# శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి

[ శతతమ జన్మదినోత్సవ ప్రచురణము ]

ఎనిమిదవ సంపుటము

# శ్రీవివేకానందసంపూర్ణగ్రంథావళి

[ శతతమ జన్మదినోత్సవ ప్రచురణము ]

ఎనిమిదవ సంపుటము

—సంపాదకులు
ఆచార్య శ్రీ జోస్యులగడ్డ సత్యనారాయణమూర్తిగారు



శ్రీ రామకృష్ణ మఠము
—మైలాపూరు : : మద్రాసు - 4

# విజ్ఞప్తి

శ్రీవివేకానందసంపూర్ణగ్రంథావళిలో సకలవిశ్వమునకును ఒకసువార్త యున్నది. అంతే కాక ఆ గ్రంథావళి హిందువులకు స్వమతధర్మపత్రమును అగుచున్నది. తమసిద్ధాంతమునుగూర్చి నిజ మెఱుగ గోరిన ప్రతిహిందువునకును, శిశువులకు వారి తండ్రి తాతల మతస్వరూపమును వివరింపగోరిన ప్రతిహిందుజననికిని ఈ గ్రంథావళి కొన్ని యుగములవఱకు వెలుగును, విశ్వాసమును ఒసంగుచుండును. ఈ స్వామిజి వాణిలో సమష్టిప్రజాహృదయము వ్యంజితమై యున్నది. గీతాచార్యుడైన కృష్ణునివలెను, బుద్ధునివలెను, శంకరాచార్యునివలెను, భారతదేశమున వెలసిన ప్రతి మతాచార్యునివలెను, శ్రీవివేకానందస్వామి వేదములనుండియు ఉపనిషత్తులనుండియు కైకొన్న ఉదాహరణములతో తనవాక్యములను నింపియున్నాడు. ద్వైతవిశిష్టాద్వైతాద్వైతములు ఒక్కటే పరిణామములోని మూడు దశ లనియు, వీనిలో కడపట పేర్కొన బడిన అద్వైతమే పరమలక్ష్య మనియు, స్వామి, అద్వైత సిద్ధాంతసర్వాతిశాయిత్వమును ఘోషించెను. ఆయన బోధనలు సరళములుగను సప్రమాణములుగను నుండును. ఏలయన భగవదనుభవపులోతులకు తాను ముందుగ దిగియే ఆయన వానిని లోకమునకు కఱపెను. 1893 సెప్టెంబరు మొదలు 1902 జూలై వఱకును గల ఆ కొన్ని యేండ్లలో శ్రీవివేకానందునివాక్కున వెలువడిన అమృతసందేశము ఆంగ్లమున ఎనిమిదిసంపుటములుగ నున్నవి. స్వామిజి శతతమజయంతిమహోత్సవసందర్భమున ఆయన గ్రంథముల విషయానుగుణముగ మరల పదిసంపుటాలుగా విభజించి అన్నిప్రాంతీయభాషలలోనికిని అనువదింపించి అర్పింప బూనితిమి. ఆంధ్రమున వెలువడిన శ్రీవివేకానందసంపూర్ణ

గ్రంథావళిసంపుటదశకములో ఇది యెనిమిదవది. ఆచార్య శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి సంపాదకత్వమున వెలువడిన యీ సంపుటములో కీ. శే. కందుకూరి మల్లికార్జునము గారి అనువాదభాగము కొంతయు, శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి గారు (కరీంనగరము) అనువదించిన విశేషభాగమును సంగ్రథితములై యున్నవి. ఈ విద్వాంసుల కందఱికిని, ముద్రణదోషశోధనమున అన్వితులైన శ్రీ చిలుకూరి మాధవకృష్ణకవి, శ్రీ వేదము రామశాస్త్రిమిశ్రులకును, దీని నింతసొంపుగ ముద్రించి యిచ్చిన జ్యూపిటరు ముద్రణాలయమువారికిని మా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము. స్వామిజిసందేశము మాతృదేశభక్తిభరితము, ప్రాణప్రదము, ఆత్మోత్తేజకరము, విశ్వజనీనము. స్వామిజిదృష్టి దివ్యదృష్టి. ఆయన అమోఘపరిష్కారవిధానము సూచింపని ముఖ్యసమస్య లేనే లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయు కలుగక తప్పదు. ఆంధ్రమహాజనులు మా ప్రచురణములపట్ల సదా చూపు ఆదరమునే ఈ సంపుటములపట్లను చూపినచో, మా శ్రమ ఫలవంతమైన దని సంతోషింతుము. ఎల్లర అందుబాటులో నుండుటకై సంపుటపు వెల చాల తక్కువగా నిర్ణయించినాము. ఈ శతవార్షికోత్సవసంవత్సరములోనే కొనువారికి నూటికి పదిలెక్కన వెల తగ్గింపబడును.

మార్చి, 1963

ప్రకాశకుడు

# విషయసూచిక

# మనశ్శక్తులు

(1900 సం॥ జనవరి 8 వ తేదీనాడు లాస్‌ఏంజలిస్, కాలిఫోర్నియాలో స్వామిజీ చేసిన ప్రసంగము)

ప్రపంచమందంతటను సర్వకాలములందును దివ్యశక్తులను గుఱించిన విశ్వాసమున్నది. మనమందఱమును కొన్ని యసాధారణ సంఘటనలనుగుఱించి వినియున్నాము. మనలోకొందఱకు సాక్షాత్తుగ అట్టి అనుభవమునుగలదు. నా అనుభవములోనున్న కొన్ని యథార్థ సంఘటనలనుగూర్చి చెప్పుటతో ఈ విషయమారంభింతును. ఒకానొక వ్యక్తియున్నాడు. ఏవైన ప్రశ్నలను మనము మనసులో ననుకొన్నచాలు. అతడు వెంటనే సమాధానమిచ్చెడు వాడు. ఇంతేకాదు, అతడు జరుగబోవు విషయములను చెప్పెడివాడని విన్నాను. ఆశ్చర్యపడి కొందఱుస్నేహితులతో అక్కడకు వెళ్ళితిని. అందఱమనస్సులలో ఏవో ప్రశ్నలడుగదలచినవి మాకున్నవి. పొరపాట్లు వచ్చునేమోయని ఆప్రశ్నలువ్రాసి జేబులో పెట్టుకొన్నాము. మాలోనొకనిని చూచి ఆ ప్రశ్నకు సమాధానము చెప్పినాడు. తర్వాత అతడు కాకితముమీద ఏమియోవ్రాసి మడచి దానిపై నాచేత సంతకము పెట్టించి ఇట్లనినాడు: "అది విప్పకుము. జేబులో నుంచుకొని మఱల నేనడుగునంతవఱకుంచుము". అట్లనే మా అందఱకును చెప్పి తలకొక కాకితమునిచ్చినాడు. తర్వాత భవిష్యత్తులో జరుగగల కొన్ని సంఘటనములను గుఱించి మాకు జోస్యము చెప్పినాడు. తర్వాత "మీ యిష్టమువచ్చిన భాషలో ఒక మాటగాని వాక్యముగాని అనుకొను" మనినాడు. నేనొక పెద్ద "సంస్కృతవాక్యము" అనుకొంటిని. "అతనికాభాష ఆలియదు" "నీ జేబులో కాకితముతీసి చదువు"మనినాడు. తీసిచూచినగదా సరిగా ఆసంస్కృతవాక్యమే అందుగలదు. ఇది గంటక్రింద వ్రాసినది.

ఈయన నేనువ్రాసినట్లే ఆవాక్యమునే అనుకొనునని క్రింద వ్రాసినాడు. అట్లే జరిగినది. మాలోనొకనికిట్లే జరిగినది. అతడు మనస్సులోనేదో ఒకభాషలో ఒకవాక్యమునో మాటనో అనుకొనుమనినాడు. అతడు అరబిక్ భాషలోనిమాటలు అనుకొనినాడు. అవి కొరానులోని ముక్కలు. ఆ భాష ఈవ్యక్తికసలు తెలియుటకు వీలులేదు. ఆముక్కలనుకొని జేబులోనుండి కాకితముతీసి అతడు చూడగా సరిగా నతడనుకొనిన ముక్కలే వ్రాయబడినవి. మాలో ఒకడు వైద్యుడు. అతడొక జర్మన్ వైద్య-గ్రంథములోని ఒక వాక్యమనుకొని కాగితముతీయగా నదేవాక్యము అగపడినది.

చాలాదినములైనతర్వాత మఱల నీవ్యక్తివద్దకు నేనేగితిని. నేననుకొంటినిగదా ఏదో పూర్వము నేను భ్రాంతిలోపడియుండవచ్చునని—కొందఱు స్నేహితులతో వెళ్ళితిని. ఈ పర్యాయము కూడ అతడుచెప్పినవన్ని అక్షరశః యథార్థములు.

మఱొకపర్యాయము భారతదేశములో నేను హైదరాబాదు వెళ్ళితిని. అక్కడ ఒక బ్రాహ్మణుడున్నాడు. అతడనేకవస్తువులు గాలిలోనుండి పుట్టించును. అతడక్కడ ఏదోవ్యాపారము చేసికొనుచుండెను. చాల పెద్దమనిషి, మర్యాదస్థుడు. "ఏదిబాబూ నీవిద్యచూపించు"మని అడిగితిని. అతనికి అపుడు జ్వరమువచ్చినది. హిందూదేశములో ఒక నమ్మకమున్నది. ఒక పుణ్యాత్ముడొక జబ్బుమనిషిని ముట్టుకొన్నచో వానిజబ్బు నయమగునని. ఈబ్రాహ్మణుడు జ్వరపడినాడు కాబట్టి "స్వామీ నా నెత్తిపై మీచేయి నుంచుము, నాజ్వరము నయమగును" అని యనినాడు. "సరే బాగున్నది. నీవిద్య నాకు చూపించవలె"నని నేనంటిని. అతడు సరేనన్నాడు. అతనికోరికననుసరించి చేయిపెట్టితిని. అతనివిద్య చూపించినాడు. అతడు వట్టి గోచీమాత్రము పెట్టికొన్నాడు. మేమతనిదగ్గఱ ఏవస్తువులేకుండ బట్టలదగ్గఱనుండి అన్నీ లాగికొంటిమి. పాపము చలిగదాయని ఒకదుప్పటినిచ్చి ఒకమూల

కూర్చుండబెట్టి ఏబదికండ్లతో ఇరువదియైదుమంది మతనివంకకు చూచుచుంటిమి. "చూడండి మీా యిష్టమువచ్చిన విషయమును వ్రాసిపెట్టుకొను"డన్నాడు. మే మాదేశములో పండనిపండ్ల పేర్లు ద్రాక్ష, నారింజ మున్నగునవి వ్రాసి కాగితములు మడచి అతని కిచ్చితిమి. అతని దుప్పటిలోనుండి ద్రాక్షగుత్తులు నారింజ కాయలు బయటకు రాదొడగినవి. వానిని కలిపి తూచినచో, అవి అతనికి రెట్టింపుతూగును. "ఇవి తినుడని" ఆతడన్నాడు. మాలో కొంద ఱది గారడియని యూహించి వానిని తినుటకు నిరాకరించిరి. అపు డతడే తినుట మొదలుపెట్టినాడు. అందుచే మేమందఱము తినుట మొదలుపెట్టినాము. పండ్లు బాగుగనేయున్నవి.

చివర కతడు గులాబిపూల గుట్టను సృష్టించెను. ప్రతి పువ్వు చక్కగా నున్నది. ఆపూల రేకులపై మంచుబిందువు లున్నవి. ఒక్కపూవును నలిగిపోలేదు. ఒక్కరేకు తునిగిపోలేదు. అబ్బ! రాసెకుపూలు. నేను "నీ వెట్లు సృష్టించితివయ్యా" అని యడిగితిని. ఆయన "ఇదియంతయు హస్తలాఘవ" మన్నాడు.

ఏమైన కానిండు, అది కేవలము హస్తలాఘవమనుట చాల అసంభవముగ కన్పించుచున్నది. ఇంత బహుళముగ ఆయీావస్తువు లతడెక్కడనుండి తెచ్చినాడు.

నేను ఇట్టి సందర్భములను పెక్కు చూచితిని. భారతదేశ ములో మీారు తిరిగినచో బహుప్రదేశములందిట్టి సందర్భములు వందలకొలది మీారు చూడవచ్చును. ఇవి ప్రతిదేశములోను కన్పించును. ఈదేశములో నిట్టి ఆశ్చర్యకరసందర్భములను చూడ గలరు. సరే దీనిలో నిస్సందేహముగా చాలామోసముండునను కొందు. కాని మోసమన్నది యథార్థమున కనుకరణమే కావల యును గదా. ఈయథార్థముండితీరవలెను. ఉన్నప్పుడే అనుకరణ సాధ్యము. లేనిదానిని అనుకరించుట ఎట్లు? యథార్థవిషయమునే అనుకరించుట పొసగును.

చాలాపురాతనకాలములో వేలసంవత్సరములక్రిందట భారతదేశములో ఈ నాటికంటె ఎక్కువగా ఈ దివ్యమహిమలు ప్రదర్శితములగుచుండెడివి. నాకనిపించునుగదా—ఒక దేశములో జనసమ్మర్ద మెక్కువగుకొలది మానసికశక్తులు తగ్గిపోవునని. ఒక పెద్ద దేశములో చాలతక్కువమంది జనులు నివసించుచున్నప్పు డచ్చట మానసిక శక్తి లెక్కువగానుండవచ్చును. ఈ సందర్భములను హిందువులు చక్కగా పరిశోధించి కొన్ని సిద్ధాంతములు చేసిరి. వారు మంచి వివేకవంతులు. కాబట్టి ఈ మనశ్శక్తులను గుఱించి ఒక శాస్త్రమును నిర్మాణముచేసిరి. ఈసందర్భములన్నియు అసాధారణములే యైనప్పటికి నిజమున కవి స్వాభావికములే కాని అస్వాభావికములు కావని, అలౌకికములుకావని నిర్ణయించిరి.

ఈ అసాధారణసంఘటనములు ప్రకృతి సిద్ధములైన సంఘటనములవలెనే కొన్నిసూత్రములకు కట్టువడియేయుండును. ఒకానొక మనుష్యు డట్టి మానసికశక్తులతో నుద్భవించుట ప్రకృతి చిత్రమేమియుకాదు. ఈ మహిమలన్నియు శాస్త్రీయముగ అధ్యయనముచేసి సంపాదింపవచ్చును. ఈ శాస్త్రమును రాజయోగమని భారతీయులందురు. దీనినభ్యసించు ప్రజలు వేనవేలున్నారు. భారతజాతియంతకు నీ రాజయోగము దైనందినోపాసనయందొక యంగమై పరిణమించినది.

ఈ అసాధారణశక్తులన్నియు మానవుని మనస్సునందే నిగూఢమైయున్నవని వారు నిర్ణయించిరి. మనుజుని మనస్సు మహత్తత్త్వమం దొకభాగము. ప్రతివానిమనస్సు తక్కిన అన్ని మనస్సులతో సంబద్ధమైయున్నది. ప్రతిమనస్సు అది ఎచ్చట నున్నప్పటికిని తక్కినప్రపంచమంతటితోను సంబద్ధమైయుండును.

మీరు భావప్రేషణమునుగూర్చి విన్నారా? ఒకవ్యక్తి ఇక్కడ ఒక విషయమును భావించును. మఱియొకచోట మఱి

యొక మనస్సులో ఈభావ మభివ్యక్తమగును. ప్రయత్నపూర్వకముగా ఒకవ్యక్తి దూరమునందున్న మఱొకని మనస్సులోనికి ఒక భావమును పంపనిచ్ఛగించును. అచటనున్న ఆమఱొకనిమనస్సు ఒకభావమువచ్చుచున్నదని ఎఱింగి ఆభావమును పంపినవైఖరిలోనే గ్రహించును. ఈదూరమెంతయైనను జరుగుపనిలో భేద ముండదు. ఈ భావము ప్రయాణించి ఉద్దిష్టపురుషుని చేరును. అతడు దీనిని గ్రహించును. నామనస్సువేఱు. నీమనస్సువేఱు. ఇట్లున్నచో మనమనస్సులమధ్య ఏవిధమైన సంబంధము లేనిచో నాభావము మీకెట్లందగలదు? సామాన్యపరిస్థితిలో నా భావము మీకు సరాసరిగా నంటుటలేదు. నాభావము శబ్దతరంగముల క్రింద పరివర్తింపబడి నీ మేదస్సులో ప్రవేశించి మఱల నీ మనస్సులో భావరూపమందుచున్నది. కాబట్టి ఈ సాధారణసందర్భములలో భావము శబ్దములోనికిమాఱి మఱొకచోట శబ్దము భావములోనికి పరివర్తితమగుచున్నది. ఈపద్ధతి కొంచెముచుట్టు త్రోవ. కాని దూరశ్రవణమునం దిట్టిదేమియు లేదు. అది చాల సూటియైన త్రోవ.

ఈదూరశ్రవణము మనస్సులు పరస్పర సంబద్ధములై యున్నవని ఋజువుచేయుచున్నది. సృష్టికంతకు, ఈవిశ్వమునకంతకు ఒక మనస్సున్నది. నీమనస్సు - నామనస్సు - ఇట్లే వ్యక్తులయొక్క మనస్సులు విశ్వముయొక్క మనస్సునందున్న చిన్నచిన్న ముక్కలు; పెద్దసముద్రములో లేచిన తరంగములను బోలినవి. ఈ తరంగము లొకొక్కకటి సంబద్ధములయ్యే యున్నవి. ఈ సంబంధమునుబట్టి మన భావములను సూటిగా మనము కావలసిన మనస్సులోనికి పంపగలము.

మనపరిసరమున నేమి జరుగుచున్నదో మీ రెఱుగుదురు. ఈ ప్రపంచమునందెల్లపుడు సర్వవస్తువులు పరస్పర ప్రభావితములగుచుండును. మనశక్తిలో కొంతభాగము మనశరీరములను

పోషించుట కుపయుక్తమగుచున్నది. దీనిపైన మనశక్తిలోని ప్రత్యణువును దివారాత్రము లితరులపై ప్రసరింపజేయుచు వారిని ప్రభావితులను చేయుచున్నాము. మనశరీరములు, మనగుణములు, మేధ – ఆధ్యాత్మికసంపత్తి ఇవియన్నియు విడువకుండ నితరులపై తమ ప్రభావమును ప్రసరించుచునే యుండును. ఫలితముగా మనముకూడ ఇతరుల ప్రభావమునకు లోనగుచున్నాము. నిరంతరము మనచుట్టు జరుగుచున్నస్థితి ఇదియే. ఇప్పుడొక ఉదాహరణము చూతము. ఒకవ్యక్తి మనసమ్ముఖమునకు వచ్చెననుకొందు. అతడు బాగుగాచదువుకొనినవాడు. చక్కనిభాష మాట్లాడును. అతడు సందర్భమునకు తగునట్లు మీతో మాట్లాడును. కాని అతడు మీకు ఏమియునచ్చలేదు. మఱొకడువచ్చును. ఏదో కొంచెము మాట్లాడును. ఆమాటలుకూడ అంత బాగుగా లేవు. ఆమాటలలో కొన్ని తప్పులుండవచ్చును. వ్యాకరణ దోషములుండవచ్చును. ఐనను అతడు మీకు బాగుగానచ్చవచ్చును. ఇట్టి యనుభవము మీలో పల్వురకుండియుండవచ్చును. ఏమి తేలినది. మనకు నచ్చికకల్గించునవి వట్టిమాటలేకావు. మాటలుకాని, భావములుకాని నచ్చికకల్గించుటలో మూడింట ఒకవంతు మాత్రమే పనిచేయును. ఆభావములు, ఆమాటలు చెప్పినవ్యక్తి యున్నాడే అతడు తక్కినరెండు వంతులు పనిచేయును. వ్యక్తిగత ప్రభావము మనకు నమ్మికకల్పించుటలో ప్రధానపాత్ర వహించును.

మనకుటుంబములలో యజమానులుందురు. వారిలో కొందఱు ప్రయోజకులు. కొందఱు కారు. ఎందుకని? మనము ఏ సందర్భములోనైన కృతార్థులము కాలేనిచో ఆ దోషమును ఇతరులపై రుద్దుదుము. నేనా పనిచేయలేనప్పుడు దానికి కారణము 'ఫలానావాడు' అని చెప్పుదును. చేతకాని సందర్భములలో తనదోషములను, లోపముల నొప్పుకొనుట కెవ్వడు నిచ్చగింపడు.

ప్రతివాడు తాను దోషరహితుడనని నిరూపించుటకు ప్రయత్నించును. తప్పంతయు నెవరిమీదనో త్రోసివేయుటకు, కడకు అదృష్టము బాగుండలేదనియు చెప్పుటకు చూచును. కుటుంబ యజమానులు సమర్థముగా నిర్వహింపలేనప్పుడు వారిలో వారు ఇట్లు వితర్కించుకొనవలెను—కొందఱు వారివారి కుటుంబములను చక్కగా పరామర్శ చేసికొనుచుండగా, మఱికొందఱు చేయలేక పోవుటకు హేతువేమి? ఈ భేద మెక్కడనున్నదనగా వ్యక్తిలో నున్నది, వ్యక్తిగత ప్రభావములో నున్నది.

మానవజాతిని నడపించిన మహానాయకుల విషయమునకు వచ్చినచో, నాయకత్వము వహించుటలో గణనకు వచ్చునది వ్యక్తివిశేషమని మనకు బోధపడును. ప్రాచీనులైన మహాకవులను, శాస్త్రవేత్తలను పరిశీలించినను నిజమునకు వారిభావములన్నియు కలిపి ఎన్నియుండును? మనుష్యజాతి నుద్ధరించిన మహానుభావులందఱు వ్రాసిపెట్టిన గ్రంథముల నన్నిటిని తీసికొని ఒక్కొక్కరి గ్రంథములను పరిశీలించి చూతము. అచ్చమైన భావములు ప్రపంచము పుట్టినప్పటినుండి ఇంతవఱకు వచ్చినవానిని పునరుక్తి లేకుండ చూచినచో అన్నియు కలిపి గుప్పెడుకంటె నెక్కువ యుండవు. వారిగ్రంథములయందు మనకొఱకు వారు వ్రాసిపెట్టిన గ్రంథములుచూడుడు. ఆ గ్రంథకర్తలు మహాప్రతిభా శాలురుగా కన్పింపరు. ఐనను వారికాలములో వారు మహా ప్రతిభాశాలురు. వారంత మహానుభావులగుటకు హేతువేమి? వారు భావించిన భావము లేమాత్రము కావు. వ్రాసిన గ్రంథములు కావు. చేసిన ఉపన్యాసములు కావు. వారి తాలూకు మిగిలినదేదియు కాదు. దానికి హేతువు మిగులలేదు. అది వ్యక్తివిశేషము. పూర్వము చెప్పినట్లు మూడింట రెండువంతులు శక్తి, తక్కిన ఒకవంతు ప్రతిభావాగ్వైఖరులు. మనుష్యుని వ్యక్తి విశేషమే ప్రధానమైనది. మనముచేయు పనులన్నియు ఆ వ్యక్తి

విశేషముయొక్క అభివ్యక్తస్వరూపములు. మనుష్యుడున్నప్పుడే చేతలుండును. కార్యమెప్పుడు కారణమునుబట్టి నడచును.

విద్యావిధానమునకెల్ల, శిక్షణమునకెల్ల వ్యక్తిత్వాభివృద్ధియే లక్ష్యముగా నుండవలెను. కాని వ్యక్తిత్వము నభివృద్ధి చేయుటకు బదులు మనము పైపై మెఱుగులను దిద్దుటకు ప్రయత్నించుచున్నాము. లోన లొటారముచేసి పైన పటారము చేయుటవల్ల లాభమేమి? సర్వశిక్షణమునకు లక్ష్యము మనుష్యుని వ్యక్తిత్వము నభివృద్ధిచేయుట. తనసహచరులపై తనప్రభావమును వ్యాపింపజేయువాడు నిజముగా గొప్పశక్తిమంతుడు, విద్యుత్ యంత్రమును బోలువాడు. అటువంటివాడున్నపుడతని యిచ్ఛవచ్చినట్లు పరిస్థితులను మార్చివేయగలడు. అతడు మట్టినుండి బంగారము తీయగలడు. వాని వ్యక్తిత్వప్రభావమువలన సమస్తక్రియలు సమకూరును.

మన కీ సందర్భము యథార్థమని తెలియును. కాని మనకు తెలిసిన ఏ భౌతికసిద్ధాంతములు కాని ఈ సందర్భమును వివరింపలేవు. దీనిని భౌతికశాస్త్రజ్ఞానముతో మన మెట్లు నిరూపింపగల్గుదుము? ఎంతప్రాణవాయువు, ఎంతఉదజనివాయువు, ఎంత బొగ్గు, ఎన్నిఅణువులు విభిన్నపరిస్థితులలో నున్నపుడు, ఎన్ని కణములున్నపుడు ఎంత విచిత్రమైన వ్యక్తివిశేషము సంభవించునని ఎట్లు చెప్పవచ్చును? కాని అట్టి వ్యక్తివిశేషము మనకు కన్పించుచునే యున్నది. అంతేకాదు, వ్యక్తివిశేషము మన యెదుట మనుష్యుడై జీవించుచు, కదలుచు, పనిచేయుచు, మనలను ప్రభావితులనుచేయుచు, ఆవేశపెట్టుచు, తర్వాత కొంత కాలమునకు గతించిపోగా, అతని ప్రతిభ, గ్రంథములు, పనులు మొదలైనవి అతడు వదలిపెట్టిన కొన్నిజాడలుమాత్రముగనే మిగిలి యుండుట మనము చూచుచునేయున్నాము. దీనినిగూర్చి ఆలోచింపుడు. గొప్పమతాచార్యులను, తాత్త్వికులైన గొప్ప

మేధావులను పోల్చిచూడుడు. ఈ మేధావులు ఏ మానవునియొక్క అంతరాత్మను ఉద్దీపింపచేసియుండరు. కాని వారు చాల ఆశ్చర్యము కలిగించు గ్రంథములు వ్రాసిరి. మఱి మతాచార్యులున్నారు. వారిజీవితకాలములో వారు దేశములకు దేశముల ను త్తేజపఱచిరి. ఈ విపర్యాసమంతయు, ఈ భేదమంతయు, వారి వ్యక్తివిశేషము లందున్నది. మేధావులలో ఈ వ్యక్తివిశేషము చాల చూచాయగ నుండును. ఆచార్యపురుషులలో నీ వ్యక్తివిశేష మెక్కువ. మేధావులలో మనకు కన్పించునది బుద్ధిమాత్రమే. ఆచార్య పురుషులలో మనకు కన్పించునది జీవశక్తి. మేధావులలో పదార్థ సమాహారమువల్ల అట్టి బుద్ధివికాసముకల్గిన కల్గవచ్చును. కొన్ని పదార్థములను ఒకచో పెట్టినచో నవి క్రమముగ తగిన పరిస్థితు లలో మేళవింపబడి ఒకమెఱపును మెఱపింపవచ్చును. లేనిచో నారిపోవచ్చును. ఆచార్యపురుషులలో నిది ఒకజ్యోతివలె వెలు గొంది మఱికొన్ని జ్యోతులను వెల్గింపవచ్చును.

ఈ వ్యక్తిత్వము నభివృద్ధిచేయు పద్ధతులను యోగశాస్త్ర మునందు వివరించిరి. ఈ యోగసూత్రముల నభ్యసించినచో ప్రతివారు తమవ్యక్తిత్వమును పెంచుకొనవచ్చును. ఈ వ్యక్తిత్వ మన్నదే చాల గొప్పవస్తువు. ఇదియే సర్వశిక్షణలలోనున్న రహస్యము. దీనికి సార్వత్రికమైన యుపయోగము కలదు. గార్హస్థ్యజీవితములో, భాగ్యవంతుడు, పేదవాడు, వణిజుడు, ఆధ్యాత్మికశక్తిగల తత్త్వవేత్త—వీడువాడననేల—ప్రతివారిజీవిత ములో నీ వ్యక్తిత్వాభివృద్ధి యనునది చాల గొప్పవిషయము. ఈ భౌతికసిద్ధాంతములనుదాటి ఇంతకంటె సూక్ష్మమైన సున్నిత మైన కొన్నిసిద్ధాంతములున్నవి. భౌతికప్రపంచము, మానసిక ప్రపంచము, ఆధ్యాత్మికప్రపంచము వేనికవి వేఱుగావు. ఉన్న దొక్కటే ప్రపంచము. ఈ ప్రపంచమునందు బాగుగా మందమైన భాగము ఈ కన్పించెడు భౌతికజగత్తు. ఇది సున్నితముగా తేరిన

కొలది ఆత్మపదార్థము బాగుగా స్థూలరూపములో కన్పించునది శరీరము. మిక్కిలి సున్నితమైనది జీవుడు. ఇది పిండసృష్టిలోనిది. బ్రహ్మాండసృష్టిలో నింతే. ఈ కన్పించు విశ్వమంతయు బాహ్యమైన ముద్దకట్టిన దళసరితనము. ఇది పోనుపోను సూక్ష్మతమమై ఈశ్వరుడగును.

సూక్ష్మమైనదానియందు మహాశక్తి ఇమిడియుండునని, కరడుగట్టినదానియందు శక్తియుండదనియు మనమెఱుగుదుము. ఒక మనుష్యుడు మిగుల బరువైన పదార్థమునెత్తికొని పోవుచుండును. వానికండరములు పొంగియుండును. వానిశరీరమంతట పరిశ్రమ లక్షణము కన్పించును. మనమేమనుకొందుము ? వాని కండరములు చాల బలముగలవనుకొందుము. కాని వాని శరీరమున సన్నదార ములవంటి నరము లాకండరములకు బలము తెచ్చును. ఆసన్న నరములలో ఒక్కటైనను కండరములలోనికి చేరకుండ తెగ గోసినచో ఈకండరము లేమియు పనిచేయలేవు. ఈనరములంత కంటె సూక్ష్మవస్తువునుండి, ఇదిమరల సూక్ష్మతరవస్తువునుండి, ఇది సూక్ష్మతమమైనపదార్థమునుండి శక్తినిగ్రహించును. కావున శక్తి సూక్ష్మమైన పదార్థమునుండి జన్మించును. మనము దళసరిగానున్న వస్తువులోనే చలనమునుచూడగలము. సూక్ష్మములైనవస్తువులందు చలనములను మనము చూడలేము. ముద్దుగానున్న వస్తువు కదలునపు డా కదలికను గ్రహింపగలము. కాన మనము స్థూలవస్తువులతో చలనమున కభేదాధ్యవసాయముచేయుదము. కాబట్టి ఉన్న శక్తియంతయు సూక్ష్మదశలోనే యుండును. ఆదశలో మనకే చలనమును కన్పించదు. కారణము ఆ సూక్ష్మదశలో మనము చూడలేనంతవేగముగా, తీక్ష్ణముగా ఆచలనముండును. ఈ అభివ్యక్తమగుచున్న సూక్ష్మతరశక్తులను గ్రహించుటకు మనకేదైన సాధనమున్నచో ఈశక్తిని మన మదుపులో పెట్టవచ్చును. ఒక సరస్సులో అడుగుననుండి ఒక నీటిబుడగ బయలుదేఱినపుడు అది

పైకివచ్చినపుడుమాత్రమే మనకు కన్పించును. పైకివచ్చునంత వఱకు దానిస్వరూపమేమియో మనకు కన్పించదు. కాబట్టి బాగుగా రూపుకట్టునంతవఱకు మనము భావములను గుర్తింపలేము. బాగుగా రూపుకట్టినపుడుమాత్రమే లేక చేతలలో నభివ్యక్తమైనపుడుమాత్రమే మనము దానిని గ్రహింతుము. మనచేతలు, భావములు మనయదుపులోనుండవని మనము నిరంతరము చెప్పుచుందుము. కాన మనకు వానిపైన అధికారమెట్లుండును? మనము ఆ భావములయొక్క సూక్ష్మదశలోనే అదుపుచేయగల్గినచో అనగా ఆభావములను వేరులోనే, అవి భావదశనందకపూర్వమే, అవి చేతలోనికి రాకముందే నిగ్రహింపగల్గినయెడల మనము వాని నదుపులోపెట్టుటకువీలుండును. ఆసూక్ష్మశక్తులను ఆసూక్ష్మకారణములను వివేకించి, పరీక్షించి అర్థముచేసికొనుటకు మనకు ఒకపద్ధతి దొరకినచో అప్పుడు మనము మనలను అదుపులో పెట్టుకొనుటకు వీలుండును. తనమనస్సును తాను నిగ్రహించుకొనినవాని కితరులమనస్సులను నిగ్రహించుశక్తి యుండును. అందుచేతనే పవిత్రత, నీతియున్నవానికి మతమునందత్యంతప్రాముఖ్యమున్నది. పరిశుద్ధుడు నీతిమంతుడైనవాడు తన్ను తాను నిగ్రహించుకొనగల్గును. మఱి అందఱిమనస్సు లొక్కటే—ఒకే మహత్తత్త్వముయొక్క భిన్నభావములు. ఒక మట్టిముద్దను తెలిసికొనుటవల్ల ప్రపంచములో మట్టినంతను తెలిసికొన్నట్లే. తనమనస్సును నిగ్రహించుకొనుట చేతనైనవారికి ఇతరుల మనస్సులయొక్క రహస్యము తెలియును. అతనికి తక్కినవారి మనస్సులపైనను అధికారముండును.

మనము మనప్రకృతియందలి సూక్ష్మదేహములను నిగ్రహించుకొనగల్గినచో, మనకున్న శారీరకబాధలు చాలభాగము తగ్గిపోవును. మనకున్న బహుచింతలు దూరీకృతములగును. వలసినదెల్ల మనస్సులోని సూక్ష్మచలనములను నిగ్రహించుట.

సూక్ష్మచలనములపై మన కదుపున్నచో అనేకదుష్ఫలితములు తప్పును. జీవితమునకు సంబంధించినంతవఱకు మనోనిగ్రహమువల్ల నుపయోగమిదియే. దీనినిదాటిన ఇంకను గొప్ప ఉపయోగము గలదు.

నేనిప్పుడు వేఱే తర్కించకుండ పట్టి సిద్ధాంతములు మీకు చెప్పెదను. ఒకజాతి అభివృద్ధిపొందుటలో ఎన్నిదశాభేదములుపొందునో ఆజాతియందలి ప్రతిమనుష్యుడును తనచిన్నతనములో అన్ని దశాభేదములను గడచియుండును. ఉన్న భేదమెల్ల జాతికి ఆదశాభేదములు కడచుటలో వేలసంవత్సరములు పట్టగా పిల్లవానికి కొన్ని సంవత్సరములుమాత్రమే పట్టును. చిన్నబిడ్డ పురాతనకాలమందలి అనాగరకునివంటివాడు. ఈచిన్నబిడ్డ తూనీగలను పట్టి నలుపును. అందుచే ఈ బిడ్డకు తన జాతిలో ఆదిమమానవునివలె అనాగరకుడు. అతడు పెరుగుచు అతని జాతి పొందియున్న ప్రస్తుతాభ్యుదయ దశచెందునంతవఱకు గల వివిధదశలను గడచుచు వచ్చును. ఈ దశలన్నియు నతడు చాలాత్వరగాగడపును. అంతే భేదము. ఇప్పుడు మనుష్యజాతినంతయు మొత్తముగా తీసికొందము. లేక జంతుజాలమునంతయు మొత్తముగా తీసికొందము. అనగా మనుష్యునికంటె క్రిందిజీవరాసులను మొత్తముగా గ్రహింతము. ఈమొత్తము కలిసి ఒకవైపునకు ప్రయాణించుచున్నది. ఆలక్ష్యమును పరిపూర్ణత్వమందదము. మనుష్యజాతియొక్క-కాగల అభ్యుదయసర్వస్వమును గ్రహించిన స్త్రీపురుషులు కొందఱు జన్మింతురు. ఈ మొత్తము మనుష్యజాతియంతయు పరిపూర్ణత్వము పొందువఱకును బహుజన్మలెత్తి వారితోబాటు పరిపూర్ణత్వమందుటకు బదులు ఈ దశాభేదములన్నియు వారి జీవితకాలములోనే కొలదిసంవత్సరములలోనే గడచి ఆపరిపూర్ణత్వమును ఇప్పుడే పొందజాలుదురు. ఈ పరిపూర్ణత్వమొందుటకుగల ఈ పద్ధతిని మనము కొలదికాలములోనే—శ్రద్ధావంతులమైనచో— అమలుపఱుపవచ్చును. కొంతమంది మనుష్యులను ఏవిధమైన

విజ్ఞానములేనివారిని సముద్రమధ్యమున ఒక దీవిలో పెట్టి వారికి జీవించుటకుమాత్రమే సరిపడినతిండి, గుడ్డ - ఇచ్చి ఊర కున్నచో, వారు క్రమక్రమముగా అభివృద్ధిచెంది నాగరకతను పెంచుకొందురు. ఇది సహజమైనపద్ధతి. దీనికి కొన్ని సౌకర్యము లను మనము సమకూర్చినచో ఈ నాగరికత తొందరగ పెరుగును. మనము చెట్లను తొందరగ పెంచుచుంటిమిగదా. మనము వాని కేవిధమైన దోహదము చేయకున్నను వానిస్వభావము ననుసరించి అవి పెరుగును. కాని కాలమెక్కువపట్టును. మనము అవి సహజముగ పెరుగు కాలముకంటె తక్కువకాలములో పెరుగునట్లు చేయుచున్నాము. కృత్రిమపద్ధతులలో ఆపెరుగుదలను అభివృద్ధిచేయుచున్నాము. అట్లే మనుష్యునివిషయములోమాత్ర మభివృద్ధి నెందుకు త్వరితము చేయరాదు? మనము జాతి విషయ కముగ దీనిని త్వరితముచేయగలము. ఇతరదేశముల కెందు కుపా ధ్యాయులనంపుచున్నాము. జాత్యభివృద్ధికి, మఱి వ్యక్త్యభివృద్ధికి దోహదముచేయలేమా? చేయగలము. ఈద్రుతగతి కొక యవధి కలదని చెప్పగలమా? ఒకవ్యక్తి అతని జీవిత కాలములో నెంత అభివృద్ధిచెందునో మనము చెప్పలేము. ఒకవ్యక్తి ఇంతవఱకే అభివృద్ధి సాధించును, అని చెప్పు టకు కారణసామగ్రి ఏమున్నది? పరిస్థితులు సక్రమముగ నున్నచో ఆశ్చర్యకరమైన అభివృద్ధి సాధింపవచ్చును. కాన పరి పూర్ణత్వమందువఱకు నీ యభివృద్ధి కొక హద్దులేదు. తేలిన సారాంశమేమి? ఈ జాతిలో పుట్టినమనిషి ఇప్పటినుండి కోట్ల కొలది సంవత్సరములలో సాధింపగలపరిపూర్ణత్వము ఇప్పుడే ఇచ్చటనే సాధింపవచ్చును. యోగులుచెప్పునదిది. అవతార పురుషులు, ఆచార్యపురుషులు అట్టి పరిపూర్ణత్వమును తమ జీవి తములందు—అనగా ఒక్కజన్మలోనే సాధించినారు; ఇట్టి మహాను భావులు సర్వకాల సర్వావస్థలందు ప్రపంచమందంతట జన్మించు చునేయున్నారు. నిన్న మొన్న మనుష్యజాతియొక్క మొత్తము

జీవితమంతయు కడచివచ్చి పరిపూర్ణత్వము ఈజన్మమునందే సాధించిన ఒక మహాపురుషుడుండెడివాడు. ఈ అభ్యుదయసాధన ఈ అభివృద్ధిని త్వరితమొనర్చుటకూడ కొన్ని సిద్ధాంతముల కను వదించుటకు కొన్ని సూత్రములలోని కొదిగింపజేయుటకు వీలైనది. ఈ సిద్ధాంతములను ఈసూత్రములను మనము చదివి ఆ రహస్యములనవగతముచేసికొని వానిని మనము సాధనచేసినచో మనము నట్టి అభ్యుదయమందుట తప్పనిసరి గదా. మన అభివృద్ధిని మనము త్వరితముచేయవచ్చును. మనము పరిపూర్ణత్వ మీ జన్మలోనే పొందవచ్చును. మనజీవితములో ఇట్టి సాధనచేయుట చాల ఉత్తమదశ. యోగశాస్త్రము (అనగా - మనస్సును - తచ్ఛక్తిలను గుఱించిన వివేకము) నకు పరమప్రయోజన మీ పరిపూర్ణత్వము. కొందఱకు ధనసహాయముచేయుట, కొన్నివస్తువుల నిచ్చుట నిత్యజీవితములో సుఖముగానెట్లు మెలంగవలెనో చెప్పుట వట్టి వివరములు. ఈయోగశాస్త్రముయొక్క ప్రయోజనము మానవుడు త్వరగా పరిపూర్ణత్వమును సాధించునట్లుచేయుట. అంతేకాని ఈ భౌతికజగత్తుయొక్క చేతిలో నతని నొక ఆట బొమ్మ క్రింద పెట్టి యుగములతరబడి సముద్రములో అలలలో ఊగులాడుచు ప్రయాణముచేయు సంగడికొయ్యవలె చేయుట కాదు. ఈ యోగశాస్త్రము నిన్ను బలవంతునిచేసి నీయభివృద్ధిని ప్రకృతిచేతులలోనుండి నిచేతులలోనికి తెచ్చిపెట్టి నిన్ను దివ్యజీవనునిగా చేయగలదు. అది మహత్తరభావము.

మనుష్యునియొక్క విజ్ఞానము, అధికారము, సుఖము పెరుగుచున్నవి. నిరంతరము జాతిమొత్తముమీద మన మభివృద్ధి చెందుచున్నాము. ఇది యథార్థమైన విషయము. కాని ఇది జాతి మొత్తముమీద యథార్థమైనది. కాని వ్యక్తులవిషయములో యథార్థమా అను ప్రశ్న. కొంతవఱకు యథార్థమే అని చెప్పవచ్చును. కాని దీనికి హద్దెక్కడ? అను ప్రశ్న మఱల పుట్టు

చున్నది. నేను నా కన్నులతో కొంతదూరము చూడగలను. కాని ఒకడున్నాడు. అతడు కన్నులుమూసికొని ప్రక్కగదిలో ఏది జరుగుచున్నది చూడగలడు. నీవు "నేను నమ్మ"నందువు. అతడు రెండు మూడు వారములలో నిన్ను నమ్మునట్లు చేయగలడు. ఆ విద్య ఎవరైనను నేర్చుకొనవచ్చును. కొంతమంది మనుష్యులకు మఱొకమనుష్యుని మనస్సులో ఏమిజరుగుచున్నది తెలిసికొనునట్లు నేర్పుటకు ఐదునిముసములే చాలును. ఇవి యథార్థ విషయములు. వీనిని నిరూపింపవచ్చును.

మఱి ఈ విషయములన్నియు యథార్థములుకదా. వీనికి మాత్రము హద్దెక్కడ? వీనికిమాత్రము మితియున్నదా? ఈ గదిలో ఒకమూల కూర్చుండిన మనుష్యుని మనస్సులోనున్న విషయముల నిక్కడనుండి ఒకడు తెలిసికొనగల్గినప్పుడు ప్రక్క గదిలో మనుష్యుని మనస్సులలోని విషయము నెందుకు తెలిసికొన లేడు? మఱెక్కడనైననున్నవాని మనస్సెందుకు తెలిసికొన లేడు? ఎందుకు తెలిసికొనలేడో మనము చెప్పలేముగదా. అట్లు తెలిసికొనుట అసంభవమని మనము చెప్పలేము. కాని ఆ తెలిసికొనుట ఎట్లు సంభవమో మనము చెప్పలేము. భౌతికశాస్త్రవేత్తలిట్టి విషయములు సంభవములని చెప్పుటకు వీలులేదు. "మాకు తెలియ"దని మాత్రము వారు చెప్పవచ్చును. శాస్త్రముయొక్క పనియేమి? యథార్థసంఘటనములను ప్రోగుచేయుట. వానిలోనున్న సాధారణసూత్రములను బైటకులాగుట. వాని సత్యము నుగ్గడించుట. అంతే. అంతేకాని ఆ యథార్థసంఘటనములే జరుగవన్నచో శాస్త్రమునకు చోటెక్కడిది?

మనుష్యుడు సంపాదింపగల శక్తికి మితిలేదు. భారతీయుని మనస్సు విచిత్రమైనది. అతనికి ఏ విషయమందైన ఆసక్తి కల్గినచో అతడు తక్కిన అన్నివిషయముల నుపేక్షించి ఆ ఒక్కవిషయములో మున్గును. భారతదేశమున ఎన్నిశాస్త్రము లుత్పన్నము

లైనవో ఎఱుగుదురా? గణితశాస్త్ర మచ్చట పుట్టినది. సంఖ్య లన్నియు సంస్కృతమునుండియే మీ రరువు తెచ్చుకొన్నారుగదా. అంకగణితమే కాదు. అక్షరగణితము నచ్చటనే పుట్టినది. న్యూటనుకు మున్ను కొన్ని వేలసంవత్సరములక్రితమే భారతీయులు భూమ్యాకర్షణశక్తిని గుర్తించిరి.

ఈ విశేషము చూడుడు. భారతదేశచరిత్రలో నొకానొక కాలమం దీ యోగశాస్త్రము భారతీయులను మిగుల నాకర్షించి నది. వారిలక్ష్యములను సాధించుటకు చాల సుగమమైనమార్గ మగుటచేత అది వారి కెంతో ప్రీతిపాత్రమైనది. మనస్సు ఏ పని నైనను చేయగలదు. మనశ్శక్తులను చక్కగా పరీక్షించి కొన్ని సూత్రములను, సిద్ధాంతములను నిర్మాణము చేయవచ్చును. మంత్రములు, గారడీ మొదలగునవి అసాధారణములు కావు. అన్నియు సశాస్త్రీయములే, "అన్నియు భౌతికశాస్త్రవిషయ ములవలెనే సశాస్త్రీయములే" అని వారు నిర్ణయించిరి. ఈ నిర్ణయమెంత బలవత్తరమైనదనగా తక్కిన భౌతికశాస్త్రము లన్నియు దాదాపు ఉపేక్షితములై వినష్టములైనవి. ఈ యోగ శాస్త్రమొక్కటే వారిదృష్టినంతయు ఆకట్టుకొన్నది. భిన్న శాఖలకు చెందిన యోగులు వివిధసాధనలు చేయుటకు ప్రారం భించిరి. కొంతమంది వెలుగుతో సాధనలుచేసి శరీరములో వివిధ వర్ణములుగల రశ్ములు తెచ్చుచున్న మార్పులను కనిపెట్టుటకు ప్రయత్నించిరి. వా రొకేరంగు గుడ్డలు కట్టికొని అదేరంగుగల యిండ్లలో వసించుచు, అదేరంగుగల పదార్థములు తినుచు సాధన చేయజొచ్చిరి. వివిధములైన సాధన లిట్లే కొనసాగింపబడినవి. కొందఱు ధ్వనితో సాధన చేసిరి. చెవులు మూసికొని విప్పార్చి సాధనలు చేసిరి. మఱికొందఱు ఘ్రాణవిషయకమైన సాధనలు చేసిరి.

లక్ష్యమంతయు మూలభూతమైన సూక్ష్మతమస్థితి నందు కొనుటయే. ఈ సాధకులలో కొందఱు ఆశ్చర్యకరమైన సిద్ధుల

నందిరి. వారిలో చాలమంది వ్యోమయానము (గాలిలోని కెగురుట)ను సాధించిరి. పాశ్చాత్యదేశములలో నొక గొప్పపండితుడు నాకీకథ చెప్పినాడు. ఆయనకు సిలోన్‌గవర్నరు తాను ప్రత్యక్షముగా చూచి చెప్పెనట. కొన్ని కఱ్ఱలు అయిమూలలుగా నిల్పి తయారుచేసిన ఒకపీటమీద ఒకచిన్నపిల్లను తీసికొనివచ్చి కాలుమీద కాలువేసికొని కూర్చుండునట్లు చేసిరి. ఆమె కొంతసేపు కూర్చున్న తర్వాత ప్రదర్శకుడు నెమ్మది నెమ్మదిగా ఐమూలలుగా నిలబెట్టిన కఱ్ఱలను ఒక్కొక్కదానినే తీసివేసెను. అన్నిటిని తీసిన తర్వాత ఆ పిల్ల గాలిలో తేలుచు నట్లే కూర్చున్నది. ఆ గవర్నరు అందులో ఏదో జిత్తున్నదనుకొని తనచేతిలోనున్న కత్తితో ఆ పిల్లకాళ్లక్రిందుగా విసరిచూచెనట. అచట నేమియు లేదు. ఇది జరిగినది. ఈ సంఘటనయొక్క స్వరూపమేమి? ఇదేమి గారడియో, ఇంద్రజాలమో కాదు. ఇదొక విశేషము. హిందూదేశములో ఇట్టివిషయము లసంభవములని ఎవ్వడు ననడు. హిందువులకెంతో స్వాభావికవిషయమిది. హిందువులు వారిశత్రువులతో పోట్లాడవలసినపు డేమందురో మీ రెఱుగుదురా? "యోగిపుంగవు డెవరో వచ్చి వీరినందఱిని తఱిమివేయును" అని అందురు. ఇది హిందూజాతికున్న పెద్దనమ్మకము. కత్తిలోను, ఆ కత్తిని పట్టిన చేతిలోని బలమెంత? ఉన్నబలమంతయు ఆత్మయందలిది.

ఇట్టి శక్తి ఆత్మనిహితమై యుండుట యధార్థమై యున్నపుడా శక్తులందు మహోత్తమమైనదానిని సంపాదించుటకు మన స్సువ్విళ్లూరును. కాని తక్కినశాస్త్రములలోవలెనే ఒకమహాసిద్ధిని సాధించుట యోగమునందును కష్టమైన పనియే. మఱి కొంచెమెక్కువ కష్టమన్న నతిశయోక్తి లేదు. ఐనను చాలమందిట్టి సిద్ధులు సులభముగా సాధింపవచ్చుననుకొందురు. కొంత డబ్బు సంపాదించవలెనన్నచో ఎన్నో సంవత్సరములు పట్టునుగదా. విద్యుచ్ఛాస్త్రమునో, మఱొకశాస్త్రమునో నేర్చుకొనుట కెన్ని

సంవత్సరములు పట్టును? నేర్చుకొన్న పిదప జీవితమంతయు సాధన చేయుచుండవలసినదే గదా!

మఱి తర్కనశాస్త్రములు స్థావరపదార్థములనుగూర్చి ప్రవర్తించునవి. ఒకకుర్చీయున్నది. దానిని నీవు చక్కగా పరీక్షించవచ్చు. అది ఎగిరి పాఱిపోదు కాబట్టి. కాని ఈ యోగ శాస్త్రము మనస్సుతో వ్యవహరించును. ఈ మనస్సన్నది అతి చంచలము. దానిని నీవు పరీక్షింతుననుకొన్నపు డది పాఱిపోవును. క్షణమునకొకబుద్ధి. అనుక్షణము మనస్సు పరివర్తన చెందుచునేయుండును. ఇంత పరివర్తనము మధ్య దానిని మనము పరీక్షించి అర్థముచేసికొని నిగ్రహింపవలెను. ఈ శాస్త్రము ఎంత కష్టసాధ్యమో చూడుడు. దీని కెంత కఠినసాధన కావలెనో చూడుడు. కొందఱు అభ్యసించుటకు కొన్ని పాఠములు ఎందుకు చెప్పరని నన్ను అడుగుదురు. అదంత తేలికపనికాదు. నే నిక్కడ వేదికపై నిలబడి యుపన్యసింతును. మీ రింటికిపోవుదురు. దీనివల్ల మీకుగాని, నాకుగాని లాభము లేదు. మీ రేమందురు? "ఇదంతయు వట్టి అర్థహీనమైన ప్రలాప" మందురు. ఎందుకని? చెప్పినదానిలోనుండి అట్టి సామగ్రిని తీసికొనవలెనని మీరు చూతురు కాబట్టి. నాకు తెలిసిన యోగశాస్త్రము చాల కొంచెము. కాని నేను సంపాదించిన ఈ కొంచెము తెలివికి నాకు ముప్పదియేండ్ల కాలము పట్టినది. ఆ కొంచెము ఆరేండ్లనుండి ప్రజలకు చెప్పుచున్నాను. ముప్పదిసంవత్సరములు చాల కష్టపడి ఈ కొంచెము నేను నేర్చుకొన్నాను. ఒక్కొక్కప్పుడు దినమున ఇరువదిగంటలు సాధనచేసెడివాడను. ఒక్కొక్కప్పుడు రాత్రి ఒక గంటయే నిద్రపోయెడివాడను. మఱొకపుడు రాత్రియంతయు సాధనచేసెడివాడను. ఒక్కొక్కప్పు డుచ్ఛ్వాసధ్వనియు వినిపించని ప్రశాంతస్థలములందు వసించెడివాడను. ఒక్కొక్కప్పుడు గుహాల లోనుండెడివాడను. ఎంతకష్టమో చూడుడు. ఐనను నాకు తెలిసిన దెంత? అసలేమియు తెలియదనవచ్చును. ఈ శాస్త్రములో

ఆవగింజలో అరువదవవంతు మాత్రము నాకు తెలియును. కాని ఇది చాల యథార్థమని, విశాలమైనదని, ఆశ్చర్యకరమైనదని నేను గ్రహించితిని.

మీలో నెవరైన ఈ శాస్త్రవ్యాసంగముచేయుటకు పూనుకొన్నచో అతడు జీవితములో ఏ వ్యాపారములోనైనను ఎంత మనోనిశ్చయముతో దిగునో అంతకంటె ఎక్కువ మనోనిశ్చయముతో పూనుకొనవలెను.

వ్యాపారమన్న దానికెంత శ్రద్ధ కావలెనో ఎంత కష్టపడవలయునో! తండ్రి మరణించినను, తల్లి, భార్య, కడకు పిల్లలెవరు మరణించినను వ్యాపార మాగుటకు వీలులేదు. గుండె బ్రద్దలగుచున్నను మనము మన వ్యాపారస్థలమునకు పోవలసినదే! క్షణక్షణమునకు మనకు యమబాధగా నున్నను దానిని వదలుటకు వీలులేదు. అది తప్పదని, అట్లుండుట సరియైనపద్ధతి యని మన మనుకొందుముగదా.

ఈ వ్యాపారములన్నిటికంటె నెక్కువశ్రద్ధ యోగాభ్యాసమున కవసరము. వ్యాపారములో పల్వురు రాణింపగలరు. కాని యోగమందు కొందఱే. ఎందువల్లననగా, ఈ యోగాభ్యాసము చేయు వ్యక్తి మానసిక, దైహికనిర్మాణములమీద అతడు పొందు సిద్ధి యాధారపడియుండును. వ్యాపారములో నందఱును లక్షలార్జింపలేరు. ఏదో కొంచెము సంపాదింతురు. అట్లే యోగసాధనమందు ప్రతివాడు ఏవో కొన్ని వెల్గురేకలు చూచును. ఈ వెల్గురేక ఈ యోగశాస్త్రముయొక్క యాథార్థ్యమును గుఱించి ఈ యోగసిద్ధిని పరిపూర్ణముగా సాధించినవారు కలరన్న దానిని గుఱించి దృఢమైన విశ్వాసము కల్గించును.

ఈ శాస్త్రమునుగూర్చి ఇది స్థూలమైన పరిచయము. యోగమునకు ఇతరాధార మక్కఱలేదు. దానికాళ్లపై నది నిల్వగలదు. దానివెలుగు దానికున్నది. ఇతరశాస్త్రములతో

పోల్చిచూచినను దానికి క్షతిలేదు. గారడీవాండ్రు మోసగాండ్రు, మిథ్యాపాండితిని ప్రకటించువారును ఇతరవిషయములందువలెనే ఈ విషయమందును గలరు. వ్యాపారము లాభసాటిగనున్న కొలది దానిలో వంచకులు, మోసగాండ్రు ఎక్కువమంది ఉండనే యుందురు. అందువల్ల వ్యాపారము చెడ్డదనలేము. మఱొక విషయము. ఈ వాదములనన్నిటిని వినుట బుద్ధికి చమత్కార మనిపించును. విచిత్రవిషయములను వినుటవల్ల బుద్ధికి తృప్తికలుగ వచ్చును. కాని మీలో నెవరైనను ఇంతకంటె నెక్కువ తెలిసి కొనవలెనన్నచో, వట్టిఉపన్యాసమువల్ల లాభములేదు. యోగము ప్రత్యేకజీవనవిధానము. దానిలో ప్రవేశించినపుడే అందలిసారము హృదయంగమమగును. దానిని ఉపన్యాసములద్వారా నేర్పలేము. నేర్చుకొను వాంఛ ఎవరికేని యున్నచో వారికి నేను ఆనంద పూర్వకముగా సాహాయ్యమును సలిపెదను.



# ఆధ్యాత్మికసాధనకు కొన్నిసూచనలు

(కాలిఫోర్నియా, లాస్‌ఏంజెల్సులో "హోం ఆఫ్ ట్రూత్"లో ఉపన్యసింపబడినది)

ప్రాణాయామమును గుఱించి మఱికొన్ని సాధనములను గూర్చి ఈ ఉదయము మీకు కొంత చెప్పెదను. మనము సిద్ధాంత ములనుగూర్చి చాలకాలమునుండి చర్చించుచున్నాము. ఇప్పుడు కొంచెము సాధనచేసిచూచుట అవసరము. ఈ విషయముపైన భారతదేశములో చాల గ్రంథములున్నవి. మీ దేశప్రజలు ఇతర విషయములలో సాధనచేసినట్లు మా దేశప్రజలు అధ్యాత్మవిద్యను సాధనచేసిరి. ఈదేశములో ఐదుగురు మనుష్యులుకలిసి ఉమ్మడి వ్యాపారము ప్రారంభింతురనుకొందము. అనుకొన్న ఐదుగంట లలో వారు దాని నమలులోపెట్టగలరు.

హిందూదేశములో అనుకొన్నతర్వాత 50 సంవత్సరముల కును అమలులోపెట్టలేరు. ఇట్టి విషయములలో వారు చాల మందకొడి మనుష్యులు. కాని ఒక విషయము మీరు చూడుడు. ఎవరైన ఒక క్రొత్తవేదాంత సిద్ధాంతమును ప్రతిపాదించినచో ఆ సిద్ధాంతమెంత గందరగోళముగనున్నను దానికి చాలమంది అనుయాయులుందురు. ఒకయుదాహరణము గమనింపుడు—ఒంటి కాలిమీద పన్రెండేళ్ళు, అహోరాత్రము లదేపనిగ నిలబడ్డచో మోక్షముకల్గునని ఒక మతము బయల్దేరినచో వందలకొలది మనుజులట్లు నిలబడుటకు సిద్ధపడుదురు. అట్లు నిల్చుటలోకల బాధ ఎంతయున్నను సహనముతో వారాపని ప్రారంభింతురు. చేతులు పైకెత్తి సంవత్సరముల తరబడి ఆధ్యాత్మికోన్నతికై తపించు ప్రజలు చాలమందియున్నారు. నేను వరదలను చూచితిని. మఱి వాఱంద రజ్ఞానులు. తెలివితక్కువవారనుకొన్నారేమో. వారిబుద్ధి

వైశద్యముచేత, ప్రతిభచేత మనలను వా రాశ్చర్యచకితులను చేయగలరు. కాబట్టి సాధనయన్నది సాపేక్షమైన మాటగాని నిరపేక్షమైనది కాదు.

మన మితరుల స్వరూపస్వభావములను నిర్ణయించుటలో కొన్ని తప్పులు చేయుదుము. ఎప్పుడు మనకు తెలిసినదే ప్రపంచ మనుకొందుము. మనసీతి, ప్రవర్తన, మనధర్మజ్ఞానము, మన ప్రయోజనము, ఇవియే మన సర్వస్వమనుకొందుము. నేనొకసారి ఐరోపాలో తిరుగుచు 'మార్సెల్సు' వెళ్ళితిని. అచ్చట ఒక వృషభయుద్ధము ఏర్పాటుచేసిరి. స్టీమరులోనున్న ఇంగ్లీషువా రందఱు ఆవృషభయుద్ధమును గుఱించి ఇది చాల క్రూరమని విమర్శించుటకు, దూషించుటకు మొదలుపెట్టిరి. నే నింగ్లండుచేరిన తర్వాత అక్కడ బహుమానముకొఱకు పోరాడువారు కొందఱు పారిస్‌నగరమునకు పోగా ఫ్రెంచివారు వారినట్లు బహుమానము కొఱకు పోరాడుట అనాగరకమని వారిని వెళ్ళగొట్టినట్లు విన్నాను. ఆ యీ విషయముల నేను బహుదేశములలో విన్నతర్వాత క్రీస్తు యొక్క "నీ తప్పు లితరులెన్నకుండనుండవలె నన్నచో ఇతరుల తప్పుల నీ వెన్నకుము" అనుసూక్తిని చక్కగా నర్థముచేసి కొంటిని. మనము జ్ఞానము పెరిగినకొలది మనమెంత అజ్ఞానులమో మనమెఱుగుదుము. మనుష్యునియొక్క మనస్సెంత విచిత్రమైనదో ఎంత విభిన్నమైనదో మనకు తెలియును. నేను నాచిన్నతనములో మాదేశములోని సన్యాసులసాధన విశేషములను విమర్శించెడివాడను: ఆచార్యపురుషులే యోగసాధకులను విమర్శించిరి: మహాపురుషుడైన బుద్ధుడును వారిని విమర్శించెను. ఐనను నేను పెద్దవాడనైనకొలది వారినిగుఱించి విమర్శించుట కూడనిపని యని నాకు తోచుచున్నది. ఒక్కొక్కప్పుడు వారిలో పరస్పర విరుద్ధములైన ఊహలెన్నియున్నను వారి కార్యదీక్ష, సహన శక్తిలో ఒక అంశమైన నా కున్న చో బాగుండుననుకొను

చుందును. యాతనమీది రోతవలన నా విమర్శనము పుట్టలేదు. అది ద్వేషమునుండి పుట్టినది కాదు. అది వట్టి పిఱికితనము...... నేనట్టి సాధన చేయుటకు సాహసింపజాలను. వీనినుండి నావిమర్శ పుట్టినదని నేను తలఁచుగాననుకొనుచుందును.

మనోబలము, శక్తి, ధైర్యము చాల గొప్పవిషయములని మీ రెఱుంగుదురు. అట్లని సాధారణముగ మన మనుచుందుము. చాల ధైర్యశాలి, శూరుఁడు, సాహసియనికొందఱనుగూర్చి మెచ్చుకొను చుందుము. కాని ఆధైర్యము, ఆశౌర్యము, ఆసాహసము – ఇవి సర్వకాలసర్వావస్థలందు ఆమనుష్యుని కుండకపోవచ్చునని మనము గుర్తుపెట్టుకొనవలెను. శతఘ్నుల కెదురొడ్డి నిల్చినవాఁడు శస్త్రచికిత్సకు భయపడవచ్చును. మఱియొకనికి తుపాకియన్న చోభయము. కాని అవసరపడ్డప్పుడెంత శస్త్రచికిత్సనైనను శాంతముగ నోర్చు కొనును. కాబట్టి ఇతరులనెన్నునపుడు ధైర్యమన్న నేమియో గొప్పదనమన్న నేమియో ముందు నీవు చక్కగా విచారించు కొనవలెను. వీఁడు మంచివాఁడు కాఁడని నేను ఒకనినిగూర్చి చెప్పుదు ననుకొనుఁడు. కాని, నేనేవిషయములలో అయోగ్యుఁడనో ఆ విషయములందతఁడు మహాయోగ్యుఁడుగా నుండవచ్చును.

మఱియొక ఉదాహరణమును తీసికొందము. స్త్రీపురుషు లలో ఎవరు సమర్థులన్న విషయమునుగూర్చి చర్చవచ్చినపుడు ఇదే పొరపాటు సాధారణముగ జరుగుచుండుట మీరు గమనించి యుందురు. 'మగవాఁడు పోట్లాడగలఁడు. కాయకష్టము చేయగలఁడు. ఆఁడుది బలహీనురాలు. పోట్లాడలేదు. అందుచేత మగవాఁడు ఆఁడు దానికన్న గొప్ప' అని సాధారణముగ ననుకొందురు. ఇది చాల తప్పు. మగవానివలెనె స్త్రీకూడ ధైర్యశాలినియే. ఎవరి త్రోవలో వారు యోగ్యులు. చిన్నపిల్లలను అంత ఓర్పుతో, అంతసహనముతో, స్త్రీవలె పురుషుఁడు సాకగలఁడా ? మగవాఁడు కార్యాచరణదక్షుఁడైనచో స్త్రీ బాధలను ఓర్వజాలును. స్త్రీ

కార్యాచరణమున ఆఱితేఱియున్న పురుషుడు ఓర్చుకొనలేడు. ఈ విశ్వమంతయు నొక త్రాసువంటిది. అటు కొన్నిగుణములు, ఇటు కొన్ని సమముగా నుండును. మన మేమి చెప్పగలము? ఎప్పుడో ఒకరోజున మనకు జ్ఞానోదయముకల్గి ఎందుకుపనికిరాని ఏ క్రిమియందో, కీటకమందో, మన మానవత్వముతో సరితూగ గల అంశమున్నట్లు మనకు గోచరము కావచ్చును. పరమ దుర్మార్గునిలోగూడ నా దగ్గఱలేని కొన్ని సద్గుణములుండవచ్చును. అట్లుండుట నాకు నిరంతరానుభవములోనున్న విషయము. అంతవర కెందుకు? అడవిజాతిమనుష్యుడున్నాడా? వాని శరీర నిర్మాణము చూడుడు. అంత చక్కని శరీరనిర్మాణము నాకున్నచో బాగుండుననుకొనుచుందును. అతడు కడుపునిండ తినును. త్రాగును. వ్యాధియనిన నేమియో వానికి తెలియదు. నేను అను క్షణమేదో బాధపడుచునేయుందును. ఈ తెలివితేటలు వానికిచ్చి వానిశరీరము పుచ్చుకొన్నచో బాగుండునని ఎన్నోసార్లను కొందును. ఈ ప్రపంచమంతయు మిట్టపల్లములుగా నుండును. పల్లము లేనిచో మిట్టుండదు. అందుచేత ఈ సృష్టియందు తౌల్య మున్నదంటిని. నీవొకవిషయములో గొప్పవైనచో మఱియొకడు మఱొకవిషయములో గొప్ప. నీవు స్త్రీపురుషులనుగుఱించి నిర్ణయింపవలసివచ్చినపుడు వారివారికి ప్రత్యేకగుణములను తీసి కొని ఆయాగుణములందే వారిని కొలువవలెను. ఒకరికొలతలు మఱియొకరికి సరిపోవు. ఒకడు దుర్మార్గుడని మఱియొకడు చెప్పుట న్యాయముకాదు. కొందఱందురు, "ఈపనియే జరిగిన ప్రళయము వచ్చు"నని. ఆ పని జరుగుచునే యున్నది. ప్రళయము రానే లేదు. మీ దేశములో స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చినచో దేశము సర్వనాశనమగునని పూర్వ మనుచుండెడివారు. కాని అట్లు జరిగినదా? ప్రజలందఱకు విద్యచెప్పినచో ప్రపంచకము నాశన మగునని కొందఱనుచుండెడివారు. అట్లు జరుగకపోగా లోకము బాగుపడినది. చాలసంవత్సరములక్రిందట ఇంగ్లాండునకు ఒకపెద్ద

ఆపద జరుగునని ఒకపుస్తకము వ్రాయబడినది. అందులో ఆగ్రంథకర్త కూలి పెరుగుచుండగా వ్యాపారము పడిపోవుచున్న దని నిరూపించినాడు. ఇంగ్లాండులో కార్మికులు అధికవేతనములు కోరుచున్నారని, జర్మనులు తక్కువ కూలితో పనిచేయుచున్నా రని ఒక తగాదా బయలుదేరదీసినాడు. అప్పుడు ఈ సంగతిని విచారించుటకు జర్మనీ కొక విచారణసంఘమును బంపిరి. వారు పరిస్థితులు విచారించి జర్మను కార్మికులే ఎక్కువ వేతనము పుచ్చు కొనుచున్నట్లు నివేదికలు వ్రాసిరి. ఈ పరిస్థితి ఎందుచే నేర్పడినది. సామాన్యప్రజలందఱు విద్యావంతులగుటవల్ల. మఱి ఆ సందర్భ ములో సామాన్యులు విద్యావంతులైనచో ప్రపంచము నాశన మగుట సరియా? ముఖ్యముగా భారతదేశములో సర్వత్ర మనకు కొంతమంది ఛాందసులు కన్పింతురు. వారు ప్రజలకు ప్రతివిషయ మును తెలియకుండ రహస్యముగ నుంచుటకు ప్రయత్నింతురు. వారు ఈ విశ్వమునందు పరమోత్తమమైన మనుష్యులమని ఒక నిర్ణయమునకు వచ్చిరి. వారు ఈ విధముగ ప్రజలందఱకు విద్య చెప్పుట మొదలైన విషయములు తమ కపాయము కల్పించునని యనుకొందురు. కాని వారివల్ల మాత్రము ప్రజాసముదాయము నకు హానికలుగవచ్చును.

సాధనను గుఱించిన విషయమును సమీక్షింతము. భారత దేశములో బహుపురాతనకాలమునుండి యోగసాధన చేయ బడుచువచ్చినది. క్రీస్తుశకము 1,400 సంవత్సరములకు పూర్వము పతంజలి యను నొక శాస్త్రకర్త యుండెడివాడు. అతడు కొన్ని యోగానుభవములను, కొన్నియుదాహరణములను, కొన్ని యోగపరిశోధనలను గ్రహించి తనకుపూర్వమున్న యోగాను భూతులనన్నిటిని విచారించి ఒకపెద్దగ్రంథమును వ్రాసెను. ఒక సంగతి గుర్తుపెట్టుకొనుడు. ఈ ప్రపంచము బహుపురాతన మైనది. ఏదో 2000, 3000 సంవత్సరముల క్రిందట ప్రపంచము

పుట్టినదనుకొనుట పొరపాటు. ఈ పాశ్చాత్యదేశములలో బైబిలులోని క్రొత్తనిబంధనము వచ్చుటతో సంఘజీవనము ప్రారంభమైనదని కొంతమంది ప్రచారముచేయుచున్నారు. అంతకుపూర్వము సంఘజీవనమే లేదట! పాశ్చాత్యదేశములకు సంబంధించినంతవఱకు నది నిజముకావచ్చు. మొత్తము ప్రపంచకమంతటికి నాసిద్ధాంతము వర్తించదు. నేను లండనులో నుపన్యాసములు చెప్పుచుండగా, నొక మంచిమేధావి, వివేకియైన ఒకానొక స్నేహితుడు తఱచుగా నాతో వాదించుచుండెడివాడు. నాతో రకరకములుగా వితండవాదములుచేసి ఒకనాడు ఆకస్మికముగ నిట్లడిగినాడు: మఱి మీ ఋషులు ఇంగ్లాండునకువచ్చి మాకెందుకు బోధింపలేదు? నేను జవాబుచెప్పినానుగదా "బాబూ వారువచ్చుట కప్పుడు ఇంగ్లాండు లేదు. అప్పు డిక్కడన్నియు నడవులు. వారివచ్చి ఎవరికి చెప్ప మందువు?"

ఒకసారి ఇంగర్‌సాల్ నాతోనిట్లనినాడు: "నీవు ఏబదిసంవత్సరములక్రిందట మా దేశమునకువచ్చి ప్రబోధము చేసియున్నచో నిన్నురిదీసెడివారు. ప్రాణములుండగా నిలువున నిన్ను తగుల బెట్టెడివారు. లేకపోయిన కడకు రాళ్ళతో కొట్టి ఊళ్ళలోనుండి తఱిమివేసెడివారు."

కాబట్టి క్రీ.పూ. 1400 సం॥ల క్రిందట నాగరకత ఉండెడిదని మనమనుకొనుటలో దోషమేమియునుండదు. పైగా నాగరకత యన్నది పెఱుగుచువచ్చినదా? లేక దిగజారిపోవుచువచ్చినదా? అను విషయము గట్టిగా చెప్పుటకు వీలులేదు. నాగరకత క్రమక్రమముగా పెఱుగుచువచ్చినదను విషయమును నిరూపించుటకు చేయు వాదములు చూపించు నుదాహరణములు అడవిమనుష్యుడు నాగరకదశనుండి క్రిందికిదిగజారిపోయిన మానవుడే యని నిరూపించుటకుకూడ పనికివచ్చును. చైనాదేశములో ఆటవికదశనుండి నాగరకదశ క్రమక్రమముగా సంభవించినదను విషయము నెవ్వరు

నొప్పుకొనరు. కారణమేమన అది వారి అనుభవమునకు విరుద్ధముగానుండుటయే. కాని అమెరికాకు సంబంధించినంతవఱకు మీ జాతి అభివృద్ధికి సంబంధించినంతవఱకు ఆ విషయము చాల యథార్థము.

700 సం॥ల నుండి హిందువులు నాగరకముగా దిగజారి పోవుచున్నారు. హిందువులు పూర్వ ముత్తమమైన నాగరకతా దశలో నుండెడివారని మనము విశ్వసింపవచ్చును. ఈ విషయము కాదనుటకు వీలు లేదు.

ఏనాగరకతయైనను స్వభావసిద్ధముగ ఏర్పడ్డదని చెప్పుటకు ఒక్క ఉదాహరణమును లేదు. ప్రపంచములో మఱియొక నాగరకజాతితో సంబంధము లేకుండ తన నాగరకత నభివృద్ధిపొందించు కొన్న జాతి ఏదియు లేదు.

మొదట ఏ ఒకటి రెండుజాతులో నాగరకములైయుండి వాని సంపర్కమువల్ల నాగరికత ఇతరజాతులకు వ్యాపించియుండెను. అనాగరకజాతులు విదేశములకుపోయి తక్కినజాతులతో కలసి, వారి అభిప్రాయములను వ్యాపింపజేసియుండును. ఆవిధముగ నాగరకత వ్యాపింపజేయబడియుండును.

ఈవిషయమును నిరూపించుటకు అధునాతన భౌతికశాస్త్ర పరిభాషలో మనము మాట్లాడుదము. కాని ఒకవిషయము మీరు గుర్తుంచుకొనుడు. మతవిషయికముగ మూఢవిశ్వాసములున్నట్లే భౌతికశాస్త్రవిషయములోగూడ మూఢవిశ్వాసములున్నవి. మత కర్మలందు ప్రత్యేక నైపుణ్యము సంపాదించిన పురోహితులున్నట్లే భౌతికశాస్త్రమందును పురోహితులున్నారు. వారేశాస్త్రజ్ఞులు. ఎవ్వరైన డార్విన్, హక్సలే మొదలగు గొప్పశాస్త్రజ్ఞులపేరు లుదాహరించినచో మనము వెంటనే వారు చెప్పినదానిని నమ్మి వేయుదుము. అది ఈకాలపుమోజు. శాస్త్రీయవిజ్ఞానమని మన మనుకొనుదానిలో నూటికింట తొంబది తొమ్మిదివంతులు వట్టి

సిద్ధాంతములు. అందులో చాలభాగము బహుశిరస్సులు, కరములుకల్గిన దయ్యములనుగుఱించిన పురాతనవిశ్వాసములవంటివి. పైగా ఆదయ్యములయందలి విశ్వాసములే కొంత మెఱుగు. వాని దృష్ట్యా రాళ్ళు, రప్పలకన్న మానవుడు కొంచెము మెఱుగు. ఈ భౌతికసిద్ధాంతములున్నవే వీనిదృష్ట్యా మానవునికిని వానికిని భేదముకలదు. అచ్చమైనశాస్త్రజ్ఞానము కోరువారు చాల జాగరూకులై యుండవలెను. పురోహితుల విషయములోవలెనే శాస్త్రజ్ఞుల విషయములోను జాగ్రత్తయవసరము. మొదట దేనిని నమ్మవలదు. చెప్పినదానినిగూర్చి చక్కగా విచారించి పరీక్షింపుము. నిరూపణకునిల్చునో లేదో చూడుము. నిలిచినచో అప్పుడదియథార్థమనుకొనుము. భౌతికశాస్త్రమునకు సంబంధించిన బహు విశ్వాసములు ప్రస్తుతము ప్రచారములోనున్నవి నిరూపణకాగలేవు.

గణితశాస్త్రవిషయములోనే ఎక్కువ భాగము సిద్ధాంతములు, ఇంకను ఋజువున కందని ఊహామాత్రములే యైనవి. అంతకంటె నుత్తమమైన గణితశాస్త్రవిజ్ఞానము లబ్ధమైనపుడు ఈ సిద్ధాంతములు గవ్వకుకాకుండపోవును.

క్రీ.పూ. 1400 సం॥ల క్రిందట ఒకమహర్షి కొన్ని యోగానుభవములను తీసికొని వాని స్వరూపము చక్కగా విచారించి తార్కికసూత్రముల ననుసరించి కొన్ని సిద్ధాంతములను నిర్ణయించెను. ఆయనతర్వాత ఆయన కనిపెట్టిన విషయములలో కొన్ని భాగములు తీసికొని కొందఱు ప్రత్యేకమైన పరిశోధనలుగావించిరి. పురాతన జాతులలో హిందువులుమాత్రమే ఈయోగశాస్త్రమును తీసికొని మిక్కిలి శ్రద్ధతో పరిశోధనలుచేసిరి. నేను మీకిప్పుడు యోగశాస్త్రమునుగూర్చి కొంత చెప్పుచున్నాను గదా! మీలో ఎంతమంది యోగాభ్యాసముచేయుదురు. ఒకవేళ చేసినచో ఎన్ని రోజులు చేయుదురు? ఇది మీరేమాత్రము సాధనచేయలేరు. హిందూదేశములో యోగసాధన యుగయుగాలనుండి వచ్చుచున్నది.

హిందువులకు ప్రార్థనామందిరములుగాని సామూహికప్రార్థనములుగాని ఇట్టివేమియు లేవని చెప్పిన మీరాశ్చర్యపడుదురు. కాని వారు ప్రతిదినము ప్రాణాయామము చేయుదురు. ధ్యానమును చేయుదురు. ఈ రెండు వారి ఆరాధనలో చాలముఖ్యమైనవి. ప్రతి హిందువు ఈ రెండు చేయవలెను. ఇది మా దేశీయమైనమతము. కాకపోయిన ఒక్కొక్కనికి ఒక్కొక్క ప్రత్యేకపద్ధతియుండును. ఒకప్రత్యేకమైన ప్రాణాయామపద్ధతి. ఒకప్రత్యేకమైన ధ్యానపద్ధతి. ఒకవ్యక్తి ప్రత్యేకపద్ధతి అతనిభార్యకును తెలియకపోవచ్చు. తండ్రికిని తెలియకపోవచ్చు. కాని వారందఱు నీ ప్రాణాయామము, ఈ ధ్యానముచేయవలసినదే. పైగా వీనిలో ఏవిధములైన యోగశక్తులు సంపాదింపవలయునను కాంక్షలు లేవు. అసలీయోగశక్తి అన్నమాటకు వారేమియు విలువనీయరు. గంగానదియొద్దున వేనకువేలు జనులు ప్రతిదినముకూర్చుండి ఈ ప్రాణాయామము, ధ్యానము కన్నులుమూసికొని చేయుచుండుట మనము చూడవచ్చును. సామాన్యమానవులకు కొన్ని సాధనలు చేయుట దుస్సాధ్యము అనుటకు రెండు కారణములున్నవి. 1. ఈ యోగముపదేశించువారు సామాన్యజనులు యోగాభ్యాసమునకు పనికిరారని చెప్పుచుందురు. ఇందులో కొంత నిజముండవచ్చును కాని చాలభాగము వారు గర్వమువల్లనే ఇట్లనుచుందురు. 2. ప్రజలు బాధింతురనిభయము రెండవకారణము. ఈ దేశములో ప్రాణాయామము వెల్లడిగా అభ్యసించుటకెవ్వరు నిచ్చగింపరు. కారణమేమన పదిమందికి తెలిసినచో అతడు వెఱ్ఱివాడనుకొందురని భయము. ప్రాణాయామ మభ్యసించుట ఇచట నాగరకలక్షణముకాదు. మఱి హిందూదేశములో ప్రార్థనచేయుచు "ఓభగవంతుడా! నేడు నాకన్నమిమ్ము, గుడ్డయిమ్ము" అని మీవలె అడిగినచో ఆ అడిగినవారిని ప్రజలపహసింతురు. "దేవుడు స్వర్గమునందున్నాడు" అను మాటకంటె తెలివితక్కువమాట ఇంకొకటి ఉండదని హిందువుల అభిప్రాయము. హిందువైనవాడు

భగవంతుడు తనహృదయమునందే యున్నాడని భావించి ప్రార్థించును.

ఇడా, పింగళ, సుషుమ్న — అను ముఖ్యమైన నాడులు మూడున్నవని యోగులు చెప్పుదురు. ఈమూడును వెన్నుబద్ద నాశ్రయించియున్నవి. ఇడా పింగళ, ఈరెండును వెన్నుబద్దకు వామ దక్షిణ భాగములందున్న నాడీకూటము. సుషుమ్న వెన్నుపూస మధ్యలోనున్న రంధ్రము. అది నాడీకూటముకాదు. ఈ సుషుమ్న మూసికొనియుండును. సామాన్యమానవునకు దీని యుపయోగములేదు. ఇడా, పింగళనాడులే సామాన్యమానవుని యందు పనిచేయుచుండును. ఈ రెండునాడులే ఇతరనాడుల యొక్క సహాయముతో శారీరకమైన సర్వావయవములకు ఆజ్ఞ నందించుచు నిరంతరము యాతాయాత ప్రక్రియ ...చుచుండును.

ఈ ఇడా, పింగళా, నాడీవ్యాపారములను సక్రమపద్ధతిలో పెట్టుటయే ప్రాణాయామమునకు గొప్ప ప్రయోజనము. కాని వట్టి ప్రాణాయామమువల్ల ప్రయోజనము పెద్దగా లేదు. కాక పోయిన దానివలన ఊపిరితిత్తులలోనికి ఎక్కువగాలి పోవును కాబట్టి రక్తముపరిశుద్ధమగును. అంతకుమించిన యుపయోగము దానికిలేదు. ఎక్కువ గాలినిపీల్చుకొని దానిని రక్తమును పరిశుద్ధము చేయుటకు వినియోగించుటలో పెద్దయోగశక్తి ఏమియు లేదు. ఈరక్తమునుశుద్ధిచేయుటయన్నపని ఊపిరితిత్తులచలనమునకు సంబంధించినది. కాని యీచలనమును ప్రాణమునకు సంక్రమింపజేయవచ్చును. సర్వవిధములైన చలనములు ప్రాణము యొక్క వికారములే. ఈ ప్రాణమే విద్యుత్తు. ఆకర్షణశక్తి. మేదస్సులో ప్రాణమే భావరూపముపొందుచున్నది. సర్వమును ప్రాణమే. ప్రాణమే సూర్యుని చంద్రుని నక్షత్రములను నడుపుచున్నది.

ఈ విశ్వమునందు సర్వపదార్థములు ప్రాణముయొక్క ప్రసరణమువల్లనే సంభవించుచున్నవి. ఈ ప్రాణప్రసరణము

యొక్క ఉత్తమమైన కార్యము భావము. ఆలోచన. ఇంతకంటె నుత్తమమైన కార్యమేమైన ఉన్నదేమో ఊహింపలేము. ఇడా, పింగళనాడులు ప్రాణమువల్ల పనిచేయును. ప్రాణమే సర్వశరీరావయవములందును ప్రసరించుచున్నది. వివిధములైన శారీరక శక్తులుగా రూపొందుచున్నది ప్రాణప్రసరణమే. భగవంతుడు వేఱే ఎచ్చటనో కూర్చుండి పనిచేయుచున్నాడనియు, ఎక్కడో సింహాసనముపై కూర్చుండి న్యాయాన్యాయములు విచారించుచున్నాడనియు అనుకొనుట మానివేయుడు. అదిచాల ప్రాత భావము. పనిచేయుటవల్ల మనప్రాణశక్తి వ్యయమగుచున్నది. కావున మన మలసిపోవుచున్నాము. ప్రాణాయామమువల్ల శ్వాసనిశ్వాసములు సక్రమముగా జరుగును. ప్రాణప్రసరణము సక్రమముగా జరుగును. ప్రాణప్రసరణము సక్రమపడినచో శరీరమునందలి ప్రత్యవయవము సరిగా పనిచేయును. యోగులు తమ శరీరముల నదుపులో పెట్టుకొనగల్గినచో శరీరములో ఏయవయవమునకు జబ్బుచేసినను అచ్చట ప్రాణప్రసరణము చక్కగా జరుగుట లేదని గ్రహించి తదంగమునకు ప్రాణశక్తిని ప్రసరింపజేసి దానియందు సక్రమమైన ప్రాణసంచారమును కల్గించుకొందురు.

నీ శరీరములోని ప్రాణప్రచారమును నీవు నిగ్రహింపగల్గినచో తగినంతశక్తి నీకు సమకూడిన తర్వాత నీ విక్కడనే యుండి ఎక్కడో ఏదేశములోనోయున్న మఱియొకవ్యక్తియొక్క ప్రాణసంచారమునుకూడ నిగ్రహింపగలవు. ఎందుచేతననగా ప్రాణమంతయు నొక్కటే. ఒకటేప్రాణము నిరవచ్ఛిన్నమై విశ్వమంతయు వ్యాపించియున్నది. ఏకత్వమన్నది సర్వసృష్టిని పరిపాలించుచున్న సిద్ధాంతము.

ఆధ్యాత్మికముగ, భౌతికముగ, మానసికముగ, నైతికముగ, తాత్త్వికముగ ఈ విశ్వమందంతటను ఏకత్వము విద్యమానమైయున్నది. జీవితమన్నది కేవల మొకవిధమైనప్రసరణము.

దేనియొక్క ప్రసరణము? చైతన్యముయొక్క ప్రసరణము. ఈ ఆకాశపదార్థము చైతన్యవంతమొనర్చుచున్న వస్తువేదో నిన్నును అదియే చైతన్యవంతునిగా చేయుచున్నది. ఒక సరస్సులో మంచు గడ్డకట్టుకొనిపోయినచో పలుతావుల ఆమంచులో పలువిధములైన దళసరితనముండును. అట్లే ఆవిరి ఒకచోట గూడుకట్టుకొన్నచో అచ్చటను దానిదళసరితనము విభిన్నముగానుండును. విశ్వమంతయు ఒకేపదార్థము ఒకసముద్రముగా ఏర్పడినట్టిది. ఇది ఒక పెద్ద ఆకాశపదార్థము. ఈ ఆకాశము పెద్దసముద్రమువంటిది. ఇందు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రము, భూమి, నదులు, విభిన్నములైన స్థితులలో రూపొందిన ఏకపదార్థవిభూతులు. విభిన్నముగా కన్పించుచున్నను ఉన్న పదార్థమొకటే, సర్వత్ర అదొక్కటే.

మనము వేదాంతశాస్త్రము చదివినచో మనకీ ప్రపంచమంతయు ఒకే పదార్థముయొక్క విలసనమని తేలును. ఆధ్యాత్మికముగా మాత్రమే కాదు. భౌతికముగా మానసికముగా మాత్రమేకాదు, వీనిలో వ్యావహారికముగ భిన్నముగ కన్పించినను అంతయు నొక్కటే పదార్థ విలసనము. ఈ భేదము మనదృష్టి భేదమునుబట్టి ఏర్పడినది. నీవు "ఈ దేహమే నేను" అనుకొన్నపుడు నీవు ఆత్మవన్నమాట మఱతువు. నీ వాత్మపదార్థమవనుకొన్నప్పుడు దేహముమాట మఱచెదవు. ఉన్నదెల్ల నొక్కటే వస్తువు. అదినీవే. నీ వున్నావు. అనగా ఉనికియేనీవు. ఆయునికిని నీవు శరీరమని అంతఃకరణమని జీవుడని అనుకొనుచున్నావు. జనన మరణములు, జీవితము మొదలైనవి కేవలము అంధ విశ్వాసములు. ఎవడును పుట్టలేదు. చావలేదు. కాకపోయిన ఉన్నస్థితి మాఱు నంతే. ఉనికి మాఱదు. ఈ పాశ్చాత్యదేశములలో మరణమన్నచో విపరీతమైన భయము. ఏవిధముగానైన బ్రదికియుండుటకే పట్టుకొని వ్రేళ్ళాడుదుము. "మరణముతర్వాత

మాకు జీవనము ప్రసాదింపుము. మాకు జీవనము ప్రసాదింపుము'' అని పాశ్చాత్యులు ప్రార్థింతురు. మరణానంతరముకూడ మీ యునికికి క్షతిలేదని ఎవరైన చెప్పిన వా రెంతయో సంతసింతురు. అసలు దానిని గుఱించి సందేహమెట్లు పుట్టును? నేనస్తమించిన ట్లెట్లూహింపగలను? నీవు చచ్చిపోయినట్లు నీవు భావింపుము. అపుడు నీకు ఒకసంగతి తెలియును. శరీరము చచ్చిపోయినదనియు దానిని చూచుటకు నీవు మిగిలియేయున్నావనియు నీకు బోధ పడును. బ్రతుకుయొక్క స్వరూపమది. ఒక్కక్షణమును నీయునికి నీవు మఱువలేవు. జ్ఞానముయొక్క మొదటిలక్షణము ''నేను న్నాను'' అనునది. అసలెప్పుడు లేని ఒకస్థితినెవ డూహింపగలడు? అందుచేత నేను లేకపోవుటయనునదుండదు. ఇదిస్వయంవ్యక్తమైన విషయము. దానికితరసాక్ష్య మక్కఱలేదు. అందుచేత అమర త్వము అవినాశిత్వమన్న భావము మనుష్యునిలో సహజముగా నున్నది. మఱి ఊహాతీతమైన విషయమునుగూర్చి మనము చర్చిం చునదెట్లు? స్వసాక్షికమైన విషయమునకు సంబంధించిన గుణాగుణ ములను గుఱించి మనము చర్చింపగోరనేల?

అందుచేత ఈ విశ్వమంతయు ఏదృక్కోణమునుండి చూచి నను ఒక్కటేపదార్థము. ఈ విశ్వమంతయు మనకు ప్రాణస్వరూ పము - ఆకాశస్వరూపము. ఒక సంగతిమాత్రము గుర్తుపెట్టు కొనుడు. తక్కిన ప్రాథమిక సిద్ధాంతములవలెనే ఇదియు స్వవిరుద్ధ మైనది. ఎందుచేతననగా ప్రాణమన నేమి? ఆకాశమన నేమి? ప్రాణమనగా జడపదార్థమును కదలింపజేయునది. మఱి ఆకాశ మనగా జడపదార్థము. ప్రాణమువల్ల కదలునది, కదలింపబడు నది. అందుచే ఇట్టి అన్యోన్యాశ్రయదోషదుష్టమైన భాగమిది. మనమేమో విజ్ఞానవంతులమనుకొందుము. మన ప్రాథమికసిద్ధాం తములందే ఇట్టి దోషము సన్నిహితమైయున్నది. సంస్కృత ములో ఒక సామెతయున్నది. దానికర్థము ''తలలేని తలనొప్పి.''

తలకాయలేదు గాని తలనొప్పి యున్నది. ఇది అటువంటిది. ఇట్టి పరిస్థితినే మాయయందురు. ఇది ఉన్నదా అన్నచో లేదు. లేదా యన్నచో ఉన్నది. అందుచేత ఉన్నదికాదు లేనిదికాదు. ఇది ఉన్నదని చెప్పుటకు వీలులేదు. దేశకాల నిమిత్తముల నతిక్రమించిన నిత్యమైన పదార్థమే స్వయంవ్యక్తమగునదియే సత్పదార్థము. అందుచే మాయ సత్పదార్థముకాదు. కాని ఈ ప్రపంచమున్నదని ఒక యనుభవము మనకున్నది. అందుచేత దీనిని కేవలము లేదనలేము. కాబట్టి ఈవిధమైన ఉనికి భ్రాంతి. మాయ యొక్క స్వరూపమిది.

కాని సర్వపదార్థములందు సత్తవ్యాపించియున్నది. ఆసత్త దేశకాలనిమిత్తములచే పరిచ్ఛిన్నమైనది. ఆసత్తయే ఆత్మ పదార్థము. ఆదిమధ్యాంతరహితము. ఆనందస్వరూపము. నిత్యముక్త స్వభావము. పురుషుని నిజస్వరూపమదియే. ఆయథార్థస్వరూపమీ దేశకాలనిమిత్తములచే పరిచ్ఛిన్నమైనది. ప్రపంచమునందలి సర్వపదార్థములంతే. ప్రతి పదార్థముయొక్క అచ్ఛమైన స్వరూపమదియే. ఇది భావవాదముకాదు. మేము ప్రపంచము లేనేలేదనుటలేదు. ప్రపంచమునకున్న సత్త వ్యావహారికసత్త. సాపేక్షకమైనది. కాని ప్రపంచమునకు స్వతంత్రమైనసత్తలదు. పారమార్థికసత్తలేదు. పారమార్థికసత్త ఆత్మపదార్థమే. దేశకాల నిమిత్తములననుసరించి ఆత్మసత్తయున్నది. దాని నాశ్రయించి ప్రపంచసత్తయున్నది.

నేను చాల శాఖాచంక్రమణముచేసితిని. ఇపుడు ప్రధాన విషయముపై దృష్టిసారింతుముగాక. మన శారీరక చలనములన్నియు రెండు విధములు. 1. తెలిసి చేయునవి. 2. తెలియకుండనే చేయునవి.— ఈ రెండును మననాడులయందు ప్రవహించు ప్రాణముచేసెడు పనులే. అందుచేత మనకు తెలియకుండాజరుగు ప్రాణ క్రియాకలాపముమీదకూడ మనమదుపు సంపాదించినచో చాల లాభముండును.

ఒకానొక సందర్భమున ఈశ్వరుడనగా నేమో మానవుడనగా నేమో నేను మీకు నిర్వచనముచెప్పితిని. మనుష్యుడనగా చుట్టు గీతలేని, సున్నవంటివాడు. కాని ఈ సున్నకుచుట్టు గీత లేదుగాని కేంద్రమున్నది. ఆ కేంద్రము అహంకారము. ఈశ్వరుడుకూడ చుట్టుగీతలేని పెద్దసున్నవంటివాడు. ఈ పెద్దసున్నలో కేంద్రము సర్వత్రనున్నది. మనయందఱ కన్నులు, కాళ్ళు, చేతులు, మెదడు మన సర్వావయవములు ఈశ్వరునివే. ఈసర్వావయవములతో చేయుచున్న దీశ్వరుడే! ఎల్లర చేతులద్వారా ఆతడు క్రియసలుపును. ఎల్ల కన్నులద్వారా ఆతడు చూచును. ఎల్ల పాదములద్వారా ఆతడు నడచును. ఎల్ల శరీరములద్వారా గాలి పీల్చును. సర్వజీవనమందు జీవించును. ఎల్ల నోళ్లద్వారా ప్రసంగించును. ప్రతిమేధద్వారా యోచించును. అందుచే మనుష్యు డీశ్వరుడు కావచ్చును. సర్వవిశ్వముపై నధికారము సంపాదించవచ్చు. చేయవలసినదెల్ల తన కేంద్రమును విశాలతరముచేసి కొనుటయే. తన్ను గుఱించిన తెలివికి తాను కేంద్రము. ఈచైతన్యమును విశ్వవ్యాప్తముగాచేసికొనగల్గినచో చాలు. అందుచే జ్ఞానమనునది ప్రధానమైనవిషయము. ఒక ఉపమాన మిచ్చి దీనిని వివరింతును. అంతయు చీకటియున్న దనుకొనుడు. మధ్య అనంతమైన గీత కలదు. ఇదంతయు మనకు కన్పించునది కాదు. కాని ఈగీతమీద ఒక వెల్గుచుక్క నడచుచున్నది. ఈ వెల్గుచుక్క నడచుచున్నపుడు వరుసగా ఈ గీతపై వివిధభాగములు మిలమిలలాడును. దీనివెంట మఱల చీకటి మూసికొనుచుండును. మనజ్ఞానస్వరూప మిట్టిది. మనజ్ఞానముయొక్క పూర్వానుభవములు వర్తమానానుభవములచే తిరోహితములగుచున్నవి. చిత్తమునందు సంస్కారరూపమున ఒదిగిపోవుచున్నది. అపూర్వానుభవములు మనలో ఉన్నట్లు మనకు తెలియవు. కాని ఉన్నవి. మనకు తెలియకుండ మనస్థూలసూక్ష్మశరీరములను మార్పుచెందించుచున్నవి. ఇప్పుడు మనము మనకు తెలియకుండ

జరుగు ప్రతిచలనము పూర్వము తెలిసి చేయబడుచుండెడిదే. మనమాచలనము నిష్ప్రియత్నముగా జరుపుటకు వలసినంతబలము వానికి సంక్రమింపజేసితిమి.

సర్వవిధములైన నీతిపద్ధతులలో ఉన్న పెద్దలోపము ఇది. మనుష్యుడు అకార్యము చేయకుండనుండగల్గుటకు అవలంబింపవలసిన మార్గములు చెప్పకపోవుటయే. నీతిపద్ధతులన్నిట దొంగతనము చేయకుము అని పెద్దలు చెప్పుదురు. మంచిదే. అసలు మనిషి ఎందుకు దొంగతనము చేయును? ఎందుకనగా, ఈ దొంగతనము చేయుట ఇట్టి అకార్యములన్నియు స్వాభావికమైపోయినవి. గజదొంగ, అసత్యవాది, దుర్మార్గుడు, కులట — వీఱందరు నిష్టము లేకుండనే ఆ పనులు చేయుచుందురు. ఇది మన స్తత్త్వమునకు సంబంధించిన పెద్దసమస్య. మనము కొంచె ముదారబుద్ధితో చూచిన సజ్జనుడుగానుండు టంత తేలికపనిగాదు. మీరందఱేమి? ముక్తిని సంపాదించునంతవఱకు వట్టి యంత్రముల వంటివారు. మీరు సత్పురుషులమనుకొని గర్వించవచ్చునా? నిజముగా గర్వించరాదు. మీరందఱు ఎందుచే సజ్జనులు. మీరు సజ్జనులుగదప్ప మఱొకవిధముగ నుండజాలరు. మఱియొకడు దుర్మార్గుడు. అతడు దుర్మార్గుడుగతప్ప వేఱువిధముగనుండలేదు. మీరే వానిస్థితిలో నున్నచో మీరు ఎట్లుండెడివారో ఎవరికి తెలియును? వ్యభిచారిణి, దొంగ—వీరిద్దఱు నీవు మంచివాడవుగా నుండుటకు బలిపడిన క్రీస్తులు. ఒక్కొక్కప్పుడు మంచివాడు బలియగును. ఒక్కొక్కపుడు చెడ్డవాడు బలియగును. అందుచే దైవతమైన క్రీస్తు, రాక్షసుడైన క్రీస్తు వీరిద్దఱు నాకు సమానముగ పూజనీయులే. మంచివాడు బలియైనపుడు అతడు దైవతక్రీస్తు. చెడ్డవాడు బలియైనపుడు అతడు రాక్షసక్రీస్తు. దొంగలు, హంతకులు, దుర్మార్గులు, దురభ్యాసులు, దుష్టులు—వీఱందఱు నాకు క్రీస్తులే. ఇది నా మతము. ఇట్లనుకొనకుండ నేనుండలేను. సత్పురుషులు,

దుర్మార్గులు, దురంతకులు—వీరందఱి పాదములకు నేను వందనము చేయుదును. వీరందఱు నా కాధ్యాత్మికోన్నతిని గల్గించినవారే. వీఱందఱు నాకు రక్షకులే. ఒకనిని నేను తిట్టవచ్చు గాని అతని లోపములు నా కన్నులు తెఱచి నన్ను జ్ఞానమార్గము దెసకు త్రిప్ప వచ్చును. ఒకని నేను మెచ్చుకొనవచ్చును. నేను వాని సత్కా ర్యములవల్ల లాభమందియుండవచ్చును. నే నిక్కడ నిలబడి యుండుట ఎంతసత్యమో అదంతసత్యము. వీథినిబడిపోవు కొండొక రీతి ఆడుదానిని చూచి నే నసహ్యించుకొనవలసినదే. అట్లు చేయుట సంఘమున కిష్టము. కాని ఆమె నాకు రక్షకురాలు. ఆమె దోసగును, ఆమెపై బడిన జుగుప్సయును ఒరులకు పారము చూపును. తక్కిన స్త్రీలయొక్క పాతివ్రత్యమునకు కారణము కావచ్చును. దీనినిగూర్చి మీ రాలోచింపుడు. ఇది చాల యథార్థము. ఇం దీషణ్మాత్రము అతిశయోక్తి లేదు. నేను లోకములో తిరిగిన కొలది పలువురి స్త్రీ పురుషులతో కలిసి తిరిగిన కొలది నా కీ యభిప్రాయము దృఢపడుచున్నది. నే నెవరిని నిందింతును? ఎవరిని మెచ్చుకొందును? నా డాలుకు రెండు ప్రక్కలు. రెండును పరిశీలనార్హములే! పూర్వాపరవిషయ సమీక్ష చేయుట నా ధర్మము.

ప్రథమమున మనముందున్నపని చాలపెద్దది. మనము చేయవలసినది మనస్స్వభావములో మేళవించిపోయిన అనంతమైన సంస్కారములను నిరోధించుట. మన మొక చెడ్డపనిని తెలిసియే చేయుచున్నాము. ఆ పనిచేయుట తెలివితోనేగాని దానికారణము మాత్రము ఎచటనో చిత్తముయొక్క అంతరాంతరములో మనకు తెలియకుండ పడియున్నది. అందుచేత అది చాల శక్తిగలిగినదై యున్నది.

ఈ చిత్తగతసంస్కారములను నిరోధించుటయే యోగము యొక్క ప్రథమలక్ష్యము. మనము చిత్తవృత్తులను నిరోధింపగల

మని మన మెఱుగుదుము. ఎందుచేత? ఈ చిత్తగతసంస్కారము లెట్లేర్పడ్డవి? ఇవన్నియు ఒకప్పుడు మన మనస్సులో మనము తెలిసి చేసిన భావనలే. ఇవి చిత్తమునందు పేరుకొని సంస్కారములైనవి. మనము వానిని చూడము. అవి యున్నవని మనకు తెలియదు. ఉన్నవని మనము మఱచితిమి. కాని ఈ దౌష్ట్యమునకు కారణము చిత్తములో నున్నట్లే సత్కార్యాచరణమునకు కారణము చిత్తములోనే యున్నది. ఆ చిత్తమన్నది మన జేబు వంటిది. మంచి చెడ్డ వస్తువులను మనజేబులో వేసికొన్నట్లే చిత్తములోగూడ దుష్టసంస్కారములు సత్సంస్కారములు నిలువ చేసికొంటిమి. వాని నిప్పుడు మఱచితిమి. వానినిగూర్చి ఆలోచించనే ఆలోచించము. వానిలో చాలభాగము క్రుళ్లి మనకు చాల అపాయకరముగ తయారైనవి. ఈ చిత్తగతసంస్కారములు విజృంభించి మానవత్వమును చంపుచున్నవి. అందుచే నిజమైన యోగశాస్త్రముయొక్క లక్షణము ఆ చిత్తగతసంస్కారములను అదుపులోనికి తెచ్చుట. మనుష్యుని మరల పునరుజ్జీవింపజేసి తన స్వాధీనములో తా నుండునట్లు చేయుట. నిగ్రహవంతునిచేయుట. ప్లీహములు మొదలైన స్వాభావికచలనముగల్గిన అవయవములను మన అధీనములో నుండునట్లు చేసికొనగల్గును.

ఇది చిత్తనిరోధము; యోగశాస్త్రమునందలి ప్రథమ విషయము. తరువాత గమనార్హమైన ముఖ్యమైన విషయము అతీంద్రియద్రష్టత్వము. ఈ అతీంద్రియద్రష్టతాస్థితి పొందిన తర్వాత పురుషుడు ముక్తుడగును. దైవీస్థితి పొందును. మృత్యువు నిర్జితమగును. దౌర్బల్య మనంతమైన శక్తిగా పరిణమించును. లోహశృంఖలములు విడిపోవును. ఇది యోగశాస్త్రలక్ష్యము. ఇది దివ్యానుభవము. దీనికి మేర లేదు.

కాబట్టి యోగాభ్యాసము రెండువిధములుగా నుండును. ఇడా పింగళ నాడులను సక్రమముగా పనిచేయించుటవలన చిత్త

గతసంస్కారమును నిరోధించుట ఒకటి. అతీంద్రియద్రష్టత్వ మందుట మఱియొకటి.

బహుకాలాభ్యాసమువల్ల ఈ దివ్యానుభూతిపొందినవాడే యోగి యని గ్రంథములు వాకొనుచున్నవి. నిరంతరము ధ్యానయోగమునందుండుటవల్ల సుషుమ్నమార్గము తెఱచుకొని అంతకుపూర్వ మెప్పుడు నా సుషుమ్నామార్గమున ప్రవేశింపని ఒకానొక ప్రాణశక్తి ప్రవాహమందు ప్రవేశించి క్రమముగ షట్చక్రస్థానములను భేదించుకొని సహస్రారమును చేరును. అప్పుడు సాధకునికి ఆత్మస్వరూపజ్ఞానము కల్గును. ఈశ్వరునితో అభేదాధ్యవసాయము కల్గును.

ప్రతివాడును ఒక్కడైన వదలకుండ ఈ యోగానుభవము నందవచ్చును. కాని ఇది చాల కష్టమైన పని. ఈ అనుభవమును పొందగోరువాడు వట్టి ఉపన్యాసములు వినుటవల్ల ప్రయోజనము లేదు. కొంచెము ప్రాణాయామమభ్యసింపవలెను. ఉన్నదంతయు ప్రయత్నముచేయుటలోనే యున్నది. ఒక క్రొవ్వువత్తిని తయారుచేయుట కెంతకాలముపట్టునో చూడుడు. తయారైన తర్వాత వెల్గు టెంతసేపు. క్షణము. అన్నము వండుట కెంతకాలము పట్టును. తినుటయన్ననో ఎంత నెమ్మదిగతిన్నను అరగంటకంటె పట్టదు. ఒక్కక్షణములో దీపము వెల్గించినట్లు, అట్లే మనము యోగానుభూతి నొక్క క్షణములో పొందవలెనని వాంఛింతుము. కాని క్రొవ్వువత్తి తయారుచేయుట చాలముఖ్యమన్న సంగతి మనము మఱచిపోవుదుము.

లక్ష్యమునుచేరుట చాలకష్టమైనను మనమేమాత్రము ప్రయత్నముచేసినను అది వ్యర్థముగా పోదు. ఏవస్తువు వ్యర్థముగా బోదని మనకు తెలియును. అర్జునుడు గీతాశాస్త్రములో శ్రీకృష్ణు నడుగును : ''సిద్ధిని పొందనియోగి ఛిన్నాభ్రమువలె నశించునా? అత డేగతిని పొందును''. శ్రీకృష్ణుడు ''నాయనా! ఈ ప్రపంచ

ములో ఏదియు వ్యర్థముగా పోదు. ఎవడే పని చేసినను అది వానికి దక్కును. యోగాభ్యాసమునకు ఫలితము ఒకని కీ జన్మలో కలుగకున్నను తర్వాతిజన్మలో ఇప్పుడు వదలిపెట్టినచోటినుండి ప్రారంభించును. ఇది చాలయథార్థమైనవిషయము. కానిచో, జీససు, బుద్ధుడు, శ్రీశంకరుడు బాల్యముననే మహానుభావు లెట్లు కాజాలిరి.

ప్రాణాయామము, యోగాసనములు మొదలగునవి యోగాభ్యాసమునకు సాహాయ్యకములు. కాని అవి కేవలము దైహికములు. యోగాభ్యాసము ఎక్కువ భాగము మానసికము. అన్నింటికంటె ప్రధానముగా నావశ్యకమైనది ప్రశాంతజీవనము.

నీవు యోగివి కావలెననుకొన్నచో నీవు నిశ్చింతుడవు కావలెను. ఒంటరిగను, నిశ్చింతగను నీవు జీవించుటకు తగిన ప్రదేశమునందుమాత్రమే నీవు నివసించవలెను. లౌకిక సుఖభూయిష్ఠమైన జీవనముచేయుచు, ఆత్మానుభూతి పొందగోరుట కుదురదు. ఏరుదాటువాడు మధ్యలో ఒక మొసలిని చూచి అది తెప్పకొయ్య అనుకొని దానిని పట్టుకొనినట్లుండును. ప్రథమముగా నీవు ఆత్మానుభవమునకై యత్నింపుము. ప్రథమమున దైవ సామ్రాజ్యము నన్వేషింపుము. అది పొందితివా నీ కన్నియు కరతలామలకములే. ఈ ఆత్మానుభూతియన్నది చాల గొప్ప ధర్మము. ఇది గొప్పత్యాగము. ఈ లక్ష్యమునకై బ్రతుకుము. దీనిపైన మనస్సునిల్పుము. తక్కిన ఏ విషయమునకు నీ మనసులో చోటుండరాదు. ఈ ఆధ్యాత్మిక పరిపూర్ణత్వమును సాధించుటకై మన సర్వశక్తులను వినియోగింతుము. నిజముగా మన మాత్మానుభూతికై తహతహలాడినచో మనము దానికొఱకై బాగుగా కష్టపడగల్గుదుము. "కష్టేఫలి". మనము మధ్యను పొరపడవచ్చును. ఈపొరపాట్లు మనకు తెలియకుండ దేవతలవలె సహాయము చేయుచున్నట్టివి.

ఆధ్యాత్మికజీవనమునకు ధ్యానము చాల సహాయకము. ధ్యానమునందు మనము భౌతికపరిస్థితులనన్నిటిని నిరాకరించి మన సహజమైన దైవీస్వభావమునందు మగ్నులమైపోవుదుము. ధ్యానమునందు మనకు బాహ్యమైన ఏవిషయముయొక్క అవసరముగాని లేదు. ఆత్మానుభవస్పర్శ చాలు. చీకటికోణములు తేజోవంతములగును. దుర్వాసనా భూయిష్ఠములు సుగంధ బంధురములగును. రాక్షసుడు దేవతయగును. విరోధము నశించును. స్వార్థము మటుమాయమగును. శరీరమును గుఱించి మన మెంత తక్కువగా నాలోచించిన అంతమంచిది. ఏలయన ఈ శరీరమే మనలను క్రిందికి దిగలాగునది. సంగము, దేహాత్మభ్రాంతి, మనదుఃఖములకు హేతువులు. ఇది రహస్యము. "నే నాత్మపదార్థమను. ఈ దేహము నేనుకాదు. ఈసర్వప్రపంచము, దానియందున్న సర్వబంధములు మంచి చెడుగులు సుఖదుఃఖములు మున్నగునవన్నియును నొకయవనికపైన చిత్రించిన చిత్రములవంటివి. నే నీయన్నింటిని చూచుచున్నాను, ద్రష్టను" అని నిరంతరము భావింపవలెను.



# జ్ఞానయోగోపన్యాసములు*

## I

ఓంతత్సత్. ఓంకారమును తెలిసికొనుట సృష్టిరహస్యమును తెలిసికొనుట. రాజయోగము, భక్తియోగములకువలెనే, జ్ఞానయోగమునకును లక్ష్య మొక్కటే కాని మార్గములురెండు. ఇది బలవంతుల కుపయోగించుయోగము. అనగా యోచించు స్వభావము కలవారికిమాత్రము. భక్తియోగి భక్తిప్రేమలద్వారా ఏకత్వమును దర్శించును. జ్ఞానయోగి కేవలవిచారణవల్ల తత్త్వమును దర్శించును. అతడు తన పురాతన దేవతార్చనలను, విశ్వాసములను ఆచారములను వదలిపెట్టుటకు సిద్ధముకావలెను. ఇహపరముల రెంటిని విడిచిపెట్టుటకు సిద్ధపడవలెను. మోక్షేచ్ఛ యొక్కటియే కోరదగినది. జ్ఞానము లేక మోక్షము లేదు. మోక్షమనగా స్వరూపజ్ఞానము, జన్మ, జరా, మృత్యుభయములకు తా నతీతుడ ననియెఱుంగుట. ఆత్మదర్శనమన్నింటికంటె ఉత్తమమైనది. ఆత్మ ఇంద్రియాతీతము. మనస్సునకు నతీతము. సత్యమైన ఆత్మ పదార్థము తెలియబడునదికాదు. అదిశాశ్వతమైనది. జ్ఞాత, జ్ఞేయము గాదు. మనకున్న జ్ఞానము సాపేక్షకమైనది. కేవలజ్ఞానముకాదు. ఇంద్రియజ్ఞానమంతయు సాపేక్షమగును. కార్యకారణసంబద్ధమైనది. ఈ ప్రపంచకము సాపేక్షకమైనది. ఆత్మతత్త్వమునందు ఆరోపితమైనది. ఇచట సుఖదుఃఖములు సమానముగనుండును. ఈప్రపంచకమునందే తన ఆత్మస్వరూపము నెఱింగి బ్రహ్మభూతుడగును.

---

* ఎస్. వి. వాల్డో అను సుప్రసిద్ధ అమెరికను శిష్యురాలు ఈప్రసంగములను వ్రాసియుంచెను. 1896 లో శ్రీ శారదానందస్వామి వారు అమెరికాలో నుండగా వాని నకళ్లను తీసికొనిరి.

ఈ ప్రపంచము ప్రకృతిదృష్ట్యా పరిణామము. పరమాత్మ దృష్ట్యా వివర్తము. మనము మాయాపిహితమైన పరమాత్మనే, బ్రహ్మమునేచూచి ప్రపంచమని భ్రాంతిపడుచున్నాము. ఈ ప్రపంచకము వట్టిశూన్యము కాదు. ఇది మిథ్య యనగా అసలు లేదని కాదు. ఆయున్నది బ్రహ్మము. అదియే ప్రపంచకముగా కన్పించుచున్నది. ఆ బ్రహ్మమునాధారము చేసికొని ఈప్రపంచము భాసించుచున్నది.

ఆత్మ జ్ఞాతృస్వరూపము. మనము జ్ఞాత నెట్లెఱుఁగుదుము. మనము జ్ఞాతృస్వరూపులముగావున జ్ఞాత నెఱుంగలేము. జ్ఞాత యెప్పుడును జ్ఞేయము కాజాలదని వేదాంతము చెప్పును. అధునాతన భౌతికశాస్త్రము నిట్లే చెప్పును. కాని మనకాయాత్మ పదార్థదర్శన మప్పుడప్పుడు కల్గుచుండును. ఈ ప్రపంచభ్రాంతి మనము దాటినప్పుడు మన కాయాత్మదర్శనము సంభవించును. తర్వాత ఈ ప్రపంచభ్రాంతి వెంటనే మనము వదలిపోగలము. ఈ ప్రపంచము వట్టి ఎండమావియని మన కనుభవములోనికి వచ్చును. ఈ ఎండమావిని తప్పించుకొని ఆత్మదర్శనము సంపాదించుటయే సర్వమతముల లక్ష్యము. జీవాత్మ పరమాత్మలకు భేదములేదని వేదములు బోధించును. కాని ఈ ప్రపంచభ్రాంతిని నిరసించి ఈ జీవాత్మ, పరమాత్మైక్యమును సాధించినవారు చాల కొలదిమంది మాత్రమే.

జ్ఞానియగుటకు మొదటగాజయింపవలసినది భయము. అది మనకు ప్రబలశత్రువు. తర్వాత నీకు దానినిగుఱించి తెలియునంత వఱకు దేనినీ నమ్మరాదు. నిరంతరము నేనీ శరీరమునుకాదు, మనస్సునుకాదు, మనోవృత్తినికాను, బుద్ధియనుకాను, నేనాత్మ స్వరూపుడనని భావించుచుండుము. ఈ అన్నింటిని నీవు నిరాకరించినపు డాత్మస్వరూపుడవుగా మిగులుదువు. జ్ఞానియొక్క ధ్యాన పద్ధతి రెండు విధములు.

ఒకటి, అనాత్మపదార్థములను నిరసించుట.

రెండు, ఆత్మపదార్థము నవలంబించుట.

ఈ ఆత్మ ఏకము. సచ్చిదానందస్వరూపము. నిజమైన హేతువాది నిర్భయముగా తన తర్కమును తుదివఱకును కొన సాగించును. త్రోవలో మధ్య నిలుచుటవలన లాభములేదు. మనము ఇదికాదు. ఇదికాదని ఆత్మస్వరూపము కాని దానిని నిరసించుకొనుచు పోయిపోయి నిరసించుటకు వీలులేనిచోట మాత్రమే ఆగెదము. అదియే నిజమైన "నేను". ఆ "నేను" విశ్వమునకు సాక్షీభూతము. అవికారమైనది శాశ్వతమైనది. అనంతమైనది. అదియే ఆత్మపదార్థము. దానిని మన కగపడకుండ చేయునది అజ్ఞానము. ఇది ఆత్మపదార్థమును పొరలుపొరలుగా కప్పియున్నది. ఐనను ఆ ఆత్మపదార్థముమాత్ర మవికారమై ఏకమైయున్నది.

ఒకవృక్షముపై రెండుపక్షులు కూర్చున్నవి. పైననొకటి. క్రిందనొకటి. పైననున్న పక్షి శాంతమైనది. పరిపూర్ణమైనది. ఠీవిగలది. సుందరమైనది. క్రిందనున్న పక్షి కొమ్మనుండి కొమ్మకెగురుచున్నది. ఒక్కొక్కచోట తీయనిపండ్లుతిని సుఖపడుచున్నది. ఒక్కొక్కచోట చేదువితిని దుఃఖపడుచున్నది. ఒకరోజు మఱియు చేదైనపండుతిన్నప్పుడు, దృష్టిపైకి నిగుడించి పైన ఠీవిగా, శాంతముగాకూర్చున్న పక్షివంకచూచి దానివలె నేనునున్నచో నెంతబాగుండు ననుకొనినది. కొంచెము దానివంకకు పైకెగిరినది. వెంటనే మఱల దానివలె నుండవలెనను కోరిక మఱచిపోయినది. పూర్వమువలెనే తీయనిపండ్లు, చేదుపండ్లు తినుట ఆరంభించి సుఖదుఃఖము లనుభవించినది. మఱల పైకిచూచి కొంచె మెగిరినది. ఇట్లు బహుపర్యాయములుచేసినది. చిట్టచివరకు పైన శాంతముగ, ఠీవిగాకూర్చున్న పక్షికి మిగుల సమీపమునకెగిరినది. ఆ పక్షి యాకలసౌందర్యము మిలమిల మెఱసినది. తన్ను వివ

శము గావించినది. చిట్టచివరకు తానే ఆపక్షి. అక్కడ రెండు లేవు. మొదటనుండియు పైనకూర్చున్నది తానే. తా నెప్పుడు నక్కడనే కూర్చున్నది. క్రిందికిదిగనేలేదు. ఆసంగతి ఇప్పుడే గ్రహింపగల్గినది. ఎంత విచిత్రమైన సంగతి. జీవుడా క్రింది పక్షి వంటివాడు. తాను భావింపగల్గిన లక్ష్యమువంక కెగురుటకు ప్రారంభింపవలె. ప్రయత్నము చేయవలెను. తుదకు తానే పరమాత్మ యని తా నెప్పుడు పరమాత్మస్వరూపుడుగ నుండెనని తక్కిన దంతయు స్వప్నప్రాయమని గ్రహించును.

అనాత్మ ద్రవ్యములనుండి తాను వేఱని వివేకించుట, ఆత్మ పదార్థము నిత్యసత్యమని విశ్వసించుట అచ్చమైనజ్ఞానము. జ్ఞాని తనమనస్సులో ఓం తత్సత్ అని భావించుచుండవలెను. అనగా ఓం - అన్నదొక్కటే సత్పదార్థము. ఏకత్వము జ్ఞానయోగమునకు మూలసూత్రము. ఇదియే అద్వైతము. అనగా ద్వైతము కానిది. ఇచట ద్వైతభావము లేదు. వేదాంతశాస్త్రమున కిది పునాది. బ్రహ్మసత్యము. జగన్మిథ్య. అహం బ్రహ్మాస్మి. ఇది మన కనుభవములోనికి వచ్చువఱకు భావించుచుండవలెను. లాభాలాభములు, శుభాశుభములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వముల నతిక్రమించి శాశ్వత మవికార మనంతము నద్వైతమైన ఆత్మస్వరూపుడను నేనని అనుభవమును తెచ్చుకొనునంతవఱకు భావింపవలెను.

జ్ఞానయోగి మతసంకుచితత్వముకలవానివలె తీవ్రవాదిగా నుండవలసినదే. ఐనను అతడు విశాలదృష్టికలవాడై యుండవలెను. అతడు తన మనస్సును నియమించుకొనవలెను. అతడు బౌద్ధము, క్రైస్తవము మొదలైన మతముల యభిప్రాయముల నవగతమొనర్చుటకు వెనుదీయరాదు. ఐనను అతడు సృష్టియందేకత్వమునే సర్వత్ర అనుసంధానము చేసికొనవలెను. నిరంతరాభ్యాసమువలన చిత్తము వశమగును. ఆ ఏకత్వమునందే భిన్న

త్వము దృశ్యమానమగును. మనముచేయు పనులతో మనము 'అహం' మమాభిమానము పొందరాదు. మనముచేయు అభ్యాసమును వదలి అన్యశ్రవణము, అన్యదర్శనము, అన్యసంభాషణము చేయరాదు. మన శ్రద్ధయంతయు అభ్యాసమునందే కేంద్రీకరింపవలెను. అహోరాత్రములు 'సోఽహం' మంత్రమును జపింపవలెను.

## II

అద్వైతవేదాంతాచార్యులలో శ్రీశంకరభగవత్పాదులు శిరోమణి. పటువైన వాదబలమున వేదవేదాంతములనుండి ఆయన అద్వైతసత్యముల నిరూపించెను. ఆ సత్యములమీద జ్ఞానసిద్ధాంతమును నిర్మాణముచేసి తనభాష్యమునందు వ్యాఖ్యానించెను. బ్రహ్మమును గురించి ఉపనిషత్తులందున్న భిన్నభిన్నవర్ణనములను సమన్వయించి ఉన్నది ఒక్కటే సత్పదార్థమని నిరూపించెను. అధికారిభేదముననుసరించి ఉపనిషత్తులయందు దాయా భిన్నవర్ణనములు ఏర్పడినవని నిరూపించెను. క్రీస్తుబోధనలుకూడ అధికారిభేదమునుబట్టి చేయబడినవే. మొదట స్వర్గములో భగవంతుడున్నాడు. ఆయనను ప్రార్థింపుడని చెప్పెను. తర్వాత ఒక అడుగు పైకి వెళ్లి "నేను వృక్షమును, మీరు కొమ్మలు" అని చెప్పెను. తుదకు "నేను, భగవానుడు నభిన్నులమే" యనెను. "స్వర్గసుఖము నీయందే యున్నది" అని చెప్పెను. శ్రీశంకరుడు మోక్షమునకు వలసిన మూడు పదార్థములను చెప్పెను. 1. మనుష్యత్వము, 2. ముముక్షుత్వము, 3. మహాపురుషసంశ్రయము. ఈ మూడు నున్నచో మనకు ముక్తి హస్తామలకమే. జ్ఞానమే మోక్షకారణము. జ్ఞానముతోపాటు సద్గుణములు నుండవలెను.

ఉన్న దొక్కటే సత్పదార్థము. జీవులందఱు ఆ సత్పదార్థమే. దానియొక్క అంశలుకాదు అనునది వేదాంతసారము.

ఒకేసూర్యుడు ప్రతిహిమబిందువునందు ప్రతిబింబించి అనేకుడైనట్లు కన్పించుచున్నాడు. దేశకాలనిమిత్తములందా సత్పదార్థము ప్రతిబింబించి బహుజీవులుగా భాసించుచున్నది. ఇది వట్టి ఆభాసము. దీనికంతకు వెనుకనున్న సత్పదార్థ మొక్కటే. వైరాగ్యమనగా శరీరాదులందు ఆత్మాభిమానము అహంమమాభిమానము లేకుండుట. ఈ శరీరాదులందు అహంమమాభిమానము ఒక పీడకల. దీనినుండి విడుదల పొందవలెను. 'సోఽహం' అను సత్యమును మనము గుర్తెఱుంగవలెను. మనము సముద్రములో కలిసి నశించిపోవుటకు అందు కురియు వానచినుకులవంటివారము కాము. దానిలో జీవుడు పరమాత్మయందంశ కాదు. సంపూర్ణముగ పరమాత్మయే. అజ్ఞానమునుండి విముక్తుడగుటతో ఈ పరమ సత్య మనుభవమునకు వచ్చును. అనంతమైన పదార్థము విభక్తమెన్నటికిని కాజాలదు. ద్విత్వరహితమైన ఏకత్వమునందు ద్విత్వము సంభవించదు. ఉన్నదొక్కటే. ఈ జ్ఞానము ప్రతిజీవికిని ఎప్పటికైనను కలిగితీరును. కాని మన మిప్పుడే అట్టి జ్ఞానము సంపాదించుటకు శ్రమింపవలెను. మన మా జ్ఞానము పొందినగాని మానవులకు చేయదగినంత పెద్దసాహాయ్యము చేయలేము. జీవన్ముక్తుడుమాత్రమే నిజముగా నందఱ ప్రేమింపగలడు. నిజమైన సేవచేయగలడు. పరమసత్యము బోధింపగలడు. అదియే మనకు మోక్షమునీయగలట్టిది. ఆశ మనలను బానిసలుగా చేయును. ఈ ఆశాపిశాచము దాహము ఆరనిది. దానికి వశులైనవారికి విశ్రాంతి యుండదు. జీవన్ముక్తుడు ఈ కామమును జయించినవాడు. ఎట్లు జయించెను? అతడు తాను పరిపూర్ణుడైన బ్రహ్మస్వరూపుడననియు, సర్వము తనస్వరూపమే కావున కోరుటకే పదార్థము మిగిలి లేదనియు గుర్తించినాడు. ఇట్టి జ్ఞానమే ఆశాపిశాచమును జయించుటకు చాలినది. మనకున్న భ్రాంతులన్నింటికి మూలము మనస్సు, శరీరము, స్త్రీపురుషభేదము.

మతము, కులము, బంధము — ఈ అన్నియు మనస్సు నిర్మించినవే. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అందుచే మనము నిరంతరము పరమార్థము అనుభవమునకు వచ్చునంతవఱకు మననము చేయుచుండవలెను. ఆనందము మన స్వభావము. మన మనుభవించు లౌకికసుఖమూ ఆనందచ్ఛాయ. ఆ యానందలేశము. ఈ లేశమాత్రమైన సుఖముకూడ మన స్వభావమును మనము ముట్టుకొన్నప్పుడే సంభవించును. ఈ ఆనందము సుఖదుఃఖముల కతీతము. ఇదియే ప్రపంచమునకు సాక్షీభూతమైనది. అది ద్రష్ట. ఈ జగత్తు దృశ్యము. ద్రష్ట అవికారి. దృశ్యము నిరంతరము మాఱిపోవుచుండును. ఈ ద్రష్ట సమక్షమున జీవనగ్రంథములోని పుటలు చలించిపోవుచుండును.

యోగ మభ్యాసజన్యము. జ్ఞానము యోగజన్యము. జ్ఞానమువల్ల ప్రేమ జనించును. దీనివల్ల ఆనందము కలుగును.

అహంకార మమకారములు అజ్ఞానజన్యములు. వీనిని దూరీకరించుట అసంభవమగునట్లుగా అనంతకాలమునుండి మనము వీనిలో చిక్కుకొనియున్నాము. మనము ముక్తులము కావలెనన్న వీనిని దూరీకృతమొనరింపవలెను. మనము వివేకులము, సంతుష్టులము కావలెను. గడ్డముపెంచిన జ్ఞానికాడు. మతము ప్రపంచమునందు ఆనందమయమైనది కావలెను. ఉత్తమమగుట దీనిహేతువు. కేవలసన్న్యాసమువల్ల మనుష్యుడు పవిత్రుడుకాడు. ఈశ్వరభక్తుడు, పవిత్రుడు ఐనవాడు దుఃఖించవలసిన యవసరమేమున్నది. వాడు పసిబిడ్డవలె, ఈశ్వరునిబిడ్డవలె సంతుష్టుడు కావలెను. మతములో ప్రధానమైన యంశము చిత్తశుద్ధి. ఈశ్వరుడు మనలోనే యున్నాడు. కాని చిత్తశుద్ధికలవారు మాత్రమే తనహృదయమునం దీశ్వరదర్శనము చేయగలరు. మనము లోకమును చూచుచుంటిమిగదా. మనము దానిని లోక మనుకొనుచుంటిమి కావున అట్లే తోచుచున్నది. దానియం

దీశ్వరబుద్ధి చేసిన మన కదళ్లే తోచును. ప్రతివస్తువునందును మన కీశ్వరదృష్టి యుండవలెను. మాతాపితలు, అన్నలు, తమ్ములు, శత్రువులు—ఎల్లరయందును ఈశ్వరబుద్ధియే యుండవలెను. సర్వమునందు నీశ్వరబుద్ధి చేసినచో ఈ ప్రపంచ మెట్లు మాటిపోవునో చూడుడు. సర్వత్ర ఈశ్వరునితప్ప ఇతరమును చూడవలదు. దుఃఖము, స్పర్ధ, కష్టము అంతర్ధానమగును. జ్ఞానము మతములన్నింటి కతీతమైనది. అచట మతములేదు. అనగా జ్ఞానము మతములకు విరోధి యని కాదు. మతములకు మించిన స్థితి. జ్ఞాని ఈ భిన్నమతములను నిరసింపడు. అందఱకును సహాయపడును. నదులన్నియు సముద్రమునందు కలిసి ఏకమైనట్లు మతములన్నియు జ్ఞానగాములై ఏకమగును. సర్వపదార్థములకు నధిష్ఠానసత్త బ్రహ్మపదార్థము. మన కీ సత్యము దృగ్గోచరమైనంతనే మనకును వేఱె సత్త యుండదు. అప్పుడు మనము అధిష్ఠానస్వరూపులమని తెలిసికొందుము. ఈ ఏకత్వానుదర్శనము వల్ల మన కీశ్వరునితోడి ఏకత్వానుసంధానము కుదురును.

శ్రీకృష్ణుడు భగవద్గీతయందు జ్ఞానయోగమునుగూర్చి చక్కగా చెప్పెను. గీతాశాస్త్రము భారతీయవాఙ్మయమందు మకుటమాణిక్యముగా ప్రసిద్ధమైనది. అది వేదములకొక టీకి వ్యాఖ్యానము. మోక్షసామ్రాజ్యమును జయించుటకు మన మీ జీవితమునందే యుద్ధమును చేయవలెను. అందుచేత మనము వెనుకడుగు వేయరాదు. సాధింపదగినదంతయు సాధించితీరవలెనని మన కది బోధించును. గీత పరమపురుషార్థమును గుఱించి చేయవలసిన సాధనల నుపదేశించును గావున యుద్ధరంగమునందీ యుపదేశదృశ్య మేర్పాటుచేయబడినది. కృష్ణుడు అర్జునునకు సారథియై అతనిని విషాదపడవలదని, అతడవినాశియైన ఆత్మస్వరూపము గావున వికారియైనది ఆత్మస్వభావమగుటకు వీలులేదు కావున మృత్యుభయము విడనాడుమని బోధించెను. అధ్యాయము

తర్వాత నధ్యాయముగా వేదాంతసత్యములను శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించెను. ఈ బోధలే ఈ గ్రంథమున కింత మహత్త్వమొసంగినవి. వేదాంతసిద్ధాంతములన్నియు నిందు సంక్షేపవివరణమందినవి. వేదములు, ఆత్మ అనంతమనియు, శరీరపతనమువల్ల నాత్మ వినష్టముకాదనియు బోధించును. ఆత్మపదార్థము ఒకసున్నవంటిది. కాని ఈ సున్నకు హద్దులులేవు. దీని కేంద్రముమాత్రము శరీరగతమై యుండును. మృతి యనగా ఈ కేంద్రముమాఱుట. ఈశ్వరుఁడుకూడా ఒకసున్న. ఈ సున్నకును హద్దులులేవు. కాని దీని కేంద్రబిందువు సర్వత్ర యున్నది. మనము సంకుచితమైన ఈ శరీరకేంద్రమునుండి విడివడినచో మనము మన నిజమైన ఆత్మ యగు ఈశ్వరుని కనుగొందుము.

వర్తమానము భూతమునకు భవిష్యత్తునకు మధ్య నున్న హద్దుగీత. అందుచేత మనము వర్తమానమునకే కట్టువడియుంటిమని వాదింపరాదు. ఈ వర్తమానము భూతభవిష్యత్తులను వదలలేదు. ఈ మూఁడును కలిసినగాని పరిపూర్ణముకావు. అందుచే కాలభావము మన ఆలోచనమార్గమువల్ల మనకు దాపురించిన బంధము.

## III

ప్రపంచముతో సంగము వదలవలయునని జ్ఞానయోగము చెప్పును. అట్లని ప్రపంచమునే వదలిపెట్టనక్కఱలేదు. ప్రపంచమందుండి ప్రాపంచికుఁడు కాకుండ నుండుట నిజమైన సన్న్యాసిలక్షణము. సన్న్యాసిని గుఱించిన ఈ యభిప్రాయ మన్నిమతములకు నేదో విధముగా సమానముగానే యున్నది. సర్వసమానత్వము, సర్వత్రసమదర్శనము, జ్ఞానిలక్షణము. మానావమానములను, శుభాశుభములను, శీతోష్ణములను జ్ఞాని సమదృష్టితో చూచును. భారతదేశములో ఈ విషయము నమలులోపెట్టిన మహానుభావు లున్నారు. వారు మంచుకొండల నెక్కెదరు.

మందు ఎడారిలో నడతురు. వారు కౌపీనమాత్రధారులు. శీతోష్ణాది ద్వంద్వముల నతిక్రమించినవారు.

మనము శరీరాభిమానమును మొట్టమొదటగా వదల వలెను. మనము శరీరముకాదు. తర్వాత లింగ దేహాభిమానము వదలవలెను. లింగదేహమనగా మనస్సు, అంతఃకరణము. మన మదికాదు. సూక్ష్మదేహమది. ఆత్మలో చేరినదికాదు. శరీర మన్నమాట ప్రతివస్తువునకును వాడవచ్చును. అన్నియు శరీర ములే. ఈ అన్నిటిలో సమానలక్షణ మొకటున్నది. అదియే ఉనికి. మనశరీరములు మనస్సున కుపాధులు. ఆ మనస్సు ఆత్మ కుపాధి. ఆ ఆత్మ ఏకమే. అదియే పరమాత్మ. అచ్ఛమైన ఉనికి. మన ఆత్మయొక్క ఆత్మ. విశ్వమంతకును ఆత్మ భూతమైనది అదియే మనప్రాణమునకు ప్రాణము. మన అచ్ఛమైన ఆత్మ. మనము ఈశ్వరునికంటె వేఱని ఏకొంచెమైన భేదబుద్ధి కల్గి యున్నచో మనకు భయముండనేయుండును. మనము పరమాత్మ కంటె భిన్నులము కామను దృఢజ్ఞానము సంపాదించుచో అది పోవును. మనకంటె వేఱేమున్నది భయపడుటకు? జ్ఞానబలము వల్ల జ్ఞాని శరీరమును, మనస్సును తిరస్కరించి ఉత్తమస్థితికి పోవును. నిష్ప్రపంచసిద్ధి చెందును. అజ్ఞానము నాశముచేసి అచ్ఛ మైన ఆత్మపదార్థమును ప్రత్యక్షీకరించుకొనును. సుఖదుఃఖములు, ఇంద్రియానుభవములు అవి ఆత్మను తాకలేవు. ఆత్మపదార్థము దేశకాలనిమిత్తముల నతిక్రమించినట్టిది, అనంతమైనది, సర్వ వ్యాపి.

జ్ఞాని ఏ పద్ధతులకు, ఏ గ్రంథములకు, ఏ రూపములకు కట్టువడియుండరాదు. ఐనను జ్ఞాని నామరూపముల నతిక్రమింప నేరనివారిని నిందించరాదు. అతడింకొకవ్యక్తినిగూర్చి ఆలో చింపనేరాదు. "నీకంటె నేను యోగ్యుడను" అని మఱొకని గుఱించి ఆతడెన్నడును తలపరాదు.

జ్ఞాని కుండవలసిన నాల్గు లక్షణము లివి :

1. జ్ఞానమును గుఱించిన జిజ్ఞాస తప్ప మఱొక ఇచ్ఛ ఏమియు నుండరాదు.

2. అతని కింద్రియములన్నియు వశమందుండవలెను. కష్ట సహిష్ణుత్వము, తితిక్ష యుండవలెను. రాజప్రాసాదమున హంసతూలికాతల్పమున పరున్నను, కఠినశిలాతలమున శయనించినను అతని కొక్కటే. కష్టములను చూచి అతడు బెదరి పాఱిపోరాదు. వానిని స్వీకరించి అనుభవింపవలెను. అత డన్నిటిని త్యజింపవలెను. ఆత్మపదార్థమునే నమ్మవలెను.

3. ఆత్మ నిత్యసత్యము — తక్కినవన్నియు అసత్యమని యతడు గ్రహింపవలెను.

4. తీవ్రమైన మోక్షేచ్ఛ కల్గియుండవలెను.

అచంచలమైన శ్రద్ధతో జ్ఞాని చిత్తసమాధిపొంది శాంతిని సంపాదించును. శాంతి లేకున్న మనుష్యుడు జంతుసదృశుడు. జ్ఞాని పరోపకారపారీణుడు. ఈశ్వరసేవకుడు. ఇహపరములందు కల్గు లాభాలాభములు, కర్మఫలములు మెచ్చక అతడు పరమేశ్వర బోధనచే పరకార్యములందు ప్రవృత్తుడగును. అతని కేమి కావలయును? ఈ ప్రపంచమునందు పొందదగిన ఉత్కృష్టమైన ఆత్మానుభూతి నందిన తర్వాత పొందవలసిన దేముండును? ఆత్మ పదార్థమొక్కటే అభిన్నమైన సత్పదార్థమని వేదము చెప్పును. మనస్సు, మేధ, బుద్ధి — వీనియన్నింటికంటె ఆత్మ వేఱు. దీని నుండియే పైనను ల్లేఖింపబడినవన్నియు కల్గినవి. ఆత్మపదార్థము శక్తి వల్లనే మనముచూచుట, వినుట, ఆలోచించుట, తినుట చేయుచున్నాము. ఈసృష్టికి ప్రయోజనమొక్కటే. అది ఏకత్వమును దర్శించుట. సృష్టియంతయు ఓంకారస్వరూపము. అనగా ఒక్కటే

సత్పదార్థవిలసనము. జ్ఞాని ఏమతమునకుచెందినవాడుకాడు. దేనికిని కట్టుపడియుండరాదు. అతడు హిందువుకాడు, మహమ్మదీయుడును కాడు, క్రైస్తవుడునుకాడు. అన్నియు నగును. అతడు కర్మ త్యాగముచేసినవాడు. పరమేశ్వరున కాత్మార్పణముచేసినవాడు. అతని నే కర్మయు బంధించదు. అతడు నిశితసమీక్ష చేయును. అతడు దేనిని ఒప్పుకొనడు. నిరంతర మతడొక్కటే భావించును. "ఏ విశ్వాసములు లేవు, ఏ పుణ్యశబ్దములు లేవు, స్వర్గనరకములు లేవు, ఆలయములు లేవు, ఉన్నదొక్కటే ఆత్మపదార్థము." "నేతి, నేతి" అని సర్వమును నిరాకరించిన తర్వాత నిరాకరింప రాని పదార్థమొకటి మిగిలినది. అదియే ఆత్మ. జ్ఞాని దేనిని అనాలోచితముగ అంగీకరింపడు. తనకున్న హేతువాదబలము వల్ల, బుద్ధిబలమువల్ల వివేకించి, నిత్యపదార్థమును గ్రహించి, సాపేక్షకములైన అనిత్యపదార్థములను దూరీకరించి నిర్వాణపరమైన శాంతి నందును. ఈ స్థితిని వర్ణించుట, భావించుటకూడ అశక్యము. లౌకికమైన ఫలితములనుబట్టి జ్ఞానియొక్క జ్ఞానమును నిర్ణయించుట అశక్యము. గరుత్మంతుడు ఆకాశమునందు చాల ఎత్తున కెగురవచ్చును. కాని ఆపక్షిదృష్టి భూమిమీదనే. ఎందేని మాంసఖండము కన్పించెనా, అంత ఎత్తునుండి క్రింది కొక్కమాటు దూకును. దానివలె నుండకుము. వ్యాధులు నెమ్మదింపవలెననియు, ఆయుర్దాయము పెరుగవలెననియు, సంపద కావలెననియు కోర కుము. మోక్షము కావలెనని కోరుము.

మనము సచ్చిదానందస్వరూపులము. సత్పదార్థము సృష్టి యందు అన్ని విశేషణములను నిరాకరించిన తర్వాత మిగిలినది. అందుచే మనమున్నాము. ఉంటిమని తెలియును. అనగా ఉనికితో కూడియున్నాము. ఇదియే సత్. అందుచే సత్పదార్థానుభూతి మన కున్నది. మరొకదాని సంపర్కమక్కఱలేకుండ ఉనికివల్లనే ఆనంద ముపలభ్యమానమగును. అప్పుడప్పుడు మనకు అచ్చమైన

ఆనందము క్షణికముగా అనుభవములోనికి వచ్చును. అప్పుడు దేనినిగాని కాంక్షింపము. దేనినిగాని ఎవరికినీయము. మన మితరము నేమియు ఎఱుగము. కేవలానందమనుభవింతుము. మఱుక్షణ మాయానందములేదు. మన కండ్లయెదుట మఱల ఈ జగద్దృశ్యము కన్పించును. ఈ జగద్దృశ్యము కేవలము పరమాత్మపైన కన్పించు వట్టి విలసనము. ఆ పరమాత్మ ఈ దృశ్యమున కధిష్ఠానభూతుడని మనకు గోచరించును. మనము లోకములోనికి దిగిచూచితిమేని పరమాత్మను జగత్తుగా భావించితిమేని సచ్చిదానందము మనకే త్రిపుటిగా గోచరించును. భగవంతుడు, ఆచార్యపురుషుడు, సాధకుడు. సత్ సృజనశక్తి, చిత్ పరిపాలనశక్తి, ఆనంద అనుభవశక్తి. మూడు నొక్కటియే. సత్పదార్థము జ్ఞాతమగుచున్నది. అందుచేత జ్ఞానము వినా సత్పదార్థములేదు. అందుచేతనే క్రీస్తు సిద్ధుని (పుత్రుని) ద్వారా తప్ప మనుష్యుడు భగవంతుని చూడలేడని చెప్పినాడు. వేదాంతము వల్ల ఇక్కడనే నిర్వాణము పొందవచ్చునని, మరణపర్యంతము వేచియుండనక్కరలేదని మనకు తెలియును. నిర్వాణమనగా ఆత్మానుభవము. ఈఆత్మానుభవము ఒక్కక్షణకాలము, ఒక్కపర్యాయము కల్గినచో తర్వాత నతనికి మఱల సంసారభ్రాంతియుండదు. మనకు కండ్లున్నవికాబట్టి ఈజగత్తు కన్పించును. కాని దీని ఈస్వరూపమేదియైన ఒక్కతడవ అనుభవములోనికి వచ్చినదికావున తెలియుచునే యుండును. ఈ జగద్దృశ్యమాత్మపదార్థమును కప్పిన ఒక తెర. ఈ తెర తొలగించి ఆత్మదర్శనము మనము పొందినచో ఈ మార్పంతయు పైనకప్పిన ఈతెరలోనే కాని లోననున్న ఆ ఆత్మయందు ఏవిధమైన వికారములేదని మనకు తెలియును. సిద్ధునివిషయములో తెర చాల పలుచగానుండి లోననున్న ఆత్మపదార్థము ప్రకాశించుచుండును. ప్రాకృతుని విషయములో ఈ తెర చాల దళసరిగానుండును. ఒక్క విషయము మనము మఱచిపోరాదు. ఆ సిద్ధునికి, ఈప్రాకృతున కధిష్ఠానభూతమైన దొక్కటే ఆత్మపదార్థము.

హేతువాదమంతయు ఏకత్వదర్శనమునందు పర్యవసించును. అందుచే మనము మొదట వివేచనముపయోగించి తర్వాత అభేదముపయోగింతుము.

భౌతిక శాస్త్రవిషయములలోకూడ నింతే. బహుధాకన్పించుచున్న ప్రకృతిశక్తులు పరీక్షవల్ల క్రమముగా వానియన్నింటి కాధారభూతమైన ఒక్క శక్తియందు లీనమగును. భౌతిక శాస్త్రము ఈ శక్తుల ఏకత్వము గ్రహింపగల్గినచో అది తుదముట్టినట్లే. ఏకత్వమునందుకొన్న తర్వాత కల్గునది శాంతి. అందుచే జ్ఞానము సర్వాతిశాయి.

సర్వశాస్త్రములలో అధ్యాత్మశాస్త్ర ముత్తమమైనది. ఈ అధ్యాత్మశాస్త్ర మనంతకాలమునకు పూర్వమే ఈ తుదకన్నియు ఒక్కటే అని 'ఏకత్వమును' కనుగొన్నది. జ్ఞానయోగమునకు లక్ష్య మీ 'ఏకత్వమును' దర్శించుటయే. ఈ విశ్వమునంతకు నొక్కటే ఆత్మ. తక్కిన పదార్థములన్నియు దాని విలసనములు. ఈ విలసనములన్నిటికంటె ఆ ఆత్మపదార్థ మతిశయమైనది. వ్యాపకమైనది బ్రహ్మమే. సింహము, పెద్దపులి, మేకపిల్ల, ఆతతాయి, ఎవరైననుసరే ఆ ఆత్మపదార్థ విలసనములే. ఆత్మను మించి మఱియొకవస్తువునకు యథార్థస్థితిలేదు. "ఏకం సత్ విప్రా బహుధావదంతి" ఈ జ్ఞానముకన్న ఉత్తమపదార్థమింకొకటిలేదు. యోగసిద్ధులహృదయములందు ఈ జ్ఞానము స్వయముగా మెఱయును. ధ్యానయోగమువల్ల హృదయము పరిశుద్ధమైనకొలది జ్ఞానానుభూతి తళతళలాడిపోవును. ఈ విషయము 4000 సం॥కు పూర్వమే గ్రహింపబడినది. కాని ఈ జ్ఞానము జాతిపరము కాలేదు. ఇప్పటికిని ఏకొలదివ్యక్తుల సొమ్ముగానోయుండిపోయినది.

## IV

ఈ మనుష్యులందఱు నిజముగా మనుష్యులుకారు. ప్రతివాడు తన అంతఃకరణముద్వారా ఈ ప్రపంచ పరిస్థితిని నిర్ణ

యించుకొనవలెను. దీనిని సంపూర్ణముగ నర్థముచేసికొనుట చాల కష్టము. కంటికి కగపడనిదానికంటె అగపడుదానికి ప్రజలు ఎక్కువ విలువ నిత్తురు. ఒకకథ దీనిని విశదముచేయును. బొంబాయిలో ఇద్దఱు మనుష్యులున్నారు. ఒకడు హిందువు. మఱొకడు జైనుడు. ఒక భాగ్యవంతుడైన వణిజునింటిలో చదరంగమాడుచుండిరి. ఆ యిల్లు సముద్రసమీపముననున్నది. ఆట చాల కాలముసాగినది. ఎత్తైన డాబామీందర వారు కూర్చొనియుండిరి. దానికి క్రిందుగా సముద్రపు పొంగుపోటులు వచ్చుచుపోవుచున్నవి. వారిదృష్టి అటుమళ్ళినది. వారిలో నొకడు దానినిగుఱించి ఒక పురాణకథ చెప్పెను. దేవతల ఆటలే ఈ దృశ్యము నిట్లు సృష్టించెను. వారు జలమునంతయు ఒకగోతిలోనికి పోసి మఱల పైకిచల్లుచుండిరి. రెండవవాడు దీని నొప్పికొనలేదు. "దేవతలు వారి ఉపయోగార్థము ఈనీటిని ఒక పెద్ద కొండశిఖరమునకుతోడి కొని పనిముగిసినపిదప క్రిందకు క్రుమ్మరించి" రని ఆతడనెను. అక్కడ ఒక యువకవిద్యార్థి ఉన్నాడు. ఇది విని నవ్వి ఆతడిట్లనెను. "ఏమయ్యా! చంద్రోదయమువల్ల సముద్రము పోటు పొడుచునని మీకు తెలియదా?" ఇది విని వారిద్దఱికి పట్టరాని కోపము వచ్చినది. "ఏమోయి మేము పిచ్చిపుల్లాయిలమనుకున్నావా? చంద్రునివద్ద ఈ నీళ్ళను పైకిలాగుటకు త్రాళ్ళేమైన నున్నవని. ఈ నీళ్ళంతదూరము పోగలవని మేమనుకొనుచున్నట్లు నీ యభిప్రాయమా" అని విరుచుకుపడినారు. అట్టి పిచ్చి సమాధానములను వారంగీకరింతురా! ఈ సందర్భములో గృహాధికారి అక్కడకువచ్చెను. కథ తెలిసికొనెను. అతడు చదువుకొన్నవాడే. విషయము తెలిసినవాడే. కాని ఈచదరంగపుటాటగాండ్ర కీ విషయముచెప్పి లాభములేదని అతనికి గట్టిగా తెలియును. ఆకుఱ్ఱ విద్యార్థి కొకసైగచేసి ఆ ఆటగాండ్రిద్దఱకు మిక్కిలి తృప్తికరముగా ఒక చక్కని సమాధానము నాతడు చెప్పెను. "ఓయి బాబూ! మీకు తెలిసియేయుండును. సముద్రముమధ్య ఒక

స్పాంజికొండ యున్నది. మీరు స్పాంజినెఱుగుదురు కాన ఆకొండ తెలియునుగదా! ఈస్పాంజికొండ సముద్రపునీళ్ళలో చాలభాగము పీల్చును. అపుడు సంద్రములోపలికి పోవును. అప్పుడపుడు దేవతలువచ్చి ఆకొండపై నృత్యముచేయుదురు. వారి త్రొక్కుళ్ళకంతకుపూర్వము పీల్చిన నీరంతయు బయటకువచ్చి సముద్రము పొంగును. బాబూ! సముద్రములో పోటువచ్చుటకు కారణమిది. ఇప్పుడుచూడుడు నేను చెప్పినదెంత చక్కగా తర్కబద్ధముగా నున్నదో'' చంద్రుడు సముద్రపుపోటును కల్గించుననగా నవ్విన ఆ పెద్దమనుష్యు లిద్దఱు ''స్పాంజికొండ - దేవతలనృత్యములు'' అను విషయమును చక్కగా నమ్మినారు. దేవతలపై వారికి విశ్వాసముగలదు. స్పాంజి వారు చూచినదే. వారిదృష్టిలో 'స్పాంజి, దేవతలు' - కంటె ఈసముద్రపు పోటుపాటులకు వేఱె కారణముండవలసిన పనిలేదు.

సుఖమన్నది సత్యమనుటకు ఒకకారణముకాదు. ఇక సత్యము సుఖకరముగా నుండవలసిన అవసరమునులేదు. సత్యము నెఱుగగోరినవాడు సుఖభోగముల నంటిపెట్టుకొన్న లాభములేదు. అన్నింటిని వదలుట చాలకష్టము. కాని జ్ఞాని సుఖమునువదలియే తీరవలెను. అతడు పరిశుద్ధుడు కావలెను. వాంఛలన్నింటిని చంపవలెను. శరీరమందాత్మ భ్రాంతిని చేయరాదు. అప్పుడుమాత్రమే అతని హృదయమందు ఉదాత్తమైన సత్యము ప్రకాశించును. త్యాగముచాల అవసరము. మానవునిలోని ఆసురశక్తి అణగవలెను. దానిని దునుమాడుటకు వలసిన ప్రక్రియ ఈ త్యాగమున గలదు.

కావున అన్ని మతములలోను త్యాగము ప్రశంసింపబడినది. దేవతలకు మనముచేయు పూజానైవేద్యాదికమంతయు నచ్చమైన త్యాగమునకు మార్గదర్శకముమాత్రమే. ఈ అచ్చమైన త్యాగము శరీరమందాత్మబుద్ధి ఇత్యాదులత్యాగము, మిథ్యాత్మత్యాగము.

అప్పుడుమాత్రమే సత్యాత్మజ్ఞానముమనకు కల్గును. జ్ఞాని శరీర రక్షణమునందు జాగరూకుడు కారాదు. తద్రక్షణేచ్ఛయుకూడదు. అతడు ధైర్యవంతుడై ఈప్రపంచమునశించినను లక్ష్యపెట్టకుండ సత్యమును కన్గొనుటకై ప్రయత్నింపవలెను. ఎండమావుల వెంట బడి తిరుగువారు సత్యమునకై పాటుపడలేరు. పిచ్చియూహలు గలవారు అందుకై శ్రమపడలేరు. ఈసత్యాన్వేషణమున జీవిత మంతయు వినియోగించి చేయవలసినది. ఒక్క జీవితముకాదు. నూఱుజీవితములు అందుకై వినియోగముకావలెను. కొలదిమంది మాత్రమే తమహృదయమునందే పరమేశ్వరదర్శనముచేయుటకు, ఇహపరములను త్యాగముచేయుటకు, ఇష్టదైవమును, కర్మఫలిత మును త్యాగముచేయుటకు సాహసింతురు. దృఢమైన ఇచ్ఛ ఇట్టి సాహసకార్యమునకు అవసరము. ఏమాత్రపు చలనమైనను దౌర్బల్యసూచకము. పురుషుడు సర్వదా పరిపూర్ణుడు కానిచో నతడు పరిపూర్ణుడగుటకే వీలులేదు. కావలసినదెల్ల తాను పరి పూర్ణుడనని గ్రహించి ఆభావమును అనుభవములోనికి తెచ్చు కొనుటమాత్రమే. బాహిరశరీరాదులందు అతనికి బంధమున్నచో అతడు మర్త్యుడగును. విశిష్టమైన ఆత్మపదార్థమునకే అమృతత్వము కుదురును. ఆత్మను వికారిగాచేయు పదార్థమేదియులేదు. ఆత్మ పదార్థము వికారియనుకొనుట వట్టిభ్రాంతి. మఱి సాధకుడుతాను ఆత్మపదార్థమనని భావింపవలెను. ''నేను శరీరమును లేక నేను మనస్సును'' అని సాధకుడనుకొనరాదు. తానే ఈవిశ్వమునకు సాక్షిభూతుడనని అతడు గ్రహింపవలెను. అప్పుడు తన కండ్ల ముందు ఈపరివర్తనముచెందుచున్న ఈజగద్దృశ్యసౌందర్యము గాంచి ఆత డానందింపగలడు. ''ఈ విశ్వమునేనే, నేనుబ్రహ్మను.'' అని అతడు భావింపవలెను. సాధకుడు ఆత్మైక్యానుసంధానము చేసినచో నతనికసంభవమన్నదిలేదు. మాయ అతనిఅధీనమగును. శ్రీరామకృష్ణపరమహంస ఇట్లు చెప్పెను. ''పెరుగుచిలికి వెన్న తీసినతర్వాత పాలలోవేయుము, నీటిలోవేయుము అది వానిలో

కలిసిపోదు". కాబట్టి సాధకు డాత్మానుభూతి పొందినచో మఱల సంసారమునందు తగులము చెందడు.

ఆకాశములో విమానములోనుండి చూచినచో క్రింద నున్న వస్తువులలో భేదముకన్పించదు. సాధకుడు పైభూమికలకు పోయిన కొలది అతనికి సన్మార్గులు - దుర్మార్గులు భిన్నముగా కన్పింపరు. కుండను ఆవములోకాలినతర్వాత మఱల దానిని కుమ్మరిసానపై పెట్టి ఏమిచేయగలడు? అట్లే మనస్సు ఈశ్వరపాదములందు లగ్నమైనతర్వాత దానికి అగ్నిపరీక్ష చేసుటవలనపిదప— ఈకాల్చినకుండవంటిదగును. దానికి మఱల లోకస్పర్శయుండదు. సంసారవికారములుండవు. తత్త్వదృష్టియనగా సంస్కృతములో సమ్యగ్దృష్టి యని యర్థము. మఱి మతము తత్త్వశాస్త్రమున కాచరణరూపము. భారతదేశమునందు వట్టి సిద్ధాంతవిషయికము. ఊహావిషయికమునైన తత్త్వశాస్త్రమునకు పెద్ద విలువలేదు. ఇచ్చట ఒక పెద్దఛర్చి, అంతశ్శాఖలు, మొదలైనవి లేవు. ఉన్నవి రెండే పెద్దభాగములు. ద్వైతాద్వైతములు - ద్వైతమతమిది, "మోక్షమునకు ఈశ్వరకృప యొక్కటియే మార్గము. ఒకపర్యాయము సంసారమున పడినతర్వాత ఈ బంధములోనుండి బైటపడుటకు దైవకృపయొక్కటియే సహాయముచేయగలదు. ఈశ్వరునకు ఈ బంధములేదు. ఆయన దయవల్ల మన మీబంధమును త్రెంచుకొనగలము". అద్వైతముచెప్పునదిది. "ఈ ప్రపంచమునకు అధిష్ఠానముగా పరమేశ్వరుడున్నాడు. ఆయన బంధరహితుడు స్వతంత్రుడు. బంధాతీతుడగు ఆపరమాత్మదర్శనమువల్ల మోక్షము కల్గును. మోక్షమనగా బంధరాహిత్యము" అని ద్వైతము కొంతవఱకేచెప్పును. అద్వైతము తుట్టతుదకు కొనిపోవును. ముక్తికి దగ్గఱత్రోవ చిత్తశుద్ధి. మనము సంపాదించినదే మనకుదక్కును. ఏ విశ్వాసముగాని, శాస్త్రముగాని మనకు లాభములేదు. భగవంతుడనుచు నొకడున్న అందఱును ఆయనను చూడవచ్చును.

ఆపరమాత్మ ఇట్లుండునట్లుండునని ఎవరును చెప్పవలసినపనిలేదు. వేడినీళ్ళు వెచ్చగానుండునని చెప్పుటఏల? వలసినవాడు తాకి తెలిసికొనును. పరమాత్మ ప్రతివానిబుద్ధికిని సత్యముగా భాసించి తీరవలెను. పాపమనుమాటకు పాశ్చాత్యుల అర్థము వేఱు. హిందువుల అర్థము వేఱు. పాశ్చాత్యులదృష్టిలో పాపమనగా భగవంతునికి కోపము తెప్పించుపనులు చెడ్డపనులు. ఈ అర్థములో పాపములు కావు. వీనిని చేయుటవల్ల మనము భగవంతునియెడ అపచారము చేయుటలేదు, మఱిమనకు మనమే చేసికొను చున్నాము. అందుచే దాని ఫలితమనుభవించితీరవలెను. నిప్పులో చేయిపెట్టుట పాపముకాదు. కాని పెట్టినవానికి కాలితీరును. ప్రతి కర్మకును ఫలితముండును. కర్తకు దానిఫలితము సంక్రమింపక తప్పదు. క్రైస్తవమతములో కొందఱు భగవంతుడు వేఱు, జీవుడు వేఱు అనిచెప్పుదురు. ఇదిద్వైతము. కొంద "ఈశ్వరుడు-ఆచార్య పురుషుడు-సాధకుడు ఒక్కటే"యని యందురు. ఇది అద్వైతము. మొదటిదాని కంటె రెండవది సమంజసము. ద్వైతము పర మాత్మవైపు ఒకయడుగు. ఈ సాధనలో మనకు భగవంతుని పిల్లలమను అనుభూతికల్గును. అద్వైతముచివరి అడుగు. ఈసాధ నలో మనము పరమాత్మతో నభిన్నులమని, పరమాత్మస్వరూప మని అనుభూతిలోనికి దెచ్చుకొనవచ్చును.

V

శరీరములు శాశ్వతముగా నెందుకుండరాదని అడుగ కూడదు. శరీరము పాంచభౌతికము. మార్పు దానిస్వభావము. అందుచే భంగురస్వభావముకలది. అశాశ్వతము. మనము వికృతి పొందకుండ గల్గినచో మనకు శరీరములేదన్నమాట. దేశకాల నిమిత్తముల కతీతమైన పదార్థ మాత్మపదార్థము. దానికిని దేశ కాలనిమిత్తములచేత విక్రియమాణములగు ఆకాశాది పదార్థముల కును సంబాధములేదు. దేశకాలములు మనయందేయున్నవి.

అందుచేత మనయొక్క నిజస్వభావము దానినతిక్రమించినశాశ్వత సత్పదార్థము. రూపములన్నియు భంగురములు. మతములన్నియు నిందువల్లనే భగవంతుడు రూపరహితుడని చెప్పను. మీనాండ రను గ్రీకు శాస్త్రియనుచక్రవర్తి ఒకడుకలడు. క్రీ.పూ. 150 లో అతడు బౌద్ధమతము పుచ్చుకొనెను. ఒకబౌద్ధ మతగురు వతనికి బౌద్ధమతదీక్షనిచ్చెను. అతనిని బౌద్ధులు మిళిందుడని పిలిచెడి వారు. అతనిగురువు ఒక సన్యాసియువకుడు. ఈమిళిందుడాగురువు నిట్లడిగెను. బుద్ధునివంటి పూర్ణపురుషుడను పొరపాటుపడునా? తప్పులుచేయునా?'' ఆ గురువు జవాబిది. ''పూర్ణపురుషుడు అతని యనుభవమందు లేని చిన్నచిన్న విషయములలో అజ్ఞానిగా నుండవచ్చును. కాని అతడు అనుభవములోనికి తెచ్చుకొనిన విషయములం దాత డెప్పుడును పొరపడడు. అతడు జీవన్ముక్తుడు. అతనికి సృష్టిరహస్యమంతయు తెలియును. సృష్టియొక్క అచ్చ మైన స్వరూపము తెలియును. కాని దేశకాలములందు సృష్టికి స్వభావభూతమైన ఆ పదార్థము ఎట్లు విక్రియమాణమగుచున్నదో అతడెఱుంగలేక పోవచ్చును. అతనికి అన్నికుండల కుపాదాన కారణమైన మట్టి స్వరూపము తెలియును. కాని ఆ మట్టి ఎన్ని విధములైన రూపములక్రింద దృశ్యమానము కావచ్చునో ఆ రూపములన్నియు తెలియకపోవచ్చును. పూర్ణపురుషు డాత్మ పదార్థమును దర్శించును. కాని ఆ ఆత్మపదార్థముపైన కన్పించు బహువిధవిలసనము లతడెఱుంగకపోవచ్చును. ఈ లౌకికజ్ఞానమం తయు మనవలెనే అతడుకూడ నేర్చుకొనవలసిన దే. కాని అతని అనంత బుద్ధిబలమువల్ల మనకంటె చాలనేర్చుకొనగలడు. సమాధి వంతమైన చిత్త మేవిషయముపైకి త్రిప్పిన ఆ విషయమునిట్టే గ్రహింపగలడు. ఈ విషయము చాల ముఖ్యమైనది. మనము జాగ్రత్తగా అర్థముచేసికొనవలెను. లౌకికసందర్భములయందు బుద్ధుడో, క్రీస్తో పొరపాటుపడిన సందర్భములున్నవి. అట్లు పడవచ్చును. ఈ విషయము మనకు గుర్తున్నవా రట్లు

పొరపాటు పడుటను గుఱించి పిచ్చి పిచ్చి యూహలుచేయు నవకాశముండదు. వారి ఉపదేశములను వారిశిష్యులు దుర్వ్యాఖ్యానము చేసిరని మనము నిందింపనక్కఱలేదు. వారి ఉపదేశములందొకటిసత్య మింకొకటి అసత్యమనిచెప్పరాదు. ఒప్పుకొన్నచో అంతయు ఒప్పుకొనుము. లేనిచో నంతయు తిరస్కరింపుము. కలగూరగంపవలెనున్న దానిలో మనము మంచి నేరుట దుర్లభముకదా. ఒకసంగతి ఒకతడవ జరుగుటకు వీలున్నచో నది మఱలకూడ జరుగవచ్చునుగదా. "మనుష్యుడొకప్పుడు పరిపూర్ణత్వ మందుకొనెను" అని ఒప్పుకొన్నచో మనము నట్టిదాని నందుకొనుటకు వీలున్నదన్నమాట. మనమీ జన్మయందే పరిపూర్ణత్వము నందుకొనుటకు వీలులేకున్నచో నెక్కడో స్వర్గములోగాని మఱేలోకములోగాని మనము పరిపూర్ణత్వ మందుకొనుటకు వీలుండదు. క్రీస్తు పరిపూర్ణుడు కానిచో అతనిపేరుమీదుగా వచ్చిన మతము నష్టమగును. అతడు పరిపూర్ణుడైనచో మనముకూడ అట్లగుటకు వీలున్నది. గ్రహించుట అన్న మాటకు మన అర్థమేదియో పూర్ణపురుషుడైనవాని యర్థ మదిగాదు. మనజ్ఞానము సాపేక్షమైనది. పూర్ణపురుషుని విషయములో నిట్లు కాదు. ఆత్మజ్ఞానమునందు ఇట్టి సాపేక్షకత్వమునకు చోటులేదు. తర్కమునకు చోటులేదు. చిత్తమునందు జన్మాంతరాగతములైన వాసనలుండును. వీనిని ఆంగ్లభాషలో "ఇన్ స్టింక్ట్సు" అందురు. అనగా సహజప్రవృత్తి. బుద్ధి ఎప్పుడైన పొరపడవచ్చును. బుద్ధి వివేచనాత్మకమైనది. కాని ఈ సహజప్రవృత్తి బుద్ధివలె అంత పొరపడు స్వభావముకలదికాదు. ఐనను వాసనకన్న వివేక ముత్తమము. ఎందుచేత? అది ప్రజ్ఞానమునకు సాధకము. ప్రజ్ఞానము వివేకమునకన్న ఉత్తమము. వివేకముకన్న ప్రజ్ఞానము ముఖ్యము. ఈ ప్రజ్ఞానము వాసనాజ్ఞానమువలెనే పొరపడని స్వభావము కలది. కాని ఇది పైయంతరువులోనిది.

వాసన క్రింది అంతరువులోనిది. జీవులందు మనఃపరిణామము మూడు విధములుగా నుండును.

1. చిత్తప్రధానమైనది — ఈ దశలో యంత్రవతుగా నుండును. పొరపాటుండదు.
2. బుద్ధి—దీనియందు వివేచనముండును. పొరపాటుపడుట సాధారణము.
3. ప్రజ్ఞానము దివ్యమైనది. ఈదశలో పొరపాటుపడుట యుండదు.

ఈ మూడు దశలు క్రమముగా జంతువులందు, మానవులందు, దేవతలందు కన్పించును. పరిపూర్ణుడైన మానవునకు తెలిసికొనరాని విషయముండదు. అతడు లోకోపకారకముగా జీవించును. అతనికి కోరదగ్గదేమియు నుండదు. ఇదియే అతనికిని మనకును గల భేదము. సత్త్వము అనగా ఉనికి, సర్వవ్యాపకము. అది మనకందఱకు సమానముగా నున్నది. అదియే సత్పదార్థము.

ఒకానొక సంఘటనమునందలి కార్యకారణభావము చెప్పునది సిద్ధాంతము. కాని సిద్ధాంతమన్నది దానియంతటనది ఒక పదార్థముకాదు. ఈ పదమును లౌకికజగత్తులో కొన్ని సంఘటనములమధ్యనున్న కార్యకారణభావములను చెప్పుటకు మనము వాడుదుము. మన మీ సిద్ధాంతము అన్నదానిని పట్టుకొని వ్రేలాడకూడదు. ఇదొక అంధవిశ్వాసము కారాదు. పొరపాటు తప్పకుండా వివేచనాపథమునందు సంభవించితీరును. కాని ఈ పొరపాటులను సరిచేసికొనుటకు మనముచేయు ప్రయత్నమే మనల నీశ్వరకోటిలోనికి చేర్చును. శరీరములోనున్న దుష్పదార్థమును గెంటివేయుటకు శరీరముచేయు ప్రయత్నమే వ్యాధి. అట్లే పుణ్యమన్నది మనలోనున్న అసురసంపత్తును గెంటివేయుటకు దైవీసంపత్తు చేయు ప్రయత్నము. మనము ఈశ్వరకోటిలో చేరుటకు కొన్ని పొరపాట్లుకూడా చేయవలసినదే.

నీ వెవ్వరిపైన జాలిపడకుము. అందఱును నీతో సమానులని భావింపుము. నీలో ప్రధానముగానున్న అసమానదృష్టి కడిగివేయుము. మనమందఱము సమానులమే. కాబట్టి "నేను మంచివాడను, నీవు చెడ్డవాడవు, నిన్ను నేను మార్చుటకు ప్రయత్నముచేయుచున్నా" నని అనుకొనరాదు. సమానత్వమన్నది ముక్తజీవుల లక్షణము. క్రీస్తు పాపాత్ములతో కలిసి జీవించెను. తా నందఱికంటె గొప్పవాడనని భావించలేదు. తా నున్నతపీఠము నలంకరించితినని ఆత డూహింపలేదు. పాపాత్ములుమాత్రమే ఇతరులలో పాపమును చూతురు. మానవునిగాక ఈశ్వరునే చూడుము. మనస్వర్గమును మనమే నిర్మించుకొందుము. నరకములోకూడ స్వర్గమును నిర్మించుకొనవచ్చును. పాపాత్ములు నరకమందే యుందురు. వారిని మనచుట్టు నున్నట్లు చూచినచో మనముకూడ నరకమందున్నట్లే. ఆత్మపదార్థము దేశకాలావచ్ఛిన్నముకాదు. సర్వత్ర నుండునది. సర్వవ్యాపకము. నేను సచ్చిదానందస్వరూపుడను. కేవలుడను. 'సోహం, సోహం' అని అనుభవములోనికి తెచ్చుకొమ్ము. జననమరణములు రెంట సంతోషమునే చెందుము. ఈశ్వరభక్తియందు మునిగిపొమ్ము. శారీరకబంధములను త్రెంచుకొనుము. మనము శరీరములకు దాసులమై మన కాలిసంకెళ్లను ప[illegible] దాస్యమును ప్రేమించి దానిని [illegible] కవల ముద[illegible] పరాయణులమై యున్నాము. శరరభావమును పట్టుకొ[illegible] త్రులా[illegible]కుము. ఈ శరీరము నిరంతరముండవలెనని కాంక్షింపకుము. శరీరమునందు తగులము చెందకుము. మనకు ప్రేమపాత్రులైన వారి శరీరములందుకూడ తగులము చెందకుము. ఈ[illegible] మనకు గురువు. మరణము మఱల జీవితమునకు పునఃప్రారంభమే. శరీరము మన బడిపంతులు. ఐనచో ఆత్మహత్య చేసికొనుట పొరపాటు. అది ఉపాధ్యాయుని చంపుటవంటిది. అసలు బడిపంతులను తప్పించుకొనగలవా? వానిచోటులో నింకొకడు గోచ

రించును. కాబట్టి మన మీ శరీరభావము నతిక్రమించువఱకు మనకీ శరీరము తప్పదు. ఒకటిపోయిన మఱియొకటి వచ్చును. ఐనప్పటికిని మనము శరీమం దాత్మ భ్రాంతి చెందరాదు. పరిపూర్ణత్వమందుట కదొక సాధనమాత్రమే యని భావించవలెను. హనుమంతుడు శ్రీరామభక్తుడు. ఆయ నిట్లనినాడు :

"నేను శరీరమనైనప్పుడు నాథా! నీనుండి శాశ్వతముగా నెడబాటుచెందుదును. నేను జీవుడనైనచో నీవనిన పెద్దయగ్నిలోనుండి చెదరిన ఒకకణమను. నేనాత్మనైనచో నేనే నీవు."

అందువల్ల జ్ఞాని ఆత్మానుభూతినందుటకై సాధనచేయును.

## VI

భావన చాల ప్రధానము. మన మేమి భావింతుమో అది యగుదుము. ఒకప్పుడొక పవిత్రసన్న్యాసి యుండెను. ఒకచెట్టుక్రింద కూర్చుండి అతడు వేదాంతము బోధించుచుండెను. పాలు, పండ్లు ఆహారముగా గొనును. నిరంతరము ప్రాణాయామము చేయుచు తాను పవిత్రజీవినని భావించెడివాడు. ఆ యూరియందే ఒక కులట కలదు. ప్రతిదిన మీ సన్న్యాసి ఆమెకడకేగి పాపము [illegible] ఆమెగ[illegible]కమున కేగుననుచుండెడివాడు. పాప[illegible] ఏమిచయున మీ[illegible]. [illegible]జీవికకు ఆధారము. ఆ విధాన [illegible]ర్చుకొనలేదు. కాని ఈ సన్న్యాసి చెప్పు నరకబాధలు విని చాల భయపడెడిది. ఆమె కన్నులవెంట నీరు కార్చుచు, "ఓ పరమేశ్వరా! నే నీ మార్గమునుండి తప్పుకొన[illegible]ను. క్షమించు"మని దినదినము ప్రార్థించెడిది. కాలాంతరమున సన్న్యాసి, జారిణి మరణించిరి. ఈమెను దేవతలు స్వర్గమునకు కొనిపోయిరి. ఆ సన్న్యాసిని యమదూతలు కొనిపోయిరి. అత డా యమదూతల నడిగెను : "ఇదేమి పాపమయ్యా! నేనంత పవిత్రజీవిని. ప్రజలకు ధర్మము బోధించితిని. నన్ను

నరకమునకు తీసికొనివచ్చినారు. ఆ కులటను స్వర్గమునకు గొనిపోయినారు.'' యమదూత లిట్లనిరి: ''అదికాదయ్యా! పాప మామె తప్పక వేశ్యావృత్తి నవలంబించినది. కాని ఆమె మనస్సులో నిరంతరము ఈశ్వరధ్యానము చేసెడిది. అందుచే ఆమెకు వైకుంఠము వచ్చినది. కాని నీవు మంచిపనులు చేసినను నీ మనస్సెప్పు డితరుల పాపములందే నిమగ్నమై యుండెడిది. నీకు కన్పించినదంత పాపమే! భావనయు నదే! అందుకే పాప భూమియగు నరకమునకు నీవు రావలసివచ్చినది.'' ఈ కథలోని సారాంశము స్పష్టమే. బాహ్యావేషమువల్ల ప్రయోజనము లేదు. పరిశుద్ధహృదయము కావలెను. దానియందే ఈశ్వరుడు ప్రతిబింబించును. పంకిలచిత్తమునం దీశ్వర ప్రతిబింబము పడదు. మనము మానవజాతిని సంరక్షించువారమని, ఉన్నతపీఠముల నలంకరించిన యోగులమని తలపరాదు. ఈ పాపాత్ముల నందఱ నుద్ధరించుట కవతరించిన అవతారపురుషులమని అనుకొనరాదు. ''స్వయంతీర్ణః పరాంస్తారయంతి'' మనము పరిశుద్ధులమగుటకు యత్నించవలెను. అందులోనే పరోపకారము కలిసివచ్చును.

భౌతికశాస్త్రమునకు (పదార్థవిజ్ఞానశాస్త్రమనుడు) ఇరు ప్రక్కల వేదాంతశాస్త్రమున్నది. దానిలో తర్కమున్నది. కాని అది తర్కహీనస్థితిలో ప్రారంభమై తర్కరహితస్థితిలో నంతమగును. భౌతికజ్ఞానము నాధారముగా చేసికొని మనము తర్కము కొనసాగించినచో ఈ భౌతికజ్ఞానమును మీఱిన స్థితిని మనము పొందితీరవలెను. తర్కమన్నది మనము పొందిన ఇంద్రియజ్ఞానమును వివేచించుటద్వారా ఏర్పడి సంపాదితమగును. సంస్మరణమున సంచితమైన పరిశీలనశక్తియే హేతుజ్ఞానము. మనము మన ఇంద్రియజ్ఞానమును మీఱి ఊహింపలేము, తర్కింపలేము. తర్కము నతిక్రమించిన పదార్థమేదియు ఇంద్రియ ప్రత్యక్షవిషయము కాదు. మనకు తర్కముయొక్క పరిమిత స్వభావము తెలి

యును. కాని దాని నతిక్రమించిన ఒక స్థితిని రేఖామాత్రముగ మనము తెలిసికొనుటకు తగిన స్థితికి మనలనది కొని వచ్చును. అప్పుడు మనుష్యునకు తర్కముకంటె వేఱయిన జ్ఞానసాధనము ఒకటియున్నదా యను ప్రశ్న పుట్టును. మనుష్యునిలో తర్కము నతిక్రమించిన స్థితినందుట కొకానొకశక్తియుండుట సంభవము. సర్వకాలములందు కొందఱు యోగులు తమలో నిట్టిశక్తియున్నదని నొక్కి చెప్పినారు. కాని వస్తుస్వభావమునుబట్టి ఆధ్యాత్మికభావములను, జ్ఞానమును తార్కికపరిభాషలో చెప్పుట దుర్ఘటము. ఈ సిద్ధులందఱు వారి ఆధ్యాత్మికానుభూతులను భాషలో తాము వ్యక్తముచేయజాలమని చెప్పియేయున్నారు. భాషలో వారి యనుభవముల వ్యక్తమొనర్పగల పదజాలములేదు. కాబట్టి ఈ అనుభూతులన్నియు సత్యములే; ప్రయత్నించిన ఎల్లరును పొందగలరని వారనిరి. అందుచే సాధనవల్లనే ఆయనుభూతులు తెలిసికొనదగినవి. వర్ణించుటకు వీలులేనివి. మనుష్యునిలోనున్న అతీంద్రియశక్తులవల్ల - ప్రకృతిలోనిమిడియున్న అతీంద్రియశక్తులను తెలిసికొనుపద్ధతులను గుఱించి చెప్పు శాస్త్రము మతశాస్త్రము లేక వేదాంతశాస్త్రము. మనకు మనుజునిగుఱించి చాల కొంచెమే తెలియును. ఈశ్వరునిగుఱించియు కొంచెమే తెలియును. మనుజునిగుఱించి ఎక్కువ తెలిసినకొలది విశ్వమునుగుఱించియు తెలియును. పిండాండము బ్రహ్మాండమునకు సూక్ష్మదశ. అందుచే జ్ఞానమంతయు పిండాండమందున్నది. ఈ విశ్వమునందు కోట్యంశముమాత్రమే భౌతికజ్ఞానముగా ప్రత్యక్షమగుచున్నది. అంతవఱకే మనము తర్కముచే సాధించినాము. దీనిని మీఱిన మఱియొక సిద్ధాంతము కనిపెట్టుటకు మనము మన వివేచన ముపయోగింపలేము. వివేకించుట యనగా మనము చూచిన ఒక విషయము విభజించి మనమనస్సులో గుర్తుపెట్టుకొనుట. ఒక క్రొత్తసందర్భమును మనము గమనించినపుడింతకుపూర్వము మన మనస్సులోనున్న విభాగములో దీనిని చేర్చుటకు యత్నింతుము. ఇదే వివే

చనము. ఈ శ్రోత్రసందర్భము తత్పూర్వసందర్భములలో దేని తోనో ఒక దానితో చేర్చగలిగినపుడు మనకు తృప్తికల్గును. కాని మన మీవిధమైన వివేచనముతో భౌతికదశను దాటి పైకి పోలేము. మనుష్యుడింద్రియపరిధులనుదాటి అతీంద్రియజ్ఞానమును సంపాదింపగలడన్నది వేల సంవత్సరముల అనుభవముమీద నిర్ధారణచేయబడిన విషయము. 5000 సంవత్సరములకు పూర్వము ఈశ్వరానుభూతి ఇంద్రియసాధ్యముకాదని ఉపనిషత్తులు చెప్పినవి. అధునాతనమైన నాస్తికవాదము ఇంతవఱకొప్పుకొనును.

వేదములు ఈ ఇంద్రియప్రత్యక్షజ్ఞానమును దాటి మనుష్యుడతీంద్రియద్రష్ట కాగలడని చాటిచెప్పినవి. జీవితమొక సముద్రము వంటిది. దానిమీద మంచు పేరుకొనియున్నది. ఈపై జీవితమే మనకు దెలియును. అంతర్గతమైన ఆ దివ్యజీవితమొక మహాసముద్రము, మనుష్యుడీపైన పేరుకొన్న మంచులో ఎట్లనో కొట్టుకొని లోనికిపోయి ఆ దివ్యజీవనమును చూడగలడు. ఇంద్రియ జ్ఞానమును అతిక్రమించుటవల్లనే అతడు పరమాత్మదర్శనముచేయ గలడు. తన స్వరూపజ్ఞానము నందగలడు.

జ్ఞానమనగా ఇంద్రియజ్ఞానముకాదు. మనము బ్రహ్మమును తెలిసికొనలేము. కాని బ్రహ్మమగుదుము. అనగా బ్రహ్మము నందు మన మొక భాగముకాము. అంతయును సాగగొట్టుటకు వీలులేని దానిని తెగగొట్టుటకును వీలులేదు. ఈ కన్పించుభేదమంతయు బాహ్యవిలసనముమాత్రమే, దేశకాల పరిధులయందు దృశ్యమానమగుచున్న ప్రతిబింబముమాత్రమే. కొన్నివేలమంచు బిందువులలో సూర్యుడు ప్రతిబింబించి బహుధా భాసించినను ఉన్న దొక్కడే సూర్యుడనీ, ఆబహుత్వ మాభాసమనీ మనకు తెలియునుగదా. అందుచేత జ్ఞానదృష్టిలో ఈ భేదదర్శనముండదు ఏకత్వ దర్శనమేయుండును. జ్ఞానదశయందు జ్ఞాతలేడు, జ్ఞేయము లేదు, జ్ఞానములేదు. అనగా ఈ త్రిపుటియుండదు. నేను, నీవు

వాడు అనుభేదములేదు. అది కేవలత్వము, ఏకత్వము. సర్వదా మనము ఈబ్రహ్మపదార్థమే. ఒకప్పుడు ముక్తుడన్నచో నెప్పుడును ముక్తుడన్నమాటే. మనుష్యుని కార్యకారణభావము బంధించి యుంచలేదు. సుఖ దుఃఖములు మనుష్యునకు సహజములుకావు. సూర్యుని మబ్బు లావరించినట్లివి తాత్కాలికముగా వాని నావరించును. ఆ మబ్బులు తొలగిపోయిన సూర్యుడుకన్పించును. ఈ మబ్బులవల్ల అతడందిన మార్పులేదు. అత డెప్పు డట్లే అవి కారుడై వెల్గుచున్నాడు. మనుష్యుడనంతే. అతడు జన్మించలేదు. మరణించడు. అతడు దేశకాలములందు బంధితుడై లేడు. ఈదేశ కాలములన్నవి వట్టి మనోవిలసనములు. అవి సత్యములని భ్రాంతి పడి వానిమఱుగుననున్న ఆత్మపదార్థము మనము దర్శింపలే కున్నాము. కాలమన్నది మన ఆలోచనాపద్ధతిలోని ఒక అంశము. కాని మనదిమాత్రము నిరంతరమైన శాశ్వతమైన వర్తమానము. మంచిచెడుగులన్నవి మనకు సంబంధించినంతమాత్రము భాసించునవి కాని యథార్థములు కావు. ఒకదానిని వదలి ఇంకొకటి లేదు. ఒక దానినివదలి వేఱొకటియుండలేదు. అట్టివి అర్థవంతములుకావు. ఈ ద్వంద్వములను మనము దర్శించునంతవఱ కీశ్వరుడు మనకంటె వేఱనిభావించు చున్నంతవఱకు మన మీ పుణ్యపాపములనుభావిం పకతప్పదు. కేవలము అధిష్ఠానభూతమైన పరమాత్మభావమును మనము పట్టుకొనగల్గినంతనే, ఈశ్వరునితో నేకత్వము దర్శింప గల్గినంతనే ఇంద్రియభ్రాంతి తొలగదు. ఈ నిరంతర కామజ్వరమును మనము వదలించుకొన్నప్పు డనంతమైన, దుఃఖకారకమైన ఈ ఆశాపాశమును తెగగోసికొన్నపుడు మన మీ లాభాలాభములను, మేలుకీడులను అతిక్రమించి వాని బారి నుండి తప్పించుకొనగల్గుదుము. నేయిపోసినకొలది అగ్నిమండును. కాని తగ్గదు. అట్లే అనుభవమువల్ల కామము శాంతించదు. చక్రము గిరగిర తిరుగుచున్నది. కేంద్రముపై నీవు కూర్చున్నచో నీకు త్రిప్పటయుండదు. కేంద్రమునకు దూరమైనకొలది విసు

రెక్కువ. శాంతి తక్కువ. అందుచే కేంద్రమునకు సమీపమునకు రమ్ము. కామమును దిగద్రొక్కుము. మూలచ్ఛేదము చేయుము. మిథ్యాత్మలను నిరాకరించుము. అప్పుడు మాత్రమే మనదృష్టి నిర్మలమై పరమాత్మదర్శన మొనర్పగలము. కేవలము ఇహపరములను త్యాగముచేయుట ద్వారా మనము ఆత్మావలంబన మంద గల్గుదుము. మనము దేనినైనను కాంక్షించినప్పుడు కామమింకను మనపై నధికారముచేయుచున్నదన్నమాట. ఒక్కక్షణము నిరాశుడవై నిల్వుము. కప్పినమంచు వచ్చును. వ్యాపకమైన, శాశ్వతమైన సత్పదార్థమైనపుడు నీవు కాంక్షింపదగిన దేమున్నది? సర్వము త్యాగముచేసి కేవలుడై నిలుచుటయే జ్ఞానయోగ రహస్యము. లేదు లేదన్నచో నీవు లేకనే పోదువు. ఉన్నదున్నదన్నచో ఆయనికి నీవేయగుదువు. లోనికి చూపుమఱల్చి ఆత్మోపాసన చేయుము. ఆత్మనువదలి ఏమియులేదు. మనల నావరించినది వట్టి మాయ.

## VII

ఆత్మపదార్థము సర్వవ్యాపకము. దేనిచేతను వ్యాప్యము కాదు. మన సహజస్వరూప మది యని తెలిసినంతనే మనము ముక్తిపొందెదము. దేహతాదాత్మ్యము చెందినచో మనకు ముక్తిలేదు. దుర్లభముకూడ. మర్త్యత - ముక్తి యన్నవి విరుద్ధభావములు. మర్త్యత యనగా వికృతి. అవికారమైన పదార్థమే ముక్తము. ఆత్మ యొక్కటియే ముక్తము. అందుచే మన స్వభావము - స్వరూపము ఆత్మయే. సిద్ధాంతములు శాస్త్రములు వేఱేపెట్టుడు. మన మీముక్తావస్థ నంతర్గతముగా అనుభవించుచునే యున్నాము. మనముచేయు ప్రతిక్రియ ఈ విషయమును నిర్ధరించును. బుద్ధి స్వతంత్రముగాదు. ఊరక స్వతంత్రమన్నట్లు భాసించును. ఈ ఆభాస నిజముగా స్వతంత్రమైన ఆత్మయొక్క ప్రతిఫలనమువల్ల కల్గినది. ఈ ప్రపంచమంతయు కార్యకారణ

భావబద్ధమైనపుడు దీనిలోనుండి తప్పించుకొనవలెను. ఎందునిలిచి, ఈ ప్రపంచము నుద్ధరింపవలెను? ప్రవాహములో కొట్టుకొనిపోవు వానిని రక్షించుటకు, ఆ ప్రవాహమున కవ్వల నిలుచుటకు రక్షకునకు కొంత నేల యుండవలయునుగదా. లేనిచో నత డెక్కడ నిల్చుండి వాని నొడ్డుకు లాగును? నేనొక పురుగునని చేతులెత్తి అఱచు మహాపిష్టుడుకూడ తాను సిద్ధుడగుటకు ప్రయత్నించుచున్నాడని యెఱుంగును. అతడు పురుగులోకూడ సిద్ధుని దర్శించుచున్నాడు.

మనుష్యజీవితములకు రెండు లక్ష్యము లున్నవి. ఒకటి విజ్ఞానము, రెండవది ఆనందము. స్వాతంత్ర్యము లేనిచో ఈ రెండును అసంభవములు. ఈ రెండును జీవితమునకంతకు నికషోపలములు. మనము శాశ్వతమైన ఏకత్వానుభూతి నందవలెను. సమస్త సృష్టియందు ఏకత విరాజిల్లుచున్నదని మనము గ్రహింపవలెను. అట్లు గ్రహింపనిచో మనము పాపాత్ములందఱికొఱకు దుఃఖింపజాలము. వారికొఱకు దుఃఖింపవలయునన్న ఆ పాపములు చేయునది మనమే యని మనకు తెలిసియుండవలెను. అందుచేత యథార్థమునకు వారును మనము నొక్కటే. స్వార్థత్యాగమనునది సర్వకాలములందును చెల్లు నియమము. స్వార్థపరత్వము కాదు. సర్వమును ఆత్మస్వరూపమై యుండగా స్వార్థపరత్వమునకు చోటెక్కడిది. ఎవ్వరికిని ప్రత్యేకముగా హక్కులనునవి లేవు. ఉన్నదెల్ల నొక్క ప్రేమ. క్రీస్తుచప్పిన సద్బోధన లెవ్వరు నాచరణలో పెట్టలేదు. ఆ బోధనల నాచరణలో పెట్టినచో లోకముద్ధరింపబడెడిది. ఆయన బోధనలకు వ్యతిరేకపద్ధతులాచరణలోనికివచ్చి లోకమును నాశనముచేసినవి. స్వార్థత్యాగము మాత్రమే ఈ సమస్యను పరిష్కరింపగలదు. స్వార్థపరత్వము కాదు. హక్కు అన్నది చాల సంకుచితభావము. నిజముగా నాది, నీది యనునది లేదు. ఏలయన, "నేనే నీవు, నీవే నేను."

కాబట్టి మనకు విధి యున్నది కాని హక్కులు లేవు. ఈ విశ్వమంతయు నేనే యని మన మనుకొనవలెను గాని నేను 'జానును, మేరీని' అని అనుకొనరాదు. ఇవన్నియు సంకుచితభావములు. ఇవన్నియు వట్టిభ్రాంతులు. మనలను బంధించియుంచును. ఎందు కనగా నేను 'జానును', 'నేనే వేఱు' అని నే ననుకొనగానే నాకు కొన్నివస్తువులపైన మమకార మేర్పడి నేను, నాది అని భావించుచు నిరంతరము క్రొత్త క్రొత్త భేదములను సృష్టించుటకు మొదలుపెట్టుదుము. ఈ క్రొత్త క్రొత్త భేదములు పెరుగుచున్న కొలది మన బంధములును పెనవేసికొనును. మన సహజమైన ఏకత్వభావమునుండి – ఆత్మభావమునుండి దూరదూరముగా తొలగి పోవుదుము. ఉన్న దెల్ల నొక్కటే ఆత్మపదార్థము. మనందఱ నిజస్వరూప మదియే. ఏకత్వమే నిజమైన ప్రేమ. అభయము, భిన్నత్వము ద్వేషమును, భయమును పెంచును. ఏకత్వ మొక్కటే నిజమైన సిద్ధాంతము. ఈ భూమిమీద మనము చిన్న చిన్న ప్రదేశముల నాక్రమించి ఇతరు లందులోనికి రాకుండ దడికట్టుకొందుము. ఆకాశములో నట్లు చేయుదుమా? సరిగా కొన్నిమతము లిట్లే చేయును. ఈ మార్గమే ముక్తికి త్రోవ. తక్కినవన్నియు దుష్టములని చెప్పు మతము లిట్టివి. ఈ చిన్న చిన్న ఆవరణలు తొలగించి ఈ హద్దులన్నిటిని తుడిచివేయవలెను. అన్నిమతములు పరమాత్మను చేర్చుటకు మార్గములు. ఈ మిథ్యాత్మ, ఈ స్వార్థమును త్యాగముచేయవలెను. క్రైస్తవుల పవిత్రస్నానమను నదీ సత్యమునకు చిహ్నప్రాయము. ఈ పవిత్రస్నానమెందుకు? క్రొత్తజీవితములో ప్రవేశము కల్గించుటకు. దీనితో ఆ ప్రాతవాడు చచ్చి క్రొత్తవాడు పుట్టును. అనగా మిథ్యాత్మ వినష్టమై, సత్యాత్మ ప్రకాశితమై సర్వాత్మభావ మనుభూతము కావలెను.

వేదములందు రెండుభాగములున్నవి. 1. కర్మకాండ, 2. జ్ఞానకాండ. వేదములందు మతభావముయొక్క క్రమవికాస

మంతయు కన్పించును. ఒక ఉత్తమసత్యముతో బాటు దానిని గ్రహించుటకు సహాయముచేసిన మార్గములుకూడ వేదములందు సంగృహీతములైనవి. ఇట్లెందుకు సంగృహీతములైనవనగా "ఈ ప్రపంచము ఈ సృష్టి నిత్యమైనది" అని ఋషులెఱుంగుదురు. కావున ఎప్పుడును ఈ మార్గమునందు ప్రయాణించువా రుండనే యుందురు. పరమార్థము పొందుట కందఱు నర్హులే కాని అందఱును దానిని గ్రహింపలేరు. తక్కినమతములన్నింటిలో ఉత్తమసత్యములుమాత్రమే సంగృహీతములైనవి. ఫలితముగా ఆ సత్యము నందుకొనుటకు సహాయముచేసిన ఇతరభావములు నిగృహీతములై, వినష్టములైనవి. ఈ ఉత్తమసత్యములు కొలది మందికి మాత్రమే గ్రాహ్యములై ఇతరులకర్థరహితములైపోయినవి. మనకు పురాతనసంప్రదాయములపై తిరుగుబాటులు జరుగుట లోని కీలక మీవిషయమునగలదు. వానినొప్పుకొనుటకుబదులు ఆధునాతనభావము లా సత్యములను నిర్ధరింపవలసినదని తగాదా పెట్టును. కారణములు చూపింపవలసినదని, చూపింపనిదే ఒప్పుకొనమని ఆధునికులు గోలచేయుదురు. క్రైస్తవమతములో చాలా భాగము తత్పూర్వమున్న మతములోని నమ్మకములకు, ఆచారములకు క్రొత్తఅర్థములుచెప్పి క్రొత్తపేర్లిచ్చుచుండును. ఆ పురాతనవిశ్వాసములు, ఆచారములు, అవి పెరిగిన కారణములు, వానిలోని మార్పులు మనము చక్కగా వివరించిపెట్టినచో చాల విషయములు స్పష్టములై భాసించును. వేదము లీ పురాతన భావములనన్నిటిని చక్కగా సంరక్షించినవి. అందువల్లనే వీనిని వివరించుటకు పెద్దవ్యాఖ్యానములు బయల్దేరవలసిన అవసరము కలిగినది. దీనివల్ల కొన్ని దుష్ఫలితములును కలిగినవనుకొనుడు. ఆయా ఆచారములకు, భావములకు ప్రయోజనములు లేకపోయినను వానిని పట్టుకొని వ్రేలాడుట, అంధానుసరణముచేయుట మొదలైనవి కొన్ని కలిగినవి. అనేక కర్మలలో ఇప్పుడు వాడుకలో లేని భాషలోని మాటలు కొన్ని మంత్రములని కొందఱు చెప్పు

దురు. వానికి నిజముగా నర్థమేమియు మనము చెప్పలేము. క్రీస్తుశకమునకు చాలపూర్వమే పరిణామవాదము వేదములందు మనకు కన్పించును. కాని దానిని డార్విను చెప్పునంతవఱ కది హిందువుల పిచ్చినమ్మకముక్రింద జమకట్టబడెడిది. కర్మకాండ యందు దైవోపాసనలయొక్క బాహ్యపద్ధతులు సంగృహీతము లైనవి. నిస్స్వార్థదృష్టితో వీనినాచరించినప్పుడు, పట్టితంత్రముగా వీనిని దిగజారనియకుండ శ్రద్ధతో ఆచరించినపుడు వీనివల్ల ఫలితము కలుగును. వీనివల్ల చిత్తశుద్ధి కల్గును. కర్మయోగి తనకంటె ముం దితరుల నుద్ధరించుటకు వాంఛించును. ఇతరుల నుద్ధరించుటలోనే అతడు కృతార్థుడగును. ఒకమహాభక్తు డిట్లని నాడు: "కృష్ణభక్తులను సేవించుటయే అన్నింటికంటె గొప్ప ఉపాసన. ఈ ప్రపంచములోని జీవుల పాపములన్నియు నే నొక్క డనే భరించి నరకమునకు పోవుదును. తక్కినవారందఱును ముక్తు లైనచో నాకు చాలు" ఇది గొప్ప ఉపాసన. అచ్ఛమైనది. స్వార్థత్యాగమునకు స్రోవతీయును. ఒకఋషినిగుఱించి ఒకకథ కలదు. అతడు తనకుక్క స్వర్గమునకుపోవుటకు తనపుణ్యమంతయు దానికిచ్చినాడట. ఎందుచేత. పాప మది చాలకాలము విశ్వాస ముతో నతనిని సేవించినది. అందు కతడు తనపుణ్యము దానికిచ్చి తాను నరకమునకేగుటకైనను ఇచ్ఛగించెను.

జ్ఞానకాండ జ్ఞానమువల్లనే మోక్షము కల్గునని చప్పును. మోక్షము పొందుటకు వివేక మవసరము. జ్ఞానము ప్రధానమైన సిద్ధి. జ్ఞాత తన్ను తానే తెలిసికొనుట. ఆత్మయొక్క జ్ఞాతయై కూడ తన్ను తా నెఱుగుటకు జ్ఞేయభావమునుకూడ పొందినది. అద్దమెంత స్వచ్ఛముగానున్న ప్రతిబింబమంత స్వచ్ఛముగా నుండును. అట్లే సాధకుని చిత్తమెంత స్వచ్ఛముగానున్న అంత స్వచ్ఛముగా పరమాత్మ దానియందు ప్రతిబింబించును. తా నీశ్వ రునికంటె వేఱని, తాను శరీరమునని మనుష్యుడు భావించును.

ఈ భ్రాంతి మాయవల్ల సంభవించును. మాయ అనగా ఉన్నది అన్యథా భాసించుటకాని లేనిది భాసించుటకాదు. (లేనిదిభాసించుట తుచ్ఛము. ఉదాహరణము: శశవిషాణము; ఉన్నవస్తువు మఱొక రీతిగా భాసించుట మిథ్య: రజ్జువునందు సర్పము) ఈ దేహాత్మభ్రాంతి అసమభావమునకు త్రోవతీయును. హెచ్చుతగ్గులు కన్పించును. దీనివల్ల స్పర్ధ, అసూయ పెరుగును. ఈ అసమానత్వమున్నంత వఱకు మనకు శాంతిలేదు. అజ్ఞానము, అసమానత్వము దుఃఖము నకు మూలములని జ్ఞానయోగము చెప్పును.

మనుజుడు లోకములో బహు దుఃఖములనుభవించి, మోక్షము పొందవలయునని వాంఛించును. ఈ లౌకికబంధము లను తెగగోసికొనవలెనని తపనచెంది జ్ఞానమునకై ప్రయత్నిం చును. తనయొక్క అచ్ఛమైన స్వరూపమేదియో తెలిసికొని ముక్తుడగును. తర్వాత అతడు లోకము నొకపెద్ద యంత్రముగా చూచును. కాని ఆ యంత్రముయొక్క చక్రములో తనవ్రే ళ్లిఱుకుకొనకుండ చూచుకొనును. అనగా లోకమునందు తగుల మందడు. ముక్తుడైనవానికి విధి నిషేధములు లేవు. ముక్తుని ఏశక్తియు బంధించలేదు. అతడు లోకమునకు మేలుచేయును. అది అతనిస్వభావమును వ్యక్తీకరించును. అంతేకాని ఏ శాసనమువల్లను అది కాదు. ఇంద్రియబంధములను త్రెంచుకొనలేనివారి కిది వర్తించదు. మిథ్యాత్మభావమును దూరీకరించి, సత్యాత్మస్వరూప మందు పరినిష్ఠితుడైయున్న ముక్తపురుషునకుమాత్రమే ఇది వర్తించును. అతడు ఆత్మభావమునందు పరినిష్ఠితుడైయున్నాడు. కాబట్టి అత డే నియమమునకు కట్టుబడియుండడు. అతడు స్వతం త్రుడు. పరిపూర్ణుడు. అతడంధవిశ్వాసములనన్నిటిని దూరముగ నెట్టివేసెను. అతడు లౌకికయంత్రమునుండి బైటపడెను. ఈ ప్రకృతియున్నదే అది మన ఆత్మలను ప్రతిబింబించు మసద్దము. మానవులు చేయుపనికి మితియున్నదికాని వాంఛకు మితిలేదు.

అందుచేత మనము ఇతరులుచేయు కష్టము నేదోవిధముగా గుత్త గొని దాని ఫలితములను మన మనుభవించుటకును, పనిచేయకుండ తప్పించుకొనుటకును యత్నింతుము. పనిచేయుటకు యంత్రములను కనిపెట్టుటవల్ల ప్రపంచస్థితి బాగుపడదు. మనము యంత్రములను కనిపెట్టినది మనుష్యులకష్టముతో తృప్తితీరక. ఈయంత్రములను కనిపెట్టినతర్వాత మనకు ఉత్పత్తి ఇంకను ఎక్కువకావలయును. దాని ఉత్పత్తితో మనకు తృప్తిలేదు. తృప్తిచెందని కోరికలతో మరణించి మఱలమఱల మనుజుడు ఆకోరికలను తీర్చికొనుటకు జన్మలెత్తును. హిందువులు మనమీమనుష్యజన్మ ఎత్తుటకు పూర్వము ఎనుబదిలక్షల జన్మముల నెత్తితిమని చెప్పుదురు. ఈకామమును, ఈకోరికను చంపివేయుము. దీనినుండి బైటపడు మని జ్ఞానయోగము చెప్పును. ఇదొక్కటియే త్రోవ. కార్య కారణభావమును దూరీకరింపుము. ఆత్మను తెలిసికొనుము. మోక్షమొక్కటే చక్కని సత్ప్రవర్తనను పెంచగలదు. ఈకార్య కారణభావ మనంతమైనది. దీనిపట్టులో నున్నంతవఱకు నిర్వా ణము లభించదు. దీనిపట్టులో కట్టుబడియున్నవి మిథ్యాత్మభూతము లైన దేహాదులు. వీనిని నిరసించుము. ఇట్లొనరించుటవలన మోక్షములభించును. ఆమోక్షము ఈ కార్యకారణభావము యొక్క పరిధినతిక్రమించినది.

మన స్వభావము స్వచ్ఛమైనది. స్వతంత్రమైనది, స్వచ్ఛ మైన వస్తువు తప్పుచేయదు. మనము కన్నులతో, మనస్సుతో చూచుచున్నది పరమేశ్వరునే. మనమాపరమేశ్వరునే బహుధా 'యిది' 'అది' అని చెప్పుచున్నాము. యథార్థమున కున్నది పరమేశ్వరుడొక్కడే. ఈ పైకన్పించు భేదములన్నియు నాతని యందు మనము కల్పించినవి. ఈ దేహాత్మభ్రాంతి దృష్టిలో మన మనుకొనుచున్నామే, ఈ మనము వినష్టమై స్వచ్ఛ స్వభావమైన ఆత్మభావమునందును. బుద్ధుడజ్ఞానమువల్ల, అస

మానత్వమువల్ల దుఃఖము కల్గునని చెప్పెను. ఇది చాల చక్కని సంగతికాబట్టి దీనిని వేదాంతులు తీసికొనిరి. ఈ ఉత్తమపురుషుడైన బుద్ధునియొక్క అంతర్దృష్టిని ఈ సిద్ధాంతము వ్యక్తము చేయును. మనము ధైర్యవంతులము, శ్రద్ధావంతులము కావలెను. మనము శ్రద్ధతో నేమార్గమవలంబించినను అది మనలను మోక్షగాములను చేయును. ఒక్కతడవ గొలుసులో నొక్క కొలికినిపట్టుకొని లాగుట మొదలుపెట్టినచో, గొలుసంతయు రాకతప్పదు. చెట్టుపాదులో నీరు పోసిన చెట్టంతకు పోసినట్లే. చెట్టు కొమ్మకొమ్మను రెమ్మ రెమ్మను ఆకు ఆకును తడపుట వ్యర్థప్రయాసము. అందుచే ఈశ్వరునికై వెదకుము. అతడు దొరకెనా అంతయు దొరకినట్లే, ఛర్చి - సిద్ధాంతములు ఉపాసనాపద్ధతులు - ఈయన్నియు ఆధ్యాత్మికభావమును, మతమను చిన్నమొక్కను వృద్ధిచేయుటకు వేసినకంచెలు. ఆచిన్నమొక్క వృద్ధికొందుటకు తుదకు వీనిని తీసివేయవలెను. అందువల్ల బహుమతములు, బహుమతగ్రంథములు, వేదములు, బైబిలు మొదలైనవి ఈచిన్నమొక్కకు వేసిన చిన్నతొట్లు. ఈతొట్లలోనుండి బైటకువచ్చి పాతుకొని ఆమొక్క లోకమంతయు విస్తరింపవలెను.

నేను సూర్యునిలో, నక్షత్రములలో నున్నాను. సర్వత్ర నేనే యున్నానని మనము భావించుట నేర్చుకొనవలెను. ఆత్మ దేశకాలముల నతిక్రమించినది. చూచుప్రతికన్ను నాదే. ఈశ్వరనామమును సంకీర్తనముచేయు ప్రతినోరు నాదే. పాపాత్ములు పుణ్యాత్ములు అందఱునేనే. నేనొక్కచోట బంధితుడనై లేను. శరీరమనుకాను. ఈ విశ్వమంతయు నాశరీరము. ఈ సర్వమును ప్రతిబింబీకరించుకొను శుద్ధస్ఫటికమను నేను. కాని అది ఎప్పుడును శుద్ధమే. మనమందఱము మన ఇష్టప్రకారము మనముందు ఇంద్రజాలదృశ్యములు సృష్టించుకొనుచు, మంత్రదండములు త్రిప్పు ఇంద్రజాలికులము. కాని ఈ ఇంద్రజాల దృశ్యములనుండి అవినాశమైన

ఆత్మపదార్థమును చేరుకొనవలెను. ఈ ప్రపంచమంతయు ప్రొయ్యిమీద కాగుచున్న నీటివంటిది. మొదట ఒక బుడగ పైకివచ్చును. తర్వాత మఱొకటి. తర్వాతవందలుగావచ్చి ఆవిరై పోవును. అట్లే ఆచార్యపురుషులు మొదటిబుడగలట్టివారు, అక్కడ అక్కడ బయల్దేరుదురు. కట్టకడకు జీవులందఱు ఆవిరై ఈ ప్రపంచములోనుండి ముక్తులగుదురు. ఈ సృష్టి ఎప్పటికప్పుడు క్రొత్త, ఎప్పటికప్పటి కీ క్రాగులో క్రొత్తనీరు క్రాగుచుండును. ఆవిరియగుచుండును. బుద్ధుడు క్రీస్తు ఈ క్రాగులో లేచిన రెండు పెద్దబుడగలు. వారు చాల గొప్పవారు. వారుస్వయంతీర్ణులై పరులను తరింపజేసిరి. వీరిద్దఱిలో ఎవరును పరిపూర్ణులుకారు. కాని వారిలోని సుగుణములను బట్టి వారిని పరిశీలింపవలె గాని లోపములబట్టి కాదు. బుద్ధునికన్న క్రీస్తు కొంచెము తక్కువ. ఏలయన; అతడు చెప్పిన సిద్ధాంతము నతడు సర్వకాల సర్వావస్థలందు పాటింప లేకపోయెను. స్త్రీలకు పురుషులతోబాటు సమాన స్థాన మీయలేదు. పాపము స్త్రీ అతనిని చక్కగాసేవించినది. అతనికన్ని పనులుచేసిపెట్టినది. కాని ఒకర్తుకకు నతడు జ్ఞానము ప్రసాదించలేదు. దీనికి కారణమతడు సెమిటిక్ జాతివాడగుట. మహాత్ము లార్యు లట్టివారుకారు. వారు స్త్రీకి పురుషునితో సమాన స్థానమిచ్చిరి. ఆధ్యాత్మవిద్యయందు లింగభేదమును వారు పాటింపలేదు. వేదోపనిషత్తులందు ఆధ్యాత్మికసత్యము లుపదేశించిన స్త్రీలుండిరి. పురుషులతో సమానపూజ నందుకొనిన స్త్రీలుండిరి.

## VIII

సుఖదుఃఖములు రెండును బంధములే. సుఖము బంగారు త్రాడు. దుఃఖము ఇనుపత్రాడు. కాని రెండు నాత్మభావమునుండి మనలను దూరస్థులజేసి నిగ్రహించుటలో బలమైనవే. ఆత్మకు సుఖదుఃఖములు రెండును లేవు. ఈ రెండును దశాభేదములు.

ఇవి మాఱుచుండవలసినదే. ఆత్మస్వభావ మానందము, శాంతి. మార్పులేనిది. మనము దానిని క్రొత్తగా సంపాదింపవలసినది లేదు. ఆ శాంతి, ఆనందము మనకుండనేయున్నవి. మనకన్నుల గప్పిన మైకము తుడుచుకొని చూడవలెనంటే మనమాత్మభావము నందు విశ్రాంతులమై పరిపూర్ణమైన శాంతితో ఈ లోకచిత్రము దర్శింపవలెను. ఈ లోకచిత్రము వట్టి పిల్లచేష్ట. ఇది మనలను కలవరపెట్టరాదు. భూషణమునకు మనస్సు సంతోషించినచో తిరస్కారమునకు దుఃఖించును. ఇంద్రియసుఖము మనస్సంతోషములు, శాశ్వతములుకావు. క్షణికములు. మనయందే అచ్ఛమైన నిరపేక్షమైన శాశ్వతమైన ఆనందమున్నది. దానికి వ్యంజక సామగ్రి అక్కఱలేదు. అది బాహ్యవస్తువులపై ఆధారపడలేదు. ఆ ఆత్మానందమునే 'మతము' అని, 'ఆధ్యాత్మికత' యని అందురు. మనము అంతర్దృష్టి పెంచుకొనినకొలది మనలో ఆధ్యాత్మికత పెరుగును. ఆనందమునకై మనము ప్రాపంచికవిషయములపై దృష్టి మఱల్పరాదు.

ఒక పెద్ద ఉప్పెనగాలి వచ్చినది. కొంతమంది చేపలమ్ముకొను స్త్రీలు ఒక ధనవంతుని ఉద్యానవనములోనికి తలదాచుకొనుటకు పోయిరి. అతడు వారి కాతిథ్యమిచ్చెను. వారికి తిండి పెట్టి, అందున్న ఒక విశ్రాంతిగృహములో విడియించెను. దానిచుట్టు సువాసన వెదజల్లు పూలమొక్కలున్నవి. వాని సువాసనతో నిండి వాయువంతయు గుబాళించుచున్నది. ఆ పల్లె స్త్రీలకు అక్కడ ఆ సువాసనలో నిద్రపట్టలేదు. వారి కేదో కొంత లోటు కన్పించినది. ఆ పదార్థము లేనిచో వారికి సుఖములేదు. కొంతసేపటికి వారిలో నొకామె లేచి ఆ చేపలబుట్టలు పెట్టిన చోటికి పోయి ఆ విశ్రాంతిగృహములోనికి వానిని కొంపోయెను. ఆ చేపలకంపు వారి కలవాటు. ఆ కంపులో వారు సుఖముగా నిద్రపోయిరి.

లోకము ఈ చేపలబుట్టవంటిది. దీనిపైన మన మాధార పడియుండరాదు. ఆధారపడుట తామసికము. తమస్సధమ గుణము. దీనికంటె రజోగుణము కొంచెము మెఱుగు. ఇది అహంకార మమకారములను పెంచును. ఈ రజోగుణప్రధాను లొక్కొక్కప్పుడు మంచిపనులుచేసి ఆధ్యాత్మికభావసంపన్నులు కావచ్చును. దీనికంటె గొప్పది సత్త్వగుణము. సత్త్వగుణ ప్రధాను లాత్మభావమందు విశ్రమింతురు. ఈ మూడుగుణములు బహువిధములుగా సమ్మిశ్రితములై ప్రతిమానవునియందున్నవి. ఒక్కొక్కప్పు డొక్కొక్కనిలో ఒక్కొక్కగుణము ప్రాధాన్యము వహించును. మనము రజస్తమోగుణములను జయించి వానిని సత్త్వములో లయింపజేయుటకు ప్రయత్నించవలెను.

సృష్టి యనగా ఒకదానిని తయారుచేయుట కాదు. సామ్యావస్థనుపొందుటకు చేయు ప్రయత్నము. జీలుగబెండు ముక్క లొక నీళ్లతొట్టిలో వసితిమి. ఆ ముక్క లొక్కొక్కటి గానూ, పదిపదిగాను నీటిపైకి తేలును. అన్నియు పైకి తేలిన తర్వాత చలనముండదు. అన్నియు సామ్యావస్థను పొందినవి. ఈ సామ్యావస్థ నందిన తర్వాత చలనముండదు. చలనమే మార్పు. అదియే జీవితము. సామ్యావస్థలో ఇది లేదు. అనగా మార్పు, జీవితము. సామ్యావస్థ పొందిన తర్వాత అది అంత మగును. ఈ సామ్యావస్థ పొందుటకు పడు బాధయే సృష్టిరూపము. జీవితమునందు మంచిచెడ్డలు రెండు నుండును. సామ్యావస్థ పొందిన తర్వాత అచ్చట ప్రపంచ ముపశమించును గాబట్టి. సామ్యావస్థయన్నను, ప్రళయమన్నను అర్థమొక్కటే. దుఃఖము లేకుండ సుఖముండుటకు వీలులేదు. కీడు లేక మేలుండుటకు వీలు లేదు. ఎందుచేతననగా, సామ్యావస్థ లేకపోవుటయే జీవితము కాబట్టి. మనకు కావలసినది మోక్షము కాని జీవితముకాదు. సుఖముకాదు. మేలుకాదు. సృష్టి నిరంతరము సాగుచునే

యుండును. దీనికి మొదలులేదు. తుదిలేదు. అనంతమైన సముద్రములో రేగిన కెరటమువంటిది. అది నిరంతరము చలించుచునే యుండును. ఆ సముద్రములో అందని లోతులుండును. అచ్చట జలము లెప్పుడును నిశ్చలములే. కొన్ని చోట్ల అడుగునీటిపొరలలో కదలిక పుట్టినను, మఱల అచ్చటి జలములు నిశ్చలములు కావచ్చును. కాని పైపొరలయందు ఈ కెరటములు నడచుచునే యుండును. అందుచేత సామ్యావస్థను నైశ్చల్యము పొందుటకు చేయు ప్రయత్నమును సాగుచునేయుండును. బ్రదుకు చావులు రెండును ఒకేనాణెమునకు రెండుప్రక్కలవంటివి. అనగా ఒకే సంఘటనమునకు రెండుపేళ్లు అనిగ్రహింపనగును. రెండునుకూడ మాయయే. ఒకక్షణములో బ్రతుకుటకుచేయు ప్రయత్నము యొక్క స్థితి. అనంతరక్షణములో మృత్యువు. ఈ రెంటినిమీఱి అచ్చమైన స్వభావ మాత్మస్వరూపమనునది. మనము ఈ సృష్టిలో పడితిమి. వెంటనే ఈ స్థితి మనకు జీవితముగా తయారైనది. అసలు మనకు కన్పించు నీవిషయజాలమంతయు జీవరహితమైనది. మనము వానియందు ప్రాణసంచారము నారోపించి, పిచ్చివాండ్ర వలె మఱల వారినిచూచి భయపడుటయో, ఆనందించుటయో చేయుచున్నాము. ఈ ప్రపంచమున్నదని చెప్పలేము, లేదని చెప్పలేము, సత్యమని చెప్పలేము, అసత్యమని చెప్పలేము. ఇది సత్యముయొక్క నీడ.

కల్పన సత్యముయొక్క నీడవంటిదని ఒక కవి చెప్పెను. ఈ కన్పించు బాహ్యప్రపంచముకంటె సత్యమైన, అధిష్ఠానభూతమైన ఆ ఆంతరప్రపంచము ఎన్నోమడుంగులు పెద్దది. ఈ బాహ్య విశ్వము, ఆ ఆంతరవిశ్వమునకు ఛాయాభూతమైనది. మనము త్రాడును చూచినచో పాము లేదు. పామును చూచినచో త్రాడు లేదు. రెండు నొకేతడవ యుండవుగదా. మనకు ప్రపంచము భాసించుచున్నపు డాత్మప్రభావాభాసముండదు. అప్పు డది వట్టి

బుద్ధివిషయమైమాత్రముండును. బ్రహ్మానుభూతికల్గినచో అహంకారము, ప్రపంచాభాసము వినష్టమగును. దీపము చీకటి నెఱుగదు. ప్రకాశములో తమస్సునకు చోటుండదుగదా! కాబట్టి సర్వము బ్రహ్మపదార్థమే. ఈశ్వరభావన చేయుచున్నపుడు మనము ఆత్మపదార్థమును మనకంటెభిన్నముగాభావించి ఉపాసించుచున్నామని గ్రహింపనగును. కాని సర్వదా ఆ ఆత్మపదార్థము మన నిజస్వరూపమే. ఏకమేమైన పరమేశ్వరస్వరూపము. ఉన్నచోట నుండుట మందునిస్వభావము. కీడును దూరీకరించి మేలునకై ప్రయత్నించుట మానవస్వభావము. దేనిని అన్వేషింపక వదలక నిరంతరము ఆనందమగ్నమైయుండుట దైవీస్థితి. మన మందఱము నిట్టి దైవీస్థితి పొందవలెను. మన హృదయములన్నియు సముద్రములవలె విశాలములుకావలెను. లౌకికములైన విషయముల యందు తగులముచెందక మనము లోకమును గోడమీాద గీచిన ఒక బొమ్మగాచూడవలెను. అప్పుడుమాత్రమే దానివల్లవచ్చు దుష్ఫలితములను మనము పొందకుండ లోకదృశ్యమును చూచి ఆనందింపగలము. మనము లోకమునందు మంచిని చూచుటకై తాపత్రయపడుటేల? మనకు లోకమందేమి కన్పించును? బురద గుంటలో ఆడుకొనుపిల్లలకు కొన్ని గాజురాళ్ళు దొరికినట్లు మనకును కొన్ని దొరకవచ్చును. ఆపిల్ల లాగాజురాళ్ళను మఱల పోగొట్టుకొందురు. మఱల వానికై వెదకుదురు. అంతే.

ఆధ్యాత్మికత, పరమేశ్వరుడు, ఇవి అనంతమైన శక్తులు. ముక్తులమైనచో మనము ఆత్మస్వరూపులమగుదుము. అమృతులమగుదుము. పరమేశ్వరుడుకూడ ముక్తుడే. ముక్తుడు కానిచో అతడు పరమేశ్వరుడనుటకు వీలులేదు. కావున మోక్షమే మనము కోరదగినది. మోక్షమును విడిచి, అమృతత్త్వము లేదు. పరమేశ్వరుడు లేడు.

జీవసృష్టమైన ప్రపంచమును నిరసింపనిదే మనకు మోక్ష సామ్రాజ్యమున నడుగిడుటకు వీలులేదు. ఇంతకుపూర్వ మెవరును జీవసృష్టిని నిరసింపనిదే మోక్షసామ్రాజ్యమున నడుగుపెట్టినవారు లేరు. ఇకముందుండడు. ప్రపంచమును నిరసించుటయనగా అహంకారమును నిరసించుట. 'అహం' అను అభిమానమును చెందకుండుట. ఈశరీరములోనున్నను శారీరకములైన సుఖదుఃఖములు పొందకుండుట: ఈ అహంకారమే సర్వానర్థములకు హేతువు. ఈదుష్టుని వ్రేళ్ళతో పెకలింపవలెను. స్వార్థమును త్యజించి నిర్మలములై నిరహంకారులైన శాంతులకే మానవజాతికి నిజముగా సాహాయ్యపడు శక్తియుండును. వారెప్పుడును 'నేను'–'నాది' అన్న మాట తలపెట్టరు. వారు పరోపకారమునకై తాము నిమిత్త మాత్రులై ఈశ్వరుని చేతిలో నుపకరణములైయుందురు. వారు ఆత్మైక్యానుసంధానము చేసినవారు. తమకుగా, తాము బుద్ధిపూర్వకముగా నేదియు చేయరు. ఎవరినేదియునడుగరు. త్యాగమూర్తులు, నిస్వార్థులు. వారి యహంకారము సంపూర్ణముగా వినష్టమైనది. ఆశ నిర్దళితమైనది. వారు నిజమైన జీవన్ముక్తులు. వారు లక్ష్యభూతులు. అహంకారము వినష్టమైనకొలది ఈశ్వరానుభూతి పెరుగును. అహంకారము నిరసించి పరమాత్మభావమును మనలో దీపింపజేసికొందుముగాక. స్వచింత ఈషణ్మాత్రమును లేనపుడు మాత్రమే మన ముత్తమమైన కార్యము నిర్వహింపగలము. అమితమైన పలుకుబడిని సంపాదింపగలము. లోకమునందుత్తమ కార్యములను సాధించినవారందఱు నిష్కాములే. నిన్ను దూషించు వారిని ఆశీర్వదింపుము. అహంకారమును నిరసించుటకు సాహాయ్యపడుటలో వారు లోకమునకెంత ఉపకృతి చేయుచున్నారో ఆలోచించిచూడుము. మిథ్యాత్మను దూరీకరించి సత్యాత్మభావము నవలంబింపుము. పరిశుద్ధమైన తలపులనే తలపుము. అప్పుడు నీవు వేలకొలది వట్టి ప్రచారములకంటె ఎక్కువ పనిని చేయగల్గుదువు. శక్తి శాంతినుండి, చిత్తశుద్ధినుండి ప్రసరించును.

# IX

ఈశ్వరతత్త్వ మనుభవమువల్ల తెలియునదికాని చెప్పుట వల్ల తెలియదు. ఎందుచేతననగా ఆ చెప్పుట తప్పనిసరిగా కొంచె పఱచుట. ఈశ్వరతత్త్వమును మనము చెప్పవలసివచ్చిన మాట లలో చెప్పవలెను. సెయింట్ పాల్ చెప్పినట్లు వేఱుమాటలు విధ్వంసహేతువులే. ఈ వర్ణరూపమైన అభివ్యక్తిలో జీవముం డదు. ఇది వట్టి ప్రతిబింబముమాత్రమే. ఐనను ఒక సూత్రము తెలియునట్లు చెప్పవలెనన్న దానిని లౌకికోదాహరణములలో పొదిగి చెప్పవలెను. మనము ఈ పైన పొదిగిన కప్పును చూచి ఇదియే సత్పదార్థమని భావించి దానియందాచ్ఛాదితమైయున్న సత్పదార్థము గమనింపజాలము. ఈపై దానిని ప్రతీకముగా చూడ లేము. ఇది సాధారణముగా జనులుచేయు పొరబాటు. ప్రతి మతాచార్యుడు ఈ విషయము నెఱుంగును. దీనిని తొలగించు టకై పాటుపడెను. కాని మనుష్యుడు సామాన్యముగ కన్పించు దానినే ఉపాసింపగల్గునుగాని కన్పించనిదానిని ఉపాసింపజాలడు. ఈ కారణమువల్ల పలువురు మతాచార్యులవతరించి మఱల మఱల ఆయా కాలములకు తగిన పద్ధతిలో అచ్ఛమైన ఈశ్వరతత్త్వమును ప్రజలకు తెలియచేయుటకును, దానికి కాలోచితమైన క్రొత్త తొడుగులు తొడుగుటకును వచ్చిరి. ఈ పైన తొడిగిన తొడుగుల స్వరూపము లేవైనను వానివెనుకనున్న సత్యము సర్వకాల సర్వావస్థలయందును మార్పులేక యున్నట్టిది. కాని ఆసత్యము ఆ ఈశ్వరతత్త్వ మొకరూపములో ప్రదర్శింపవలసియున్నది. ఆ కారణమున ఒక్కొక్క కాలమున ఆ ఈశ్వరతత్త్వమున కొక్కొక్క క్రొత్తరూపము ఏర్పడి అభ్యుదయము పొందుచున్నది. మానవజాతి కానుకూల్యత సమకూర్చినది. ఈనామరూపములపట్టునుండి మనము విముక్తులమైనపుడు మనము సర్వవిధములైన దేహబంధముల నుండి విముక్తులముకాగల్గినప్పుడు మనకు మోక్షముకలుగును. నిరం తరాభ్యుదయమన్నను, నిరంతరబంధమన్నను ఒక్కటే యర్థము.

మనము పైని కన్పించు భేదభావమును చీల్చికొని శాశ్వతమైన అభేదభావములోనికి అభిన్నమైన బ్రహ్మభావమును చందవలెను. ఆత్మపదార్థము సర్వజీవులకు నొక్కటే. అదినిర్వికారము. అద్వయము. అది జీవితముకాదు. కాని అది జీవితరూపమున ప్రత్యక్షమగుచున్నది. అది జీవితమునకు, మరణమునకు, సుఖదుఃఖములకు నతీతము. అది కేవలము ఏకము. మనము నరకములోనైనను ఈశ్వరతత్త్వమునే దర్శించుటకు యత్నింపవలెను. సాపేక్షకమైన, నామరూపాత్మకమైన ప్రపంచమునకు సంబంధించినంతవఱకు స్వాతంత్ర్యమన్న మాట కర్థములేదు. ఏరూపము నేను స్వతంత్రము నని చెప్పలేదు. రూపభ్రాంతి వినష్టమగునంతవఱకు ముక్తి యనునది లేదు. మనము లోకమునందు సర్వస్వతంత్రులము కాము. మనస్వాతంత్ర్యము మఱొకనికడ్డమురాకుండునంతవఱకే నిలుచును. అడ్డమువచ్చినపుడు మన స్వాతంత్ర్యము సాగదుగదా. మన మితరులను కష్టపెట్టరాదు. అచ్ఛమైన జ్ఞానమొక్కటే. సాపేక్ష జ్ఞానములనంతములు. జ్ఞానవాహిని మనయందఱయందును ప్రవహించుచున్నది. పిపీలికనుండి బ్రహ్మదేవునివఱకు ప్రవహించుచున్నది. అచ్ఛమైన మతమొకటే. వివిధ పద్ధతులలో ప్రతీకములలో, ఉదాహరణములలో, సారముచూడగలవారి కెక్కడైనను దొరకును. అసలు మనము పతితులమై ప్రపంచమంతయు పతితమగుచున్నదనుకొనుచున్నాము. ఓయి పిచ్చివాడా! నీవు వినుటలేదుగాని నీ హృదయములో నిరంతరము సచ్చిదానందస్వరూపమగు ఆత్మపదార్థము "సోహం", "సోహం" అని శాశ్వతగానము చేయుచున్నది.

కల్పనలేకుండ ఆలోచించుట అసంభవము. ప్రతి మనోవృత్తియందు రెండుభాగములున్నవి. 1. జ్ఞానము, 2. దాని అభివ్యక్తమైన మాట. మనకీరెండు నుండవలసినదే. మనకు వట్టి అధ్యాత్మవిదులుకాని, వట్టి చార్వాకులుగాని ఈ లోకమేమో చెప్పలేరు. ఈలోకమేమో చెప్పవలెనన్నచో మనకు జ్ఞానము,

అభివ్యక్తి రెండు నుండవలెను. అసలు జ్ఞానమంతయు ప్రతిబింబ విషయికమైనది. మనమద్దములో ప్రతిబింబించు మన ముఖములు మాత్రమే చూచుకొనగలము. ప్రతివాడును ఆత్మపదార్థమును, బ్రహ్మపదార్థమును చూచుటయన్నది పొసగదు. కాని ప్రతివాడు ఆత్మభూతుడే. అందువల్ల ఆ ఆత్మపదార్థమును ప్రతిబింబింపజేసి జ్ఞానవిషయమునుగా జేసికొనవలెను. ఈవిధమైన ప్రతిబింబ దర్శనమే విగ్రహారాధనకు త్రోవతీసినది. ఈ విగ్రహములు కొయ్యవి, రాతివి మొదలుకొని మహానుభావులైన బుద్ధుడు క్రీస్తు మొదలగువారివఱకునున్నవి. ఈ అన్నియు ప్రతీకములే. అనగా ఈశ్వరతత్త్వమును ప్రతిబింబరూపమున దర్శించుట కేర్పడినవే. బుద్ధుడు విడువకుండ దేవతలపై కొనసాగించిన వ్యతిరేక ప్రచారమువల్ల హిందూదేశములోనికి విగ్రహములువచ్చినవి. వేదములందు నివిలేవు. బుద్ధుడువచ్చి సృష్టికర్త రక్షకుడైన దైవము లేడన్నప్పుడు దానికి ప్రత్యామ్నాయముగా ఆచార్యపురుషుల విగ్రహములు వచ్చినవి. బుద్ధుడు నొక ఆచార్యుడై లక్షలకొలది జనముచే నారాధింపబడుచున్నాడు. సంస్కరణకొఱకే తీవ్రప్రయత్నములు చేయరాదు. అట్లు చేసినచో నచ్చమైన సంస్కరణముకే ముప్పు ఘటిల్లును. మనుష్యునకు ఉపాసనయన్నది స్వాభావికగుణము. కేవలాధ్యాత్మికభావనగావించుట మహావివేకులకు గాని కుదురదు. అందువల్ల మనుష్యుడు తానారాధించుటకు భగవంతున కొకరూప మెప్పుడును కలిగించుచునేయుండును. ఇది చాల మంచిదికూడ. దీనిని ప్రతీకమందురు. ఈప్రతీక మేదైనను కావచ్చు. ఇదిఈశ్వరతత్త్వమునకు ప్రతీకముగానుండవలెను. అచ్చమైన ఈశ్వరతత్త్వమే ఆరాధింపబడునది. ఈప్రతీకము తనంతటనది ఆరాధ్యముకాదు. అన్నిటినిమించి గ్రంథములలోనున్నంత మాత్రమున విశ్వసింపవలసినదే అను అంధవిశ్వాసమునుండిబయటపడవలెను. ప్రతిదానిని శాస్త్రము, మతము, వేదాంతము క్రిందికి కొనితెచ్చుట ఏదో గ్రంథమునందు ప్రమాణమునకు కట్టుబడ

జేయుట భరింపరాని భయంకరమైన నియంతృ లక్షణము. గ్రంథా రాధనము మిక్కిలి చెడ్డది. ఒకప్పుడు ఒక దుప్పియుండెడిది. మిక్కిలి 'గర్వపోతు'. అది దాని పిల్లతో నిట్లన్నది. "చూడు నేనెంత బాగున్నానో! నా కొమ్ము లెంత వాడిగానున్నవో! ఒక్క పోటుతో నేను మనుష్యుని చంపగలను. దుప్పిజన్మ మంచిది." అప్పుడే దూరమునుండి వేటకాని ఈల వినిపించినది. అదివిని దుప్పి పరువెత్తినది. దానితోపాటు దానిపిల్లయు పరుగెత్తినది. సురక్షిత ప్రదేశము చేరినంత పిల్ల అడిగినది. "ఏమయ్యా నీవంత బలవంతుడవు, ధైర్యవంతుడవు గదా. మనుష్యుని చూచి పాఱి పోయితివేమి?" దుప్పి ఇట్లనినది: "బిడ్డా నేను బలవంతుడను శక్తి మంతుడను; కాని ఆ చప్పుడు విన్నప్పుడు నా కిష్టమైనను లేక పోయినను నన్నేదోవచ్చి ఆవేశించి పరుగెత్తింపజేసినది." మన మట్టివారమే. గ్రంథములందు వ్రాసిపెట్టబడిన ధర్మముల బూరల మ్రోతలు మనకు విన్పించును. మనకున్న అలవాట్లు, మనపురాతన విశ్వాసములు మనల నావేశించి యున్నవి. ఈ సంగతి మనము తెలిసికొనకపూర్వమే మనము వానికి కట్టువడిపోదుము. మన నిజస్వభావమగు స్వాతంత్ర్యము మఱచిపోదుము.

జ్ఞానము శాశ్వతమైనది. ఆధ్యాత్మికతత్త్వము గ్రహించిన వానిని మనము జ్ఞానియందుము. అతడు లోకములోనికి వెలుగు తెచ్చును. కాని అతడు తెచ్చు జ్ఞానము శాశ్వతమైనదైనను అది కొసమాటయని దానినిపట్టుకొని ఊగులాడరాదు. యోగ్యుడైన వాని కెవనికైనను జ్ఞానాలోకము గోచరించును. కావలసినది చిత్తశుద్ధి. ఇది కలవారే ఈశ్వరతత్త్వమును దర్శింపగలరు. మనుష్యుడు జంతుసముదాయమునం దుత్తముడు. మర్త్యలోకము చాల గొప్పది. ఇచ్చట మానవుడు జన్మించి ముక్తిపొందవచ్చును. ఈశ్వరుని గుఱించి మనముచేయు ఊహలలో కల్పించు నాకృతు లలో మనుష్యాకృతి దొడ్డది. ఈశ్వరునకు మన మారోపించుగుణ ములు మనుష్యగుణములు కాకపోయిన, మనుష్యునిలో నీగుణ

ములు కొంత తక్కువతరగతిలో నుండవచ్చును. మనుష్య రూపవిశిష్టమైన భగవద్భావననుండి మనము బైటపడవలెనన్నచో, మనఃకల్పములు వీడవలెను. ఈ ప్రపంచదృశ్యమును చూడ రాదు. ఆత్మానుసంధానముచేసి కైవల్యానుభూతి నందినచో ఈ ప్రపంచమున తగులోకనమని గ్రహింపగలము. అప్పుడు మిగులున దొక్క ద్రష్టయే. దృశ్యము లేదు.

మనకు తెలిసిన ప్రపంచములో మనుజుడుమిన్న. పరిపూర్ణ త్వము సాధించినవారు ఈశ్వరతత్త్వమందు మగ్నులైనారని చెప్ప వచ్చును. అందువల్ల ద్వేషమనగా ఆత్మహననమని అర్థము. సర్వమాత్మమైనప్పుడు దేనినైనను ద్వేషించుట ఆత్మహననమే. కాబట్టి ప్రేమయన్నది నిజమైనధర్మము. ఈ ప్రేమభావమునకు లేచుటయే పరిపూర్ణత్వము. కాని మనలో ఈపరిపూర్ణత్వము పెరిగినకొలది చేయుపని తక్కువ. పరమసాత్త్వికుడీ ప్రపంచమును చూచి ఇది వట్టిపిల్లలయాటయని ఎంచి దానియందు తాను జోక్యము కలిగించుకొనుట కిచ్చగింపడు. రెండుకుక్కపిల్లలు కీచులాడుట చూచి మనమెంతజోక్యముకల్గించుకొందుమో అంతే. అది అంతపెద్ద విశేషముకాదని మనకు తెలియును. పరిపూర్ణమానవుడు ప్రపంచ మును మాయావిలసనమని ఎఱుగును. ప్రపంచమునకు సంసార మనిపేరు. పరస్పరవిరుద్ధమైన కొన్నిశక్తులు మనపై *ప్రసరించుట వల్ల ఈ సంసారమేర్పడుచున్నది. ముక్తియన్నది మిథ్య. బంధ మన్నది స్వప్నమని జడవాదము చెప్పును. వేదాంతమేమను ననగా మనము ముక్తులమైకూడ కామని చెప్పును. అనగా లౌకి కావస్థలో శారీరకావస్థలో మనము ముక్తులముకాము. ఆధ్యాత్మి కావస్థలో సర్వదాముక్తులమే. ఆత్మపదార్థము బంధమోక్షముల కతీతమైనది. మనమందఱము ఇంద్రియాతీతమైన అనశ్వరమైన చిత్పదార్థములము. మనమందఱము కేవలమానందపదార్థము. సచ్చిదానందస్వరూపులము.

---

# రాజయోగము - ఆఱు పాఠములు

[సారసిబుల్ అను అమెరికన్ శిష్యురాలు తన గృహమున ఏర్పఱచిన సన్నిహితమిత్రుల తరగతిలో శ్రీవివేకానందస్వామి చేసిన ప్రసంగములివి. ఈ తరగతిపాఠముల నామె వ్రాసి యుంచెను. పిదప 1913 లో ఇవి ముద్రింపబడి మిత్రులందు పంచిపెట్టబడినవి. —సంపాదకుడు.]

లోకములో తక్కిన శాస్త్రములవలెనే రాజయోగముకూడ ఒక శాస్త్రము. ఇందలి విషయము మనస్సు. దానిని శాస్త్రము విభాగించిచూపును. ఇంద్రియాతీతమైన విషయములను వివేకించుటవలన నిది ఆధ్యాత్మికతాసౌధమును నిర్మాణముచేయుచున్నది. ప్రపంచములో గొప్ప ఆధ్యాత్మికసంపత్తిగల మహానుభావులు క్రీస్తుగాని, పాల్‌గాని, పీటర్‌గాని - ఎవరైనను అపరోక్షానుభూతిని పొందినవారే. తాము దర్శించితెలిసికొన్న ఆధ్యాత్మిక సత్యమునుగుఱించి చెప్పినవారే.

ఈ అపరోక్షజ్ఞానము యోగసాధ్యము.

జ్ఞప్తికాని, బుద్ధికాని, సత్పదార్థమునకు అవధిభూతములు కావు. బుద్ధి నతిక్రమించిన ఒకస్థితియున్నది. ఈస్థితి అసలు స్పృహలేకుండ కొయ్యబాఱుస్థితి. రెండు నొకవిధముగ నేయుండును. కాని రెంటి మధ్య చాల పెద్ద భేదమున్నది. ఒకటి అజ్ఞానదశ. రెండవది జ్ఞానదశ.

ప్రస్తుతయోగము ఒకశాస్త్రముగా మన బుద్ధికి విశదపడును.

సమాధి సర్వజ్ఞానమునకును మూలము.

యోగము పంచభూతములను వశముచేసికొను పద్ధతిని మనకు తెల్పును. యోగమనుమాటకు కలయికయని, లేక మార్చుట

యని అర్థము. జీవాత్మను పరమాత్మతో మేళవించుట యోగము.

బుద్ధికి లోబడి మనస్సు పనిచేయును. బుద్ధియనబడు పదార్థము స్వభావమను గొలుసులో ఒక కొంకివంటిది.

"నేను" అన్న భావము కొంత ఈబుద్ధిని, ఎక్కువ భాగము అజ్ఞానము వ్యాపించియుండును. అనగా అహంకారమునందు కొంతభాగము బుద్ధి, ఎక్కువభాగమునం దజ్ఞానమన్నమాట. ఈ అహంకారమును దాటి దీనికి తెలియకుండ నున్నది జ్ఞానావస్థ.

విశ్వాసముతో నిరంతరాభ్యాసము చేయుటవలన మనసులోని పొరలు మనముందు విప్పికొనును. ప్రతిపొరయందును మనకు కొన్ని కొన్ని క్రొత్తక్రొత్త విషయము లనుభవములోనికి వచ్చును. క్రొత్తక్రొత్త ప్రపంచములు స్పష్టములై మనకు కన్పించినట్లు, క్రొత్తక్రొత్త శక్తులు వశమైనట్లనిపించును. కాని అంతటితో మనమాగరాదు. మనముందు నిజమైన రత్నాలగని యున్నపుడు ఈగాజురాళ్ళ తళతళలకు మనము భ్రమింపరాదు.

మనకు లక్ష్యము పరమాత్మదర్శనము. అది పొందనిచో మనము వినష్టముకాగలము.

సిద్ధినందదలచుకున్న సాధకునకు మూడు లక్షణములుండవలెను.

## 1. ఇహాముత్రఫలభోగవిరాగము

ఈలోకమందు పరలోకమందతనికి సుఖము లనుభవింపవలెనన్న ఇచ్ఛ కూడదు. అతడు సత్యసందర్శనమునకు పరమేశ్వరదర్శనమునకు మాత్రమే ప్రయత్నింపవలెను. మనము పుట్టినది సత్యమును సాధించుటకు, భోగములనుభవించుటకు కాదు. ఈ భోగానుభవమును బుద్ధిహీనుల ననుభవింపనిండు. వారివలె

మన మనుభవింపజాలము. మనుష్యు డాలోచనాస్వభావి. అందు వల్ల మృత్యువును జయించుదనుక జ్యోతిర్దర్శనము కల్గునంతదనుక సాధన వదలరాదు. మనుష్యుడు నిష్ప్రయోజనమైన వృథాసంభాషణములలోపడి నష్టపోరాదు. సంఘపూజ, కీర్తి, మొదలైనవి విగ్రహారాధనవంటివి. ఆత్మకు స్త్రీ, పురుష భేదములు దేశకాల భేదములు నేమియు లేవు.

## 2. ముముక్ష

ముముక్షు అనగా పరమాత్మదర్శనమునకై చేయబడు ఆంతరంగికతపస్సు; తీవ్రమైన ఇచ్ఛ. నీటిలోమునిగినవాడూపిరికొఱకు తహతహపడినట్లు సత్యమునకై పరమాత్మదర్శనమునకై మనుజుడు తహతహపొందవలయును. వలసినది భగవంతుడు. మఱొకటి పనికిరాదు. ప్రలోభములను అసత్య విషయములను చూచి మోసపోరాదు. వీనినన్నిటినివదలి ఆత్మపరిశీలనము చేయవలెను.

## 3. శమాది షట్క-సంపత్తి

ఇవి యాఱు : శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధులు.

శమము :—మనస్సును బహిర్ముఖము కానీయకుండ నిగ్రహించుట.

దమము :—ఇంద్రియ నిగ్రహము.

ఉపరతి :—మనసును లోనికిమళ్లించుట, అంతర్ముఖత్వము.

తితిక్ష :—శీతోష్ణాది ద్వంద్వసహనము.

శ్రద్ధ :—ఒకేవృత్తియందు మనస్సునింపుట, ఒకే విషయమును గ్రహించి నిరంతరాను సంధానముచేయుట, కాలమును గణింపకుండుట.

సమాధి :—ఆత్మానుసంధానముచేయుట.

సాధకుడు తానెవరో విచారించుకొనును. అంధవిశ్వాసమును దూరీకరింపవలెను. "నేను తక్కువవాడను పనికిమాలినవాడ"నను భావములు విసర్జింపవలెను. అహోరాత్రములు నేనాత్మస్వరూపుడనని ఆత్మైక్యానుభూతి కల్గునంతవఱకు భావింపవలెను.

ఈ లక్షణములు లేనిచో ఫలితమేమియునుండదు. మనకు కైవల్యమునుగుఱించి తెలియవచ్చును. కాని మనము దానిని గుఱించి చెప్పలేము. చెప్పుటకు యత్నించినచో దానికి మనమొక హద్దుపెట్టినట్లగును. అప్పుడది కైవల్యముకాకుండ పోవును.

మన మింద్రియముల హద్దులనుదాటి బుద్ధినిదాటి అతీంద్రియానుభూతిలోనికి పోవలెను. దీనికి తగిన శక్తి మనదగ్గఱనున్నది. (మొదటిపాఠము. దీనిని ఒకవారము దినము ఉచ్ఛ్వాసనిశ్వాసములతోపాటు సాధనచేసినతర్వాత శిష్యుడు గురువుతో నివేదించును.)

## పాఠము I

మనుష్యునిలోనున్న వ్యక్తిత్వము విజృంభింపజేయుటకుద్దేశించిన పాఠ మిది. ప్రతివ్యక్తిత్వము పరిపుష్టము కావలెను. ఈ వ్యక్తిత్వములన్నియు కేంద్రస్థానమున సమన్వితము లగును. "భావన సమాధికి ద్వారము. భావనయే ఆలోచనమునకు మూలము." ఆచార్యపురుషులు, కవులు ప్రకృతిసిద్ధాంతములను కనిపెట్టినవారందఱు గొప్పభావనాశక్తి కలవారు. ప్రకృతి మనకు వెలిగానున్నను దానిజ్ఞానము మనలోనే యున్నది. ఱాయి భూమిమీద బడుట బైట జరుగునదే కాని ఆ భూమ్యాకర్షణరూపమైన జ్ఞానము మనలోనే కల్గుచున్నది కాని బైటకాదు. అత్యాహారులు, నిరాహారులు, అతినిద్రులు, నిద్రాదరిద్రులు—యోగులు కాలేరు. అజ్ఞానము, చాంచల్యము, అసూయ, ఆలస్యము, సంగము,

యోగసాధనకు బద్ధశత్రువులు. యోగసాధనకు కావలసిన గుణములు మూడు.

1. బాహ్యాభ్యంతరశుద్ధి — మనస్సును క్రిందికి గుంజు దైహిక మానసిక మలమంతయు క్షాళనము చేయవలెను.

2. సహనము— మొదట చాల విపరీతమైన స్వరూపములు కన్పించును కాని క్రమముగా నవి అణగిపోవును. ఈ దశ చాల కఠినమైనది. కాని వదలిపెట్టకుము. సాధన కొనసాగింపుము. సహన మున్నచో తుదకు ఫలితము కల్గును.

3. పట్టుదల—కష్టము వచ్చినను, సుఖము వచ్చినను, రోగము వచ్చినను, ఆరోగ్యముగా నున్నను — ఏది ఏమైనను ఒక్కదినమునైనను సాధన చేయక వదలకుము.

సాధనకు యోగ్యమైన కాలము సంధ్యాకాలము. మన స్థూల, సూక్ష్మదేహమందలి రక్తప్రవాహము, భావప్రవాహ ములు ప్రశాంతముగా నుండు కాలము. సంధ్యాసమయము రెండు స్థితులకు మధ్యనున్న సమస్థితి. ఈ సంధ్యాకాలములందు సాధన చేయుట కుదుర దేని నిద్రలేచిన వెంటనే ఉదయము, నిద్రపోవుటకు ముందు రాత్రివేళ సాధన చేయవలెను. శారీరకశుద్ధి మిక్కిలి యవసరము. ప్రతిదినము శుభ్రముగా స్నానము చేయవలెను.

స్నానము చేసిన వెంటనే స్థిరముగా కూర్చుండుము. నీవొక కొండవోలె అచంచలుడవుగా కూర్చున్నట్లు భావింపుము. నిటారుగా కూర్చుండుము. తల, భుజములు, పిఱుదులు వంగ రాదు. వెన్నుబద్దపై బరువు పడరాదు. వెన్నుబద్ద వెంట యోగ శక్తి ప్రవహించును. అందువల్ల వెన్నుబద్ద నిరపాయముగా నుండ వలెను. పాదాగ్రమునుండి శిరఃపర్యంతము పరిశుద్ధముగానున్నట్లు భావనచేయవలెను. భావనాసందర్భమున ఆయా యవయవములను మనస్సునందు రూపించి చేతితో స్పృశింపవచ్చును. తర్వాత శరీరమంతయు పరిశుద్ధముగా నున్నదనియు, నది ఈశ్వరునకు

సాధనభూతముగా నర్పితమైనదనియు, అది నిన్ను సత్యదర్శనము చేయింపగలదనియు, ఈ సంసారవారిధిని నిన్ను దాటించుట కది తరణోపాయమైననౌక యనియు భావింపుము. తర్వాత రెండు నాసారంధ్రములగుండ లోనికి గాలినిపీల్చి, బయటకు నిరవశేష ముగా వదలివేయుము. ఓపినంత బహిఃకుంభకము—అనగా గాలి పీల్చకుండ నుండుట చేయుము. ఇట్లు నాల్గు పర్యాయములు చేయుము. తర్వాత మామూలుగా ఉచ్ఛ్వాస నిశ్వాసములు కొనసాగించుచు నాత్మానుభూతికై ధ్యానింపుము. "ఈ విశ్వమును సృజించిన పరమాత్మయొక్క తేజస్సును నేను ధ్యానము చేయు చున్నాను. ఆ పరమాత్మ నా బుద్ధిని ప్రచోదన చేయుగాక"— అని పది పదునేను నిముషము లిట్లు చేయుము.

నీ యనుభవమును నీ గురువునకుదప్ప మఱి ఎవ్వరికిని చెప్ప కుము. వాఙ్నియమమును పాటింపుము. ఎల్లప్పుడు సత్సంకల్పము లనే చేయుము. మనము మన మేమి సంకల్పింతుమో ఆ విధము గనే పరిణమింతుము.

ధ్యానము మానసికమలమును హరించును. యోగులు మాత్రమే యథార్థమునకు స్వతంత్రులు. తక్కినవారు బద్ధులు. మనము ముక్తుల మగుటకు నొక్కొక్కటిగా బంధములను త్రెంచ వలెను.

సర్వులు సత్పదార్థములను గ్రహింపగలరు. భగవంతుడు సత్యమైన, మన కీశ్వరానుభూతి కల్గవలెను, ఆత్మానుభూతి పొంద వలెను.

ఆత్మపదార్థమును కన్గొనుట కొక్కటే మార్గము. అది శరీరము కాదని తెలిసికొనుట.

యోగులు మన ఇంద్రియములను రెండుభాగములు చేసిరి : జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు.

అంతఃకరణ మంతరింద్రియము. అది 4 భాగములు. 1. మనస్సు, 2. బుద్ధి, 3. చిత్తము, 4. అహంకారము.

సంకల్ప వికల్పాత్మకము మనస్సు. ఇది ఆలోచనాత్మకమైనది. దీనిని సరిగా నిగ్రహింపకున్నచో ఈ శక్తి వ్యర్థమగును. అదుపులోనికి తెచ్చుకొనినచో నిది గొప్పశక్తిగా పరిణమించును.

బుద్ధి :—ఇది నిశ్చయాత్మకమైనది.

అహంకారము : గర్వాత్మకమైనది. కర్తృత్వ, భోక్తృత్వ రూపము.

చిత్తము :—ఇది పై మూడు వృత్తుల కధిష్ఠానభూతము. తక్కిన మూడు వృత్తులును చిత్తసముద్రమం దుద్భవించిన తరంగములు.

చిత్తము ఇతర వృత్తులలోనికి మారకుండ అవికారముగా నుంచుట కేర్పడిన శాస్త్రము యోగము. అనగా చిత్తవృత్తి నిరోధకసాధనము. తరంగితమగు సముద్రమునబడిన చంద్రప్రతిబింబమువలె చంచలమైన మనస్సునందు ఆత్మ స్పష్టముగా ప్రతిబింబించదు. సముద్రము నిస్తరంగమైనపుడు చంద్రబింబము చక్కగా ప్రతిఫలించినట్లు చిత్తము నిరుద్ధమై, శాంతమైనపుడు చిత్తమునందు ఆత్మ ప్రతిబింభించి దర్శనయోగ్యమగును.

మనస్సు శరీరమువంటిదికాదు. కాని అదికూడ సూక్ష్మభూతమువల్ల నేర్పడినదే. మనస్సు చిరకాలము శరీరమునందు బద్ధమై యుండదు. మన మప్పుడప్పు డీశరీరమునుండి పైకిలేచుటవల్ల ఈ విషయము ఋజువగుచున్నది. మన మింద్రియముల నిరోధించుటవల్ల మనస్సును మన యిష్టమువచ్చినపుడెల్ల శరీరమునుండి వేరుచేయుట నేర్చుకొనగల్గుదుము.

ఇంద్రియనిగ్రహ మలవాటైన తర్వాత విషయములను నిగ్రహింపవలెను. మన కనుభవములోనున్న ప్రపంచమంతయు వైషయికమైనది. ఉత్తమస్థితికి చెందినందులకు నిదర్శన మొకటే.

అది స్వతంత్రము. నీవు ఇంద్రియములకు దాసుడవు కాకుండ వానిని నిగ్రహింపగల్గినపుడుమాత్రమే ఆధ్యాత్మికజీవనమునం దడుగిడినట్లు భావింపుము. ఇంద్రియాకర్షణమునకు లోనైనవారు పట్టి ప్రాకృతులు, ఇంద్రియములకు బానిసలు.

చిత్తవృత్తులను నిర్మూలనముచేసి చిత్తమును ప్రశాంతము చేసినచో మనము జన్మరాహిత్యము చెందినట్లే. కోట్లకొలది సంవత్సరములు శ్రమించి మన మీ శరీరములను సంపాదించితిమి. ఈ శరీరసంపాదనశ్రమలో వీనిని మన మెందుకు సంపాదించితిమో ఆ మహత్తరమైన ప్రయోజనమును మఱచితిమి. ఆ ప్రయోజనము మోక్షము సంపాదించుట, పరిపూర్ణత్వము సంపాదించుట, శరీరమును వృద్ధిపొందించుటయే మన సర్వప్రయత్నములకు ప్రయోజనమని మన మనుకొనుచుంటిమి. అదియే మాయ. మన మీ భ్రాంతిని నిరసించి మన ప్రధానలక్ష్యమును గుర్తుకుతెచ్చుకొని మన మీ శరీరము కాదని ఇది మనకు సాధనమేతప్ప సాధ్యము కా దని గ్రహింపవలెను. శరీరము భృత్యునివంటిదే!

మనస్సును శరీరమునుండి బయటకులాగి మనము శరీరముకంటె వేఱని దర్శించుట నేర్చుకొనవలెను. మన మీ శరీరమునకు జ్ఞానము, చైతన్యము సంక్రమింపజేసి, ఇది ప్రాణవంతమైనదని, యథార్థమని భావించుట మొదలుపెట్టుదుము. చాలకాలము ఈ తొడుగు నీడ్చుటవల్ల అలవాటై, ఈ తొడుగు మనము కాదను మాటను మఱచిపోతిమి. మనము కోరినపుడెల్ల ఈ శరీరమును దూరముగ నెట్టి ఇది మనకు సాధనమని, ఒక సేవకుడని మనము కోరినపుడెల్ల చూచుటకు యోగము అవసరము. యోగసాధనము లందు తొలిలక్ష్యము మనశ్శక్తులను నిరోధించుట. రెండవలక్ష్యము వానిని మఱి ఏవిషయమందైనను లగ్నముచేయుట.

ఎక్కువగా మాట్లాడువాడు యోగి కాలేడు.

## పాఠము II

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు అని యోగమున కష్టాంగములున్నవి.

1. యమము:—ఇది చాలముఖ్యమైనది. జీవితమునందంతట దీని యుపయోగము ఉన్నది. ఇది 5 భాగములు కలది.

(1) అహింస, (2) అస్తేయము, (3) శౌచము, (4) సత్యము, (5) అపరిగ్రహము. త్రికరణశుద్ధిగా వీనిని పాటించుట యమము.

2. నియమము :—ఇది శారీరకము; స్నానాన్న పానము లకు సంబంధించినది.

3. ఆసనము :—పిఱుదులు, భుజములు, తల - నిటారుగా నిల్పి వెన్నుబద్ద వంగకుండ కూర్చుండుట.

4. ప్రాణాయామము :—వాయునిరోధము. దీనివల్ల ప్రాణ శక్తి నిరుద్ధమగును.

5. ప్రత్యాహారము :—మనస్సును బహిఃప్రసరణము లేకుండ నిరోధించి అంతఃప్రసరణశీలమును చేయుట, ధ్యేయమును మాత్రమే మనస్సునందు పునఃపునరనుసంధానము చేయుట.

6. ధారణ :— ధ్యేయమునందు మనస్సును కేంద్రీక రించుట.

7. ధ్యానము :—ఈదశయందు ధ్యేయమే ఏకధారగా ప్రవ హించును.

8. సమాధి :—ఆత్మదర్శనము. ఇదియే మన సర్వప్రయ త్నములకు చరమదశ.

యమనియమములు ఆజన్మము అభ్యసింపవలెను. తక్కినవి నిచ్చెనమెట్లు. ఒకదానితర్వాతి నొకటి వరుసగా అభ్యసింప దగినవి. తక్కినవానిని తృణజలూకన్యాయమున ననుసరింపవలెను.

మఱొక గడ్డిపరకను గట్టిగబట్టియే జలగ వెనుకటి గడ్డిపరకను విడుచును. రెండవమార్గమున ప్రవేశించుటకుమున్ను మొదటిదానిని బాగుగ నభ్యసింపవలెను.

ఈపాఠములో ప్రాణ నిరోధమునుగుఱించి చెప్పుదును. రాజయోగమందు ప్రాణవాయువు సూక్ష్మశరీరమున ప్రవేశించి ఆధ్యాత్మికానుభూతినికల్గించును. ప్రాణాయామము మొత్తము శరీరమునంతటికిని దీపకమైనసాధనము. అది మొదట ఊపిరితిత్తులకు బలమిచ్చును. అది ఊపిరితిత్తులపై, హృదయముపై, రక్త ప్రసారముపై, మేధపైన, మనస్సుపైన పనిచేయును. బుద్ధి ఒక బాహ్యాజ్ఞానమును కల్గింపగా ఆ బాహ్యాజ్ఞానము మఱల బుద్ధిని ప్రదీపింపజేయును. మన ఇచ్ఛలు చాల బలహీనమైనవి. వాని శక్తులను మనము సరిగా గుర్తింపలేము. మన మంతగా భౌతిక జగత్తునందు మగ్నమైతిమి. మనకున్నదంతయు బాహ్యప్రవృత్తియే. బాహ్యమైన జగత్తు మన మనశ్శాంతిని పాడుచేయును. మనము బాహ్యజగత్తుయొక్క స్థితిలో మార్పుతేలేము. ఇదంతయు తప్పు. నిజముగా నెక్కువబలవంతమైన శక్తి మనలోనే యున్నది.

లోకమునందు మహానుభావులైన ఆచార్యపురుషులు, సిద్ధులు మనస్సుల్లప్తమైనబాహ్యజగత్తును జయించి ఆత్మశక్తితో దివ్యసందేశమును వినిపించిరి.

ఒకరాజు తనమంత్రిని ఒకఎత్తైన బురుజులోపెట్టి ఖైదు చేయగా ఆమంత్రి భార్య ఒకపోకచెక్క, తేనె, పట్టుదారము, నూలుత్రాడు, మ్రోకు నందింపజేసి ఖైదులోనుండి తప్పింపగల్గిన కథ మనస్సును ఎట్లదుపులోనికి తెచ్చుకొనవలెనో నిరూపించును. ఆకథలోని పట్టుదారమువంటిది ప్రాణాయామము. ఈప్రాణాయామమువల్ల నొకదానితర్వాత నొకటి మనశ్శక్తుల నదుపులోనికి తెచ్చుకొనవచ్చును. చిట్టచివరి ధ్యానమన్నది పెద్ద మ్రోకు.

దానినిబట్టి మన మీ శరీరమన్న ఖైదులోనుండి ముక్తిచెంద వచ్చును. ముక్తులమైనతర్వాత మోక్షసాధనముల నావలపాఱ వేయవచ్చును.

ప్రాణాయామమున 3 భాగములు కలవు: అవి పూరక, కుంభక, రేచకములు.

పూరకము:—గాలిని లోనికిపీల్చుట.

కుంభకము:—గాలిని నిల్పుట.

రేచకము:—గాలిని బైటకు వదలుట.

మెదడునుండి వెన్నుబద్దవెంట రెండుప్రక్కల మూలాధారమువఱకు వచ్చి అటనుండి మఱల రెండవ ప్రక్కనుండి ఒకదానినొకటి దాటి మఱల వెన్నుబద్దవెంట మెదడును చేరు రెండు నాడులున్నవి. ఒకదానిపేరు పింగళ. ఇది మెదడులో నెడమ ప్రక్కనుండి బయలుదేరి వెన్నుబద్దవెంట మూలాధారమునకుదిగి అచట వెన్నుబద్ద కుడిప్రక్కకు తిరిగి మఱల ఎడమ ప్రక్కకు తిరుగును. దీనిస్వరూపము ఇంగ్లీషు అంకె ఎనిమిదిలో అర్ధాకృతిగా నుండును. (S)

రెండవనాడి ఇడ. ఇదియు పింగళనాడికి ఎదురుచుట్టుకొని ఎనిమిదంకెయొక్క పూర్ణాకృతిని సిద్ధింపజేయును. ఈ ఎనిమిదంకెలో పైభాగముకంటె క్రిందిభాగము పొడవెక్కువ. ఈ రెండు నాడులలో ప్రాణశక్తి దివారాత్రములు ప్రవహించుచు షట్చక్రస్థానములందు ప్రాణశక్తిని నిల్వచేయుచుండును. కాని మన కీచక్రములు తెలియవు. ధ్యానమువల్లమాత్రమే వానిని మనము చూడగల్గుదుము. ఇడాపింగళ ప్రవాహములు మన శ్వాసపద్ధతితో సంబంధించియున్నవి. అందుచే ప్రాణాయామమువల్ల శరీరమును స్వాధీనము చేసికొనగలము.

కఠోపనిషత్తునందు శరీరము రథము, మనస్సు పగ్గములు, బుద్ధి సారథి, ఇంద్రియము లశ్వములు, విషయములు పంథగా

వర్ణింపబడినవి. ఆత్మ రథికుడు. రథికుడు చక్కని గ్రహణశక్తిగల వాడై సారథిని గుఱ్ఱముల నదుపులో నుంచునట్లు తయారుచేసిన తప్ప తనలక్ష్యమును తాను చేరలేడు. ఇంద్రియములు దుష్టాశ్వములవలె కుపథమున కీడ్చి వానిని పతితుని చేయవచ్చును. ఈ రెండు ఇడా పింగళాశక్తులు సారథిచేతిలోనున్న పగ్గములు. అతడు ఈ గుఱ్ఱములను వశపఱచుకొనవలెనన్న ఈపగ్గములు పట్టవలెను. మనము నియమవంతులమగుటకు శక్తిసమన్వితులము కావలెను. అట్టి శక్తి సంపాదింపలేకున్నచో మనము మన పనులనదుపులో నుంచుకొనలేము. యోగమొక్కటే మనలను నియమితులను చేయుటకు సమర్థమైనది. యోగలక్ష్యము నైతికప్రభావము చేకూర్చుటే! యోగులు ఈ ఇడాపింగళా ప్రవాహములను మూలాధారమున నిరోధించి మేరుదండమనబడు వెన్నుబద్ద మధ్యగా వ్యాపించియున్న సుషుమ్నానాడి వెంట ప్రవహింపజేయగల్గుదురు. సుషుమ్నానాడియందు ప్రవేశించినపుడీ ఇడా పింగళా ప్రవాహములు జ్ఞానప్రవాహములుగా మాఱును. ఇట్టి స్థితి యోగులందేయుండును.

ప్రాణాయామమునందు రెండవపాఠము :— ఒకే పద్ధతి అందఱకు పనికిరాదు. ఈ ప్రాణాయామము లెక్కప్రకారము చేయవలసినది. ఈ లెక్కకు ఓంకారమునుపయోగింపవచ్చును.

ప్రాణాయామముచేయుపద్ధతియిది. బొటనవ్రేలితో కుడిముక్కు నొక్కిపట్టుము. ఎడమముక్కువెంట గాలిని ఓంకారమును నాల్గుమాట్లు జపించునంతకాలములో లోనికి పీల్చుము. తర్వాత తర్జనితో ఎడమముక్కును నొక్కిపట్టి మనసా ఓంకారమును 8 సార్లు ఉచ్చరించునంతకాలము వాయువును లోపల కుంభించుము. తర్వాత బొటనవ్రేలిని కుడిముక్కుపైనుండి తీసి కుడిముక్కుగుండ ఓంకారమును నాల్గుసార్లుచ్చరించుకాలములో గాలిని వదలివేయుము.

ఈ వదలివేయుట పూర్తికానున్నపుడు పొత్తికడుపును వేగముగా అక్కలించి లోనున్నగాలియంతయు బయటకు పోవు నట్లు ప్రయత్నించుము. తర్వాత ఎడమముక్కును మూసియే ఓంకారమును 4 సార్లుచ్చరించుచు కుడిముక్కునుండిగాలిపీల్చుము. తర్వాత కుడిముక్కును బొటనవ్రేలితో నొక్కి 8 సార్లు ఓంకారమును జపించుచు కుంభించుము. తర్వాత ఎడమముక్కుగుండ ఓంకారము నాల్గుమార్లు జపించునంతలో గాలినివదలుము. పూర్వమువలెనే పొత్తికడుపు నక్కలించుము. ఇట్లు రెండు పర్యాయములు ధ్యానమునకు కూర్చున్నపుడెల్ల చేయుము. ఇది 4 సార్లు ప్రాణాయామముచేసినట్లు గణింపదగినది. ఒక్కొక్క ముక్కువెంట రెండేసి ప్రాణాయామములు సలుపుము. నీవు ప్రాణాయామమునకు కూర్చుండుటకుముందు ప్రార్థనచేయుటమంచిది.

ఇట్లొక వారముదినములు అభ్యసించుము. తర్వాత క్రమముగా పూరక, కుంభక, రేచక కాలమును పూర్వపునిష్పత్తి చెడకుండ క్రమముగా పెంచుము. పూరకమునందు 6 జపించినచో కుంభకమున 12. ఈ అభ్యాసము పుణ్యభావమును, చిత్తశుద్ధిని, ఆధ్యాత్మికతపెంచును. అడ్డుత్రోవలు త్రొక్కకుము. ఏవేనిసిద్ధులు సాధించుటకై యత్నించవలదు. ప్రీతియున్న పదార్థమొక్కటే మనతోకూటు వచ్చునది. అదియే అభివృద్ధిచెందుచుండును. రాజయోగమువల్ల ఈశ్వరదర్శనముచేయగోరువారు మానసికముగా, శారీరకముగా, నైతికముగా, ఆధ్యాత్మికముగా బలవంతులై యుండవలెను. అందుచే, మీరు చేయు ప్రతిప్రయత్న మీ త్రోవలో నుండవలెను.

లక్షమందిలో నొక్కడు ముక్తికై ప్రయత్నించును. కొద్దిమంది మాత్రమే సత్యదర్శనముచేయగలరు. కాని దేనినైనను సాధింపవలెనన్నచో సత్యమునకై ప్రాణత్యాగము చేయుటకైనను సిద్ధపడవలెను.

## పాఠము III

కుండలిని :

ఆత్మపదార్థమును యథాతథముగా అనుభవములోనికి తెచ్చుకొమ్ము. ఇంతకాలమును శరీరమునే ఆత్మయనుకొనుచున్నాము. మనము ఆత్మను శరీరమునుండి, ఇంద్రియములనుండి, మనస్సునుండి వివేకించవలెను. అప్పుడుమాత్రమే మనము అమృతత్వము పొందగలము. మార్పు కారణకార్యరూప ద్వంద్వమును బట్టి సంభవించునది. అందుచే మారునట్టిదెల్ల మర్త్యమేయగును. శరీరము ఈకారణమువల్ల అమర్త్యమగుటకు వీలులేదు. మనస్సు కూడ నంతే. రెండును నిరంతరము మార్పుపొందుచున్నవి గదా! కేవలము మార్పుపొందని పదార్థముమాత్రమే అమర్త్యమైనది. అది మార్పుచెందదు కాబట్టి దానిపైన ఏశక్తియు ప్రసరింపలేదు.

మన మా అమర్త్యమైన ఆత్మపదార్థముగా మారవలెనని కాదు. నిజమునకు మనస్వరూపమదే. కాని మనము పైనకప్పియున్న ఈ అజ్ఞానపు ముసుగును తొలగించుకొనవలెను. ఇది మన యథార్థస్వరూపమునకావరణముగానున్నది. శరీరమన్నది విషయరూపముగొన్న మనోవృత్తి. ఇడాపింగళాప్రవాహములు శరీరమునందలి మూలమూలలకు శక్తిని ప్రసరింపజేయును. ఉపయుక్తము కాగా మిగిలినశక్తి వెన్నుబద్దనున్న చక్రములయందు చేరుకొనియుండును.

ఈ ప్రవాహములు వశమందుండవు. ప్రాణవంతమైన శరీరమందే కన్పించును.

యోగికి ఒక వీలున్నది. అత డీ ప్రవాహములను చూడగలడు. అతని జీవితములోనవి తళతళ మెఱయును. చక్రములు కూడ నట్లే మెఱయును.

మనముచేయుపని కొంత తెలిసి, కొంత తెలియకకూడ చేయగలము. యోగి మఱొకరకమైన పనిచేయు శక్తిగలవాడు. అది

అతీంద్రియశక్తి. ఈ అతీంద్రియశక్తియే సర్వకాలసర్వావస్థలందు ఆధ్యాత్మికజ్ఞానమునకు మూలకందము. ఈ అతీంద్రియదర్శనములో పొరపాట్లుండవు. సహజమైన ప్రవృత్తికిని దీనికినిగల భేదమిది. ఆ సహజప్రవృత్తి యంత్రవతుగానుండునది. ఇదియో అతీంద్రియ మైనస్థితి. దీనిని సమాధియందురు. యోగులుమాత్ర మీశక్తి ప్రతి మనుష్యునిలోను నిగూఢమైయున్నదనియు, ఎవ్వరైనను దానిని మేల్కొలుపవచ్చుననియు నందురు.

ఈ ఇడా పింగళ ప్రవాహములయొక్క గతి నిరోధించి మేరుదండ మధ్యవ్యాపినియైన సుషుమ్నను దాటింప నాద్వారమున దీనిని ప్రవహింపజేయవలెను. సుషుమ్నారంధ్రమునందు నీ ఇడా, పింగళా ప్రవాహములను మనము ప్రవేశపెట్టగల్గినచో మనకు తాత్కాలికముగ ఈ శరీరమునుండి వేరుపాటుకల్గును.

మూలాధారమందలి చక్రము చాలాముఖ్యమైనది. అచట వీర్యశక్తియంతయు గూడుకట్టియుండును. అది త్రికోణాకారముగా నుండి దానినొక చిన్న సర్పము చుట్టుకొనియున్నట్లు యోగులు చెప్పుదురు. ఈపాము నిద్రపోవుచుండును. ఇదియే కుండలిని. దీనిని మేల్కొలుపుటయే రాజయోగ ధ్యేయము.

ఈగొప్ప వీర్యశక్తిని పాశవికప్రవృత్తి కనుమతింపనీయకుండ ఊర్ధ్వవ్యాపినిగాచేసి మేధస్సునకు పంపి అచ్చటనిలువచేసినచో నది ఓజస్సుగామారి గొప్ప ఆధ్యాత్మికశక్తిగా పరిణమించును. సత్సంకల్పము, ఈశ్వరసంకీర్తనము మొదలైనవి ఆవీర్యశక్తిని ఓజస్సుగా పరిణమింపజేసి మనకాధ్యాత్మికశక్తిగా ప్రసాదించును. అసలు మనుష్యుడనగా ఈ ఓజస్సే. అందుచే మనుష్య జంతువు లందే ఈ ఓజస్సు నిల్వయగుటకు వీలున్నది. ఎవనిలో జాంతవిక మైన ఈ వీర్యశక్తి ఓజోరూపముగా పరిణమించునో అతడు దేవు డగును. ఆధికారికముగా నతడుపదేష్టయగును. అతని బోధలు ప్రపంచమును పునరుజ్జీవింపజేయును.

ఈ సర్పము—కుండలిని—నెమ్మదినెమ్మదిగా అంతరువులవెంట సహస్రారమువఱకు ప్రాకినట్లు యోగిభావించును. పురుషుడుగాని స్త్రీగాని ఈ వీర్యశక్తి ఓజస్సుగా పరిణమింపజేసికొనగల్గినపుడే నిజముగా ఆధ్యాత్మికత్వము నందగలరు.

క్రొత్తశక్తి దేనిని నుత్పాదింపలేము. ఉన్నశక్తిని క్రొత్త పుంతలకు మళ్లింపవచ్చు. అందుచే మనచేతిలోనున్న ఉత్తమ శక్తులను మన ఇచ్ఛ నుపయోగించి మన అధీనములోనికి తెచ్చుకొని వానిని వట్టి పాశవికములుగా నుపయోగింపకుండ నాధ్యాత్మిక శక్తులుగ పరిణమింపజేయుటకు జాగ్రత్తపడవలెను. నీతికిగాని, ఆధ్యాత్మికతకుగాని పవిత్రజీవనమన్నది మూలస్తంభమని ఇందువల్ల మనకు తెలియుచున్నది. ప్రధానముగా రాజయోగములో మనోవాక్కాయములను త్రికరణములను పరిశుద్ధముగా నుంచవలెను. అవి పవిత్రముగా నుండవలెను. వివాహితులకు, బ్రహ్మచారులకు—ఈ విషయములో వ్యత్యాసము లేదు. పురుషుడు తన వీర్యశక్తులను వ్యర్థపుచ్చినచో నాధ్యాత్మికత సంపాదింపలేడు.

ప్రపంచములో సర్వకాలములందు విలసిల్లిన మహర్షులు, సిద్ధులు, నందఱు సన్న్యాసులు, బ్రహ్మచారులే అని ఇతిహాసములందు కన్పించుచున్నది. పవిత్రజీవనులు మాత్రమే పరమాత్మదర్శనము చేయగలరు.

ప్రాణాయామము చేయుటకుముందు మూలాధారమందలి త్రికోణాకృతియైన చక్రమును చూచుటకు ప్రారంభింపుము. కన్నులు మూసికొని ఆ రూపమును భావింపుము. దానిచుట్టు అగ్నులు మండుచున్నట్లు దానిమధ్య పాము చుట్టుకొని పరుండియున్నట్లు భావింపుము. ఆ కుండలిని నీవు స్పష్టముగా చూడగల్గిన తర్వాత అది మూలాధారములో నున్నట్లు భావింపుము. కుంభకముచేసినపుడు గాలిని ఆ సర్పముయొక్క నెత్తిమీాదికి వేగముగా పంపి దానిని లేపుటకు ప్రయత్నింపుము. ఇదంతయు

భావనయే. ఈ భావన ఎంత బలముగానున్న అంత త్వరగా ఫలితము కల్గును. కుండలిని మేల్కొనును. అది మేల్కొన్నదని భావించుము. ఇడా, పింగళా ప్రవాహమును సుషుమ్నా రంధ్రము లోనికి ప్రవేశపెట్టుటకు ప్రయత్నింపుము. ఈ ప్రయత్నము వాని ప్రవేశమునకు తోడ్పడును.

## పాఠము IV

మనము మనస్సును నిరోధించుటకుముందు దానిని పరీక్షింపవలెను. మనస్సు చంచలమైనది. దీనిని పట్టుకొని చలింపకుండ ఒకేభావమునందు నిలుపవలెను. ఇట్లు నిరంతరము చేయవలెను. ఇచ్ఛాశక్తివల్ల మనస్సును నిగ్రహించి ఈశ్వరునియందు నిలిపి యుంచగల్గుదుము.

మనస్సును నిగ్రహించుకొనుటకు మిక్కిలి తేలికయగు మార్గ మొకటున్నది. శాంతముగా కూర్చుండుము. మనసును దానియిష్టమువచ్చినట్లు కొంచెముసేపు పోనిమ్ము. "ఈ మనస్సు తిరుగుచుండగా దానిని చూచుచు నిల్చిన సాక్షిని నేను; ఈ మనస్సునుగాను" అని గాఢముగా భావింపుము. తర్వాత ఆ మనస్సు నీకంటె వేఱని భావించుచున్నట్లు, నీవు దానిని చూచు చున్న ట్లనుకొనుము. నీవు పరమాత్మ వనుకొమ్ము. శరీరము కాని మనస్సు కాని నీకంటె భిన్నములని భావింపుము.

మనస్సు నొక శాంతమైన సరస్సువలె నీయెదుట నున్నట్లు ఆ మనస్సులో నుదయించు వృత్తు లా సరస్సులో లేచుచు నడంగు చున్న బుడగలవంటివని భావింపుము. ఆ వృత్తులను నిరోధించుటకు ప్రయత్నింపకుము. వాని వ్యుత్పత్తి, విలీనముల నూరక సాక్షి భూతుడవై చూచుచుండు మంతే. ఇట్లు చేయగా క్రమముగా వృత్తులు అణగిపోవును. సరస్సులో ఒకరాయి విసరిన తరంగములుపుట్టి వానివల్లకూడ తరంగములుపుట్టి విశాలమగుచు పోవును. అందుచే నా మనస్తరంగముల నిరోధింపవలెనన్న

వానిలో నొక పెద్ద తరంగమును తీసికొని దానిని క్రమముగా సంకుచితపఱచుచు దానిని బిందుమాత్రముగ చేసి అచ్చట మన మనస్సునంతయు కేంద్రీకరించి నిలుపవలెను. "నేను మనస్సును కాను, మానసిక యోచనను గమనించుచున్నానన్న భావమునకు నేను సాక్షిభూతుడను." అనగా 'ఆలోచించుటను నేను చూచుచున్నాను, ఆ మనస్సు పనిచేయుచుండగా నేను చూచుచున్నాను' అని నిరంతరము భావింపుము. కాలక్రమమున అనుభవముతో గాని, మనోవృత్తులతో గాని నీకు అభేదభావము తగ్గిపోవును. తుదకు నీవు మనస్సుకంటె భిన్నుడవనియు, మనస్సు ఒక సాధన మాత్రమే యనియు, నీకంటె భిన్నమనియు నీవు గ్రహింపగలవు.

ఈ భిన్నత్వమును సాధించిన తర్వాత మనస్సు నీకు వశపడును. దానిని నీవు పరిచారకునివలె నీ యిష్టప్రకారము నిరోధింపవచ్చును. యోగి యగుటకు ఇంద్రియముల నతిక్రమింపగల్గుట మొదటిలక్షణము. మనస్సును జయించిన తర్వాత యోగి ఉచ్చస్థితి చెందినట్లని గ్రహింపనగును.

సాధ్యమైనంతవఱ కేకాంతమున నుండుము. ఈ పీఠము తగినంత ఎత్తుగా నుండవలెను. దానిపైన దర్భాసనము, దానిపైన మృగాజినము, దానిపైన పట్టుబట్ట, పీఠమున కానుదుబల్ల యుండనక్కఱలేదు. అది స్థిరమైనదిగా నుండవలెను.

వృత్తులు బొమ్మలవంటివి. అందుచేత మనము వానిని కల్పింపరాదు. మనము చేయవలసినదెల్ల మనస్సునుండి వృత్తులను తొలగించుటమాత్రమే. మనస్సును వృత్తిరహితముగా చేయవలెను. వృత్తి ఉదయించిన వెంటనే దానిని త్రోసివేయవలెను. ఈ ఫలితమును సాధించుటకు మనము విషయములను నిరసించి శరీరభావము నతిక్రమింపవలెను. ఈ ప్రయత్నమును చేయుటకు మాత్రమే మనుష్యజీవితము ఏర్పడినది.

ప్రతి ధ్వనికిని ఏదో యొక యర్థమున్నది. మనస్స్వభావములోనే శబ్దార్థములు రెండు సంబద్ధములై యున్నవి.

మన చరమలక్ష్యము పరమాత్మ. పరమాత్మ ధ్యానము చేయవలెను. మన మాయనను తెలిసికొనలేము. ఎందుచేత ? సర్వమునకు సాక్షిభూత మాత్మ. సర్వమును తెలిసికొనునది గాని తెలియబడునది గాదు. కాని మన మాత్మస్వరూపమే.

మనము పాపమును దర్శించుచో దానిని సృష్టించు చున్నామన్నమాట. మనము ఆవస్తువును చూచుటకుముందు మన మది కావలెను. అది మనమైనప్పుడే దానిని బైటచూతుము. ఎందుచేతననగా, లోక మాదర్శమువంటిది. మన మచ్చట చూచునది ప్రతిబింబము మాత్రమే. ఈ శరీరము మనము కల్పించుకొన్న చిన్న అద్దము. కాని మొత్తము విశ్వమంతయు మన శరీరమే. మన మెల్లప్పు డీభావన చేయుచుండవలెను. అప్పుడు మనము మరణింపమని, మఱియొకని చంపమని, ఏవస్తువు మనకంటె భిన్నము కాదని మనకు తెలియును. మనకు జనన మరణములు లేవు. మనము చేయవలసినదెల్ల సర్వమునందును ప్రీతిభావము గలిగియుండుటయే.

"ఈ సర్వవిశ్వము నాశరీరము. ఈవిశ్వమునందున్న సుఖ సంతోషములన్ని, ఉత్సాహమంతయు, నారోగ్యమంతయు నాదే, నేనే ఈ విశ్వము"నని భావింపుము. తుదకు ఈ విశ్వమునందు ప్రతిఫలించుచున్న క్రియయంతయు మననుండియే ఉత్పన్నమగు చున్నదని మన మెఱుగుదుము.

మనము పరమాత్మయన్న సముద్రమునందు లేచుచున్న చిన్నిచిన్ని కెరటములవంటి వారమేయైనను మనకాధారభూతముగా నున్నది సముద్రమే. ఆ మహాసముద్రమునకు మనము భిన్నముగా లేము. ఏ కెరటమును దానికి భిన్నముగా నిలువలేదు.

చక్కగా నుపయోగించినచో భావనమనకు మంచి ఉప కారముచేయును. అది బుద్ధిని దాటి మనలను వలసినచోటికి కొనిపోవు వెలుగు.

ఆత్మానుభూతి మనలోనేయున్నది. దానిని సాధించుటకు మనచేతిలో నున్న ఉత్తమశక్తుల నుపయోగింపవలెను.

## పాఠము V

### ప్రత్యాహారము, ధారణ :

"మార్గములు భిన్నములైనను నన్ను కోరువారు నన్ను చేరుదురు. అందఱు నన్నుపొందితీరవలె" నని శ్రీకృష్ణపరమాత్మ చెప్పెను. ప్రత్యాహారమనగా బహుముఖముల ప్రవహించు మనస్సును మళ్ళించి ఏకాగ్రమునుచేయుట. అట్లుచేసి ఏకవిషయము నందు నిల్పుట. మనస్సును దాని యిష్టమువచ్చినట్లు పోనిచ్చుట తొలియడుగు. ఆమనస్సు నూరకచూచుచుందుము. అది ఏమాలోచించునో చూదుము. మనస్సు ఆత్మకాదు, జీవుడును కాదు. అది సూక్ష్మభూతముల సమాహారమువల్ల నేర్పడినది. అది మన చేతిలోని సాధనము. నాడీశక్తులవల్ల మనము దాని నెట్లుపయోగింపవలెనో తెలిసికొనవచ్చును.

స్థూలశరీరము ఆమనస్సుయొక్క వైషయిక రూపము. సాధకుడు స్థూలసూక్ష్మశరీరములకంటె వేఱైనవాడు. శాశ్వతము, అవికారము, సాక్షిభూతమునైన ఆత్మస్వరూపులముమనము. శరీర మన్నది భౌతికాకారముగొన్న మనస్సు. ఎడమముక్కుగుండా గాలియాడుచున్నప్పుడది విశ్రాంతికాలము. కుడిముక్కుగుండా నాడుచున్నపుడు పనిచేయుకాలము. రెండు ముక్కులగుండా నాడుచున్నపుడు ధ్యానముచేయు కాలము. మనము శాంతముగా రెండు ముక్కులతోను గాలిపీల్చుచున్నపుడు ప్రశాంతముగా ధ్యానము చేసికొనుట కనువగుస్థితిలో ఉన్నామని గ్రహింపనగును. మొట్ట మొదటగానే చిత్తమును కేంద్రీకరించుటకు ప్రయత్నించుట వల్ల లాభములేదు. వృత్తినిరోధము దానియంతటనదియే సంభవించును.

బొటనవ్రేలితో, తర్జనితో రెండుముక్కులను మూయుట వల్ల ప్రాణాయామము కొంతకాలమభ్యసించిన తర్వాత వ్రేళ్ళుప యోగింపకుండగనే భావనవల్లనే మనకు వలసినట్లు నాసారంధ్ర మును మూయుట, తెఱచుట సుసాధ్యమగును.

ఈస్థితి వచ్చినతర్వాత ప్రాణాయామములో కొంచెము మార్పు చేయవలెను. సాధకునకు ఓంకారముకంటె ఇష్టమైన నామమున్నచో పూరక రేచకములందు ఓంకారముబదులు దాని నుపయోగింపవలెను. కుంభకమునందుమాత్రము - హూం - అని ధ్యానింపవలెను.

కుంభించిన వాయువును ప్రతి యుచ్చారణయందును కుండలిని తలపైన నదుమవలెను. ఆ యదుముట ఆ కుండలిని మేల్కొలుపుచున్నట్లు భావింపవలెను. పరమాత్మతో లేక ఈశ్వరునితో నీవు అభిన్నుడ నని భావింపుము. కొంచెముసేపైన తర్వాత సాధారణ పరిస్థితిలో ఎవరో మనుష్యుడు వచ్చినట్లు మన మెంత చక్కగా గమనింతుమో, ఏవో ఆలోచనలు రానున్నట్లు అవి ఎట్లు మొదలుపెట్టునో, ఏ స్వరూపమున నుండునో మనకు చక్కగా తెలియును. మనము మన మనస్సులకంటె భిన్నులమని మనకంటె ఈ వృత్తులు వేఱు, మనము వేఱని వివే కించుట మనకు బాగుగా చేతనైనపు డీస్థితి సంభవించును. ఈ వృత్తులచేతిలో నీవు చిక్కరాదు. నీవు వానికంటె భిన్నుడవుగా నిల్చుండుము. వానియంతట నవియే ఆగిపోవును.

ఈ పవిత్రములైన వృత్తుల ననుసరింపుము. వానితో కొంత దూరము నడువుము. అవి అణగిపోయిన తర్వాత నీ పూతగొన్నది సర్వశక్తిమైన ఈశ్వరునియందని గ్రహింతువు. ఇదే అతీంద్రియ స్థితి. వృత్తి అణగినప్పు డావృత్తి ననుసరించి నీవును దాని ననుసరించి లయించిపొమ్ము.

కాంతిపరివేషము లంతర్జ్యోతియొక్క చిహ్నములు. అవి యోగులకు కన్పించును. ఒక్కొక్కప్పుడు మనకు ఒకముఖము

వలె దానిచుట్టు జ్వాలలు వ్యాపించియున్నట్లు కన్పింపవచ్చును. ఆ జ్వాలలందు కన్పించిన ముఖమునకు సంబంధించిన మనుష్యుని శీలమును, ఎట్టి పొరపాటును లేకుండ మనము నిశ్చయింపవచ్చు. ఒక్కొక్కప్పుడు మనయిష్టదైవము కన్పింపవచ్చు. ఈ ఇష్టదైవముపై మన మనస్సును లగ్నముచేయవచ్చును. మనము తక్కిన ఇంద్రియములతోడను విషయపరిజ్ఞానము పొందుచున్నను కన్నులతోనే ఎక్కువ పొందుదుము. ఈ విషయజ్ఞానమును పరిపూర్ణముగా భౌతికము కాను. సగము మాత్రమే భౌతికము. మనము కల్పనలేకుండ భావింపలేము. కాని జంతువులును భాషాసాహాయ్యము లేకుండనే విషయజ్ఞానము నందుచున్నట్లు కన్పించుచుండుటచే వృత్తికిని విషయములకును విడదీయరాని సంబంధమున్నదని మనము చెప్పజాలము.

యోగమునందు భావన పరిశుద్ధముగను, పవిత్రముగనుంచుకొనవలెను. మనకున్న భావనాశక్తి మనుష్యునిబట్టి భేదించును. ఎవరి కేది స్వాభావికమో ఆ పద్ధతి ననుసరించుట జన్మాంతరకర్మపరిపాకమువల్ల ఈ జన్మయందు మన మిట్లున్నాము. బౌద్ధు లిట్లు చెప్పుదురు: ఒకదీపమునుండి మఱొకటి వెల్గింపబడును. దీపము వేఱైనను వెల్గొకటే.

సంతుష్టుడవుగ నుండుము. ధైర్యశాలిగ నుండుము. స్నానము ప్రతిదినము చేయుము. సహనము, శౌచము, శ్రద్ధ కల్గియుండుము. అప్పుడు నీవు నిజమైన యోగి కాగల్గుదువు. త్వరపడకుము. నీకు ఏవైన సిద్ధులు కల్గినచో అవి రాజమార్గములు కావనియు ప్రక్కత్రోవలనియు గ్రహింపుము. రాజమార్గమునుండి ని న్నది ఆకర్షింపకుండ చూచుకొమ్ము. వానిని నిరసించి నీ లక్ష్యమైన ఆత్మనే గట్టిగాపట్టుకొమ్ము. శాశ్వతమైన సత్పదార్థముకై విచయనము కొనసాగింపుము. సత్పదార్థలాభమువల్లనే చిత్తవిశ్రాంతి లభించును. నిర్వాణము లభించును. సర్వము

అధీనమగును. అప్పుడు మఱొకదానికై యత్నింప నక్కఱ యుండదు. మనకు పునరావృత్తిరహితమైన శాశ్వతముక్తి, సంపూర్ణత్వము, సచ్చిదానందస్వభావము కల్గును.

## పాఠము VI

సుషుమ్న :

సుషుమ్నను ధ్యానించుట చాల యుపయోగకరము. నీకు సుషుమ్నదర్శనము కలుగవచ్చును. కల్గినప్పుడు దీర్ఘముగా సుషుమ్నాధ్యానముచేయుము. ఈ సుషుమ్న చాల సుకుమారమైన తేజోవంతమైన దారము వంటిది. మేరుదండమునందు వ్యాపించియున్న ద్వార మిది. కుండలినిశక్తి ఈ మార్గముగుండా సహస్రారమునకు పోవుట ముక్తి.

యోగికభాషలో సుషుమ్నయొక్క రెండు చివరలు రెండు పద్మములందున్నట్లు చెప్పబడినవి. క్రిందిపద్మము మూలాధారమందలిది. పై పద్మము సహస్రారమందలిది. ఈ రెంటిమధ్య మఱి నాల్గు పద్మము లున్నవి. 6. సహస్రారము, 5. ఆజ్ఞాచక్రము (భ్రూమధ్యగతము), 4. విశుద్ధచక్రము (కంఠమూలస్థము), 3. అనాహతము (హృదయస్థము), 2. మణిపూరము (నాభిస్థానము), 1. స్వాధిష్ఠానము (మూలాధారస్థానము). మనము కుండలిని మేల్కొల్పవలెను. క్రమముగా దాని నొక పద్మము నుండి మఱొక పద్మమునకు చేర్చుచు సహస్రారమునకు కొంపోవలెను. ఈ షట్చక్రములును మనస్సులోని ఆఱు పొరలతో సరిపోయి యుండును.



# డాక్టరు పాలు డ్యూసేన్*

## (దేవసేనుడు)

ఇతడొక జర్మను మతగురువుయొక్క కుమారుడు. ఆ మత గురువు అంత సంపన్నుడుగాడు. ఆయన కెనమండుగురు బిడ్డలు. వారిలో డా॥ పాల్ డ్యూసేన్ ఒకడు. ఆదినములలో యూరపు దేశమునందు సంస్కృతభాష సంస్కృత సాహిత్యము చాల క్రొత్తగానుండెడివి. సుమారు పదిసంవత్సరముల క్రితము ఒక నాడు ప్రొఫెసరు లాసన్ సంస్కృతభాషా సాహిత్యములపై నుపన్యసించుచుండెను. ఆ ఉపన్యాసములు రుసుమీయనక్కఱ లేకుండ ప్రతివారును వినవచ్చును. ఇప్పటికి గూడ ఐరోపా విశ్వ విద్యాలయములయందు సంస్కృతము నేర్పుట వృత్తిగా బెట్టుకొని జీవించుట యసంభవము. ఆ విశ్వవిద్యాలయములు కొంత సహా యముచేసిననే అట్లు సాధ్యమగును.

లాసన్ జర్మనీదేశమందు సంస్కృతభాషా వ్యాసంగమును వ్యాపింపచేసిన మహాత్ములలో చివరివాడు. వారు నిజముగ మహాత్ములు. ఆరోజులలో నిస్స్వార్థమైన జ్ఞానాపేక్ష తప్ప భార తీయ సారస్వతమునందు జర్మను పండితులకు వేరు ప్రయోజన మేమున్నది? లాసన్ పండితుడు శాకుంతలనాటకమునందు ఒక అంకము వ్యాఖ్యానించుచుండెను. పాల్ డ్యూసే నపుడు విద్యార్థి. లాసన్ ఉపన్యాసమును వినుటకై వచ్చెను. అక్కడ చేరిన వారిలో ఇతనికంటె మిక్కిలి శ్రద్ధగా వినుచున్నవాడు మరియొకడు లేడు. వ్యాఖ్యాతమగుచున్న విషయము రమణీయమైనది. విచిత్ర మైనది. అంతకంటె ఆ భాష, ఆధ్వనులు, ఇంకను రమణీయముగా నున్నవి. విచిత్రముగా నున్నవి. అలవాటులేని పాశ్చాత్యుల ముఖ

---

* 1896 లో "బ్రహ్మవాదిన్" పత్రికలో ప్రకటింపబడినది.

యంత్రములందు సంస్కృత హల్సముదాయము బహువిచిత్రమైన మార్పులు పొందుచుండును. లాసేను ఉచ్చారణమునందు సంస్కృతభాష అపరిపుష్టముగానున్నను దాని మాధుర్యము పాల్ డ్యూసేనుని విచిత్రముగా నాకర్షించినది. ఉపన్యాసమైపోయిన తర్వాత అతడు ఇంటికి తిరిగివెళ్ళెను. లాసేను చెప్పిన విషయములు అతనికి నిద్రలోగూడ మనసులో తిరుగుచుండెను. ఇంతవఱకు అతడెఱుగని దేశముయొక్క దృశ్యము అతని కనులముందు కన్పించెను. వర్ణసమీకరణమునందు అంతవఱకు అతడు దర్శించిన ఇతరదేశములకంటె అతని కన్నులయందు ఈదేశముయొక్క సౌందర్యము సర్వాతిశయముగా నున్నది. అతని చేతగుండె అతని ఉన్నతాత్మ అంతకుపూర్వ మెఱుగని అద్భుతాకర్షణపొందెను.

ఆతనిబుద్ధి వికసించి అతని చదువు పూర్తియై గౌరవనీయమైన, కీర్తికరమైన పెద్ద వేతనముగల యుద్యోగమున ఆతడు ప్రవేశించునని అతని స్నేహితు లనుకొనుచుండిరి. కాని ఇప్పుడే సంస్కృతము వచ్చి పడ్డది. అప్పటికి పాశ్చాత్యవిద్వాంసులలో అధికభాగము ఈ భాషను గుఱించి వినియైన నుండలేదు. మఱి ఆ భాషావ్యాసంగమువల్ల లౌకికప్రయోజనము ఇప్పుడుకూడ దుర్లభమైనదియని పైనచెప్పనే చెప్పితిని. కాని అతనికి సంస్కృతము నేర్చుకొనుటయందు ప్రగాఢమైన యభిలాష యుండెను.

ఆధునికులమైన మనకు ఇట్టి విజ్ఞానతృష్ణ అర్థముగాదు. ఈ కాలమునగూడ వారణాశి, నవద్వీపములవంటి ప్రదేశములందు పురాతనసంప్రదాయ ప్రకారము కేవలము జ్ఞానార్జనమే తమ విధి యని సంప్రదాయసిద్ధముగా చదువుకొన్న పండితులు, సన్న్యాసులు కలరు. వీరికి పాశ్చాత్యవ్యామోహితులకున్న ఆధునికవిద్యార్థుల విలాసపూరితమైన వాతావరణము గాని తగిన సాధనసంపత్తి గాని ఒకసహస్రాంశముగూడ లేదు. వారు తాటియాకుల వ్రాతప్రతులతో గ్రుడ్డిదీపముల ముందర బహు

రాత్రములు చదువుచుందురు. ఇట్టి గ్రుడ్డిదీపములముందు చదువుట వలన మఱి ఏ దేశపు మనుష్యునకైనను కండ్లు పోవును. ఒక ప్రసిద్ధ పండితునికొఱకు ఒక తాళపత్రగ్రంథముకొఱకు వారు వందల కొలది మైళ్లు నడచిపోవుదురు. తల తెల్లగా నెరసిపోవునంతవఱకు జరాభారముచే శరీరము ముడుతలుపడి, వణకు పుట్టునంతవఱకు తమ శారీరక మానసిక శక్తులన్నింటిని విద్యాసముపార్జనయందే వెచ్చబెట్టుదు రీ మహానుభావులు. దైవానుగ్రహమువల్ల మన దేశమునందు ఇట్టి మహామహులు అపురూపముగా నచ్చట నచ్చట నున్నారు. ఈనాడు భారత దేశమునకు గర్వకారణమైన ఈ విజ్ఞానధనము పూర్వకాలమందు ఇట్టి నిస్స్వార్థులైన మహా పండితుల కష్టఫలము. ఈ చెప్పిన మాటలో నున్న యాథార్థ్యము భారత దేశమునందు గల సాంప్రదాయికపద్ధతిలో చదువు కొన్నవారి పాండిత్యముయొక్క లోతును, గట్టితనమును, స్వార్థ రాహిత్యము, శ్రద్ధాపరత్వమును ఈనాటి విశ్వవిద్యాలయములోని విద్యార్థుల వ్యాసంగముతో పోల్చిచూచిన అవగతమగును. మన దేశీయులు తక్కినజాతులతో వారి ప్రతిభావంతమైన పురాతన చరిత్రకు తగిన స్థానమును సంపాదించుకొనవలెనన్నచో నిజమైన పాండిత్యముకొఱకు నిస్స్వార్థమైన, పరిశుద్ధమైన తృష్ణ, నిష్కపటమైన, శ్రద్ధాయుతమైన బుద్ధి మరల ప్రాధ్యానము వహింపవలెను. ఇట్టి విజ్ఞానతృష్ణయే జర్మనీదేశమును ఇట్టి స్థితికి తీసికొని వచ్చినది. ఈనాడు జర్మనీదేశము అగ్రదేశము లన్నింటిలో నొక్కటిగా గణింపబడుచున్నది.

ఈ జర్మను విద్యార్థుల హృదయములలో సంస్కృతము నేర్చుకొనవలెనను నభిలాష మిక్కిలి గాఢముగా నున్నది. ఇది చాల కష్టమైనది. ఈ జర్మను విద్యార్థిగూడ సంస్కృతము నేర్చుకొనుటలో బహుకష్టము లనుభవించెను. మిక్కిలి కఠినముగా పనిచేసెను. చిట్టచివరకు అప్రతిహతమైన శక్తితో ఈ కష్టములను గడచి కృతార్థుడు కాగలిగినాడు. ఇప్పు డీతడు పాశ్చాత్య దేశ

ములలోనేగాదు భారతదేశములోగూడ ప్రసిద్ధుడు. కీలు విశ్వ విద్యాలయములో నాచార్యుడు. యూరపునందును, అమెరికా యందును సంస్కృత విద్వాంసులను నేను చూచితిని. వారిలో కొంతమంది భారతీయ వేదాంతమును గురించి సరసమైన దృష్టి గలవారే. వారియొక్క నిస్స్వార్థమైన పనిని వారి బుద్ధిబలమును నేను మెచ్చుకొందును. కాని పాల్‌డ్యూసేన్ (తన్ను దేవసేను డని పిలుచుకొనుటకు ఈత డెక్కువ ఇచ్చగించును). మాక్సు ముల్లరు పండితుడు—వీరిద్దరు భారతదేశముయొక్కయు, భారతీయ శాస్త్రములయొక్కయు నిజమైన స్నేహితులని నాకు తోచినది. పాల్ దేవసేనుడు, అతనిభార్య, అతనికుమార్తె వీరు ముగ్గురు హిందూదేశమంతటను పర్యటనచేసిరి. వీరితో జర్మనీ, హాలండు దేశములగుండా లండనుకు నేను కలసి ప్రయాణము చేసితిని. ఈ ప్రయాణములందు లండనులోను, బయటను వారితో నేను కలసికొన్న సందర్భములు నాకు నా జీవితమందు ఆనందదాయక ఘట్టములు.

పాశ్చాత్యదేశములందు తొలుతగా సంస్కృతము చదివిన వారు సంస్కృతమును ఊహాపోహలతో వ్యాసంగము జేసిరి గాని విమర్శనాశక్తితో గాదు. వారికి తెలిసిన కొంచెముతో వారుచేసిన హంగామాకు మితిలేదు. ఆ రోజులలో భారతీయతత్త్వశాస్త్రము లందు 'శాకుంతల' నాటకము మహోత్కృష్టగ్రంథ మను నభిప్రా యము నిండియున్నదన్నచో వారి వ్యాసంగ మెట్లుండెనో మనము వేరుగా చెప్పనక్కఱలేదు. ఇట్టి సంస్కృతవిద్వాంసుల వెనువెంట కొంతమంది విమర్శకమన్యులు, అపండితులు, సంస్కృతమన నేమియో ఎరుగనివారు, సంస్కృతమునందు ఏమియు లేదని ప్రాచ్యమైన నేవిషయమైనను వెక్కిరించువారు బయలుదేరిరి. అప్పటి సంస్కృతపండితులకు, భారతీయమైనచో చాలు. అది గులాబి, కస్తూరి. ఆ విమర్శకమన్యులకో వట్టి చెత్త. ఈపండితులు, విమర్శకులు, వారి వాదములను అచ్చటి సభ్యుల కుపన్యసించు

చుండెడివారు. ఆ సభ్యులకు సంస్కృతము అక్షరముముక్క రాదు. ఇట్టి పాండిత్యమువల్ల వచ్చు ఫలితము వట్టి గందరగోళముతప్ప మఱేమియు లేదు. వీరు భారతదేశమునకు చెప్పినదేమనగా, "మీకు సొంతమైనదేదియు లేదు. మీ కళలన్నియు ఫలానాజాతి నుంచి ఎఱువు తెచ్చుకొన్నవి. మీ శిల్పము ఫలానాజాతినుంచి ఎఱువు తెచ్చుకొన్నది. మీ ప్రాచీనశాస్త్రములుగూడ ఎఱువు తెచ్చుకొన్నవే. మీ మతముగూడ మీరు దిగుమతిచేసికొన్నదే" అని ఈ విధమైన పరిశోధన ఒకరి కాళ్లు ఒకరు త్రొక్కుకున్నట్లు సాగినది. కొంతకాలమునకు అంతకంటె కొంచెము పరిస్థితి మెరుగైనది. ఇప్పుడు సత్యమైన, పరిపక్వమైన పాండిత్యము లేనిదే వట్టి సాహసమువల్ల ఎవరైనను హాస్యాస్పదులగుటతప్ప ఫలితము లేదనియు, భారతీయ సాంప్రదాయములను ద్వేషభావముతో నిరసించుట తగదనియు, ఇతరులనుకొన్నదానికంటె భారతీయ సంప్రదాయములందు అధికగుణములు కలవనియు పాశ్చాత్యదేశములందు ఇప్పుడిప్పుడే గమనింపబడుచున్నది.

ఇప్పుడు యూరపునందు ఒక క్రొత్తతరహా సంస్కృత పండితులు. సంస్కృతమునై [illegible] దేరిరి. వారు ఉదారులు గావున పూజనీయులు. వారు పండితులు కావున సానుభూతిపరులు. ఈ క్రొత్తతరహా పండితులకు, తత్పూర్వులకు మధ్యమువంటివాడు మన మాక్సుముల్లరు. పాశ్చాత్యపండితులలో ఈ మాక్సుముల్లరునకును భారతీయులైన మనము చాల ఋణపడియుంటిమి. వారు పిన్నవయస్సున మొదలు పెట్టిన ఒక మహాకార్యమును బహువృద్ధులైన తరువాత ముగించినారని విన్నప్పుడు నేను మిక్కిలి ఆశ్చర్యపడితిని. ఈ మహాకార్యనిర్వహణమునందు ఆయనకు సాహాయ్యమేమియు లేదు. భారతీయపండితులకుకూడ చదువరాని తాళపత్రగ్రంథములు భారతదేశములోగూడ చదువుటకు జీవితకాలమంతయు పట్టును. పోని, ఏ పేదపండితుని సాహాయ్యమైనను ఈయనకు లేదు.

(అమెరికాదేశస్థులు మనపండితులనుగూర్చి ఇట్లు చెప్పిరి: "నెలకు పది షిల్లింగు లిచ్చియో లేక తాను ప్రకటించు మిక్కిలి నూతన పరిశోధనముల పుస్తకముయొక్క పీఠికలో అతనిపేరు ప్రస్తావించియో ఒక భారతీయపండితునిచేత పనిచేయింపవచ్చును.") అట్టి పరిస్థితిలో ఈ మాక్సుముల్లరు రోజుల తరబడి, నెలల తరబడి, సాయనభాష్యములోని ఒకమాటయొక్క లేక వాక్యముయొక్క అర్థమును వివరించుటకు పనిచేసెడివాడు. ఈ సంగతి అతడే నాతో చెప్పెను. చిట్టచివర కతడు ఈ వైదికసాహిత్యమహారణ్యము నందు సుఖప్రచారయోగ్య మగు రాచబాట నిర్మాణము గావింపగల్గినాడు. ఈ పాశ్చాత్యుడు చేసిన ఈ మహాకార్యమును గుఱించి కొంచెము ఆలోచింపుడు. అతడు మన కెంత ఉపకారియో తెలియును. అతడు వ్రాసిన బహువిషయములతో, చేసిన బహువ్యాఖ్యానములతో మన మేకీభవింపక పోవచ్చును. అట్లేకీభవించుట నిజముగా నసంభవము. ఏకీభావమున్నను, లేకపోయినను మనలో ఎవ్వరమైనను చేయుటకు స్వప్నమందుకూడ ఊహింపలేని ఈ మహాకార్యము మా తాత తండ్రులయొక్క [illegible] రక్షించి [illegible] వ్యాఖ్యాపింపచేయుటకును అతడు ఒంటరిగా లక్ష్య చేసెను. ఇదియంతయు అతడు భక్తిప్రపత్తులతో, నిండియున్న హృదయముతో చేసిన పని గాని వట్టి స్వార్థముతో చేసినది గాదు.

మాక్సుముల్లరు ఈ నూతనోద్యమమునకు తొల్లింటినాయకుడైనచో డ్యూసేను ఆ యుద్యమముయొక్క అభివృద్ధిదశలోనివాడు. మనవేదములందున్న ఆధ్యాత్మికసిద్ధాంతరత్నములు, భాషాశాస్త్రవిషయికపరిశోధనలో మరుగుపడిపోయినవి. మాక్సుముల్లరు ఆ రత్నములను కొన్నింటిని పైకితెచ్చి పదిమందికి చూపించినాడు. అతడు భాషాశాస్త్రవేత్తలలో అగ్రగణ్యుడగుటచేత ఆ రోజులలో ఈ సత్యములవంకకు ఇతరుల దృష్టి నాకర్షింపగల్గెను. డ్యూసేనునకు ఆ భాషాశాస్త్రసంబంధమైన పిచ్చి లేదు.

అతడు ప్రాచీన గ్రీకు, అధునాతన జర్మనీ వేదాంతములందు విశిష్టమైన పండితుడు. అతడు ఔపనిషధికసిద్ధాంతములందు మునిగి వాని యాథార్థ్యమును గమనించి లోకమునకు చాటినాడు. వేదాంతమును గూర్చి తమ యభిప్రాయమును స్వతంత్రముగా చెప్పగల్గినవారిలో డ్యూసేను అగ్రగణ్యుడు. ఇతర పండితులు ఏమనుకొందురో యను సంగతి అతడు గణింపలేదు. అతడు దర్శించిన యాథార్థ్యమును స్పష్టముగా చెప్పగల్గిన ధీరుడు. సత్యమును గూర్చి అంత ధైర్యముగా చెప్పగల ధీరులు మనకు నేడు కావలయును. ఇట్టివారు ఇప్పుడు పాశ్చాత్యదేశములందు ఎక్కువ అవసరము. ఎందుచేతననగా, అక్కడ సంఘభయము చేత, ఇతరకారణములచేత పండితులు తాము నమ్మని సాంప్రదాయముల గూర్చి, ఆచారములను గూర్చి ఖండితముగా చెప్పలేని స్థితిలో నున్నారు. అందుచేత మాక్సుముల్లరు, డ్యూసేను మొదలైన ధీరులయొక్క సత్యపరత్వము, మనలో నున్న దోషములను తరువాతి కాలమున మన శాస్త్రపద్ధతులందు కలిగిన పతనములు, అవి మన సంఘమునకు సమన్వయపఱచుకొనుటలో జరిగిన దోషములు వారు నిశితముగా వర్ణించిరి. ఇప్పుడు ఇటువంటి నిష్కపటులైన స్నేహితులు మనకు చాల అవసరమై యున్నారు. మనదేశములో ఒకప్రక్క ప్రతి మూఢాచారము శాస్త్రీయమని నమ్ము ఛాందసులు, మఱియొకప్రక్క మన చరిత్రము, మన మతము మొదలైనవన్నియు గుణరహితములని, పనికిమాలిన చెత్త యని, వానినన్నింటిని మనసంఘమును, మన వేదాంతమును, ఈ సాంప్రదాయములను నాశనముచేయవలెనని తెలుపు పరమనాస్తికులును కలరు. ఈ పరిస్థితిలో ఇట్టిస్నేహితుల అవసర మెంతేని మనకు కలదు.



# మాక్సుముల్లర్ మహాశయుడు

[బ్రహ్మవాదిని - లండన్ పత్రికకు పంపబడిన స్వామిరచన 1896 జూన్. 6]

మన ''బ్రహ్మవాదిని'' యాశయము సర్వదా ''కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన''. (నీకు కర్మాధికారమేకలదు, కాని ఫలములందు లేదు.) అయినను ఒక కర్మవీరుడు ఒరులదృష్టి నాకర్షింపక, వెలుగును వెలార్పింపక తన క్రియాక్షేత్రమునుండి కదలి పోలేదు.

మన ప్రారంభదశ యత్యద్భుతము. మనసోదరులు ప్రదర్శించిన మనఃపూర్వకమైన యాత్మసర్వాదులు ప్రశంస కతీతములు. దృఢసంకల్పము, పరిశుద్ధమైన తృష్ణ — వీనికి మంచి కాలమువచ్చును. ఇట్టివారు కొలదిమందియైనను విఘ్నముల నెట్టించి జయమునందితీరగలరు.

కొందఱు కపటసిద్ధులుందురు. వారికి దూరముగనుండుట మంచిది. కొన్నిసిద్ధులు లేవనరాదు. అవి యసాధ్యములుగావు. కాని సుహృద్వరులారా! ఈ భౌతిక ప్రపంచమున నూటికి తొంబదిపాళ్ళ సిద్ధుల వెనుక నున్నది కామమో ధనమో లేక కీర్తివాంఛయో! మిగిలినపదింట తొమ్మిదిమంది వైద్యుల జాగరూకత నభిలషించువారుగాని తత్త్వవేత్తల జాగ్రత్తలను గోరువారుకారు.

ప్రప్రథమముగ సాధించతగిన మహావిషయము పరిశుద్ధమైన శీలము, ప్రతిష్ఠితప్రజ్ఞ. ఇది సర్వులకు వర్తించును. అధైర్యపడవలదు. ఎందుకగా ప్రతినూత్నవిషయమును తొల్తటిదశలో సందేహించుట లోకసహజము. అది ముక్తిమార్గమైననుసరే, దానిని లోకము శంకించును. అది దానినైజము కాబట్టి. ఈ విషయము

సర్వదా తప్పనిది. పాప మీ పిచ్చిలోక మెన్నిసార్లు వంచింప బడినది. నశ్వరమైన యీ భౌతికజీవితదృష్టి విజృంభమాణమగు ప్రతి వినూత్న విషయమునందును తన సందేహాస్పదములైన దృక్కు లనే వెదజల్లును. కొంత వ్యతిరేకమును సైతమును ప్రదర్శించును. ఈ మన ప్రయత్నమునందేమేని సత్యమున్నచో నది సర్వదా విస్తరింపదగినది. లోకమున కదేమైన వెల్గుబాట చూపగల్గినచో నింద, స్తుతిగ మారును. ఈర్ష్య ప్రేమగమారును. ఆధునిక ప్రపంచము సామాన్యముగ రాజకీయ, సాంఘికాది విషయ ప్రయోజనముల నర్థించి మతము నొక సాధనముగ గ్రహించు చున్నది. దీనినుండి జాగ్రత్తపడవలెను. మతము దేనికిని సాధ నముగాదు. దానికదియే లక్ష్యము. సత్యముకాని ప్రపంచసుఖ స్థితి కుపకరణమైన మతము మతముకాదు. అదింకేదియైనను — భగవదపచారము. మనుష్యజాతికే ద్రోహము. ఇంద్రియగ్రామ తృప్తికంటె వేఱేమియు లేదనుటకంటె మనుష్యజాతికి చేయు ద్రోహ మింకేమియున్నది ?

సత్యము, పవిత్రత, నిస్వార్థపరత్వము — ఈ సద్గుణపుంజ మెచ్చట విలసిల్లునో వానిని గల్గియున్న వానిని నాశనముచేయు టకు సమర్థమైనశక్తి సృష్టిలో నెచ్చటనులేదు. ఈ సద్గుణములచే విశిష్టుడైన వ్యక్తియొక్కడే సమస్తవిశ్వము ప్రతిఘటించినను దాని నెదుర్కొనగలడు.

అన్నిటికంటెను "పొత్తు"ను గుఱించి జాగ్రత్తపడవలెను. అనగా నీవు ప్రతిమనుష్యునకు విరోధిగనుండుమనుటకాదు నా యుద్దేశ్యము. నీ యభిప్రాయములు సుఖదుఃఖములందు జెదు రక, సమానముగనుండవలెను గాని యనుయాయులు లభింతు రన్న యాసతో నీ యభిప్రాయములను వినిమయము చేసికొని పొత్తభిలషించుట పరిహరింపదగినది. నీయాత్మయే సకలప్రపంచ

మున కాధారభూతము. కాగా దేని యాశ్రయమును నీవాశించుట? ప్రశాంతముగ, గంభీరముగ, దృఢముగ, ప్రేమతో వేచియుండుము. సహాయమిప్పుడు లేనిచో సకాలమునకు లభించును. తొందరపడుట యెందులకు? ప్రతి మహాకార్యముయొక్క నిజమైన కార్యాచరణ శక్తి తత్ప్రారంభములందే యుండును. దాని నొకరెఱుగలేక పోవచ్చును.

వంగదేశమునందొక కుగ్రామమునందు పరమదరిద్రులైన బ్రాహ్మణదంపతులకు జనించిన యొక శిశువుచరిత్ర, బోధలు ఖండఖండాంతరములకు ప్రాకునని యెవరు కలగనిరి? ఎవరూహించిరి? నేను భగవాన్ రామకృష్ణునిగుఱించి ప్రస్తావించుచున్నాను. మీరు మాక్సుముల్లరుపండితు నెఱుగుదురా? అతడు "నైన్టీన్త్ సెంచరీ" "పందొమ్మిదవ శతాబ్దము" అను పత్రికలో పరమహంసనుగుఱించి వ్రాసినాడు. తగినసాధనములున్నచో శ్రీరామకృష్ణునిగూర్చి యాతనిబోధలనుగూర్చి విపులముగ వ్రాయుట కాతడుబలాటపడుచుండెను. మాక్సుముల్లరెంత యసాధారణవ్యక్తి! కొన్నాళ్ళక్రిందట నేనాయనను దర్శించియుంటిని. అతడెవరైననేమి? శ్రీరామకృష్ణపరమహంసను ప్రేమించినవాడు. ఆతని యెడల నాకున్న గారవమును వ్యక్తమొనర్చుటకై వెళ్ళినాను. ఆతనిజాతిమతము లేవైననేమి. ఆతనిని దర్శించుటయన్న దొక తీర్థయాత్రగ భావించితిని.

"మద్భక్తానాంచ యేభక్తాస్తే మేభక్తతమామతాః"— నా భక్తులను సేవించువారు నాకు పరమభక్తులు. అన్నది సత్యము కాదా?

బ్రహ్మసమాజనాయకరత్నమైన కీ. శే. కేశవచంద్రసేనుని జీవితమున ఆకస్మికమై, ముఖ్యమైన పరివర్తనములను గలిగించిన నిగూఢమైన పరమశక్తిని విచారించుటకై ప్రోత్సహింపబడి యా

పండితుడు నాటినుండియు హృదయపూర్వకముగ శ్రీరామకృష్ణ పరమహంస జీవితప్రబోధములచే నాకర్షింపబడి, వానిని ప్రశంసించి ఆమహానీయుని శిష్యుడయ్యెను. "శ్రీరామకృష్ణపరమహంస నేడు మనుష్య సహస్రములచే నారాధింపబడుచున్నాడు" అని నే నాపండితునితో పలికితిని. "ఆరాధనయన్న దట్టి మహాత్ములను కాక మఱెవ్వరి ననుసరించును, అట్టి మహనీయులుకాక మఱెవ్వ రారాధన కర్హులు?" ఇది యాతని సమాధానము. ఆతడు మూర్తీభవించిన దయాగుణము. స్టరిడీని, నన్ను తనతో భోజనమునకై యుండుడని ఆతడడిగినాడు. ఆక్సుఫర్డు నందలి వివిధకళాశాలలను, బాడ్లన్ గ్రంథాలయమును మాకు చూపించెను. మాతో బాటు రైల్వేస్టేషనకు వచ్చినాడు. ఇదంతయు నెందుకు చేసినట్లో యతడే చెప్పినాడు. "శ్రీరామకృష్ణపరమహంస శిష్యసాహచర్యము నిరంతరము లభించునా?"

నా యీ పండితదర్శనము నిజముగా నొక కనువిప్పు. తమస్సును జీల్చుకొనివచ్చు నొక వెల్గురేఖ. సొగసైన చిన్ని యిల్లు. అందములువిచ్చిన యా యుద్యానవనము. పరమ ప్రశాంతమై, కృపారసము పైన జిందించెడి మోముతో, నెరసిన వెంట్రుకల వెండి కిరీటము దాల్చిన యా మహర్షి, డెబ్బది శీతఋతువులను జూచిన యా ఫాలభాగము భావబంధురములై యుండెను. పసివానినుదుటివలె పరమమృదువైన ఆ ముఖమందలి ప్రతిరేఖయు తనవెనుకనున్న యగాధమైన యాధ్యాత్మికచింతనమును వెల్లడించుచున్నది. సుదీర్ఘజీవనపథమున ప్రతికూల శక్తులను, జుగుప్సను ఎదుర్కొని ముందంజవేసిన భర్తను అనుసరించిన ఆ యిల్లాలు, ఆ పుణ్యదంపతుల పరిసరదృశ్యములు ప్రాచీన భారతీయమహర్షిలోకమును మనస్సులో మెదలించి నన్ను పులకితునిజేసినవి. ఆ తీవలు, ఆ పువ్వులు, ఆ ప్రశాంతవాతావరణము, ఆ నిర్మలమైన నీలాకాశము — ఇవన్నియు మన

బ్రహ్మర్షుల, రాజర్షుల పవిత్రకాలమునకు, పూజనీయులైన అరుంధతీవశిష్ఠులు విలసిల్లిన పవిత్రమైన ప్రాచీనకాలమునకు నా మనస్సును గొంపోయినవి.

నేను దర్శించిన దెవరిని? ఒకభాషాతత్త్వవేత్తనుకాదు, ఒకమహాపండితునిగాదు, పరమాత్మతోడి సదా తనసంబంధమును తెలిసికొనిన యొక పవిత్రాత్మను. ప్రతి కదలికయందు నవిచ్ఛిన్నమైన యఖండాత్మను సమీపించుటకై విస్తరించు దివ్యహృదయమును దర్శించితిని. ఉప్పునీటిపడియలకై యితరులు స్వశక్తులను వ్యర్థమొనర్చుకొనుచుండగా, నీతడు జీవితపథమునందలి తీపినీటి యూటను మాత్రమే సేవించినాడు. నిశ్చయముగా నితని ప్రతి హృదయస్పందనమును "ఆత్మానంవై విజానీథ అన్యాం వాచం విముంచథ" (ఆత్మనుగూర్చియే తెలిసికొనుము. ఇతరములైన వాక్కులను పరిత్యజింపుము) అన్న యీ యుపనిషల్లయను గ్రహించినది.

సకలప్రపంచముల నూపివేయగల పండితుడు, తత్త్వవేత్తయైన యీతని చదువు, తత్త్వశాస్త్రము పరబ్రహ్మపదార్థమును దర్శించుటకై యుపరితలములకు గొంపోయినవి. అతని యపరావిద్య, పరావిద్యను సమీపించుట కుపకరించినదనుట నిశ్చయము. సత్యమైన విద్య యన్న నిదే. "విద్యా దదాతి వినయం" (విద్య వినయము నిచ్చును). దివ్యజ్యోతిని దర్శింపజేయని చదువువలన నేమి ప్రయోజనము?

భారతదేశమన్న నతని కెంత భక్తి! నా మాతృభూమి యెడల నా కట్టి భక్తిలో శతాంశమున్న జాలు. అసాధారణమైన ప్రజ్ఞతో, నిరంతరము బుద్ధితో శ్రమించుచు నేబదియేండ్లకు పైగా—ఇంకెక్కువగానో—అతడు హైందవునివలె తాత్త్విక విచారణమందు గడపినాడు. అనంతమైన సంస్కృత సాహిత్యా

రణ్యమునందు తీక్ష్ణమైన దివ్యజ్యోతియొక్క వెలుగునీడలనుగూర్చి తీవ్రాభిలాషతో, పరమానందముతో నవి స్వాత్మలో లీనమైతన్నుపరివీఘులకెత్తునంతవఱకు ఆగక ఆతడు అన్వేషణము సాగించినాడు.

ఆయన తత్త్వవేత్తలలో తత్త్వవేత్త. ఏ వేదాంతము, మతము సర్వమానవకోటిని దరింపజేయగల్గునో, యేది సమస్త మతముల కతీతమో యా వేదాంతముయొక్క నిజమైన తత్త్వమును వివేచించి గ్రహింపగల్గిన మహనీయుడాతడు. ఇక రామకృష్ణపరమహంస యెవరు? వేదాంతోక్తమైన మహద్విషయము ననుభవపూర్వకముగ జూపించినవాడు. ప్రాచీన పవిత్ర భారతదేశమే యాతడు. దాని ప్రతిమూర్తి. భవిష్యద్భారతము నకు వెలుగుపుంత. సకలలోకములకు దివ్యజ్యోతిర్వాహకుడు. "రత్నముల విలువ రత్నాల వ్యాపారికే తెలియు" నన్న దొక నానుడి. హైందవతాత్త్వికాకాశమునందు మెఱసిన ప్రతి నక్షత్రము వెదజల్లు కాంతిపుంజమును హైందవునికంటె ముందుగా నీ పాశ్చాత్యమహర్షి దర్శించి యానందించి యభినందించుటలో నాశ్చర్యమేమికలదు?

"మీరు మా దేశమున కెన్నడు విచ్చేయుదురు? తమ ప్రాచీనుల చింతనములను వెల్గునకు దెచ్చిన మీకచటి ప్రతి హృదయమును నీరాజనము పట్టగల"దని ఆతని నుద్దేశించి పలికితిని. ఆ వృద్ధమహర్షి వదన మొక్కసారి విప్పారినది. ఆ కన్నులలో నొకబాష్పకణము తళుక్కున మెఱసినది. మృదు శిరఃకంపనము తర్వాత నా హృదయస్పందనము వాగ్రూపము ధరించినది. "అప్పుడు నేను తిరిగివచ్చుట యుండదు. నన్నచ్చటనే దహనము చేయవలెను". తరువాతి ప్రశ్నల పరంపరవలన నిభృతమనుష్యహృదయస్థ పవిత్రస్థానములందు అనధికారముగ ప్రవేశించినట్లగును. ఆ హృదయాంతరాళమందలి నిగూఢరహస్య

ముల నెవ్వ డెఱుగును? జన్మజన్మాంతరములం దాతని కీ భరత దేశముతో నేమి సంబంధమున్నదో? ఎవ్వ డెఱుగును. కాని కవికులగురువు వాక్కిట్లు ధ్వనించినది.

"తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం, భావస్థిరాణి జననాంతర సౌహృదాని"—(అతడు మనస్సునందు నిదమిత్థమని తెలియరాని, యాత్మయందు గాఢమైన పూర్వజన్మస్నేహములను స్మరించుచున్నాడు).

అతని జీవితము లోకమున కొక వెలుగుబాట. ఆతడు తన ప్రస్తుతజీవితయానమునుండి తరలుటకుమున్ను అందుండి ప్రసరించు ఆశీర్వాదమరీచి సుదీర్ఘభావికాలపథము నాలోకిత మొనరించుగాక!



# పహ్వారీబాబా జీవితసంగ్రహము

దుఃఖిత ప్రజానీకమునకు సేవచేయుట నిజముగా మహాకార్యము. బుద్ధుడు తక్కిన ఆధ్యాత్మికవిషయములనన్నిటిని ఒక ప్రక్కకు నెట్టి, దీనికే ఎక్కువ ప్రాముఖ్యమిచ్చెను. ఐనను అతడు స్వార్థపరత్వము నంటిపెట్టికొని యుండుట ఎంత తెలివి తక్కువయో, గ్రహించుటకు సంవత్సరముల తరబడి తపస్సుచేసి శ్రమించెను. అతడు మన ఊహకుకూడ అందనంత నిస్స్వార్థుడు. నిరంతరకృషిచేసినవాడు. ఐనను అతడు సృష్టిస్వరూపమును తెలిసికొనుటకు పడినశ్రమ మఱిఎవ్వరును పడియుండలేదు. చేసినపని గొప్పదనమునుబట్టి ఆపనిచేసినవానియొక్క ఆత్మానుభవశక్తి తెలియును. ఒక నిష్కృష్టమైన ప్రణాళికలోని సర్వాంశములను చక్కగా అవగతముచేసికొనుటకును సాధించుటకును అంత పెద్ద ఏకాగ్రమైన భావన అక్కఱలేదు. కాని, ఉన్నతభావములన్నియు తీవ్రమైన ఏకాగ్రభావనలయొక్క పరిణతరూపములేయని చెప్పవలెను. చిన్నచిన్న పనులుచేయుటకు ఆ పద్ధతులు తెలిసినచో చాలును. కాని చిన్ని బెడ్డవేసినపుడు పుట్టు సరోవరతరంగమునకును ఝంఝామారుతమువల్ల సముద్రములోపుట్టు తరంగమునకు సామ్యమెక్కడ? ఆశక్తిలో ఏకోట్యంశమో ఈ బెడ్డ విసరుటలో నుండవచ్చును.

మనస్సు నొక మహాకార్యమును చేయుటకు సిద్ధముచేయవలెనన్న కొన్ని యథార్థములను కొన్ని సత్యములను అవెంత హృదయవిదారకమైనను, ఎంత భయంకరమైనను అవగతము చేసికొనవలెను. నిస్స్వార్థమైన నిష్కపటమైన సేవాభావన యుండవలెను. ఆస్థితిని చెందుటకు ఎంతశ్రమమైనను సరే అట్టి అవగాహన, అట్టిభావన ఉన్నప్పుడే మహాకార్యనిర్వహణమునకు మానవుడు సమర్థుడగును. సూక్ష్మపదార్థములు కాలక్రమమున స్థూల

పదార్థముల నాకర్షించి అభివ్యక్తమగుచుండును. అదృశ్యము దృశ్యపదార్థముగ పరివర్తనము చెందును. ఊహాగానము సుసాధ్యమగును, కార్యము కారణమగును. భావన కార్యరూపము ధరించును.

ప్రతిబంధకసామగ్రివల్ల ప్రతిహతమైన కారణము కాలాంతరమున కార్యముగా పరిణమించును. అట్లే భావన ప్రస్తుతము ఎంతశక్తిహీనముగా కన్పించినను కాలాంతరమున కార్యరూపము ధరించును. ఏవిషయమైనను దానియొక్క శక్తివల్ల కార్యరూపము వహించి ఇంద్రియానుభవయోగ్యమగునను వాదనలో సత్యము లేదు.

జంతువు ఎంతతక్కువ తరగతికిచెందిన ఇంద్రియానుభవమంత ఉత్కటముగనుండును. కాబట్టి నిజమైన నాగరకత ఇంద్రియానుభవ ప్రచురమైన దశనుండి—ఈ పశుత్వమునుండి, మనుష్యుని ఉద్ధరించునదిగా నుండవలెను. ఉత్తమములైన ఇంద్రియాతీతములైన అనుభవములను అతనిదృష్టిపథమున ప్రదర్శింపవలెను. లౌకికమైన సుఖభోగములను రుచిచూపించుట, ప్రదర్శించుట ఉత్తమ నాగరకత కాదు.

ఈ విషయము మానవులకు చూచాయగా తెలియును. ఈ విషయమునుగుఱించి అతడు గాఢముగా ఆలోచించియుండక పోవచ్చు. దానియొక్క స్పష్టస్వరూపమును నిర్ణయించుకొనియుండకపోవచ్చును. ఇంద్రియాతీతమైన అనుభవములను గుఱించి అతనికి వివిధములైన అభిప్రాయము లేర్పడియుండవచ్చును. కాని అట్టి అనుభవమునుగూర్చిన జ్ఞానమొకటి అతనిలోనుండి పైకి త్రోసికొని వచ్చుచుండును. నిస్స్వార్థసేవకులకు, వైద్యులకు, నైంద్రజాలికులకు, మతాచార్యులకు, శాస్త్రవేత్తలకు అతడు గౌరవమును నెఱపుట కిదియే కారణము. మనుష్యుడు ఈ అలౌకిక వాతావరణములో ఎంత ఎత్తునకు ఎగురగలడో సాంసారికమైన

స్పర్శలేకుండ ఎంత పరిశుద్ధముగ భావింపగలడో ఎంతకాలము లోకభావనకు దూరముగనుండగలడోయన్న దానినిబట్టి అతని ఆత్మాభివృద్ధిని మనము కొలువవచ్చును. ఏవోకొన్ని అవసరపరిస్థితులలో తప్ప సంస్కారియైన మానవుడుకూడ ఈ ఇంద్రియ భోగము లనుభవించుటలోనే తన కాలమును వినియోగించుచున్నాడు. అవసరమైన సందర్భములలో ఇంతకంటె ఉత్తమమైన పనిచేయుచున్నను అదికూడ నిరుత్సాహముగనే చేయుచున్నాడనుట చాల యథార్థమైన సంగతి.

ఈ విలాసములుకూడ భావములనుబట్టి ఆదర్శములనుబట్టి నిర్మితములగుచున్నవి. వీనియందు మానసికాభివృద్ధి సాధ్యమైనంతవఱకు ప్రతిబింబించుచునేయున్నది. కళ పుట్టినది ఇచ్చట నుండియే.

అగ్ని యొక్కటే. కాని అది భిన్నముగా వ్యక్తమగును. ఈ అభివ్యక్తమైన దానికంటె దానిస్థితి అనభివ్యక్త స్వరూపములోనే అనంతముగానున్నది. అట్లే అనంతమైన భావనలో ఒక యంశముమాత్రము అభివ్యక్తదశకువచ్చి మనకు లౌకిక సుఖముల నొనగూర్చును. తక్కినభావన మన చిత్తమువచ్చినట్లు పరివర్తనముచేయుటకు వీలుపడదు. పరమసూక్ష్మవిషయములు మన దృష్టికి సరిగానందవు. వానిని భౌతికస్థితిలోనికి మార్చుటకు మనము చేయు ప్రయత్న మపహాస్యముపాలుగాక తప్పదు. మహమ్మదు కొండదగ్గఱకు పోవలెగాని కొండ మహమ్మదుదగ్గఱకు రాదు. మనుష్యుడు అలౌకికానందముపొందవలె నన్నచో, దాని దీప్తిలో మునుగవలెనన్నచో కారణప్రపంచములో తాదైక్యముకావలె నన్నచో ఆయెత్తుకు తానెగురగల్గియుండవలెను. చిత్రచిత్రములైన దృశ్యములను విప్పిచూపగల్గునది జ్ఞానము. జ్ఞానమే జంతువును దేవతగా మార్చును. ఏయొక్కటి తెలిసిన సర్వమును తెలియునో అట్టిస్థితికి మనలను గొంపోవుజ్ఞానమే సర్వోత్తమము. ఏక

జ్ఞానమువల్ల సర్వజ్ఞానము—జ్ఞానమునకు హృదయభూతము, సర్వ శాస్త్రములకును నాడివంటిది, ఆధ్యాత్మికశాస్త్రము. ఇట్టి జ్ఞానమే సర్వోత్తమమైనది. ఇట్టి జ్ఞానముక్కటే పురుషుని పరిపూర్ణుని చేయగలదు. పరిపూర్ణముగా భావనలో జీవించునట్లు చేయగలదు. ఆధ్యాత్మికశాస్త్రమే ఉత్తమోత్తమమైనదని ఏ దేశమున భావింపబడునో ఆ దేశము గొప్పది.

సిద్ధాంతము పరిపూర్ణముగ ఆచరణలో పెట్టుట కష్టము. కాని లక్ష్యము మాత్రము విస్మృతము కాకుండ నుండవలెను. లక్ష్యమును మన మెప్పుడును దృష్టిపథమునందుంచుకొనవలెను. దానివంకకు త్రోవదప్పకుండ నడవగల్గిన మంచిదే. లేకున్న చీమ వలె ప్రాకనైన ప్రాకగల్గుదుము. మఱియొకటి: ఆ లక్ష్యము మన కండ్లముందు తేజోవంతమై ప్రకాశించుచుండును. ఒక్కొక్కసారి ఆ తేజస్సు భరించలేక కండ్లు కప్పుకొందుము. కాని అది మెఱయుచునే యుండును.

ఆచరణకు ప్రాణభూతము లక్ష్యము. మనజీవితములనంతటను లక్ష్యము పెనవేసికొనియున్నది. మనజీవితములో నిత్యము నిర్వహింపవలసిన ధర్మములనుగూర్చి మనము విచారణచేయుచు కూర్చున్నను లేక ఆచరణలో పెట్టుచున్నను ఈ లక్ష్యముమాత్రము మనదృష్టిపథమునందుండితీరవలెను. ఈ లక్ష్యముయొక్క కిరణములు సూటిగాగాని, వంకరగగాని మనజీవితమునందు ప్రసరించి దానిని కాంతిమంతముచేయవలెను. మనకు తెలియకగాని, తెలిసిగాని చేయు ప్రతి పని ఈ లక్ష్యముయొక్క కిరణప్రసారజన్యకాంతిలోనే నిర్వహింపబడవలెను. ప్రతివస్తువు దీనికాంతిలోనే నయనగోచరము కావలెను. పరివర్తితము కావలెను. మనలక్ష్యమునుబట్టియే మన అభివృద్ధి యుండును. ఈ లక్ష్యములోనున్న శక్తియే మనలను త్రమ్ముకొన్నది. మన సుఖదుఃఖములయందు, మన ఉత్తమాల్పకార్యములందు, మన గుణాగుణములందు దీ లక్ష్యశక్తియే ప్రకటీకృతమగుచుండును.

జీవితముపైన లక్ష్యమునకున్న అధికారమిట్టిదిగదా. మఱి జీవితముకూడ లక్ష్యము నేర్పాటుచేసికొనుటలోకూడ ఇంత శక్తి మంతమైనదే. లక్ష్యముయొక్క యాథార్థ్యము ఆచరణలో నున్నది. లక్ష్యసిద్ధి దాని ఆచరణీయతనుబట్టి యుండును. అసలట్టి లక్ష్యమనుచు నొకటి యున్నదని తెలియుటకు నిదర్శనమేమున్నది? ఎక్కడనో అక్కడ ఏదోవిధముగ దాని కాచరణ యున్నపుడే అట్టి లక్ష్యమున్నదని తెలియును. లక్ష్యము విశాలతరమైనది కావచ్చును. ఆచరణ దానిలో అంశము మాత్రమే కావచ్చును. కాని ఆ లక్ష్యముయొక్క వైపుల్య మీ ఆచరణాత్మకాంశములను శతసహస్రముగా గుణించుటవల్ల నేర్పడునదే. బహుధాలక్ష్యము ఆచరణలోనున్న విషయములను తీసికొని లెక్కకట్టి సాధారణీకరణముచేయుటవల్ల రూపుకట్టునట్టిది.

లక్ష్యముయొక్క శక్తియంతయు ఆచరణలో నుండును. మనపైన లక్ష్యముయొక్క ప్రసరణమంతయు ఆచరణద్వారా కల్గును. ఆచరణద్వారముననే లక్ష్యము మనకు ప్రత్యక్షమగును. మన కవగతముచేసికొనుటకు తగినరూపములో దృగ్గోచరమగును. ఆచరణవల్లనే లక్ష్యము చేరుకొనుటకు మనము ప్రయత్నింతుము. ఆచరణవల్లనే మనకు లక్ష్యమును సాధింపగలమన్న ఆశ దృఢపడును. మన సాధన కొనసాగించుటకు వలసిన ధైర్యము చిక్కును.

లక్ష్యమునుగుఱించి రమణీయముగా వర్ణించుచు సూక్ష్మసూక్ష్మతరభేదములతో సిద్ధాంతీకరించు పండితులు వందమంది కంటె దానిని జీవితములో సాధించి చూపించిన ఒక్కవ్యక్తి అధికశక్తిమంతుడు.

వట్టి ఆధ్యాత్మికసిద్ధాంతములవల్ల మానవజాతికి కల్గు ప్రయోజనమేమియు లేదు. అవి వట్టి ప్రతిభాప్రదర్శకములు

మాత్రమే. అవి మతముతో మేళవించినపుడుమాత్రమే వాని నాచరణలోపెట్టి కొంత సిద్ధి సంపాదించుటకు ప్రయత్నించు మనుష్యులు కొందఱు బయలు దేరుదురు. ఏవిధమైన సంభావ్యత లేని కొన్ని ఆధ్యాత్మికసిద్ధాంతములుకూడ వాని నాచరణలో పెట్టుటకు కొంతమంది మనుష్యులు బయలుదేరినప్పుడు వానిని కొంతవఱకైన సాధించి చూపించినపుడు, వేలకొలది అనుయాయుల నవలోకింపజాలినవి. ఎంతయో యోగ్యతమములై, సువిచారితములైన సిద్ధాంతములు ఆచరించువారు లేక వినష్టములైపోయినవి.

మనలో చాలమంది మనభావములకు తగినట్లుగా మన భౌతికజీవితమున మనముచేయుపనులను రూపొందించుకొనలేము. ఎవడో ఒకానొక అదృష్టవంతుడుమాత్ర మట్లుచేయును. మనలో చాలమంది ఎక్కువగా ఆలోచించినపని చేయలేము. ఎక్కువగా పనిచేసిన ఆలోచించలేము. ఈకారణమువల్లనే చాలమంది మహాప్రతిభాశాలురు వారు నిర్మించిన లక్ష్యము లాచరణీయము లని తాము ఋజువుచేయలేక ఆ భారమును భవిష్యత్కాలమునకు వదలిపెట్టిరి. వారి భావములు అవగాహనచేసికొని ఆచరణలో పెట్టి వ్యాపింపచేయుటకు వారికంటె అధిక ప్రతిభాశాలురుకావలసి వచ్చినది. కాని ఈ మాటలు వ్రాయుచుండగా నాకనులముందు ఒకదృశ్యమగపడినది. పార్థసారథి రథముపై ఉభయసేనలమధ్య వామహస్తముతో గుఱ్ఱముల పగ్గములుపట్టుకొని ఉభయసేనావాహినులను పాఱజూచుచు బలాబలములను లెక్కగట్టుచు ఆశ్చర్యమగ్నుడైన అర్జునునకు పరమాశ్చర్యమైన కర్మయోగము నుపదేశించుచుండెను. ఆయననోటినుండి వచ్చుచున్నట్లు ఈ మాటలు మాకు విన్పించినవి.

కర్మణ్యకర్మయః పశ్యేత్ - అకర్మణిచ కర్మయః
స బుద్ధిమాన్ మనుష్యేషు - సయోగి కృత్స్నకర్మకృత్.

బహుకర్మకలాపములందు ప్రశాంతిని - ప్రశాంతియందు కర్మకలాపమును దర్శించువాడే బుద్ధిమంతుడు. అతడే యోగి. సర్వకర్మములను చేసినవాడు.

ఇది పరిపూర్ణమైన లక్ష్యము. కాని ఈ లక్ష్యము నందుకొనువారు చాలకొద్దిమందిమాత్రమే. మనమున్న దున్నట్లుగా తీసికొందము. అందుచేత మానవుడు పొందదగిన పరిపూర్ణత్వములో విభిన్న వైఖరులు విభిన్నవ్యక్తులలో నుండి గ్రహించి వానినన్నిటిని కూర్చి మనకన్నులయెదుట నిల్పుకొని తృప్తిజెందుదుము. మతమందే మనకు తీక్ష్ణభావావిష్టులు, పరోపకారపారీణులు - ఆత్మవేత్తలు - వినయసంపన్నులు - తితిక్షాపరులు కన్పింతురు.

ఈ గ్రంథములో నేను చిత్రింపదలచుకొన్న దొక పరమ వినయవంతుడు, ఆత్మానుభవ సంపన్నుడైన మహాపురుషుని జీవితము.

ఆయనపేరు పహ్వారీబాబ. ఈ పేరాతనితల్లిదండ్రులు పెట్టినదికాదు. తర్వాతవచ్చినది. వారణాసిసమీపమందలి "గూజీ"కి దగ్గఱగానున్న ఒక గ్రామములో బ్రాహ్మణుల దంపతుల కతడు జన్మించెను. అతడు బాల్యమునందే ఘూజీపూరు చదువుకొనుటకు వచ్చి మేనమామలయింటిలో పెరిగెను. ప్రస్తుత కాలములో హైందవయతులలో సన్యాసులు, యోగులు, బైరాగులు, పాంథీలు అను భేదములున్నవి. సన్యాసులు శంకరాచార్యు నద్వైతమునకుచెందినవారు. యోగు లద్వైతమునకు చెందిన వారేయైనను భిన్నయోగాభ్యాసములు చేయువారగుటవల్ల వీరిది వేఱెశాఖయైనది. బైరాగులు రామానుజాచార్యుడు మొదలైన వారు నిర్మించిన ద్వైతసిద్ధాంతములకు సంబంధించినవారు. పాంథీలు మహమ్మదీయ ప్రభుత్వములకాలములో మనదేశమందు బయలుదేరిన ఆధ్యాత్మికవాదములకు చెందినవారు. పహ్వారీబాబా

మేనమామ రామానుజమతస్థుడు. దీనికే శ్రీశాఖ అని కూడ పేరు. ఆయన నైష్ఠిక బ్రహ్మచారి. అనగా యావజ్జీవము బ్రహ్మచర్యనిష్ఠగలవాడు. ఘాజీపూరుకు రెండుమైళ్ళదూరమున గంగయొద్దున కొంత భూమియున్నది. అచ్చటనే ఆయన తన నివాసము నేర్పాటుచేసికొనెను. ఆయనకు చాలమంది మేనల్లుండ్రు కలరు. వారిలో నొకడైన పహ్వారీబాబాను తెచ్చుకొని ఆయన పెంచుకొనుచుండెను. ఆయన తన ఆస్తిని, తన స్థితిగతులను అతని కప్పజెప్పవలెనని ఉద్దేశముగలిగి యుండెను.

ఈ కాలములో పహ్వారీబాబా జీవితమునుగూర్చి మన కెక్కువ తెలియదు. ఈతర్వాతి జీవితములో ఆయన ఇంతప్రసిద్ధుడగుటకు తత్పూర్వజీవితములోనున్న విశేషములేవో మనము తెలిసికొనుటకైన వలసిన సూచనలును లభింపలేదు. ఆయన న్యాయవ్యాకరణములు, తమ మతగ్రంథమైన శ్రీభాష్యము చక్కగా వ్యాసంగముచేసెననియు ఆయన చాల పరిహాసప్రియుడనియు, అప్పుడప్పుడు తోడి విద్యార్థులు ఆయన పరిహాసమునకు గుఱియగుచుండువారనియు మాత్రమే తెలియుచున్నది.

ఈ మహాత్ముడు తన విద్యార్థిదశలో పురాతన హైందవ విద్యార్థియొక్క ధర్మములను నిర్వహించుచు గడపెను. చదువునుగూర్చి మిక్కిలి శ్రద్ధవహించెడివాడు. బహుభాషలను నేర్చుకొనుటకు అభిరుచికలవాడు. ఇంతకుమించి ఆయనయొక్క విద్యార్థి జీవితములో తర్వాతి త్యాగమయమైన జీవితముయొక్క గభీరలక్షణములను సూచించు నంశములు లేనేలేవు.

తర్వాత ఒక సంఘటనజరిగి ఈయనకు కనువిప్పుతెచ్చెను. జీవితముయొక్క మహాలక్ష్యమేదియో ఈయనకు బోధపడెను. మతమనగా 'వట్టి గ్రంథపఠనముకాదు. జీవితములో ఆచరించి సాధించదగినది ఏదో దానిలోనున్నది' అని అతనికి తహతహ పుట్టెను. అతని మేనమామ చనిపోయెను. ఇంతకాలము అతని

ప్రేమకు విషయమైన ఆ మేనమామ ముఖ మతనికి కన్పించ లేదు. ఆ పిల్లవాడు చాల గాఢ స్వభావుడు. అతనికి గల్గినదుఃఖమునకు మేర లేదు. ఈ మేనమామ ముఖమదృశ్యమైనది. దీని స్థానము నాక్రమించుకొనుటకు పరివర్తనములేని ఒక దృశ్యమునుపొందుట కతడు నిశ్చయించుకొనెను.

హిందూదేశములో మాకేపనిచేయవలెనన్నను ఒక గురు వుండి తీరవలెను. గ్రంథములు వట్టి దిక్ప్రదర్శకములుమాత్రమే అని మావిశ్వాసము. రహస్యములు గురుశిష్యపరంపర నాశ్ర యించియుండును. అది కళయైనను, శాస్త్రమైనను సరే, గురు ప్రబోధమువలన శిష్యునకవగతము కావలెను. మతమందన్ననో చెప్పనే అక్కఱలేదు. బహుపురాతనకాలమునుండి ఋజువర్తను లైన మహానుభావు లరణ్యములలో, ఏకాంతప్రదేశములలో, ఆధ్యాత్మికసాధన నిరవచ్ఛిన్నముగ సాగించుకొనుచుండెడివారు. ఇప్పటికిని ఒక అడవి, ఒకకొండ, ఒకపవిత్రస్థలముగాని ఏదో ఒక మహర్షికి నివాసముగానుండెడిదని ప్రసిద్ధిలేకుండ నున్నది లేదు. మాదేశములో ఒక సామెతయున్నది. అది యిది : "ప్రవహించు సలిలము నిర్మలమైయుండును. సంచరించుయోగి నిర్మలవర్తనుడై యుండును" అని. హిందూదేశములో నైష్ఠిక బ్రహ్మచర్యము నడపువారు విధిగా తమజీవితములో చాలభాగము భారతదేశ మందలి బహుప్రదేశములలో బహు పుణ్యస్థలములకు యాత్రలు చేయుచు గడపుదురు. ఈ విధముగ వారు నిస్సంగులుగా నుండ వచ్చును. మతమును ఇంటింటికి ప్రచారముచేయవచ్చును. భారత దేశములో నలుమూలల నాల్గు మహాస్థలములున్నవి. ఈ మహా స్థలములను సన్యాసులు తప్పకుండ దర్శించి సేవింపవలసినదే.

ఈ యుద్దేశములన్నియు ఇతనికి ఉండి యుండవచ్చు. కాని వీనియన్నిటిలో ముఖ్యమైనది జ్ఞానతృష్ణ. అతని తీర్థయాత్రల గురించి మనకెక్కువ తెలియదు. కాని అతడు వైష్ణవమత సార

స్వతము· వృద్ధిపొందిన భాషలన్నియు చక్కగా నేర్చినవాడు. ద్రావిడము, పురాతనవంగభాష చక్కగా వచ్చినవాడు. అందు వల్ల ఇతడు దక్షిణహిందూదేశమున, వంగదేశమున చాల కాల ముండియుండవచ్చును.

కాని అతనిస్నేహితులు గట్టిగా ఒక సంగతిచెప్పెదరు. కథియవార్‌లో గిరినార్ కొండ శిఖరమున నతడు యోగా భ్యాసము చేసెనని, కొంత యోగానుభవమును గడించెనని చెప్పుదురు.

ఈ గిరినార్‌కొండ బౌద్ధులకు చాల పుణ్యక్షేత్రము. ఈ కొండ పాదప్రదేశమున ఒక పెద్ద గుట్టకలదు. దానిపైననే అశో కుడు మొదటి శాసనములను చెక్కించెను. ఇచ్చటనే బ్రహ్మాండ మైన స్తూపములు బహు విభిన్నకాలములందు నిర్మింపబడినవి. వానిచుట్టు అడవిపెరిగినది. చాలకాల మీ స్తూపములేవో చిన్న చిన్న గుట్టలని ప్రజలనుకొనిరి. ఈ గిర్నార్ కొండపైన అవధూత యైన దత్తాత్రేయగురుమూర్తి యుండెడివాడని హిందువుల భావన. ఇప్పటికికూడ మహాయోగు లీ కొండపైన కొంతమంది అదృష్ట వంతులకు కన్పించుచుందురని వదంతి.

తర్వాత మన బ్రహ్మచారి గంగానదియొద్దున వారణాసి సమీపములో నొక సన్యాసికి శుశ్రూషచేసెను. ఈ సన్యాసి యోగాభ్యాసముచేయుచు భూమిలో ఒక సొరంగము త్రవ్వుకొని అందు నివసించుచుండెడివాడు. తర్వాత మన బ్రహ్మచారి ఈ యోగివలెనే ఘాజీపూర్ సమీపమున గంగయొద్దున లోతైన బొరియత్రవ్వి అందు నివసించుచుండెడివాడు. యోగులు గుహల లోను లేక అట్టి ప్రదేశములలోను నివసించుట అలవాటు. అట శీతోష్ణస్థితి సమానస్థాయిలో నుండును. నిశ్శబ్దముగా, ప్రశాంత ముగా నుండును. ఈ కాలములోనే మనబ్రహ్మచారి వారణా

సిలో ఒకసన్యాసివద్ద అద్వైతము, సిద్ధాంతముకూడ అధ్యయనము చేసెను.

బహు సంవత్సరములు తీర్థయాత్రలు, శాస్త్రాధ్యయనము, యోగాభ్యాసముచేసి తన పూర్వనివాసమునకు మన బ్రహ్మచారి తిరిగివచ్చెను. అతని మేనమామ అప్పుడు బ్రతికియుండిన, ఉపనిషత్తులలోని ఋషివలెనే ఈ పిల్లవానిని చూచి ''నాయనా నీముఖమిప్పుడు బ్రహ్మతేజస్సుతో ప్రకాశించుచున్న''దని యుండెడివాడు. కాని ఇప్పు డతనికి స్వాగతముచెప్పి, ఆతిథ్యమిచ్చినది చిన్ననాటి స్నేహితులు. వారిలో చాలమంది సంసారసముద్రమునబడి దారితెన్నులేక ఈదుచున్నవారే.

కాని వారికికూడ ఇతనిలో ఆశ్చర్యకరమైన పరివర్తనము కన్పించినది. అతడు చిన్ననాటి వీధిబడి స్నేహితుడుగా లేడు. అతని ఆకారము, ప్రవర్తన, అంతటిలో సంభ్రమముగొలుపు పరివర్తనమొకటి కానవచ్చుచుండెను. కాని ఈపరివర్తనము వారికి జిజ్ఞాసను కల్పించలేదు. అతడీ ప్రపంచకపు దుఃఖమునుండి విడివడిన మహాపురుషుడు. అంతేచాలు. అతనిలో ఆ గుణమునే వారు తెలియకుండ భావించి గౌరవించిరి. ఏ విధమైన ప్రశ్నలతని నడుగలేదు.

క్రమముగా ఈయోగిలోనున్న విశేషగుణము లభివృద్ధి పొంద జొచ్చినవి. ఈయనగూడ వారణాసి యోగివలె నేలలో ఒక బొఱియద్రవ్వి అట గంటలకొలది నివసించుచుండెడివాడు. తర్వాత ఆహారనియమము కఠినముగ అవలంబించుట మొదలైనది. దినమంతయు ఆశ్రమములోకూర్చుండి తన యిష్టదైవమైన రామచంద్రుని పూజలో మునిగిపోయెడివాడు. చక్కగా వంటచేసి బహుపదార్థములు సిద్ధముచేసి తనస్నేహితులకు, పేదవాండ్రకు పెట్టుచుండెడివాడు. ఈ వంటచేయుటలో నితని కపారమైన ప్రావీణ్యమున్నది. రాత్రిపడువఱ కతిథిసపర్యచేయుచుండువాడు.

అతిథులందఱు నిద్రించినతర్వాత ఎవరికి తెలియకుండ అందుండి తరలి గంగ యాది ఆవలియొడ్డునకుజని అట రాత్రియంతయు యోగాభ్యాసములతో ప్రార్థనలతో గడపి వేకువనే తిరిగివచ్చి స్నేహితులను నిద్రనుండి లేపి మఱల అతిథిసేవ మొదలుపెట్టెడి వాడు.

అతని ఆహారము రోజురోజు తగ్గిపోవుచుండెడిది. కడకు ఒక గుప్పెడు వేపాకుగాని, కొన్ని ఎఱ్ఱమిరియాలుగాని అతని ఆహారక్రియకు చాలెడివి. తర్వాత అతడు రాత్రులందు గంగానది ఆవలియొడ్డుననున్న వనములకు పోవుట మానివేసెను. చాలవఱకు తన భూగృహమునందే యుండెడివాడు. దినములకొలది మాస ములకొలది అతడా భూగృహములోనేయుండి ధ్యానము చేయుచు తర్వాత ఎప్పుడో బయటకువచ్చెడివాడని నేను విన్నాను. ఈదీర్ఘ సమయములలో అత డేమితినియుండెడివాడో ఎవరికిని తెలి యదు. అందుచే అతనిని ప్రజలు పహ్వారీబాబా యని పిల్చెడి వారు. దాని కర్థము పవనాహారి.

శేషజీవితమం దతడీగుహనువదలలేదు. ఒకసారి అతడు బహుకాలము గుహనుండిబైటకురాలేదు. ప్రజలంద ఱతడు మర ణించియుండునని భావించిరి. కాని బహుకాలానంతర మీ మహానుభావుడు గుహలోనుండి బైటకువచ్చి బహుసంఖ్యాకులైన సాధువుల కొక పెద్ద విందుచేసెను.

ధ్యానమగ్నుడుకాని సమయములందు గుహాముఖమున నున్న పర్ణశాలలో నాతడు నివసించుచుండెడివాడు. అతిథులెవరేని తన్ను చూచుటకు వచ్చినచో వారికి దర్శనమిచ్చి వారి కాతిథ్య మిచ్చుచుండెడివాడు. ఈమహానుభావునికీర్తి బహుదూరము వ్యా పించినది. ఘాజీపూర్ నల్లమందుశాఖలో ఉద్యోగిగానున్న రాయ్ గగనచంద్రరాయ్ బహదూర్ - అను నొక సాధుజను డుండెడివాడు. చాల ఉదారుడు. ఆధ్యాత్మికభావసంపన్నుడగుట

వల్ల ఈయన బహుజనప్రియుడయ్యెను. ఈయనయే ఈయోగితో మాకు పరిచయము కావించెను.

ఈయన జీవితములో హిందూదేశములోని పలువుర యోగిపుంగవుల జీవితములలోవలెనే బాహ్యాడంబరమేమియు లేదు. ధర్మము ఆచరించి చూపించదగినదిగాని వట్టిమాటలతో చెప్పుట వల్ల ప్రయోజనము లేదు. బహుకాలాభ్యాసమువల్ల చిత్తము పరిపక్వమైనవారికి మాత్రమే బ్రహ్మానుభూతి కల్గునని భారతీయుల సిద్ధాంతము. దీనికి పహ్వారీబాబా జీవితము మఱియొక ఉదాహరణము. ఇట్టి మహానుభావులు తమకు తెలిసినది నోటితో చెప్పుటకు ఏమాత్రము నిచ్చగింపరు. వట్టి మాటలవల్ల ప్రయోజనము లేదనియు, అంతరంగిక సాధనవల్లనే ఆధ్యాత్మికానుభూతి కల్గుననియు వారి దృఢవిశ్వాసము. మతోద్దేశము సాంఘిక ప్రవర్తన తీర్చి దిద్దుటకాదు. మతమనగా ఈజీవితమునందే సత్పదార్థమును స్వస్వరూపమును ప్రత్యక్షీకరించుకొనుటకు చేయు తీవ్రసాధన. వారి క్షణముకంటె ఉత్తరక్షణము బలీయమని ఒప్పుకొనరు. ఈ మహాకాలమునందు ప్రతిక్షణము నొకదానికొకటి తుల్యమైనదే. అందుచేత 'ఎప్పుడో మరణించినతర్వాత ముక్తిపొందదగినదన్నమాట వారంగీకరింపరు. ఇపుడే, ఇటనే మనమాధ్యాత్మికానుభవము పొందితీరవలెనని చెప్పుదురు.

నేనొకసారి "ఈ ప్రపంచమునకు సేవచేయుటకై మీరు ఈ గుహనుదాటి వెలుపలికి రాకూడదా" అని అడిగితిని. మొదట ఆయన తనకు సహజమైన వినయముతో సుకుమారమైన హాస్యమును మేళవించి ఇట్లు సమాధానము చెప్పెను.

"ఒక దుర్మార్గుడొక పెద్ద నేరముచేసి పట్టువడెను. అందుకు శిక్షగా వాని ముక్కు కోసివదలిరి. ముక్కు లేకపోవుట వల్ల అతడు సిగ్గుపడి లోకములో నుండలేక ఒక అడవిలోనికి

పాఱిపోయి అచ్చట ఒక పులిచర్మముపఱచి దానిమీద కూర్చుండి ఎవ్వడైన ఆత్రోవనవచ్చుచున్నాడని తనకు తోచినపుడెల్ల సమాధిలోమున్గినట్లు నటించెడివాడు. దీనివల్ల ప్రజలు దూరముగా నుండుటకు బదులు గుంపులుగుంపులుగా నతనివద్దకు వచ్చి సన్మానించెడివారు. ఈవిధముగా అరణ్యములో నుండుట అతనికి మఱల చాల సుఖముగానున్నది. ఇట్లు సంవత్సరములు గడచినవి. చిట్టచివర కతనిచుట్టు చేరిన ప్రజలు ఈ మౌనయోగిని ఏదైన చెప్ప వలసినదని అభ్యర్థించిరి. అందులో ఎక్కువగా ఒకయువకు డుపదేశము చేయుమని యోగిని తొందరపెట్టెను. ఇంకేమైన ఆలస్యము చేసినచో ఈ యున్న గౌరవము దెబ్బతిను పరిస్థితి ఏర్పడెను. ఆయువకు డంతతొందరపెట్టెను. అందువల్ల ఒకనాడు స్వామి మౌనమునుత్యజించి ఆయువకునితో "బాబూ రేపుప్రొద్దున మంచి వాడియైన కత్తి నాకదానిని తెమ్మ"ని పలికెను. ఆయువకుడు తన జీవితాశయము సిద్ధించునని సంతోషించి మఱునాడు కత్తితెచ్చి నాడు. ఈముక్కిడియోగి వాని నడవిలో ఒక నిర్జనప్రదేశమునకు గొంపోయి ఆకత్తితో తృటిలో వానిముక్కుకోసి గంభీరముగ "బాబూ సరిగా ఇట్లే నే నీవిద్య ఉపదేశమందితిని. నీకు నట్లే చేయుచున్నాను. సరియైన అవకాశము సందర్భము పడినపు డింత నేర్పుగా ఈ ఉపదేశముచేయవలె" నని చెప్పినాడు. ఆయువకుడు ఎవరికైన చెప్పుట సిగ్గుచేటని తన గురువుచెప్పినట్లుకూరాల నడచుకొనెను. కాలక్రమమున దేశములో ముక్కిడియోగులసంఖ్య పెరిగి ఒక పెద్ద శాఖయయ్యెను. నన్నుకూడ అట్టి ఒక శాఖను వ్యాపింపజేయుమని నీ యభిప్రాయమా! స్వామీ!"

మఱియొకప్పుడు నేనాయనను ఇట్లే ప్రశ్నింపగా ఆయన చెప్పిన సమాధానమిది: "బాబూ! సహాయమనునది చేతులతో చేయదగినదా? మనస్సులోకూడ సహాయముచేయవచ్చును. శరీరములో నిమిత్తము లేదు".

మఱియొకప్రశ్న మఱొకప్పుడు "స్వామీ! మీరు మహాయోగులుకదా. మీరు రఘునాథుని విగ్రహమారాధించుట, హోమముచేయుట మొదలైన కర్మకలాపమాచరింపనేల? ఈకర్మకలాపము ప్రారంభకులకుగాని మీకేల" యని ఆయననడిగితిని. దానికాయన ఇట్లు సమాధానము చెప్పెను: "నాయనా! ప్రతివాడు కర్మ స్వలాభమునకై చేయుచున్నాడని యనుకొననేల? పరార్థమై కర్మమాచరింపరాదా?" అని.

ఒకప్పుడొక దొంగ ఆయన ఆశ్రమమునకు వచ్చి ఆయనను చూచి భయపడి పాఱిపోయెను. పాఱిపోవుటకుముందు తాను దొంగిలించిన వస్తువులనన్నిటి నొక మూటగట్టి దానినటనే వదలి చోరుడు పాఱిపోయెను. అదిచూచి ఆమూట తీసికొని వాని వెంట పరువెత్తి కొన్నిమైళ్ళలో వానిని పట్టుకొని ఆమూట వాని కాళ్ళవద్ద పెట్టి నమస్కరించి కండ్లవెంట బాష్పములురాల్చుచు "బాబూ! నా తప్పిదము మన్నింపుము. నీ వస్తువులు తీసికొని పొమ్ము. అవి నీవి. నావికావు" అని యోగి బ్రతిమాలెను. ఈ కథ యందఱకు తెలియును.

ఒకసారి ఆయననొక త్రాచు కఱచెను. గంటలతరబడి ఆయన చనిపోయినట్లు కొయ్యబారి పడియుండెను. తర్వాత లేచెను. ఆయనస్నేహితు లేమిజరిగినదన ఆయ నిట్లుత్తర మిచ్చెను. "ఆత్రాచు పరమేశ్వరుని దూతసుడీ". ఆయన మహత్తర గుణముల నెఱుగుదుము కావున ఈ ప్రేమ వ్యక్తీకరణ మెట్టిదో గ్రహింపజాలుదుము.

అన్ని విధములైన శారీరక బాధలు పరమేశ్వరుని దూతలని ఆయన భావించును. ఆయన పరమ సత్పురుషుడు. వినయవంతుడు. ప్రేమపూర్ణుడు. ఆ బాధలు ఈశ్వరదూతలే. మఱొకపేరుతో వానిని పిల్చుటయు ఆయనభరింపలేడు. వానివల్ల ఆయన బాధ పడవచ్చుగాక. ఆయన ఈప్రేమ, ఈసజ్జనత్వము, ఈమధుర

స్వభావము వేలకొలది ప్రజల నాకర్షించెడిది. ఆ ప్రదేశములకు పోయినవారెల్ల రీ విషయమును ఎఱుగుదురు. ఆ ప్రాంతములం దాతని ప్రశస్తి అపారము. ఇటీవల ఆయన ఎవ్వరికిని కన్పింపకుం డెను. ఎప్పుడైన భూగృహమునుండి బయటకు వచ్చుట తటస్థిం చిన తలుపువెనుకనుండి తన్ను దర్శింపవచ్చినవారితో నాతడు మాట్లాడును. ఆయన పైకి వచ్చినాడనుటకు సూచనలు హోమాగ్నిధూమమును పూజాద్రవ్యములను సమకూర్చుకొను సవ్వడియును.

ఆయనలోనున్న పెద్ద విశేషమిది: అది ఎంత చిన్నవిషయ మైనను చేయుచున్నపు డాయన దానిలో మునిగిపోవును. ఒకప్పు డాయన ఇట్లు చెప్పెను. మనము లక్ష్యమునకెంత విలువనిత్తుమో, ఎంతభక్తి చూపింతుమో అంతవిలువ, అంతభక్తి లక్ష్యసాధన మునకుకూడ మనము చూపింపవలెను. దాని కాయనయే ఉత్త మోదాహరణము. ఆయన శ్రీరామచంద్రునియం దెంత శ్రద్ధ చూపించునో అంత శ్రద్ధ ఒకరాగిపాత్ర తోముటయందును చూపించును. ఆయనవినయము, వేదన, బాధ, తన్నుతాను హీనుడనని భావించుకొనుటవల్ల పుట్టినదికాదు. ఒకప్పు డాయన మాకిట్లు చెప్పెను. "పరమేశ్వరుడు సర్వసంగ పరిత్యాగుల యొక్క ఆస్తి. సర్వకామములను కడకు స్వాత్మనుకూడ పరిత్యా గముచేసినగాని పరమేశ్వరుడు లభింపడు:" ఇట్టి ఈశ్వరానుభూతి నుండి ఆయన వినయముదయించినది. ఆయన యెప్పుడు ప్రత్యక్ష ముగ బోధనలుచేయలేదు. అట్లు చేసినచో తానితరులకంటె గొప్పవాడను భావము కలుగవచ్చును. తానాచార్యపదవి నవలం బింపవలసి వచ్చును. కాని ఊరక ఒక్కపర్యాయము మనము కదపినచో ఆ ధార – ఆ వివేకధార – అవిరళముగ వచ్చును. కాని ఆయన మనప్రశ్నలకొసంగు సమాధానములన్నియు పరోక్షములుగానుండును. ఉదాహరణరూపములుగా నుండును.

చూచుట కాయన పొడవుగా, పుష్టికలిగి యుండును. ఆయన కొంకఱ్ఱటేకన్ను. కొంచెమున్నవయసుకంటె తక్కువ వయసు గలవాఁడుగా కన్పించును. అంత మధుర కంఠధ్వని మఱి ఎచ్చటను నేను వినలేదు. ఆయన జీవితములో చివరి పదిపంద్రెం డేండ్లకాలమాయన మానవమాత్రుని కంటబడుట మానివైచెను. కొన్ని బంగాళాదుంపలు కొంచెము వెన్న ఎవరైన తెచ్చి ఆతలుపు వెనుక పెట్టుదురు. ఆయనెప్పుడో రాత్రివేళ సమాధిలో లేకుండ భూమిపై నగదిలో నివసించునప్పుడెప్పుడో రాత్రివేళ ఈవస్తువులు తీసికొనెడివాఁడు. భూగృహములో నున్నపుడవి తీసికొనెడివాఁడు కాఁడు. అంత ప్రశాంతమై అంత యోగానుభూతిమయమై, పావిత్ర్యము, వినయము, పరమప్రేమ మొదలైన సద్గుణపుంజముల కుదాహరణప్రాయమై ఈ మహాపురుషుని జీవితము సాగినది.

ఆయన సమాధిలోనుండి బయటకు వచ్చినట్లు గుర్తు హోమ ధూమమని వెనుకవ్రాసిచ్చితిని. ఒకరోజున ఈ హోమధూమము మాంసముకాలిన కమరుకంపు కొట్టుచుండెను. చుట్టునున్నజనులు లోపలనేమిజరుగుచుండెనో గ్రహించలేకపోయిరి. ఈ వాసన అంతకంతకు ఉత్కటమైనది. ధూమము అంతకంతకు నధికమైనది. వారికనుమానముతోచి తలుపులు పగులగొట్టి లోపలప్రవేశించి చూచిరి. ఆమహాయోగి పరమేశ్వరునకు తుది హవిస్సుగా తన శరీరమును హోమాగ్నియందు హుతముగావించెను. ఆ శరీరము నకు మిగిలినదేమియున్నది? ఒకబూడిదకుప్పమాత్రమే.

ఈసందర్భములో కాళిదాస మహాకవి చెప్పినమాటలు మనము స్మరించుట యుచితము.

"అలోకసామాన్య మచింత్య హేతుకం
ద్విషంతి మందాశ్చరితం మహాత్మనాం."

మహాత్ములచరిత్రములు లోకసాధారణములుగానుండవు. వార లెందుకు ప్రవర్తింతురో ఎంత ఆలోచించినను సామాన్యుల కందదు. అవివేకులు వారి చరిత్రములను ద్వేషింతురు.

కాని నాకు తెలిసినంతవఱకు ఆయన ఇట్లెందుకు చేసెనో ఒక కారణము నేను చెప్పుటకు సాహసించుచున్నాను. ఆయన అంత కాలము సమీపించినదని గుర్తించియుండును. మరణానంతరము తన శరీరమునకు సంస్కారము చేయవలసినపని ఇతరులపై పెట్టి వారిని బాధింపనేలయని మనఃకాయనియతితో ఆర్యజనునకు సహజమైన తుదియజ్ఞకర్మ నామహనీయుడు నిర్వర్తించెను.

ఈరచయిత (వివేకానందస్వామి) ఈ సిద్ధపురుషున కెంతో ఋణపడియున్నాడు. ఈ మహాగురువునకు తాను భక్తుడు, సేవకుడు. ఈ రచనను ఆమహనీయునియొక్క జ్ఞాపకచిహ్నముగా నుండుటకు ఆయనకంకితము చేయుచున్నాడు. నిజమునకు అంతయోగ్యత ఈ రచనలో లేక పోవచ్చుగాక!



# ఆర్యులు - తమిళులు

హిందూదేశము మనుష్యశాస్త్ర ప్రదర్శనశాలయని చెప్ప వచ్చును. సుమత్రా దీవులలో కన్గొనబడిన అర్థవానరాస్థిపంజరము వెదకినచో ఇచ్చటను కన్పించవచ్చును. డోల్‌మెన్‌లు కావలసినన్ని దొరకును. రాతిపనిముట్లు ఎక్కడత్రవ్వినను దొరకును. చెఱువులప్రక్క నివసించెడిజనము, కనీసము నదీతీరముల నివసించెడి జన మొకప్పుడు సమృద్ధిగా ఉండియుండురు. గుహలలో నివసించెడివారు, పర్ణాంబరులు, ఇప్పటికిని ఉన్నారు. దేశములోని బహుభాగములలో అడవులందు పురాతనకాలపు వేటకాండ్రు కన్పింతురు. చారిత్రకజాతులనుగుఱించి చెప్పనే అక్కఱలేదు. నీగ్రిటోలు, కొనేరియనులు, ద్రావిడులు, ఆర్యులు వీరందఱు చారిత్రకజాతులే. వీరికి కాలాంతరమున బహుజాతులతో సంపర్కముకల్గినది. మంగోలులు, తార్తారులు, భాషాశాస్త్రజ్ఞులు చెప్పు ఆర్యజాతులు వీరితో సంపర్కముకల్గియుండిరి. ఇచ్చట పర్ష్యాదేశీయులు, గ్రీసుదేశీయులు, యూంచీలు, హూణులు, చైనీయులు, సిథియనులు, మఱి కొంతమంది అందఱు మేళవించుకొనిపోయిరి. యూదులు, పార్సీలు, అరబ్బులు, మంగోలులు జర్మన్ అడవులలో నివసించు వైకింగు జాతీయులు - అంతయు కలిపి ఒక మానవసముద్రము. జాతులసముద్రములో తరంగములు. ఇవి పైకిలేచును. కళకళలాడును. ఒకదానితో నొకటి ఢీకొనును. రూపుమాయును. ఒక్కొక్కప్పు డువ్వెత్తునలేచి చిన్నితరంగములను మ్రింగును. ఒక్కొక్కసారి క్రుంగును. ఇవన్నియు కలిసి హిందూదేశచరిత్ర యాయెను.

ఇంత ఈ గందరగోళములో ఒకానొక తెగ - ఒకపద్ధతి కనిపెట్టి దాని గొప్ప సంస్కృతివల్ల హిందూదేశములోనున్న బహుజనులను తనలో నిముడ్చుకొనగల్గినది.

ఇది ఉత్తమోత్తమమైనజాతి. దీనిపేరు ఆర్యజాతి. అది కనిపెట్టిన పద్ధతి వర్ణాశ్రమాచారము.

ఆర్యులు బుద్ధిపూర్వకముగనో, అబుద్ధికృతముగనో కొన్ని సౌకర్యములు తమకై ప్రత్యేకించుకొనిరి. ఐనప్పటికి వర్ణాశ్రమ పద్ధతి చాల మంజులము. ఒక్కొక్కప్పుడు సాంస్కృతికముగ హీన స్థితిలోనున్న జాతులను పైకిలాగుటకు తగినంత మంజులముగ కూడ నుండెడిది.

హిందూదేశమును నడపునది ధనముకాదు. కత్తికాదు. మేధ. ఆత్మశక్తిచేత నియమితమై పవిత్రీకృతమైన మేధస్సుచే దేశము నడపబడుచున్నది. దీనికి కారణము వర్ణాశ్రమవ్యవస్థయే. భారత దేశములో ఈ నాయకత్వము వహించిన వర్ణము బ్రాహ్మణ వర్ణము. వీ రార్యులలో అగ్రేసరులు. ఇతర దేశములందలి సాంఘిక వ్యవస్థకంటె ఆర్యులవ్యవస్థ పైకి భిన్నముగా కన్పించినను రెండు విషయములలో తప్ప తక్కినవానిలో అంతగా భేదించదు.

ఇతర దేశములలో యుద్ధకుశలుడైన క్షత్రియునకే అందఱి కంటె ఎక్కువ గౌరవమిత్తురు. రోములోనున్న మతగురువైన పోప్ రైనునదియొడ్డుననున్న ఒకానొక బందిపోటుదొంగల వంశ మునకు చెందినవాడనని చెప్పికొని తృప్తిపడును. భారతదేశములో అందఱికంటె ఎక్కువగా గౌరవింపబడునది శాంతుడైనపురుషుడు. అనగా బ్రాహ్మణుడు. సత్పురుషుడు.

భారతచక్రవర్తులలో మిగుల నుత్కృష్ట స్థానము నలంక రించువాడైనను తన వంశమునకు మూలపురుషుడొక ఋషియని చెప్పుకొనుటకు గర్వపడును. ఆ ఋషి ఒక అడవిలో దరిద్రుడై నివసించుచు అచ్చటిగ్రామీణులవద్ద వలసిన పదార్థములుకొనుచు తనజీవితమునంతయు ఇహపరములను గుఱించిన సమస్యలను పరిష్కరించుటకై వినియోగించుచు గడపినట్టివాడు. ఇది మొట్ట

మొదటి విషయము. అనగా ఇతరదేశములకును మనదేశమున కును నున్న ప్రథమభేదము.

రెండవది వర్ణభేదము. ఇతరదేశములలో వ్యక్తివరకే పరిమితము. ధనము, అధికారము, మేదస్సు, సౌందర్యము, ఇవి యున్నచో జన్మతః అత డేతరగతికి చెందినను ఫర్వాలేదు. వీనితో నతడుత్తమస్థితి నందగలడు.

భారతదేశములోమాత్రము వర్ణము జన్మసిద్ధము. ఐననిచ్చటకూడ ఎవరైన నధమజాతినుండి ఉత్తమజాతికి పోవచ్చును. కాకపోయిన ఇతరులకొఱకు తన జీవితమును తనశక్తియుక్తులను ధారపోయవలయునను ధర్మమునకు జన్మస్థానమైన ఈదేశములో మాత్రము తన జాతినంతను ఉద్ధరించినతప్ప, తన కుద్ధరణములేదని ఒక డెంచును. పరార్థవాదమునకు పుట్టినిల్లైన మన ఈదేశములో మాత్రము తనతో నొకడు తనయావత్తు జాతిని ఉద్ధరించును.

భారతదేశములో ధనము, అధికారము మొదలగువానివల్ల నీజాతివారిని నీవు వెనుద్రొక్కి నీకంటె పైతరగతివారితో కలియుటకు వీలుండదు. నీకున్న ధనాధికారాదులు నీవు గడించుకొనుట కుపకరించినవారిని నీవు తిరస్కరించి అవమానించుటకు వీలులేదు. భారతదేశములో నీవు నీకంటె పైజాతిలో చేరవలెనన్న మొదటగా నీవు చేయవలసినది నీ జాతిని ఉన్నతదశకు తెచ్చుట. అప్పుడు నిన్నడ్డుపెట్టగల్గినది మార్గములో నేదియునుండదు.

హిందువుల సమ్మేళనపద్ధతి. అనంతకాలమునుండి ఇది సాగుచునేయున్నది. ఇతరదేశములోకంటె భారతదేశములోనే ఆర్యులు ద్రవిడులు మొదలగుమాటలకు భాషాశాస్త్రవిషయకము గనే అర్థముగలదు. తల పుఱ్ఱెలను పరీక్షించి దానివలన జాతి భేదములను నిరూపించుట యిచ్చటకుదురదు.

బ్రహ్మ క్షత్రియాది శబ్దములుకూడ కేవలము కులమర్యాదలనుమాత్రమే సూచించునవి. ఈకులము చక్కగా పరిష్కృత

మైనతర్వాతకూడ ఈకులములందు హెచ్చు తగ్గులు సంభవింపక తప్పలేదు. కొన్ని తక్కువజాతులవారి నుండియో పరదేశముల నుండి వచ్చినవారినుండియో కొన్ని క్రొత్తసంఘములను పైకుల ములో చేర్చుకొనకతప్పలేదు. కాకపోయిన వివాహాదులు చేసి కొనకుండ కొంత శాఖాభేదములు కాపాడుకొనుచువచ్చిరి.

యుద్ధకౌశల్యముకలిగిన జాతియంతయు క్షత్రియులలోను విజ్ఞానప్రతిభలుకలవారు బ్రాహ్మణులలోను, ధనముకలవారు వైశ్యులలోను పరిగణితులైరి.

ఈ క్రొత్తవారువచ్చి తమలో చేరినను అపూర్వపు ప్రాత వారు కొంత శాఖాభేదము కల్పించి వారితో సంకరముకాకుండ దూరముగనుంచుచు వచ్చిరి. కాని కాలాంతరమున వారు వీ కేకముకాక తప్పలేదు. ఇది భారతదేశమున మనకన్నులయెదుట కన్పించుచునే యున్నది.

సాంఘికముగ అభివృద్ధిచెందిన కొంతమంది ప్రజలు కొన్ని సౌకర్యములను ప్రత్యేకముగనుంచుకొనుటకు వాంఛించుట స్వాభా వికము. కాబట్టి ఎవడైన ఒకరాజుయొక్క అండలభించినప్పు డుత్తమజాతివారు ప్రధానముగ బ్రాహ్మణు లధమజాతివారిలో నున్న తుల్యవాంఛలను బలముపయోగింపజేసి వీలైనచో అణచి వేయుటకు యత్నించెడివారు. కాని వారీప్రయత్నములో జయము పొందిరా యన్న ప్రశ్నకలదు. మీ పురాణములను ఉపపురాణ ములను జాగ్రత్తగా పరీక్షించిచూడుడు. మహాపురాణములందలి స్థానికఖండములనుచూడుడు. అంతవఱకెందుకు ? మనకన్నుల యెదుట మనచుట్టు ఏమిజరుగుచున్నదో చూడుడు. ఈ ప్రశ్నకు సమాధానము దొరుకును. మనలో ఇన్ని వర్ణభేదములున్నవి. వివాహాదుల విషయములో ఒకవర్ణమందే శాఖాభేదములుపాటించు చున్నాము. ఐనను ఎన్నికట్టుదిట్టములు చేసికొన్నను మన దొడ

మిశ్రితజాతియనక తప్పదు. ఆమాటకున్న పరిపూర్ణమైన అర్థము మనయందు పట్టితీరును.

ఆర్యతమిళ శబ్దములకున్న అర్థమేమైనను హైందవులలో నున్న ఈ రెండు పెద్దతరగతుల ప్రజలు పశ్చిమసరిహద్దులనుదాటి హిందూదేశమునకు వచ్చియుందురని ఒప్పుకొన్నప్పటికిని, బహు పురాతనకాలములనుండి ఈ తరగతులమధ్య భిన్నత్వము భాషా సంబంధమైనదిగాని రక్తసంబంధమైనది మాత్రముకాదు. వేదము లందు వర్ణింపబడిన దస్యుజనుల శారీరకవికారము లేవియు ద్రవిడు లకు లేవు. ఆ విశేషణము లేవియు వీరికి పట్టవు. ఆర్యులందముగా నుందురా తమిళులందముగానుందురాయని ఒక కాని డబ్బు పై కెగురవేసి తేల్చుకొనవలసినదే.

ఏవర్ణమునకుగాని ఉన్న ఆభిజాత్యగర్వము అంతస్సత్త్వము లేనిదిమాత్రమే యగును. కాని ఈ ఆభిజాత్యగర్వము దక్షిణ దేశములో ఈ భాషాభేదములవల్ల నిలద్రొక్కుకొన్నదని చెప్పు టకు మాకు చాల విచారమగుచున్నది. ఐతే దక్షిణదేశములో ఈ సాంఘిక నియంతృత్వము తబిసీలుగా మేమిచ్చుట విచారించుట కిచ్చగింపము. అట్లే విభిన్న బ్రాహ్మణశాఖలు ఇతరకులములు ఎట్లు జన్మించినవో పరీక్షించుటకుకూడ మేము ఇచ్చగించుట లేదు: కాని మదరాసు రాష్ట్రమందు బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులమధ్య నున్న తీవ్ర విరోధమును మనము గమనించినచో చాలును.

పరమేశ్వరుడు మనుష్యుల కనుగ్రహించిన సాంఘికవ్యవస్థ లలో వర్ణవ్యవస్థ పరమోత్తమమైన దానిలో ఒకటియని భారతీ యులమైన మనవిశ్వాసము. ఈవ్యవస్థలో తప్పనిసరిగా సంభవిం చిన కొన్ని దోషములు విదేశీయులు పెట్టిన బాధలనుండియు పలువురు బ్రాహ్మణశబ్దవాచ్యుల అజ్ఞానాహంకారములనుండియు జనించి బహువిధముల పరమోత్తమమైన భారతీయవ్యవస్థ యొక్క సక్రమమైన అభ్యుదయమును నిరోధించినను, ఈ వ్యవస్థ

భారతదేశములో ఆశ్చర్యకరమైన ఫలితములను సాధించినది. భారతీయప్రజ లక్ష్యసిద్ధినందుట కీ వర్ణాశ్రమవ్యవస్థ యుపకరింపగలదనుటలోకూడ సందేహములేదు.

భారతదేశముయొక్క లక్ష్యము మఱచిపోవద్దని మేము హృదయపూర్వకముగ దక్షిణభారతీయబ్రాహ్మణులను ప్రార్థించుచున్నాము. ఆలక్ష్యము ప్రపంచమందలి సర్వజనులను పరిశుద్ధులు, పరమేశ్వరతుల్యులైన సద్బ్రాహ్మణులనుచేయుటయే. మహాభారతము మొదట సృష్టియంతటను మానవులందఱు బ్రాహ్మణులే యని చెప్పినది. సృష్టియంతమునందును అందఱు నందువల్ల బ్రాహ్మణులే కావలెను.

అందుచేత నేను బ్రాహ్మణుడనని చెప్పుకొను ప్రతివాడును ఊరక నటించి లాభములేదు. తమ ఆధ్యాత్మికశక్తిని ఋజువొనరింపవలెను. తర్వాత ఇతరులకుకూడ అట్టి స్థితి చేరునట్లుద్ధరింపవలెను.

ఈబ్రాహ్మణులలో చాలమంది వట్టి అభిజాత్యగర్వము మాత్రమే పెంచుకొనుచున్నారు. మోసగాండ్రెవరైనను స్వదేశీయులైనను విదేశీయులైనను కాని వీరి యీ దురహంకారమును, స్వాభావికమైన సోమరితనమును ప్రస్తుతించిన చాలు; వీరు సంతృప్తిపడెదరు.

ఓ బ్రాహ్మణులారా! జాగ్రత్తపడుడు. ఇది మరణచిహ్నము. లెండు. మీ మనుష్యత్వమును చూపుడు. మీ బ్రాహ్మణత్వము మీ చుట్టునున్న బ్రాహ్మణేతరుల కౌన్నత్యము కల్గించుటవలన ఋజువుచేసికొనుడు. ఊరకయేదో చెప్పుటవల్ల గురుత్వము వహించుటయో అహంకారపడుటయో అంధవిశ్వాసములలో దొర్లుటయో ప్రాచ్యమని పాశ్చాత్యమని వట్టిమాటలు చెప్పుటయో వల్లకాదు. సేవాబుద్ధితో తక్కినవారి నుద్ధరింపుడు. సేవించుట తెలిసినవాడే పరిపాలించుట కర్హుడు.

మఱి బ్రాహ్మణేతరులున్నారు. వారుకూడ వర్ణద్వేష మును ప్రజ్వలింపజేయుటలో తమ శక్తులను ఖర్చుపెట్టుచున్నారు. దీనివల్ల ఉన్నసమస్య తీరదు. ఈ జ్వాలలో హైందవేతరులు సంతోషపూర్వకముగ మఱికొన్ని సమిధలుకూడ వేయుచున్నారు.

ఈ వర్ణద్వేషములవల్ల మనమొక్క అడుగును ముందుకు వేయలేము. మన కష్టమొక్కటియుతీరదు. ఇంతియకాక మన కేమైనలాభము కలుగునన్నచో నదియు పోవును. ఈ ద్వేషాగ్ని ప్రజ్వలించినచో శతాబ్దులతరబడి మనకు అభివృద్ధి ఉండదు.

ఇది బౌద్ధులుచేసిన రాజకీయమైన తప్పిదము. మఱల తిరిగి జరుగుటయే యగును.

ఈ యజ్ఞానపుగొడవలో, ఈద్వేషములో పండిత డి. సవరి రాయన్ అను నతడు న్యాయమైన వివేకవంతమైన మార్గములో పనిచేయుచుండుట మాకు సంతసముకల్గించుచున్నది. ఆయన ఆర్య ద్రవిడ సమ్మేళనమన్న విషయముమీద కొన్ని వ్యాసములు వ్రాసెను; "సిద్ధాంత దీపిక" యను పత్రికలో. ఈ వ్యాసముల యందు పాశ్చాత్యభాషాశాస్త్రము సృష్టించిన అస్పష్టతను ఆయన తొలగించగల్గినాడు. దక్షిణదేశమందున్న వర్ణవిషయిక సమస్య లను చక్కగా నర్థముచేసికొనుటకు సొగసైన మార్గమును వేసి నాడు. అంతేకాని అర్థరహితమైన పిచ్చిపిచ్చి తగాదాలతో తన అనర్ఘమైనశక్తిని వెచ్చపెట్టలేదు.

యాచించుటవల్ల ఒరుగునదేమియులేదు. మనము అర్హుల మైనప్పుడే మనకేదైన లభించును. ఈ అర్హత సంపాదించుటకు మొదటి లక్షణము దానిని సాధింపవలెనను ఇచ్ఛ. మనము ఆస్తిని సంపాదించుట కర్హులమని మనము భావించినపుడు మాత్రమే ఆస్తినికోరి మనము కృతార్థులమగుదుము.

అందుచేత ఈ పాశ్చాత్యులు చెప్పిన ఆర్యసిద్ధాంతము దాని సాలెగూటి చిక్కులు, దాని విషమయమైన అనుబంధములు

నెమ్మదిగా పరిశుభ్రముగా తుడిచి పారవేయుట చాల అవసరము. ఎక్కువ దక్షిణదేశమున కవసరము. ఆర్యజాతికి పూర్వవంశీయులైన ద్రావిడుల పురాతనవైభవము చక్కగా నర్థముచేసికొని కొంత ఆత్మగౌరవము సంపాదించుకొనుటకూడ అవసరము.

మేమార్యశబ్దమును త్రోసిపుచ్చుటలేదు. కాని ఈశబ్దమునుగూర్చిన అన్య సిద్ధాంతములు మాకు నచ్చవు. మా మతగ్రంథములందలి ఆర్యశబ్దమున కర్థము, ఇప్పుడున్న కోటానుకోట్ల హిందువులు. ఈ ఆర్యజాతి రెండు గొప్పజాతుల కలియకవల్ల నేర్పడినది. ఒకరు సంస్కృతము మాట్లాడువారు. ఇంకొకరు తమిళము మాట్లాడువారు. వీరు హిందువులు. ఈ ఆర్యశబ్దము హిందువులందఱకు సమానముగవర్తించును. కొన్ని స్మృతులలో ఆర్యశబ్దము శూద్రులకు వర్తించదని ఉన్నది. దాని కర్థము లేదు. శూద్రులనగా పరమార్థము నవగతముచేసికొనుటకు వేచియున్న ఆర్యులని యర్థము, అంతే.

పండిత సవరిరాయన్ నడచుచున్నది విపజ్జనక స్థానము మీాదనని మాకు తెలియును. వేదమందలి కొన్ని నామములకు జాతులకాయన చెప్పిన అర్థములు మే మొప్పుకొనము. ఐనను హైందనాగరకతాసంస్కృతులను పరీక్షించుటకు పునాదివేసినాడు. వాని పుట్టుపూర్వోత్తరము లెట్టివో పరిశోధింపగడంగినాడు.

ఆయనపురాతన ద్రావిడులు, అక్కడోసుమేరియనులు ఏకజాతివారను సిద్ధాంతముచేయుటయు సంతోషదాయకమే. ఈ అక్కడోసుమేరియన్ నాగరకత అన్ని నాగరకతలకంటెను పురాతనమైనది. దీనితో పోల్చిన ఆర్యనాగరకత, సెమెటిక్ నాగరకత పసిపాపలు. ఇట్టి నాగరకతకు చెందుటవల్ల మాకిది గర్వకారణమే.

ఈజిప్టుదేశీయుల తొలినివాసము పుంటు. ఇది మలబారు. ఇచ్చటి ప్రజలే. సముద్రముదాటి నైలునదీ ప్రాంతమున దక్షిణో

త్తరములుగా వ్యాపించినారు. వారే ఈజిప్టీయులు. వారెల్లపుడు తమపురాతన దేశమునుగుఱించి స్వర్గతుల్యముగా భావింతురు. దానినికూడ మేమీసందర్భములో సూచించుచున్నాము.

ఈత్రోవ నిజముగ చాలమంచిది. తర్వాతతర్వాత వివరముగ శ్రద్ధగ ఈపరిశోధన తప్పకుండ కొనసాగగలదు. తమిళభాషను చక్కగా అధ్యయనముచేయుటవల్ల సంస్కృతవేదాంతమునందును మతమందునుగల ద్రావిడ సంపర్కములు చక్కగా వ్యాసంగముచేయుటవల్ల ఈ పరిశోధన చక్కగా కొనసాగగలదు. నిజముగా తమిళభాషను మాతృభాషవలె నేర్చుకొన్నవారు మాత్రమే ఇట్టి పరిశోధనచేయుట కర్హులు.

మఱి మేము వేదాంతులము. సన్న్యాసులము. మేము సంస్కృతభాషులైన మా పూర్వఋషులైన వైదికులను చెప్పికొని గర్వపడుదుము. పురాతన తమమైన నాగరకతకల మా తమిళభాషులైన పూర్వపు ఋషులను తలంచుకొని గర్వింతుము. ఈ ఇద్దఱికంటెను పురాతనమైన కోలారులను మాపూర్వపు ఋషులను తలచి గర్వింతుము. వీరు అడవులనివసించి వేటవల్ల జీవించెడివారు. రాతిపనిముట్లు వాడెడి పురాతనవాసులను తలంచియు మేము గర్వింతుము. వీరు తొలిమానవులు. మఱి డార్విన్ చెప్పిన పరిణామవాదము నిజమైనచో మేము మానవునికంటెను పురాతనమైన చతుష్పదప్రాణులైన మా పూర్వులనుగూర్చి తలంచుకొని గర్వింతుము. అసలు మేము చరాచరాత్మకమైన ఈ విశ్వముయొక్క బిడ్డలమని గర్వింతుము. మేము జన్మించి పనిచేయుచు బాధపడుచున్నామని గర్వింతుము. మా చేయుపని తీరిపోయి మరణించి పునరావృత్తిరహితమైన శాశ్వతపథమున ప్రవేశింతుమని మఱిమఱి గర్వింతుము.



# దివ్యజ్ఞానసమాజమువిూద విమర్శ

దివ్యజ్ఞానసామాజికులు ఈ సంవత్సరము జూబిలీ యుత్స వము చేసికొనుచున్నారు. వారు ఈ 25 సంవత్సరముల నుండి ఎట్లు నడుచుకొనుచున్నది, ఏమిచేయుచున్నది అంతయు వార్తా పత్రికలలో ప్రకటింపబడినది.

హిందువులదృష్టి మిగుల విశాలమైనదికాదని, అత్యంతమైన యౌదార్యము(దోషమేమో యనిపించువఱకు) వారికి లేదని ఎవ్వరు పలుకజాలరు. కొంతమంది హైందవయువకులీ అమెరికా వేదాం తపు టంటుముక్కలను తెచ్చి నాటి దాని మాహాత్మ్యమును గుఱించిన గాథలతో ఇచట పెంపకముచేయుచుందురు.

ఈ దివ్యజ్ఞానసామాజికులు ఈ విశ్వమునుగుఱించిన దివ్య జ్ఞానము అచ్చముగా తమకే కలదని వాదింతురు. వారికట్టి జ్ఞాన మున్నదని తెలిసికొనుటకు మేము సంతోషింతుము. అట్టి జ్ఞానము వారు కట్టుదిట్టములుచేసి ఎవ్వరికి తెలియకుండ రహస్యముగ కాపాడుచున్నందుకు మాకు మఱియు సంతోషముగనున్నది. మేము హిందువులము. దీనులము. మాపై ఈజ్ఞానవాహిని ప్రవ హించినచో నేమైపోవుదుమో! అధునాతన దివ్యజ్ఞానమతమంతయు అనిబిసెంటే. బ్లావాట్స్కీమతము, ఆల్ కాట్ మతము వెనుకపట్టి నట్లు కన్పించుచున్నవి. కనీసము అనిబిసెంట్ అభిప్రాయమైనను మంచిదే. మఱి ఆమె పట్టుదల ఉత్సాహమును గుఱించి ఎవరై నను మఱొకమాట చెప్పలేరు.

దివ్యజ్ఞానమతమును తీవ్రముగా విమర్శించువారుండ వచ్చును. మామట్టుకు దివ్యజ్ఞానమతములో మంచియే కన్పించు చున్నది. కొన్ని ప్రత్యక్షముగా మంచివి - కొన్ని పరోక్షముగ

మంచివి. మేము పరోక్షముగా మంచివన్నవానినే వారు చెడుగా భావనజేసి మంచివిచేయునవందురు. అనగా చెడులోగూడ మంచి కల్గించు లక్షణమున్నదని వారిభావన. వివిధములైన భువర్లోకాదు లనుగూర్చి – వానిలోనివసించు జనులనుగూర్చి వారికి బాగుగా తెలి యును. కొంతమంది దివ్యజ్ఞానసామాజికులు నేర్పుగా ఇతరలోక ములవారిని పిశాచములను, తర్జనితో పిలిచి మాట్లాడుదురు. ఇదంతయు మంచిదే! ఈ దివ్యజ్ఞానము మాకు తెలిసిన సూది మందులలో చాల ఉత్తమమైనది. దీనిని ఎక్కించినచో కొంత మంది తలలో సూక్ష్మజీవులు బాగుగా పెరుగును. ఈ లోకాలను గుఱించి చెప్పినదంతయు యథార్థమని వారపుడు చక్కగా అంగీక రింతురు.

ఈ దివ్యజ్ఞానసమాజముకాని, మతేసమాజముకాని చేయు చున్న మంచిపనిని తక్కువపఱచవలెనను ఉద్దేశము మాకులేదు. కాని గతకాలములో అతిశయోక్తి మనజాతిలోనున్న దుర్గుణము. దివ్యజ్ఞానసమాజము సాధించినదానినిగుఱించి లక్నోలోని "ఎడ్వొ కేట్" – అను పత్రికలో ప్రకటితమైన వ్యాసములో అది చాల అతి శయోక్తులతోకూడుకొని యున్నదని చెప్పక తప్పదు. ఒక విషయ మునుగూర్చి తక్కువచేసి మాట్లాడుట చాల దుర్మార్గమనిచెప్పక తప్పదు. అట్లే ఒకపనినిగుఱించి అనవసరముగ ఆకాశమునకెత్తు టయు జుగుప్సాకరముగానుండును.

ఈదివ్యజ్ఞానము అమెరికాదేశపు టాధ్యాత్మికవాదము యొక్క అంటుమొక్క. ఆధ్యాత్మికపరిభాషగా కొన్ని సంస్కృత శబ్దములు ప్రయోగింపబడును. భూతావేశమును గుఱించిన ఉదం తము లేకపోలేదు.

ఆ యీ సందర్భమంతా "ఎడ్వొకేట్" – లో వ్యాస ములువ్రాసిన రచయితకు తెలియునని మేమారోపించుట లేదు. కాని ఆరచయిత హిందువులనగా తాను తన దివ్యజ్ఞాన సామాజి

కలుగునని అనుకొనరాదు. స్వామి దయానందసరస్వతి మొదట బ్లావాట్స్కీ మతము నాదరించినను తర్వాత దానిలోని సంగతి సందర్భములను గ్రహించి దానిని దూరీకరించినాడు. హిందువులలో చాలభాగము మొదటినుండి ఈ దివ్యజ్ఞానసామాజికుల క్రియాకలాపములన్నిటిని చక్కగా కనిపెట్టుచున్నారు. దీని కెంత దూరముగానున్న మంచిదో వారికి తెలియును.

ఈ రచయితయొక్క ప్రత్యేకదృష్టి యట్లుండనిండు. ఈ కలియుగములోగూడ హైందవులలో మతబోధకు, బోధకులకు కొదువలేదు. ఆ పనికై వారికి రష్యన్ పిశాచములు అమెరికన్ పిశాచములు అక్కఱలేదు.

ఈ వ్యాసములు హిందువులపైన, వారి మతముపైన అవమానకరమైన ప్రచారములు. ఆ రచయిత ఈ సంగతి తెలిసికొనుగాక. ఏమనగా, మా హిందువు లెవరికి పాశ్చాత్యదేశముల నుండి మతమును దిగుమతిచేసికొను నవసరము పట్టలేదు. దాదాపు తక్కినవస్తువులన్నియు దిగుమతిచేసికొన్నందువల్ల వచ్చిన అవమానము చాలు. మతము దిగుమతిచేసికొనవలసిన అవసరము పాశ్చాత్యదేశములకున్నది. అసలు మేము చేయుచున్న పని అదే. ఈ దివ్యజ్ఞానసామాజికులు పాశ్చాత్యదేశములలో మన మతమునకు చేసిన సాహాయ్యము అచ్చట క్షేత్రమును సిద్ధముచేసిపెట్టుటకాదు. మీదుమిక్కిలి అందు వారివలన నెలకొనిన వింతపద్ధతుల నెదుర్కొని మతసముద్ధరణమునకై విశేష కృషి చేయవలసివచ్చును. దివ్యజ్ఞానసామాజికులు మాక్సుముల్లర్ మొదలైన పండితులయొక్కయు, ఎడ్విన్ ఆర్నాల్డ్ మొదలగు కవులయొక్కయు ప్రాపకము సంపాదించి పాశ్చాత్యుల హృదయములను వశపఱచుకొనుటకు వాంఛింతురు. కాని వీ రా పండితులను, ఆ కవులను నిందించుటకు సర్వోత్తమమైన వివేకము తమకే కలదని నటించుటకు వెనుదీయరు. ఇంత సర్వోత్తమమైన విశ్వ

వివేకము రహస్యముగా దాచిపెట్టబడినందులకు మనసు కుదుట పఱచుకొందుము. హిందూదేశములోని గారడీవిద్య, ఫకీరులవిద్య మొదలైన హైందవుల ఆధ్యాత్మికవిద్య యను భావము పాశ్చాత్య దేశములలోని విద్వాంసుల హృదయములలో బలపడినది. మన దివ్యజ్ఞానసామాజికులు మన హిందూమతమునకు చేసిన గొప్ప సాహాయ్య మిదియే.

ప్రతిదేశములో ఈ దివ్యజ్ఞానసమాజముండుటవల్ల కలిగిన సత్ఫలిత మొక్కటే; మాకు తెలిసినంతవఱకు నిజమైన ఆధ్యాత్మిక వేత్తలను వంచకులనుండి వేఱుచేయుట.

ప్రొఫెసర్ కోచ్ క్షయరోగుల ఊపిరితిత్తులందు సూది మందులను ప్రయోగించువాడు. క్షయవ్యాధిగ్రస్తులు ఆరోగ్య వంతులనుండి వేఱుచేయబడుచుందువారు. ఆధ్యాత్మికప్రభావము గలవారినిగూడ ఒరులనుండి ఇట్లే వేఱొనరించి గుర్తించు టవసరముగదా! ఇట్టి సత్కార్యము దివ్యజ్ఞానసమాజము సర్వ దేశములందు చేసినది. ఇది సత్యారముగ దృగ్గోచరమైన ఏకైక మైన మేలు.



# ఒక స్నేహితునికి సానుభూతి సందేశము

(ఈ ఉత్తరము 1893 వ సం॥ము మే 23 వ తారీకున డి. ఆర్. బాలాజీరావు అను ఒక ఆపన్నగ్నుడైన స్నేహితునికి బొంబాయినుండి వ్రాయబడినది)

"నేను తల్లిగర్భమునుండి దిగంబరునిగా జనించితిని. మఱల దిగంబరునిగనే నేను ఎటనుండి వచ్చితినో అటకే పోవుదును. పరమేశ్వరుడు ఈ మధ్యదంతయు నిచ్చినాడు. మఱల తీసి కొన్నాడు. పరమేశ్వరుని నామమే సర్వోత్కృష్టమైనది." ఇవి

పురాతనుడైన ఒక యూదు సాధువు ఒక మహాపద సంభవించినప్పుడు చెప్పిన మాటలు. అతడు చెప్పినది యథార్థము. ఈ మాటలలో సృష్టిరహస్యమంతయు నిమిడియున్నది. సముద్రము యొక్క ఉపరితలమున పెద్ద పెద్ద తరంగములు లేవవచ్చు. తుపానులు విజృంభింపవచ్చు. కాని సంద్రముయొక్క లోతులందు అంతరాంతరములందు అనంతమైన నైశ్చల్యము, ప్రశాంతి, ఆనందము నున్నవి. దుఃఖితులు అదృష్టవంతులు. వారికి తప్పకుండ సాంత్వనము లభించి తీరవలెను. ఎందుచేత? ఇట్టి కష్టములు సంభవించినపుడు హృదయము నిరంతరము వేదనాదోదూయమానమై నిరాశాయుతమై యుండును. మనకాళ్లక్రింద భూమి కదలిపోయినట్లుండును. ఈ ప్రపంచమంతయు దుఃఖమయమై నిరాశామయమై కన్పించును. అప్పుడు హఠాత్తుగ అంతశ్చక్షు వున్మీలితమై పరమార్థము మనకళ్ళయందు తళతళ మెఱసి, ఈ ప్రపంచమంతయు స్వప్నప్రాయమై, ఈ సృష్టిరహస్యము మనకు అపరోక్షమై భాసించును. అదియే సత్పదార్థము. నిశ్చయముగా ఇట్టి సందర్భములందే ప్రతిభావంతునికి, మనోదార్ఢ్యముకలవానికి, ఆనందమయమైన సత్పదార్థావభాసము, బ్రహ్మానుభవము కల్గును. ఈ అనంతమైన సత్పదార్థమునే వివిధమతస్థులు వివిధములైన నామరూపములతో ఆరాధింతురు. దుఃఖమువల్ల జరుగు సాహాయ్యమిది. కాని పేదగుండెలుకలవారిని, ప్రాకృతులను దుఃఖము ఛిన్నాని జేసివేయును. ఈ సత్పదార్థావభాసము కల్గిన తర్వాత దుఃఖదాయకములైన బంధములు నిరస్తములై జీవాత్మ పరమాత్మయందు లీనమగును. ఈ స్థితియే శాంతి. ఒకడు పరమ దుర్మార్గుడు కావచ్చును, దురాచారుడు కావచ్చును. పరమాత్మ సన్నిధానములో వాని దుస్స్వభావము నిరస్తమై పోవును. పరిశ్రాంతుడు విశ్రాంతిచెందును. అందుచేత బాబూ! అహోరాత్రము పరమేశ్వరునకు విన్నపము చేయుచునే యుందుము. "ఓ పరమేశ్వరా! నీయుద్దేశము నెఱవేఱును. 'ఎలా?' యని ప్రశ్నిం

చుట మా పనికాదు, నీయాజ్ఞ నిర్వర్తించుట, తర్వాత మరణించుట మాపని. అంతే. ఓ ఈశ్వరా! నీనామము సర్వోత్కృష్టము. నీయుద్దేశము నెఱవేఱును.'' ఓ పరమేశ్వరా! నీయాజ్ఞకు తల వంచితీరవలెనని మాకు తెలియును. ఓ స్వామీ! నీశక్తియే ఈ కష్టముల స్వరూపముగ మాకు ప్రత్యక్షమగుచున్నదని మాకు తెలియును. నీ యాజ్ఞకు లోబడుట జీవున కిష్టమే కాని శరీరమునందు కష్టము ననుభవించు ఓపిక లేదు. ఓ దయాస్వరూపుడా! నీవుపదేశించు ఆత్మార్పణ మొనర్చుటకు హృదయము వెనుకాడుచున్నది. ఆత్మార్పణము చేయుటకు తగిన దార్ఢ్యము మా కిమ్ము. ఓ పరమేశ్వరా! నీవు సృష్టించిన ఈవిశ్వమంతయు నీ కుటుంబము. ఈ నీకుటుంబమంతయు వినష్టమగుచుండగా రెండు చేతులు కట్టుకొని నీవు నిశ్చలముగా, ప్రశాంతముగా చూడగలవు. ఓ పరమేశ్వరా! ఓ మహాగురుమూర్తీ! సైనికుడు సేనాని ఆజ్ఞకు 'చిత్త' మనవలసినదేతప్ప ఎదురుచెప్పుటకు వీలులేదని నీ యుపదేశము. ''ఓ పరమేశ్వరా! అర్జునసారథీ! రమ్ము, రమ్ము. ఆ పార్థున కుపదేశించినట్లు సర్వసంగపరిత్యాగపూర్వకముగా నిన్ను శరణుచెందుటయే ఈ జీవితమునకు చరమలక్ష్య''మని నా కుపదేశింపుము. నేనును నీ యుపదేశపీయూషముగ్రోలి పురాతనమహర్షులవలె దృఢచిత్తముతో ''ఓం శ్రీకృష్ణార్పణమస్తు'' అని ఆత్మార్పణ చేయుదును.

బాబూ! పరమేశ్వరుడు నీకు చిత్తశాంతి ప్రసాదించుగాక యని అహోరాత్రములు నేను పరమేశ్వరుని ప్రార్థింతును.

—వివేకానంద



# మన మతవిశ్వాసములు

(ఇది కిడి యను నతనికి చికాగోనుండి 1894 వ సంవత్సరము మార్చి 3 వ తారీకున స్వామిజీ వ్రాసిన ఉత్తరము)

విశ్వాసమన్నది అంతస్సాధనకు చక్కగా ఉపయోగించు మాతో బాటు నేనును నంగీకరింతును. కాని దానిలో ఒక ప్రమాదమున్నది. దానివల్ల దురభిమానము పెరుగును. అభ్యుదయము కుంటువడును.

జ్ఞానము మంచిదే; కాని దానియందు నొక ప్రమాదమున్నది. అది వట్టి ప్రతిభాప్రదర్శనగా పరిణమింపవచ్చును. ప్రేమ యన్న పదార్థము చాల గొప్పదే! కాని అది వట్టి హృదయదౌర్బల్యముక్రింద పరిణమించి వినష్టము కావచ్చును.

ఈ మూడువస్తువులు సమపాళముగ నుండవచ్చును. శ్రీరామకృష్ణునియందు విశ్వాసము, జ్ఞానము, ప్రేమ యన్నవి సమతలముగా నున్నవి. అట్టి మహాపురుషులు చాల కొలదిమంది యుందురు. అప్పుడప్పు డుదయింతురు. కాని మనము ఆ సత్పురుషుల ఉపదేశములను లక్ష్యముగా నుంచుకొని సాధనచేయవలెను. మనలో ప్రతివాడు వ్యక్తిగతముగా ఆయన పొందిన పరిపూర్ణతను సాధింపలేకపోవచ్చు. కాని సామూహికముగా ఒకరినొకరు దిద్దుకొనుటవల్ల, ఒకరినొకరు సరిపోల్చుకొనుటవల్ల, సర్దుకొనుటవల్ల ఒకరికొకరు తోడుపడుటవల్ల సామూహికముగ మనము పరిపూర్ణత్వము సాధింపవచ్చును. ఇది పలువురు కలిసి సంపాదించు సమత. తక్కినమతములన్నిటికంటె ఇది నిశ్చయముగా ఉత్తమము.

ఒకమతము కొంత ఫలితమును సాధింపవలెనన్న ఉత్సాహము చాల యవసరము. కాని మనము ఈ మతభేదములు

పెరిగిపోకుండ జాగ్రత్తపడవలసినది. మనము ఈ మతభేదములు పాటింపని ఒకశాఖగా ఉండుటవల్ల కలుగు లాభములు, విశ్వజనీన మతవైశాల్యముయొక్క లాభములు రెండును మనకు కల్గును. కావున ఈ ప్రమాదము లేకుండ చేసికొనవచ్చును.

పరమేశ్వరుడు సర్వవ్యాపకుడైనను ఆయన మనుష్యశీలము నాశ్రయించి వ్యక్తమగుచుండును. రామకృష్ణునివంటి సచ్ఛీలుడు మఱి ఎవ్వడు లేడు. ఆయన పరిపూర్ణపురుషుడు. మనకు ప్రధానమైనది ఈ శీలమే. రామకృష్ణునియొక్క శీలమే మనకు లక్ష్యము. ఎవరి అంతస్తున కుచితముగా వారు ఆయన భగవంతుడని, రక్షకుడని, గురువని, ఆదర్శమని, మహాపురుషుడని వారి యిచ్చవచ్చినట్లు భావించుకొనవచ్చును. మనము సాంఘికసమానత్వముగాని, అసమానత్వముగాని ప్రచారముచేయుటలేదు. కాని ప్రతివ్యక్తికి సమానమైన హక్కులున్నవి. ఆలోచనాస్వాతంత్ర్యము, క్రియాస్వాతంత్ర్యము సర్వవిధముల ఉండితీరవలెను.

మన మెవ్వరిని తిరస్కరింపము. దివ్యజ్ఞాన సామాజికులు, ఏకేశ్వరోపాసకులు, బహుదేవతోపాసకులు, నాస్తికులు, ఎవరైనను మన కొకటే. మనము కోరునదెల్ల ఒక్కటే లక్షణము. అతడు శిష్యుడు కాదలచుకొన్నచో అతడు తనశీలమును, రామకృష్ణుని శీలమునుబట్టి మలచుకొనవలెను. ఆ శీలము గంభీరముగను, సువిశాలముగను నుండవలెను. అతని ప్రవర్తన, అతని శీలము, అతని ఆహారపానక్రియ ఒకానొకవిధముగా నుండవలెననికూడ మనము నిర్దేశింపము. అది ఇతరులకు యాతన కలిగింపనిచో చాలు. సాధనమార్గమం దభివృద్ధి అరికట్టునది, మనుష్యుని పతితునిచేయుటకు సహకరించునది దుర్గుణము. మనుష్యుని ఉత్తమస్థితిని చెందింపజేయునది, సమదృష్టిని కలిగించునది సద్గుణమని మన నిర్వచనము.

తనకు తగిన ఒకానొక విషయమును, పద్ధతిని గ్రహించుటకు, ఎన్నుకొనుటకు, అనుసరించుటకు మనము ప్రతివానికిని

స్వాతంత్ర్యమిత్తుము. ఈ యుదాహరణమును గమనింపుడు: మాంసము తినుట ఒకనికి మంచిది. ఒకనికి పండ్లుతినుట మంచిది. వారి వారి పద్ధతులలో ప్రతివారు సాధనచేసికొనవచ్చును. వారి నందఱను మనము చేర్చుకొందుము. కావలసినదెల్ల ఒకడు మఱి యొక పద్ధతిని విమర్శింపరాదు. అత డట్టి పద్ధతి ననుసరించుటవల్ల అతనికి నష్టము కలుగవచ్చును. కావున ఇతరునికికూడ నది కల్గునని విమర్శింపరాదు. అంతేకాదు. తనపద్ధతిని ఇతరు లనుసరింప వలయునని పట్టుపట్టరాదు. కొందఱకు వివాహజీవితము సాధనకు తోడ్పడవచ్చును. కొందఱకు అంకిలి కలిగింపవచ్చును. అందువల్ల బ్రహ్మచారియైనవాడు, వివాహితుడు, శిష్యుడగుటకు వీలులేదని చెప్పరాదు. తన నియమములు, తన ఆచారములు ఇతరులుకూడ అనుసరించవలెనని బలవంతము చేయరాదు.

మనము ప్రతివ్యక్తి పరమేశ్వరస్వరూపమని విశ్వసింతుము. ప్రతిజీవుడు మేఘాచ్ఛన్నుడైన జీవుడే. ఒకజీవునకు, మఱొకజీవునకు భేదము ఈపైన కప్పిన మేఘములయొక్క సాంద్రతనుపట్టియుండును. అంతే. తెలిసిగాని, తెలియకగాని సర్వమతములందును ప్రధాన మైన మూలబీజ మిదియే యని మనము విశ్వసింతుము. పరమేశ్వర శక్తి యొక్కచే భిన్నభిన్నముగ అభివ్యక్తమగుచున్నది. ఈ సిద్ధాంతమే సర్వమనుష్యజాతియొక్క భౌతిక, మానసిక, ఆధ్యాత్మికవికాసముల చరిత్రమును మనకు విశదీకరించును.

ఈ సిద్ధాంతమే సర్వవేదములకు సారభూతమైనదని విశ్వసింతుము. ప్రతిజీవి తక్కినజీవులందఱు భగవత్స్వరూపులని భావింపవలెను. అట్లు చూడవలెను. అంతేకాని వారిని ద్వేషించుట, వారి కపకారముచేయుట, హింసించుట కూడదని విశ్వసింతుము. ఇది కేవలము సన్న్యాసధర్మమేకాదు, స్త్రీపురుషు లందఱ ధర్మమును.

ఆత్మకు లింగభేదములేదు. జాతిలేదు. వేదములందు గాని, దర్శనములందుగాని, తంత్రములందుగాని ఎచ్చట

నాత్మకు లింగధర్మము విశ్వసింపబడలేదు. అందువల్ల సాంఘిక సంస్కరణములతో మతమునకు సంబంధము లేదని చెప్పు వారితో మన మేకీభవింతుము. కాని మతము సాంఘికనియమములు చేసి జీవులమధ్య భేదమును సృష్టింపవలసిన అవసరములేదు. ''దానిలక్ష్యము అట్టిభేదములను, విరుద్ధభావములను కల్పించుట కాదు'' అని మనము చెప్పినచో వారును మనతో అంగీకరింపవలెను.

ఇట్టి భేదభావమువల్ల మన మేకత్వము, సమత్వము చిట్ట చివరకు పొందుదుమని వాదించినచో దానికి మా సమాధానమిది : ''ఇదేమతము మఱల మఱల బురదతో బురదను తుడిచివేయలేమని చెప్పినది. మనుష్యుడు అవినీతిగా ప్రవర్తించుటవల్ల వినీతుడు కాగలడనుట యెట్టిదో ఇది అట్టిది.''

సాంఘికధర్మములు మతముయొక్క అంగీకారముతో ఆర్థిక పరిస్థితులవల్ల సృష్టింపబడినవి. మతము చేసిన గొప్ప తప్పిదము సాంఘికవిషయములతో జోక్యము కల్పించుకొనుట. కాని అది సాంఘికసంస్కరణము మతముయొక్క పని కాదని చెప్పుట ఎంత వంచనయో, ఎంత స్వవచనవ్యాఘాతమో చూడుడు. సరే, సాంఘికసంస్కరణము మతముచేయవలసిన పనికాదు. నిజమే. మతము సంఘసంస్కారము చేయనక్కఱలేదు. కాని సాంఘికధర్మములను మనపై రుద్దుటకు మతమున కధికారములేదు. అందుచేత మతము దూరముగా దానిహద్దులలో ఉన్నచో ప్రతివిషయము సక్రమముగా జరుగును.

మనుష్యునిలో సహజముగా ఉన్న సంపూర్ణత్వము నభివ్యక్తీకరించునది విద్య.

మనుష్యునిలో సహజముగానున్న దేవత్వమును అభివ్యక్తీకరించునది మతము.

అందువల్ల విద్యాబోధకుడుగాని, మతబోధకుడుగాని చేయవలసినది ప్రతిబంధకసామగ్రిని తొలగించుటయే. నీవనవసరముగా

జోక్యము కల్పించుకొనకుము. ప్రతికార్యము సక్రమముగా జరుగు నని నే నెప్పుడనుచుందును. అంతే మనధర్మము. త్రోవలోని అడ్డంకులను తొలగించుటమాత్రమే మనకర్తవ్యము. తక్కినపని పరమేశ్వరునిది.

అందుచే ప్రధానముగ ఈ విషయమును మీరు మనసులో నుంచుకొనవలయును. మతమునకు సంబంధము జీవునితో కలదు. సాంఘికవిషయములతో నది జోక్యము కల్గించుకొనరాదు. ఇంతకు పూర్వము జరిగిన దుర్మార్గమున కంతకును సంపూర్ణముగ నిదియే కారణమనికూడ మీరు గుర్తుంచుకొనవలయును. ఒకడు మఱి యొకని యాస్తిని బలవంతముగా లాగికొనగా, వాడు తిరిగి మఱల తనయాస్తిని వీనినుండి లాగికొనుటకు యత్నించెను. అప్పుడు వీడు గోలపెట్టుచు హక్కులను గుఱించి ధర్మపన్నములను చెప్పిన ఎట్లుండునో ఇది సరిగా అట్లుండును.

ఈ పురోహితులు ప్రతిసాంఘికవిషయముతోను జోక్యము కల్పించుకొనవలసిన అవసర మేమున్నది? లక్షలకొలది జనులు దుఃఖభాజనులగుటకు వీరిజోక్యమే కారణము.

నీవు క్షత్రియుల మాంసాహారమునుగూర్చి చెప్పుదువు. మాంసమో మఱియొకటో వారేమితిన్నను హిందూమతమునం దుదారమైనది, సుందరమైన దెల్ల వారివల్ల సంభవించినదే. ఉపనిషత్తులు వ్రాసినదెవ్వరు? రాముడెవ్వరు? కృష్ణుడెవరు? బుద్ధుడెవరు? తీర్థంకరు లెవ్వరు? వీరందఱును క్షత్రియులే. క్షత్రియుడు మతమును గుఱించి ఎప్పుడు చెప్పినను అత డందఱకు పంచిపెట్టెను. బ్రాహ్మణులెప్పు డేదివ్రాసిన నది తెలిసికొనుట కితరునకు హక్కులేదనియే చెప్పిరి. గీతను చదువుము. వ్యాసుని సూత్రములు చదువుము. నీకు చదువుకొనుట చేతకానిచో ఎవరి చేతనైన చెప్పించుకొమ్ము. గీతలో చెప్పబడినది సర్వజనులకు స్త్రీపురుషభేదములేకుండ, జాతి, వర్ణభేదములేకుండ ఉద్దిష్టమైనది.

కాని వ్యాసుడు వేదములకు కొన్ని అర్థములు ఆరోపించుటకు ప్రయత్నించెను. ఎందుకు? పాప మమాయికులైన శూద్రులను వంచించుటకు. పరమేశ్వరునియొక్క దయావాహిని కొక మాంసపుముక్క అడ్డముపడినచో ఆగిపోవుట కతడేమైన నీవలె పరమ దుర్బలుడు, అవివేకియు ననుకొంటివా? నిజముగా అత డట్టివాడే యైనచో దమ్మిడీకి కొఱగాడు.

నే నేమో చేయుదునని ఆశపడకుడు. ఒకవిషయము మాత్రము నాకు బాగుగా నిశ్చితమైనది. నేను మీకు చాలపర్యాయములు వ్రాసితిని, చెప్పితినికూడ. ఏమనగా, భారతదేశము నుద్ధరించుకొనవలసినది భారతీయులుమాత్రమే అని. అందుచే ఓ భారతీయ యువకులారా! మీరు పల్వురు ఈ క్రొత్త ఆదర్శముతో ఆవిష్టులు కాగలరు. ఆలోచింపుడు. మీకు కావలసిన పరికరములను ప్రోగుచేయుడు. సంగతి, సందర్భములన్ని విచారింపుడు. మహిమలు మొదలైనవి వదలివేసి, శ్రీరామకృష్ణుని చరిత్రము వ్రాయుడు. ఆయన బోధించిన సిద్ధాంతముల కుదాహరణప్రాయముగ నుండున ట్లాయన జీవితము వ్రాయుడు. కేవల మాయన జీవితము చాలు. దానిలోనికి నన్నో, మఱెవ్వరినో తీసికొని రాకుడు. ఆయన జీవితము వ్రాయుటలో ముఖ్యోద్దేశము ఆయన బోధలను ప్రపంచమునం దభివ్యాప్తముచేయుట. ఆ బోధల కుదాహరణప్రాయముగ ఆయన జీవితమును చూపించుట. నే నెందుకైనను పనికిరానివాడనే. ఐనను నాపై నొక బాధ్యత యున్నది. నాయధీనములోనుంచిన ఆభరణపేటికను మీ కందింపవలెను. మీకే ఎందుకందింపవలెను? ఎందుకనగా వంచకులసూయాపరులు, బానిసమన స్తత్త్వముకలవారు, పిఱికివాండ్రు వట్టి భౌతికవిషయములనే విశ్వసించెడివారు. ఎందుకు పనికిరారు కాబట్టి. అసూయ యనునది మనజాతిశీలములోనున్న ఒకమచ్చ. అది బానిసలకు స్వభావము. ఇదిగో ఈ కాని గుణమున్నచో

పరమేశ్వరుడంత శక్తిమంతుడైనను విశ్వాసము కొలువవును. నేను వచ్చినపని మైపోయినది. నా పని నేను పూర్తి చేసితిని. ''మరణించితిని'' అని యనుకొనుడు. మీరందరు చిన్నవారు. యువకులు. ఈ కార్యము మీరు నిర్వర్తించవలసియున్నదని అనుకొనుడు. ఈ భారము వహింపుడు. పరమేశ్వరుడు మిమ్మను గ్రహించును. నన్ను వదలిపెట్టుడు. అసలు నావంక చూడవలదు. ఈ క్రొత్తసిద్ధాంతమును, లక్ష్యమును, జీవితమును ప్రజలకు బోధింపుడు. కాని ఏ ఆచారమునుగాని, ఏ పద్ధతినిగాని, ఏవ్యక్తిని గాని మీరు ఖండించవలదు. కులము, వర్ణము మొదలైన సాంఘికదురాచారములను ఖండించుటగాని, సమర్థించుటగాని చేయకుడు. మీరు చెప్పవలసినదెల్లనిదియే: ''అయ్యలారా, మీరు జోక్యము కల్గించుకొనవలదు. ప్రతి క్రియ దానియంతట అది సక్రమముగా నడచును.''

మీరందరు వీరులు. ధైర్యశాలులు. ప్రేమపాత్రులు. మీ అందఱికి నా ఆశీర్వాదములు.



# మతమునందలి ప్రధానసూత్రములు

(ఈ అసంపూర్ణవ్యాసము మిస్ ఎస్. ఇ. వాల్డో అను నామె కాగితములలో దొరకినది. ఈ శీర్షిక ప్రకాశకులు పెట్టినది.)

ప్రపంచమందలి మతములన్నియు పురాతనములు గాని అధునాతనములుగాని, ఇప్పుడున్నవిగాని, పోయినవిగాని, ఈ నాల్గు విభాగముల క్రిందకు వచ్చునట్లు నాకు తోచుచున్నది :

1. తాంత్రికము :—మనుష్యునిలోనున్న ఆధ్యాత్మిక జిజ్ఞాసను అభివృద్ధిచేయుటకు సాధన కుపకరించుట కవసరమైన బహిరంగ సహాయకముల నుపయోగించుట.

2. చరిత్రము :—ఆయా మతములయందు సిద్ధపురుషులుగా పేరొందిన ఆచార్యపురుషులయొక్కయో, దైవములయొక్కయో, జీవితములందు ఆయా మతములయొక్క తత్త్వమును దీపింపజేయుట. దీనిలో పురాణగాథలుకూడ చేరును. ఒకజాతి, ఒక కాలములో కల్పితపురాణము లనుకొన్న కథలను తత్పూర్వకాలములోగాని, తదితరజాతులలోగాని చరిత్ర లనియే భావింపబడియుండును. పురాణములవల నెందులకు? ఆచార్యపురుషుల జీవితములుకూడ తరువాతి తరముల జనులు ఆ చరిత్రలో చాలభాగము కల్పితగాథలుగా భావించుట గలదు.

3. తత్త్వశాస్త్రము :—ఆయా మతముల తత్త్వమంతయు తర్కబద్ధముగా నిరూపించుట.

4. అతీంద్రియానుభూతి :— ఇంద్రియానుభవమును మించిన, ఊహను మించిన అనుభవము కొంతమందికి కాని ఆయా పరిస్థితులు సమకూరినపు డందఱకు గాని కల్గుటకు వీలైన అనుభవ మిది యని నిరూపించుట. ఇది పై మూడు విభాగములందును నిరూపితము కావచ్చును.

ప్రపంచమందున్న మతములన్నిటికిని (పోయినవిగాని, ఉన్నవిగాని) ఈ నాల్గింటిలో అన్నియో, కొన్నియో పుట్టవచ్చును. చక్కగా అభివృద్ధి పొందిన మతములలో ఈ నాల్గుపద్ధతులు మనకు కన్పించును.

సర్వోత్తమముగా అభివృద్ధిపొందిన మతములు కొన్నిటికి మతగ్రంథములు లేవు. అవి వినష్టమైనవి. కాని మతగ్రంథములు కలిగిన మతము లీనాటివఱకు నిల్చియున్నవి. కాబట్టి ప్రపంచమందున్న గొప్పమతములన్నియు ఈ మతగ్రంథములపై ఆధారపడియున్నవి. వైదికమతము వేదములపై నాధారపడినది (దీనినే హిందూమతమని బ్రాహ్మణమతమని తప్పుగా పిలుతురు) అవెస్టా మతము అవెస్టామీద, మొజాయిక్ మతము ఓల్డుటెస్ట్మెంటుపై, బౌద్ధము త్రిపిటకములమీద, క్రైస్తవమతము న్యూటెస్టుమెంటుపై, మహమ్మదీయ మతము కొరానుమీద ఆధారపడియున్నవి. చైనాలోని తావోమతమునకు, కన్ఫూషియన్ మతమునకుకూడ గ్రంథము లున్నవి. ఈ రెండుమతములు బౌద్ధమతముతో పెనవేసికొని పోయియున్నవి. కాబట్టి వీనిని బౌద్ధమతములో చేర్చినను చేర్చవచ్చును.

మఱి నిక్కచ్చిగా చెప్పవలసివచ్చినచో జాతి భిన్నతను బట్టి మత భిన్నత ఏర్పడలేదు. జాతీయమతములని నిక్కచ్చిగా చెప్పదగినవిలేవు. కాని వైదికమతము, మోజాయిక్ మతము, అవెస్టిక్ మతము, ఆయాజాతులకే పరిమితమైయున్నవని చెప్పవచ్చును. కాని బౌద్ధము, క్రైస్తవమతము, మహమ్మదీయమతము ప్రారంభదశనుండియు వ్యాపకములుగానున్నవి.

ప్రపంచమునాక్రమించుకొనుటలో బౌద్ధులు, క్రైస్తవులు, మహమ్మదీయులకు సంఘర్షణ తప్పదు. అందువల్ల ఆయాజాతులకే పరిమితమైన మతములును ఈ సంఘర్షణలో పాల్గొనకతప్పదు. ఈ జాతీయమతములుగాని, వ్యాపకమతములుగాని వీనిలో ప్రతిమతము

బహుశాఖలుగా చీలిపోయినవి. తెలిసియో తెలియకయో బహు పరివర్తనములనందినవి. విభిన్న పరిస్థితుల ననుసరించి ఈ మార్పులు తప్పలేదు. ఈ ఒక్క యథార్థము చాలు. ఈ మతములలో ఏ ఒక్కటియు మానవజాతికంతటికి ఏకమతముగా నుండుటకు తగదు. ప్రతిమతము ఆ మత మేజాతిలో పుట్టినదో ఆ జాతి విశేషణములను తనలో ప్రతిబింబించుకొనును. మఱల ఆ మత మవలంబించిన ప్రజలలో ఆయా విశేషగుణములు తీవ్రతరమగు టకు నిలుకడగా నుండుటకు అది కారణభూతమగుచున్నది. అందుచేత ఏ మతముకూడ విశ్వజనీనమగుటకు వీలులేదు. అంతేకాదు. వీనిలో కొన్ని లోపములుకూడనున్నవి. ప్రతిమతము మనుష్యస్వభావములోనున్న కొన్ని గుణముల నభివృద్ధిచేయుటకు తోడ్పడును. కాని ఆమతములను నిర్మించిన జాతి ప్రజలకు సహజ ములుకాని గుణములను అణగద్రొక్కివేయును. నిర్మూలము చేయును. అందుచే ఏమతమైనను ఒక్కటియేయైనచో మానవ జాతి కపాయకరము, పతనకారణము అగును.

బహుపురాతనకాలమునుండి ప్రపంచవ్యాప్తమైన రాజ కీయ సామ్రాజ్యము, ప్రపంచవ్యాప్తమైన మతసామ్రాజ్యము అను ఈ రెంటినిగూర్చి తొల్లింటినుండి మానవజాతి కలలు గనుచున్నదని మనకు ప్రపంచచరిత్ర చెప్పుచున్నది. కాని మహావిజేత ప్రణాళిక లెప్పటికప్పుడు భగ్నమై పోవుచునే యున్నవి. ప్రపంచములో ఏదో కొంతభాగము నాతడు జయించి జయించకపూర్వమే ఆతని రాజ్యము భిన్నమైపోవుచుండెడిది. అట్లే ప్రాకజాలు వయస్సురాకపూర్వమే ప్రతిమతము బహుశాఖ లుగా చీలిపోవుచువచ్చినది.

కాని సాంఘికముగ, మతవిషయకముగకూడ అనంతమైన భేదము లున్నప్పటికి పరస్పరాధారమనునది మానవజాతిలో సహ జముగా కలదని నాకు తోచుచుండును. కాబట్టి ఈ సంభావమునకు

అడ్డుతగులకుండ పనిచేయగల్గుట ఉత్తమము. ప్రతి మతము భిన్న శాఖలుగా విడివడుటవలన మతమునకు మేలేజరుగునుగాని కీడు జరుగదు. దీనివలన మతము పరిపుష్టమగును. ఎక్కడచూచిన ఒకేవిధముగా నుండు టంత మంచిదికాదు. ఇదికూడ ఈశాఖా భేదమువలన తొలగును. మనపద్ధతులు నిర్ణయించుకొనుటకు కూడ ఇది పనికివచ్చును.

దీనికి ఫలితము మతము సర్వదా వినష్టమగుట కాదు. వేల కొలది శాఖలు బయలుదేరుట, తనంతట తానొక శాఖయగుట మేలు. మఱి ఈ యున్న మతములన్నింటిని కలిపి ఒకతత్త్వశాస్త్ర మును నిర్మాణముచేసినచో అది వీనికన్నింటి కాధారభూతమై వీని యందున్న ఏకత్వమును ప్రదర్శించును. పురాణగాథలందు కర్మ కలాపమందు ఏకత్వముండదు. మనకీ బహిరంగమందే ఎక్కువ భేదము. అంతరంగమందంత లేదు. చెప్పిన సిద్ధాంతము ఒకటే యైనను ఆచార్యపురుషులలో వారు గొప్ప, వీరు గొప్ప యని ప్రజలనుకొనుట కలదు.

అందువల్ల ఈమతములన్నింటిని కలిపి చూచుటవలన నొక తాత్త్వికమైన ఏకత, సర్వమతముల కాధారభూతమైనది మనకు కన్పించును. ఆ ఏకత కుదాహరణముగ ప్రతివ్యక్తి తనగురువును తానెన్నుకొనవచ్చును. తన ఆరాధనామార్గము తానెన్నుకొనవచ్చును. ఈ కలిపిచూచుటయనునది వేల సంవత్సరముల నుండియు జరుగుచునే యున్నది. పరస్పర విరోధములవల్ల ఇప్పుడిది మందగించినది.

అందువల్ల భిన్నజాతులమధ్య ఈ విరోధము నభివృద్ధి చేయుటకంటె పరస్పర మభిప్రాయములు తెలిసికొనుటకు మనము సహాయపడవలెను. ప్రజలను విద్యావంతుల నొనర్చుటకు ప్రపంచ మందలి అన్ని మతములలోనుండి మనము బోధకులను ఎల్ల తావులకు పంపించు నేర్పాట్లు చేయవలెను. కాని పూర్వము

అశోకుడు చేసినట్లు ఒకరినొకరు తిట్టుకొనకుండ కట్టడి చేయవలెను. ఒకరిదోషము లొకరెన్నకుండ చేయవలెను. ఒకరికొకరు సాయపడుట, సానుభూతిచూపించుట, తెలియజెప్పుకొనుట మాత్రమే సమంజసము.

ప్రపంచమునందంతటను భౌతికజ్ఞానమున కాధ్యాత్మ జ్ఞానము విరుద్ధమని పెద్దగోల జరుగుచున్నది. భౌతికజీవనము మాత్రమే యథార్థమైనదని నిర్ధరించుటకు ఆధ్యాత్మికతపైన ఒక పెద్ద యుద్ధముచేయుట ఈరోజులలో పెద్ద మోజైపోయినది. దీని ముందు మతప్రచారకులే నిల్వలేకున్నారు. మామూలు ప్రజల సంగతి యేమి? సామాన్యప్రజలు అనాలోచితముగ పైకిసొగసుగా నున్నవారి నెప్పుడు అనుసరింతురు, ఆచరింతురు. కాని కొంత వివేకముకల ప్రజలుకూడ ఈ కూడని మోజులోపడి ఈ కపటవాదములలో తగుల్కొని చెడిపోవుట జరుగుచున్నది. ఇది చాల విచారింపదగిన విషయము.

మఱి మన ఇంద్రియములున్నవి. అవి మనకు జ్ఞానసంపాదకములు. అనగా ఇంద్రియానుభవములమీద ఆధారపడి మన జ్ఞానముండును. ఇంతవఱకు బాగుగనేయున్నది. కాని మనకున్న జ్ఞానమంతయు ఇంద్రియానుభవమే యనుట సరికాదు. ఈ భౌతిక శాస్త్రములన్నియు కేవలము ఇంద్రియజ్ఞానజన్యములనియే యన్నచో కేవలేంద్రియజ్ఞానజన్యమైన శాస్త్రముండదని మనము గట్టిగా చెప్పవచ్చును. అసలు ఏశాస్త్రముకాని కేవలము ఇంద్రియానుభవముపై ఆధారపడదు.

ఇంద్రియములు విషయసంగ్రహముచేయును. సాదృశ్యములు, వైదృశ్యములు సంగ్రహించును. వానిపని అంతవఱకే. ఈ ఇంద్రియములు సంపాదించిన విషయజ్ఞానమునందు కొన్ని అతీంద్రియభావములు విశేషణములుగా ఉండకతప్పదు. దేశము,

కాలము మొదలైనవి ఇంద్రియానుభవములుకావు. దేశకాల సంపర్కమెఱుగని విషయజ్ఞానమనునదుండదు. విషయజ్ఞానము ఇంద్రియసంబంధియేకాని దానియందు విశేషముగానున్న జ్ఞానముమాత్ర మతీంద్రియమనకతప్పదు. ఇది మొదటిది. రెండవది ఇంద్రియానుభవమువల్ల మనకులభించిన కొన్ని యథార్థములను తరగతులవారీగా విభజించుట, వానియందు సమానముగ కన్పించు ధర్మములనుబట్టి సూత్రములనేర్పాటు చేయుట ఇవి బుద్ధి విషయములుగాని ఇంద్రియవిషయములుకావు. వీనికి వాస్తవిక స్థితిలేదు. కాబట్టి ఇటువంటి సాధారణీకరణములకు అభౌతికమైన భావము లాధారముకాని భౌతికవస్తువులుకావు. ఈ సాధారణీకరణ మెంత సున్నితముగానున్న ఎంత సూక్ష్మముగానున్న ఈ భావములు అంత సూక్ష్మబుద్ధివిషయకములుగా నుండును. జడపదార్థము, శక్తి, మనస్సు, ధర్మము, తర్కము, కాలము, దేశము మొదలైనవన్నియు బుద్ధివిషయకములే. వీని నెవ్వడును ఇంద్రియములవల్ల ప్రత్యక్షీకరించుకొనలేడు. అనగా ఇవి కేవలము ఆలోచనాగమ్యములుమాత్రమే కాని ఇంద్రియప్రత్యక్ష యోగ్యములు కాని భావములని గ్రహింపనగును. ఇవి ఇంద్రియప్రత్యక్షయోగ్యములు కాకపోయినప్పటికిని, బుద్ధిగమ్యములైనప్పటికని వీనితోకలిపినతప్ప భౌతికసంఘటనలను అర్థముచేసికొనజాలము. చలనమన్నది భౌతిక సంఘటనమే యయ్యును చలనమునందు నిగూఢముగానున్న శక్తి బుద్ధి వేద్యమైయున్నది. అట్లే కొన్ని అనుభవములలో పదార్థము బుద్ధి గమ్యముగానుండును. బైట జరుగుచున్న మార్పులలో ఇమిడియున్న ధర్మసూత్రము బుద్ధిగమ్యము. భావపరంపరలో జరుగుచున్న మార్పులలో నిగూఢముగానున్న మనస్సుగూడ బుద్ధిగమ్యమే. అట్లే ఒకదానివెంట నొకటిగా జరుగు సంఘటనలలో ఇమిడియున్న కారణకార్యసూత్రము బుద్ధిగమ్యము. ఐనను శక్తి, పదార్థము, ధర్మము, తర్కము, దేశకాలములనునవి ఇంద్రియప్రత్యక్షయోగ్యములైన పదార్థములు.

ఇవి కేవలము బుద్ధికృతములైనభావములుగాని వీనికి స్థితి లేదనియు ఇవి ఏతరగతికి, ఏవస్తువులకు విశేషణములుగా అర్థము చేసికొనబడుచున్నవో వానితో వేఱుగా వీనికి ఉనికి లేదనియు, వాని నుండి వీనిని విడదీయుటకు వీలు లేదనియు ఎవరైన వాదింపవచ్చును.

అసలిట్టి బుద్ధికృత భావములు అనునవి యుండునా యను ప్రశ్న ఆవల పెట్టుదము. మనము తరగతులవారీగా ఏర్పాటు చేసిన వస్తువులకంటె భిన్నముగా ఇవి యున్నవా లేవాయను ప్రశ్న అట్లుంచుదము. అసలు ఈపదార్థము, ఈశక్తి, ఈ దేశకాలములు, ఈ హేతుసంబద్ధమైన తర్కము, ఈ సాధారణధర్మము, మనస్సు, ఇవియన్నియు, తరగతులుగా విభజింపబడి వస్తువులకంటె వేఱుగా స్వతంత్రముగా ఉన్నవనియు, బుద్ధి గమ్యములై మాత్రమే ఇవిభాసించుననియు స్వతంత్ర ప్రతిపత్తిగలిగి వప్పుడు మాత్రమే ఇంద్రియప్రత్యక్షయోగ్యమైన వస్తువుల వర్థము చేసికొనుటలో ఇవి ఉపయోగింపగలవనియు వేఱు చెప్ప నక్కఱలేదు. ఈభావములస్థితి ఎట్టిదైనను రెండు ముఖ్యవిషయములు మన మొప్పుకొనక తప్పదు. 1. ఇవి బుద్ధిగమ్యములు, ఇంద్రియప్రత్యక్షయోగ్యములు కావని, 2. భౌతికములైన విషయములను అవగతము చేసికొనుటకు ఇవి ఉపకరించుచున్నవని గ్రహింపనగును.

బాహ్యప్రపంచము ఆంతరప్రపంచమునుబట్టి ఏర్పడుచున్నదా? ఆంతరప్రపంచము బాహిరమునుబట్టి ఏర్పడుచున్నదా? జడపదార్థము మనుస్సునుబట్టి ఏర్పడుచున్నదా? లేక మనస్సు పదార్థమునుబట్టి ఏర్పడుచున్నదా? పరిస్థితులనుబట్టి మనస్సు మలచబడుచున్నదా? మనస్సునుబట్టి పరిస్థితులు మలచబడుచున్నవా? అనునది బహుకాలమునుండి వచ్చుచున్న సమస్య. ఐనను అది నిత్యనూతనమే. ఏది ముందు? ఏది వెనుక? ఏది కారణము? ఏది కార్యము? మనస్సునకు జడపదార్థము కార

ణమా? లేక జడపదార్థమునకు మనస్సు కారణమా? అను సంగతి అట్లుంచి బాహ్యజగత్తు ఆంతరజగత్తునుబట్టి ఏర్పడినను, ఏర్పడకపోయినను ఈ బాహ్యజగత్తు ఆంతరజగత్తునకు అనుబంధించియే మనకు అర్థము కావలసి యున్నది. ఈ బాహ్య ప్రపంచమే ఆ ఆంతరప్రపంచమునకు కారణమని కొంచెము సేపనుకొందము. ఐనను ఆ బాహ్యప్రపంచము అనగా ఆంతర ప్రపంచమునకు కారణభూతమైనది మనకు తెలియదు. తెలియునదియు కాదు. ఎందుచేతననగా, మనస్సు స్వప్రతిబింబభూతిమైన జగద్దృశ్యములు మాత్రమే గ్రహింపగలదు. అనగా మనస్సులోనున్న సూక్ష్మవాసనలే బహిరారోపితములై మనస్సుచేత జగద్రూపేణ దృశ్యమానములగుచున్నవి. అందుచేత జగద్దృశ్యము బాహ్యముగా కానవచ్చుచున్నను, న్యాయ్యమునకు మానసిక జగత్తియొక్క ప్రతిబింబమే కాని అది వాస్తవికము కాదు. దృశ్యమానమగు బాహ్యజగత్తు మనఃపరికల్పనమని లేక మనః ప్రతిబింబమని ఏర్పడినది. ప్రతిబింబ మెప్పుడును బింబమునకు కారణమనుట కుదురదు. మనస్సుచేత గృహీతమైన దృశ్యము మనస్సునకు కారణము కాజాలదు. ఆ దృశ్యముయొక్క సత్త కేవలము మనస్సుద్వారానే గృహీతమైనది, వాస్తవికము కాదు.

కావున మనస్సును పదార్థమునుండి విడదీయుట అసంభవము. అది చాల అనుచితముకూడ. ఎందుచేతననగా, అసలు పదార్థమని మనము దేనిని పిల్చుచున్నాము? చైతన్యవిరహితమైన, బాహ్యసత్తాకమైన దానిని పదార్థమనుచున్నాము. మనస్సని దేనిననుచున్నాము? బాహ్యసత్తారహితమైనదానిని, చైతన్యవంతమైన దానిని మనస్సని పిల్చుచున్నాము. మఱి మనస్సునకు వేఱుగా పదార్థమును, దీనికి వేఱుగా మనస్సును నిరూపించుటకు మన మేమి చేయవలసివచ్చినదో చూడుడు. ఆయా పదార్థములను

నిరూపించుట కాయా గుణములను పృథఃకరించి మఱల పృథః కృతములైన గుణములతోనే నిరూపింపవలసివచ్చినది. అనగా చైతన్యము, బాహ్యసత్త రెండును తీసివేసినతప్ప లక్షణము చెప్పుట కుదురలేదు. లక్షణము చెప్పుటకు మఱల ఆ రెండు గుణములను కొనిరావలసివచ్చినది. జరిగినదేమన, మనఃపదార్థము లను విడివిడిగా నిరూపించుటకు మనము దానిలోనుండి ఒక గుణమును, దీనిలోనుండి ఒకగుణమును తీసివేసి మఱల ఆ తీసి వేయబడిన గుణములనే మఱల వానిలో నున్నట్లు భావించి పరస్పరభేదము సాధింపవలసివచ్చినది. అందుచేత పదార్థమునకు మనస్సు కారణమా? మనస్సునకు పదార్థము కారణమా? అను వాదము వట్టిమాటల గారడీతప్ప మఱి ఏమియు లేదు. ఈ విధ మైన వివరణములందు మనస్సు, పదార్థము అను శబ్దములకు భిన్నార్థములు సాధించుట వట్టి ఆభాసతప్ప కుదురునది కాదు. మనశ్శబ్దము ఒక్కొక్కప్పుడు జడభిన్నమైన, బాహ్యసత్తాకమైన పదార్థము నుద్దేశించి, ఒక్కొక్కప్పుడు మనోజడపదార్థముల రెంటికిని అనగా ఆంతరబాహ్యసమ్మేళనరూపమగు దృశ్యము నుద్దేశించి ప్రయుక్తమగును. అట్లే జడపదార్థమన్న మాట ఒక్కొక్కప్పుడు ఇంద్రియవిషయభూతపదార్థమన్న పరిమితార్థ మందు ప్రయుక్తమై ఒక్కొక్కప్పుడు బహిరంతర్దృశ్యజగత్తులకు కారణభూతమగు వాస్తవికపదార్థ మన్న యర్థములో ప్రయుక్త మగుచు వచ్చినవి. జడవాది మనస్సన్నది ఒకప్రక్కనుండి భౌతికపదార్థమే యని వాదించుచు, మఱొకప్రక్కనుండి ఈ ఆంతర బాహిర జగత్తులకు కారణభూతమైన ఒకానొక పదార్థము తాను చెప్పెడి మూలభూతములైన ద్రవ్యములకంటె, అణువులకంటె విభిన్నమైన దానిని జడపదార్థమను సంకేతముతో చెప్పును. భావవాది జడవాది చెప్పు ఈ మూలద్రవ్యము లీయణువులు మనః ప్రసవములని ఒకప్రక్కనుండి చెప్పుచు, మఱొకప్రక్కనుండి

మనోజడపదార్థములకు రెంటికి కారణభూతమైన మఱియొకపదార్థ మున్నదని దానిని ఈశ్వరశబ్దముతో సంకేతించి చెప్పుచుండును. ఒకడు ఈవిశ్వమునంతను తద్గతమైన బహిరంశమును స్వీకరించి వ్యాఖ్యానింపగా మఱియొకడు అంతరంశమును స్వీకరించి వ్యాఖ్యానించుటకు ప్రయత్నించును. ఈ రెండు ప్రయత్నములును వ్యర్థములే. ఆంతరమైన మనస్సుగాని, బాహిరమైన జడపదార్థము గాని ఒకదాని కొకటి కారణములు కానేరవు. దాని సత్త దీని మీద గాని, దీని సత్త దానిమీద గాని ఆధారపడి యున్నవని చెప్పుటకు వీలులేదు. మనోజడపదార్థముల రెంటియందు వ్యాపించి యున్న మఱియొక పదార్థము నంగీకరించినతప్ప మన కీచిక్కు-విడదు.

భావము మనోజన్యము కాబట్టి భావమునకు పూర్వభావిగా మన స్సుండవలెను. భావములేని ఒక కాల మున్నదనుకొందము. ఉన్నచో ఇప్పుడు మనకు తెలిసిన పద్ధతిలో అనగా మనము భావించుచున్నట్లుగా జడపదార్థ ముండియుండుటకు వీలులేదు. మఱియొక దృష్టిపథమునుండి చూచినచో జ్ఞాన మనునది అనుభవ జన్యము. అనుభవము ఏ విషయమునైన నాశ్రయించియుండును. విషయము అనగా బాహ్యజగత్తు. అందువల్ల జడపదార్థము లేనిది మనస్సుండజాలదు. అనగా మనస్సునకు జడపదార్థము పూర్వముండవలెను.

ఈరెంటిలో ఏది ముందన్న సంగతి అట్లుంచుడు. ఈరెంటికి ఆది యుండుటకు వీలులేదు. అసలు జ్ఞాన మనునది ఎట్లేర్పడును? సాధారణీకరణమువల్ల ఏర్పడును. అనగా సదృశములైన సందర్భ ములలోనుండి సమానముగా నున్న యంశమును మనము గ్రహింతుము. ఇదియే సాధారణీకరణము. ఇట్టి దానికి ముందు కొన్ని సదృశ సందర్భము లుండి తీరవలెను. ఇంతేకాక ఈ సందర్భముల పరస్పరసాదృశ్యమును గ్రహించుటకు పూర్వానుభవముండి

తీరవలెను. పూర్వానుభవము లేక సదృశీకరణము కుదురదు. అందువల్ల పూర్వజ్ఞానము లేక ప్రస్తుతజ్ఞానము కుదురదు. మఱి జ్ఞాన మను భావము పదార్థములమీాద ఆధారపడియున్నది కావున భావము, పదార్థ మనునవి రెండును ఆదిమంతములని చెప్పుటకు వీలులేదు.

సాధారణీకరణము విషయానుభవములయొక్క సారాంశ మని చెప్పితిమి. ఈ విషయానుభవములు భిన్నభిన్నములుగా నుండును. ఈభిన్నానుభవములు సాధారణీకృతిపొందుటకు ఒక అధిష్ఠానముండవలెను. అట్టి అధిష్ఠానమేది? ఇంద్రియానుభూతు లన్నియు ఇంద్రియగ్రాహ్యమైన దృశ్యజగత్తుయొక్క సమగ్ర స్వరూపము నిరూపించుటకు ఒక అధిష్ఠానముపైన ఏకీకృతము కావలెను. దృశ్యజగ త్తంతయు ఒక బొమ్మయనుకొన్నచో ఆ బొమ్మ వ్రాయుట కేర్పడిన అధిష్ఠానమేది? చిత్రములను వ్రాయు టకు వస్త్రము లేక కుడ్య మాధారమైనట్లు ఇంద్రియములచే గృహీతమైన వివిధానుభవములను సమీాకరించి ఒక ఆకారము రూపొందించుటకు ఒక అధిష్ఠానముండి యుండవలెను. అట్టి అధి ష్ఠానము మనస్సు అనియో వృత్తియనియో చెప్పుటకు వీలులేదు. అప్పుడు ఈ మనస్సును పదార్థముకూడా దృశ్యకోటిలో చేరు చున్నది. అందువల్ల అనవస్థాదోష మేర్పడును. మనస్సనగా నేమి? భిన్నభావములయొక్క ప్రవాహమును మనస్సనుచున్నాము. ఈ భిన్నత్వము మనస్సునం దనుభూతమగుచున్నది. మనస్సు నిర్వికారము కాదు. కాబట్టి అది ఏకము కాజాలదు. అందుచేత ఒక నిర్వికారమైన, ఏకమైన పదార్థ మొకటి దానికధిష్ఠానముగా నుండి యుండవలెను. ఈ ఏకత్వమును మనము కనుగొనిన తర్వాత ఇంతటితో మనవివేచన మాగిపోవును. ఒకవస్తువు నెంతవఱకు విభాగింప గలము? అవిభజనీయమైన స్థితివఱకు విభజింపగలము. ఆపైన విభాగముండజాలదు. ఎచ్చటభావమునకు, పదార్థమునకు

ఏకత్వము కుదురునో దానిని దాటి ఏ సందర్భమునకైనను మఱి యొకటి అధిష్ఠానముండజాలదు. దానినిమీాఱి మన వివేకము ప్రసరింపదు. మన బాహ్యాంతర్జ్ఞానముల వివేకమునంతటిని వ్యాపించి అధిష్ఠానభూతముగా ఇది ఉండునుగాన ఇంక వివేకింపవలసిన అగత్యముకూడ మనకు లేదు. మన పరిశోధనకు ఫలితముగా మానసిక భౌతిక అనుభవములయొక్క సంపూర్ణస్వభావము వీని కధిష్ఠానభూతమైన ఒక పదార్థముగా తేలినది.

ఇప్పుడీ యధిష్ఠానభూతమైన పదార్థము మన కింద్రియ గ్రాహ్యము కాలేదు. కాని కొంత యాంతరంగికానుభూతి కలుగుచున్నది. దాని స్వరూపస్వభావము లిట్టివని మనము నిర్ణయింపలేము. కాని ఆ పదార్థమున్నదను ఒక అనిర్వచనీయాను భవము మన సర్వవిషయానుభవములందును అంతర్యామిగా, పూలయందు దారమువలె ఉన్నది. మనసాధారణీకరణశక్తి, మన వివేకము ఈ రెండును ఈ పదార్థముయొక్క గ్రహణమువల్లనే సాధ్యమగుచున్నవి.

ఈ మానసిక, భౌతిక జగత్తులను మీాఱి, వేఱు పదార్థమున్నదని ఊహింపవలసిన అవసరము లేదు. మనకు తెలిసినది తెలిసికొనగల్గునది మాత్రమే ఈ జగత్తు. దానినిగూర్చి వ్యాఖ్యానించుటకు దానినిమీాఱిన మఱొకపదార్థముయొక్క అవసరము లేదు. అంతేకాక ఈ సమస్తమునకాధారభూతమైన పదార్థమొకటి కలదనుకొనుట వట్టి భ్రాంతియని కొందఱు వాదింపవచ్చును.

మిగుల పురాతనకాలమునుండి ప్రతిభావంతులయందు ఈ రెండువాదములుండనే ఉన్నవి. ఒక వాదమువారు బుద్ధివేద్యములగు భావములను సృష్టించుటవలననే మనస్సు ఒక విషయము నాకళింపుచేసికొనగలదనియు, ఈభావములను సూక్ష్మ సూక్ష్మతరముగ వివేకించుకొనుచు సర్వమునతిక్రమించి - దేశకాలనిమి

త్తముల నతిక్రమించి ఒక పరమసూక్ష్మమైన కేవలతారూపమైన ఒక భావమును ఊహించునంతవఱకు మనస్సునకు విశ్రాంతిలేద నియు చెప్పుదురు. బహిరంతరానుభూతులనన్నిటిని వివేకించు కొనుచు పోగాపోగా వానియందేకరూపముగా వ్యాపించియున్న ఒక భావము కొనకు తేలును. స్థూలమైన అనుభవము, అంతకంటె సూక్ష్మమైన భావమునందు, దాని నంతకంటె సూక్ష్మ తమమైన భావమునందు లయించుకొనుచు పోగా తుదకు మిగులు నది ఈసమస్త జగత్తునకు ఆధారభూతమై కన్పించును. అన్ని అను భవములందది అవిచ్ఛిన్నముగా వ్యాపించియున్నది. కాబట్టి సమస్తమునకు అదియే స్వరూపముగా తేలును. సమస్తానుభవము లకు స్వరూపమదియేకాబట్టి ఈ సమస్తానుభవములు నిజమునకు దానియొక్క క్షణకాలావస్థితములగు వికారములు మాత్రమే అనియు, ఈ సర్వానుభవములు వట్టి ఆభాసికములనియు అదొ క్కటే సత్యమనియు తేలును. అందుచేత ఈ ఇంద్రియానుభవము లందు సత్యము లేదు. వాస్తవికత లేదు. సత్యము వీని కతీత మైనది. వాస్తవికత వీని కతీతమైనది.

రెండవవాదము వారు ఈ విశ్వమునందు మన ఇంద్రియ ములద్వారా గ్రాహ్యమైన వైషయిక అనుభవమే సత్యమనియు, ఈ ఇంద్రియానుభవములన్నిటికి వీనికంటె అతీతమైన ఒకానొక పదార్థ మాధారభూతముగా నుండియుండవలెనను భావము అను బంధించియున్నను అది వట్టి మనోవిలసనము తప్ప సత్యమైనది, వాస్తవికమైనది కాదనియు వచింతురు.

మఱి ఒకనిర్వికారమైన పదార్థముయొక్క జ్ఞానము మన కున్నపుడే మార్పు పొందుచున్న పదార్థమును మనము అర్థము చేసికొనగల్గుదుము. ఐనచో నీవు చెప్పిన ఆ అవికారపదార్థము ఈ వికారపదార్థముదృష్ట్యా అవికారమే ఐనను అది కేవలము నిర్వికారమని చెప్పుటకు వీలులేదు. 'దాని నిర్వికారత అపేక్షకము'

అని మాత్రమే చెప్పదగును. అప్పుడు దానిలో ఉన్న వికార స్వభావమును నిర్ణయించుటకు నిర్వికారమైన మఱొకపదార్థము కూడ అవసరమగును. అదికూడ సాపేక్షకనిర్వికారమే కావున దానికి ఇట్లనవస్థాదోషము సంఘటిల్లుననుచో నీ వెంత దూరము పోయినను ఒక వికారవంతమైన పదార్థము నది వికారవంతమైనదని తెలిసికొనుట కొక అవికారపదార్థము అవసరము. కావున, ఆ అవికారపదార్థము లేకుండ ఈ వికార పదార్థము నర్థము చేసికొనుటయే దుర్ఘటము. అందుచే ఈ వికార జాతము నంతటకును అధిష్ఠానభూతముగా ఆ అవికారపదార్థమనునది ఒకటి కలదని ఒప్పుకొనక తప్పదు. ఇది సమాధానము. ఇందులో నేను కొంత యొప్పికొందును, కొంత యొప్పికొన ననుట కుదురు నది కాదు. అంగీకరించిన, మొత్త మంగీకరించవలెను. రూపాయకు తిరుగ, బొర్లసితులు రెండుండును. ఒకప్రక్క నీ కిష్టములేకపోయి నను దానిని నీవు తీసికొనక తప్పదు.

ప్రతివిషయమునందును మానవుడు తాను స్వతంత్రుడుగా నుండవచ్చునని వాంఛించును. మహాప్రతిభావంతునినుండి పట్టి మూఢునివఱకు ప్రతివాడు తాను స్వతంత్రుడనని భావించును. కాని కొంచె మాలోచించినచో ప్రతిమానవుడు తాను చేయు పనులన్నిటి వెనుక ఏవో కొన్ని భావములు, కొన్ని పరిస్థితులున్న వని గ్రహించును. ఈ భావములకు, ఈ పరిస్థితులకు అతడు చేయు పనికి కార్యకారణసంబంధము కుదురుచునే యుండును.

ఇచ్చట మఱల అదే చిక్కు: మనుష్యుని ఇచ్ఛాశక్తి ఈ కార్యకారణరూపతర్కముచే బద్ధమైయున్నది. ఒక మొక్క యొక్క పెరుగుదల, రాతిపతనము మొదలగు సంఘటనలు ఎంత కారణకార్యరూపసంబద్ధములుగా నున్నవో మనుష్యుని బుద్ధికూడ అంతగా తర్కముచే బద్ధమై యున్నది. కాని ఇంత బంధితమై యున్నను తాను స్వతంత్రమన్న భావము

అవినాశిగా నుండనే యున్నది. ఇచ్చట భౌతికవాదులు ఈ స్వాతంత్ర్యభావము వట్టి భ్రాంతియనియు, మానవుడు అవసరమును బట్టి రూపొందువాడనియు వాదింతురు.

దీనిలో రెండు దోషము లున్నవి: 1. ఈ స్వాతంత్ర్యభావమును భ్రాంతి యని చెప్పుట, ఈ పరిస్థితిని విశదీకరించలేకపోవుట. 2. ఈ అవసరము లేక కార్యకారణరూపబంధము—ఇదియే భ్రాంతి యని ఎందుకు చెప్పరాదు? ఏ సిద్ధాంతమైనను అది ఏ సందర్భములను పరిశీలించుటకు బయలుదేరినదో ఆ సందర్భములలో అట్లు చేయజాలకపోవుచో ఆ సిద్ధాంతము దోషభూయిష్ఠమని తేలికగా చెప్పవచ్చును. అందుచేత ఈ శరీరముకాని, బుద్ధిగాని స్వతంత్రములు కావనియు ఈ శరీరాంతఃకరణములను మీఱి ఒకానొక స్వతంత్రపదార్థము దీని కాధారభూతముగా నున్నదనియు అంగీకరింపక తప్పదు.



# "శ్రీరామకృష్ణపరమహంస - ఆయన జీవితము - బోధనలు"*

పాశ్చాత్య సంస్కృత పండితులలో ప్రధానుడు మాక్సు ముల్లరు పండితుడు. ఋగ్వేదసంహిత పూర్వము ,సంపూర్ణగ్రంథ మెచ్చటను దొరకెడిదికాదు. ఇప్పుడు ఈస్టిండియాకంపెనీయొక్క యౌదార్యమువల్ల దొరకుచున్నది. మాక్సుముల్లరు పండితుని బహుకాలపరిశ్రమమువల్ల ఆ గ్రంథ మిప్పుడు చక్కగా ముద్రింప బడి ప్రజలందఱికి లభించుచున్నది. భారత దేశములో విభిన్న స్థలములలో సేకరించిన వ్రాతప్రతులు వివిధములుగా నున్నవి. వానిలో బహుశబ్దములు సరిగా లేవు. ఈ వ్రాతప్రతుల లోని లిపి పలువిధములుగా నున్నది. ఒక వైదేశికునికి, అత డెంతగా గొప్పపండితుడైనను, ఈ సంస్కృతలిపి సరిగా నున్నదో లేదో, క్లిష్టములైన సంగ్రహములైన ఆయా వ్యాఖ్యానముల అర్థము నిక్కచ్చిగా చెప్పనగునో లేదో మొదలగు అంశములు నిర్ణయించుట ఎంత కష్టమో మనకు తెలియదు. ఋగ్వేదమును ప్రకటించుట మాక్సుముల్లరు జీవితములో ఒక గొప్పవిశేషము. అంతేకాదు. అతడు పురాతన సంస్కృత సారస్వతమును అధ్యయ నముచేయుటలోనే తనకాలమంతయు వినియోగించుచున్నాడు. తనజీవితమంతను పురాతన సంస్కృత సారస్వతాధ్యయనమునకే అంకితముచేయుచున్నాడు. ఇందువల్ల భారతదేశమందు పురాతన కాలమునందువలెనే నేడును వేదమంత్రములు మార్మ్రోగుచున్న వని, హోమధూమములు ఆకసమున పందిళ్లు కట్టుచున్నవని జనక,

* "రామకృష్ణ ఆయన జీవనము, సూక్తులు" అను పేరుతో ప్రొఫెసర్ మేక్సుముల్లరు రచించిన గ్రంథముపై వ్రాయబడిన సమీక్ష. 1899 మార్చి 14-వ తేదీనాడు "ఉద్బోధన" పత్రికలో ప్రకటింపబడినది.

వశిష్ఠ, యాజ్ఞ్యవల్క్యులవంటి మహర్షులు, గార్గి, మైత్రేయివంటి విదుషీమణు లిచ్చట నిండియున్నారని, వేదధర్మములు, గుహ్యసూత్రములు ఇపుడును ఇచ్చట అమలులో ఉన్నవని మాక్సుముల్లరు భావించుచున్నట్లు మన మనుకొనరాదు.

ఈయన నవీనభారతదేశమందు ఏమూల ఏది జరుగుచున్నదో ఎప్పటికప్పటికి తెలిసికొనుచునే యున్నారు. ఈ నవీన భారతదేశము సగము చచ్చియున్నదని, మతాంతరులైన వైదేశికులచేత పదదళితము కావింపబడియున్నదని, అచ్చట పురాతనాచారములు, పద్ధతులు, కర్మకలాపములు మొదలైనవన్నియు లుప్తములైపోయినవని అత డెఱుగును. మాక్సుముల్లరు భారతదేశమున కెప్పుడును రాలేదు. అందువల్ల ఇచ్చటి ఆచారములను గూర్చి, పద్ధతులను గుఱించి, నీతివిధులను గుఱించి ఆయనకున్న అభిప్రాయములను ఇచటి ఆంగ్లో-ఇండియనులు అపహసింతురు. కాని వారు సమస్త జీవనమును ఇందే కడపినప్పటికిని, వారిందే పుట్టి పెరిగినప్పటికిని, వారి కేదో ముఖాముఖి పరిచయమున్న ప్రజలయొక్క ఆచారవ్యవహారములను గుఱించిన భోగట్టా కాక తక్కిన ప్రజానీకముయొక్క ఆచారవ్యవహారములనుగూర్చి యేమియు తెలియదని వారు గ్రహించినచో మంచిది. అంతవఱ కెందుకు? ఈ భారతీయప్రజానీకము వివిధములైన కులములక్రింద విభక్తమై యున్నారు. ఒకకులమువారికి మఱొకకులమువారి ఆచారవిశేషములు తెలిసికొనుట దుర్ఘటము. అట్టి సందర్భములలో ఎక్కడో పుట్టి పెరిగి ఇచ్చటికి వచ్చిన ఈ ఆంగ్లో-ఇండియన్ల కేమి తెలియును?

చాలకాలము క్రిందట నేనొక పుస్తకమును చదివితిని. దానిపేరు "ఇండియా నివాసము" ("రెసిడెన్స్ ఇన్ ఇండియా") దానినొక ప్రఖ్యాతుడైన ఆంగ్లో-ఇండియను వ్రాసినాడు. అందులో ఒకఅధ్యాయము ఆనాటివారి అంతఃపురరహస్యములను గుఱించినది.

సాధారణముగా ప్రతిమనుష్యునిహృదయములో రహస్య మనగానే అది ఏదియో తెలిసికొనవలెనను వాంఛ కలుగును. నాకు నట్లే కలిగినది. చదివితిని. అంత ప్రఖ్యాతుడైన గ్రంథకర్త వ్రాసిన దేమో తెలియునా? స్థానికప్రజలయొక్క జీవితములోనున్న శృంగారవ్యవహారమును వర్ణించి, తనదేశప్రజలకు సంతృప్తికలిగించుటకై అతడు తనవద్ద పాచిపనిచేయుచున్నవానిభార్య, ఆమె విటకాడు ఎట్లు ప్రేమవ్యవహారములందు నిమగ్నులై యుండిరో వ్రాసినాడు. మఱి ఈ గ్రంథమునకై ఆంగ్లో-ఇండియనులు ఎగబడుట చూచిన ఆ గ్రంథకర్త ఉద్దేశము చక్కగా నెఱవేఱినదని, తాను వ్రాసిన గ్రంథమునుగూర్చి అతడు చాల తృప్తిపడుచున్నాడని మన మనుకొనవచ్చును.

ఇక నీ ఘోష యేల? మీ కేమి చెప్పవలెను? పరమాత్మ గీతయందు చెప్పనే చెప్పినాడు :

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.

విషయములను ధ్యానించుటవల్ల పురుషునకు వానితో సంగ మేర్పడును. సంగమువల్ల కామము పుట్టును. కామమువల్ల క్రోధము జనించును.

సరే, ఈ శాఖాచంక్రమణము మాని అసలు విషయమునకు వత్తము. మాక్సుముల్లరుపండితునికి మన ఆచారవ్యవహారములను గుఱించి, నైతికప్రమాణములనుగుఱించియున్న జ్ఞానమునకు, భారతదేశములోని బహురాష్ట్రములందు ప్రస్తుతము జరుగుచున్న సంఘటనలనుగుఱించియున్న జ్ఞానమునకు మన మాశ్చర్యపడి తీరవలెను. ఆయనకు మనదేశమును గుఱించి ఎంత తెలియునో నాకు ప్రత్యక్షముగా తెలిసిన విషయము.

ప్రధానముగ మాక్సుముల్లరు పండితుడు భారతదేశము నందలి వివిధభాగములలో ఉదయించుచున్న క్రొంగ్రొత్తమతతరంగ

ములను తీక్ష్ణముగా పరిశీలించుచుండును. ఎప్పటికప్పుడు తన పరిశీలనము పాశ్చాత్యప్రజలకందించుచుండును. దేవేంద్రనాథ ఠాకూరు, కేశవ్ చంద్రసేనులు నడపుచున్న బ్రహ్మసమాజము, స్వామిదయానందసరస్వతి స్థాపించిన ఆర్యసమాజము, దివ్యజ్ఞానోద్యమము మొదలైన అన్నిటినిగుఱించి ఆయన పరామర్శింపకుండ వదలలేదు. కొన్నిటిని మెచ్చుకొన్నాడు. కొన్నిటిని తీవ్రవిమర్శకు గుఱిచేసినాడు. అతడు "బ్రహ్మవాది" - "ప్రబుద్ధభారతము" - అను ప్రసిద్ధపత్రికలయందు ప్రకటించిన శ్రీరామకృష్ణపరమహంస సూక్తులు, బోధనలు చదివెను. ప్రతాపచంద్రమజుందార్ అను బ్రహ్మసమాజప్రచారకుడు వ్రాసిన "పరమహంస శ్రీరామకృష్ణ" అను వ్యాసమును చదివెను. చదివి రామకృష్ణపరమహంసయొక్క జీవితమునందాసక్తుడయ్యెను. కొంతకాలముక్రిందట "ది ఇంపీరియల్ అండ్ ఏషియాటిక్ క్వార్టర్లీ రెవ్యూ" అను ఇంగ్లండునందలి ప్రసిద్ధమాసపత్రికయందు సి. హెచ్. టానీ, యం. ఏ. (ఇండియా వాసులో లైబ్రేరియన్) అను నతడు వ్రాసిన రామకృష్ణ పరమహంసయొక్క జీవితసంగ్రహము ప్రకటితమైనదానిని ఆతడు పరిశీలించెను. మాక్సుముల్లరు పండితుడు మదరాసు కలకత్తాల నుండి కొంతభోగట్టాను సేకరించి "ది నైంటీన్తు సెంచరీ" యను ప్రసిద్ధమైన ఆంగ్లమాసపత్రికయందు "ఎ రియల్ మహాత్మన్" ("ఒక నిక్కపు మహాత్ముడు") అనుపేరుతో శ్రీరామ కృష్ణపరమహంస జీవితము - బోధనలనుగూర్చి ఒక చిన్న వ్యాసమును వ్రాసెను. అందులో "ఈమహాత్ముడు తనయొక్క అనుభవసిద్ధమైన భావములతో నిర్మలమైన ఆధ్యాత్మికశక్తితో పరిఢవిల్లు నూతనభావతో నాహృదయమును ఆకర్షించినాడు. భారతదేశము బహుశతాబ్దములనుండి పురాతనమహర్షులయొక్క భావములో ఆధునాతన కాలములో పాశ్చాత్యపండితుల భావములో ఊరకవల్లెవేయుచున్న సందర్భములో ఆయన స్వానుభవముతో నిండిన భావతో భారతదేశమందాక ఆధ్యాత్మికశక్తిని ప్రసరింప

జేసినాడు. మాక్సుముల్లరుపండితుడు ఎక్కువగా భారతదేశము యొక్క మతసారస్వతమునంతయు తెలిచినాడు. కావున అందులోని పురాతనమహర్షులు, మహానుభావులు మొదలైనవారి చరిత్రలు ఆయనకు చక్కగా తెలియును. "తాదృశచరిత్రవంతు డధునాతనకాలములో భారతదేశములో జీవించియుండునని భావింపనగునా?" అను ప్రశ్న ఆయనకుపుట్టినది. ఈప్రశ్నకు "శ్రీరామకృష్ణపరమహంస జీవితమును గుఱించి అట్లు భావింపనగు"నని ప్రత్యుత్తరమీయవచ్చును. భారతదేశముయొక్క భవిష్యదభ్యుదయము – భవిష్యద్వైభవములు — వీనినిగుఱించిన ఆశాలత భారతదేశమునకు తనజీవితము సంకితముచేసిన ఈ పండితుని హృదయములో పెరిగి పెంపొందినది.

పాశ్చాత్యదేశములందు భారతదేశముయొక్క అభ్యుదయమును కాంక్షించునట్టి ఉదారపురుషులు కొందఱున్నారు. కాని మాక్సుముల్లరు పండితునికంటె ఈవిషయములో ఎవరైన తక్కువవారే యని చెప్పవలెను. మాక్సుముల్లరు భారతదేశమునకు పట్టి శ్రేయోభిలాషియేకారు. ఆయనకు హిందూవేదాంతమతమునందు చాల విశ్వాసమున్నది. మాక్సుముల్లరుపండితుడు అద్వైతముకంటె గొప్పసిద్ధాంతము ఏమతమందైననుండగల్గుట అసంభవమని బాహాటముగా నంగీకరించెను. పునర్జన్మనుగుఱించి దేహాత్మభ్రాంతిగల్గినవారు గావున క్రైస్తవులకు విపరీతమైనభయము కలదు. కాని మాక్సుముల్లరు పండితుడు పునర్జన్మసిద్ధాంతమునందు గట్టి నమ్మకము గలవారు. కారణము ఆయనకది స్వానుభవములోనున్నవిషయము. ఆయన తాను పూర్వజన్మమునందు భారతీయుడననియు, ఇప్పుడు, ఈవార్ధకములో భారతదేశమునకు వచ్చినయెడల ఆజన్మాంతర సంస్కారము లొక్కపర్యాయము తీవ్రముగా ఉద్బుద్ధమై శరీరము తాళుకొనజాలకపోవుననియు అడలును. ఆయన ఇప్పుడు హిందూదేశమునకు రాకపోవుటకు ప్రధానకారణ మీభయమే. కాని ఆయనకూడ సంసారియే కాబట్టి తాను పూర్వ

జన్మలో ఎవరైనప్పటికి ఆయన అన్ని విషయములను దృష్టిలో నుంచుకొని ప్రవర్తింపవలసియుండును. సంసారియే కానక్కఱ లేదు. సర్వసంగపరిత్యాగియైనవాడుకూడ కొన్ని ఆచారములు తన దేశీయులొప్పుకొననివానిని పరమపవిత్రమైనవని తానెఱిగినప్పటికి పదిమంది దూషింతురని వానినాచరించుటకు వెనుకాడును. కీర్తి ప్రతిష్ఠలు, పదవులమీది వాంఛ, అతనిప్రవర్తనమును, అతనిపనులను (అతడెంత సంగపరిత్యాగియైనను) మలచుచుండును. అతడు పైకి అట్టివాంఛలు పరమనీచములని చెప్పినచెప్పుగాక. అట్టి సందర్భములో, సంసారియైయుండి విశ్వజనీనమైనప్రశస్తి సంపాదించి, స్వజనమునందు ఏకాంచెమైన అపప్రథరాకుండ జాగ్రత్తపడుచుండువాడు తాను గట్టిగా విశ్వసించిన అభిప్రాయములనెంత జాగ్రత్తగా వెల్లడిచేయవలసియుండునో వేఱుగా చెప్పనక్కఱలేదు. మాక్సుముల్లరు పండితునకు యోగులయొక్క యోగశక్తులనుగుఱించి ఏమియు విశ్వాసములేదనుమాట సత్యముకాదు.

భారతదేశములో ఇప్పుడు ప్రచలితముగా నున్న కొన్ని మతోద్యమములమీద తన అభిప్రాయమును మాక్సుముల్లరు పండితుడు ప్రకటింపవలెనని అనుకొనుచుండెను. "హిందూదేశము ఆధ్యాత్మికజనబహుళము. దానిని గుఱించి పాశ్చాత్య దేశములందు కొంత అపప్రచారము జరుగుచున్నది. అందువల్ల ఏర్పడిన కొన్ని దురభిప్రాయములను తొలగించుటకు భారతదేశమునందును, అమెరికాలోను, ఇంగ్లండునందలి పత్రికలలోను ప్రకటితమై ప్రచారమగుచున్న భారతీయ సాధువులను గుఱించిన కాకమ్మ, పిచ్చుకమ్మ కథలను నిరసించుటకు భారతీయదివ్యజ్ఞానము, తాంత్రిక బౌద్ధము మొదలగువానిని మించి కొంత యథార్థమై తెలిసికొనదగిన విషయముకలదని ఆయన వ్రాసెను. "హిందూదేశము ఏవోకొన్ని భయంకరాధ్యాత్మికాభ్యాసములు చేయుచున్న ఒక క్రొత్తజాతి మనుష్యులతో మాత్రమే నిండియున్న

దని, ఈ క్రొత్తజాతిమనుష్యులేవో కొన్ని గారడీలుచేసి వానివల్ల ఒక సుఖమైన జీవికను గడుపుచున్నవారనియు, వీరుగాలిలో పక్షులవలె ఎగురుట, జలములో చేపలవలె మునిగియుండుట, పలు విధములైన వ్యాధులు మంత్ర తంత్రములతో భూతోచ్చాటన ముతో మాన్పుట, లోహములను బంగారము, వెండి, రత్నము లుగా మార్చుట, తమకున్న సిద్ధులవల్ల ధనికులకు సుపుత్రులు కలుగునట్లు చేయుట మొదలైన విద్యలతో ధనము సంపాదించు వారు మాత్రమేయైయున్నారను అభిప్రాయము మనము పడరాదు. కొందరు మహాపురుషులు, మహాయోగులు బ్రహ్మానుభవము కలవారు జీవన్ముక్తులు, మహాభక్తులు, ఎప్పుడును భారతదేశ ములో ఉండనే ఉన్నారు. ఇట్టి మహాపురుషులను, జీవన్ముక్తులను నిరాకరించి, పూర్వము చెప్పిన గారడీవాండ్ర నాశ్రయించునంత నీచస్థితికి భారతదేశమందలి ఆర్యజాతి ఇంకను దిగజారిపోలేదు.'' ఇట్లు నిరూపించుటకు మాక్సుముల్లరు పండితుడు ప్రయత్నించెను. ''నిజమైన మహాత్ము'' డను పేరుతో మాక్సుముల్లరు పండితుడు శ్రీరామకృష్ణపరమహంస జీవితమును గురించి 1896 ఆగష్టునెల ''ది నైన్‌టీన్త్ సెంచరీ'' (''పందొమ్మిదవశతాబ్దము'') అను పత్రికలో ఒకవ్యాసము వ్రాసెను.

యూరపు, అమెరికా ఖండములందలి పండితులు, ప్రజలు చాల ఆసక్తితో ఈ వ్యాసము చదివి శ్రీరామకృష్ణదేవుని వంకకు ఆకర్షింపబడిరి. అంతకు పూర్వము హిందూదేశము దిగంబరులు, అజ్ఞానులు, పిరికివాండ్రు, మనుష్యభాదులు, పశుప్రాయులు, వితంతువులను నిష్ఠురముగా సజీవదహనము చేయు వారు, బహువిధములైన పాపకార్యములను చేయు ప్రజలు - ఇట్టివారితో, నిండియుండెడిదని ఈ పాశ్చాత్యనాగరకప్రజానీక మనుకొనుచుండెడిది. ఇట్టి అభిప్రాయములు వారి కేర్పడుటకు కొందరు క్రైస్తవమిషనరీలే కాక కొందరు మనదేశీయులును కారణ

భూతులైనారని చెప్పుటకు నాకు సిగ్గుగా నున్నది. మాక్సు ముల్లరు వ్యాసము చదివిన తర్వాత వారి దురభిప్రాయములు తొలగిపోజొచ్చినవి. పాశ్చాత్యప్రజానీకమునకు క్రైస్తవమిషనరీలును కొందఱు హైందవులును కప్పిన ఈ అజ్ఞానపు తెర క్రమముగా తొలగి పోవుచు వచ్చినది. "ప్రపంచమునకంతకు ఆచార్యపురుషుడైన భగవాన్ శ్రీరామకృష్ణదేవుని కనినదేశము మన మింతకు పూర్వము. వినుచున్న పాపిష్ఠిజనులతో నిండియుండునా? మన మిన్నాళ్లు హిందూదేశస్వరూపమునుగుఱించి మనకు తెలియకుండ, ఏవేవో ఉద్దేశములు లోపల పెట్టుకొని దుష్ప్రచారము చేయుచున్న ఈమిషనరీలు మొదలగువారిచేత వంచితులమైనామా" అను ప్రశ్నలు ఈ వ్యాసము చదువగనే వారికి కలిగి తీరును.

మాక్సుముల్లరువంటి వేదాంతి, హైందవమతతత్త్వ సాహిత్యవేత్త, మహాపండితుడు, ఈ మాసపత్రికయందు శ్రీరామకృష్ణుని జీవితమును గుఱించి భక్తిపూర్వకముగా పాశ్చాత్యుల కొఱకు వ్రాసిన తర్వాత పూర్వము దుష్ప్రచారము చేసినవారికి ఆగ్రహావేశములు వృద్ధిపొందుటలో ఆశ్చర్యము లేదు.

హైందవదేవతలనుగుఱించి క్రైస్తవమిషనరీలు దుష్టముగా చిత్రించుచు, దుష్ప్రచారము చేయుచు అట్టి దేవతల నారాధించుచున్న జాతియందు పుణ్యపురుషులు పుట్టుటకు వీలే లేదని నిరూపించుటకు బహుప్రయత్నములు గావించిరి. కాని వారి ప్రయత్నములన్నియు ఒకమహాప్రవాహములో గడ్డిపరకవలె కొట్టుకొని పోయినవి. మఱి శ్రీరామకృష్ణపరమహంసయొక్క తేజఃపుంజమును వ్యాపింపకుండ అరికట్టజూచిన మనస్వదేశీయులు కొంద ఱున్నారు. వారును ఆశాభంగము చెందక తప్పలేదు. దైవశక్తి ముందు మానవసంకల్ప మేమి చేయును?

సరే, ఫలితముగా ఈ వృద్ధమహాపండితుని తలపైన ఈ మిషనరీలు, అస్మద్దేశీయులుకూడ రాళ్లవాన ప్రారంభించిరి.

కాని ఆ వృద్ధు డనేకయుద్ధములలో నాతితేఱినవాడు. వీరికి జంకి వెన్నుజూపువాడు కాడు. చాల తేలికగ వీరిని మట్టుపెట్టినాడు. మఱికొంతమంది అసమర్థులైన విమర్శకులయొక్క నోరు కట్టివేయుటకు "శ్రీరామకృష్ణుడు - ఆయన జీవితము - బోధనలు" అను పేరుతో ఆయన జీవితమును, బోధనలును సమగ్రముగా ప్రకటించినాడు. ఈ గ్రంథము చదివిన వారికి రామకృష్ణపరమహంసను గుఱించి, ఆధ్యాత్మికభావములనుగుఱించి ఎక్కువగా తెలియగలదని ఆయన భావము. ఆయన ఇట్లు వ్రాసినాడు: "ఈమహాత్ముడు భారతదేశములోను, అమెరికాలోను గొప్ప ప్రసిద్ధి సంపాదించినాడు. ఈ రెండుదేశములలో ఈ మహాపురుషుని సందేశములను ఈయన శిష్యులు వ్యాపింపజేయుచు ఆయన సిద్ధాంతముల కనుయాయులను వృద్ధిచేయుచున్నారు. వీరిలో క్రైస్తవులుకూడ పలువురు కలరు." "ఇది మీకు చాల ఆశ్చర్యముగా నుండును. కొందఱిది నమ్మకపోయినను పోవచ్చును. కాని ప్రతి మానవ హృదయమునందును ఆధ్యాత్మికవిషయములనుగుఱించి తెలిసికొనవలెనను ఆవేదన కొంత ఉన్నది. తహ తహ ఉన్నది. ఈ ఆవేదన - ఈ తహతహ ఒక పెద్ద ఆకలివంటిది. ఈ ఆకలి తీర్చుకొనక తప్పదు. మఱి ఇప్పుడు శ్రీరామకృష్ణునియొక్క శిష్యుల మతప్రచారము, ఆధ్యాత్మికప్రచారము ఆకొన్నవారికి అమృతమువలె సరాసరి లభించినది. అందుచేత ఇది వారి కమృతప్రాయమైనది." "శ్రీరామకృష్ణుని మతమునందు చేరినవా రింతమంది యని చెప్పు మాటలలో కొంత అతిశయోక్తి యుండిన ఉండవచ్చు. కాని అంత పురాతనమైన ఈ వేదాంతమతము ఈ అధునాతనకాలములోకూడ ఇంత విజయవంతముగా ప్రచారము పొందుచున్నదనగా దీనిని మన మెంతో శ్రద్ధతో తెలిసికొనదగి యున్న మత మని చెప్పక తప్పదు."

మాక్సుముల్లరు పుస్తకముయొక్క మొదటిభాగములో మహాత్ముని జీవితమునందలి నాల్గు భాగములు యోగాభ్యాస

ములు, మొదలైన వానిని గుఱించి దయానందసరస్వతి, పహ్వారీ బాబా, దేవేంద్రనాథఠాకూరు, రాయిసాలిగ్రామసాహెబ్ బహదూర్ (రాధాస్వామిమతనాయకుడు) లను గుఱించి కూడ కొంత వ్రాసెను. తర్వాత శ్రీరామకృష్ణునిజీవితము ప్రారంభమగును.

సంభాషణపద్ధతిలో చరిత్రవ్రాయుట చరిత్ర గ్రంథములన్నింటను తప్పనిసరియైనది. ఇందులో ఒకచిక్కున్నది. ఈ చెప్పువాని ఇష్టమునుబట్టి, అయిష్టమునుబట్టి యథార్థములు మార్పు పొందుచుండును. కాని మాక్సుముల్లరుకూడ ఈ సంభాషణపద్ధతి కొంత అవలంబింపక పోలేదు. కాని రామకృష్ణుని జీవితమునందలి యథార్థవిషయములను సంగ్రహించుటకు ఆయన చాల శ్రమపడెను. నేను శ్రీరామకృష్ణపరమహంస దాసానుదాసుడను. మాక్సుముల్లరు పండితుడు తాను రామకృష్ణపరమహంసనుగూర్చి సంపాదించిన ఉదంతమంతయు సునిశితతర్కముతో, నిష్పక్షపాతముగా నిర్ధరించుకొన్నను ఈ మాటలు వ్రాయక వదలిపెట్టలేదు. "ఐనప్పటికిని ఉన్న దున్నట్లు చిత్రించుటకు నే నెంత యత్నించినను ఈ సంభాషణపద్ధతివలన కొంతమంది భక్తులు ఆయన జీవితమునకు నాధారణముగా అంటగట్టు మహిమలు అక్కడక్కడ సూచనామాత్రముగ నా గ్రంథమందు గోచరింపవచ్చును." ఆయన ఈ మాటలు బ్రహ్మసమాజప్రచారకుడగు శ్రీ ప్రతాపచంద్రమజుందారు, ఆయన అనుయాయులు మఱికొందఱు "శ్రీరామకృష్ణపరమహంసను గుఱించి అధికమునరించి చెప్పకుడు" అని వ్రాసిన ఉత్తరములకు సమాధానముగ చెప్పినవి. బెంగాలులో మనలో మన మితరుల పచ్చనుచూచి సహింపనివారము. కాబట్టి మాక్సుముల్లరు పండితుడు చెప్పిన భావబంధుర మధురవచనములను మనము చక్కగ మననముచేయవలెను.

ఈగ్రంథమందు తేలికభాషలో సంగ్రహముగా శ్రీరామకృష్ణుని జీవితము చిత్రింపబడినది. గ్రంథకర్త ప్రతిమాటను తూచి

చూచి వాడను. 'ఒకనిజమైన మహాత్ము'డను వ్యాసములో అక్కడక్కడ మెఱయుచున్న రవ్వలు చాల జాగ్రత్తగా పొదుగబడినవి. ఒకప్రక్క క్రైస్తవమిషనరీలు, మఱొకప్రక్క మన బ్రహ్మసామాజికులు కలరు. రెండు భయంకరసన్నివేశములమధ్య ఇరుకుత్రోవలో నౌకనడిపినట్లు మాక్సుముల్లరు ఈ ఇరువురి తగాదాలకు తట్టుకొనుచు ఈ గ్రంథమును వ్రాసెను. పూర్వమువ్రాసిన "ఒకనిజమైనమహాత్మ" డను వ్యాసమువల్ల క్రైస్తవమిషనరీలు, బ్రాహ్మసామాజికులు ఈ యిరుతెగలవారు మాక్సుముల్లరుపండితునిపైన విఱుచుకొనిపడిరి. మఱి మాక్సుముల్లరు పండితుడు ఈ గ్రంథములో వారినేమియు ప్రతినింద చేయలేదు. తనహుందాతనమును ఈషణ్మాత్రము కోల్పోవలేదు. ఇంగ్లండులో పరమసుకుమారముగ వ్రాయురచయితలు తమహుందాతనమును కోల్పోవరు. నైచ్యమున కొడిగట్టరు. మాక్సుముల్లరు పండితుడట్టివాడు. పరమవివేకముగా, పరమోదారముగా, ఈర్ష్యయనునది, ద్వేషమనునది, రేఖామాత్రముగనైన లేకుండ దృఢముగ తన వయఃపరిణతికి, పాండిత్యపరిణతికి యోగ్యమైన మేఘగంభీరనినదములో మహాత్ముడైన శ్రీరామకృష్ణపరమహంసయొక్క అసాధారణమైన భావములను ఆమహనీయుడు వ్యక్తీకరించెను. సామాన్యదృష్టికి అందని ఉత్తమభావములను వివరించెను. ఉభయపక్షములవారు చేసిన పిచ్చిపిచ్చి శంకలను సమర్థముగా నుత్తరించెను.

ఈ శంకలు మిగుల వింతగా నున్నవి.

బ్రహ్మసమాజమునకు కర్ణధారియైన కీ॥ శే॥ కేశబ్ చంద్ర సేన్ శ్రీరామకృష్ణునిగుఱించి ఇట్లనుచుండెడివాడు: "ఆయన భాష చాల తేలికగా, మధురముగా, దివ్యముగా, మిగుల పుష్టితమై యుండెడిది. ఆయన మాటలయం దచ్చటచ్చట కొన్ని మనము గ్రామ్యోక్తు లనబరగునవి ఉండెడివి. ఆయన పసిపిల్లవానివలె

అమాయికముగా వానిని వాడెడివాడు. ఆయన వాడినపుడు వానియం దేవిధమైన అపార్థము భాసించెడిది కాదు. ఆయన వాడినపుడు ఆ మాటలు సౌందర్యసందీపితములై యుండెడివి.'' ఐనను మనవాండ్రిదియొక పెద్దనేరముగా నెన్ని చూపింతురు.

ఆయనపై మోపిన మఱొక నేర మిది: ''ఆయన సన్న్యాసము పుచ్చుకొనుటవల్ల భార్య ననాగరకముగా చూచినారు'' దానికి మాక్సుముల్లరు పండితుని సమాధాన మిది : ''ఆయన తనభార్యయొక్క అనుమతితోనే సన్న్యాసముపుచ్చుకొన్నాడు. మఱి ఆయన జీవితకాలమంతయు ఆయనభార్య భర్తకనురూపమైన సచ్ఛీలవతియై, ఆయనను గురువుగా స్వీకరించి, తన జీవితమంతయు ఆయన ఉపదేశానుసారము బ్రహ్మచారిణియై గడపినది. ఆ సంగతి యట్లుంచుడు. పిల్లలను కనిన తప్ప భార్యాభర్తలమధ్య ప్రేమయుండుటకు వీలులేదా? ఎట్టి శారీరకసంబంధము లేకుండ భార్యాభర్తలు బ్రహ్మచారులుగా, పరమశుద్ధముగా జీవించుచు బ్రహ్మానందమునందు బ్రహ్మచారులు కావచ్చును. ఇది మన దేశములో మనము విశ్వసింపమనుకొనుడు. కాని హిందువుల యోగ్యతయట్టిది.'' ఇట్టి చక్కని, పరమోచితమైన అభిప్రాయమును చెప్పిన మాక్సుముల్లరు పండితుని పరమేశ్వరుడనుగ్రహించుగాక. ఆయన విజాతీయుడు. వైదేశికుడు. ఆయనకుకూడ మన బ్రహ్మచర్యములోని రహస్యము తెలిసినది. బ్రహ్మానుభూతిని సంపాదించుట కదియొక్కటే మార్గము. ఈ దినములలోకూడ హిందూదేశములో నీబ్రహ్మచర్యము పాటింపబడుచునేయున్నది. అది ఆయన గ్రహించినారు. మఱి వంచకులైన మనవారలకు భార్యాభర్తృసంబంధమనిన నట్టి శారీరకసంబంధమేయట. మనిషి తానెంతో జగమంతే యనుకొనును.

మఱొకనేరము కులటలనుగూర్చి ఆయన తగినంత కాఠిన్యము వహించలేదనునది. దానికి మాక్సుముల్లరు పండితుని సమా

ధానమెంతచక్కగా చెప్పినాడో చూడుడు! "ఈనేరము మత కర్తలలో రామకృష్ణునియొక్కనిమీదనే మోపుటకువీలులేదు. ఆయనతోపాటు చాలమందియున్నారు". ఎంత చక్కగా చెప్పినాడు! శ్రీబుద్ధదేవుడు అంబాపాలియను ఒక వ్యభిచారిణిని, క్రీస్తు ఒక సమేరియా వ్యభిచారిణిని అనుగ్రహించి రక్షించిరి.

మఱియొకనేరము "రామకృష్ణుడు కొన్ని దురభ్యాసములు కలవారిని దూరీకరింపలేదనునది". అయ్యలారా! మిమ్ము పరమేశ్వరుడనుగ్రహించుగాక! ఇదెట్టినింద! ఒకడేదో ఒకచుక్క, రెండు చుక్కలు త్రాగినాడే యనుకొందము. అట్టివాని నీడనైన మనము త్రొక్కకూడదా? అంతయేనా అర్థము? ఎంతక్రూరమైననింద! ఐతే దీనిస్వరూపమేమి? "ఆమహాపురుషుడే లోకమందలి త్రాగుబోతులను, వ్యభిచారులను, దొంగలను, ఇట్టివారిని తన్ని ఎందుకు వెళ్ళగొట్టలేదు" అని ఊహింపనగునా? ఆయన కన్నులు మూసికొని గొంతు మార్పులేకుండా ఒకేరీతిగా వేణువూదినట్లు మెల్ల మెల్లగా తీయగా తన అభిప్రాయములను దాచుకొని ఎందుకు మాట్లాడలేదనియా? అన్నిటికంటె మించిన నేరమేది?

ఆయన జీవితకాలమంతయు గృహస్థుడుగా నుండక పోవుట.

ఈదోషారోపకులు "ఇదిగో ఇంత పవిత్రముగా ఈ యీ పద్ధతులతో జీవించవలెనుసుమా" యని చెప్పినట్లు మనము నడచుకొనకపోయినచో హిందూదేశము తప్పకుండ నాశనమైపోవును! పాపము వీరు నిర్మించిన నీతిసూత్రములవల్ల హిందూదేశ ముద్ధరింపబడు గాక!

గ్రంథములో అధికభాగము రామకృష్ణుని జీవితమును గుఱించి చెప్పుటకంటె ఆయన చెప్పినబోధనలు సంగ్రహించుటకై వినియుక్తమైనది. ఈ పుస్తకముయొక్క ప్రతులు చాల శీఘ్రముగ విక్రయింపబడుటనుబట్టి ఆంగ్లభాషను మాట్లాడు ప్రజల

యొక్క దృష్టిని ఆ బోధ లంతగా ఆకర్షించినవో మనమూహింప వచ్చును.

ఈబోధలు శ్రీరామకృష్ణపరమహంసయొక్క పవిత్ర ముఖమునుండి శ్రుతిగోచరములైనవికాబట్టి అవి ఆధ్యాత్మికశక్తితో నిండియున్నవి. అందుచే అవి ప్రపంచమందంతటను దివ్యకాంతులను వెదజల్లుచునేయుండును. మహాపురుషులు బహుజీవుల నుద్ధరించుటకు జన్మింతురు. వారి జీవితములు, వారిచేతలు సామాన్యరీతిని నడువవు, బోధనాపద్ధతియు అంతవిచిత్రముగానుండును.

మనమేమి చేయుచున్నాము? ఆయన ఒక పేద బ్రాహ్మణుని కుమారుడు. ఆయన పుట్టుకవల్ల మనలను పవిత్రులను చేసినాడు. ఆయన జన్మవల్ల మనము పవిత్రులమైనాము, ఆయన చేతలవల్ల మన ముద్ధరింపబడినాము. మనము జనించిన జాతియొక్క సహృదయత్వమాయనయొక్క అమృతబోధనవల్ల సంపాదించుకొనగల్గినాము. దీనికి ప్రత్యామ్నాయముగా ఆయనకు మనముచేసినదేమి? సత్యమెల్లప్పుడాస్వాద్యముగ నుండదు. కాని ఆస్వాద్యముగ లేకున్నను కొన్ని సందర్భములలో సత్యము చెప్పక తప్పదు. మనలో కొందఱాయనజీవితము, ఆయనబోధలు, మనకెంతయో మేలుచేకూర్చునని గ్రహించినవారున్నారు. గ్రహించినారంతే! మనజీవితములోవానిని ఆచరణలో పెట్టుటకు ప్రయత్నము చేయుట మన తలకుమించినపని. మన ఆత్మ, మన శరీరము, రెండుకూడ ఆపరమహంస పుట్టించిన భక్తి జ్ఞానములను ఉత్తాలతరంగములతో సమ్మేళనముచేయుమాట ఎక్కడ కెక్కడో! ఈ ఈశ్వరలీలను అర్థముచేసికొనినవారికిగాని, కనీస మర్థముచేసికొనుటకు యత్నించిన వారికిగాని ఒక్కసంగతి చెప్పెదను. కేవలము అర్థముచేసికొనినందువల్ల ప్రయోజనమేమి? నీ వర్థముచేసికొంటివనుటకు నిదర్శనమేమి? నీవూరకే మాటలలో ప్రతిజ్ఞావాక్యములు చెప్పినంతమాత్రమున, దానిలో నీకు చాల విశ్వాసమున్నదని చెప్పినంతమాత్రమున నిన్నెవరు నమ్ముదురు? నీవుచేసిన

పని నీయాచరణమునకు, నీభావములకు నిదర్శనము. నీ వనుకొన్న దానిని, విశ్వసించినదానిని ఆచరణలో పెట్టుము. అప్పుడు లోకము నిన్ను గుర్తించును. నీ భావములు హృదయపూర్వకముగా చెప్పినవో కావో నీ చేతలు ఋజువుచేయును. నీ చేతలు నీ భావముల ఫలితములే గదా!

కొందఱు తాము పెద్దపండితులమనుకొని ఈనిరక్షరాస్యుడైన, సామాన్యుడైన పూజారిని శ్రీరామకృష్ణునిగుఱించి చాల తేలికగా భావింతురు. వారికి వినయపూర్వముగా నాచేయు అభ్యర్థనమిది: "అయ్యలారా! ఒక్క నిరక్షరాస్యుడు, పూజారి తనశక్తివల్ల ఇంత కొంచెముకాలములో మీ పితృపితామహుల యొక్క సనాతనధర్మమును మహాసముద్రముల యావలనున్న దేశములందుకూడ మార్మ్రోగ చేసినాడే! ఆయన ఏ దేశమునకు చెందినాడో మీరా దేశమునందు నాయకమణులు. పూజ్యస్థానమలంకరించినవారు. శక్తిమంతులు. ఉత్తమవంశసంజాతులు. మహాపండితులు. అంతగొప్పవారగు మీరెంత గొప్పపనులు చేయవలెను! మీ దేశముయొక్క, జాతియొక్క ఉత్తమస్థితికి మీరూరక ఇచ్చించినచోచాలు, మీరెంత గొప్పపనులు చేయగల్గుదురో చూడుడు. కావున లెండు. నడుము కట్టుడు. ముందుకురండు. మీలోనున్న మహాశక్తిని చూపుడు. దానిని వ్యక్తముచేయుడు. ఇదిగో మేమిక్కడ మీకు సాష్టాంగపడి పూజించుటకు సిద్ధముగానున్నాము. మేము వట్టి అజ్ఞానులము. పేదవాండ్రము. ఏమియు తెలియనివారము. ఏదో ఇంత తిండియైన దొరుకునని ఈ బైరాగి బురఖా తగిలించుకొని, పేరు, ఊరు లేని సన్న్యాసులమై తిరుగుచున్నాము. మీరో మహాభాగ్యశాలురు. పలుకుబడి కలవారు. సామర్థ్యముకలవారు. ఆభిజాత్యముకలవారు. విజ్ఞానము, పాండిత్యముగూడ కలిగినవారు. మీరేల విజృంభింపరు? మీరెందుకు నాయకత్వము వహింపరాదు? మాకు దారిచూపుడు. లోకోద్ధరణమునకై పరిపూర్ణత్యాగముచేసి ఉదాహరణభూతులుకండు.

మేము తప్పకుండ చేతులుకట్టుకొని దాసులవలె మిమ్మనుస రింతుము.''

దాస్యములో గ్రుడ్డుచున్న జాతికి స్వాభావికగుణములైన నిష్కారణవైరము, ఈర్ష్యా ద్వేషములు మొదలైన దుర్గుణములు మఱికొంతమంది శ్రీరామకృష్ణపరమహంసయొక్క కీర్తి ప్రతిష్ఠల విషయమున చూపుచున్నారు. వారికి మేము చెప్పునదిది : ''ప్రియ మిత్రులారా! మీప్రయత్నము వట్టివ్యర్థము. ఎందుకనగా ఇప్పుడు ఈవిశ్వమునంతయు నాక్రమించుకొనిన అనంతమైన ఈ రామకృష్ణమతమహాతరంగము ఏదోవ్యక్తిగతమైన పేరు, కీర్తి, ధనము మొదలైనవానికొఱకు మేము చేసిన ప్రయత్నముయొక్క ఫలితమైనచో మీరెవ్వరు ప్రయత్నముచేయకుండనే ఇది వినష్ట మైపోవును. అది ప్రకృతిసిద్ధమైనధర్మము. స్వలాభమునకై చేసినధర్మమువల్ల చిరస్థాయియైన ఫలితము పుట్టబోదు. ఇది ఈ రామకృష్ణమత మహాతరంగము. ఈతరంగముపై దివ్యకాంతితో భాసిల్లుచు దివ్యమూర్తియై శ్రీరామకృష్ణప్రభువు నిలబడి యున్నాడు. ఇది మాస్వార్థచింతతో చేసిన ప్రయత్నముయొక్క ఫలమైనచో ఈతరంగము వినష్టమై పోవును. మఱల లేవనే లేవదు. అట్లుకాక ఈమహాప్రవాహము విశ్వజనని అనుగ్రహమువల్ల, దివ్యశక్తివల్ల ఒకమహాపురుషుని హృద్గతమైన నిస్వార్థప్రేమప్రవా హమేమైనచో ఓ శక్తిహీనులారా! ఆవిశ్వజనని, ఆమహేశ్వరి యొక్క ఇచ్ఛాశక్తి అడ్డగించుటకు మీకేమిశక్తియున్నది?''

# "జ్ఞానము - జ్ఞానాధికరణము - జ్ఞానసాధనము"

(స్వామిజీ "ఉద్బోధన" పత్రికకు 12-2-1899 లో వ్రాసిన బెంగాలీ వ్యాసమునకు ఇంగ్లీషుద్వారా అనువాదము)

జ్ఞాన మన్నది ఎచ్చటనుండి కల్గునన్న విషయమునుగుఱించి బహుసిద్ధాంతములు ప్రపంచింపబడినవి. ఉపనిషత్తులయందు దేవతలందఱిలో ప్రథముడైన బ్రహ్మ ఈ సర్వజ్ఞానమునకు నిధాన మనియు, ఆయన ఈ జ్ఞాననిధిని శిష్యుల కిచ్చెననియు, వారు శిష్య ప్రశిష్యపరంపరామార్గమున జ్ఞానమును వినష్టము కాకుండ వ్యాపింపజేసిరనియు చదువుదుము. జైనుల సిద్ధాంత మీ క్రిందిది: వారి సిద్ధాంతమునుబట్టి కడచిన కాలము ఒకవేయి, రెండువేల మధ్య అర్బుదముల సంవత్సరములు కలది. ఈ మహాకాలము నందు కొంతమంది సిద్ధపురుషు లుదయించిరి. వారు మనుష్య సంఘమునకు ఈ జ్ఞానభాండారమును పంచిపెట్టిరి. బుద్ధుల సిద్ధాంతము నిట్టిదే. అనంతమై, విశ్వజనీనమైన జ్ఞానముగల బుద్ధు లుదయింతు రందురు. హిందూపౌరాణికులు అవతారములు వచ్చునని చెప్పుటలోకూడ హేతు విదియే. కాకపోయిన వారు ఈ జ్ఞానదర్శనముతో బాటు ధర్మమును కూడ ఉద్ధరింతురని చెప్పుదురు. హిందూదేశము దాటిన తర్వాత తక్కిన దేశములలో మఱొక విధమైన సిద్ధాంత మున్నది. మహాత్ముడైన జొరోష్టరు దివినుండి భూమిమీదికి జ్ఞానమును కొనివచ్చెను. మోసెస్, క్రీస్తు, మహమ్మదు, వారి వారి పద్ధతులలో జ్ఞానమును భూమిపై వ్యాపింపజేసిరి.

దేవతలలో బ్రహ్మపద మత్యుత్తమమైనది. పుణ్య కర్మములవల్ల ఎవ్వరైనను బ్రహ్మపద మందవచ్చును. ఏ కొద్దిమందియో జినులు కాగలరు. తక్కినవారు ముక్తి

నందగలరు. బౌద్ధులలో బుద్ధత్వము ప్రతివాడు పొందవచ్చును. వైదేశికమతములలో మోసెస్, క్రీస్తు, మహమ్మదు, జొరోష్టరు ఏదో ఒకప్రత్యేకమైన కార్యమును నిర్వహించుటకు పుట్టిన మహానుభావులు. పౌరాణికఋషులచే పేర్కొనబడిన అవతార పురుషులును అట్టివారే. ఈ దివ్యపురుషులు పొందిన పదము నాక్రమింపనెంచుట పిచ్చికోరిక.

నిషేధింపబడిన ఫలములను తినుటవల్ల ఆదాముకు జ్ఞానోదయమైనది. జహోవాయొక్క దయవల్ల నోవాకు సాంఘిక శాస్త్రము అవగతమైనది. ప్రతిశాస్త్రమున కొక అధిదేవత యుండునని, ఆ శాస్త్రారంభకులు దేవతలో, సిద్ధపురుషులో అగుదురని, చెప్పులు కుట్టు విద్య నుండి బ్రహ్మ విద్య వఱకు దేవతలో సిద్ధపురుషులో ఆదిగురువులని హిందువుల సిద్ధాంతము. "గురువు లేని విద్య లేదు." గురుశిష్యసంప్రదాయానుసారముగా తప్ప మఱియొక విధముగా విద్యాసంగ్రహము లేదు. గుర్వనుగ్రహముతో, గురుముఖతః నేర్చుకొనవలసినదే తప్ప మఱొక మార్గము లేదు.

మఱి వేదాంతశాస్త్రజ్ఞులు, ఇతరశాస్త్రజ్ఞులుకూడ జ్ఞానమనునది బయటనుండి సంపాదించునది కాదని వచింతురు. జ్ఞానమాత్మస్వభావము. అందుచే ప్రతివానికిని జ్ఞానసముపార్జనమునందు స్వాభావికమైన అధికారము కలదు. ఆత్మ అనంతజ్ఞానమునకధికరణము. దానిని ప్రకాశింపజేయు బాహ్యవస్తువు లేదు. కొందఱి సిద్ధాంతములనుబట్టి ఈ అనంతమైన జ్ఞానము తరుగదు, పెరుగదు, వినష్టము కాదు. సామాన్యముగ మానవునకు దీని ఎఱుక లేదు. దీనిపైన ఒక అజ్ఞానపుతెర కప్పియుండును. ఈ అజ్ఞానపుతెర వాని పురాకృతదుష్కృతఫలితము. తెర తొలగిన తోడనే జ్ఞానము ప్రకాశించును. మఱికొందఱిట్లు చెప్పుదురు: "జ్ఞానమనునది ఆత్మయందున్నను, పాపరూపక ప్రతిబంధక

సామగ్రివల్ల అది నిరోధింపబడినది. పుణ్యకర్మలవల్ల ఈశ్వరానుగ్రహము కల్గును. ఈశ్వరానుగ్రహమువల్ల ప్రతిబంధక సామగ్రి తొలగును. అప్పుడు జ్ఞానము ప్రకాశమగును.'' మన వేదశాస్త్రములం దిట్టివే మఱికొన్ని జ్ఞానసాధకమార్గములు భక్తి, నిష్కామకర్మ, అష్టాంగయోగము మొదలైనవి ప్రపంచింపబడినవి. మొత్తముమీద వీనినన్నిటిని పరిశీలించినచో ఈ మార్గములం దొకటిగాని అంత కెక్కుడుగాని యన్నియుగాని ఆచరించుటవల్ల మానవునకు తన సహజమైన స్వరూపము ఎఱుకపడును. అతనియందు నింతవఱకును అజ్ఞానావచ్ఛిన్నమై అణగియున్న అనంతజ్ఞానము, శక్తి, అభివ్యక్తమగును.

ఈ సంగతి యిట్లుంచి అధునాతన తాత్త్వికులయొక్క అభిప్రాయములను చూతము. ''మానవుని మనస్సు సహస్రముఖముల అభివ్యక్తమగును. దేశకాలనిమిత్తములపై మనఃప్రభావము, మనస్సుపైన దేశకాలనిమిత్తముల ప్రభావము ప్రసరించినపుడు పరమోత్తమమైన జ్ఞానము ఆవిష్కృతమగును'' అని వారి అభిప్రాయము. అంతేకాదు, వ్యక్తియొక్క దార్ఢ్యమువల్ల, ఉత్సాహమువల్ల దేశకాలములనుకూడ అధిగమించుటకు వీలున్నది. అతడు బలవంతుడైనచో నతనికి చుట్టునున్న దేశకాలపరిస్థితులు పరమవ్యతిరేకముగా నున్నప్పటికి అతడు వానినధిగమించి తనశక్తిని ప్రదర్శించును. అంతేకాదు, అతనిపైన బహుభారములు పడినప్పటికి కాలక్రమమున నవి సుగమములగును. అతడు తొలుత నెంతబలహీనుడైనను, శ్రద్ధాసంకల్పములు కలవాడైనచో తప్పక తుదకు లక్ష్యమును సాధించితీరును. పూర్వము అజ్ఞానులు, అనాగరకులుగానున్న ప్రజలను చూడుడు. తమ శక్తియుక్తుల నన్నింటిని కేంద్రీకరించి పనిచేయుటవల్ల ఎంత త్వరగా నాగరకతను వారు పెంపొందింపచేసికొనుచున్నారో! నిమ్నజాతులవారుకూడ శ్రద్ధతో పనిచేసి ఎంత ఉత్తమపదవులను

సాధించుకొనుచున్నారో చూడుడు. మనుష్యఖాదుల సంతాన మీనాడు ఎంతో నాగరకులు, విద్యావంతులు అగుచున్నారు. అనాగరకులైన వారి సంతానము ఈ దినములలో భారతీయవిశ్వ విద్యాలయములందు మన బెంగాలీ విద్యార్థులతో పోటాపోటీగా విద్యాభ్యాసము చేయుచున్నారు. ఇంగ్లీషుప్రభుత్వము నీ విషయ ములో అభినందించి తీరవలెను. శాస్త్రీయపరిశోధకుల గుణములు పితాపుత్రసంబంధమై యుండు నను సిద్ధాంతమువంకకు మ్రొగ్గు చుండిరి. వారి మ్రొగ్గుదల నానాటికి తగ్గిపోవుచున్నది.

కొందఱు శాశ్వతముగ ఒక జ్ఞానభాండారమున్నదని, భూత భవిష్యద్వర్తమానాత్మకమైన జ్ఞానమంతయు దానియందు భద్ర పఱుపబడియుండునని చెప్పుదురు. ఈ జ్ఞానభాండారము తమ పితృ పితామహుల యధీనమై సురక్షితముగా నున్నదని చెప్పుదురు. పూర్వులు తొలియధికారులు. వారు ఈ భాండారమును దాని యొక్క అర్థమును వారివంశములందు పుట్టినవారికి మాత్రమే ఇచ్చినారట! అందుచే కేవలము వారు మాత్రమే ఆ జ్ఞానభాండా రమునకు యజమానులు. వారసులు. అందువల్ల వారిని తక్కిన వారందఱు పూజింపవలెను.

"అట్టి పితృపితామహులులేని ప్రజలయొక్క గతి యే" మని మన మడిగితిమా "వారి గతి యంతే" అని వారి జవాబు. వారిలో చాల అతిదయార్ద్రహృదయులు "బాగుగనే యున్నది. వారు వచ్చి మాకు సేవచేసినచో, ఆ సేవకు ఫలితముగా వారు పైజన్మలో మా జాతియందు పుట్టుదురు. వారికి మేము కల్పించు గతి యంతే" అని చెప్పుదురు, "అధునాతనశాస్త్రజ్ఞులు భౌతిక శాస్త్రమునందు, తక్కిన లౌకికవిద్యలయందు బహువిషయములు కనిపెట్టుచున్నారు. మీ రెప్పు డా విషయములు కల గని యుండరు. మీ పితృపితామహులును కల గని యుండరు" అని మఱల ప్రశ్న. దానికి వారు "మా పితృపితామహులకు తెలియక

పోవుటేమి? వారి కివన్నియు తెలియును. దురదృష్టవశాత్తు ఆ విజ్ఞానమంతయు లుప్తమై పోయినది. నీ కేమైన నిదర్శనము కావలయుచో చూపెదము. చూడుడు. ఈ సంస్కృతశ్లోక''మని మొదలుపెట్టుదురు. మన అధునాతనులకు కావలసినది ప్రత్యక్ష సాక్ష్యము. అందుచే వారిచ్చు సమాధానములకు, నిదర్శనములకు వీ రేమాత్రము విలువ నీయరు.

సాధారణముగ సమస్త జ్ఞానమును రెండు తరగతులక్రింద విభజింపవచ్చును. 1. పరావిద్య. 2. అపరావిద్య.

1. పరావిద్య యనగా ఆధ్యాత్మికవిద్య. 2. అపరావిద్య యనగా లౌకికవిద్య. ఒకటి శ్రేయస్సాధనము. రెండవది ప్రేయస్సాధనము. శ్రేయస్సు అనశ్వరము. ప్రేయస్సు నశ్వరము. ఈ రెండువిద్యలమధ్య, వీనిసాధనములమధ్య అనంతమైన భేదమున్నది. అంతేకాదు, ఈ విద్యాసముపార్జనమునందు అందఱకును ఒకేమార్గ మనువుగా నుండునని చెప్పుటకు వీలులేదు. కాని యథార్థమునకు భిన్నమార్గములందున్న భేదము సజాతీయభేదము గాని విజాతీయభేదము కాదు. పరాపరవిద్యలు రెండు పరస్పర భిన్నములు కావు. అవి రెండు నొకటే. ఒక్కటే మహావిద్య, జ్ఞానసముద్రము. అది యణువునుండి బ్రహ్మపర్యంతము సర్వత్ర వ్యాపించియున్నది. ఒకేజ్ఞానముయొక్క క్రమవికాసములోనున్న రెండు అంతరువు లీ పరాపరవిద్యలు. ఒకదశలో అభివ్యక్తమైనపుడు దానిని అపరావిద్యయనియు, అంతకంటె పైదశలో అభివ్యక్తమైనపుడు దానిని పరావిద్య యనియు అనుచుందురు.

''కొంతమంది మహాపురుషులు భగవదాజ్ఞవల్ల స్వాభావికముగా గాని, పురాతన సత్కర్మఫలితముగా గాని జన్మింతురు. వారికి ఈ సర్వజ్ఞానము ఆకస్మికప్రత్యవభాసమగును. వారివల్ల తప్ప మనకు ఈ జ్ఞానము లభించదు'' అను నొక సిద్ధాంతమున్నది. ఇదే యథార్థమైనచో ఏ వ్యక్తియైనను పరిశుద్ధమైన ఒక క్రొత్తసత్య

మును కన్గొనుటకై ప్రయత్నము చేయనక్కఱలేదు. ప్రయత్నము చేసి కన్గొనదగినదేదియు లేదు. కావున ఆ వంక నుత్సాహముగాని, ప్రయత్నముగాని జనులలో ఉండనే యుండదు. అంతేకాదు, అన్నింటికంటె దుష్ఫలిత మేమనగా, ఏదో క్రొత్తగా తమంతట తా మేదైన కనుగొనవలెనని ఎవరైన ప్రయత్నించినచో ఆ ప్రయత్నమును సంఘము వ్యతిరేకించి ఆపివేయును. అందువల్ల వ్యక్తిగతప్రయత్నము చేయవలయునను వాంఛయే నశించును. మనుష్యుల అభ్యుదయమార్గమంతయు నీ సర్వజ్ఞులైన జనులచే "ఇక్కడనుండి ఇంతవఱ"కని బద్దెలుగీసి నిర్ణయింపబడినట్లైన యెడల ఈ మార్గమును రేఖామాత్రముగనైన తప్పి నడచినచో సంఘము వినష్టమై పోవునను భయ ముదయించును. అందువల్ల సంఘము కఠిననియమము చేసి, అదేమార్గము ప్రతివాడు అనుసరించవలెనని శిక్షాస్మృతులు చూపి బలవంతముగా లొంగదీయుటకు ప్రయత్నించును. ఈ ఇరుకు త్రోవలలో మనుష్యుల నందఱను క్రుక్కి నడువవలసినదని సంఘము వారిని బలవంతముగా లొంగదీయగలిగినపుడు సంఘస్థితి లేక నడక కేవలము యాంత్రికముగా తయారగును. మనుష్యజీవితములో ప్రతి పని ముందుగానే నిర్ణీతమై యున్నచో అప్పుడు మన ఆలోచనాశక్తికి, సంస్కృతికి ఫలిత మే మున్నది? స్వతంత్రాలోచనమునకుగాని, స్వతంత్రకర్తృత్వమునకుగాని అవకాశ మే మున్నది? ఉపయోగములేనందువల్ల కాలాంతరమున స్వతంత్రాలోచనముగాని, కర్తృత్వముగాని వినష్టమై పోవును. జాతిమొత్తముమీద ఒక తామసికమైన, స్వాప్నికమైన నిర్జీవత వ్యాపించును. ఆ జాతి తల్లక్రిందులుగా అధోగతికి పోవును. ఆ జాతియొక్క వినాశము ఎంతోదూరము లేదు.

ఆ సంగతి యట్లుంచి అట్టి దివ్యపురుషుల ఆజ్ఞలకు సంబంధము లేకుండ సంఘ మభ్యుదయము పొందుననుకొందము. అప్ప

డేమి జరుగును ? నాగరకత, వివేకము, అభ్యుదయము చైనీయులను, హైందవులను, ఈజిప్టీయులను, బాబిలోనీయులను, గ్రీకులను, రోమనులను తక్కిన అధునాతన, పురాతన జాతులను తమ పురాతన ఋషిపుంగవుల అడుగుజాడల నడచు ఈ సర్వజాతుల వారిని వదలివేసి, జూలూలు, కాఫ్రీలు, అెటెంటోటులు, అండమానులందలి అనాగరకజాతులు, ఆస్ట్రేలియా దీవులందు అనాగరకజాతులు మొదలైనవారిని (నాయకుల నెఱుగక స్వతంత్రమైన జీవితమును గడపిన ఈ జాతులవారిని) ఆశ్రయించియుండవలసి వచ్చును. అనగా వారికంటె వీరు నాగరకత, వివేకము, అభ్యుదయము కలిగియున్నవారని చెప్పవలసివచ్చును.

ఈవిషయములన్నియు దృష్టిలోనిడికొని ఆలోచించినచో ప్రతివ్యక్తియందు సర్వత్ర జ్ఞానము వ్యాపించియున్నదన్నమాట సత్యమైనప్పటికిని, మహాపురుషులు నిర్దేశించిన మార్గమునందు స్వతస్సిద్ధమైన గొప్పతనము దాని కుండనేయున్నది. గురుశిష్య సాంప్రదాయమునుబట్టి విద్యాగ్రహణము పొందుటయందు దాని కుండవలసిన విశేషముండనేయున్నది. ఈ అన్నింటిలో ప్రత్యంశమునకు, మొత్తము జ్ఞానముయొక్క అభివృద్ధియందు దేనికుండవలసిన స్థానము దాని కుండనేయున్నది. మనమాయాయంశములకెంతెంత విలువయున్నదో అంచనావేయుటకు నేర్చుకొనవలయును. కాని ఈగురువులయందున్న అంధభక్తితో వారి యనుచరులు సత్యమును గౌరవభక్తులకు బలిపెట్టి నిజముగా ఆమహాపురుషు లెందుకు జన్మించిరో ఏప్రయోజనము సాధించుటకు పుట్టిరో యను విషయములను వదలివేసి వట్టి వ్యక్తిపూజచేయుట వల్ల వ్యక్తికొఱకు వారు ఆదేశించిన సత్యమును బలిపెట్టినవారగుదురు.

మన అందఱ అనుభవములోనున్న ఒక సత్యమేమనగా మానవుడు అసమర్థుడు, అశక్తుడునైనప్పుడు, తనపితృపితా

మహాలగొప్పదనమును నెమరువేసికొనుచు బ్రదుకు నీడ్చుచుం డును. తనపురాతన పురుషులయందు భక్తిపూర్ణమైన హృద యము కలవాడు క్రమక్రమముగా ప్రతివిషయమును ఆ పురాత నుల పాదములముందు త్యాగముచేసి బలహీనమైపోవును. కడకు ఈదుర్బలమైన వ్యక్తి ఆ పూర్వుల గొప్పదనము ఒక్కటియే యూతగాగొని జీవితముసాగించును. మీ పురాతనులు ఈ విజ్ఞాన మంతకు అధికారులుగానుండి యుండుట నిజమేని క్రమముగా మీ దగ్గఱకువచ్చుసరికి అది వినష్టమైపోయినది. కాబట్టి ఈ విజ్ఞాన మంతయు వినష్టమగుటకు వారి సంతానమైన మీరే కారణము. అది మీకిపుడున్నను లేకున్న నొకటే. అందుచే ఎట్లును పోయినట్టి ఈ విజ్ఞానమునుగుఱించి మాకున్నదన్నను పోయినదన్నను కలుగు ప్రయోజనము శూన్యము. మీరు పునః మీపూర్వులనాటి విజ్ఞాన మును పొందవలెనన్నచో మీరు తిరిగి కష్టపడవలెను. క్రొత్త ప్రయత్నములు చేయవలెను.

నిజమే. ఆ ఆత్మజ్ఞానము దానంతటదియే పరిశుద్ధ చిత్తము గలవానికి ప్రకాశమగును. అందువల్ల నది ఏదో ప్రయత్నించి బైటనుండి తెచ్చుకొనదగినదికాదు. కాని ఈ చిత్తశుద్ధి సంపాదించుటకుగూడ నిరవచ్ఛిన్నమైన సాధన కావలయును. మఱి భౌతికవిజ్ఞానము విషయములో కొన్ని గొప్పగొప్ప సంగ తులు కొందఱు మేధావులైన శాస్త్రజ్ఞుల మనస్సులలో మెఱపు దీగలవలె వాటంతటవి మెఱసినవి. వారూరకే ఆమెఱపునుపట్టు కొని సిద్ధాంతములను చేసియున్నారు. అట్టి శాస్త్రసత్యములు వారి మనస్సులలో మెఱసినవికాని వట్టి అసంస్కృతుడైన ఆటవిక మనుష్యుని మనస్సులో ఎప్పుడైనను మెఱయునా? అందువల్ల నిరంతరధ్యానమువల్ల, నిరంతరవ్యాసంగమువల్ల అనగా కఠిన తపస్సువల్ల ఏ జ్ఞానమైనను ఉద్భవించును.

మనము అసాధారణము, దివ్యావేశము, అని పేర్కొను సందర్భములన్నియును సామాన్యమైన బుద్ధి నిరంతర పరిశ్రమవల్ల

అభివృద్ధినందినసందర్భములందే సంభవించునవి. ఈసాధారణ, అసాధారణజ్ఞానములకున్న భేదములు సజాతీయములైనవే. విజాతీయమైనవికావు. ఎటుకతో మనముచేయు ప్రయత్నములు మనకు దివ్యమైన జ్ఞానానుభూతి కలుగుటకు సాహాయ్యకములగును.

అనభివ్యక్తమై ప్రతిమానవునియందు సంపూర్ణత్వమున్నది. ప్రతిమానవుడు పరిపూర్ణమైనయోగి, ఋషియగుటకు దగిన శక్తి సామర్థ్యములుకలవాడే. అతడు అవతారపురుషుడైననుకావచ్చు. భౌతికశాస్త్రరంగమునందు బహువిషయములు కనిపెట్టదగిన శాస్త్రవేత్తయైనను కావచ్చు. కావలసినదెల్ల వలసినంత కాలము, తగినంత ఉపదేశము, పరిశ్రమ. ఇవి యున్నచో ఈ పరిపూర్ణత్వము సుసాధ్యమగును. అభివ్యక్తమగును. ఏజాతి ప్రజలలోనైన ఒకసారి ఇట్టి మహాపురుషులు పుట్టినచో ఆజాతిలో అట్టిమహాపురుషులు ఎక్కువగా పుట్టుటకవకాశముండును. అట్టి మహానుభావుల యుపదేశమువల్ల ముందుకుసాగిపోవుజాతి అట్టివారి ఉపదేశభాగ్యమందనిజాతికంటె త్వరగా అభివృద్ధిచెందుటలో సందేహములేదు. మఱి అట్టి మహాత్ములు పుట్టనిజాతులలోకూడ వారు తప్పక ఉదయింతురు. ఉదయించి ఆప్రజలనుకూడ అభివృద్ధి పథములో నడపించుట నిక్కము.



# తర్కము - విశ్వాసము - ప్రేమ

(అట్లాంటిక్ సముద్రతీరమునకు స్వామిజీ ప్రచారముచేయుటకై పోవుటకు ముందు ఒకసంవత్సరము (1894) అంతయు హేల్‌కుటుంబముతో గడపెను. ఈ వ్యాసము జార్జి డబ్ల్యు. హేల్‌యొక్క చిరునామాకల ఉత్తరములు వ్రాయు కాగితములపైన వ్రాయబడియుండుటవల్ల స్వామిజీ అటనున్నకాలములోనే దీనిని వ్రాసియుండవచ్చునని యూహించవచ్చును. తర్కము, విశ్వాసము, ప్రేమ యను విషయములమీద స్వామిజీ పెన్సిల్‌తో కొంత ఉటంకింపుగా వ్రాసికొనినారు. అది అప్పుడు క్రొత్తవెల్గునకు వచ్చినది. దురదృష్టవశమున వ్రాసిన తేదీ సరిగా నిశ్చయించుటకు వీలులేకపోయినది.)

తర్కము :—దీనికి కొన్ని పరిమితు లున్నవి — దాని మూలము — దాని పతనావస్థ. దానిచుట్టు నున్న గోడలు — భౌతికవాదము. నాస్తికత్వము. కాని అంతటితో ఆగిపోరాదు. ఇంద్రియాతీతమైన ఒకానొక శక్తి ప్రతిక్షణము తనప్రభావమును మనపై బఱపుచున్నది — ఆకాశము, నక్షత్రములు మనమీాద పనిచేయుచున్నవి. మనకు కన్పించని పదార్థములుకూడ అట్లొన రించుచున్నవి. అందువల్ల మనము ఇంద్రియముల నతిక్రమించి పైన నేమున్నదో గ్రహింపవలెను—తర్క మొక్కటే అందుకు చాలదు — సాంతమైన తర్కము అనంతమైన పదార్థమును గ్రహింపనేరదు.

కేవలవిశ్వాసము :—పతనావస్థ - ద్వేషము, దురభిమానము - శాఖాభిమానము, సంకుచితత్వము అనంతపదార్థమును గ్రహింపనేరవు. ఒక్కొక్కప్పుడు ఈ సంకుచితత్వమువల్ల గాఢత్వము కల్గును. కాని వైశాల్యము వినష్టమగును — మఱి ద్వేషపూరితులలోను, దురభిమానులలోను గర్వాహంకారపూజ యెక్కువ. మఱియొక మార్గము లేదు —

వేఱొక మార్గము లేదా — ప్రేమ యున్నది. దాని కెప్పుడు పతనావస్థ లేదు — అది ప్రశాంతమైనది, మృదుత్వము చేకూర్చునది, విశాలతరమగుచుండునది. దాని వ్యాపనమునకు ఈ విశ్వము పట్టదు.

మనము ప్రేమ యన నేమియో నిర్వచింపలేము. దాని క్రమవికాసము, దాని వాతావరణము వర్ణించి కొంత దాని భోగట్టా సూచింపగలము.

దాని ప్రథమలక్షణము ఆకర్షణ — అన్నింటిని కలుపుట, కొన్నిపద్ధతులు, కొన్నిరూపములు వీనివంకకు ప్రేమ ప్రొఁగ్గుదల చూపుచో అది వినష్టప్రాయము. కొన్నిపద్ధతులు, కొన్నిరూపములు, కొన్నిసేవాస్వరూపములు వీనిద్వారా ఆరాధనము చేయుట నిజమైన ప్రేమ కాదు.

నిజమైన ప్రేమ యున్నచో పద్ధతు లంతర్ధానమగును. ప్రేమనుగుఱించి కొన్నివిషయములు వ్యక్తులు ఈ దిగువ సూచింపబడెను: మనుష్యభాష, మనుష్యరూపములు, ఈశ్వరుడు, తండ్రి, తల్లి, ప్రియుడు అను భావములు ప్రేమలోనివి. సొలోమాన్ యొక్క "సాంగ్ ఆఫ్ సాంగ్స్" ప్రేమబంధురము—ప్రేమలో, స్వతంత్రత, అస్వతంత్రత కలవు. ప్రేమ, పాతివ్రత్యము, అనసూయ, సీత— వట్టి కఠినమైన, శుష్కమైన ధర్మముగా ప్రేమింపరాదు. నిరంతరానందదాయకమైన ప్రేమ — సీత చేసిన ఆరాధన - ప్రేమోన్మత్తత ఈశ్వరోన్మాదము రాధ కథ - దురర్థము చేసికొనబడినది. నియమము లెక్కవైనకొలది—కామము ప్రేమను నాశన మొనరించును. స్వార్థము ప్రేమను ధ్వంసముచేయును. వ్యక్తిత్వము పోయి సాధారణీకృతి కలుగవలెను, విషయాశ్రయత్వముపోయి నిర్విషయము కావలెను — కేవలత్వము పొందవలెను. నమాజు చేయుచున్న మహమ్మదీయుడు—చిన్నపిల్ల—సానుభూతి—కబీరు— చేతులనుండి రక్తము స్రవించిన క్రైస్తవసన్న్యాసిని—మహమ్మదీయయోగి. ప్రత్యణువు శాంతిచెందినప్పుడు స్వస్థమగును.

ప్రతిమనుష్యుడు సుఖమును, స్థైర్యమును గోరును. చేయుచున్న ప్రయత్నము యోగ్యమైనదే కాని ఆ ప్రయత్నమునకై విషయ భూతములైనవి మాత్రము అసత్పదార్థములైనవి. కాని విషయోపసేవనమునందు క్షణికమైన సుఖము మాత్రము లభించుచున్నది.

జీవాత్మకు పొందదగిన పరమగతి నిరుపాధికమైన పరమాత్మ. అప్పుడు మాత్రమే జీవునికి పరిపూర్ణత, తృప్తి చేకూరును.

జీవాత్మ నిశ్చలస్థితిని, పరమశాంతిని, పరిపూర్ణత్వమును పొందుటకు పడు బాధయే ప్రేమ.



## ఆరు సంస్కృత సుభాషితములు

1. అజరామరవత్ప్రాజ్ఞః విద్యామర్థంచ చింతయేత్
   గృహీత ఇవ కేశేషు, మృత్యునాధర్మమాచరేత్.

విద్యాధనములను సంపాదించునపుడు తనకు జరామరణములు లేవనుకొని ఇహలోకమే శాశ్వతమని భావింపవలెను. ఈశ్వరారాధనము చేయునప్పుడు మృత్యువుచేత తలపట్టి ఈడ్వబడినట్లు భావింపవలెను.

2. ఏకయేవ సుహృద్ధర్మ నిధనేప్యనుయాతియః

ధర్మమొక్కటే నిజమైన స్నేహితుడు. మరణించినతర్వాత కూడ నదొక్కటే వెంటవచ్చును.

తక్కినవన్నియు మరణముతోసరి. —వివేకానంద

3. నిర్విశేషము, అచింత్యము, అనంతము, పరిశుద్ధము, పావనమునైన పరమాత్మా! నీకు నమస్కారము.

—స్వామి వివేకానంద

4. సమతా సర్వభూతేష్వే తన్ముక్తస్య లక్షణం
సర్వభూతములందు సమదృష్టి ముక్తుల లక్షణము.

—వివేకానంద

5. ఓ పరమాత్మా! నీవొక్కడవే ఈప్రపంచమందు
నిధానమవు.

—వివేకానంద

6. నీవే తల్లివి తండ్రివి.
నీవే ప్రభుడవు నీవే నాపతివి ప్రియుడవు.

—వివేకానంద

(అమెరికాలో స్వామి వ్రాసిన "న్యూ డిస్కవరీస్" (నూతనావిష్కారములు) అను గ్రంథములోనివి. ఈ యాఱును ఇంగ్లీషు అనువాదములతో ఆయన ఫోటోగ్రాపుల ఆటింటిమీద వ్రాయబడినవి).



# పరమాత్మ సందేశము

(ఈ క్రింది మూడు ప్రకరణములు వివేకానందస్వామి కాగితములలో దొరకినవి. ఆయన ఒక గ్రంథమును వ్రాయదలచుకొని, కొన్ని ఉటంకింపులు చేసికొనినారు).

1. బంధము, 2. ధర్మము, 3. పరమాత్మ, 4. ముక్తి.

## 1. బంధము

1. వాంఛ యనంతము. అదికొంతవఱకే తీరును. ప్రతి వానిలోను వాంఛ అనంతముగానుండును. దానిని తీర్చుకొనుశక్తి భిన్నభిన్నముగా నుండును. కొందఱు కొందఱికంటె లాభము పొందుచుందురు.

2. ఈ పరిమితియనునదే పెద్దబంధము. దీనిని త్రెంచుకొనుటకే మనము జీవితమంతయు పాటుపడుచున్నాము.

3. మనము సుఖమునే కోరుదుము. సుఖసాధనములనే కోరుదుము. దుఃఖమును, తత్సాధనమును కాదు.

4. మనము కోరు వస్తువులన్నియు మిశ్రితములుగా నుండును. సుఖదుఃఖములు రెండింటిని అవి సమ్మిశ్రితములుగా నిచ్చును.

5. మనము విషయములందు దుఃఖదోషానుదర్శనము చేయలేము. వానియందు సుఖమునే చూచి ఆకర్షితులమగుదుము. అందువల్ల సుఖముతోబాటు తెలియకుండ దుఃఖమునుగూడ పొందుచున్నాము.

6. ఒక్కొక్కప్పుడు మనము కేవలము సుఖమే కల్గునని దుఃఖము సంభవింపదని వ్యర్థాశలను పెంచుకొందుము.

7. మన ఆశలుకూడ నిరంతరము మాఱుచుండును. ఈ రోజున మెచ్చుకొనినదానినే రేపు పసహ్యించుకొందుము. నేడు సుఖకరమైనది రేపు దుఃఖకరము గావచ్చును. నేడు ప్రియమైనది రేపు ద్వేష్యము కావచ్చును.

8. ఉత్తరజన్మలో మనము దుఃఖస్పర్శ లేకుండ కేవల సుఖసాధనములనే సంపాదించగలమని వ్యర్థాశలు పెంచుకొందుము.

9. భవిష్యత్తనగా వర్తమానముయొక్క కొనసాగింపు. భవిష్యత్తను ప్రత్యేకపదార్థము లేదు.

10. విషయములందు సుఖము కోరువారు దానిని పొందుదురు. కాని దానితోబాటు దుఃఖమును వారనుభవించి తీరవలెను.

11. పర్యవసానమున వైషయికసుఖమంతయు దుఃఖమే. ఎందువల్లననగా మార్పు, మరణములు దానివలన దాపురించును.

12. విషయములన్నియు నశించును. విషయజాతమునకు మార్పు స్వభావము.

13. కోరిక పెరిగిన కొలది సుఖదుఃఖానుభవము పెరుగును.

14. శరీరనిర్మాణమునందలి సౌకుమార్యమును బట్టి సంస్కృతి యుండును. ఈ సౌకుమార్య మధికమైన కొలది సంస్కృతి యధికమగును. సుఖదుఃఖానుభవము పెరుగును.

15. శారీరకసుఖముకంటె మానసికసుఖ మెన్నో మడుగు లధికము. అట్లే శారీరక బాధలకంటె మానసిక బాధలు తీవ్రములైనవి.

16. భవిష్యత్తును గుఱించి మనము చేయు తలపోత పూర్వ విషయములను ప్రస్తుతకాలమునందు స్మరించుట. ఈ రెండును మనకు సుఖదుఃఖములను పెంచును.

17. సుఖసాధనములను అధికముగా కూడబెట్టుకొనువాడు వాని ననుభవింపజాలడు. అనుభవించుటకు వలసిన భావనాశక్తి

వానికుండదు. ఈ భావనాశక్తి కలవానికి ఆ వస్తువులు పోవు నేమో యను భయమో, లేక వానియందు దోషానుదర్శనమో యుండును.

18. మనము దుఃఖమును దూరీకరించుటకు ప్రయత్నించు చున్నాము. కొంతవఱకు కృతార్థులమగుచున్నాము. కాని ఈ ప్రయత్నమున మనకు క్రొత్తదుఃఖము సంక్రమించుచున్నది.

19. మనము ఒక్కొక్కప్పుడు కృతార్థత పొందుదుము. విజయధ్వజమును చేబూనుదుము. ఒక్కొక్కప్పుడు మన ప్రయత్నము నిష్ఫలమై పోవును. మనము సుఖముకొఱకై దేవులాడుదుము. మనవెంట దుఃఖము వచ్చును.

20. మేము చేయుచున్నామని మన మందుము. కాని మనము చేయుటలేదు. ఆ పని మనము చేయవలసివచ్చుచున్నది. మేము బ్రదుకుచున్నామని మన మందుము. కాని మనము ప్రతి క్షణము చావవలసివచ్చుచున్నది. మనము జనసమూహములో కలిసియున్నాము. వారితోబాటు కలిసిపోవలెనే గాని ఆగుటకు వీలులేదు. ఇది సంతోషింపదగునది కాదు. అట్లయైనచో ఒక గురివిందగింజంత సుఖమునకు కొండంత కష్టమును పడనేల? పైన ఆ చిన్నమెత్తు సుఖము వట్టి ఆశ మాత్రమే. చాలభాగము లభించునది కాదు.

21. మన నిరాశ యథార్థమైనది. మన ఆశయే రేఖా మాత్ర తృప్తి. చెఱుపులో మంచితనము నవలోకించుట.

## 2. ధర్మము

1. ధర్మము సంఘటనమునుండి వేఱుకాదు. నియమము వ్యక్తినుండి వేఱుకాదు.

2. ప్రతి సంఘటనమునందును నిమిడియున్న ఆచరణ పద్ధతియే ధర్మము.

3. ధర్మమును గుఱించి మనకున్న జ్ఞానము సంభవించు చున్న పరివర్తనములను బట్టి సంపాదితమైనది. ఈ మార్పుల నతిక్రమించి మనము ధర్మమును చూడలేము. సంఘటనముకంటె భిన్నముగా ధర్మమున్నదని ఊహించుట వట్టి మనఃప్రకల్పము. వట్టి పరిభాష. అంతకుమించి లేదు. ధర్మసూత్రము ప్రతి మార్పునం దనుస్యూతముగా నుండునట్టిది. ఆ ధర్మసూత్రము పట్టు సందర్భములయందుండు పద్ధతి. ఆ వస్తువును గుఱించిన మన జ్ఞానములో ఆ వస్తుగతమైన శక్తి ఒకభాగము. ఆ శక్తి మఱియొక దానిమీద ఏ పద్ధతిలో పనిచేయునో ఆ పద్ధతి ధర్మసూత్రము.

4. యథాస్థితికములగు వస్తువులయందుండు ధర్మము అవి ఒకదానిపై నొకటి ఎట్లు పనిచేయునో అన్నదానినిబట్టి యుండును. అంతే కాని ఎట్లు పనిచేయవలయునో అన్నదానినిబట్టి యుండదు. నిప్పు కాలకుండ, నీళ్లు తడిగా కాకుండ నున్నచో మెఱుగే కావచ్చును. కాని అవి అంతే. ఇది యథాస్థితి. ఇది ధర్మము. ఈ ధర్మముయొక్క సమీచీనతకు నిదర్శనము. కాలని నిప్పు, తడిలేని నీళ్లు—నిప్పు కాదు, నీరు కాదు.

5. ఆధ్యాత్మికసూత్రములు, నీతిసూత్రములు, సాంఘిక సూత్రములు, జాతీయసూత్రములు సాంఘిక, ఆధ్యాత్మిక విషయ ములందు ప్రయోగింపబడుచుండును. ఆయా క్రియాకలాపాను భూతులందు వ్యక్తమగుచుండును.

6. మన మీ ధర్మములచేత నిర్మితులమై మఱల వానినే చేయుదుము. అనగా మన నిర్మాణమం దీ ధర్మ మిమిడియున్నది. అందుచేత మనము వానిని ఆచరణకు తెచ్చుకొందుము. కొన్ని సందర్భములందు మనుష్యుడు తప్పకుండ అట్లే ప్రవర్తించునను విషయము సాధారణీకృతిపొందించి అదే సందర్భములందు మఱొక మనుష్యుడున్న నట్లే ప్రవర్తించునని చెప్పుట ధర్మ సూత్రము. అనగా నెచ్చటను భేదము పొందని అనగా 'తేడా'

రాని విశ్వజనీనమైన ప్రవర్తనము మనుష్యధర్మము. ఈ ధర్మము నే వ్యక్తియు తప్పించుకొనలేదు. ఐనను సర్వవ్యక్తులయొక్క ప్రవర్తనముమీద వేసిన అంచనానుపట్టి ఈ విశ్వజనీనధర్మముండును. సమస్తము లేక విశ్వజనీనము లేక అనంతము వ్యక్తిని తీర్చిదిద్దును. దీనికి వ్యక్తి కట్టుబడియున్నంతకాలము నా ధర్మ మమములో నున్నదని గ్రహింపనగును. ఈ అర్థములో ధర్మ మనగా విశ్వజనీనత యన్న మాట. విశ్వజనీనత వ్యక్తిమీద, వ్యక్తిమీద విశ్వజనీనత ఆధారపడియున్నవి. ఆద్యంతవంతములగు అంశములతో అనంతపదార్థము అనగా అసంఖ్యేయపదార్థము నూహించుట కష్టమే. అట్టి దీ విశ్వజనీనత. ఈ విశ్వజనీనధర్మము వినాశమొందునది కాదు. అనంతపదార్థమునందలి అంశము వినష్టమగుట అసంభవము. ఎందువల్లననగా, అనంతపదార్థమునకు మన మేదైన చేర్చుటగాని తీసివేయుటగాని లేదు. అందులో సర్వాంశములు నిత్యమైనవే.

7. మనుష్యశరీరము నిర్మించుటకు మూలభూతములైన పదార్థములను గుఱించిన సూత్రములు కన్గొనబడినవి. ఈ పదార్థము లనంతకాలమునందు వినష్టములు కాకుండ ఉండుట కూడ గమనింపబడినది. ఒకలక్షసంవత్సరములక్రిందట బ్రతికి యున్న మనుష్యశరీరనిర్మాణమునందు మూలభూతములైన పదార్థము లెందెందో ఇంకను నున్నవని నిరూపింపబడినది. అట్లే ఒకప్పుడు వ్యక్తమైన భావములు ఒరుల మనసులందు గలవు.

8. కాని శరీరమును అతిక్రమించి మానవునకు వేఱుస్థితి యున్నదా అనుదానిని కనిపెట్టుటలో కష్టమున్నది.

9. ఆధ్యాత్మికత, నీతిధర్మములు ప్రతిమనుష్యునకును పట్టవు. నీతిశాస్త్రములు, న్యాయశాస్త్రములు, జాతీయధర్మములు అనుసరించుటకంటె మీఱుట ఎక్కువగా గోచరించుచున్నది.

ఇవి నిజముగా ధర్మములే యైనచో వీనిని మీఱు టెట్లు సంభవించును?

10. ప్రకృతిధర్మములను ఏ మానవుడు వ్యతిరేకించలేడు. మఱి నీతిధర్మములను, జాతీయధర్మములను ప్రజలు మీఱుచున్నారని మనము గోలపెట్టుదుము.

11. ఒకజాతిలో అధికసంఖ్యాకుల ఇష్టమునుపట్టి రూపొందినవి జాతీయధర్మములు. ఈ పరిస్థితి యిట్లున్నచో బాగుండునని కొని మన మేర్పాటుచేసికొన్న ధర్మములు ఉన్న పరిస్థితినుండి ఏర్పాటుచేయబడినవి కావు.

12. 'ఒకరివస్తువులను మఱియొకరు కోరకూడదు' అనునది ఆదర్శప్రాయమైన ధర్మము కావచ్చును. కాని యథార్థముగా నున్న ధర్మము ఒకరివస్తువులను బహుమంది కోరుచుండుటయే.

13. అందుచేత ప్రకృతిధర్మము లన్నపుడు ఆ ధర్మ శబ్దమున కర్థము వేఱు. నీతి, సాంఘికధర్మము లన్నప్పుడు ఈ ధర్మ శబ్దమున కర్థము వేఱు.

14. ప్రపంచమునం దమలులోనున్న నీతిధర్మములను యథార్థపరిస్థితులతో పోల్చిచూచినప్పుడు మనకు రెండుధర్మములు ప్రముఖముగా కన్పించును.

1. వ్యక్తి సమూహమునుండి తాను వేఱని భావించుట. సర్వజనులకు ఎంతకష్టమైననుసరే తానుమాత్రము సుఖపడవలయును. ఇది స్వార్థపరత్వము.
2. స్వార్థరాహిత్యము తన్నుగూర్చి ఆలోచింపకుండుట, ఇతరులనుగూర్చియే ఆలోచించుట.

ఈ రెండును సుఖాన్వేషణములోనే బయలుదేరుచున్నవి. సుఖ మనగా స్వేంద్రియాధీనమై యుండుననియు, నితరులకు నష్టము ఘటిల్లజేయుటలో సుఖముండుననియు అనుకొనుటవల్ల ఘటిల్లినది. రెండవది ఇతరులకు మేలుచేయుటలో సుఖముండుననుట

వల్ల ఘటిల్లినది. అనగా పరసుఖసుఖిత్వము. ఈ పరసుఖసుఖిత్వము కలవారు మహాపురుషులు. ఈ పరదుఃఖసుఖులు, పరసుఖసుఖులు. ఈ యిద్దఱు లోకమం దుండనే యున్నారు. ఒకొక్కప్పుడు పరదుఃఖసుఖిత్వము, పరసుఖసుఖిత్వము ప్రక్క ప్రక్కనే కలిసి పనిచేయుచుండును. సాధారణముగా ప్రతిమనుష్యునిలోను ఈ రెండు గుణములు కొంచె మెక్కువ తక్కువగా కలిసియే యుండును. దొంగ దొంగతనము చేయునది కేవలము తన కొఱకా? బహుశః తాను ప్రేమించిన మఱొకరి కొఱకు కావచ్చు.

### 3. బ్రహ్మపదార్థము, కైవల్యము

1. ఓం తత్ సత్. సచ్చిదానందాత్మకము.

(అ) పరమార్థసత్త, యథార్థసత్త — పరమార్థసత్తాశ్రిత ములైనప్పుడే వ్యావహారికప్రపంచసత్త భాసించును. వ్యావహారికసత్త యథార్థముకాదు.

(ఇ) బ్రహ్మపదార్థము స్వయంప్రకాశకము. జ్ఞాతృస్వరూపము. అంతఃకరణసాక్షి. తక్కిన ప్రకాశకపదార్థములందున్న ప్రకాశము బ్రహ్మపదార్థమునుండి సంక్రాంతమైనది. అహంకారాదులందున్న జ్ఞాతృత్వముకూడ బ్రహ్మపదార్థము నుండి సంక్రాంతమైనది.

(ఉ) బ్రహ్మపదార్థము తృప్తిస్వరూపము. దానియందు కొఱతలేదు. దానియందు సర్వమున్నది. సర్వపదార్థములయొక్క సారభూతమైనది బ్రహ్మపదార్థము. అందుచే నది సచ్చిదానందస్వరూపము.

(ఋ) అది సజాతీయ, విజాతీయ భేదరహితము. నిర్గుణము. సుఖదుఃఖాది ద్వంద్వాతీతము. అజడము. అంతఃకరణముకంటె భిన్నము. అపరము. అనంతము. పరమాత్మస్వరూపము, విశ్వాత్మ.

(ఇ) నాయందు నీయందు సమస్తజగత్తునందున్న యథార్థ సత్త—అందుచేత తత్త్వమసి. అది నీవగుచున్నావు.

2. ఆ పరమాత్మ పదార్థమే విశ్వసృష్టిపాలన, లయకర్తృ స్వరూపముగా, ఉపాదానకారక కారణముగ, పరమేశ్వరుడుగ, ప్రాణస్వరూపుడుగ, ప్రేమస్వరూపుడుగ, సౌందర్యస్వరూపుడుగ మనస్సుచేత భావింపబడుచున్నది.

(అ) ఈపరమాత్మస్వరూపముయొక్క ఉత్తమాభివ్యక్తి ఈశ్వరుడు. సర్వశక్తి ఈశ్వరస్వరూపముగ వ్యక్తమగుచున్నది. పరమాత్మ అనంతప్రేమస్వరూపుడై అభివ్యక్తిచెందుచున్నది.,

(ఇ) ఈశ్వరునియందు పరమాత్మ అనంత సౌందర్యముగ ప్రకాశితమగుచున్నది. పరమాత్మవంకకే జీవాత్మ ఆకర్షింపబడుచున్నది.

## సత్యం - శివం - సుందరం

బ్రహ్మపదార్థము, సచ్చిదానందము, పరమాత్మ అనంతము.

బ్రహ్మాది స్థావరాంతమైన జగత్తంతయు ప్రాణప్రేమ సౌందర్యముల అభివ్యక్తియే.

ఈప్రాణప్రేమ సౌందర్యములు రూపుగొన్న వ్యక్తి ఈ విశ్వమునకంతకు జనకుడు. దేవాధిపతి. మహేశ్వరుడు. సర్వవ్యాపకుడు. దృశ్యజగత్తుకంటె వేత్తైనవాడు. జీవులకన్నింటి కాత్మభూతుడు. జీవభిన్నుడు. విశ్వము సృష్టించినాడు. కాబట్టి విశ్వమునకు జనకుడు. ప్రేమతో ఈవిశ్వమును నడపుచు కొనకు తనలోనికే ఉపసంహరించుకొనుచున్నాడు. కావున విశ్వపాలకుడు. ఆమహాశక్తియొక్క ఆజ్ఞవల్లనే సూర్యచంద్రులు ప్రకాశించుచున్నారు. వర్షములు కురియుచున్నవి. మృత్యువుకూడ ఆయన

ఆజ్ఞకు లోబడివర్తించుచున్నది. సర్వకారణములందున్న శక్తి ఆపరమాత్మస్వరూపము. పరమాత్మయే కారణమును కార్యోత్పాదన సమర్థమగునట్లు చేయుచున్నది. అతని ఇచ్ఛయే అచ్ఛమైనధర్మము. ఆయన ప్రమాదపడుట కవకాశములేదు. ప్రకృతిధర్మములు పరమేశ్వరేచ్ఛాస్వరూపములు. వానికి మార్పులేదు. కర్మసిద్ధాంతమునకు పరమాత్మ ప్రాణము. పరమాత్మయే సర్వకర్మలకు ననుసంధాత. పరమాత్మ ప్రేరేపణమువల్లనే మన కర్మలనుబట్టి మనము మనజన్మలను పొందుచున్నాము.

ముక్తి జగదుద్దేశము. ముక్తియే జగత్తునకు లక్ష్యము. పరమాత్మయొక్క ప్రేరణముతో ప్రకృతిధర్మముల ననుసరించి మనము ముక్తిపొందుటకు ప్రయత్నించుచున్నాము. ముక్తిపొందుటకై జగత్తుచేయు ప్రయత్నము తీవ్రముముముక్షుకలిగిన మానవునియందు పరమోత్తమముగా నభివ్యక్తమగుచున్నది. ముక్తి కర్మ, భక్తి, జ్ఞానయోగములద్వారా పొందదగినది. కర్మయోగము పరోపకారములకై అవిరతముగా పాటుపడుట. భక్తియోగము, ఈశ్వరారాధన, సంకీర్తనము, ధ్యానము. జ్ఞానయోగము ధ్యానమువల్లకల్గునది.

## బేలూరు మఠము - ఒక విన్నపము

శ్రీరామకృష్ణపరమహంసశిష్యులు హిందూమత సిద్ధాంతములను వ్యాపింటజేయుటకై పూర్వము పాశ్చాత్యదేశములలో నిందాపాత్రమగుచున్న హిందూమతమునకు కొంత గౌరవము సంపాదించుటకు చేసినకృషి ఫలించినది. అందువల్ల హిందూదేశమందును, ఇతరదేశములందును మన మతమునుగూర్చి ప్రచారముచేయుటకు వలసినంతమంది యువసన్న్యాసులను మనము తయారుచేయగలమను ఆశ యుదయించుచున్నది. విద్యార్థులు గురుకులవాసము చేయవలెనన్న వైదికసిద్ధాంతము ననుసరించి

కొంతమంది యువకులను విద్యావంతులను చేయుటకుగూడ ప్రయత్నములు సాగుచున్నవి.

కొందఱు ఐరోపీయస్నేహితుల, కొందఱు అమెరికా స్నేహితుల చలువవల్ల కలకత్తా సమీపమున గంగయొడ్డున ఒక మఠముకూడ నెలకొల్పబడినది. మఱికొలది కాలములో సత్ఫలితములుకలుగునట్లు పనిచేయవలయుననిన కొంతధనము కావలసియున్నది. అందువల్ల మాప్రయత్నముపై సానుభూతికలవారి కీ విజ్ఞాపనము చేయుచున్నాము.

మాకుగల స్తోమతునుబట్టి వీలైనంతమంది యువకులను విద్యావంతులను చేయవలెనని మే మభిలషించుచున్నాము. పాశ్చాత్య భౌతికశాస్త్రము హిందూతత్త్వశాస్త్రము ఈ రెంటియందును వారికిగల విశ్వవిద్యాలయవిద్యకు తోడు, వారిని విద్యావంతులను చేయవలెనని మా యభిలాష.

గురూపసదనమునందు నివసించుటవల్ల వారికి మంచి శిక్షణ యలవడునని మా తాత్పర్యము. కలకత్తాయందున్న కేంద్రమఠమునకు క్రమముగా దేశమంతటను, వలసినంతమంది మనుష్యులు తక్కిన ధనాధిసాధనములు లభించినతర్వాత, శాఖలు నెల కొల్పబడును.

శాశ్వతమైన సత్ఫలితము సాధించుటకు కొంతకాలము పట్టును. దానికి యువకులత్యాగనిరతి - ధనికులత్యాగనిరతి చాల యవసరము.

వలసినంతమంది మనుష్యులు దొరకుదురనియే మా యభిప్రాయము. అందువల్ల ధనసహాయము చేయవలసినదని మతాభిమానులకు, దేశాభిమానులకు, ధనికులకు విన్నపముచేయుచున్నాము.

—వివేకానంద.

## అద్వైతాశ్రమము - హిమాలయము

(మార్చి 1899 లో మాయావతి, ఆల్మోరా, హిమాలయమందలి అద్వైతాశ్రమముయొక్క సమాచారగ్రంథములో చేర్చుటకు స్వామిజీ ఈ ఉత్తరమును వ్రాసెను.)

ఎవ్వనియందీ విశ్వమున్నదో, ఎవడీ విశ్వమందున్నాడో, ఈ విశ్వమే తానై ఎవ్వడున్నాడో, ఎవ డాత్మయందున్నాడో ఎవనియం దాత్మయున్నదో, ఎవడు జీవున కాత్మభూతుడో, అట్టి పరమాత్మ జ్ఞానమువల్ల, అనగా విశ్వాత్మత్వము సాధించుటవల్ల భయము సర్వము తొలగిపోవును. దుఃఖమంతర్ధానమగును. శాశ్వత ముక్తి లభించును. సర్వభూతములయొక్క ఏకత్వమన్న పరమ సత్యమును గ్రహించి అనుభవములోనికి తెచ్చుకొని ఆచరణలో పెట్టుటవల్లనే వ్యక్తిగతముగాగాని సాంఘికముగాగాని క్షేమాభివృద్ధి ప్రేమవైశాల్యము సాధింపబడును. "పారతంత్ర్యము దుఃఖము; స్వాతంత్ర్యము సుఖము" అద్వైతమువల్లనే మనుష్యుడు నిగ్రహవంతుడై, పారతంత్ర్యము దానితోడి గుణములగు అంధ విశ్వాసములను పాఱద్రోలగలుగుచున్నాడు. అందువల్ల బాధపడుటకు, ఒకపనిని సాధించుటకు ఆత్యంతికమైన మోక్షము పొందుటకు మనుష్యులు సిద్ధము కాగలుగుచున్నారు.

ఇంతవఱకు ద్వైతభావాపన్న దౌర్బల్య పరిస్థితులనుండి విడివడి ఈ సముదారసత్యమును సర్వమానవుల కుపదేశించుటకు వీలుకలుగ లేదు.

ఈ మానవజాతికంతకు ఈ సిద్ధాంతమంతయు నుపయోగపడ లేక పోవుటకు కారణ మిదియేయని మన నిశ్చయము.

ఈ సిద్ధాంతము వ్యక్తులయొక్క, లేక జనసమూహము యొక్క జీవితముల నున్నతస్థాయికి గొంపోవుటకు తగిన ధారాళమైన, పరిపూర్ణమైన అవకాశమును కల్పించుట కీ హిమాలయ

పర్వతప్రదేశములందు, ఈ సిద్ధాంతమునకు తొలి జన్మభూమి యందు మన మీ మఠమును ప్రారంభించుచున్నాము.

ఇచ్చట అద్వైతసిద్ధాంతము మూఢవిశ్వాసముల నుండి దౌర్బల్యహేతువులగు సాంకర్యములనుండి కాపాడ గల్గునని మన మాశించుచున్నాము. ఇచ్చట పరిశుద్ధమైన, సూటియైన అద్వైత సిద్ధాంతము మాత్రమే ఉపదేశింపబడును. సాధన చేయబడును. తక్కిన సిద్ధాంతములన్న మనకు పరిపూర్ణమైన సానుభూతికలదు. ఈ ఆశ్రమము అద్వైతమునకే, ఒక్కఅద్వైతమునకే అంకితము గావింపబడినది.

## రామకృష్ణసేవాసదనము - వారణాసి - ఒక విన్నపము

ప్రియమైన——

రామకృష్ణసేవాసదనము - వారణాసిని గుఱించి మేము పంపిన గతసంవత్సరనివేదికను స్వీకరించవలసినదని కోరు చున్నాను. ఈ వారణాసిపట్టణమందు కష్టములపాలగుచున్న మన సోదరప్రజలకు (సాధారణముగా వృద్ధస్త్రీపురుషులకు) మేము చేసిన సేవనుగుఱించి ఆనివేదికలో నివేదించితిమి.

ఈ దినములలో సామాన్యప్రజానీకము ప్రబోధమొందు చున్నది. ప్రజాభిప్రాయమునకు విలువయొనగూడుచున్నది. అందువల్ల హిందువులక్షేత్రములు, వానిస్థితిగతులు, అచ్చట జరుగుచున్న పని విమర్శనుండి తప్పించుకొనలేవు. ఈ పట్టణము హిందువులకు పరమపవిత్రక్షేత్రము. ఈ పట్టణమునుగుఱించి మిగుల తీవ్రములైన విమర్శలే వచ్చినవి.

తక్కిన పుణ్యక్షేత్రములకు తమ పాపములు ప్రక్షాళించు కొనుటకై ప్రజలు పోవుదురు. ప్రజ లా క్షేత్రములందు కొలది దినములు మాత్రమేయుందురు. మఱి పురాతనక్షేత్రమగు ఈ వారణాసియందు స్త్రీ పురుషులు, మఱియు వృద్ధులైనవారు ఈ

విశ్వనాథస్వామి దేవాలయ గోపురచ్ఛాయలందు మరణించినచో ముక్తికలుగునని ఆమరణము నివసించుటకు వత్తురు.

మఱి లోకోపకారార్థము సన్న్యసించిన మహాత్ములు దారాపుత్రాదులను విడిచి ఏకాకులై ఇచట నివసించుటకు వత్తురు.

వారును సామాన్య ప్రజానీకమువలెనే రోగగ్రస్తులగుచుందురు. ఈ పట్టణమును నిర్వహించువారికి ఈ నిందలో చాల భాగము చెందునన్నమాట యథార్థము కావచ్చును. ఇచ్చటి పురోహితులకు ఈనిందలో చాలభాగము చెందునన్నమాట సత్యము కావచ్చును. ఐనను మనము వారివలె మనకండ్లయెదుట జరుగుచున్న సత్యమును విస్మరింపరాదు. ప్రజలు తమముందు తమ ద్వారబంధముల కానుకొని నిలిచి స్త్రీపురుషులను, సన్న్యాసులను, గృహస్థులను బాధావర్తములందు ముంచుకొనుచు ప్రవహించు దుఃఖప్రవాహమును చేతులుకట్టుకొని చూచుచున్నారు. ఏఒక్కడు కూడ ఆప్రవాహమునుండి ఆయభాగ్యులను ఉద్ధరింపజాలకపోవుచుండెను. పురోహితులపైన పుణ్యక్షేత్రములపైన విమర్శావర్షము కురిపించినంతమాత్రమున ఈ బాధాప్రపంచమునం దణుమాత్రమైన యాతనయు తగ్గదు. ఏ ఒక్కడును రక్షితుడుకాడు.

పరమశివునకు శాశ్వతనివాసమైన ఈ పట్టణము ముక్తిదాయకమన్న మన పితృపితామహుల విశ్వాసమును నిలబెట్టుటకు మనము నిజముగా ప్రయత్నించుచున్నామా ?

మనకట్టి కోరికయున్నచో ఇక్కడ చనిపోవుటకు ప్రతిసంవత్సరము అరుదెంచుచున్న అసంఖ్యాకప్రజలను చూచి మనము సంతోషింపవలెను.

పరమేశ్వరానుగ్రహమువల్ల ఎప్పటికిని ప్రజలందఱకు ఇచ్చట చనిపోయి ముక్తిపొందవలెనన్న కాంక్ష స్థిరముగా నుండు గాక!

ప్రజలు ఇచ్చట మరణించునుద్దేశముతో వచ్చుచున్నారు. వారిజన్మభూములందే వారున్నచో వారికి లభింపగల సహాయసంప

దలను వారు త్యాగముచేసి వచ్చుచున్నారు. అట్టి సందర్భము లందు వారికి రోగములు సంభవించినచో వారిస్థితి ఎట్లుండునో హిందువులైన మీరే యూహించి వారికి తగిన సాహాయ్యము చేయుటకు పూనుకొందురుగాక!

సోదరా! తుది విశ్రాంతికై సిద్ధముచేయబడిన ఈ విచిత్ర పుణ్యక్షేత్రము ప్రజల నెంతగా నాకర్షించునో ఒక్క క్షణ మాగి విచారించిచూడుము. ఇచ్చట మరణించి ముక్తిపొందవలెనని వచ్చుచున్న వృద్ధ ప్రజాప్రవాహము నీయందొక దివ్యమైన భయ భక్త్యావేశమును కల్పించుట లేదా?

కల్పించినచో రమ్ము, రమ్ము. కొంచెము చేయూతనిమ్ము. నీ వోపినంత సాహాయ్యము ఉడుతభక్తిగా చేయుము. గడ్డిపరకలు పెంటిగా నేర్పడి మదపుటేనుగును బంధించునను సామెత కలదు కదా!

ప్రపంచాధినాథుడైన పరమేశ్వరునియం దనుభూతుడైన భవదీయ

—వివేకానంద.

(ఈ ఉత్తరము వారణాసిలోని రామకృష్ణసేవాసదనమువారు 1902 ఫిబ్రవరినెలలో ప్రకటించిన ప్రథమనివేదికతో జతచేసి పంపబడినది.)



ప్రకృతిసిద్ధదశలలో నొకటిగా తోపజేయుచు, ఎల్లెడలను కాని పించు ఆకటిచిచ్చు, వికటతాండవకేళిసల్పు మృత్యువుల్యా మగు కాటకము, రోగపరితాపములకు కురుక్షేత్రము (యుద్ధభూమి), దేశపు ఆశను, కార్యతత్పరతను, ఆనందమును, ధైర్యమును కోల్పోయినవారి శల్యములతో నిండిన విశాలశ్మశానము, తన్మధ్యమున మోక్షైకగమ్యముగలిగి, ఆత్మాన్వేషణతత్పరత్వమున గాఢధ్యాననిమగ్నుడై, గంభీరమౌనముద్రదాల్చి యుపవిష్టుడైన యోగి;—భారతదేశ దర్శనార్థియై వచ్చు యూరపుఖండపు బాటసారికి కానిపించు దృశ్యములివియే!

ఆకారమునమాత్రము మానవులుగాతోచు ముప్పది కోట్ల జనసమూహము; స్వదేశీయులచేతను, విదేశీయులచేతను, స్వమతావలంబులచేతను, పరమతావలంబులచేతను, త్రొక్కియుంపబడి ప్రాణములనే చాలవఱకు కోలుపోయిన ప్రజలు; పరిశ్రమమునందును, కష్టానుభూతియందును ఓరిమిగలిగియు ప్రారంభశక్తిరహితులైయుంటచే బానిసేంద్రను పోలినవారు; పూర్వాపరశూన్యులగు నిరాశాశీలురు; ఈ జీవితమును — అది యెంత అనిశ్చయరూపమైనదిగానున్నను—ఎట్లేని కాపాడుకొన జూచువారు; బానిసేంద్రకు స్వభావసిద్ధమగు ద్వేషబుద్ధి గలిగి, తోడిప్రజల యభ్యుదయమును సైపనేరనివారు; ఆస లన్నియు అడుగంటి, శ్రద్ధావిహీనులై, ద్రోహబుద్ధిగలిగియుండువారు; ఆత్మసంరక్షణార్థము నక్కలవలె తుచ్ఛములగు జిత్తులకు, ద్రోహమునకు, కుయుక్తులకు పాల్పడువారు; స్వార్థపరత్వ స్వరూపములు; బలవంతుల పాదధూళి నాకుచుండియే తమకంటె కొంచెము బలహీనులైనవారిని చావమోదువారు; దుర్బలులై, భవిష్యదభ్యుదయవిషయమున నిరాశాగ్రస్తు లగువారికి నైసర్గికముగా సంక్రమించు అసహ్యములును, పైశాచికములును అగు వెఱ్ఱినమ్మకపు పుట్ట లగువారు; వెన్నముకవలె ఆధారభూతమైయుండు నీతిప్రమాణ మేదియు ఎఱుగనివారు: ఇట్టి ముప్పదికోట్లప్రజలు భారతదేశశరీరముపై

నిండి — కుళ్ళి కంపుకొట్టుపీనుగుపై క్రిములు నిండియున్నట్లు — నివసించు చున్నారు. ఇదియే మనలనుగూర్చి ఆంగ్లేయోన్యోగి బుద్ధియందు సహజముగా ఏర్పడు భావచిత్రము!

నూతనార్జితఅధికారమద్యముచే ఉన్మాదమునొందియుండు వారు; సవ్యాపసవ్యమార్గవివేచనాశక్తిరహితులు; భార్యాదాసులు, కామాతురులు, ఆటవికమృగములవలె క్రూరబుద్ధిగలవారు; మద్యములో మునిగి, సౌశీల్యపారిశుద్ధ్యము లన్నను, నిర్మలమార్గములు, నిర్మలాభ్యాసములు అన్నను, ఇట్టివి అనికూడ ఎఱుగనివారు; భౌతికపదార్థముతప్ప వేఱేదియు లోకమున లేదను భావముకలిగి, తమనాగరికతను, దాని వివిధప్రయోగములను మాత్రమే ఆధార భూతములుగా జేసికొన్నవారు ; బలాత్కరించియు, వంచించియు, ద్రోహమొనర్చియు ఇతరుల దేశములను, ఇతరుల సంపదను, ఉపయోగపఱచుకొని స్వీయోన్నత్యమును సాధించుకొనుటకు అలవడిన కుత్సితులు; పారలౌకికజీవిత మొకటి కల దని విశ్వసింపక, దేహమునే ఆత్మగా భావించి, ఇంద్రియములందును, ఇంద్రియసుఖములందునే జీవించువారు :— ఇట్లు పాశ్చాత్యులు ప్రత్యక్షరాక్షసులుగా భారతీయునకు తోచుదురు.

ఇరుపక్షములవారికి పరస్పరముకలుగు ఈ భావములకు వివేచనాహీనత్వము, అసంపూర్ణపరిచయము, లేక పరిచయ రాహిత్యము, మూలములు. విదేశీయులు — యూరపుఖండపు వారు—భారతదేశమునకు వచ్చి, మన పట్టణములలో పరిపూర్ణ నైర్మల్యారోగ్యములకు ఆటపట్టులగు ప్రాంతములందు రాజప్రాసాదములనుబోలు విశాలభవనములలో నివసించుచు, మన''నేటివ్'' (మనలను వారు ''నేటివ్''లు—అనగా ఇచటనే పుట్టినవారు— అందురు) ప్రాంతములను తమదేశములో తాము నిర్మలముగా, మనోజ్ఞముగా, నిర్మించుకొనిన పట్టణములతో పోల్చిచూతురు ; వారియొద్దకు పోవుచు, వారికి చక్కగా పరిచితు లగు భారతీయు

లందఱును ఒకే తరగతివారు—అందఱును వారిక్రింద ఏదో యొక కొలువుచేయువారే. నిజమునకు దౌర్భాగ్యము, దారిద్ర్యము, భారతదేశమునందువలె మఱెచ్చటను కానిపింపవు; ఇదిగాక అపరిశుభ్రత, మాలిన్యము, ఎల్లెడలను ఉండుట నెవ్వరు కాదనగలరు? ఇట్టి పంకిలము, ఇట్టి దాస్యము, ఇట్టి పతనము, ఇట్టి జుగుప్స మున్నగువానితో నిండియుండు తావునుండి యోగ్యమైన దేదైన వెలువడగలదనుట యూరపు దేశీయులకు అసంభవముగా తోచును.

ఇక మనబుద్ధికి తట్టు ఊహాలివి : యూరపుదేశీయులు దొరకినదెల్ల — వివేచన మేమియు లేక — భుజింతురు ; మనకు ఉన్నట్లు పారిశుద్ధ్యభావమునే ఎఱుగరు ; కులభేదములనే పాటింపరు ; స్త్రీలతో ధారాళముగా కలసిమెలసి మెలగుదురు ; మద్యపానము చేయుదురు ; స్త్రీపురుషు లొండొరులను కౌగిలించుకొని లజ్జావిహీనులై నాట్యవేళలందు నృత్యము చేయుదురు ;— ఇదంతయు చూచి ఇట్టి జాతియందు ఎట్టి గుణమేని కలిగియుండగలదా యని మనము అబ్బురపాటుతో ప్రశ్నించుకొందుము.

ఈ యభిప్రాయములు రెండును బాహ్యైకదృష్టి సంజనితములు—ఆంతరపరిశీలనలోపముచే, పైపైనిమాత్రమే దృష్టి పఱపుటచే, కలిగినవి. విదేశీయులను మనము మన సంఘముతో కలసిమెలసి మెలగనీయము ; వారిని "మ్లేచ్ఛులు" అందుము. వారు మనలను జానిసలుగా చూచుచు ద్వేషింతురు ; మనలను "నిగ్గర్లు" (నీగ్రోజాతివారు అందురు.)

ఈ భావములు రెంటియందును కొంత నిజము కలదనుట నిస్సంశయము. కాని ఇరుపక్షములలో నొకరును మూలమున నుండు సత్యవిషయమును కాంచలేదు.

ప్రతిమానవునిలోపల నొక భావము కలదు. వెలుపలకు కానిపించు మానవుడు ఆ భావముయొక్క బాహ్యగోచరరూప

మాత్రుడు, ఆ ఆంతరభావమునకు ఉచ్చారణోపకరణమువంటివాడు. అట్లే ప్రతిదేశజాతికిని ఒక్కొక్క జాతీయభావము ఉండును. ఆ భావము లోకసమష్టికొఱకై పాటుపడుచుండును, లోకసంగ్రహణమునకు అది ఆవశ్యకము. లోకసంగ్రహణకార్యమునకు ఆ భావము ఏనాడు అనావశ్యకముగా ఏర్పడునో, ఆనాడే ఆ భావమునకు ఉనికిపట్టగు మానవుడో, జాతియో, అంతరించును. అపారమగు దౌర్భాగ్యము, క్లేశము, దారిద్ర్యము, హింస మనకు — వెలుపలినుండియు, లోపలినుండియు — కలుగుచుండినను, భారతీయులమగు మనము ఇంకను సజీవులమై యుండుటకు కారణము మన కొక జాతీయభావము కలిగియుండుటయును, అది లోకసంగ్రహణసాధనార్థము ఇంకను కావలసియుండుటయును. యూరపుదేశీయులకును ఒక స్వకీయమగు జాతీయభావము కలదు; అది లేనిది లోకము నడువనేరదు; కావుననే వారంత బలిష్ఠులై యున్నారు. తన శక్తి నంతయు కోలుపోయిన మానవుడు ఒక క్షణకాల మేనియు జీవించునా? జాతి యనగా మానవకోట్ల సమష్టియేగదా. తన శక్తిని, కార్యతత్పరతను, పూర్తిగా కోలుపోయిన జాతి జీవించునా? వేయేండ్లుగా ఇన్ని బాధలు, ఇన్ని అల్లకల్లోలములు, తన్ను ఎదుర్కొన్నను, ఈ హిందూజాతి ఏల అంతరింపలేదు? మన ఆచారమర్యాదలు అంత హేయములుగా నున్నచో, ఇప్పటికే మనము ఈ భూలోకమునుండి ఏల నిర్మూలింపబడలేదు? మన దేశమును జయించినవారు ఒక్కరైనను మనలను రూపుమాపు యత్నములలో ఏమైనను లోప మొనర్చిరా? ఐనను ఇతర అనాగరిక దేశములలోని ప్రజలవలె మన హిందువులు నిర్మూలింపబడకుండుట ఎట్లు? భారతదేశము నిర్మానుష్య మొనర్పబడి, అరణ్యప్రాయముగా ఏల చేయబడలేదు? అట్లు జరిగియుండెనేని, విదేశీయులు ప్రతిముహూర్తమందు హిందూదేశమునకు వచ్చి, అచట శాశ్వతనివాసము లేర్పఱచుకొని సారవంతములగు ఆ దేశభూములందు — అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికా దేశము

లలో వారిప్పటికిని చేయుచున్నట్లు — వ్యవసాయము చేసికొను చుండియుందురు. నా విదేశీయమిత్రుడా, నీ వనుకొనునంత బలము నీకు లేదని, అది వెఱ్ఱియూహ యని, దీనినిబట్టి తెలియుచున్నది గదా! హిందూదేశమునకుకూడ బలము కలదనియు, బలిష్ఠమగు స్వకీయవాస్తవికత దానికి ఇంకను ఉన్నదనియు, ప్రథమమున గ్రహింపుము. మఱియు హిందూదేశము ఇంకను జీవించియే ఉన్నదనియు, ప్రపంచనాగరికతాసమష్టికి తాను సమర్పించుకొన వలసియున్న భాగమును అది యింకను సమర్పించుకొనవలసి యుండుటే అది జీవించియుండుటకు కారణమనియు, గ్రహింపుము. ఈ విషయమును మీరు కూడ — బాహ్యావేషమునందును, చింతనామార్గములందును, భావసరణియందును, పూర్ణముగా యూరపుదేశీయుల ననుకరించి, కన్నులు వాచిపోవునట్లు నిరంతర ధారగా విలపించుచు, "మమ్ము రక్షింపుడు" అనియు, "మేము అధోగతి నందితిమి, పశుదశకు కూలితిమి; యూరపుదేశీయులారా, మీరే మా రక్షకులు, మాయెడ జాలిపూని, ఈ పతనదశనుండి మమ్ము ఉద్ధరింపుడు" అనియు యూరపుదేశస్థులను సర్వదా ప్రార్థించుచుండు మీరుకూడ — గ్రహింపుడు. మీరును — హిందూదేశమునకు ఏసుక్రీస్తు వచ్చినాడనియు, కాలము పరిపక్వ మగుటచే దేవునివిధి ఈ రీతిని నెఱవేఱినదనియు వందనసమర్పణ గీతికలు ఆలపించుచుండు మీరును — దీనిని గ్రహింపుడు. అయ్యో, ఏమివెఱ్ఱి! అట్టి దేమియు జరుగలేదు! ఏసుక్రీస్తు ఇచటికి రాలేదు; ఎహోవాకూడ రాలేదు; ఇకపిమ్మటకూడ వారు రాబోరు; స్వవిషయములను, స్వగృహస్థితిగతులను, చక్కబెట్టు కొను కార్యమున వారు నిమగ్నులై, తీఱికలేకయున్నారు. ఇచట పురాణపురుషుడగు శివుడే ఇప్పటికిని యథాప్రకారము ఆసీనుడై యున్నాడు; రక్తబలులుగొను కాళికామాతయు పూర్వపు సామగ్రితోనే, తొల్లిటివలెనే, అర్చింపబడుచున్నది; ప్రేమమూర్తి యగు బృందావనగోపబాలుడును—శ్రీకృష్ణుడు—యథాపూర్వ

ముగా వేణుగానము చేయుచున్నాడు. పూర్వకాలమున ఈ వృద్ధశివుడు తన వృషభమునెక్కి, డమరుకము వాయించుచు, హిందూదేశమునుండి బయలువెడలి ఒకవైపు సుమత్రా, బొర్నియో, సెలబీసు, ఆస్ట్రేలియాలు చూచుకొనుచు అమెరికా సముద్రతీరములవఱకును, మరల మఱొకవైపున బయలువెడలి ఎద్దును బాగుగా తోలి థిబెట్, చీనా, జపానులమీదుగా సైబీరియా వఱకును, పయనించెను. ఇప్పటికిని ఆయన ఈ ప్రయాణములు మానక చేయుచునేయున్నాడు. కాళీమాతయు నేడుకూడ చీనా జపానుదేశములందుసైతము పూజలు కైకొనుచునే యున్నది; మేరీకన్యకగా మార్చి ఏసుక్రీస్తుతల్లియని క్రైస్తవులు ఆరాధించునది ఆమెనే! హిమాలయములవంక చూడుడు. వాని ఉత్తరమున కైలాసగిరి — వృద్ధశివుని ప్రధాననివాసస్థానము — కలదు; పదితలలు, ఇరువదిచేతులు గల మహాబలశాలియైన రావణుడే ఆ సింహాసనమును కదల్పజాలకపోయెను; — ఇప్పుడు క్రైస్తవమతప్రచారకులా ఆ కార్యమును పూనుకొనుట!! ఎంత సాహసము, ఎంత ఎట్టి!! ఇచ్చట భారతదేశమున డమరువు వాయించుచు ఆ వృద్ధశివుడే శాశ్వతముగా నుండును, పశుబలులు గొనుచు కాళీమాతయు ఉండును, పిల్లనగ్రోవిని ఊదుచు మనోహరుడగు శ్రీకృష్ణుడును ఉండును. వారు హిమాలయములవలె సుస్థిరముగా నెలకొని యున్నారు. ఎవ రెన్ని ప్రయత్నములు చేసినను — క్రైస్తవప్రచారకులుగాని, ఇతరమతప్రచారకులుగాని — వారిని తొలగింపజాలరు. వారియునికి మీకు సైపరాకున్నచో, బుద్ధిగలిగి ఇచటినుండి వెళ్లిపొండు! మీ నలుగురైదుగురివలన ఒక దేశప్రజ లందఱును — శాంతిని కోల్పోవువఱకును — విసుగునొందుచుండవలెనా? దుర్భరపీడనము నొందుచుండవలెనా? మీరు మఱొకచోటికి ఏల పోరాదు మీ యిచ్చ వచ్చినట్లు ధారాళముగా మేతమేయ ననువగు మైదానములు గల చోటికి ఏల చనరాదు? ప్రపంచ మంతయు మీకు కలదు గదా!

కాదు, అది జరుగనిపని! అట్లొనర్చుటకు వలయు శక్తి వారికి లేదు. వృద్ధశివునియొక్క కూటినే కుడిచి, ఆయన యింటి వాసములనే లెక్కించుచు, ఆయననుగూర్చి నిరపనిందలాడుచు, విదేశీయరక్షకు డగు నొకని మహనీయతను కీర్తించుచుండవలెను! ఎంత దుర్మార్గము! విదేశీయులకడకు ఏడుపు మొగములతో పోయి "మేము మిక్కిలి అధములము, మేము నీచులము, మేము పతితులము, మాకు కలదంతయు పైశాచికమైనదే" అని మొఱపెట్టు కొనువారికి మేము చెప్పునది ఇది: "సరే, మీరు సత్యవ్రతుల మందురు. మీ మాటలు నమ్మకుండుటకు తగు కారణము మా కేమియు లేదు. కావున మీరు చెప్పునదంతయు నిజమే కావచ్చును. కాని, ఆ 'మేము'లో సమస్తజాతిని ఏల చేర్తురు? అట్లు చేయుట ఎట్టినీతియో, ఎట్టిమర్యాదయో, కొంచెము చెప్పుడు".

మనము గ్రహింపవలసిన ప్రథమవిషయము: ఏదో ఒక జాతికిమాత్రము ఆధికారికముగా సంక్రమించిన సద్గుణము లేవియు లేవు. కాకున్న, వ్యక్తులందువలె, కొన్నిజాతులందు — తక్కిన జాతులందుకన్న — కొన్ని సద్గుణములు, రమారమిని చూచి నచో, కొంచెము అధికముగా నుండవచ్చును.

మనకు ముఖ్యవిషయము 'ముక్తి'; పాశ్చాత్యులకు ముఖ్య విషయము 'ధర్మము'. మనకు కావలసినది ముక్తి; వారికి కావలసినది ధర్మము. ధర్మశబ్ద మిచట మీమాంసకులు వాడెడు అర్థమున ఉపయోగింపబడినది. ధర్మ మనగా ఏమి? ఈ లోకమునందో, పరలోకమునందో, సుఖానుభూతిని కాంక్షింపజేయునదే ధర్మము. ధర్మమునకు కర్మమే మూలము. అది మానవుని, సుఖమువెంట పర్విడుచు చేయుంబవల్లు దానికై పరిశ్రమింప, జేయును.

ముక్తి యనగా ఏమి? ఇహలోకముగాని పరలోకముగాని ప్రకృతినియమములకు అతీతముకాదు గనుక ఇహలోకములోని సుఖము సైతము దాస్య మనియు, పరలోకములోని సుఖముకూడ అట్టిదే యనియు బోధించునదే ముక్తి; కాని ఆ సుఖముల కొంక భేదము కలదు — ఇచటిది ఇనుపసంకెల. అచటిది బంగారు సంకెల. మఱియు సుఖము అనునదంతయు — ఎచటిసుఖమైనను సరియే — ప్రకృతినియమములకు లోబడినదే గనుక, అంతము నొందితీరును, శాశ్వతముగా నిలిచియుండనేరదు. కావున మానవుడు ముక్తుడగుటకై యత్నింపవలెను, శరీరదాస్యమునకు అతీతుడు కావలెను; దాస్యమును అంగీకరింపరాదు. ఈ మోక్ష పథము హిందూదేశమునతప్ప మఱెచ్చటను లేదు. కావున ముక్తాత్ములు హిందూదేశమున మాత్రమే కలరనియు, మఱెచ్చటను లేరనియు పలుమాఱు చెప్పబడుమాట సత్యమైనదే. కాని భవిష్యత్కాలమున ఇతరదేశములందుసైతము ముక్తు లుందురనుటయు పూర్తిగా సత్యమే. అది శుభవార్త, మనకు మిక్కిలి సంతోషవార్త. పూర్వ మొకప్పుడు ధర్మము ముక్తికి అనుగుణమై యుండెను. యుధిష్ఠిరుడు, అర్జునుడు, దుర్యోధనుడు, భీష్ముడు, కర్ణుడు మున్నగుగల ధర్మారాధకులును, వ్యాసుడు, శుకుడు, జనకుడు మున్నగు ముక్తివాంఛాపరులును అప్పుడు కలసి మెలసి యుండిరి. బౌద్ధమతము ప్రవేశించుటతోడనే ధర్మమార్గము మూలద్రోయబడి, మోక్షమార్గ మొక్కదానికే ప్రాముఖ్య మేర్పడెను. కావుననే అగ్నిపురాణమందు ఉపమారూపభాషలో ఇట్లు వ్రాయబడియున్నది: "గయాసురుడు—అనగా బుద్ధుడు *— ఎల్లరకును మోక్షమార్గమును చూపి లోకమును నశింపజేయ జూచెను; కావున దేవతలెల్లరు చేరి మంతనములాడి, మోసముచే

* స్వామిజీ ఈ భావమును పిమ్మట మార్చుకొని "అగ్నిపురాణములోని గయాసురకథ బుద్ధునిగూర్చినది కానేకాదు" అని వ్రాసెను — స్వామిజీ గ్రంథావళి, 5-వ సంపుటము, 49-వ లేఖ చూడుడు.

అతనిని శాశ్వతనిష్క్రియత్వ మవలంబింప చేసిరి". ఇది యెట్లున్నను, ముఖ్యవిషయ మేమనగా, ఇప్పుడు ఎందరచేతనో ప్రస్తావింపబడుచున్న మనదేశపతనమునకు కారణము "ఈ ధర్మము" పూర్తిగా నశించుటే. మన దేశీయు లందఱును మోక్షపథమునే అవలంబించి, అభ్యసించినయెడల మంచిదే. కాని అది సాధ్యమా! భోగానంతరముగాని పరిత్యాగబుద్ధి కలుగనే కలుగనేరదు; మొదట భోగము లనుభవింపుము; పిదప త్యాగ మొనర్పగలవు. అట్లుగాక జాతియంతయు, ఉన్నట్లుండి సన్న్యాస మార్గమును త్రొక్కినచో, ఉద్దిష్టవాంఛ నెఱవేఱదు సరే కదా, మొదట ఉండినదికూడ చేతినుండి జాఱిపోవును—చేతనున్న పక్షి ఎగిరిపోయినది, పొదలోనున్న పక్షి దొరకలేదు! బౌద్ధమతము మహోచ్ఛదశలోనున్న కాలమున ప్రతిమఠమునందును వేనవేలు సన్న్యాసు లుండిరి. అప్పుడే దేశము నాశమొందుటకు సిద్ధమైనది! బౌద్ధులు, క్రైస్తవులు, ముసల్మానులు, జైనులు అజ్ఞతచే ఎల్లరకు ఒకేశాసనము, ఒకేసూత్రము విధింతురు. అది మిక్కిలి పొరపాటు; విద్యావిధానము, ప్రవర్తనవిధులు, ఆచారములు, శాసనములు, సూత్రములు వ్యక్తిమానవులకును, జాతులకును వారివారి స్వాభావికభేదముల కనుగుణముగా భిన్నములై యుండవలెను. బలాత్కరించి ఎల్లరకును ఒకేమార్గము విధింపజూచుట ఎట్లు ఉపకరింపగలదు? "మోక్షమునకంటె వాంఛనీయమైనది ఈ జీవితమున ఏదియు లేదు; మీ రెవరైన కానిండు, ప్రతివారును వచ్చి దానిని స్వీకరింపుడు" అని బౌద్ధులు ప్రకటించిరి. "అది ఎన్నడైన సాధ్యమగునా?" అని నా ప్రశ్న. హిందూశాస్త్రములు ఇట్లు చెప్పుచున్నవి: "నీవు గృహస్థుడవు, అట్టి విషయములు నీవు అంతగా మనసున పెట్టుకొనకుము, నీ స్వధర్మమును నిర్వర్తింపుము". ఇదియే సరి! ఒక్క అడుగున కెక్కువదూరము గంతు వేయజాలనివాడు, ఒక్కగంతున సముద్రముదాటి లంకకుపోవునట! ఇది యుక్తియుక్తమగు మాటయా? నీ కుటుంబమునే పోషించుకొన

జాలవు; సోదరమానవులకు ఇరువురకైన అన్నముపెట్టజాలవు; సంఘశ్రేయస్సుకై ఒక సాధారణకార్యమునేనియు ఇతరులతో నేకీభావమువహించి చేయజాలవు; కాని ముక్తివెంట పరువెత్తుచున్నావు!! "మోక్షము ధర్మమునకంటె ఎంతో శ్రేష్ఠమనుట సత్యమే, కాని ధర్మమును మొదట పూర్తిగానిర్వర్తింపవలెను" అని హైందవశాస్త్రాదేశము. ఇచటనే బౌద్ధులు తికమకపడి, ఎన్నియో అనర్థములు కలిగించిరి. అహింస మంచిదే; దురితమునకు ప్రతీకారము చేయకుండుట మహోత్తమమే — ఇవి ఉదాత్తసూత్రము లనుట నిస్సంశయమే; కాని శాస్త్రము లిట్లు చెప్పుచున్నవి: "నీవు గృహస్థుడవు. నిన్నెవరైన ఒక చెంపపై కొట్టినప్పుడు నీవు 'కంటికి కన్ను, పంటికి పన్ను'గా మాఱుచేత చేయవేని (బదులుచెల్లింపకుంటివేని), పాప మొడిగట్టుకొంటివనుట నిస్సంశయము". మను విట్లు చెప్పుచున్నాడు: "నిన్నెవడైన చంపవచ్చెనేని,—అతడు బ్రాహ్మణుడైనను—నీ వతనిని చంపుట పాపముకాదు" (మనుస్మృతి. VIII. 350). ఇది మిక్కిలినిజము, మఱచిపోదగని విషయము. "వీరభోగ్యావసుంధరా"— ఈభూమిని అనుభవించునది వీరుడే— కావున నీ వీరత్వమును ప్రదర్శింపుము; సందర్భానుసారముగా రాజనీతినిర్దిష్టములగు సామదాన భేద దండోపాయములను ప్రయోగించి (అనగా సంధిచేసికొనియో, ద్రవ్యదానమొనర్చియో, పరస్పరవైరములు రేగించియో, ప్రత్యక్షముగా పోరుసల్పియో) నీ విరోధిని వశమొనర్చుకొని ప్రాపంచిక భోగము లనుభవింప యత్నింపుము — అప్పుడు నీవు ధార్మికుడవవుదువు. అట్లుచేయక, ఎవడేని నిన్ను కాలదన్ని నేలరాచబూని అట్లుచేసినచో, నీవు ఆ అవమానములను మౌనముతోభరించి, ఊరకుంటివేని, నీజీవితమే అప్రతిష్ఠపాలగును; నీ ఐహికజీవితము ఒక నరకమగును; పారలౌకికజీవిత మింకొకనరక మగును. ఇదియే శాస్త్రబోధ: నీ స్వధర్మమును నిర్వర్తించుచుండుము — ఇది సత్యము, సత్యాతిసత్యము. ప్రియులగు నా స్వమతస్థులారా,

ఇదియే మీకు నా హితోపదేశము. దుష్టకార్యమును చేయవలదు, ఎవరిని హింసింపవలదు, ఎవరిని పీడింపవలదు, ఇతరులకు మీరు చేయగల ఉపకార మంతయు చేయుడు. కాని ఇతరులు దురిత మొనర్చినపుడు శ్రద్ధతో దానిని భరించి యూరకుండుట గృహస్థునకు పాపము; వెంటనే అదే రూపమున మాఱు చెల్లింప యత్నించుచుండవలెను. గృహస్థుడు పూర్ణపరిశ్రమతో, పరిపూర్ణోత్సాహముతో, ధనము ఆర్జించి, స్వకుటుంబమును, పరులను పోషించి వారికి సుఖము చేకూర్పవలెను; చేతనైనన్ని సత్కార్యములు చేయవలెను. అట్లుచేయజాలవేని, మనుష్యుడనని ఏల చెప్పుకొందువు? నీవు గృహస్థువుకూడ కావు—నీయట్టివాని కేమి మోక్షము?

ధర్మము కర్మముపై ఆధారపడియుండు నని ఇప్పటికే చెప్పితిమి. సమర్థతకలిగి నిరంతరకర్మాచరణనిమగ్నుడై యుండుట ధార్మికునికి స్వాభావికము. కర్మాచరణము విధింపని వేదభాగములు నిజమునకు వేదములే కావని కొందఱు మీమాంసకులుకూడ అభిప్రాయపడుచున్నారు! "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్య మతదర్థానామ్" అనునది యొక జైమినీసూత్రము. (వేదములు కర్మ ప్రతిపాదనార్థకములే గనుక, కర్మాచరణముతో ప్రసక్తములుకాని వేదభాగములు నిరర్థకములు).

"ఓంకారము నిరంతరము ఉచ్చరించుచు, దానియర్థమును గూర్చి ధ్యానించుచుండుటచే, సర్వమును సాధింపవచ్చును;" "భగవన్నామస్మరణమువలన సర్వపాపములు కొట్టుకొనిపోవును"; "ఈశ్వరసంకల్పమునకే ఆత్మార్పణ మొనర్చుకొనువానికి సర్వము లభించును"—అవును, శాస్త్రములును, సిద్ధపురుషులును పలికిన ఈ మాటలు నిస్సంశయముగా యథార్థములే, కాని, మనలో వేనవేలమంది జీవితకాలమంతయు ఓంకారమునుగూర్చియే ధ్యానించుచు, భగవన్నామమందలిభక్తిచే పారవశ్యమంది, "నీ సంక

ల్పమే నెఱవేఱుగాక, నేను నీకు పూర్ణముగా శరణాగతుడనైతిని'' అని పల్కుచున్నారుగదా, వారికి అందుచే ఏమి ఉపకృతి చేకూరినది?—పూర్ణానుస్వారము! ఇందుకు కారణ మేమియో చెప్పగలరా? కారణ మిది, దానిని పూర్తిగా గ్రహింపవలెను. ఎవనిధ్యానము వా స్తవము, కార్యసాధకము? భగవత్సంకల్పము నకు ఎవడు పూ ర్తిగా ఆత్మార్పణ మొనర్చుకొనగలడు ? ఎవడు పిడుగువంటి నిర్నిరోధశక్తితో భగవన్నామమును ఉచ్చరింపగలడు? చి త్తశుద్ధిని సాధించినవాడే, అనగా ఎవనిచిత్తము కర్మాచరణ ముచే పరిశుద్ధమైనదో వాడు, అనగా ఎవడు ''ధార్మికుడో'' వాడు.

ప్రతి మానవుడును ఒకశక్తిప్రదర్శన కేంద్రము. పురాకృత ఫలముగా ఈ శక్తి సంచితమైయున్నది. మనలో ప్రతివాడును ఈ శక్తిని తన వెనుకనుంచుకొనియే పుట్టుచున్నాడు. ఈ శక్తి యంతయు కర్మాచరణరూపమున వ్యయమై నిశ్శేషమగువఱకు ఎవడైన కర్మా చరణప్రసక్తి పెట్టుకొనక ఊరకుండగలడా? అంతదనుక అతడు తన సత్కర్మమువలనిసుఖమును, దుష్కర్మమువలని దుఃఖమును అనుభవించియేతీరవలెను; కర్మాచరణము నిలుపుకొని ఊరకుం డుట అతనికి శక్యముకానేరదు. అంతదనుక అనుభూతులను కర్మా చరణమును నిలుపుకొనుట సాధ్యముకాదేని, దుష్కర్మములు చేయుటకంటె సత్కర్మములు చేయుట, దుఃఖమనుభవించుట కంటె సుఖమనుభవించుట మేలుగదా. రామప్రసాదుడు* ఇట్లు

* రామప్రసాదుడు వంగదేశీయు డగు నొక సిద్ధపురుషుడు; కాళి కాంబికాభక్తుడు; సహజకవి. ఆమెను స్తుతించుచు గీతిక లనేకము రచించెను. వానియందు మహోదాత్తములగు ఆధ్యాత్మికసత్యములు మిక్కిలి తేటమాట లలో నెలకొల్పబడియున్నవి. ఆ గీతికలు జీవముతోను, భక్తిరసముతోను తొలుకాడుచు, అపారప్రచారముకలిగి జనాదరమునొందియున్నవి. అతినిమ్న దశయందుండు కృషీవలులుమొదలు విద్యాధికులవఱకు ఎల్లరును ఆ గీతికలాల పించునప్పుడు పారమార్థికభావావేశము నొందుదురు.

పలుకువాడు: " 'మంచి', 'చెడ్డ' అని రెండుమాటలు వాడుకలో కలవు; వానిలో 'మంచి' చేయుటే శ్రేయస్కరము".

మన మిప్పుడు ఆచరింపవలసిన "మంచి" ఎట్టిది? మోక్షమును అర్థించువాని "మంచి" యొకటి, ధర్మము అర్థించువాని "మంచి" మఱొకటి. గీతావిష్కరణ మొనర్చిన శ్రీకృష్ణభగవానుడు తేటపఱుప నెంతో ప్రయత్నించినది ఈ మహాసత్యమునే; హైందవమతములోని వర్ణాశ్రమధర్మవ్యవస్థయు, స్వధర్మసిద్ధాంతమును, దీని ఆధారముమీదనే నిర్మింపబడియున్నవి.

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహఙ్కారః సమదుఃఖసుఖః క్షమీ॥"
(గీత XII, 13)

(ఏభూతమునెడగాని ద్వేషములేనివాడు, అన్ని భూతములందును మైత్రియు, కరుణయు గలవాడు, 'నేను', 'నాది' అను భావములు లేనివాడు, సుఖదుఃఖములను సమబుద్ధితో చూచువాడు, ఓర్పుగలిగియుండువాడు). ఈ వర్ణన మంతయు మోక్షమే జీవితలక్ష్యముగా గలవానికి వర్తించును.

"క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప॥"
(గీత-II 3)

(పార్థా, కాపురుషుడవు కాకుము; అట్లగుట నీకు తగదు. శత్రుతాపకారివగు ఓ అర్జునా, తుచ్ఛమగు ఈ మనోదుర్బలత్వమును వీడి, లెమ్ము); మఱియు

"తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ।
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్॥"
"మయైవైతే నిహతాః పూర్వమేవ।
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥" (గీత-XI-33)

(కావున నీవు లెమ్ము, కీర్తిని ఆర్జింపుము, శత్రువులను జయింపుము, సమృద్ధమగు రాజ్యమును అనుభవింపుము. నాచేత వారు ఇప్పటికే చంపబడిరి. సవ్యసాచీ, నీవు నిమిత్తమాత్రుడవై యుండుము). గీతలో గల యిట్టి మాట లన్నియు ధర్మమునకు క్రొంవచూపుకొఱకు భగవంతునిచే ఉద్దేశింపబడినవి. కర్మాచరణమునం దెప్పుడును మంచిచెడుగులు కలిసియేయుండుననుట అంద ఱెఱిగినవిషయమే. కర్మాచరణమునందు కొంచముగనో, గొప్ప గనో పాపమొనర్చుటతప్పదు. ఐన నేమి? కానిమ్ము. ఊరకుం డుటకంటె కొంచెము కర్మమునైనచేయుట మంచిదిగదా — పస్తుండుటకంటె సగముకడుపునకు తినుట మేలుగదా; పుణ్యపాప మిశ్రమైనను కర్మమొనర్చుట, నిర్వ్యాపారులమై, శిలలవలె జడులమై, నిరర్థకజీవనముగడపుటకంటె మేలుగదా? గోడ ఎన్న డును బొంకదు, రాయి యెన్నడును దొంగిలింపదు. మానవుడు బొంకును, దొంగిలించును. కాని మానవుడే భగవంతు డగును. సత్త్వగుణప్రాబల్యమువలన మానవుడు నిష్క్రియుడై ఎల్లప్పు డును ధ్యానదశయందు మునిగియుండును; రజోగుణప్రాబల్యము వలన సత్కర్మములను, దుష్కర్మములనుకూడ చేయును; తమో గుణప్రాబల్యమువలన మరల నిష్క్రియుడును, జడుడును అగును. ఒకనియందు సాత్త్వికప్రాబల్య మేర్పడియున్నదా తామసిక ప్రాబల్య మేర్పడియున్నదా అని బాహ్యదృష్టిచే కనుగొనుటెట్లో చెప్పుడు. మన మిప్పుడు సాత్త్వికప్రశాంతదశయందు — సుఖ దుఃఖాతీతులమై, కర్మాచరణదశాతీతులమై — ఉన్నామో; అధ మాధమతామసిక దశకుకూలి, నిర్జీవులమై, నిర్వ్యాపారులమై, జడులమై, మృతపదార్థమువలె—శక్తివిహీనులముగనుక ఏ పనియు చేయజాలక — నిశ్శబ్దముగను, కొంచెకొంచెముగను చివికి, మఱిగిపోవుచున్నామో గ్రహించు టెట్లు? ఈ ప్రశ్నమును నేను తీవ్రబుద్ధితో అడుగుచున్నాను. బదులుచెప్పుడు. మీ మనస్సులనే ప్రశ్నించికొనిచూడుడు, మీకు నిజము తెలిసిపోవును. కాని

సమాధానముకై వేచియుండు టేల? ఫలములనుబట్టి వృక్షము నెఱుఁగఁగలముగదా. సత్త్వము ప్రాబల్యమునొందినప్పుడు మానవుఁడు నిష్కర్ముఁడై, శాంతుఁడై యుండుట నిజమే, కాని ఆ నిష్కర్మత మహాశక్తుల కేంద్రీకరణముయొక్క ఫలము, ఆ శాంతత అపారకార్యోత్సాహముయొక్క జన్మభూమి. ఆ మహాసాత్త్వికస్వభావుఁడు, ఆ మహనీయాత్ముఁడు, మనవలె నిక కాలుసేతులతో పనిచేయనక్కఱలేదు,—సంకల్పమాత్రముననే, అతని కార్యములన్నియు వెంటనే నిర్దుష్టముగా నెఱవేఱును. అట్టి సత్త్వాధిక్యుఁడే సర్వవంద్యుఁడగు బ్రాహ్మణుఁడు. అతఁడు ఇంటింటికిపోయి తన్ను ఆరాధింపుఁడని ఇతరులను ప్రార్థింపవలయునా? సర్వశక్తిసంపన్నయగు జగన్మాత అతనిఫాలభాగమున స్వర్ణాక్షరములతో స్వహస్తమున నిట్లు వ్రాయును: "మీ రెల్లరును ఈ మహాపురుషుని, ఈ నా కుమారుని, ఆరాధింపుఁడు". లోకము అది చదివి, అట్లు చేయుచు, అతనియెదుట విధేయతతో వినమ్రశిరస్కమై ప్రణమిల్లును. అట్టి పురుషుఁడు వాస్తవముగా

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహఙ్కారః సమదుఃఖసుఖః క్షమీ"*

మఱియు ప్రతిమాటను నమలినట్లు ముక్కుతో మాటాడుచు, వారమునాళ్లనుండి పస్తున్నవానివలె హీనస్వరముపడి, చినిగిపోయిన తడిపీలికగుడ్డవలె నుండి, కాలితో తన్నినను నోరెత్తక, రోషమూనక, యుండు పిఱికిపంద లగు ఆడంగిపురుషులయొద్ద కానిపించు గుణములు అధమతమస్సును సూచించును. అవి మరణలక్షణములు — సత్త్వలక్షణములుకావు — కుళ్లిపోయి కంపుకొట్టునవి. అర్జునుడు ఇట్టివారిలో కూలబోవుచున్నందుననే, భగవంతుఁడు అతనికి అంత విపులముగా గీతలో బోధించినది. ఇది సత్యముకాదా? భగవంతునినోట వచ్చిన మొట్టమొదటిమాట

* అర్థము 237-వ పుటలో వ్రాయబడియున్నది.

లను వినుడు — "క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుప పద్యతే" (పార్థా, పౌరుషవిహీనుడవు కాకుము, అది నీకుతగదు). మఱియు పిదప చెప్పిన ఈ మాటలనుకూడ వినుడు: "తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ" (కావున నీవు లెమ్ము, కీర్తిని ఆర్జింపుము). జైనబౌద్ధాదుల విపరీతభావములకు వశులమై, మనము ఈ తామసికజనదళములో చేరిపోయితిమి;— ఈ గడచిన వేయేండ్లనుండి దేశవాతావరణము నంతయు భగన్నామముతో నిండించుచు, భగవంతుని ప్రార్థించుచున్నాము; కాని భగవంతుడు వానికి చెవియొగ్గుటలేదు. ఏల యొగ్గును? బుద్ధివిహీనుని మొఱలను మానవుడే ఎన్నడును ఆకర్ణింపడు గదా, భగవంతుడు ఆకర్ణించు నని తలపనగునా? కావున మనము తప్పించుకొని బైటపడుమార్గము భగవంతుని గీతోపదేశవాక్కుల ననుసరించుటొక్కటే: "క్లైబ్యం మా స్మగమః పార్థ * * * తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ".

ఇప్పుడు మరల మన ప్రస్తుతవిషయమునకు—"ప్రాచ్యము, పాశ్చాత్యము"నకు—పోవుదము. ప్రథమమున అందలి వైపరీత్యమును చూడుడు. యూరపుదేశస్థుల రక్షకు డగు ఏసుక్రీస్తు ఇట్లు బోధించియున్నాడు: "శత్రువులుగా ఎవ్వరినేని భావింపవలదు; నిన్ను దూషించువారిని ఆశీర్వదింపుము; నీ కుడిచెంపపై కొట్టిన వారివైపునకు రెండవచెంపనుకూడ త్రిప్పుము; నీ కర్మాచరణము నంతయు చాలించుకొని పరలోకయాత్రకు సిద్ధముగా నుండుము. లోకము శీఘ్రకాలముననే అంతమొందనున్నది". ఇక మన భగవానుడు గీతలో ఇట్లు చెప్పుచున్నాడు: "ఎల్లప్పుడును పరిపూర్ణోత్సాహముతో పనిచేయుచుండుము, నీ శత్రువులను నాశమొనర్పుము, లోకము ననుభవింపుము". కాని చివరకు ఏసుక్రీస్తు, శ్రీకృష్ణుడు ఉద్దేశించినదానికి ప్రత్యక్షవిరుద్ధముగా జరిగినది. యూరపుదేశస్థులు ఏసుక్రీస్తుబోధకు అంతప్రాముఖ్య మీయలేదు.

ఎల్లప్పుడును కార్యతత్పరత్వమునకు అలవాటుపడిన వారును, అపారరాజసికస్వభావముగలవారును అగుటచే వారు యువకోత్సాహముతోను, పూర్ణసాహసముతోను, ప్రపంచములోని సర్వదేశములసుఖములను, భోగములను సమకూర్చుకొని వానిని తనివితీర అనుభవించుచున్నారు. ఇక మనమో, మూటముల్లెలు సర్దుకొని, ఒకమూలలో కూర్చుండి, రేయుంబవళ్లు మరణవిచారము చేయుచు "నలినీదళగత జలమతితరళం తద్వజ్జీవనమతిశయ చపలమ్" (తామరాకుమీది నీరు మిక్కిలి చంచలము, అట్లే ఈ జీవితము మిక్కిలి అస్థిరము) అని పాడుకొనుచుందుము. తత్ఫలముగా మృత్యుదేవుడగు యమునిభీతిచే మన రక్తము చల్లబాఱి, మాంసము భయకంపిత మగుచున్నది. దురదృష్టవశమున యముడును మనమాటలనే విశ్వసించినట్లు మహామారియు, సర్వవిధములగు ఇతరవ్యాధులును మన దేశమున ప్రవేశించినవి. గీతాబోధానుసార మెవరు ఇప్పుడు ప్రవర్తించుచున్నారు? యూరపుదేశీయులు. ఏసుక్రీస్తుసంకల్పము ననుసరించి ఎవరు ప్రవర్తించుచున్నారు?—శ్రీకృష్ణునిసంతతివారు!! ఈ విషయమును పూర్తిగా అర్థముచేసికొనవలెను. మోక్షమార్గమును ప్రథమమున కనుగొని ప్రకటించినవి వేదములు. పిదప బుద్ధుడు, ఏసుక్రీస్తు మున్నగుప్రవక్తలు బోధించిన దంతయు ఆ వైదికమూలము నుండియే కైకొనబడినవిషయము. ఈ ప్రవక్తలు సన్న్యాసులు కావున వారు "ఎవరినేని శత్రువులుగా భావించుకొనలేదు. ఎల్లరయందును మైత్రితో, దయతో నుండిరి". అది వారికి సముచితముగనే ఉండినది. కాని ఆ మోక్షమార్గమునే అవలంబింపుమని లోకమునంతయు బలాత్కరించు ఈ ప్రయత్న మేల? "రుద్దుటవలన, తోముటవలన, సౌందర్యమును ఉత్పత్తిచేయుట శక్యమా? బ్రతిమాలిగాని, బలాత్కరించిగాని, ఎవరినైన స్వకీయులనుగా చేసికొనుట సాధ్యమా? తనకు మోక్షము అక్కఱలేదనువానికిని, మోక్షమునకు అనర్హుడుగానుండువానికిని, బుద్ధుడు, క్రీస్తు ఏమి

నిర్ణయించినారు ? ఏమియు లేదు.—మానవుడు మోక్షమునైన పొందవలెను, లేక నాశమునకు సంసిద్ధుడైయుండవలెను. వారు వివరించినది ఈ రెండు మార్గములనే; మధ్యేమార్గమేదియు లేదు. మోక్షేతరార్థమునకు ప్రయత్నించుటకై మానవులకు స్వాతంత్ర్య లేశమేనియు ఈయబడలేదు— ప్రపంచసుఖమును కొంతకాలము ఒకింత అనుభవించుమార్గ మేదియు చూపబడలేదు. అందుకు అనువగు మార్గములన్నియు సంపూర్ణముగా బంధింపబడియుండుటే గాక, అడుగడుగునను అడ్డములుకూడ కల్పింపబడియున్నవి. వేద చోదితమతముయొక్కటే ధర్మార్థకామమోక్షము లనెడు నాలుగు పురుషార్థములను సాధించు మార్గముల నేర్పఱచియున్నది. బుద్ధుడు మనలను పాడుచేసెను, అట్లే క్రీస్తు గ్రీసు, రోములను పాడు చేసెను! పిదప కాలక్రమమున యూరపియనులు ప్రాటెస్టెంటు సంప్రదాయము నవలంబించి, పోపు యొక్క అధికారముక్రింద ప్రవర్తిల్లుచుండిన క్రీస్తుబోధలను ఇటునటు దులిపివైచి, తెప్పఱిలి సంతసించిరి. హిందూదేశమున కుమారిలుడు మరల కర్మమార్గ మును—కర్మమునుమాత్రము నిర్దేశించు మార్గమును — వ్యాప్తి లోనికి తెచ్చెను. శంకర రామానుజులు ధర్మార్థకామమోక్షము లను సామరస్యముతో సముచితభాగములుగా ననుభవించుటకై నిర్ణయింపబడిన సనాతనవైదికమతమును సుస్థిరముగా స్థాపిం చిరి. తాను కోల్పోయియుండినప్రాణమును పునర్లభ్యమొనర్చు కొనుమార్గమున జాతి ఇట్లు పెట్టబడినది; కాని హిందూదేశమున ముప్పదికోట్ల ప్రజలను మేలుకొల్పవలెను. కావున ఆలస్య మగు చున్నది. ముప్పదికోట్లమందిని ఒకనాటికాలమున పునర్జీవితుల నొనర్చుట సాధ్యమా ?

బౌద్ధమతముయొక్కయు వైదికమతముయొక్కయు ఉద్దేశ ములు భిన్నములుకావు గాని బౌద్ధమతము అనుసరించు మార్గము సరియైనదికాదు. బౌద్ధులమార్గము సరియైనదిగా నున్నచో, మనము ఇట్లు ఇంత పూర్తిగా ఏల చెడి వినాశదశకు వచ్చితిమి ?

కాలము గడచినందువలన ఇట్లు జరిగెనని చెప్పుట నిష్ప్రయోజనము. కార్యకారణనియమము నతిక్రమించి కాలము ఏమి చేయగలదు ?

కావున బౌద్ధులును వైదికమతస్థులును ఒకే గమ్యమును సాధింప యత్నించినను, బౌద్ధులు అపసవ్యమార్గము నవలంబించి, హిందూదేశమును అధోగతికి తెచ్చినారు. బహుశః నా బౌద్ధ సోదరు లీమాటకు కోపగించుకొని చిఱచిఱలాడుచు ఉద్రేకమొందుదురేమో! కాని అందుకు నే నేమి చేయగలను? నిజము చెప్పియే తీరవలెను. తత్ఫలము ఏమయినను నాకు అక్కఱలేదు. వేదనిర్దిష్టజాతిధర్మమే సవ్యమైనది, సరియైనది. జాతిధర్మ మనగా వివిధకులములకు నిర్ణీతమైన ధర్మము, — స్వధర్మము, అనగా, స్వకీయధర్మము. ప్రతివానికిని వాని శక్తినిబట్టి, పదవినిబట్టి, నిర్ణయింపబడిన ధర్మము. ఇదియే వైదికమతమునకును వైదిక సంఘమునకును మూలాధారము. నా దేశస్థులను పొగడుచున్నానని తలచి మఱికొందఱు మిత్రులు కుపితు లగుదురేమో. ఇచట వారి నొకమాట — ఒకేసారిగ — అడుగనిందు. అట్టి పొగడ్తల వలన నా కెట్లు ఉపకారము కలుగును? ధనమూలముగగాని, ఏదైన ఇతరవిధముగగాని వారు నన్ను పోషించుచున్నారా? అట్లొనర్పకపోవుటేగాక నేను క్షామపీడితులను, అనాథశిశువులను సంరక్షించుకొఱకు హైందవేతరదేశములందు యాచించి సంపాదించు ధనమును నాకడనుండి లాగుకొన బూర్నప్రయత్నములు చేయుదురు. నేను ఈయనేని నన్ను తిట్టి అపవాదోక్తులాడుదురు!! విద్యాధికులగు నా దేశీయులారా,—నా దేశస్థులు ఇట్టివారు. ముఖస్తుతులచే వారివలన ఏమియు లభింపదని నాకు చక్కగా తెలియును. నేను వారిని పూర్తిగా ఎఱుగుదును. వారిని మతిభ్రష్టులుగా భావింపవలెనని నే నెఱుగుదును. మతిభ్రష్టునిచే ఔషధసేవ చేయింప బూనుకొనువాడు అందుకు బహుమతిగా తన్నులకును, కాట్లకును సిద్ధపడియుండవలెనని నే నెఱుగుదును;

అట్టి బహుమతికి సిద్ధపడి, బలాత్కారముగా వారినోటిలో ఔషధముపోసి, వారిచర్యలను శాంతముతో భరించువాడే వారికి యథార్థమిత్రుడు.

ఈ జాతిధర్మము, ఈ స్వధర్మము, సర్వదేశములందుగల ప్రతిసంఘము క్షేమమునొందుమార్గము—చివరకు మోక్షమునకు గొనిపోవగల నిచ్చెన. ఈ జాతిధర్మము, ఈ స్వధర్మము, క్షీణించుటవలననే మనదేశము పతనమొందినది. కాని ఈ కాలమున అగ్రకులములవారు సామాన్యముగా కైకొను అర్థమున జాతిధర్మము (లేక స్వధర్మము) మనము తప్పించుకొనవలసిన క్రొత్త ఆపద యగుచున్నది. జాతిధర్మమునుగూర్చిన పరిపూర్ణజ్ఞానము తమకు కలదని వారిభావము. కాని నిజమునకు వారికి అది తెలియనే తెలియదు. తమగ్రామమున అనుసరింపబడు ఆచారములే వేదప్రతిపాదిత సనాతనాచారములని తలచి, అధికారములన్నియును తమవిగనే భావించుకొని వారు నాశమున కేగుచున్నారు! నా మాటలు వంశపారంపర్య కులవ్యవస్థనుగూర్చిగాని, గుణభేదములచే నిర్ణయింపబడు కులవ్యవస్థనుగూర్చి కాదు. గుణనిర్ణీతకుల వ్యవస్థయే ప్రథమమున నుండినదని నేనును అంగీకరింతును, కాని రెండు మూడు పురుషాంతరములలో గుణమునకు బదులు జన్మమునకు ప్రాధాన్య మీయబడును. ఇందుచే మన జాతీయజీవనముయొక్క ఆయువుపట్టునకు దెబ్బతాకినది; లేనిచో, మన మిట్టి పతనస్థితికి ఏల కూలితిమి? గీతలో "సఙ్కరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః" (నేను వర్ణసంకరకారకుడ నగుచు, ప్రజల వినాశమునకు కారణమయ్యెదను) అని యున్నది గదా. ఈ ఘోరవర్ణసాంకర్యము — అన్నికులములయొక్క సాంకర్యము — ఇంత గందరగోళపఱచు తెఱగున — ఎట్లు ప్రాప్తించినది? గుణభేదములనే పాటింపకుండుట ఎట్లు సంభవించినది? మన పూర్వికులకు ఉండిన శ్వేతవర్ణము ఇప్పు డేల నలుపుగా మాఱినది? సత్త్వగుణము నశించి రజోగుణలేశముతోకూడిన

తమోగుణము ఇప్పు డేల వ్యాపించియున్నది? ఇందుకు దీర్ఘ వివరణము అవసరము కావున మఱొకతడవ ఈ ప్రశ్నమునకు బదులు చెప్పెదను. ప్రస్తుతము ఈ సంగతిని గ్రహింప బ్రయత్నింపుడు—జాతిధర్మము సక్రమముగా, యథార్థముగా, కాపాడబడినచో, జాతి ఎన్నటికిని పతనమొందదు. ఇది నిజమైనచో, మన పతనమునకు కారణభూతమైన దేది? జాతిధర్మమూలము చెఱుపబడిన దనుటకు మన పతనమే స్పష్టమగు తార్కాణము. అనగా, మన మిప్పుడు జాతిధర్మ మని తలచునది అందుకు ప్రత్యక్ష విరుద్ధమైన దని తేలుచున్నది. ప్రథమమున మీ శాస్త్రములను జాగ్రత్తగా, పరిశీలనబుద్ధితో, చదువుడు. శాస్త్రములలో కులధర్మ మని పేర్కొనబడినది ఈ దేశమందు ప్రాయికముగా సర్వత్ర అదృశ్యమైన దని మీ కప్పుడు సులభముగా తెలిసిపోవును. ఇప్పుడు యథార్థరూపమగు జాతిధర్మమును పునరుద్ధరించితి రేని, దేశమునకు మహోపకారముచేసినవా రగుదురు. నేను నేర్చినది, నేను గ్రహించినది, మీకు స్పష్టముగా తెలుపుచున్నాను. నేను మీ రక్షణార్థ మేదో యొక విదేశమునుండి ఇచటికి పంపబడినవాడనుకాను. కావున మీ వెఱ్ఱి మొఱ్ఱి ఆచారముల నన్నిటిని ప్రమాణీకరించి, అవి శాస్త్రసమ్మతములని సమర్థించుట నా పని కాదు; మన విదేశీయమిత్రులు ఆ పనిని నిర్వ్యాయముగా చేయగలరు. కనుక, వారి కది కష్టముకాదు. మీరు వారిని స్తుతించి కరతాళధ్వనులచే వారిని సంతుష్టుల నొనర్తురు. వారు కోరు పరమార్థము అదియే. కాని నేను మీ ముఖములపై బురదను, దుమ్మును చల్లినచో, అది నా ముఖముమీదకూడ పడునని మీ రెఱుగుదురా? ఐన నేమి?

ప్రతిజాతికిని ఒక జాతీయకర్తవ్యము ఉండునని నేను మఱొకసందర్భమున చెప్పియున్నాను. ప్రకృతినియమానుసారముగనో, మహాపురుషులయొక్క మహోత్కృష్టబుద్ధిబలముచేతనో,

ప్రతిజాతియొక్క సాంఘికాచారమర్యాదలు ఆ జాతీయకర్తవ్యము సిద్ధించుటకు అనువుగా ఏర్పఱుపబడుచున్నవి. ప్రతిజాతియొక్క జీవితమునందును, ఆ కర్తవ్యము, దానిసిద్ధికి అత్యావశ్యకములై యుండు ఆ ఆచారమర్యాదలు వినా తక్కినవన్నియు అనావశ్యకములు. ఆ అనావశ్యకాచారమర్యాదలు అభివృద్ధినందినను, అదృశ్యమైనను ఒక్కటియే; కాని జాతీయజీవన ముఖ్యకర్తవ్యమునకు హానికలిగినచో మాత్రము జాతి అంతమునొంది తీరును.

మేము పసివారమైయున్నప్పు డొక రాక్షసి కథ వింటిమి. దాని ప్రాణ మొక చిన్నపక్షియందు ఉండునది. ఆ పక్షిని చంపిన గాని ఆ రాక్షసి చావదు. జాతియొక్క జీవితముకూడ అట్టిదే. మఱొకవిషయమునుకూడ మీరు గమనింపవచ్చును. జాతీయ కర్తవ్యమునకు అంతగా సంబంధింపని హక్కులు కొన్ని లాగుకొనబడినను, జాతికి విస్తారము కష్టము తోఁపదు — కొన్నియేల, అన్నియు లాగుకొనబడినను అంతయే. కాని, తన జాతీయకర్తవ్యమునకు — తన జాతీయజీవనమునకు ఆధారమైనదానికి — ఎంత కొంచెపాటి దెబ్బతాకినను, అది అపారశక్తితో ప్రతీకారము చూపును.

మూఁడు సజీవజాతులయొక్క — ఫ్రెంచి, ఆంగ్లేయ, హైందవ — చరిత్రములు మీరు చాలవఱకు ఎఱుగుదురు. ఆ జాతుల విషయమును ఉదాహరణముగా కైకొనుడు: ఫ్రెంచివారి మన స్తత్త్వమునకు రాజకీయస్వాతంత్ర్యమే వెన్నెముకవంటిది. ఫ్రెంచిప్రజలు సర్వవిధములగు ఒత్తుడులను శాంతతతో భరింతురు: అధికములగు పన్నులు విధింపుఁడు, వా రేమాత్రము ఆక్షేపింపరు; జాతినంతయు సైన్యములో చేరుమనుఁడు, వా రేమియు మొఱ పెట్టరు; కాని ఎవరైనను వారి రాజకీయస్వాతంత్ర్యముజోలికి పోయిరా, జాతియంతయు ఏకమై లేచి ఉన్మత్తావేశముతో ప్రతిఘటించును. "మాపై అధికారముపఱపు పదవి నెవరినిగాని

ఆక్రమించుకొననీయము. మా దేశమును పరిపాలించుకొను టందును, మా సంఘమును మా ఇష్టానుసారము నడుపుకొను టందును ప్రాజ్ఞులకు, అజ్ఞులకు, ఉన్నతశ్రేణులకు, నిమ్నశ్రేణులకు — మా కెల్లరకును సమానాధికారము కలదు". ఇదియే ఫ్రెంచివారి స్వభావమునందలి మూలసూత్రము. ఈ స్వాతంత్ర్యము జోలికి పోవువారు ఆపదలపాలగుదురు.

ఆంగ్లజాతీయమన స్తత్త్వమున "ఇచ్చి పుచ్చుకోలు" మార్గము — వణిజసహజమగు వర్తకమార్గము — స్వాభావికమై యుండును. ఆంగ్లేయులు నిష్పాక్షికత్వమును, అధికారముల పంపకమున హెచ్చుతక్కువలు లేకుండుటను ముఖ్యముగా గమనింతురు. ఆంగ్లేయుడు రాజునకును, కులీనుల అధికారాధిక్యములకును, వినమ్రతతో లోబడియుండును; కాని తనయొద్దనుండు ఒకదమ్మిడీ ఈయవలసివచ్చినను అందుకు కారణము వివరణసహితముగా, ఎఱుగగోరును. రాజు కలడు; అది సరియే; అతని యాజ్ఞకు బద్ధుడైయుండుటకును, అతనిని గౌరవించుటకును అతడు సంసిద్ధుడు. కాని రాజు ద్రవ్యము కోరినచో, ఆంగ్లేయుడు ఇట్లనును: "సరియే; కాని అది ఎందుకొఱకు కావలసినది, దానిచే ఎట్టి ఉపకారము కలుగునది నాకు మొదట తెలుపుడు; తదనంతరము ఆ ద్రవ్యము నెట్లు వెచ్చింపవలెనో ఆ విషయమును గూర్చి నా యభిప్రాయ మీయవలెను; ఆ పిదపనే నేను ద్రవ్యము నిత్తును." ఆంగ్లేయులయొద్దనుండి బలాత్కారముగా ద్రవ్యము లాగుకొనజూచిన రాజొకడు పెద్దవిప్లవమును కలిగించెను. ఆ రాజును వారు చంపివైచిరి.

రాజకీయస్వాతంత్ర్యము, సాంఘికస్వాతంత్ర్యము, మంచివే, ఉపయుక్తములే; కాని అసలువిషయము—మనకు యథార్థముగా కావలసినది — పారమార్థికస్వాతంత్ర్యము, ముక్తి అని హిందువు పల్కును. ఇదియే మన జాతీయపరమలక్ష్యము; వైదికుడుగాని, జైనుడుగాని, బౌద్ధుడుగాని, అద్వైతిగాని, విశిష్టాద్వైతిగాని,

ద్వైతిగాని, ఎల్లరును ఈ విషయమున ఒకేఅభిప్రాయము కలిగి యుందురు. ఆ ఒక్క విషయమునుమాత్రము వదలి, నీ యిచ్చ వచ్చినట్లు చేయుము, హిందువు నోరెత్తక, అప్రసక్తుడై యుండును; కాని ఆ విషయమున వానిని దూషించితివా జాగ్రత్త, నీ వినాశము సిద్ధము. అతని యాస్తినంతయు దోచుకొనుము, అతనిని కాల దన్నుము, అతనిని "నిగ్గర్" (నీగ్రో) అనియో, అట్టి మఱొక పేరనో పిలువుము, అతడు అంతగా ఆక్షేపింపడు; ఆ ఒక్క మార్గమును మాత్రము — మతసంబంధమగు ద్వారమును మాత్రము —నిరాటంకముగా, ఉపద్రవరహితముగా నుండునట్లు తెఱచి యుంపుము. పరానురాజశ్రేణులు ఎట్లు వచ్చుచు, పోవుచు ఉండిరో చూడుడు. కాని భారతసామ్రాజ్యమును వారెవ్వరును సుస్థిరముగా వశముచేసికొనజాలక పోయిరి. హిందూమతమును వారు సర్వదా ఎదిరించుచుండుటయే ఇందుకు కారణము. ఇక మొగలాయీరాజ్యమువంక చూడుడు. అది ఎంతసుస్థిరముగా, ఎంతబలిష్ఠమై యుండెను! ఏల, మొగలాయీలు ఆ విషయము లోనికి ప్రవేశింపలేదు. నిజమునకు మొగలాయీసామ్రాజ్యము నకు హిందువులే ప్రాపులై యుండిరి. జహంగీరు, షాజహాను, దారాశికోహ: వీరందఱ తల్లులును హిందువులే యని మీ రెఱుగరా? ఇప్పుడు ఇది చూడుడు — దుర్విధిప్రేరితుడగు ఔరంగజేబు దానిజోలికి పోయినతోడనే, అపారవిస్తృతినొంది యుండిన మొగలాయిసామ్రాజ్య మొక్కక్షణములో స్వప్నము వలె అదృశ్యమయ్యెను. ఆంగ్లేయప్రభుత్వము హిందూదేశమునం దింత స్థిరముగా పాదుకొనియుండుటకు కారణమేమి? వారు ఈ దేశపు మతమును ఏ విధమునగాని స్పృశింపకుండుటయే. ప్రజ్ఞావంతులమని భావించుకొనిన క్రైస్తవమతప్రచారకులు దానిని తాకిచూచిరి. అందుకు ఫలమే 1857 వ సంవత్సరపు సిపాయీల తిరుగుబాటు! ఆంగ్లేయు లీవిషయమును పూర్తిగా గ్రహించి యుండునంతదనుక వారి ప్రభుత్వము చెడక, నిశ్చలముగా నిలిచి

యుండును. ఆంగ్లేయులు—వారిలో దూరదృష్టిగల ప్రాజ్ఞులు—కూడ ఈ విషయమును గ్రహించి అంగీకరింతురు లార్డ్ రాబర్ట్సు యొక్క “ఫార్టీవన్ ఇయర్స్ ఇన్ ఇండియా” (“ఇండియాలో నలువదియొక్క సంవత్సరములు”) అను గ్రంథములో 30, 31 అధ్యాయములు చదివిచూడుడు.

ఈ రాక్షసియొక్క ఆత్మ ఎచట నెలకొనియున్నదో మీ కిప్పుడు స్పష్టముగా తెలిసినదిగదా — మతమునందు. దాని నెవ్వరును నశింపజేయజాలకపోయిరి. కనుక హిందూజాతి ఎన్నోకష్టములను, ఎన్నోఆపదలను అనుభవించియు, ఇంకను జీవించియున్నది. “జాతియొక్క ఆత్మను మతమునం దుంచుట ఎట్లు ఉపయుక్తము? తక్కినజాతులవలె మనమును దానిని సాంఘికస్వాతంత్ర్యమునందో, రాజకీయస్వాతంత్ర్యమునందో ఏల నిలుపరాదు?” అని యొక విద్వాంసుడు ప్రశ్నించుచున్నాడు. అట్లు మాటలాడుట అతిసులభమే. మతము, పారమార్థిక స్వాతంత్ర్యము, ఆత్మ, ఈశ్వరుడు, ముక్తి: ఇవన్నియు అయథార్థము లని చర్చకై అంగీకరింతమనుకొనుడు. అప్పుడు విషయము ఎట్లుండునో చూడుడు. ఒకే అగ్ని వివిధరూపములను దాల్చి ఎట్లు కానిపించుచుండునో అట్లే ఒకే మహాశక్తి ఫ్రెంచివారి యందు రాజకీయస్వాతంత్ర్యముగను, ఆంగ్లేయులయందు వాణిజ్య నైపుణ్యముగను, నైతికప్రవర్తన సీమాభివ్యాపనముగను, హిందువులయందు మోక్షేచ్ఛ (లేక) పారమార్థికస్వాతంత్ర్యముగను అభివ్యక్త మగుచున్నది. ఫ్రెంచివారియొక్కయు ఆంగ్లేయుల యొక్కయు ప్రస్తుతజాతీయశీలము అనేకశతాబ్దములభాగ్యపరిణామ ద్వారమున, ఆ మహాశక్తియొక్క ప్రోద్బలముచేతనే రూపొందిన దనియు, హైందవజాతీయశీలముకూడ అట్లే, ఆ మహాశక్తియొక్క ప్రోద్బలముచేతనే, ఎన్నోవేలశతాబ్దములు పరిణామ మొంది ఇప్పటి రూపమునకు వచ్చినదనియు, జ్ఞప్తియం దుంచుకొనవలెను. నేను మిమ్ము ఈ ప్రశ్నమును తీవ్రబుద్ధితో అడుగుచున్నాను :

ఎన్నో వేలసంవత్సరములుగా పరిణామమొందిన స్వజాతీయశీలమును విడనాడుట సులభమా, కొలదినూర్ల సంవత్సరములలోపలనే మన యందు మిశ్రితమైన విదేశజాతీయశీలమును విడనాడుట సులభమా? ఆంగిలేయులు తమ సమరశీలతను మఱచి, జగడములను రక్తపతనమును విడనాడి, తమ మతమును జీవితపరమార్థముగా జేసికొనుటందే శక్తినంతయు ఏకాగ్రమొనర్చి ప్రశాంతముగా, మౌనముగా, ఏల కూరుచుండరు?

అసలువిషయ మేమనగా, ఏఱు తన జన్మసీమయగు పర్వతములనుండి వేయిమైళ్లు ప్రవహించినది. ఇప్పు డది తిరుగ తన జన్మస్థానమునకు పోవునా, పోగలదా? ఎప్పుడేని అది వెనుకకు మరల నుద్యమించెనేని బహుముఖములుగా చెదరి, ఎండిపోవును. ఎట్లైనను ఆ ఏఱు త్వరితముగనో ఆలస్యముగనో, వెల్లడిగానుండు మనోజ్ఞసమభూమిగుండ ప్రవహించియో, ముటికినేలగుండ పెనగులాడి ప్రవహించియో, సముద్రములో చేరుననుట నిస్సంశయము. ఈ పదివేలేండ్లనుండి సాగివచ్చుచున్న మన జాతీయజీవితము ప్రమాదజనితమార్గమునుపట్టియున్నయెడల, ఇప్పుడు దానిని సరిపఱచు త్రోవ లేదు; నూతనశీలము నిప్పుడు నిర్మించుకొనజూచితిమేని దానివలన కలుగు అనివార్యఫలము మన మరణమే.

కాని అట్లు తలచుట — మన జాతీయాదర్శము ప్రమాదజనితమని తలచుట — కేవలము అజ్ఞతయనియు, అపార్థకల్పనాఫలమనియు నా అభిప్రాయము. ఇట్లు చెప్పినందుకు నన్ను క్షమింతురుగాక. ప్రథమమున ఇతరదేశములకు పోయి, ఆదేశముల ఆచారములను, అచటి స్థితిగతులను మీ సొంతకన్నులతో — ఇతరులకన్నులతో కాదు — జాగ్రత్తగా గమనించి, వానినిగూర్చి సవిచారబుద్ధితో — మీ కట్టిది కలదేని — యోచింపుడు; పిదప మీ దేశశాస్త్రములను, మీ పురాతనవాఙ్మయమును పఠించి, హిందూదేశమం దంతటను పర్యటించి, వివిధప్రాంతములలోని ప్రజలయొక్క ఆచారవ్యవహారమార్గములను పూర్ణవికసితనేత్ర

ములతో, పరిశీలనదృష్టితో—మూఢదృష్టితో కాదు కనిపట్టుడు. అట్లు చేసితిరేని, జాతి యింకను చెక్కుచెదరక జీవించియేయున్నదనియు, జాతీయజీవితము నిస్సంశయముగా స్పందించుచున్నదనియు విస్పష్టముగా—మధ్యందిన మార్తాండునంతవిస్పష్టముగా — కానిపించును. మఱియు మనజాతీయజీవితాగ్ని బూడిదచే కప్పబడియుండుటవలన మృతవస్తువుగా తోచుచున్నను రగులుచునే యున్నదనియు, మతమే మన జాతియొక్క జీవితమనియు, మతమే దాని భాషయనియు, మతమే దాని భావమనియు మీ కప్పుడు తెలియవచ్చును; ఇంతేకాక మీ రాజ్యతంత్రము, మీసంఘము, మీ పురపాలకసమాజము, మీ మహామారినిరోధనోద్యమము, మీ క్షామనివారణమునకై మీ రొనరించుప్రయత్నము: ఇవన్నియు ఇచట—గతకాలమునందెల్లప్పుడును చేయబడుచుండినట్లే ఇకమీదకూడ మతమూలముననే చేయబడుననియు మీ కప్పుడు తెలియవచ్చును. లేనిచో మిత్రమా, ఉద్రేకపూర్వకములగు ఈ ఏడ్పులును అఱ్పులును వ్యర్థములుగా పరిణమించును.

మఱియు ప్రతిదేశమునందు ఆచరింపబడునది నిజమునకు ఒకేమార్గము—అనగా కొలదిమంది బలవంతులు ఎట్లు చెప్పుదురో అట్లే జరుగుట. తక్కినవా రందఱును 'గొఱ్ఱెదాటుగా' ఆ మార్గము ననుసరింతురు. అంతయే. మీ పార్లమెంటును (లోకసభ), మీ సెనెట్‌ను (ఉన్నతాధికారనిర్వాహకశిష్టసభ), మీ వోటును (ఎన్నికపత్రము), మెజారిటీని, మీ బ్యాలట్‌ను (చీట్లచే పరిష్కరించుమార్గము) నేను చూచినాను. మిత్రమా, ఎల్ల ప్రదేశములందును జరుగునది ఒకవిధముగనే. ప్రతిదేశమందును ప్రబలులగువారు తమకు ఇచ్ఛవచ్చినట్లు సంఘమును నడపుచున్నారు. ఇతరులను గొఱ్ఱెమందలకు పోల్పవచ్చును. హిందూదేశమున ఈ ప్రబలు లెవరు అనునది ఇప్పుడు గల ప్రశ్న — వారు మతవిషయమున మహోన్నతినందినవారు. మనసంఘమును నడుపునది వారే; అవసరమైనప్పుడు మనసాంఘికనియమములను,

సాంఘికాచారములను మార్చునదియు వారే; వారిమాటలను మనము నోరెత్తక విని, వారి ఆజ్ఞను శిరసావహింతుము. మన పద్ధతిలోగల విశేషమిది; ఇతరదేశములందువలె "మెజారిటీ", "వోటు", "బ్యాలటు" మొదలగువానివలని అనావశ్యకమైన ఆర్భాటము, గందరగోళము, తత్సంబంధములగుపోరాటములు, మనదేశమున నుండవు. అంతయే.

వోటు, బ్యాలటు మున్నగువానివలన పాశ్చాత్యదేశములలో సామాన్యమానవునకు లభించునంతటి లౌకిక విషయజ్ఞానము మనకు లభింపదనుట నిజమే; కాని రాజ్యవ్యవహారనిర్వహణ మనుపేర ఇతరులను దోచుకొని, ప్రజాసామాన్యముయొక్క జీవిత రక్తమునే క్రోలి, బలిసి క్రొవ్వుగొను వర్గపువారుకూడ యూరపులోవలె మనదేశమున లేరు. ఈ రాజ్యతంత్రజ్ఞుల వ్యవహారనిర్వహణరంగమునకు వెనుక చూపట్టు ఘోరదృశ్యమును—అట్టి తరుణములం దభ్యసింపబడు ఆ లంచగొండితనపు ఉన్మత్తావేశనృత్యములు, ఆ పట్టపగలింటిదోపిళ్లు, మానవులుచేయు ఆపిశాచతాండవములు—మిత్రమా, నీ వెన్నడేని చూచుట తటస్థించెనేని, మానవునిగూర్చి నిరాశాగ్రస్తుడ వగుదువు! "పాలుకొనువారి కొఱకు ఇంటింటికిపోయి విచారింపవలెను, కాని కల్లుదుకాణము మనుష్యులతో క్రిక్కిఱిసియుండును. సౌశీల్యభూషితయగు స్త్రీకి మానమునుకాపాడుకొనుపాటి బట్టయేనియు దొరకదు, కాని బజాఱుకెక్కినస్త్రీ మోయలేనన్ని సొమ్ములు పెట్టుకొని కులుకగలదు".* ద్రవ్యసమృద్ధిగలవారు దేశపరిపాలనమును తమచేతనుంచుకొని, ప్రజలలోని సారము నంతయు పీల్చి పిప్పిచేసి, పరదేశములలో యుద్ధముచేసి చచ్చుటకు వారిని సైనికులుగా పంపు

---

* ఇది యొక కవిభావము. చిత్తశుద్ధినిగాని, సద్గుణమునుగాని లక్షింపక, ఇంద్రియములకు ఇంపుగూర్చు విషయములకే ప్రాముఖ్యమిచ్చు సంసారవిధానము నిచట కవి చిత్రించినాడు.

చున్నారు. విజయము సిద్ధించెనేని, రణాంగణమున ఆ ప్రజలు తమరక్తము నర్పించి సంపాదించిన ధనముతో బొక్కసములు నిండించుకొనుమార్గ మిది. ఇక ఆ వశవర్తులగు ప్రజలవిషయ మేమి? రక్తమును సమర్పించుటొక్కటే వారి కార్యము! ఇదియే రాజ్యతంత్రము! మిత్రమా, ఉలికిపడకుము; ఆ వ్యూహాములో చిక్కుకొని మైమఱవకుము.

ప్రప్రథమమున ఈ విషయము గ్రహించుటకై యత్నింపుము. శాసనములను మనుష్యుడు నిర్మించునా, మనుష్యుని శాసనములు నిర్మించునా? ద్రవ్యమును మనుష్యుడు ఆర్జించునా, మనుష్యుని ద్రవ్యము ఆర్జించునా? పేరుప్రతిష్ఠలను మనుష్యుడు సంపాదించునా, మనుష్యుని పేరుప్రతిష్ఠలు సంపాదించునా?

మిత్రమా, మొదట "మనుష్యుడ"వు కమ్ము; అప్పుడు ఇవియు, ఇతరములును తమంతటతామే నిన్ను వెదకుకొనివచ్చును. హేయమగు ఆ అసూయను, కుక్కలవలె ఒకరితోనొకరు చిన్న చిన్న జగడములాడుకొనుచు మొఱుగుచు ఉండుటను విడనాడుము; సదుద్దేశములను, సత్సాధనములను, నైతికపౌరుషమును, చేపట్టి ధీరుడవై యుండుము. మానవజన్మ మెత్తినందుకు, చేటుచెంద జాలని జాడలను నీ వెనుక నిలిపిపొమ్ము. "ఓ తులసీ,† నీవు ఈ ప్రపంచములో మొదట ప్రవేశించినప్పుడు లోకము సంతసించెను, నీవు ఏడ్చితివి. నీవు ప్రపంచమును వదలిపోవునప్పుడు నీకై లోకము ఏడ్చునట్లును, నీవు ఆనందముతో నవ్వుచుండునట్లును ఏర్పడువిధము లగు కార్యము లొనర్చుచు జీవితము గడపుము". ఇట్లు చేయగలిగితివేని, నీ మనుష్యనామము సార్థకమగును. చేయ లేవేని, నీవు పుట్టి ఏమిచేసినట్టు?

---

† తులసీదాసు కవి, భక్తుడు, హిందీరామాయణకర్త. కవి తనకుతానే ఇచ్చట బోధించుకొనుచున్నాడు. పారమార్థికభావపూర్ణములును, ప్రాపంచిక జనులకు హితోపదేశరూపములును, అగు ఇట్టి వాక్యములు ఆ గ్రంథమున ఎన్నియో కలవు.

మిత్రమా నీవు పిదపగ్రహింపవలసినవిషయ మిది: మనము ఇతరజాతులయొద్దనుండి నేర్చుకొనవలసిన విషయములు ఎన్నియో కలవు. తాను నేర్చుకొనవలసినవిషయము ఇంకేదియు లేదనిచెప్పు వాడు అవసానదశకు వచ్చియున్నాడనుట స్పష్టము. తనకు సర్వము తెలియునని పలికెడుజాతియు వినాశదశకు వచ్చివేయుచున్నది. "నాకు ఊపిరియున్నంతకాలము నేను నేర్చుకొనుచునే ఉండెదను". కాని మనము ఈ సందర్భమున గమనింపవలసినవిషయ మొకటి కలదు —— ఇతరులయొద్దనుండి కైకొనినవాని నన్నిటిని మనమార్గమునకు అనురూపముగానుండునట్లు మార్చుకొనవలెను. ఇతరులు నేర్పగలదంతయు మనకుకలదానిలో చేర్చుకొందుము గాని స్వకీయమైనదాని నంతయు చెక్కు-చెదరకుండ కాపాడుకొనుటకై జాగ్రత్తపడవలెను. ఇందుకు ఒక ఉదాహరణము గమనింపుడు. యూరపుదేశీయులరీతిగా నేను వంటచేయించుకొనగోరితి ననుకొనుము. భోజనకాలమున యూరపుదేశీయులు కుర్చీలపై కూర్చుందురు, మనము నేలపై కూర్చుందుము. యూరపియనులను అనుకరించుటకై నా భోజనమును బల్లపైనుంపుమని నేను గంటకెక్కు-వకాలము కుర్చీపై కూర్చుంటినేని, నా కాళ్లు యమద్వారమున కరుగ సంసిద్ధములై, నేను బాధతో గిజగిజ లాడసాగుదును. ఇందుకు నీవు ఏమందువు? వారిరీతి వంటకము నారగించుచున్నను, భోజనకాలమున నేను మనరీతిగ నేలపైనే కూర్చుండవలెను. ఇట్లే మనము ఇతరులయొద్ద ఏమినేర్చినను, దానిని మనమార్గమునకు అనురూపముగా మార్చుకొనవలెను; మన జాతీయవిశిష్టతను పూర్తిగా నిలుపుకొనవలెను. నన్నొక ప్రశ్న నడుగనిమ్ము: "మనుష్యుడు ఉడుపులనుధరించునా, ఉడుపులు మనుష్యునిధరించునా?" అసాధారణబుద్ధిమహితు డగువాడు ఏ ఉడుపులు ధరించినను, గౌరవమును పొందును; కాని నావంటి బుద్ధిహీనులు, చాకలిగాడిదవలె ఎన్ని ఉడుపులు ధరించినను, వారి నెవ్వరును లక్ష్యపెట్టరు.

ఉపోద్ఘాతముగా ఉపకరించుకొఱకై వ్రాయబడినపూర్వోక్త విషయము సుదీర్ఘముగా పరిణమించినది. కాని ఇదంతయు చెప్పిన పిదప ఈ రెండుజాతులను పోల్చిచూచుట కొంత తేలికయగును. వారు మంచివారే—మనమును మంచివారమే. "ఒకరిని నిందించి మఱొకరిని స్తుతింప ననువుపడదు; త్రాసులోని రెండుచిప్పలును సమములుగనే నిలిచియున్నవి". కాని మంచితో తరతమత్వములు కలవు గదా. అంతయే.

మనుష్యునినిర్మాణమునందు మూడువస్తువులు కలవని మన వారు చెప్పుదురు: శరీర మొకటి, మనస్సు ఒకటి, ఆత్మ యొకటి. ఈ యన్నిటిలో వెలుపలిదగు శరీరమును మొదట కైకొందము.

శరీరమునందు ఎన్నివిధములగు భేదములు కలవో మొదట చూడుము — ఎన్నివిధములగు ముక్కులు, ముఖములు, వెంట్రుకలు, పొడవులు, రంగులు, లావులు మున్నగునవి! శరీరపురంగులు రక్తమిశ్రణమువలన వివిధముగా మాఱుచుండునని మానవశాఖాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఆయాప్రదేశములయొక్క శీతోష్ణస్థితులు రంగును కొంత మార్పగలిగియున్నను, మార్పునకు ముఖ్యకారణముమాత్రము వంశపారంపర్యసంబంధమైనదే. లోకమున అత్యంత శీతలప్రాంతములందుగూడ నల్లరంగులవారు కానిపింతురు. అట్లే మిక్కిలి ఉష్ణప్రాంతములందు తెల్లనివా రుందురు. అమెరికా ఖండములోని కనడాదేశమునందలి ఆదిమవాసులదియు, ఉత్తరధ్రువప్రాంతములలోని ఎస్కిమోలదియు శ్వేతవర్ణము కాదు; కాని భూమధ్యరేఖాప్రాంతమునందలి బార్నియో, సెలెబీసు మున్నగుచోట్లలోని ఆదిమవాసులది శ్వేతవర్ణము!

హిందూశాస్త్రములప్రకారము హిందువులలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య కులములు మూడును, హిందూదేశమునకు వెలుపలనుండు చీన, హూణ, దరద్, పహ్లవ, యవన, ఖశ

జాతులన్నియు ఆర్యజాతులు. శాస్త్రములలో పేర్కొనబడిన ఈ చీనులు ఆధునికచీనాదేశీయులుకారు. అసలు ఆ కాలపు చీనాదేశస్థులకు చీనులు అను పేరేలేదు. కాశ్మీరభూమియొక్క ఈశాన్యప్రాంతమున చీనులు అను నొక బలిష్ఠజాతి — ప్రత్యేకమైనది — ఉండెను. హిందూదేశమునకును ఆఫ్ఘనిస్థానమునకును మధ్య — ఇప్పుడు కొండజాతులు నివసించుచోట — దరదులు ఉండిరి. ప్రాచీన చీనులలో శేషించినవారు నేటికిని కొలదిమంది కలరు. 'దరదిస్థానము' ఇప్పటికిని నిలిచియేయున్నది. కాశ్మీర చరిత్ర మగు 'రాజతరంగిణి'లో బలిష్ఠమగు దురద్ప్రభుత్వపు ఆధిపత్యము పెక్కుతడవలు సూచింపబడియున్నది. హిందూదేశపు వాయవ్యప్రాంతములందు ప్రాచీన హూణజాతి చాలకాలము ప్రాభవము నెఱపెను. థిబెట్‌వారు ఇప్పుడు హూణులు అనుపేరు ధరించియున్నారు. కాని ఈ హూణశబ్దము "హియూన" శబ్దము కానోపును. మనువు పేర్కొనిన 'హూణులు' ఇప్పటి థిబెట్ వారు కారు. కాని ఈ ఆధునిక థిబెట్‌జాతీయులు ప్రాచీనకాలపు ఆర్యహూణులయొక్కయు, మధ్యఆసియానుండి థిబెట్‌కువచ్చిన ఇతర మొగల్‌జాతులయొక్కయు కలయికవలన ఏర్పడినవారని తలచుటకు అవకాశము కలదు. ఇప్పటికిని ఆర్యజాతివారిమాదిరి మొగములును, కన్నులును కలవారు థిబెట్‌లో కొన్నిప్రాంతములందు కలరు అని రష్యాదేశపు బాటసారియగు ప్రియేవలస్కీ, ఫ్రాన్సుదేశపు బాటసారియగు డుక్ డార్లియాన్ వ్రాసియున్నారు. గ్రీసుదేశస్థులకు యవనులు అను పేరు ఏర్పడెను. ఈ పేరుయొక్క మూలమునుగూర్చి చాల చర్చ జరిగినది. ఐయోనియాలోనుండిన గ్రీసుజాతివారిని సూచించుటకు ఈ యవనశబ్దము మొదట వాడబడెననియు, కావున అశోకచక్రవర్తియొక్క పాళీశాసనములలో గ్రీసువారు "యోనులు" అని పేర్కొనబడిరనియు, అనంతర కాలమున ఈ యోనశబ్దములోనుండి సంస్కృతయవనశబ్దము ఉత్పత్తియయ్యెననియు కొందఱిభావము. ప్రాచీనభారతచరిత్ర

విచారకులు కొందఱు ఈ యవనశబ్దము గ్రీకులపేరే కాదు అని చెప్పుదురు. కాని ఈ యభిప్రాయములన్నియు తప్పే. 'యవన' అనునదే మూలశబ్దము. హిందువులే గాక, పురాతనకాలపు ఇజిప్తుదేశస్థులును బాబిలోనియా దేశస్థులును గ్రీసువారిని యవన నామముననే పేర్కొనియుండుట ఈ భావమునకు ఆధారము. పహ్లవశబ్దము పహ్లవీభాష మాటలాడుచుండిన ప్రాచీనపారశీకుల నామము. ఖశ శబ్దము పర్వతప్రాంతములందును, హిమాలయము లందును నివసించు అసంపూర్ణనాగరికజాతులపేరై యున్నది. ఆ శబ్దము ఆ యర్థమున నేటికిని వాడుకలో నున్నది. ఆ అర్థమున నేటి యూరపియనులు ఖశ జాతివారి సంతతికి చెందినవారు. అనగా ప్రాచీనకాలమున అనాగరికులై యుండిన ఆర్యజాతు లన్నియు ఖశ జాతికి చేరినవే.

ఆర్యుల శరీరచ్ఛాయలు కొంచెము ఎఱుపుకలిసిన తెల్లని వనియు, వారివెండ్రుకలు నల్లనివిగా గాని, ఎఱ్ఱనివిగా గాని ఉండె ననియు, ముక్కులు తిన్ననివి అనియు, నేత్రములు దిద్దితీర్చినట్లు చక్కనివనియు ఆధునికశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఇట్టి మఱి కొన్ని వర్ణనలుకూడ వారు ప్రకటింతురు. కపాలపు ఆకృతి కేశవర్ణమునుబట్టి కొంచెము మాఱుచుండునట. శరీరచ్ఛాయ నల్లగానుండుట పరిశుద్ధమగు (అమిశ్రితమగు) ఆర్యరక్తము నల్లని జాతులతో కలియుటచేత కలిగిన మార్పట. హిమాలయపు సరిహద్దులకు పడమట ఇప్పటికిని అమిశ్రితార్యరక్తముగల కొన్ని జాతులు కలవనియు, తక్కినవా రందఱును మిశ్రరక్తముగలవా రనియు, కాకపోయినచో వారు నల్లగా నుండుటకు కారణము లేదనియు వారి అభిప్రాయము. కాని ఈ యూరపియను విద్వాంసులు ఇప్పటి లోకవిషయము నెఱిగియుండవలెను. దక్షిణ హిందూదేశములోని కొన్నిప్రాంతములందు ఎందఱో శిశువులు ఎఱ్ఱనివెండ్రుకలతో పుట్టుదురు; ఆ వెండ్రుకలు రెండుమూడేం డ్లకు నల్లగామాఱును; హిమాలయములందు అనేకులకు ఎఱ్ఱని

వెంద్రుకలును, నీలపురంగో, బూడిదరంగో కల కన్నులును ఉండును.

ఆ పండితులు తమలో తాము వివాదము లాడుకొందురు గాక; మొదటినుండియు తాము ఆర్యులమని చెప్పుకొనువారు హిందువులే. పరిశుద్ధరక్తముగలవారైనను, మిశ్రితరక్తముగల వారైనను, హిందువులు ఆర్యులే; అది నిస్సంశయ విషయము. ఆర్యులమగు మనలను — మనము నల్లనివారమగుటచే — యూరపియనులు ఒల్లరేని, తాము మఱియొక పేరు పెట్టుకొందురు గాక; — అందుతో మన కేమి పని ?

శరీరచ్ఛాయ నలుపైనను, తెలుపైనను ఒకటే; ప్రపంచ జాతు లందఱిలో హిందువుల రూపరేఖలే మనోజ్ఞతమమైనవి. వారు నా జాతివారౌటచే నే నేమియు డంబము లాడుటలేదు, అతిశయోక్తు లాడుటలేదు — నేను చెప్పినది లోకమందంతటను ప్రఖ్యాతమైనదే. హిందూదేశములోతప్ప మఱెచ్చట అధిక సాఖ్యాకుల కింత చక్కని రూపరేఖలు కలవు? మన దేశస్థుల శరీరములు తక్కినదేశస్థుల శరీరములకంటె ఎంతో అధికముగా వెలికి తోచుచుండియు, అవి సుందరములుగా కానిపించుటకు వానియం దెంత యాధిక్యముండవలె నను విషయమునుకూడ గణింపవలెను. మనోజ్ఞముగా బట్టలు ధరించుటచే, సౌందర్య హీనులు చక్కనివారుగా కానిపించుటకే ఇతరదేశములందు సర్వదా చేయబడు మహాప్రయత్నము.

మన ఆరోగ్యముకంటె పాశ్చాత్యుల ఆరోగ్యము ఎంతో అధికమనుట నిస్సంశయము. పాశ్చాత్యదేశములందు నలువదేండ్ల పురుషులును, ఏబదేండ్ల స్త్రీలును వయసువారే. మంచి యాహారము భుజించుటయు, చక్కగా ఉడుపులు తొడుగుకొను టయు, శీతోష్ణస్థితి అనుకూలముగానుండు దేశమున నివసించు టయు, — అన్నిటికంటెను ముఖ్యము, — కొద్దిపాటివయస్సుననే

వివాహమాడకుండుటయు, ఇందుకు నిస్సంశయముగా కారణములు. మనలోనుండు బలిష్ఠజాతులను వారు వివాహమాడు వయస్సు ఏదియో, విచారింపుము. కొండజాతులవారిని — ఉ. గూర్ఖాలను, పంజాబీలను, జాట్‌లను, ఆఫ్రిదీలను — వారు ఏ యీడున వివాహమాడుదురో కనుగొనుము. పిదప మీ శాస్త్రములను చదివి చూడుము — బ్రాహ్మణులకు ముప్పదేండ్లును, క్షత్రియులకు ఇరువదైదేండ్లును, వైశ్యులకు ఇరువదేండ్లును నిర్ణీతవయస్సు. దీర్ఘాయుర్విషయమందును, శారీరక, మానసిక పటుత్వవిషయము లందును, పాశ్చాత్యులకును మనకును ఎంతో వ్యత్యాసము కలదు. నలువదేండ్లు వచ్చునప్పటికి మన ఆసలును, శారీరక మానసిక బలములును ఉడుగ నారంభించును. వారో, ఆ యీడున యువజనబలోత్సాహములతో, ఆశాపరిపూర్ణులై, జీవితప్రారంభ దశయందే ఉందురు.

మనము శాకాహారులము, — మన వ్యాధులలో ఎక్కువ పాలు జీర్ణకోశసంబంధమైనవి. మన వృద్ధులు — స్త్రీలు, పురుషులు — జీర్ణకోశవ్యాధులవలననే ప్రాయికముగా మరణింతురు. పాశ్చాత్యులు మాంసాహారులు, — వారి వ్యాధులలో ఎక్కువపాలు హృదయసంబంధములు; వారి వృద్ధులు — స్త్రీలు, పురుషులు — హృద్రోగములవలనను, శ్వాసకోశవ్యాధులవలనను ప్రాయికముగా మరణింతురు. పశ్చిమదేశీయ భిషగ్వరేణ్యు డొకడు కాలికములగు జీర్ణకోశవ్యాధులుగలవారు వ్యాకుల శీలురుగా, త్యాగశీలురుగా ఉందురనియు, హృదయసంబంధ రోగములును, శరీరోర్ధ్వభాగసంబంధములగు ఇతర రోగములును కలవారు, అవసానకాలముదనుక, ఆశ, విశ్వాసము కలిగియుందు రనియు చెప్పియున్నాడు; విషూచీవ్యాధినొందినవాడు ప్రథమము నుండియు మరణభీతికలిగియుండును; క్షయవ్యాధినొందినవాడు చివరి గడియవఱకును తనరోగము కుదురునని ఆశాపూరితుడై యుండును. హిందువు లెల్లయెడలను మరణమునుగూర్చియు, త్యాగమును

గూర్చియు మాటలాడుచుండుట కిదియే కారణమా యని నా చికిత్సకమిత్రుడు ప్రశ్నించుటకు యుక్తియుక్తమగు అవకాశము కలదేమో! ఈ ప్రశ్నకు నాకింతదనుక తృప్తికరమగు సమాధానము లభింపలేదు. కాని అది సత్యబీజముకలదిగనే తోచుచున్నది. పూర్ణముగా విచారింపదగినదిగనే ఉన్నది.

మనదేశమున దంతరోగములు, కేశరోగములు కలవారు అరుదు; పాశ్చాత్యదేశములందు సహజములును (జన్మసిద్ధములు), జాడ్యగ్రస్తములుకానివియు, అగు దంతము లుండువారు అరుదు. బట్టతల లంతటను కానిపించుచుండును. మనస్త్రీలు ఆభరణధారణార్థము ముక్కులను చెవులను కుట్టించుకొందురు. పాశ్చాత్యదేశమున అగ్రశ్రేణులవారు ఈ కాలమున ఇట్లంతగా చేయుటలేదు గాని, వారు అందముగా కానిపించుటకై, నడుములను బిగియ నణచికొని, వెన్నెముకను వక్రమొనర్చుకొని, తత్ఫలముగా యకృత్ప్లీహములకు స్థానభ్రష్టత్వముకల్పించి, ఆకృతిని వికృతమొనర్చుకొని, మరణవేదన లనుభవించుచుందురు. ఇందుపై దుస్తుల భారము! ఆ దుస్తులు ధరించుటవలన తమరూపరేఖలు సాధ్యమైనంతసుందరముగా కానిపింపజేసికొనవలెనని వారి భావము. వారి పాశ్చాత్యవేషమునం దొకగుణముమాత్రము కలదు. అది పనిచేయుటకు మనవేషముకంటె అనుకూలముగానుండును. ధనికజాతిస్త్రీలు సభలలో ధరించు దుస్తులుతప్ప, తక్కినస్త్రీలవేషము ప్రాయికముగా వికృతమైయుండును. మనస్త్రీల చీర, పురుషుల చోగా (ఒకవిధమగు అంగరకా), చాప్కాన్ (మఱొకవిధపు పొడుగుకోటు), తలగుడ్డ, వేషసౌందర్యవిషయమున ఎట్టి పోటీకైన ఆగగలవు. వదులుగానుండి, స్వాభావికములగుమడతలు పడియుండు ఉడుపులతో బిగుతుగా, శరీరమునకు అంటియుండు దుస్తులు సౌందర్యమున దీటురావు. కాని మనబట్టలన్నియు వదులై, మడతలుపడియు, ఉండుటచేత పనిచేయుటకు తగియుండవు. పనిచేయునప్పు డవి చెడి, నిష్ప్రయోజనమైపోవును.

పాశ్చాత్యదేశమున *ఫ్యాషన్ అనున దొకటి కలదు. వారి ఫ్యాషన్ ఉడుపులందును, మనది ఆభరణములందును, ఏర్పడి యుండును. కాని ఈ దినములలో మనఫ్యాషన్ బట్టలకుకూడ కొంచెముకొంచెముగా వ్యాపించుచున్నది. స్త్రీలదుస్తులఫ్యాషన్‌కు 'పరీ' (పేరిస్) పట్టణము, పురుషులదుస్తులఫ్యాషన్‌కు లండన్ పట్టణము, కేంద్రస్థానములు. ప్రాయికముగా 'పరీ' నగరములోని నటీజనము ఈ ఫ్యాషన్‌లను నిర్మింతురు. ఆ కాలమున ప్రఖ్యాతికెక్కియుండు నటి ఏ క్రొత్తఫ్యాషన్ దుస్తులు ధరించునో, అట్టి దుస్తులు ఫ్యాషన్‌కెక్కియుండువా రందఱును వెనువెంటనే అవలంబింతురు. దుస్తులుకుట్టు గొప్పకంపెనీలవారు ఫ్యాషన్‌లను ఈ కాలమున నిర్మించుచున్నారు. పాశ్చాత్యదేశములందు దుస్తులు కుట్టించుకొనుటయందు ప్రతియేట ఎన్నికోట్ల పౌండ్లు వ్యయమొనర్చుచున్నారో మనము ఇంచుకైన ఊహించుకొనజాలము. దుస్తులుతయారుచేయుపని యిప్పుడొకరీతి విద్య (ఒకవిధమైన సైన్స్) గా ఏర్పడినది. — ఏయేబాలికల దేహచ్ఛాయకును, కేశవర్ణమునకును, ఏయేరంగుదుస్తులు అనురూపమైయుండునో, ఏయే బాలిక దేహమునం దేయే అంగముల వైఖరి మఱుగుపఱుపవలెనో, ఏయే అంగములను సాధ్యమైనంత అనుకూలముగా కనబఱుపవలెనో,—ఇవియు, ఇట్టి ఇతరమ ఖ్యాంశములనేకములును, దుస్తులుకుట్టువారు అత్యంతజాగరూకతతో ఆలోచించి నిర్ణయింపవలెను. మఱొకవిషయము : అత్యున్నత పదవిలోనుండుస్త్రీలు ఏ దుస్తులు ధరించుచుందురో, ఇతరులు కూడ అట్టివానినే ధరింపవలెను, లేనిచో వారు ''కులము''ను కోల్పోవుదురు!! ''ఫ్యాషన్'' అనగా ఇట్టిది.

మఱియు ఈ ఫ్యాషన్ దినదినము మాఱిపోవుచుండునని చెప్పవచ్చును; సంవత్సరపు నాలుగు ఋతువులతో అది నాలుగు

* అందమునకు, నాగరికతకు, ఎప్పటికప్పుడు ఏర్పఱుపబడు వైఖరి.

సార్లు మార్పునొందుట తప్పదు. అప్పుడుకాక ఇంక పెక్కుసార్లు కూడ మారును. ధనికశ్రేణులు తమదుస్తులను నిపుణులని ప్రఖ్యాతిగన్న కంపెనీలవారియొద్ద అప్పటప్పటి ఫ్యాషన్ ప్రకారము కుట్టించుకొనుచుందురు; మధ్యశ్రేణులవారు తమయిండ్లయొద్ద దర్జీ స్త్రీలచేత వానిని కుట్టించుకొందురు; లేక తామే కుట్టుకొందురు. క్రొత్తఫ్యాషన్ అంతకుముందటిచివరిఫ్యాషన్‌కు మిక్కిలి చేరువమై యుండెనేని, అందుకు అనుకూలముగా వారిదుస్తులలో మార్పులు చేసికొందురు; అట్లుండదేని క్రొత్తదుస్తులు కొనితెచ్చుకొందురు. మాఱిపోయిన ఫ్యాషన్‌దుస్తులను ధనికశ్రేణులు తమఆశ్రితులకును, సేవకులకును ఇచ్చివేయుదురు. గొప్పయింటిస్త్రీల పరిచారికలును, అనుచారిణులును వానిని అమ్ముకొందురు. అవి యూరపియనులచే ఆఫ్రికా, ఆసియా, ఆస్ట్రేలియా ఖండములలో స్థాపింపబడిన ఉపనివేశములకు (కాలనీస్) ఎగుమతిచేయబడి, అచట మరల ఉపయోగింపబడును. అపారధనసంపన్నులు తమదుస్తులన్నిటిని 'పరీ' పట్టణమునుండియే తెప్పించుకొందురు; సామాన్యధనికులు తమదేశములోనే, తమదర్జీలయొద్దనే, ఆ ఫ్యాషన్ ప్రకారము వానిని కుట్టించుకొందురు. కాని ధనికస్త్రీలటోపీలు (హేట్స్) మాత్రము 'పరీ'లో చేయబడినవిగానే ఉండవలెను. నిజమునకు, ఇంగ్లండు స్త్రీలయొక్కయు, జర్మన్‌స్త్రీలయొక్కయు దుస్తులు అందముగా నుండవు; వారు ప్రాయికముగా—అగ్రశ్రేణులలోను, ధనికశ్రేణులలోను, చేరిన ఏ కొలదిమందియోతప్ప — 'పరీ' పట్టణపు ఫ్యాషన్లను అనుసరింపరు. కావున ఇతర దేశస్త్రీలు వారిని హేళనవాక్కులాడి పరిహసించుచుందురు. కాని ఇంగ్లండులోని పురుషులుమాత్రము మిక్కిలిచక్కని దుస్తులే తొడిగికొనుట వాడుక. అమెరికాదేశపుస్త్రీపురుషు లెల్లరును మిక్కిలి ఫ్యాషన్ గలదుస్తులనే ఉపయోగింతురు. విదేశవస్తువులు తమదేశమునకు వచ్చుటను నిరోధించుటకై అమెరికాగవరన్మెంటువారు, లన్‌డన్, 'పరీ' పట్టణములనుండి దిగుమతిచేయబడిన దుస్తులపై అత్యధిక

మగు సుంకపుపన్నులను విధించినను, ఆ దేశస్త్రీలు తమదుస్తులను 'ప-రీ' పట్టణమునుండియు, పురుషులు లణ్డన్ పట్టణమునుండియు తెప్పించుకొనుచునే ఉందురు. వివిధరీతులును, వర్ణములునుగల ఉన్ని, సిల్కు, బట్టలను అంగడివీధికి క్రొత్తగా చేర్చుచుండుటకు వేనవేలమంది స్త్రీపురుషులు వినియోగింపబడుదురు. ఆ బట్టలతో సర్వవిధములగు దుస్తులు వేనవేలమంది తయారుచేయుచుందురు. తమదుస్తులు ఆ నాటిఫ్యాషన్‌కు పూర్తిగా సరివచ్చినగాని, గొప్ప వారగు స్త్రీ పురుషులు — ఫ్యాషన్లననువర్తించువారి పరిహాస వాక్కులకు గురికాక — వీధులలో నడువజాలరు. మనదేశమున దుస్తులఫ్యాషన్‌కు సంబంధించిన ఈ బాధయంతయు లేదు గాని, అందుకుబదులు ఆభరణములఫ్యాషన్ కొంతవఱకు కలదు. ఆ దేశములందు సిల్కు*, ఉన్ని మున్నగు వానితో వ్యాపారము చేయువర్తకులు ఫ్యాషన్ ఎట్లు మాఱుచున్నదో, ఎట్టివస్తువులు జనాదరణలోనికి వచ్చుచున్నవో, ఎల్లప్పుడును మిక్కిలి జాగ రూకతతో కనుపెట్టియుందురు. లేక, స్వబుద్ధిని వినియోగించి వా రొక క్రొత్తఫ్యాషన్‌ను కనిపట్టి, జనులదృష్టిని అది ఆకర్షించునట్లు చేయ యత్నింతురు. ఇట్టియత్నమున ఏ వర్తకుడైనను విజయ మందెనేని, అతనియదృష్టము పండినట్లే — అతనిజీవితమెల్ల ధన్య మైనట్లే. మూడవ నెపోలియన్ ఫ్రాన్సుచక్రవర్తిగా ఉన్నప్పుడు, అతనిభార్య అయ్‌గెనీ చక్రవర్తిని పాశ్చాత్యప్రజలెల్లరచేతను ఫ్యాషన్‌యొక్క అవతారముగా ఎన్నబడుచుండెను. కాశ్మీర దేశపుసాలువులయం దామెకు అమితమగు అభిమానము కలదు. కావున ఆమె కాలమున కోట్లవిలువగల కాశ్మీరపుసాలువులు ఏటేట యూరపుదేశమునకు ఎగుమతిచేయబడుచుండెను. మూడవ నెపో లియన్ పదవీభ్రష్టుడైనపిదప, ఫ్యాషన్ మాఱిపోయినది.

---

* సిల్కు అనగా పట్టు. కాని ఈ కాలమున ఆంధ్రులు ఈ రెంటికిని భేదమును పాటింతురు. కావున సిల్కు శబ్దమే ఇచట వాడబడినది.

కాశ్మీరదేశపుసాలువు లిప్పుడు కొనువారే లేరు. ఇక మనదేశపు వర్తకులన్ననో, వారు వాడుకపడియున్న ప్రాతమార్గముననే ఎల్లప్పుడును నడచుచుందురు. కాలపుమార్పు ననుసరించి, పాశ్చాత్యుల దృష్టి నాకర్షింపగల క్రొత్తవైఖరిని దేనిని వారు ఊహించి ప్రవేశపెట్టజాలరు. అందుచే ఆ దేశమున వారిసరకుల కిప్పుడు గిరాకి నశించినది. కాశ్మీరదేశమునకు గాఢమగుదెబ్బ తగిలినది. అందలి ధనాఢ్యులగు గొప్పవర్తకులు, హఠాత్తుగా దివాలాతీసిరి.

నీకు కన్నులుండి, చూడగలిగితివేని, ఈ ప్రపంచము నీది కాకపోయిన, నాది; ఎవరైన, మఱొకరికై వేచియుందురను కొంటివా? ప్రపంచమునందు వివిధభోగములను, సుఖములను ఆకర్షించుకొనుటకు పాశ్చాత్యులు క్రొత్తఉపాయములను, క్రొత్తమార్గములను కనిపట్టుచున్నారు. వారు పదికన్నులతో స్థితిగతులను కనుపెట్టిచూచుచున్నారనియు, ఇనూ్నఱుచేతులతో పని చేయుచున్నారనియు చెప్పవచ్చును; ఇకమనమో, శాస్త్రకారులు గ్రంథస్థమొనర్పనివాని నెన్నటికిని చేయము. కావున మనము ప్రాతవడి నలిగినత్రోవనే నడుచుచున్నాము. స్వబుద్ధిజనితమగు మార్గములను, క్రొత్తమార్గములను, అవలంబించుయత్నమే మనకు లేదు. అందుచే అట్లుచేయు సామర్థ్యముకూడ మన కిప్పుడు నశించినది. దేశమంతయు అన్నముకొఱకు ఆకసముపగుల నఱచుచు, పస్తులుపడి చచ్చుచున్నది. ఇది ఎవరి తప్పు? మనదే. ఈ శోచనీయస్థితినుండి వెలువడుమార్గము మన మేమైన అవలంబించుచున్నామా? — ఏమియులేదు, పూర్ణానుస్వారము! మన మొనర్చునదంతయు డాంబికమగు నిరర్థకప్రసంగములవలన గొప్ప శబ్దముచేయుట. మఱేమియు చేయుటలేదు. మీ ఇఱుకుమూలనుండి బైటికివచ్చి, కన్నులు పూర్తిగా తెఱచి, ప్రపంచ మెట్లు పురోగమించుచున్నదో, ఏల చూడరాదు? అట్లు చేసినచో, మానసము వికసించి, ఆలోచనాశక్తియు, సమయోచితకార్యాచరణశక్తియు తమంతటతామే వచ్చును. దేవాసురులకథ మీరు

తప్పక ఎఱిగియుందురు. దేవతలకు తమ ఆత్మయందును, భగవంతునందును, అనంతరజీవితమునందును విశ్వాసముకలదు. అసురులు ఈ జీవితమునకే ప్రాముఖ్యమిచ్చి, ప్రాపంచికభోగము లనుభవించుటకును, శరీరసౌఖ్యములు సర్వవిధముల పొందుటకును సర్వదా ప్రయత్నించుచుందురు. దేవతలు అసురులకంటె ఉత్తములో, అసురులే దేవతలకంటె ఉత్తములో మే మిచ్చటచర్చింపబూనుకొనలేదు. కాని పురాణములలోని వర్ణనలనుబట్టి పురుషనామమునకు అసురులు దేవతలకంటె నిజమున కెక్కువ అర్హతకలవారనియు, దేవతలకంటె ఎంతోఅధికపౌరుషముగలవారనియు తోచును. దేవతలు అసురులకంటె అనేకవిషయములందు హీనులనుటకు సందేహములేదు. ఇప్పుడు ప్రాచ్య పాశ్చాత్యములను గ్రహించుటకు, హిందువులు దేవసంభూతులనియు, పాశ్చాత్యులు అసురసంభూతులనియు భావించుటకంటె ఉత్తమమార్గము కానిపించుటలేదు.

దేహనైర్మల్యమునుగూర్చి, వారిభావములను మొదట చూచెదము. నైర్మల్యమనగా శారీరక, మానసికనైర్మల్యము. ఇందు మొదటిది జలము మొదలగువాని నుపయోగించుటచేత కలుగును. హిందువు జలమును మిక్కిలి ధారాళముగా ఉపయోగించును. శారీరకనైర్మల్యవిషయమున లోకములో మఱేజాతివారును హిందువుతో సరిరారు. ఏ కొలదిజాతులందో తప్ప నీటిలోదుమికి, స్నానముచేయుట హైందవేతరజాతులందు అపురూపము. హిందూదేశముతోడి సంపర్కము కలిగిన పిదప ఆంగ్లేయులు దానిని వారి దేశమునందు ప్రవేశపెట్టిరి. విద్యార్జనార్థము ఇంగ్లండులో నివసించినవారి నడిగిచూచినయెడల ఆ దేశమున స్నానమున కేర్పాట్లు ఎంత తక్కువగా నుండునో తెలియవచ్చును. పాశ్చాత్యులు స్నానముచేసినప్పుడు — అది వారమున కొకసారి — తమ లోపలిఉడుపులను మార్చుకొందురు. ఇప్పుడిప్పుడు ధనాఢ్యు లనేకులు అనుదినము స్నానముచేయు

చున్నారు. అమెరికనులలో స్నానమాడువారిసంఖ్య ఇంకను అధికము; జర్మనులు ఎప్పుడో ఒకనాడే స్నానముచేయుట! ఫ్రెంచివారును తదితరులును మిక్కిలి అరుదుగాగాని స్నానమే చేయరు! స్పెయిను, ఇటలీదేశములు ఉష్ణప్రాంతములు. కాని అక్కడ స్నానము ఇంకను అరుదు! వారు వెల్లుల్లిని సమృద్ధిగా తిని, రేయుంబవళ్లు అమితముగా చెమర్చుచుందురు. కాని స్నానమాడరు! దీనిని ఊహించి చూడుడు. దయ్యములే వారియొద్ద నుండి పాఱిపోయితీరవలెను. ఇక మానవులమాట చెప్పవలెనా! పాశ్చాత్యదేశమున స్నాన మనగా అర్థమేమి? ముఖము, తల, చేతులు — అనగా ఉడుపులతో కప్పబడని అంగములు : వీనిని మాత్రము కడుగుకొనుటే స్నానము! కోటీశ్వరుడగు నా మిత్రు డొకడు నన్నొకతడవ 'ప రీ' కి రమ్మని ఆహ్వానించెను. 'ప రీ' పట్టణము ఆధునిక నాగరికతకు ప్రధానస్థానము, — భోగములకును, ఫ్యాషనుకును, ఉల్లాసజీవనమునకును, ఇహలోకస్వర్గప్రాయమైనది, — విద్యలకు, కళలకు కేంద్రము. నా మిత్రుడు రాజగృహమునుబోలు నొక హోటల్‌లో నాకు బస యేర్పాటుచేసెను. అచ్చటి భోజనపు ఏర్పాట్లు రాజాధిరాజులకు అర్హమై యుండును. కాని స్నానమునకు ఏర్పాట్లు? — ఆ పేరే అచట కానరాదు! దీనిని నేను రెండుదినములు మౌనముతో భరించితిని — చివరకు ఇక భరింపజాలక, నా మిత్రుని కిట్లు తెలుపవలసివచ్చెను : "ప్రియసోదరా, ఈ రాజభోగము నీవు, నీవారు, మాత్రమే అనుభవింతురుగాక! ఈ చోటినుండి తప్పించుకొనుటకు నేను ఉక్కిరిబిక్కిరులాడుచున్నాను. ఇంత ఉష్ణవాతావరణమున స్నాన సౌకర్యము లేనేలేదు! ఇదేస్థితియందు ఇంకను కాలము జరిగినచో నాకు పిచ్చిపట్టి, పిచ్చికుక్కవలె నగు అపాయము అత్యధికముగా కలదు". ఇది విని నా మిత్రుడు నాకై మిక్కిలి చింతించి, హోటలు అధికారులపై మిక్కిలి కినిసి, నాతో ఇట్లనెను : "నిన్ను నేనిక ఇచట ఉండనీయను, పోయి మంచి అనుకూల

ముగానుండు స్థలమును కనుగొనెదము రమ్ము". అచటి ప్రధానములగు పంద్రెండు హోటళ్లు తిరిగి చూచితిమి, కాని అందెందును స్నానమునకు తావే లేదు! ప్రత్యేకస్నానమందిరములు కొన్ని కలవు, అచటి కెవరైననుపోయి నాలుగైదురూపాయలిచ్చి ఒకతడవ స్నానముచేయువచ్చును. సర్వేశ్వరా, ఏమిస్థితి! ఒక వృద్ధస్త్రీ స్నానపుతొట్టిలో ప్రవేశించి వెంటనే మరణించెనని ఆనాటి యపరాహ్ణముననే నేనొక వార్తాపత్రికలో చదివియుంటిని!! ఈ విషయమున డాక్టర్ల అభిప్రాయము ఏమిగానున్నను, నిజమైన కారణ మిది యని నాకు తోచుచున్నది: అన్నినీళ్ల నొక్కసారిగాచూచి వానిలో ప్రవేశించుట కామె కదియే మొదటిసారియైయుండును; ఆ ఆకస్మికాఘాతమునకు శరీరము తాళజాలక ఆమె ప్రాణములను గోల్పోయియుండును. ఇందు అతిశయోక్తి ఏమాత్రమును లేదు. ఇక రష్యాదేశస్థులును, మఱికొందఱును ఈ విషయమున చెప్పరానంత అపరిశుద్ధముగానుందురు. థిబెట్ మొదలు, ఆ ప్రాంతపు దేశము లన్నిటిలోను ఇదే స్థితి. కాని అమెరికా హోటలులన్నిటిలో ఒక స్నానముల గదియు, అందు గొట్టపునీరువచ్చు సౌకర్యమును కలవు.

ఇక ఇచటి (మనదేశపు) స్థితి ఎంత భిన్నమో చూడుడు. హిందువులమగు మన మేల స్నానముచేయుదుము? — పాపము కలుగు నను భీతిచేత. పాశ్చాత్యులు తమ ముఖమును, చేతులను కడుగుకొనుట పారిశుద్ధ్యార్థమై. స్నాన మనగా మనయర్థము దేహముపై నీళ్లుపోసికొనుట — చమురు, మురికి అంటుకొనియుండి కానిపించుచున్నను సరే! ఇక మన దాక్షిణాత్యసోదరులు మిక్కిలి పొడవుగా, వెడల్పుగా నుండు బొట్లతో తమ్ము నలంకరించుకొందురు! వానిని పూర్తిగా పోగొట్టుట కొక ప్యూమిస్ రాతితో * రుద్దివేయవలసియుండునేమో! మనదేశమునందు

* మఱకలు పోగొట్టుటకై ఆ పేరుగల రాతితో పాశ్చాత్యదేశములందు రుద్దుదురట.

స్నానముచేయుట సులభవిషయము — ఎచ్చటనో ఒకచోట నీటిలో మునుగుట; కాని పాశ్చాత్య దేశములందిట్లు కాదు. వారు ఒక మోపెడు ఉడుపులను మొదట తీసివేసికొనవలెను—అందు ఎన్ని గుండీలు, ఎన్ని కొక్కెములు, ఎన్ని నేత్రాకృతిగల బెజ్జము లుండునో! మనదేహము ఇతరులకు అగపడిన మనకేమియు తప్పు కాదు. వారిలో అది భయంకరమగు దోషము! కాని ఇరువురును—తండ్రి, కొమాళ్లవంటి—మగవారైనచో ఔచిత్య దోషములేదు. స్త్రీలయెనుటమాత్రము ఆపాదమస్తకము బట్ట లుండియే తీరవలెను.

బాహ్యపారిశుద్ధ్యాచారము దీర్ఘకాలానుభవమున — ఆచారములన్నిటివలె — కొన్ని యెడల, ఆచారవిరుద్ధమగు నొక హింసాత్మక కార్యముగా ఏర్పడును. శరీరసంబంధములగు సర్వ విషయములు ఏకాంతస్థలముననే చూచుకొనవలె నని యూరప్ దేశస్థుని అభిప్రాయము. సరియే. "ఇతరులు చూచుచో ఉమ్మి వేయుట అసభ్యప్రవర్తనము. ఇతరుల యెదుట నోటిని పుక్కిలించి కడుగుకొనుట అవమానకరము". అందుచే, ఇతరుల ఆక్షేపణకు వెఱచి, వారు భోజనానంతరము నోటిని కడుగుకొనరు. తత్ఫల ముగా దంతములు క్రమక్రమముగా క్షీణించును! సంఘమునకు వెఱచి, నాగరికతాభిన్న ప్రవర్తనమని తలచి, పారిశుద్ధ్యమును విడనాడుట కిది యొక నిదర్శనము. మనది ఇందుకు విరుద్ధమగు "అతి" — ఎల్లరయెదుట పుక్కిలించి నోటిని కడుగుకొనుట, వీథిలోకూర్చుండి వమనమువచ్చినట్లు శబ్దములుచేయుచు, ఇట్లొన ర్చుట—ఇదియు హింసాక్రియయే అనిపించుకొనును. ఇట్టిపనులను వివిక్తస్థలమునందు, నిశ్శబ్దముగా, చేయవలసినదే; కాని సంఘము నకువెఱచి అవి మానుకొనుటకూడ అంతటితప్పే.

మఱియు, ఆయా దేశముల శీతోష్ణస్థితులయందు అనివార్య ములైయుండు ఆచారములను సంఘము ప్రశాంతభావమున భరించి, ఆమోదసూచకప్రవర్తనము నవలంబించును. మనదేశమువంటి

ఉష్ణదేశమునందు మనము చెంబులకొలది నీళ్లు త్రాగుదుము; అట్లొనర్చువారు త్రేచుట నెట్లు తప్పించుకొనగలరు? పాశ్చాత్య దేశములందు త్రేచుట మిక్కిలి అసభ్యము. కాని అచ్చట భోజన కాలమందు చీది, జేబులోని చేతిగుడ్డలో అది దాచుట నిరాక్షేపము. మన కది రోతపని. వారి దేశమువంటి శీతలదేశము నందు అప్పుడప్పు డట్లు చేయుట అనివార్యము.

హిందువులమగు మనకు పెంటయనగా మిక్కిలి ఏవగింపు. కాని నిజమునకు మనము పెక్కుతడవలు మాలిన్యము కలిగియే యుందుము. పెంటను తాకినయెడల మనము స్నానముచేయుదుము—పెంటయనగా మన కంత ఏవగింపు. కావున మనకు అది దూరముగానుండుటకొఱకై, దానిని కుప్పచేసి ఇంటిసమీపమున ఉంతుము. అచట అది ముఱుగుడువాసన కొట్టుచు, క్రుళ్లుచుం డును; దానివిషయమున మనము జాగ్రత్తతీసికొనవలసినది ఒక్క సంగతిలోనే—దానిని తాకకూడదు! కాని మనము వాస్తవముగా నరకముననే నివసించుచున్నామని ఎన్నడైన తలచుకొనుచున్నామా? ఒక విధమగు అపరిశుద్ధతనుండి తప్పించుకొనుటకు, మనము మఱొక అపరిశుద్ధతను — అంతకంటె అధికాపకారము చేయుదానిని—ఆశ్రయించుచున్నాము. ఒకకీడు పొందకుండుటకై మనము మఱొకకీడును — దానికంటె బలిష్ఠమగు దానిని — పెన్నంటుచున్నాము. ఇంటిలో పెంటను కుప్పచేసియుంచుకొనువాడు పాపముచేయుచున్నాడు. అందుకసందేహములేదు. తత్ప్రతిఫల మగు శిక్షకొఱ కతడు జన్మాంతరముదనుక వేచియుండ నక్కఱలేదు. త్వరలోనే అది అతని తలమీదికి ఒఱిగిపడును — ఈ జన్మముననే.

లక్ష్మీ (భాగ్యదేవత) సరస్వతుల (విద్యాదేవత) ప్రసాద దృష్టి ఈ కాలమున పాశ్చాత్యదేశీయులపై ప్రసరించుచున్నది. వారు భోగ్యవస్తువుల నార్జించుకొనుటతో తృప్తిపడి ఊరకుండరు. వారికార్యము లన్నిటియందును వా రొకవిధమగు సౌందర్యమును,

నాజూకును అర్థింతురు. తమగృహములందును, పరిసరములందును, ప్రతి విషయములోను, వా రొకసర్వతోముఖలాలిత్యమును మాడగోరుదురు. ఆ లక్షణము మనకును ఒకేకాలమున — దేశమున ద్రవ్యసమృద్ధియు, ఐశ్వర్యమును ఉన్నప్పుడు — ఉండెడిది. ఇప్పుడు అపరిమితదారిద్ర్యదశ మనకు పట్టియున్నది, కాని మనస్థితి యింకను చెడునట్లు, మనము రెండువిధములుగా వినాశమును తెచ్చి పెట్టుకొనుచున్నాము. అవియివి. మనకు సొంతమైనదానిని పాఱవేసికొనుట, ఇతరుల ఆదర్శములను, ఆచారములను ఆర్జించుకొనుటకు వ్యర్థప్రయాసముపడుట. మనకు ఉండిన జాతీయసుగుణములు క్రమక్రమముగ అదృశ్యములగుచున్నవి, పాశ్చాత్యుల సుగుణములు మనకేవియు పట్టువడుటలేదు! కూర్చుండుట, నడచుట, మాటలాడుట మున్నగువానియందు మన కొక సాంప్రదాయిక విశిష్టలక్షణము పూర్వకాలముననుండినది, — అది ఇప్పుడు నశించినది కాని పాశ్చాత్యమర్యాదావిధములను ఆర్జించుకొనుశక్తి మనకులేదు. పూర్వకాలానుగతమై మనకులభించిన పారమార్థిక ఆచారకర్మములు, సాధనలు, చదువులు మనము గంగలోకలిపి కొట్టుకొనిపోవునట్లు చేసితిమి, — కాని వానికి బదులు క్రొత్తదేదియు, కాలానుగుణ్యమైనది, ఇంకను మనకు ఏర్పడి సుస్థిరతనొందలేదు. ఈ రెంటిమధ్య చిక్కి ఊగులాడుచుండుటలోనే మనప్రస్తుత దురవస్థయంతయుకలదు! భవిష్యత్కాలమున రూపొందవలసిన వంగదేశము ఇంకను సుస్థిరరూపము వహింపలేదు. కళలవిషయముననే మనము అన్నిటిలోనికంటెఎక్కువగా నష్టమునొందినది. పూర్వము మనవృద్ధస్త్రీజనము మనయిండ్లనేలపై, తలుపులపై, గోడలపై కలిపినబియ్యపుపిండితో అనేకవిధములగు చక్కని ఆకృతులను చిత్రించుచుండిరి. అన్నమువడ్డించుటకు అరటియాకులను మనోహరవిధమున కోయుచుండిరి. వివిధభోజనపదార్థములను ఆకులపై అందముగా వడ్డించుటయందు తమకళాభిజ్ఞానము నంతయు వినియోగించుచుండిరి. ఈ కాలమున ఆ కళ లించుమించుగా అన్నియు

అదృశ్యమైపోయినవి. ఇప్పటికిని నిలిచియున్న విప్పుడు నశించు చున్నవి.

మన మెఱుగని క్రొత్తవిషయములను మనము నేర్చుకొని ప్రవేశపెట్టి, అభ్యసింపవలసినదే; కాని ప్రాతవాని నన్నిటిని—ప్రాతవిగానున్నమాత్రముననే, అకారణముగా — ఆమూలము తొలగించియా అట్లొనర్పవలెను? మీరు క్రొత్తవానిని ఏమి నేర్చితిరి?—ఏమియును లేదు; గందరగోళముగా కలిసియుండు కొన్నిమాటలుతప్ప!! వాస్తవోపయోగముగల యే కళను, ఏ విద్యను మీరు ఆర్జించితిరి? పూర్వకాలపు కొయ్యపనితనమును, ఇటుకరాతిపనితనమును దూరగ్రామములకుపోయి యిప్పుడైనను చూడుడు. మీ పట్టణవాసపు వడ్రంగి ఔచితిగల యొకతలుపుల జతనైన చేయలేడు — అవిగుడిసెకై చేయబడినవో, నగరుకై చేయబడినవో కనుగొనుటకష్టము! విదేశీయోపకరణములను కొనుటయుందే వారినేరుపు అంతయును— వడ్రము అనగా అదితప్ప ఇంకేమియు కానట్టు!! అకటా! మనదేశమునందు సర్వవిషయములకు అదేగతిపట్టినది. మనకు స్వకీయమైయుండిన దంతయు అదృశ్యమైపోవుచున్నది, కాని విదేశీయులయొద్ద మనము నేర్చుకొనినది ఉపన్యాసవిద్యయొక్కటియే. చదువుటయు, మాటలాడుటయు మాత్రమే!! ఆహా! వంగదేశీయులును, యూరపులో ఐర్లండుదేశీయులును, ఒకే అచ్చులో నిర్మింపబడినవారు,—అనంతముగా మాట్లాడుట, మాటమాటకు బదులాడుట! వ్యర్థములగు గంభీరప్రసంగములుచేయుటలో ఈ రెండుజాతులవారును అత్యంత నిపుణులు. ఏ కొద్దిపాటి అభ్యాసయోగ్యకార్యము చేయవలసి వచ్చినను వారు ఎందుకును ఎక్కరు,—ఇదియేకాక, జీవితకాలమంతయు వారు ఒకరి నొకరు దూషణవాక్కు లాడుకొనుచు, కలహించుచుందురు.

పాశ్చాత్యదేశస్థులకు తమవస్తువుల నన్నిటిని అందముగా, నిర్మలముగా, ఉంచుకొనుట వాడుక. అతిదరిద్రులుకూడ ఇట్లుంచు

కొనుటకై శ్రద్ధవహింతురు. ఈనైర్మల్యాభ్యాసము వీరికి ఉండియే తీరవలెను. ఏలయన, నిర్మలములగు దుస్తులు లేనివారి నెవ్వరును తమకొలువులో నుంచుకొనరు. వారి పరిచారకులు, పరిచారిణులు, వంటవాండ్రు, మున్నగువారందఱును నిష్కలంకములగు నిర్మలవస్త్రములు ధరింతురు. వారియిండ్లు ప్రతిదినము తుడిచి, కడిగి, దుమ్ముదులిపి, పొందికగా ఉంపబడును. వస్తువులను ఎక్కడెక్కడనో పడవేయక ప్రతివస్తువును దానినిర్ణీతస్థలముననుంచుట మర్యాదతోగూడినప్రవర్తనములో నొకభాగము. వారి వంటయిండ్లు పరిశుద్ధముగా, కాంతిమంతములై కానిపించును,—కూరగాయతొక్కలు మున్నగువ్యర్థవస్తువులు ప్రస్తుతము వేఱుగా నొకపాత్రమున నుంతురు. పిదప వానిని పాకీవాడు దూరముగా కొనిపోయి అందుకై నియమింపబడిన ఉచితస్థలములోపడవైచును. అట్టివస్తువులను వారు రోడ్లమీఁదను, తమదొడ్లలోను పాఱవేయరు.

ధనికుల గృహములును, ఇతరములగు కట్టడములును, అవశ్యదర్శనీయములు, — రేయుంబవళ్లవి సక్రమస్థితిలో, పారిశుద్ధ్యనిధానములై అద్భుతముగా నుంపబడి యుండును! ఇదంతయుకాక, ఇతరదేశములనుండి కళానిక్షేపములగు వస్తువులను సమకూర్చుకొని, వానితో తమగృహముల నలంకరించుకొనుట వారికి వాడుక. ఇక మనవిషయము? మనము — వారివలె — ఇతరదేశ కళారాధకులు చేసిన వస్తువులను తెచ్చుకొనుట — ప్రస్తుతకాలమున — అవసరములేదు నిజమే; కాని మనకుండువానిని నశింపకుండ పదిలపఱుపవలెనా, లేదా? చిత్రకళ (పెయింటింగ్) యందును, స్థాపత్యవిద్య (స్కల్ప్చర్) యందును, వారికిగలంతటి శక్తిని, కౌశలమును, మనము ఆర్జించుకొనుటకు చాలకాలము పట్టును. ఈ రెంటియందు మన కెన్నడును సంపూర్ణనైపుణ్యము లేదు. యూరపియనుల ననుకరించి మన మొకరిద్దఱు రవివర్మలను మనలోనుండి ఉత్పత్తిచేయగలిగితిమి!! కాని అట్టి

కళారాధకులకంటె వంగదేశమున దేవతల "చాల్‌చిత్రము"*లను నిర్మించు మన ముచ్చీలు ఎంతో శ్రేష్ఠము. వారిపనిలో ప్రకాశవంతములగు వర్ణములనైనను ఉపయోగింతురు. రవివర్మ యొక్కయు, ఇతరులయొక్కయు చిత్రములుచూచి, మనము లజ్జచే తలదాచుకొనవలసియుండును!! జయపూరువారు నిర్మించు బంగారు మలామా విగ్రహములును, మనకు పూర్వకాలమునుండి ఉన్న దుర్గాదేవి "చాల్చిత్రములు"ను అంతకంటె ఎంతో బాగుగానుండును. యూరపియనుల స్థాపత్యవిద్యనుగూర్చియు, చిత్రకళనుగూర్చియు, నా యభిప్రాయములను పిమ్మట మఱేదో యొక అవసరమున తెలిపెదను. అది అపారవిస్తృతిగల విషయము. కనుక ఇచ్చట దానిలో ప్రవేశించుట కనువుపడదు.

పాశ్చాత్యుల పాచకవిద్యనుగూర్చి ఇపుడు కొంత చెప్పెదను, వినుడు. మన దేశపు వంటయందు గల పారిశుద్ధ్యము మఱే దేశమునను లేదు; కాని ఆంగ్లేయుల భోజనమునందుగల వేళానియమము, ఏర్పాటు, నైర్మల్యము మనకు లేదు. మన వంటవాడు ప్రతిదినము స్నానముచేసి, గుడ్డలను మార్చుకొనినపిదపగాని వంటయింటిలో అడుగుపెట్టడు; అన్ని పాత్రములను, ప్రొయ్యిని, మంటితోను నీటితోను శుద్ధపఱచును; తనముఖమునుగాని, ముక్కునుగాని, దేహములో మఱేఅంగమునుగాని తాకుట తటస్థించెనేని, అతడు చేతులను కడుగుకొనియే భోజనపదార్థమేదైన తాకును. పాశ్చాత్య పాచకుడు స్నానము చేయుటయే అరుదు; మఱియు, తాను చేయు వంటకము నత డొక గరిటెతో తీసి. రుచిచూచును. ఆ గరిటెనే మరల అందులో ముంచుట అతనికి తప్పుగా తోపదు. చేతిగుడ్డనుతీసి అతడు దానిలో గాఢ

* "చాల్‌చిత్రము" అనగా దేవతావిగ్రహములపై నుంపబడు ధనురాకృతిగల "మందహాసము". పురాణకథలలోని స్త్రీ పురుషుల ఆకృతులు అందు చిత్రింపబడియుండును. దాని అంచున అలంకారికమగు పనితనముండును.

ముగా చీదును; మరల ఆ చేతితోనే పిండిపిసుకుటయు తటస్థింప వచ్చును! వెలుపలినుండి వచ్చునప్పుడు చేతులను కడుగుకొనవలె నని అతనికి తోపనే తోపదు! వచ్చిన వెంటనే వంటపని ప్రారంభించును. కాని ఇవన్నియు ఇట్లున్నను, అతడు హిమస్వచ్ఛములగు దుస్తులను, టోపీని ధరించియుండును. అతడు పిసుకు పిండిపై నెక్కి త్రొక్కినను, త్రొక్కును, — ఏలయన శరీరపుభారమంతయు అందుపైని పడినయెడల పిండి చక్కగా మెదుగును గదా, ముఖముమీది చెమట దానిలో నొకవేళ కలిసినను సరే! (అదృష్టవశమున, ఈ కాలమున ఈ పనినంతయు యంత్రములు నిర్వహించుచున్నవి). ఈ అకార్యమంతయు ముగిసి, రొట్టె తయారైనపిదప, దాని నొక పింగాణిపాత్రమున నుంచి, హిమసన్నిభమగు తెల్లని తువాలుతో కప్పి యొకపరిచారకుడు — నిష్కలంకమగు దుస్తులను, తెల్లని చేతిజోడును (గ్లోవ్సు) ధరించినవాడు — తీసికొనిపోయి, నిర్మలమగు గుడ్డతో కప్పబడిన భోజనపు బల్లపై నుంచును. ఇచట జ్ఞప్తియుంచుకొనుడు — వట్టివ్రేళ్లతో అతడు దేనిని తాకకుండుటకై చేతిజోడును ధరించును!

ఇక మన వంటవిషయము చూడుడు. మన వంటబ్రాహ్మణుడు మొదట స్నానముచేసి పరిశుద్ధుడై, పిదప చక్కగా తోమబడిన పాత్రములతో వంటచేయును. కాని దానిని మనకు పెట్టునది నేలమీద. మట్టి, ఆవుపేడ కలిపినపిదప ఆ నేల అలుకబడును. అతనివస్త్రము, ప్రతిదినము ఉదుకబడినను, ఎన్నడు ఉదుకబడనంత మురికిబట్టవలె కానిపించును. మనభోజనపాత్రముగా అప్పుడప్పుడు వాడబడు అరటియాకు — చినిగిపోయియున్న యెడల — మనకు వడ్డించు పులుసు తడినేలతోను, ఆవుపేడతోను కలియు నవకాశము కలిగి ఒక అద్భుతరుచి నిచ్చును!!

మనము చక్కగా స్నానముచేసినపిదప, చమురు జిగటతో అంటుకొనుచుండు ఒక మురికిబట్టను ధరింతుము. పాశ్చాత్య

దేశపువారు స్నానమాడక, మురికి దేహముపై, నిష్కలంక పారి శుద్ధ్యముగల ఉడుపులను ధరింతురు. ఈ విషయమును చక్కగా గ్రహింపవలెను — ఏలయన ప్రాచ్యపాశ్చాత్యములకు గల ముఖ్యభేద మిచ్చటనే. హిందువుయొక్క అంతర్ముఖత్వము, పాశ్చాత్యునియొక్క బహిర్ముఖత్వము వారి ఆచారములందును, అభ్యాసములందును స్పష్టముగా కానిపించును. హిందు వెప్పుడును ఆంతరదృష్టిని, పాశ్చాత్యుడు బాహ్యదృష్టిని కలిగియుండును. హిందువు వజ్రముల నొక గుడ్డపేలికతో చుట్టియు, పాశ్చాత్యుడు మట్టిపెళ్లను బంగరుబరణిలో పెట్టియు దాతు రని చెప్పనగును! హిందువు స్నానముచేయుట తన దేహమును నిర్మలముగా నుంచు కొనుకొఱకు. తన బట్ట ఎంతమురికిదై యున్నను అతనికి అక్కఱ లేదు; పాశ్చాత్యుడు స్వచ్ఛములగు ఉడుపులను ధరింప జాగ్రత్త పడును, దేహముపై మురికియున్న నేమి! హిందువు తనగదులను, తలుపులను, నేలను, ఇంటిలోపలి ప్రతిభాగమును, సొబగుగా, నిర్మలముగా ఉంచుకొనును — ముఖద్వారము వెలుపల పెంట కుప్ప యున్న అతని కేమి? పాశ్చాత్యుడు ఇంటినేలపై ప్రకాశ వంతములును, మనోహరములును అగు తివాసీలను పఱచి యుంచును. వానిక్రింద ఎంతో మట్టియు, ఎంతో దుమ్మును కూడియుండును. కాని అవి కనిపింపకయున్నప్పుడు, ఆక్షేపణ యేమికలదు? హిందువు తన తూచ్చుకాలువలను రోడ్డుమీద ప్రవహింపనిచ్చును — ఆ కంపు అంతగా ఆక్షేపణీయము కాదు! పాశ్చాత్యదేశమున తూచ్చుకాలువలు భూమిక్రింద నుండును — అవి విషజ్వరమూలములు!! హిందువు ఆంతరపారిశుద్ధ్యమును, పాశ్చాత్యుడు బాహిరపారిశుద్ధ్యమును గమనించును.

నిర్మలశరీరముపై నిర్మలవస్త్రములు ధరించుట ఆదర్శస్థితి. పుక్కిలించి నోటిని కడుగుకొనుట, పండ్లు తోముకొనుట, ఇట్టి వన్నియు చేయవలసినదే, — కాని ఇతరులయెదుట కాదు. కాపురముండు ఇండ్లును, వీథులును, రోడ్లును, బాహ్యప్రదేశము

లన్నియును, నిర్మలముగా నుంపవలెను. వంటచేయువాడు తన బట్టలనే కాక, దేహమునుకూడ పరిశుభ్రముగా నుంచుకొనవలెను. మఱియు సొంపుగా, పరిశుద్ధముగా నుంపబడిన స్థలమందు భోజనము చేయవలెను. భోజనకాలమున నిష్కలంకములగు గిన్నెలును, పాత్రములును ఉపయోగపఱుపవలెను. ఆచారములను, లేక నిర్ణీతవిధులను, అనుష్ఠించి జీవించుట, ఆస్తికధర్మజీవనమునకు ప్రథమసోపానము. అందులో మనశ్శరీరపారిశుద్ధ్యము, సర్వతోముఖపారిశుద్ధ్యము, అత్యంతప్రధానభాగము. ఆచారబాహ్యాగు ఆస్తికధర్మజీవనము నెన్నటికైన అవలంబింపగలడా? అనాచారపరులు పడు పాట్లు ప్రత్యక్షముగా చూచుటలేదా? అనాచారజనితదుర్భరబాధల నెఱిగియు, మనము సరియగు జీవితవిధానము నభ్యసింప బనిలేదా? మన్నెపుజ్వరము, విషూచి, మహామారి వ్యాధులు హిందూదేశమున శాశ్వతనివాస మేర్పఱచుకొని, లక్షలకొలదిజనులను కొనిపోవుచున్నవి. ఇది యెవరితప్పు? నిస్సంశయముగా మనదే. మన ఆచారహీనత అపారము!!

* "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః"
(ఆహారశుద్ధివలన మనస్తత్త్వము — అంతస్తత్త్వము — పరిశుద్ధమగును. అంతస్తత్త్వము పరిశుద్ధమైనప్పుడు స్మృతి — ఆత్మపరిపూర్ణానుభూతి జ్ఞప్తి — సుస్థిరత నొందును) అనెడు సుప్రసిద్ధస్మృతివాక్యములోని సత్యమును హైందవమతశాఖలన్నియు అంగీకరించును. కాని ఆహారశబ్దము ఇంద్రియముల కన్వయించునని శంకరాచార్యుడును, ఆహారమున కన్వయించునని రామానుజుడును చెప్పుదురు. ఈ రెంటిని సమన్వయపఱచు టెట్లు? రెండును అవసరమేయని సర్వశాఖలును చెప్పుచున్నవి. కావున మన మా మాటను రెంటికిని అన్వయింపవలెను. నిర్మలాహారము లేనిది ఇంద్రియములు తమతమ ధర్మముల నెట్లు నిర్వర్తింపగలవు?

---

* ఛాందోగ్య ఉపనిషత్ - VII-26-2.

అపరిశుద్ధాహారమువలన ఇంద్రియములు గుణగ్రహణశక్తి కొంత కోలుపోవుటో, సంకల్పవిరుద్ధప్రవర్తనము నవలంబించుటో, జరుగు నని ప్రతివాడును అనుభవసిద్ధముగా నెఱుగును. అజీర్ణవ్యాధి వలన వస్తుస్వరూపము వికృతినొందుననియు, తత్ఫలముగా, ఒక వస్తువు మఱొకవస్తువువలె కానిపించుననియు, ఆహారవిహీనత వలన కనుచూపును, ఇతరేంద్రియశక్తులును, బలహీనతనొంది, మందగించుననియు అందఱు ఎఱుగుదురు. అట్లే, ఒక్కొక్క విధ మగు ఆహారము ఒక్కొక్కవిధమగు మనశ్శరీరస్థితిని కలిగించునని మన కెన్నియోసార్లు తెలియవచ్చుచుండును. హైందవసంఘ మెంతో నిష్కర్షగా అనుష్ఠింపవలెనని నియమించియుండు—"ఇట్టి యాహారమును పుచ్చుకొనవలెను, ఇట్టియాహారమును పుచ్చుకొన కూడదు" అని నియమించియుండు — విధులకు మూలము ఈ సత్యమే. కాని పెక్కుసార్లు మన మీమూలసత్యమును — కొబ్బరివంటి దానిని మఱచి, పై పెంకువిషయమై కలహించుచు, దానిని జాగ్రత్తగా కాపాడుకొనుచుందుము.

ఆహారమును అపరిశుద్ధ మొనర్చునని తాను చెప్పు మూడు విధములగు దోషములను పరిత్యజింపుడని రామానుజాచార్యులు నియమించియున్నారు. ఇందు మొదటిది జాతిదోషము; అనగా కొన్ని ఆహారవస్తువులందు, ఉ. వెల్లుల్లి, నీరుల్లి మొదలగువాని యందు గల సహజదోషము. ఇవి ఉద్రేకకారకస్వభావముగలవి. వీనిచే మనస్సు కలతనొందును; అనగా బుద్ధి ఆందోళనమందును. రెండవది ఆశ్రయదోషము; అనగా ఆ ఆహార మెవరియొద్దనుండి వచ్చునో వానిస్వభావమున గల దోషము. దుష్టుడు తెచ్చిన ఆహారము తిన్నవానిని అపవిత్రునొనర్చి, దుష్టభావములు తలప జేయును; సత్పురుషుడు తెచ్చిన ఆహారము ఉన్నతభావకారణ మగును. ఇక మూడవది నిమిత్తదోషము. అనగా మురికి, దుమ్ము, పురుగులు, వెండ్రుకలు మున్నగు బాహ్యదోషముల కూడికచే కలుగు దోషము. అట్టి ఆహారమువలనకూడ మనస్సు

అపవిత్రమగును. ఈ మూడుదోషములలో ప్రతివాడును జాతి, నిమిత్తదోషములను తప్పించుకొనవచ్చును; కాని ఆశ్రయ దోషమును తప్పించుకొనుట ఎల్లరకును సులభముకాదు. ఈ ఆశ్రయ దోషపరిహారార్థమే మన కీ కాలమున ఇంతఅధికముగా నుండు అస్పృశ్యత, "నన్ను ముట్టుకొనకుము!" "నన్ను ముట్టుకొనకుము!" అను మాట ఉచ్చరింపబడుచున్నది. కాని పెక్కుతడవలు ఈ నియమముయొక్క నిజమగు అర్థమును మనము గ్రహింపక, విపరీతప్రవర్తన మవలంబించుటచే ఇది చిత్రమును, ఘోరమును అగు మూఢభావముగా ఏర్పడును. ఇట్టి విషయములలో మనము లోకాచారమునుకాక, మన ఆచార్యప్రముఖు లవలంబించిన మార్గము లవలంబింపవలెను. చైతన్యదేవునివంటి మహాపురుషులయొక్కయు, ఇతరమతాచార్యసత్తములయొక్కయు జీవితములను చదివి వారు ఈ విషయమున జనసామాన్యముతో ఎట్లుప్రవర్తించినది కనుగొనవలెను. భోజన విషయక జాతిదోషపరిశీలనమునకు హిందూదేశమంత అనుకూలమైనది ఇంకేదియు లేదు. ప్రపంచమునగల సర్వదేశజాతులలో హిందువులే నిర్మలతమమగు ఆహారమును కైకొందురు; ఆహార జాతినైర్మల్యము హిందూదేశమునందే మిక్కిలిజాగ్రత్తగా పాటింపబడును. మన మిప్పుడు నిమిత్తదోషవిషయమున ఇంకకొంత ఎక్కువశ్రద్ధ వహించుట మంచిది. అది మనకిప్పుడు అపారమగు కీడు కలిగించుచున్నది. బజారునందలి మిఠాయిదుకాణములలోని తినుబండారములు కొనుట ఇప్పుడు మిక్కిలి అలవాటైపోయినది; ఆ పదార్థములు నిమిత్తదోషదృక్పథమునుండి ఎంత మలినములో మనమే ఆలోచింపవచ్చును. బయటపెట్టి అమ్ముటచే, రోడ్లమీది మురికి, దుమ్ము, చచ్చినపురుగులు వానికి అంటుకొనుననియు, అవి యొక్కొక్కసారి ఎంతోప్రాతవడి, ఎంతోభ్రష్టములైయుండుననియు ఊహింపనగును. ప్రతియింట నిప్పుడు సాధారణముగా కానిపించు అజీర్ణవ్యాధికిని, పట్టణవాసుల నింతగా బాధించుచుండు

మధుమేహవ్యాధికిని, బజాఱులో అమ్ము మలినాహారమును పుచ్చుకొనుటయే కారణము. ఈ వ్యాధులు గ్రామజనుల కింతగా లేకుండుటకు ముఖ్యకారణము లూచీ (పూరీవంటి ఒకభక్ష్యము), కచూరీ (వంగదేశములో ప్రజలు తిను భక్ష్యవిశేషము) మున్నగు విషసమానాహారమును స్వేచ్ఛగా కొనదగిన అంగళ్లు అచ్చట లేమియే. ఈ విషయమును నేనింకను సవివరముగా పిదప ప్రస్తావింతును.

ఆహారమునుగూర్చి పూర్వపు సామాన్యనియమము నిచట సంగ్రహముగా తెలిపితిని. కాని దీనినిగూర్చి అభిప్రాయభేదము లెన్నియో ఉండినవి, ఇప్పుడును ఉన్నవి. మఱియు పూర్వకాలము నందువలె ఇప్పుడును మాంసాహారభక్షణము మంచిదా చెడ్డదా, లేక శాఖాహారముతోనే జీవింపవలెనా, మాంసాహారము మనకు క్షేమంకరమా కాదా అనువిషయమునుగూర్చి గొప్పవాదము కలదు. జంతువులనుచంపుట న్యాయ్యమా, అన్యాయ్యమా, అను విషయమునకూడ గొప్పవివాదము కలదు. ప్రాణముతీయుట పాపమనియు, అట్లెన్నడును చేయరాదనియు ఒకపక్షమువారు వాదింతురు. "మీ అభిప్రాయము ఆదరణార్హముకాదు! జంతుహింస చేయక బ్రతుకుటయే అసాధ్యము" అని రెండవపక్షమువారు ఇందుకు బదులుచెప్పుదురు. ఈ విషయమున శాస్త్రములుకూడ భిన్నాభిప్రాయముకలవై, బుద్ధిని కలవరపెట్టుచున్నవని చెప్పవలెను. "యజ్ఞములలో జంతువధము చేయుడు" అని శాస్త్రమొకచోట ఆదేశించుచున్నది, మఱొకచోట అదియే "ప్రాణము నెప్పుడుగాని తీయవలదు" అని చెప్పుచున్నది. యజ్ఞములలోతప్ప జంతువధచేయుట పాపమని హిందువులమతము, కాని యజ్ఞములో వధింపబడినపిదప ఆ జంతువుయొక్క మాంసమును భుజించుసుఖమును నిరాక్షేపముగా అనుభవింపవచ్చును. గృహమేధికి విధింపబడిన నియమములలో నతడు శ్రాద్ధాదులగు కొన్నియవసరములందు జంతువులను వధింపవలసియున్నది. ఆ యవసరములందు

జంతువధ చేయనిచో అతడు పాపమొనర్చినట్లు నిందార్హుడగును. శ్రాద్ధములకును మఱికొన్ని కర్మములకును ఆహూతులైనవారు అచ్చట పెట్టబడు మాంసాహారమును భుజింపనిచో, వారు జన్మాంతరమున జంతువులై పుట్టుదురని మనువు చెప్పియున్నాడు. కాని జైనులును, బౌద్ధులును, వైష్ణవులును ఇందుల కాక్షేపించి "హిందూశాస్త్రాదేశములను మేము విశ్వసింపము; వధాచరణము ఎట్టిసందర్భములలోను సహింపరాదు" అని చెప్పుదురు. బౌద్ధ చక్రవర్తి అశోకుడు యజ్ఞములొనర్చువారిని, ఏ కర్మమునగాని ఆహూతులకు మాంసాహారము పెట్టువారిని, శిక్షించుచుండెనని గ్రంథములలోనున్నది. ఆధునిక వైష్ణవులు కొంతచిక్కగు స్థితిలో నున్నారు. వారు దేవతలుగా పూజించు రాముడును, కృష్ణుడును మద్యపాన మాంసభక్షణము లొనర్చినట్లును, సీతాదేవి గంగానదీ దేవతకు మాంసమును, అన్నమును, ఒకవేయికుండల మధువును సమర్పింప మ్రొక్కుకొన్నట్లును, రామాయణ* మహాభారతములలో నున్నది.

---

* సీతామాదాయ బాహుభ్యాం మధుమైరేయకం శుచి।
పాయయామాస కాకుత్స్థః శచీమిన్ద్రో యథామృతమ్॥
మాంసాని చ సుమృష్టాని వివిధాని ఫలాని చ।
రామస్యాభ్యవహారార్థం కింకరాస్తూర్ణమాహరన్॥

(సీతను రెండుబాహువులతో కౌగిలించుకొని కాకుత్స్థవంశీయుడగు రాముడు శుచియగు మైరేయమధువును, ఇంద్రుడు శచీదేవిచేత అమృతము త్రాగించినట్లు, ఆమెచేత త్రాగించెను. సేవకులు శీఘ్రముగా సుమృష్ట మాంసాహారములను, వివిధములగు ఫలములును రామునకు వడ్డించిరి.)

సురాఘటసహస్రేణ మాంసభూతౌదనేన చ।
యక్ష్యే త్వాం ప్రీయతాం దేవి పురీం పునరుపాగతా॥

(దేవీ, మాయెడ కృప కలిగియుండుము; నేను మరల పురమును చేరినపుడు వేయికుండలకల్లుతోను, మాంసముతోవండిన యన్నములోను, నిన్ను పూజింతును.) రామాయణము.

మాంసాహారము ఆరోగ్యహాని చేయునా చేయదా, శాకాహారమునకంటె అది బలప్రదమా కాదా అను వివాదములు పాశ్చాత్యదేశములందు కలవు. మాంసాహారులు సర్వవిధశారీరక వ్యాధులచే పీడింపబడుదురని యొకపక్షమువారు చెప్పుదురు. రెండవపక్షమువా రిది యొప్పుకొనక ఇట్లందురు: "అదంతయు మిథ్యాకల్పనము. అదియే నిజమైనయెడల ఆరోగ్యవిషయమున సర్వజాతులలో హిందువులు అధికతములై యుండియుండవలెను; మాంసాహారమే ప్రధానముగాగల ఆంగ్లేయులు, అమెరికనులు మున్నగు బలిష్ఠజాతులు, సర్వవిధజాడ్యముల కాహుతియై ఇప్పటికి నిర్మూలులై పోయియుందురు". మేకమాంసము మేకబుద్ధిని, పందిమాంసము పందిబుద్ధిని, చేపమాంసము చేపబుద్ధిని కలిగించునని యొకపక్షమువా రందురు. అట్లైనచో ఉరలగడ్డలు ఉరలగడ్డబుద్ధిని, కూరగాయలు కూరగాయబుద్ధిని — అనగా జడమును, నిర్జీవపదార్థతుల్యమును అగు బుద్ధిని — కలిగించుననియు వాదింపదగునని రెండవపక్షమువా రందురు. బుద్ధి జడమై నిర్జీవపదార్థమువలె మాంద్యమునొందియుండుటకంటె సజీవజంతుబుద్ధి యుండుట శ్రేష్ఠతరముకాదా? శాకాహారపు రసాయనిక సమ్మేళనమందు గల వస్తువులే జంతువులందుగూడ గలవని యొకపక్షమువారు చెప్పుదురు. రెండవపక్షము ఈ వాదమును పరిహసించి, "ఏల? అవి గాలిలోకూడ కలవు, కావున పోయి వాయుభక్షణచేసి జీవింపుడు" అందురు. శాకాహారులు మిక్కిలి పాటుపడనోపుదురనియు, గాఢమై దీర్ఘపరిశ్రమ మవసరమైయుండు కార్యము

---

ఉభౌ మధ్వాసవక్షీబావుభౌ చన్దనరూషితౌ।
స్రగ్విణౌ వరవస్త్రౌ తౌ దివ్యాభరణభూషితౌ॥

(ఆ కృష్ణార్జునులు ఇరువురును ఇప్పపూవుకల్లు త్రాగి, చందనచర్చితాంగులై, పూదండలను, శ్రేష్ఠములగు వస్త్రములను, దివ్యాభరణములను ధరించియుండుటను నేను చూచితిని.)

మహాభారతము, ఉద్యోగపర్వము, అధ్యా: 58, 5.

నిర్వహింపజాలుదురనియు ఒకపక్షమువారు వాదింతురు. "అది నిజమైనచో, శాకాహారజాతులు ప్రపంచమున అగ్రతమపదవియం దుండవలెననియు, వా రట్లు ఉండలేదనియు, మాంసాహారులే బలిష్ఠులై అగ్రతమపదవి నాక్రమించియున్నారనియు" రెండవ పక్షమువా రిందుకు బదులు చెప్పుదురు. "హిందువులను, చీనా దేశస్థులను చూడుడు, ఎంత దౌర్భాగ్యస్థితియం దున్నారో. వారు మాంసభక్షణము చేయరు; అన్నము, అనేకవిధశాకములు తిని ఆ యల్పాహారముతో ఎట్లో జీవించుచుందురు. వారి దుఃస్థితిని పరికింపుడు. జపానుదేశస్థులుకూడ ఇట్టి దుర్దశయందే ఉండిరి. కాని మాంసాహార మారంభించిన పిదప వారి స్థితియే మాఱి పోయినది. హైందవ సైనికదళములలో ఒకటిన్నరలక్షమంది ఆ దేశీయులగు సిపాయీలున్నారు; అందు ఎందరు మాంసాహారులో చూడుడు. వారిలో శ్రేష్ఠతములగు సిక్కులు, గూర్ఖాలు మున్నగువారు శాకాహారులు కానేకారు" అని మాంసాహార పక్షమువారు వాదింతురు. "మాంసాహారము అజీర్ణవ్యాధికి మూలము" అని ఒకపక్షమువారు వాదింతురు. "అవన్నియు వెట్టిమొట్టిమాటలు, అర్థరహితవాక్కులు. శాకాహారులకే జీర్ణకోశవ్యాధు లెక్కువగా వచ్చును" అనియు, "శాకాహారము శరీరమునకు చక్కని విరేచనకారిగా నుండవచ్చును. కాని అంతమాత్రముననే లోకమంతయు ఆ ఆహారమునే పుచ్చుకొనవలెనా?" అనియు రెండవపక్షమువా రందురు.

ఈ యిరుపక్షములవా రేమేమి చెప్పినను, మాంసాహార జాతులు ఎల్లప్పుడును, ధీరత్వముచేతను, సాహసముచేతను, యోచనాపరత్వముచేతను ప్రసిద్ధులై యుండుటే సామాన్యముగా కానిపించును. మాంసాహారజాతు లిట్లు కూడ చెప్పుదురు: "యజ్ఞధూమము మింటికెగయుచుండువేళ, ఆహుతపశుమాంసము తినుచుండిన కాలముననే హిందువులలో ప్రతిభాగ్రగణ్యులగు మతాచార్యులును, అసమానమహితమగు బుద్ధిగలవారును పుట్టు

చుండిరి. కాని వారు "బాబాజీ"లయొద్ద శాకాహారాభ్యాస మలవఱచుకొనినపిదప, వారిలో నొక్కఁడైనను మహాపురుషుఁడు, ఉపజ్ఞాశక్తిమహితుఁడు ఉద్భవింపలేదు". ఈ భావమును పరిగణించి మనదేశములోని మాంసాహారులు ఆ యాహారమును మానుకొనుటకై భీతిలుచున్నారు. ఆర్యసామాజికులలో ఈ విషయమున అభిప్రాయభేదము కలదు. వారిలో ఈ విషయము తీవ్రముగా చర్చింపబడుచున్నది. మాంసాహారము అత్యంతముఖ్యమని యొక పక్షమును, అది కేవలము దోషము, అనైతికము అని రెండవ పక్షమును వాదించుచున్నారు.

ఈ విధముగా పరస్పరనిందలతో, కలహములతో, యుద్ధములతో కూడిన విరుద్ధవాదములు జరుగుచున్నవి. మిక్కిలి సున్నితమగు ఈ ఆహారవిషయకసమస్యనుగూర్చి చెలరేగుచున్న వితండవాదముల నన్నిటిని త్రోసిపుచ్చి, నే నీ విషయమును సర్వతోముఖముగా, అతిజాగ్రత్తగా పరిశీలించితిని. తత్ఫలముగా నాకు కలిగిన నిశ్చితాభిప్రాయము హిందువుల భావమే సరియైనదని; అనగా హిందూశాస్త్రములలో నిర్దేశింపబడినట్లు ప్రత్యేకమానవుల జన్మమును, వృత్తిని అనుసరించి వారి యాహారము — తక్కిన పెక్కువిషయములనుపోలి — భిన్నమై యుండవలెను. ఇదియే నిర్దుష్టమగు అభిప్రాయము. కాని ఈ కాలపు హిందువులు శాస్త్రముల ననుసరింపరు, ఆచార్యసత్తముల బోధలనుకూడ ఆలకింపరు.

మాంసము భుజించుట మొఱటుకార్య మనుటకు సందేహములేదు; శాకాహారము నిస్సంశయముగా నిర్మలతరము, — దీని నెవరు కాదనగలరు? పారమార్థికజీవనము నడపుటే జీవితలక్ష్యముగాగలవానికి శాకాహారమే తగినదనుటయు నిస్సంశయమే. కాని తన జీవితనౌకను గాఢప్రయాసపడి, ఎడతెగని చావుబ్రదుకుల పోరాటములలో చిక్కి, ప్రపంచపు పోటీల నెదుర్కొనుచు

నడపవలసియుండువాడు మాంసాహారము తీసికొనియే తీరవలెను. మానవసంఘములో 'బలహీనులను బలవంతులు అణగద్రొక్కి విజయోత్సాహము నొందుట' అనున దొకటి యున్నంతకాలము మాంసాహార మావశ్యక మే; తత్సమానమైనది మఱొక ఉచితాహార మేదైన కనిపెట్టబడవలయును. లేనిచో బలవంతులు బలహీనులను తమపాదములక్రింద పడవైచికొని త్రొక్కి అణచి వేయుటలో వింత యేమియు నుండదు. మానవులలో నే కొందఱో, శాకాహారమువలన ఉపకారమొందెదనని చెప్పుట నిష్ప్రయోజనము; — ఒకజాతిని మఱొకజాతితో పోల్చి, ఆ పిదప విషయనిర్ధారణము చేయుడు.

శాకాహారులలోకూడ పరస్పరభిన్నాభిప్రాయములు కలవు. బియ్యము, ఉరలగడ్డలు, గోధుమలు, యవలు, జొన్నలు మొదలగు గంజికట్టు (స్టార్చి) పదార్థములు భోజనమునకు పనికిరావని కొందఱి యభిప్రాయము. 'ఇవి మనుష్యులచేత ఉత్పత్తిచేయబడినవి, సకలజాడ్యమూలములు. గంజికట్టుపదార్థముల భోజనము శరీరములో చక్కెరను ఉత్పత్తిచేసి అపారహానిచేయును. గుఱ్ఱములు, ఆవులుకూడ గృహావరణములలో నుంపబడి, గోధుమ, బియ్యము ఆహారించుచున్నచో, తెవులుపడును. కాని పచ్చిక బయళ్ళలోని పచ్చిగడ్డిని, పెరుగుచుండు మొక్కలను ధారాళముగా తిరిగి తిన్నచో, అవి పునరారోగ్యవంతము లగును. పచ్చిగడ్డిలోను, తినదగు పచ్చిమొక్కలలోను గంజికట్టుపదార్థము అత్యల్పము. ఒరాంగొటాంగ్ అను వాలిడి పచ్చిగడ్డిని, పప్పుగింజలను (నట్స్) తినును. ఉరలగడ్డలను, గోధుమలను సాధారణముగా త్యజించును. ఎప్పుడైన వానిని తినెనేని, అవి పండువాఱకమునుపే, అనగా వానియందు గంజికట్టుపదార్థ మంతగా చేరకమునుపే తినును. వేపుడుమాంసమును, పండ్లను, పాలను సమృద్ధిగా నుపయోగించినచో, అవి దీర్ఘజీవితసాధకములుగా నుపకరించునని మఱికొందఱి అభిప్రాయము. మఱియు, ఫలములు

సమృద్ధిగాను, అనుదినమును భుజించువారు యౌవనమును చాల కాలము నిలుపుకొనగలరు. ఎముకలందుచేరి కరుడుకట్టు విష పదార్థమును ఫలములలోని పులుపుపదార్థము కరగదీయును; వార్ధక్యమును తెచ్చున దీ విషపదార్థమే.

ఈ వాదములెల్ల ఎన్నటికిని ముగియక, అనంతముగా చెలరేగుచున్నవి. నిరంతరవివాదగ్రస్తమైయుండు ఈ సమస్యకు సర్వసమ్మతమై, వివేకమహితమగు పరిష్కారము సారవంతమును, పుష్టికరమును అయి సులభముగా జీర్ణించు ఆహారమును పుచ్చుకొనుటయగును. అది అల్పపరిమాణములో, అత్యధికపుష్టినిచ్చుచు, శీఘ్రకాలమున శరీరములో ఇమిడిపోవునదిగా నుండవలెను. లేని యెడల తినుపరిమాణ మధికము కావలసివచ్చును. అంతపరి మాణముగల ఆహారము అఱుగుటకే దినమంతయు పట్టును. మనశక్తియంతయు ఆహారము జీర్ణించుకొనుటకే వినియోగింపబడిన యెడల, ఇతరకార్యములొనర్చుశక్తి ఎట్లు లభించును?

వేపుడుపదార్థము లన్నియు విషప్రాయములే. మిఠాయి దుకాణము మరణద్వారమే. ఉష్ణదేశములలో చమురు, నేయి, ఎంత తక్కువగా నుపయోగించిన అంత మంచిది. నేతికన్న వెన్న సులభముగా అఱుగును. మంచువలె తెల్లగానుండు గోధుమ పిండిలో బలప్రదవస్తువతిస్వల్పము. పొట్టుతీయని గోధుమపిండి ఆహారార్హము. వంగదేశమున దూరగ్రామములం దిప్పటికిని వాడుకలోనున్న ఆహారపదార్థపచనవిధానము, వైఖరి, ప్రశం సార్హములు. ప్రాచీన వంగదేశీయకవి యెవడైనను లూచీకచూరీ లను ప్రశంసించియున్నాడా? వాయవ్యప్రాంతములనుండి ఈ లూచీకచూరీలు ప్రవేశపెట్టబడినవి; కాని ఆ ప్రాంతములలో కూడ వానిని ఎప్పుడో ఒక్కొక్కసారిమాత్రమే తిందురు. ప్రతిదినము నేతివేపుడుపదార్థములనే ముఖ్యముగా తిని జీవించు వారిని అక్కడకూడ నే నెవ్వరిని చూడలేదు. మథురలోని

కు స్త్రీలుపట్టు "చాబే" జెట్టీలు లూచీలు, మధురభక్ష్యములు ప్రీతితో తిందురు నిజమే; కాని కొలదిసంవత్సరములలో చాబేజీ యొక్క జీర్ణశక్తి చేటునొంద, నతఁడు "చూర్ణము" లను పేరుగల ఆకలిమందులను తినుచుండవలెను.

బీదలు తినుట కేమియులేక పస్తులుపడి చత్తురు; ధనికులును పస్తులుపడియే చత్తురు — వారి భోజనము ఆహారార్థము కాదు గనుక. తిను వస్తువులన్నియు — అవి యేవైనను — ఆహారముకాదు. తిన్నప్పుడు చక్కగా జీర్ణించి, మనలో ఇముడు నదే నిజమగు ఆహారము. ప్రతివస్తువుతోను — అది ఏదైనను— కడుపునింపుకొనుటకంటె ఉపవసించుట మేలు. భక్ష్యములమ్ము దుకాణములలో మిక్కిలి నాజూకైనవిగా నెన్నబడు పదార్థములందు, పుష్టికరమైన దొక్కటైన లేదని చెప్పవచ్చును. వానిలో ఉండునది — విషము! పూర్వము ఆ హానికరపదార్థములను ఎప్పుడో ఒక్కొక్కసారే తినువారు. కాని ఇప్పుడు పట్టణవాసులు — అందులో ముఖ్యముగా పల్లెటూళ్ళనుండివచ్చి కాపురముచేరువారు — ఈ విషయమున ముఖ్యదోషులు. వారు వీనిని ప్రతిదినము తిందురు. వారు అగ్నిమాంద్యవ్యాధి కెరయై అకాలమృత్యువువాతబడుట చిత్రమా! నీవు ఆకలిగొనియున్నచో మధురభక్ష్యములను, నేతివేపుడువస్తువులను తొమ్చుకాలువలో పాఱవేసి, ఒక కాని బొరుగులుకొని తినుము అవి చౌకగా నుండుటేకాక, పుష్టికరముకూడ. అన్నము, పప్పు, పొట్టుతీయని గోధుమపిండి చెపాతీలు, చేపలు, కూరగాయపదార్థములు, పాలు : ఈ ఆహారము చాలును. కాని పప్పు దక్షిణహిందూస్థానసులవలె — అనగా పప్పుకట్టు (యూషము) మాత్రము కైకొని, తక్కినభాగము పశువులకు వేయుము. కలవారు మాంసము కైకొనవచ్చును. కాని అందులో వాయవ్యప్రాంతపువారివలె ఉష్ణముచేయు వాసనద్రవ్యములు కలిపి దానిని జీర్ణముకాకుండునట్లు చేసికొనరాదు. ఈ తిరుగబోతపదార్థములు ఆహారార్థ

ములే కావు; వానిని అపరిమితముగా వాడుట దురభ్యాసమూల ముననే. పప్పు మంచి బలిష్ఠాహారమే కాని, దానిని జీర్ణించు కొనుట కష్టము. లేతబటానీలకట్టు సులభముగా అఱుగును, ఇంపగు రుచి కలిగియుండును. 'ప రీ' లో బటానీకట్టును అతి ప్రియముగా చూతురు. మొదట బటానీలను చక్కగా ఉడికించి, అంబలివలెచేసి నీటితో కలుపుము. ఈ కట్టు నిప్పుడు తీగవడబోత పాత్రముగుండ — పాలు వడబోయు పాత్రమువంటిది — వడియ బోయుము. బటానీ పొట్టంతయు అప్పుడు పోవును. దీనిలో నిప్పుడు వాసనద్రవ్యములు — పసుపు, మిరియాలు మున్నగు నవి — చేర్చి యొక బానలిలో కొంచెము నేతితో ఉడికింపుము. రుచికరమును, ఆరోగ్యకరమును అగు పప్పు కట్టగును. మేకతల తోనో, చేపతలతోనో దీనిని ఉడికించినచో మాంసాహారుల కిది కమ్మగా నుండును.

హిందూదేశమున మధుమేహవ్యాధిచే నిందఱు పీడింప బడుటకు ముఖ్యకారణము అజీర్ణమే. అక్కడక్కడ ఎవరో యొక్కరికి మెదడుతో అధికముగాపరిశ్రమించుటవలనకూడ ఇది కలుగుట నిజమేకాని, ప్రాయికముగా అజీర్ణవ్యాధియే కార ణము. బొజ్జపెరుగుట అజీర్ణవ్యాధి కొక ముఖ్యలక్షణము. భోజ నము అనగా కడుపులోకూరుకొనుట అనియర్థమా? ఎవ రెంత జీర్ణించుకొనగలరో, అంతయే వారికి అర్హమగు భోజనము. చిక్కి పోవుటయు, బలియుటయు కూడ అజీర్ణమువలననే కలుగును. నీయందు మధుమేహవ్యాధిలక్షణములు కొన్ని కనిపించుటతోడనే నిరాశనొందకుము; మనదేశమున అవి గణనార్హములేకావు. వానికి ప్రాముఖ్యము నీయరాదు. భోజనవిషయమునమాత్రము జాగ్రత్తపడి అజీర్ణవ్యాధిరాకుండ చూచుకొనుము. సాధ్యమైనంత సేపు బహిరంగప్రదేశమున గడపుము, చాలదూరము నడచు చుండుము. గాఢపరిశ్రమముచేయుము. కాలికండరములు ఇనుము వలె గట్టిగా నుండవలెను. ఉద్యోగములోనుంటివేని, వీలగు

నప్పుడు సెలవుతీసికొని, హిమాలయములోనుండు బదరికాశ్రమ మునకు యాత్ర చేయుము. కొండలలో ఎక్కుటలోను దిగుటలోను రెండువందలమైళ్లుగల ఈ యాత్ర నంతయు కాలినడకనే సాగించితి వేని మధుమేహభూతము నిన్ను విడిచి పాఱిపోవుట నీకే కానిపిం చును. డాక్టర్లను నీయొద్దకు రానీయకుము. వారిలో అధిక సంఖ్యాకులు నీకు ఉపకారమునకన్న అపకారమునే ఎక్కువగా చేయుదురు; సాధ్యమైనంతవఱకు మందులే తీసికొనవలదు. అవి చాలసార్లు జాడ్యముకన్నముందే రోగిని చంపును. నడవగలిగి దసరాసెలవులలో పట్టణమునుండి మీ స్వగ్రామమునకు ఒక పోకలు కాలినడకనే సాగింపుము. మనదేశములో ధనికుడు అను మాట సోమరితనమునకును, ఇతరులపై ఆధారపడియుండుటకును, పర్యాయపదమై పోయినది. నడుచుటకు ఇతరులసాహాయ్యము కావలసినవాడు, ఇతరులచే అన్నము తినిపించుకొనవలసినవాడు, క్లేశముల ననుభవించుట తప్పదు—అతడు నిస్సంశయముగా దుర్బ లుడే. లూచీ అంతయు తిన్నచో తనకు అఱుగదని, దాని పలు పూతభాగమును మాత్రమే జాగ్రత్తగా తినువాడు జీవించియున్న ప్పుడే చచ్చినవారిలో చేరిక. ఒక్కపట్టున ఇరువదిమైళ్లు నడవ లేనివాడు మనుష్యుడా, కీటకమా? ప్రయత్నించి రోగమును, అకాలమృత్యువును చేరదీసికొనువాని నెవరు రక్షింపగలరు?

పులిసి పొంగబాఱిన రొట్టెకూడ విషమే. దానిని తాకనే వలదు! పొంగుపదార్థముతో కలిపినచో పిండి హానికరమగును. పొంగింపబడిన దేనినిగాని తినవలదు. మనశాస్త్రములలో అట్టి యాహారమునుగూర్చిన నిషేధము. ఈ విషయము అత్యంతముఖ్య మగుచున్నది. పులియబాఱిన తీయనిపదార్థము మనశాస్త్రము లలో "శుక్తము" అనబడుచున్నది. పెరుగొక్కటి తప్ప శుక్త పదార్థము లన్నియు నిషిద్ధములు — అదిమాత్రము శరీరమునకు మంచిది, ఉపకారకము. పొంగించినరొట్టెను తినవలసివచ్చినచో, దానిని మొదట నిప్పుమీద చక్కగా కాల్పుము.

అపరిశుద్ధజలము, అపరిశుద్ధాహారము సర్వవ్యాధులకు కారణము. అమెరికాలో త్రాగెడినీటిని పరిశుద్ధపఱచుట ఇప్పు డొకవెఱ్ఱియైనది. "ఫిల్టర్"ను [నీటిని వడియబోసి పరిశుద్ధపఱచు సాధనము] విశ్వసించుకాలము ముగిసిపోయినది. ఇప్పుడు అది అప్రతిష్ఠపాలైనది. ఇందుకు కారణము: నీరు దానిలో ఇంకి దిగును, నిజమేకాని, ఆ నీటిలోని క్రిములు విషూచి, మహామారి మున్నగువ్యాధులకు కారణమైనవి అందే నిలిచియుండును. ఇది ఆఫిల్టరే క్రమేణ ఈ క్రిములు పెరుగుట కనుకూలమగు ఆల వాలము అగును. కలకత్తాలో ఫిల్టర్లు మొదటప్రవేశపెట్ట బడినప్పుడు ఐదేండ్లపాటు విషూచీవ్యాధి బయలువెడలలేదట. ఆ పిదప అది మునుపటివలెనే తీవ్రముగా చెలరేగుచుండెను. ఇం దుకు కారణము ఆ పెద్దఫిల్టర్లే విషూచిక్రిములువచ్చు మార్గముగా ఏర్పడుట. నీరువడియబోయుసాధనము లన్నిటిలో మనము సామా న్యముగా వాడునదే — మూడుకాళ్ల వెదురుచట్టముపై మూడు కుండల నొకదానిపై నొకటి ఉంచు వడబోతసాధనమే శ్రేష్ఠ మైనది. కాని ప్రతి రెండుమూడునాళ్లకు ఇసుకను, బొగ్గును, మార్చి, వేడిచేసినపిదపనే మరల వాడవలెను. కలకత్తాకు సమీప మున గంగానదీతీర గ్రామములలో వాడుకలోనుండు పద్ధతి — పటికముద్దను గుడ్డలోవైచి, దానిగుండ నీటిని వడియబోయుట — అన్నిపద్ధతులలో శ్రేష్ఠమైనది. మన్నును, ఇతరఅపరిశుద్ధవస్తువు లను, వ్యాధిక్రిములను పటికముక్కలు తమతోచేర్చుకొని క్రమ క్రమముగా లోతుబానలో మసటు ("మష్టు")గా నిలుచును. ఈ సులభమార్గము గొట్టపునీటిని నిర్దుష్టమొనరించి, విదేశీయ ఫిల్టరులన్నిటికంటె శ్రేష్ఠమైయుండును. ఇదిగాక నీటిని సలసల కాచినయెడల, అది పూర్ణనిర్దుష్టత్వ మందును. పటికవలన అపరి శుద్ధపదార్థమంతయు "మష్టు"గా నిలిచిపోయిన పిమ్మట ఆ నీటిని సలసలకాచి, త్రాగుచుండుము. ఫిల్టరు మున్నగు సాధనములను తూచ్చుకాలువలో పాఱవేయుము. ఇప్పుడు అమెరికాదేశములో

పెద్దయంత్రములతో నీటిని ఆవిరిగామార్చి, ఆ ఆవిరిని మరల నీరగు నట్లు చల్లార్చి, ఆవిరియై బయటికిపోయినగాలికి బదులుగా మఱొక యంత్రముతో నిర్మలమగుగాలిని దానిలోనికి చొనుపుదురు. ఈ నీరు మిక్కిలి నిర్మలము. దీని నిప్పుడు ప్రతిగృహమందు త్రాగుడు నీరుగా వాడుదురు.

మన దేశములో, కొంచెము స్థితిపరులుగానుండువారు సర్వ విధములగు మధురపదార్థములను, నేతితో వేయింపబడినవస్తువు లను తమ బిడ్డలచే తినిపింతురు. ఏలయన వారికి అన్నము, చెపాతీలుమాత్రమే పెట్టిన జనులు ఏమనుకొందురో! ఎంత అవ మానకరమది! ఇట్టి ఆహారముతో పెంపబడినబిడ్డలు, ఎట్లుందురో మనము ఊహింపవచ్చును—వికారస్వరూపములుగలిగి, సోమరులై, అప్రయోజకులై, బుద్ధిలోపముకలిగి, వెన్నెముకలేనివారివలె నుందురుగదా! ఆంగ్లేయులు మిక్కిలిబలిష్ఠజాతివారు; రేయుంబవళ్లు గాఢముగా పరిశ్రమింతురు; వారి నివాసము చలిదేశమున— ఇట్ల య్యును మధురభక్ష్యము లన్నను వెన్నతో వేగిన వస్తువులన్నను వారికి భీతి! ఇక మనము? అగ్నిమండల మనదగు దేశమున నివ సించుచుండియు, ఒకతావునుండి మఱొకతావుకైనను కదల నిష్టములేనివార మయ్యును, ఎట్టి ఆహారము కైకొందుము? లూ చీలు, కచూరీలు, మధురభక్ష్యములు, నేతితోనో, నూనెతోనో, వేగించిన ఇతరవస్తువులనుగైకొందుము! పూర్వకాలమున వంగదేశ మందలి మనగ్రామజమీందారులు ఇరువది ముప్పదిమైళ్లు నడచుట కేమాత్రము సరకుగొనువారుకారు, నలుబది కోయిచేపలను— ఎముకలతోకూడ—తినుచుండిరి. వారు నూఱేండ్లు బ్రదుకుచుండిరి. ఇప్పుడు వారికొమాళ్లును, మనమంద్రును కలకత్తాకువచ్చి, అహం కారమూని, సులోచనములుదాల్చి, అంగడివీథిలోని మధురభక్ష్య ములు తినుచు, ఒకవీథినుండి మఱొకవీథికి పోవుటకై అద్దెబండి కుదుర్చుకొనుచు, మధుమేహవ్యాధి పీడించుచున్నదందురు; అకాల మృత్యువు వాతపడుచుందురు; వారు నాగరికతనందిన ఫలమిది.

"కలకత్తావా"రైన ఫలము! డాక్టర్లును, వైద్యులునుకూడ వారి నాశనమునకు తోడ్పడుదురు. వారు సర్వజ్ఞులు, తమ ఔషధములతో ఏ వ్యాధినైన కుదుర్పజాలుదు రని వారి యెన్నిక. కడుపులో వాయువు కొంచెము అధికమైనచో, వెంటనే ఒకఔషధము తీసికొమ్మందురు. అయ్యో! "మీకు మందు లేమియు అక్కఱ లేదు, పోయి నాలుగైదుమైళ్లు బాగుగా నడువుడు" అని చెప్పిన చాలు నను భావము ఈ వైద్యులతలలో దూఱదే!

నేను అనేకదేశములను, అనేకవిధములగు ఆహారపచన విధానములను చూచుచున్నాను. కాని ఇం దేదియు మన వంగ దేశములో వివిధపదార్థములు చేయు అద్భుతపాకవిధానమునకు సాటిరావు. వానిరుచిని మరల అనుభవించుటకై పునర్జన్మమెత్త వలెనని కోరిక కలుగుచున్నదని చెప్పుటలో అత్యుక్తి యేమియు లేదు. దంతము లున్నంతకాలము వాని విలువను అనేకులు గ్రహింపకుండుట ఎంత శోచనీయము! భోజనవిషయమున మనము పాశ్చాత్యదేశముల నేల అనుకరింపవలెను? అట్లు చేయగల ధనికులు ఎందరు కలరు? మనప్రాంతపువారికి అనుకూలమగు ఆహారము చౌకమై, ఆరోగ్యవంతము, పుష్టికరము నగు మన వంగదేశాహారమే — తూర్పుబెంగాలువారి ఆహారము వంటిది. చేతనైనంతవఱకు వారి యాహారవిధానము ననుకరింపుడు. పాశ్చాత్యాహారము ననుకరించుటకై ఆ దేశముపై దృష్టినిలుపు కొలది, మీకు అపకారమే కలుగును, మీరు అనాగరికత నొంద సాగుదురు. మీరు కలకత్తావారు, నాగరికులుగదా, మీరు సొంతముగా అల్లిన వినాశకరమగు వల — బజారు మధురభక్ష్యములు — లో చిక్కుటచే, బాంకురాజిల్లావారు తమ బారుగులు దామోదర్ నదిపాలు చేసినారు; అచటి మినపపప్పు ఊొచ్చు కాలువలో పోసినారు; ఢాకా, విక్రమపురములవారు తమపూర్వపు కూరలను కుక్కలకు వేసినారు—అనగా, వారందఱును "నాగరికు"లైనారు! మీరు వినాశదశనందితిరి, ఇతరులనుకూడ ఆత్రోవనే

లాగుచున్నారు — కలకత్తానగరవాసులగు మీరు! ఇట్లయ్యు, "నాగరికు" లైతిరని గర్వించుచున్నారు! మన మాండలిక ప్రజలు కలకత్తాలోని పెంటకుప్పలను తిని, అజీర్ణవ్యాధివలనను, గ్రహణివలనను పీడింపబడుచుండియు, తమకు ఆ జీవనము అనుకూలింపలేదని అంగీకరింపరు; కలకత్తావాతావరణము తేమగలిగి ఉప్పుతో చేరియున్నదని తమ వాదమును సమర్థించు కొందురు! వారు ప్రతివిషయమునను ఎట్లైన "పట్టణవాసులు" కావలెను!!

ఇంతదనుక ఆహారముయొక్కయు, ఇతరాచారముల యొక్కయు గుణాగుణములను సంగ్రహముగా వివరించితిని. పాశ్చాత్యుల సామాన్యాహార మేదో, అది క్రమక్రమముగ నెట్లు మారినదో ఇప్పుడు కొంత చెప్పెదను.

ఎల్లదేశములందును బీదలఆహారము ఏదోయొక దినుసు ధాన్యము, దుంపకూరలు, శాకములు, చేపలు, మాంసము భోగ్యాహారవర్గములో చేరి, నంజుకొనుట కుపయోగపడును. ఆయాదేశములందు సమృద్ధిగాపండి, అందలి పంటలలో ప్రధాన మైనది, బీదల సామాన్యాహారముగా నుండును—ఉ. వంగదేశము లోను, ఒరిస్సాలోను, మదరాసులోను, మళయాళతీరములలోను ముఖ్యాహారము బియ్యపు అన్నము, పప్పు, శాకములు. ఒక్కొ కప్పుడు చేపలు, మాంసము నంజుకొనుటకుమాత్రము పచ్చడిగా వాడుదురు. హిందూదేశమున తక్కిన ప్రాంతములందు జరుగుబడి కలవారు గోధుమచెపాతీలు, బియ్యపు అన్నము తిందురు. ప్రజా సామాన్యము బాజరా (సజ్జలు), మాహుఆ (రాగులు), జొనార్ (జొన్నలు), ఝుంగోరా (మొక్కజొన్న)లతోను, ఇతరధాన్య ములతోను చెపాతీలు చేసికొని తిందురు.

హిందూదేశమం దంతటను దుంపకూరలు, కాయగూరలు, పప్పు, చేపలు, మాంసము: వీనిని రుచిపుట్టించు పదార్థము

లుగా రొట్టెతోనో, అన్నముతోనో తిందురు. అందుచేత వీనిని సంస్కృతమున "వ్యంజనములు" (రుచికరపదార్థములు)అందురు. పంజాబు, రాజపుటానా, దక్కనులలో ధనికులును, ప్రభువులును పక్కటెఱుగులమాంసము ప్రతిదినము తిందురు. కాని, వారి ముఖ్యాహారముకూడ రొట్టెయు, బియ్యపుఅన్నమునే. దినమునకు ఒకపౌండు తూకముగల మాంసమును తినువాడు, దానితో తప్పక రెండుపౌండ్ల చెపాతీలు తినును.

ఇట్లే పాశ్చాత్యఖండములలో, బీదదేశములప్రజలయొక్క — ముఖ్యముగా ధనికప్రాంతములలోని బీదలయొక్క — ప్రధానాహారములు బ్రెడ్డు (పొంగుడురొట్టె), ఉరలగడ్డలు. వారు మాంసము అరుదుగాగానితినరు. తిన్నప్పుడు దానిని "వ్యంజనము"గా గణింతురు. స్పెయిను, పోర్చుగలు, ఇటలీలందును, తక్కిన ఉష్ణదేశములందును, ద్రాక్ష విస్తారముగా పండును; దానితో చేయబడు సారాయి మిక్కిలిచౌక. ఈసారాయీలు మత్తు కలిగించునవికావు (అనగా, మితిమీఱ త్రాగినగాని); మిక్కిలి పుష్టికరములుకూడ. ఆ దేశములలోని బీదలు చేపలు, మాంసమునకు బదులు ద్రాక్షరసమును ఆహారముగా వాడుకొందురు. కాని యూరపుఖండపు ఉత్తరభాగములందు— రష్యా, స్వీడన్, నార్వే మున్నగువానియందు — రై (అను ధాన్యపు) రొట్టెయును, ఉరలగడ్డలును, కొంచెము ఎండు చేపలును, బీదజనులయొక్క ఆహారము.

యూరపులో ఐశ్వర్యోపేతశ్రేణియొక్కయు, అమెరికాలో సర్వశ్రేణులయొక్కయు ఆహారము ఇందుకు కేవలము విరుద్ధము; అనగా, వారికి చేపలును, మాంసమును, ప్రధానాహారము; పొంగుడురొట్టె, బియ్యపుఅన్నము, ఇతరపదార్థములు వ్యంజనముగా మాత్రమే తీసికొనబడును. అమెరికాలో పొంగుడురొట్టెను వాడుట మిక్కిలి తక్కువ. చేపలు వడ్డించినప్పుడు అవి

మాత్రమే వడ్డింపబడును. మాంసము వడ్డించినప్పుడును అట్లే అది మాత్రము వడ్డింపబడును. అవి రొట్టెయు, అన్నమును లేకయే పుచ్చుకొనబడును. కావున భోజనపాత్రమును తఱచుగా మార్చుచుండవలెను; పది విధముల ఆహారము ఉండెనేని, పాత్రమును అన్నిసార్లు మార్చవలెను. మన మీ విధముగా భోజనముచేసితిమేని, మనవద్దన యిట్లు జరుగవలసియుండును: చేదుకూర (వంగదేశములో ఇది మొదట వడ్డింపబడును. దీనికి "సుక్తము" అని పేరు) మొదటవడ్డింపబడినయెడల, ఆ పాత్రము తీసి మఱొక దానిలో పప్పువడ్డింపబడును; అట్లే పులుసు మఱొకపాత్రములో పప్పునుతీసి వడ్డింతురు; ఆ పిమ్మట వట్టి అన్నమో లేక లూచీలో వచ్చును. ఇట్టివడ్డనలోగల గుణము ఒక్కొక్కపదార్థములో కొంచెముకొంచెమే తీసికొనబడుట. దేనినిగాని అధికముగా తినుట జరుగదు. ఫ్రెంచివారు ప్రొద్దున కాఫీని, ఒకటిరెండు రొట్టెచెక్కలను కొంచెమువెన్నతో తీసికొందురు. మధ్యాహ్నము చేపలు, మాంసము మున్నగు వానిని అత్యధికముకాకుండ తిందురు. ముఖ్యభోజనము రాత్రిపూట కైకొందురు. ఇటలీవారియొక్కయు, స్పెయిన్‌వారియొక్కయు భోజనవిధానము ఫ్రెంచివారిదే. జర్మనీవారు సమృద్ధిగా భోజనముచేయుదురు. ప్రతిభోజనమందును మాంసము కొంచముగానో, అధికముగానో చేయును. ఇంగ్లీషువారు మూడుసార్లు భుజింతురు. అందు ప్రథమభోజనము స్వల్పపరిమితిగలది; కాని టీ, కాఫీలు నడుమనడుమ త్రాగుచుందురు. అమెరికనులుకూడ మూడుసార్లే భుజింతురు. కాని, వారిఆహారము ప్రతిపర్యాయము అధికప్రమాణముగలదిగనే ఉండును; అందు మాంసము సమృద్ధిగా చేరియుండును. ఈ దేశము లన్నిటిలో ప్రధానభోజనము మధ్యాహ్నకాలముననో, సాయంకాలముననో కైకొనబడు "డిన్నర్" అనునది. ధనికులు ఫ్రాన్సుదేశపువంటలవారిని ఉంచుకొని ఫ్రెంచిపద్ధతిగనే వంటచేయించుకొందురు; ప్రారంభమున కొంచెము ఉప్పులోఊరిన చేపయో, చేప గ్రుడ్లో,

లేక ఏదో ఒకవిధమగు "వ్యంజనమో", శాకమో — ఆకలి పుట్టించుటకు భుజింతురు, ఆ పిదప వారియాహారపదార్థము లివి: చారు; అంతట ఈ కాలపుఆచారప్రకారము పండ్లు; అంతట చేపలు; పిమ్మట మాంసాహారము; దానితరువాత వేపుడు మాంసఖండము, అందుతోపాటు కొన్ని శాకములు; పిదప వేటలోచంపిన జంతువులు, పక్షులు, లేక దుప్పిమాంసము మున్నగునవి; అంతట మధురభక్ష్యములు. చివరక్రమమగు "ఐస్-క్రీమ్" అను భక్ష్యము (చక్కెరతో గడ్డపాఱించినపాలు). ధనికులభోజనములో పదార్థపాత్రము మాఱినప్పుడెల్ల ద్రాక్షాపానీయముకూడ మాఱుచుండును, — హాక్ (జర్మనీలోచేయబడు తెల్లసారాయి), క్లారెట్ (ఎఱ్ఱని ఫ్రెంచిసారాయి), మంచుగడ్డతో చల్లగాచేయబడిన షాంపేన్ (తెల్లని, మిసమిసలాడు తూర్పుఫ్రాన్సుదేశపు సారాయి): ఇం దేదోయొకటి పదార్థములు మాఱినప్పుడెల్ల మార్చిమార్చి వడ్డింపబడును. స్పూను (గరిటె), కత్తి, ఫోర్కు (పదార్థములను గ్రుచ్చియెత్తు ముండ్లగరిటె) భోజనపాత్రము మాఱినప్పుడెల్ల మాఱుచుండును. "డిన్నరు" పిమ్మట పాలు కలుపని కాఫీ, మిక్కిలి చిన్న కాచపాత్రములలో లిక్కారులు (చక్కెర, వాసనద్రవ్యములు కలిపిన మిక్కిలి ఘాటగు మత్తు పానీయములు) తీసికొనిరాబడును. అన్నిటికిని పిదప పొగచుట్టలు వచ్చును. భోజనపాత్రములు మాఱుటతో మాఱు సారాయీలు ఎన్నెన్నివిధములుండునో, ఎంతెంత యుండునో, అంతధనికుడుగా, అంతఐశ్వర్యవంతుడుగా, అంతఫ్యాషన్‌గలవాడుగా ఆవిందుపెట్టు నతడు ఎన్నబడును. మన దేశములో సామాన్యధనికుడుగా ఎన్నబడువాడు దరిద్రుడగునంత ధన మొక "డిన్నరు" ఇచ్చుట కచట వ్యయముచేయబడును!

నేలమీద వాల్చిన ఒక కొయ్యపీటపై "పద్మాసనము" వేసికొని కూర్చుండి, అట్టి మఱొకపీటకు వీపును ఆనించి, కొంచెము ఎత్తగు పీటపై ఒక పళ్లెరములో ఆర్యుడు భోజనము

చేయుచుండెను. ఇప్పటికిని ఆ ఆచారమే పంజాబు, రాజపుటానా, మహారాష్ట్ర, గుజరాతు దేశములలో సాగుచున్నది. బెంగాలు, ఒరిస్సా, త్రిలింగ, మళయాళ దేశములలో భోజనపాత్రములు పీటలపై ఉంచరు; భూమిపై నుంపబడిన పళ్లెరములోనో, అరటి యాకులోనో, వారు భోజనము చేయుదురు. మైసూరుమహారాజు కూడ అట్లే చేయును. మహమ్మదీయు లొక పెద్ద తెల్లగుడ్డను పఱచి దానిపై కూర్చుండి భోజనము చేయుదురు. బర్మాదేశీయు లును, జపాన్ దేశీయులును భోజనపు పళ్లెరములను భూమిపై నుంచి మోకాళ్ళను, పాదములను మాత్రమే ఆధారము జేసికొని కూర్చుందురు. హిందూదేశపువారివలె వారు పిఱుదుల యాధార మున చదునుగా కూర్చుండరు. చీనాదేశీయులు కుర్చీలమీద కూర్చుండి, భోజనపాత్రముల నొక బల్లపై నుంచుకొని, గరిటెల తోను, వాడిమిగల కొయ్యపుల్లలతోను (పదార్థములను ఖండించు పుల్లలు) భోజనము చేయుదురు. పూర్వకాలమున రోము, గ్రీకు దేశస్థులు తమ ముం దొక బల్ల నుంచుకొని, ఒక శయ్యను ఆను కొని, వ్రేళ్ళతో ఆహారమును తీసికొనుచుండిరి. యూరపు దేశీయులుకూడ కుర్చీలమీద కూర్చుండి బల్లపై నుంపబడిన యాహారమును వ్రేళ్ళతోనే తినుచుండిరి; ఇప్పుడు వారు గరిటె లను, ముండ్లగరిటెలను వాడుదురు. చీనావారి భోజనవిధానము నభ్యసించుటకు కొంత నేర్పు అవసరము. మన తములపాకు లమ్మువారు హస్తలాఘవముచే రెండు వేర్వేఱు ఇనుపరేకులను తములపాకులు కత్తిరించు కత్తెరవలె పనిచేయునట్లు ఎట్లొనర్తురో, అట్లే చీనాదేశస్థుడుకూడ రెండు కొయ్యపుల్లలను తన రెండు వ్రేళ్ళకును, కుడి అఱచేతికిని మధ్య నుంచుకొని ఆడించుచు శాకాహారమును తననోటియొద్దకు పటకారువలె కొనిపోవునట్లు చేయును. మఱియు, నోటియొద్ద నొక అన్నపుముద్ద నుంచుకొని రెండుపుల్లల నొకటిగాచేర్చి వాని నొక చిన్నపాఱవలెచేసి వానితో ఆ అన్నమును లోపలికి నెట్టుకొనును.

ప్రతిజాతివారు ఆదినములలో లభించినదానినెల్ల తినువారట! పెద్దజంతువును చంపినప్పుడు దాని నొక నెలనాళ్లు వచ్చునట్లు వాడుకొనువారట. కుళ్ళిపోయినపిదపకూడ దానిని పాఱవేయువారుకారట. కాలక్రమమున వారు నాగరికులై భూమిదున్ని పైరుపెట్టుకొనుట నేర్చిరట. పూర్వము వేటచే వారికి ఆహారము ప్రతిదినము దొరకుసదికాదట. అందుచేత వారు అడవిమృగముల వలె నొకనాడు గొంతువఱకు తిని, ఆపిదప నాలుగైదుదినములు పస్తుండువారట. ఇప్పుడు వ్యవసాయమువలన ప్రతిదినము ఆహారము దొరకుచుండుటచే వా రా దురవస్థ తప్పించుకొనిరి; కాని ఆహారముతోపాటు పూర్వకాలమువలె క్రుళ్లుడుమాంసమో, మఱేవో ఇతర క్రుళ్లుపదార్థములో తినుట వారికి సుస్థిరాభ్యాసమయ్యెను. ప్రథమమున క్రుళ్లుడుమాంసము అనివార్యాహారపదార్థముగా నుండెను. ఇప్పుడు అదో, దానికిబదులు మఱియొక పదార్థమో వ్యంజనమువలె రుచికరమగు ప్రియవస్తువయ్యెను. ఎస్కిమోజాతివారు ఎల్లప్పుడును మంచుపేరుకొనియుండు ప్రాంతములందు నివసింతురు. అచ్చట ధాన్యమేదియు పండదు; వారి దైనికాహారము చేపలు, మాంసము. ఎన్నడైనను వారికి ఆకలి మందగించినచో, జఠరాగ్ని మరల ప్రజ్వలించుకొఱకు వా రొక ముక్క క్రుళ్ళినమాంసమును తిందురు. నేడును, యూరపు దేశీయులు తాము వేటాడి తెచ్చిన వన్యపక్షులను, జంతువులను, దుప్పిజాతులను వెంటనే వండుకొనక, కొంచెము కంపుకొట్ట నారంభించుదనుక వ్రేలగట్టియుంతురు. కలకత్తాలో క్రుళ్ళిన దుప్పిమాంసము బజాఱుకువచ్చినవెంటనే అమ్ముడుపోవును. కొన్ని జాతుల చేపలను కొంచెము కుళ్ళినపిదపనే తినుట జనులకు ఇష్టము. యూరపు ఖండమున కొన్ని ప్రాంతములలో కొంచెము వాసన కొట్టు జున్ను మిక్కిలి రుచికరముగా భావింతురు. శాకాహారులు కూడ కొంచెము నీరుల్లి వెల్లుల్లులను తిన నిచ్చగింతురు; దాక్షిణాత్య బ్రాహ్మణునకు అవి వంటలో ఉండితీరవలెను. కాని హిందూ

శాస్త్రములు వానినికూడ నిషేధించినవి; ఒకకులమునకు (బ్రాహ్మణులకు) వెల్లుల్లి నీరుల్లులను, పెంపుడుకోళ్ళను, పెంపుడుపందులను తినుట పాపము. అవి తినువారు కులభ్రష్టులగుదురు. కావున సదాచారనిష్ఠగల హిందువులు నీరుల్లి వెల్లుల్లులను విసర్జించి, వానికిబదులు ఆ రెంటికంటె గాఢమగు దుర్వాసనగల ఇంగువను వాడుకొన నారంభించిరి! హిమాలయప్రాంతపు బ్రాహ్మణులు వెల్లుల్లివంటి వాసనయేగల ఒకజాతి ఎండుగడ్డిని వాడుకొనసాగిరి! అం దేమి దోషము కలదు? శాస్త్రములు వానిగుఱించి ఏమియు చెప్పలేదుగదా!

కొన్ని యాహారముల ననుమతించి, కొన్నిటిని నిషేధించు విధులు ప్రతిమతమందును కలవు. క్రీస్తుమతమునందుమాత్రము అట్టి విధులు లేవు. జైనులు, బౌద్ధులు చేపలను మాంసమును తిననే తినరు. జైను లిదిగాక, ఉరలగడ్డలు, ముల్లంగిగడ్డలు మున్నగు దుంపలను భూమిక్రింద పెరుగువానిని కూడ తినరు. వానికై త్రవ్వునపుడు పురుగు లేవైన చచ్చునేమో యని వారి భీతి. రాత్రికాలమునందుకూడ వారు భోజనముచేయరు — చీకటిలో కీటకమేదైన తమనోటిలో దూఱునని వారు భయపడుదురు. పొలుసులులేని చేపలను, పందిమాంసమును, చీలని డెక్కలుగలిగి నెమరువేయని జంతువులను యూదులు తినరు. మఱియు, చేపలుగాని, మాంసముగాని పచనముచేయుచున్నప్పుడు ఆ వంటయింటిలోనికి పాలు, పాలపదార్థమేదైనను తేబడునెడ వారు అచ్చట వంటచేయబడిన యన్నిపదార్థములను పాఱవేయుదురు. ఈ కారణమున, ఆచారనిష్ఠగల యూదులు ఇతరజాతులు వండిన యాహారమును తినరు. భగవంతునికి నివేదింపబడని జంతుమాంసమునుకూడ యూదులు—హిందువులవలెనే—తినరు. వంగదేశములోను, పంజాబులోను, దేవికి నివేదింపబడిన మాంసమునకు "మహాప్రసాద" మను నామాంతరము గలదు. "మహాప్రసాద"మయియున్నగాని, అనగా భగవన్నివేదితమైన

గాని, యూదులు మాంసమును తినరు. కావున వారును హిందువులవలె, ఏ దుకాణములోనన్న ఆ దుకాణములో మాంసమును కొనరాదు. యూదులవలె మహమ్మదీయులును అనేక నియమములను పాటింతురు. కాని యూదులవలె వారు "అతి"కి పోరు; వారును మాంసముతోగాని, చేపలతోగాని, పాలు పుచ్చుకొనరు. కాని వంటయింటిలో అవి ఒకేసారి ఉన్నను, ఒకదానినొకటి తాకినను అంతగా ఆక్షేపింపరు. హిందువులకును, యూదులకును భోజనవిషయమున చాల పోలికలు కలవు. కాని హిందువులవలె యూదులు అడవిపందులను తినరు. పంజాబుదేశములో, హిందూ మహమ్మదీయవైరములు అతితీవ్రముగా చెలరేగుచుండుటచే, మహమ్మదీయులకు నిషేధముగానుండు పనుల నన్నిటిని హిందువులు చేయుదురు. కావున అచటి హిందువులకు అడవిపంది ముఖ్యాహారములలో నొకటి యైనది. రాజపుత్రులకు అడవిపందిని వేటాడి తెచ్చి, దాని మాంసమును తినుట ఇంచుమించు ఒక "ధర్మము"గా ఏర్పడినది. దక్కనుదేశపు బ్రాహ్మణులలోతప్ప అన్నిజాతులందును పెంపుడుపందిమాంసమును తినుటకూడ మిక్కిలివ్యాప్తిలో నున్నది. హిందువులు అడవికోడిని (పుంజునైనను, పెట్టనైనను) తిందురు, కాని పెంపుడుకోడిని తినరు.

వంగదేశము మొదలు నేపాళమువఱకును, హిమాలయములలో కాశ్మీరమువఱకును నివసించు హిందూదేశస్థు లందఱును భోజనవిషయమున ఒకేవిధమగు ఆచారములను అవలంబింతురు. ఈ ప్రాంతములందు నేటివఱకును మనువు విధించిన ఆచారములే చాలవఱకు పాటింపబడుచున్నవి. కాని ఆ పాటింపబడుట బెంగాలు, బీహారు, అలహాబాదు, నేపాళములలోకంటె, కుమాను మొదలు కాశ్మీరమువఱకు గల ప్రాంతములలో అధికము. ఉ. బెంగాలీలు కోడిని, కోడిగ్రుడ్లను తినరు, కాని బాతుగ్రుడ్లు తిందురు; నేపాళమువారుకూడ అట్లే చేయుదురు. కాని కుమాను మొదలు ఆపై ప్రాంతములలో అదికూడ నిషేధమే. కాశ్మీరదేశస్థులు అడవి

బాతుగ్రుడ్లను ప్రీతితో తిందురు. కాని పెంపుడుబాతుగ్రుడ్లను తినరు. అలహాబాదుకడనుండి — హిమాలయములలో తప్ప — మేకమాంసము తిను హిందూదేశస్థులందఱును కోడినికూడ తిందురు.

ఈ ఆహారవిషయక విధినిషేధము లన్నియు చాల వఱకు ఆరోగ్యసంరక్షణార్థము ఏర్పడినవనుటకు సందేహము లేదు; ప్రతి సందర్భమునను, ఏ భోజనపదార్థము ఆరోగ్యానుకూలము, ఏది ప్రతికూలము, అని నిర్దుష్టముగా నిర్ణయించుట కష్టము. నిజమే. మఱియు, పందులును, కోళ్లును దేనినైనతిను మిక్కిలి అపరిశుద్ధ జంతువులు. వానిని గూర్చిన నిషేధమున కిదియే కారణము. అడవికోళ్లు అడవిలో ఏమితినునో ఎవరును చూచియెఱుగరు. మఱియు అవి పెంపుడుకోళ్లకంటె ఆరోగ్యవంతములై యుండును. వీనియంతగా జబ్బుపడవు. పాలు ముఖ్యముగా ఆమ్లపిత్తవ్యాధి గల వారికి—సులభముగా జీర్ణముగావు. వానిని త్వరగా మ్రింగి వేసినమాత్రముననే ప్రాణాపాయము కలిగిన సందర్భములుకూడ కలవు. పసిబిడ్డ తల్లిస్తన్యమును త్రాగినట్లు, కొంచెముకొంచెముగా పీల్చుటో, త్రావుటో చేయవలెను. అప్పుడు అవి సులభముగా జీర్ణమగును; లేకపోయిన జీర్ణముకావు. పాలు అసలే అజీర్ణ వస్తువు గనుక, మాంసముతోకూడ తీసికొనబడినప్పుడు దానిని జీర్ణించుకొనుట కష్టతరముగా నుండును. కావుననే ఒకేభోజనమున మాంసమును, పాలను తీసికొనరాదను యూదులకుగల నిషేధము.

వివేకశూన్యురాలగు తల్లి బిడ్డను బలాత్కరించి అధికముగా పాలు మ్రింగునట్లు చేయును. పిదప కొలది మాసములలో తన ప్రేమనిధానమగు బిడ్డ ప్రాణాపాయస్థితికి వచ్చినప్పుడు ఆతల్లి నిరాశాగ్రస్తురాలై గుండెలు బాదుకొనును! ఆధునికవైద్య శాఖాధికారులు పెద్దవారికి కూడ ఒక పైంటు (20 ఔన్సులు)

పాలే నిర్ణయింతురు. అవియు, మిక్కిలి నెమ్మదినెమ్మదిగా తీసి కొనుమందురు; పసిబిడ్డలకు పాలబుడ్డితో త్రాగించుట శ్రేష్ఠము. మనయిండ్లలోనితల్లులు గృహకృత్యమగ్నలై యుండుటచే, ఏడ్చుచుండు బిడ్డను పరిచారిక తనఒడిలో నుంచుకొని, పెక్కుసార్లు మోకాటితో అదిమిపట్టి, తనకు సాధ్యమైనన్నిగరిటెల పాలను ఆ బిడ్డ మ్రింగునట్లుచేయును! తత్ఫలముగా బిడ్డ యకృద్వ్యాధినంది, ఈడుకు తగినట్లు పెరుగజాలకుండును. ఆ పాలే దానికి మరణశిక్షగా వర్తించును. అపాయకరరీతిని పాలుత్రాగించినను, దానిని భరించి బ్రదుకునంతటి ప్రాణశక్తిగలబిడ్డలు మాత్రము బలిష్ఠులును, ఆరోగ్యవంతులును, అగు పెద్దవారగుదురు. ఇక మన ప్రాచీన వైఖరి పురిటిగదులను, పురిటిబిడ్డకుచేయు కాపడములను, అట్టియితరచికిత్సలను గూర్చి ఆలోచించినచో, ఈశ్వరకృపావిశేషమేదో లభించుటచేతనే మాతాశిసువులు ఆ తీవ్రపరీక్షలకు ఆగి బలమును ఆరోగ్యమును ఆర్జించుకొనగలిగియుందురని మనము అచ్చెరువుతో తలంతుము.

## దుస్తులవిషయపు నాగరికత

ప్రతిదేశమునందును మానవుని గౌరవార్హత అతడు ధరించు దుస్తులనుబట్టి కొంతవఱకు నిర్ణయింపబడును. వంగదేశమునందలి పల్లెటూరిప్రజలు తమగ్రామ్యభాషలో చెప్పునట్లు "ఒకడు 'మర్యాదస్థు' డైనది, నీచజన్ముడైనది కనుగొనుటెట్లు— అతని రాబడి తెలిసియున్నతప్ప?" రాబడిమాత్రము తెలియుట కూడ చాలదు, "అతడెట్టి దుస్తులుదాల్చునో చూచినగాని, అతడు మర్యాదస్థుడని ఎట్లు తెలియగలదు?" ప్రాయికముగా ప్రపంచమందంతటను ఇదేస్థితి. వంగదేశమున మర్యాదస్థుడెవడును మొలకుమాత్రము గుడ్డకట్టుకొని వీథులలో నడువనేరడు; హిందూదేశపు తక్కినప్రాంతములలో తలగుడ్డలేనిది ఎవ్వడును వీథులలో నడవడు. పాశ్చాత్యదేశమున ఫ్రెంచివారు ప్రతివిషయ

మునను మార్గదర్శకులైయున్నారు — వారి భోజనమును, వారి దుస్తులను ఇతరులు అనుకరింతురు. ఇప్పుడుకూడ, యూరపులోని వివిధభాగములందు వేర్వేరువస్త్రధారణ విధానములును, వేర్వేరుదుస్తులును ప్రత్యేకించియున్నను, ఎవడైనను ధనార్జన మత్యధికముగా చేసి, "జెంటిల్‌మన్" (పెద్దమనిషి) అనిపించుకొన్నమొదలు, అతడు వెంటనే తన తొల్లిటిస్వదేశవేషవైఖరిని విసర్జించి, ఫ్రెంచివైఖరిని అవలంబించును. హాలెండుదేశపు కృషీవలుని స్వదేశవేషము కాబూలువారి పైజామాలను పోలును; గ్రీసుదేశీయుడు నడుముక్రిందికి వ్రేలాడు చొక్కాలను ధరించును; రష్యాదేశస్థునివేషము టిబెట్‌వారివేషమును కొంత పోలును; — కాని వీరెవరైనను ఉన్నతపదవికి వచ్చి, మర్యాదస్థులైనచో, వారు ఫ్రెంచి "కోటు" లను, షరాయీలను ధరింతురు. స్త్రీల విషయము చెప్పనే అక్కఱలేదు, — వారు ధనికులగుటతోడనే, వారి దుస్తులెట్టివైనను 'పారిస్' లోనే కుట్టించుకొనవలెను. అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ ఇప్పుడు పాశ్చాత్యఖండములోని ధనికదేశములు. ఈ దేశములలో ప్రతివారిదుస్తులు ఫ్రెంచి "ఫ్యాషన్" కలవిగానే ఉండును. ఆ "ఫ్యాషను" నెమ్మదినెమ్మదిగా — కాని నిస్సంశయముగా — యూరపులో ప్రతిభాగమునకు వ్యాపించుచున్నది. యూరపు అంతయు ఫ్రాన్సుయొక్క "ప్రతి" (అనుకరణము)గా నున్నది. అయినను ఇటీవల పురుషులదుస్తులు 'పారిస్'లోకంటె లండనులో శ్రేష్ఠతరముగా కుట్టబడుచున్నవట. అందుచేత పురుషులు లండనులోను, స్త్రీలు 'పారిస్'వైఖరిగాను తమదుస్తులను కుట్టించుకొనుచున్నారు. మిక్కిలి ధనాఢ్యులగువారు తమదుస్తులను ఆ పట్టణములనుండియే తెప్పించుకొందురు. ఈ దేశములనుండి దిగుమతియగు దుస్తులపై అమెరికావారు అత్యధికముగ పన్ను విధించుచున్నారు. అయినను, ఆ దేశస్థులు తమ దుస్తులను 'పారిస్' నుండియు లండనునుండియునే తెప్పించుకొందురు. అమెరికనులకుతప్ప మఱెవ్వరికిని ఇట్లుచేయు సామర్థ్యము

కొలువులో ప్రచ్ఛన్నవేషముతో సారథిగానుండిన నలరాజు రథమును అత్యంతవేగముగా నడపినందున, ఋతుపర్ణుని "ఛద్దర్" చాలదూరమునకు ఎగిరిపోయి దొరకలేదు, అతడు స్వయంవరార్థము బయలువెడలియుండుటచే, "ఛద్దర్" లేకయే అచటికి పోవలసి వచ్చెనేమో! దోవతి ఛద్దర్లు ఆర్యులకు పురాతనాచారసిద్ధమగు ఉడుపులు. కావున మతనిర్దిష్టకర్మ మేదైన చేయునపుడు దోవతి ఛద్దర్లు ధరించుట హిందువులలో ఇప్పటికిని నియమము.

ప్రాచీనకాలపు గ్రీకులయొక్కయు రోమనులయొక్కయు వేషముకూడ దోవతి ఛద్దర్లే, — ఒక వెడల్పైన పెద్దగుడ్డ, చిన్నదగు మఱొకగుడ్డ. ఇది "టోగా"గా కట్టియుండును. చోగా అను మాట ఈ "టోగా"లో నుండియే ఉత్పత్తియైనది. వారొకప్పుడు "షర్టు"ను (లోపలిచొక్కా) కూడ ధరించుచుండిరి. యుద్ధముచేయునప్పుడు కోట్లు, షరాయీలుకూడ వాడుచుండిరి. స్త్రీలదుస్తు పొడుగుపాటి, తగినంత వెడల్పు గల, ఒకరీతిబట్ట — రెండుబట్టలు నిడివికి కుట్టినట్లుండెడిది —. దీనిని వారు వదులుగా పైన వేసికొని వక్షఃస్థలముక్రింద నొక చోటను, కటిప్రదేశమున నొకచోటను చుట్టును కట్టివైచుకొనుచుండిరి. అంతట అనాచ్ఛాదితములైయున్న పైభాగములను బాహువులపై పెద్దసూదులతో — ఉత్తరహిమాలయప్రాంతపు కొండవాం డ్రిప్పటికి చేయువిధమున బిగించివేయుదురు. ఈ పొడుగుపాటి ఉడుపుపై నొక "ఛద్దర్" ఉండును. ఈ వేషము నిరాడంబరమయ్యును, చూచుటకు ఇంపైయుండును.

మిక్కిలి ప్రాచీనకాలమునుండి ఇరాణ్ దేశస్థులు కుట్టిన బట్టలు వాడుకొనుచుండిరి. చీనాదేశస్థులయొద్ద వా రిది నేర్చుకొని యుందురు. వేషవిషయములలోను, ఇతర సుఖకర, భోగ్య, విషయములలోను, చీనావారు ప్రాచీననాగరికతాగురువులు. అనాదికాలమునుండియు చీనాదేశస్థులు కుర్చీలపై కూరుచుండి

బల్లమీద ఎన్నోవిధముల వ్యంజనములతో భోజనముచేయు చుండిరి. పెక్కువిధములగు కట్టుబట్టలనుకూడ — కోటు, టోపీ, షరాయి, మున్నగువానిని — ధరించుచుండిరి.

ఇరానును జయించిన పిదప అలెగ్జాండరు తన పురాతన గ్రీకుదోవతిని, ఛద్దరును విసర్జించి షరాయీలు ధరింప నారంభించెను. ఇందుకు అతని గ్రీసుదేశసైనికు లతనిపై అలుకబూని తిరుగుబాటుచేయబోయిరి. కాని "లొంగుట" అను మాటనే యెఱుగని అలెగ్జాండరు, తన అధికారప్రాబల్యశక్తిచే, షరాయీలు, కోట్లు, దుస్తునం దొక "ఫ్యాషన్"గా ఉండునట్లు ప్రవేశపెట్టెను.

ఉష్ణదేశమునందు బట్టల ఆవశ్యకత అంతగా తోపదు. ఔచిత్యసంరక్షణమున కొక కౌపీనముమాత్రము ధరించిన చాలును; తక్కిన ఉడుపులు అలంకరణమాత్రముగనే ఉపకరించును. శీతలదేశములందు అనివార్యావశ్యకతవలన జనులు — అనాగరికులై యున్నప్పుడు జంతుచర్మములను దాల్చుచుండిరి. క్రమక్రమముగా నాగరకులైనపిదప, మొదట కంబళ్లు కప్పుకొనుటను నేర్చికొని, ఆ పిదప కట్టుడుదుస్తులను షరాయీలు, కోట్లు మున్నగువానిని — ధరింప గాలక్రమమున నేర్చుకొనిరి. శీతలదేశములందు ఆభరణసౌందర్యమును ఆడంబరముగా నగపఱచుట అసాధ్యమనుట స్పష్టము. ఆభరణములు అనాచ్ఛాదితదేహముమీదనగదా ధరింపవలెను. అట్లు ధరించుట అపారమగు చలికి ఎరయగుటయే. కాని ఆభరణవ్యామోహము అచ్చట దుస్తుల సౌందర్యముగా మార్పుబడి, సంతృప్తినిచ్చును. హిందూదేశమునందు ఆభరణముల "ఫ్యాషన్" పలుమాఱెట్లు మార్పుల నొందునో, అట్లే పాశ్చాత్యదేశములలో దుస్తుల "ఫ్యాషన్" ప్రతిక్షణము మాఱుచుండును.

కావున శీతలదేశములందు ఆపాదమస్తకాచ్ఛాదితులై కాని ఇతరులయెదుటకనిపింపరాదని నియమమేర్పడెను. లండనులో మర్యా

దస్థులు స్త్రీలును, పురుషులును సాంఘికనియమములు నిర్దిష్ట ముగా పాటించిగాని బహిరంగముగా కానిపింపరాదు. పాశ్చాత్య దేశములందు స్త్రీలు నలుగురిలో తమపాదముల నగపఱచుట అవినీతినిసూచించుకార్యము. కాని నాట్యమునందు ముఖమును, భుజములను, శరీరపు పైభాగమును, బయలుపఱచుట అట్టిది కాదు. ఇక మనదేశమున స్త్రీ తన ముఖమును చూపుట లజ్జా కరకార్యము (కావుననే ముఖముపై ముసుగు కప్పుకొనుట అంత ముఖ్యమైనది). కాని పాదములను కనబఱచుట తప్పుకాదు. రాజపుటానాలోను, హిమాలయములందును, స్త్రీలు తమ కటిప్రదేశమునుతప్ప శరీరమునంతటిని వస్త్రాచ్ఛాదితముగా నుంచు కొందురు.

పాశ్చాత్యదేశమున నటీజనము, వేశ్యాజనము, పురుషు లను ఆకర్షించుకొఱకు మిక్కిలిపలుచనిబట్టలను (దుకూలములను) ధరింతురు. నృత్య మనగా పెక్కుతడవలు సంగీతమునకు అను రూపమగు చలనములతో తమ యంగములను బయలుపఱచుటే గదా! మనదేశమునందు గొప్పయిండ్లస్త్రీలు పూర్ణాచ్ఛాదితలై యుండరు; కాని వేశ్యలు అట్లుందురు. పాశ్చాత్యదేశమున స్త్రీలు పగటిపూట పూర్ణాచ్ఛాదితలైయుందురు; కావున స్వల్పాచ్ఛాదన ముతో కానిపించునప్పుడు వారి ఆకర్షణ మధికము. మనస్త్రీలు ప్రాయికముగా ఎల్లప్పుడును ఇంటిలోనే యుందురు. అందువలన వస్త్రధారణ మధికముగా చేసికొనరు; కావున పూర్ణవస్త్రధార ణమే మనకాకర్షకముగా నుండును. మళయాళమునందు స్త్రీ పురుషులు నడుమునకుమాత్రె మొకబట్టచుట్టికొనియుందురు. వంగ దేశములోకూడ ఇంచుమించు అదేస్థితి, కాని పురుషులయెదుట స్త్రీలు మొగమును పూర్తిగా ముసుగుతో మఱుగుపఱచుకొని, శరీరమును పూర్ణాచ్ఛాదితమొనర్చుకొందురు.

చీనాలోతప్ప సర్వదేశములందును యుక్తతనుగూర్చి అనేక వికృత, నిగూఢభావములు నాకు కానిపించినవి — కొన్నివిషయ

ములం దవి మితిమీఱి ఆచరింపబడును; మఱికొన్ని విషయము లందు ఇది మిక్కిలి పొరపాటని తోచును — అట్టిభావమే లేకుండును.

చీనావారు — స్త్రీలును పురుషులును — ఆపాదమస్తక మెల్లప్పుడు పూర్ణాచ్ఛాదితులై యుందురు. ఆ దేశస్థులు కన్ఫూషియస్ యొక్కయు బుద్ధునియొక్కయు అనుచరులు. కావున వారినీతి నిష్ఠురము, పరిశుద్ధము. బూతుమాటలు, బూతుపుస్తకములు, బూతుచిత్రములు, ఏమాత్రమేని అసభ్యముగానుండు ప్రవర్తనము: వీనికి బాధ్యుడగు అపరాధి వెనువెంటనే దండింపబడును. క్రైస్తవమతప్రచారకులు బైబిలును చీనాభాషలోనికి అనువదించిరి. హిందూపురాణములకు లజ్జజనింపజేయునంతటి అసభ్యఘట్టములుకొన్ని బైబిలులో నున్నవి. ఈ అసభ్యభాగములను చూచి చీనావారు క్రీస్తుమతముపై మిక్కిలిరోషము వహించి, బైబిలుకు తమదేశమునం దెన్నటికిని వ్యాప్తికలిగింపరాదని నిర్ణయించుకొనిరి. ఇదిగాక క్రైస్తవమతప్రచారిణులు సాయంకాలపు దుస్తులను ధరించి, పురుషులతో ధారాళముగా కలియుచు చీనావారిని ఆహ్వానించిరి. అమాయికులగు చీనావారు మిక్కిలి అసహ్యతతో ఇట్లు ఘోషించిరి: "ఎంత ఘోరము! మన బాలురచే బైబిలు చదివించి వారిని పాడుచేయుటకును, ఈ జిత్తులమారి, అర్థాచ్ఛాదిత, స్త్రీలమాయలకు లోబడి చెడిపోవుటకును ఈ మతము మనదేశములోనికి వచ్చినది!" ఇందుచేతనే చీనావారికి క్రైస్తవులన్న అంత కోపము. సామాన్యముగా చీనావారు ఇతరమతములయెడల మిక్కిలి సహనబుద్ధిని చూపుదురు. క్రైస్తవమతప్రచారకు లిప్పుడు ఆక్షేపణీయభాగములను వదలి బైబిలును పునర్ముద్రణ మొనర్చిరని నా వినికి; కాని ఈ చర్యవలన చీనావారి సంశయములు మునుపటికంటె అధికమైనవట!

మఱియు, పాశ్చాత్యఖండమున సభ్యతామర్యాదలను గూర్చిన భావములు దేశదేశమునకు వేఱు. ఇంగ్లీషువారు, అమెరి

కనులు, ఒకరీతిభావములను, ఫ్రెంచివారింకొకరీతి వానిని, జర్మనులు మఱొకరీతివానిని అవలంబింతురు. రష్యనులకును, థిబెట్ వారికిని పెక్కువిషయములందు సమానభావములు కలవు. టర్కీ వారికి వీనిలో దేనితోను సంబంధము లేని ప్రత్యేకవిధభావములు కలవు. ఇట్లే ఇతరదేశీయులకును.

## ఆచారములు, ఉచితప్రవర్తనములు

యూరపులోను, అమెరికాలోను గుప్తతను మనకంటె చాల అధికముగా పాటింతురు. మనము శాకాహారులము కావున శాకములు మున్నగువానిని అధికముగా తిని, ఒక్కొక్కసారి యొకటి రెండుచెంబుల నీరు త్రాగుదుము. ఉత్తరహిందూస్థానప్రాంతములలోని కృషీవలుడు ఒకసేరు యవధాన్యచూర్ణమును తిని, అందుచే మిక్కిలి డప్పిగొని, బావినుండి నీటిని పలుమారులు తోడి త్రాగనారంభించును. వేసవిలో మనయిండ్లలో కొన్నిభాగములు "ఖాలీ"గా నుంచి వెనుదగొట్టమునుండి దప్పిగొన్నట్టివారికి నీరు పోయుదుము. ఈ మార్గములు ఆచరించుటవలన జనులకు గుప్తత విషయము అంతముఖ్యముగా నుండదు; అది వారికి సాధ్యము కాదు. ఆవులకొట్టములను, గుఱ్ఱపులాయములను సింహశార్దూల పంజరములతో పోల్చిచూడుము. కుక్కను మేకతో పోల్చి చూడుము. పాశ్చాత్యుల ఆహారములో మాంసము ముఖ్యము. శీతలదేశములలో నీటిని ఎప్పుడోగాని త్రాగరు. గొప్పవారు చిన్న కాచపాత్రములలో కొంచెము సారాయిని కైకొందురు. ఫ్రెంచివారికి నీళ్లన్న రోత, అమెరికనులుమాత్రము వారిదేశము వేసవిలో మిక్కిలివేడిగానుండును కావున — మాటిమాటికి చాల నీరు త్రాగుదురు. న్యూయార్కు కలకత్తాకంటె వేడిగానుండును. జర్మనులు బీరు అను సారాయిని అధికముగా కైకొందురు. కాని, భోజనకాలమున కాదు.

శీతదేశములందు మనుష్యులకు సులభముగా పడిసెము పట్టును. అందుచేత వారు తుమ్మకుండుట సాధ్యముకాదు. ఉష్ణదేశములందు జనులు భోజనవేళలందు చాల నీటిని త్రావుదురు, కావున మనకు త్రేచకుండుట సాధ్యముకాదు. ఇక ఆచారములను చూడుడు: పాశ్చాత్యసంఘములో త్రేచితివేని, అది క్షమింప నర్హము కానట్టి ప్రబలదోషము; కాని జేబుగుడ్డను తీసి దానిలోనికి గట్టిగా చీదితివేని, అందేమియువారికి దోషము కనిపింపదు! మనసంఘములో అతిథి త్రేచినగాని గృహమేధి తృప్తినొందడు చక్కగా భుజించినందుకు త్రేనుపులే గురుతు! కాని ఇతరులతో కూర్చుండి భోజనముచేయునప్పుడు, చీదుట మనకు ఎట్లుండును?

ఇంగ్లండు అమెరికాలలో అజీర్ణవ్యాధినిగూర్చిగాని, నీకుగల జీర్ణకోశసంబంధవ్యాధులనుగూర్చిగాని, స్త్రీలయెదుట ప్రస్తావింపరాదు; నీ మిత్ర మొకవృద్ధస్త్రీయైనను, ఆమెతో నీకు సంపూర్ణ పరిచయ మున్నను, ఈ ఆక్షేపణ వర్తింపదు. ఫ్రాన్సుదేశములో ఈ విషయములనుగూర్చి యింత పట్టింపులేదు. జర్మనులకు అంతకంటె తక్కువపట్టింపు కలదు.

స్త్రీలయెదుటమాటలాడునపుడు ఇంగ్లండు అమెరికా దేశ పురుషులు మిక్కిలి జాగ్రత్త వహించియుందురు; 'లెగ్' (కాలు) అనుమాటనే ఎత్తరాదు. ఫ్రెంచివారు, మనవలె మిక్కిలి ధారాళముగా మాట్లాడుదురు; జర్మనీవారును, రష్యావారును ఎవరియెదుటనైన అసభ్యముగా భాషింతురు.

తన వలపునుగూర్చిన సంభాషణలు తల్లికొమాళ్ల మధ్యను, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రమధ్యను, తండ్రులతోను ధారాళముగా జరుగుచుండును. తండ్రి తనకొమార్తెను ఆమెప్రియుని (భర్తకాబోవువానిని) గూర్చి అనేక ప్రశ్న లడుగును. ఆమె పెండ్లియొప్పుదలనుగూర్చి సర్వవిధములగు పరిహాసవాక్కులాడును. అట్టి సందర్భములందు ఫ్రెంచికన్యక లజ్జావనతశిరస్కయై యుం

దును. ఆంగ్లకన్య బిడియపడుచుండును, అమెరికన్ కన్య తీవ్ర ప్రత్యుత్తరములు వెనువెంటనే యిచ్చుచుండును. చుంబనము, ఆలింగనముకూడ, అంత ఆక్షేపకరములుకావు ; వీనినిగూర్చి నలుగురియెదుట మాటలాడవచ్చును. కాని మన దేశమున వలపులనుగూర్చి పెద్దలగు బంధువులయెదుట మాటలాడరాదు వానిని అప్రస్తుతముగానేని ప్రస్తావింపరాదు.

పాశ్చాత్యు లిప్పుడు ధనికులు. మనుష్యునియొక్క దుస్తులు మిక్కిలి పరిశుద్ధముగా, ఆచారానుసరణలో నిర్దుష్టమైయున్న తప్ప, అతడు ''జెంటిల్ మన్''గా(పెద్దమనిషిగా)ఎన్నబడడు–సంఘములో నతడు చేరరాదు. ''జెంటిల్ మన్''గా ఉండువాడు తన కాలర్‌ను (మెడపట్టీ గుడ్డను) షర్టును దినమునకు రెండుమూడుసార్లు మార్చుకొనుచుండవలెను. బీదలకిట్లుచేయుట శక్యముకాదుగదా. బయటి బట్టపై మచ్చ లుండరాదు — చివర కందొక మడతయైనను ఉండకూడదు. వేడిమివలనిబాధ ఎంతగా నున్నను, చేతులకు గ్లోవులు (చేతిమేజోళ్లు) ధరించియే బయటికి పోవలెను. లేనిచో, వీథులలో నడచునప్పు డొకవేళ చేతులు మలినతనొందవచ్చును; మలినహస్తములతో ''లేడీ'' (ప్రతిష్ఠగలస్త్రీ) తో హస్తచాలనము చేయుట ''జెంటిల్ మన్''కు మిక్కిలి అనుచితము. మర్యాదస్థులసంఘములో, ఉమ్మివేయుటను, పుక్కిలించుటను, పండ్లుకుట్టుకొనుటను, ఎవ్వడైన చేసెనేని, ఆ అపరాధి ''చండాలుడు''గా— నీచజాతివాడుగా పరిగణింపబడి, విసర్జింపబడును.

పాశ్చాత్యుల ధర్మము శక్తిని — స్త్రీమూర్తిగా ఎన్నబడు సృజనశక్తిని — ఆరాధించుట వామాచారసాధకుడు స్త్రీ నారాధించువిధమును పోలియుండును. తాంత్రికారాధకుడు చెప్పునట్లు: ''ఎడమవైపున స్త్రీ; ......కుడివైపున, మద్యపూరిత పాత్రము; ఎదుట, మిశ్రణావశ్యవస్తుసహిత మగు వేడిమాంసము; ఉండవలెను. తాంత్రికమతము మిక్కిలి నిగూఢము, యోగుల

కేని దురవగాహము". ఈ శక్తిపూజయే బహిరంగముగా, ఎల్లర చేతను (అచట) అవలంబింపబడునది; మాతృభావము, అనగా తల్లిమెడ పుత్రునకుగల సంబంధము, కూడ మిక్కుటముగా కాన వచ్చును. యూరపుజనులది నిజమునకు రోమన్‌కాథొలిక్ మతమే! — ప్రొటస్టాంటిజమ్‌యొక్క బలము అచట అంతగా కానిపింపదు. రోమన్‌కాథొలిక్‌మతములో జెహోవా, యేసుక్రీస్తు, మూర్తిత్రయము అప్రధానదైవములు; అచటి ఆరాధన మంతయు మాతకే — చేతులలో ఏసుశిశువు నుంచు కొనియుండు ఆ మాతృమూర్తికే! చక్రవర్తి "అమ్మా" అని అఱచును; సేనాధిపతి "అమ్మా" అని అఱచును; పతాకహస్తు డగు సైనికుడు "అమ్మా" అని అఱచును; చుక్కానికడనుండు నావికుడు "అమ్మా" అని అఱచును; గుడ్డపేలికలు ధరించియున్న చెంబడివాడు "అమ్మా" అని అఱచును; వీథిలోని బిచ్చగాడు "అమ్మా" అని అఱచును! లక్షలాదిగొంతులు, లక్షలాది విధముల, లక్షలాదిప్రదేశములనుండి, — రాజభవనములనుండి, పూరిగుడిసెలనుండి, ఛర్చి (గుడి) లోనుండి — "అమ్మా", "అమ్మా", "అమ్మా" అని అఱచుచుందును. ప్రతి ప్రదేశమునుండియు "మరియా" అను శబ్దమే, రేయుంబవళ్లు "మరియా", "మరియా" శబ్దమే వినబడుచుండును.

తరువాతిది స్త్రీయొక్క ఆరాధన. ఈ శక్తిపూజ కామాంధత కాదు. కాశిలో, కాళీఘాట్‌లో, ఇతరపుణ్యక్షేత్రములలో చేయ బడునది శక్తిపూజయే, ఆ కుమారీపూజయే, ఆ సధవాపూజయే. ఆ శక్తి కేవలము భావనలోనిది కాదు, కేవలము ఊహలోనిది కాదు, — వాస్తవముగా, ప్రత్యక్షముగా కానిపించునది. మన శక్తిపూజ పుణ్యక్షేత్రములందుమాత్రమే, కొన్నివేళలందు మాత్రమే జరుపబడును. కాని వారిది ఎల్లచోట్లను, ఎల్లప్పుడును, దినముల, వారముల, మాసముల, సంవత్సరముల పొడుగునను జరుగుచుండును. స్త్రీకి అగ్రస్థానము; ఆమెదుస్తు, ఆమెఆసనము,

ఆమెఆహారము, ఆమెఅక్కఱలు, ఆమెసౌకర్యములు : ఇవన్నియు అగ్రగణ్యములే. ప్రతివిషయమునందును ప్రథమమర్యాదలు ఆమెకే అర్పింపబడును. ఉన్నతకుటుంబములందు పుట్టినవారి మాటయే కాదు; యువతులయొక్కయు, సౌందర్యవతుల యొక్కయు మాటమాత్రమేకూడకాదు; ప్రతిస్త్రీయొక్కయు, ఆమె ఎవరైనను, పరిచితమైనను, అపరిచితమైనను పూజ. ఈ శక్తిపూజను మూర్లు (మూర్స్) — మహమ్మదీయమతావలంబులగు మిశ్రితఅరబ్ జాతివారు స్పెయినును జయించి ఎనిమిది శతాబ్దము లేలినకాలమున యూరపులో మొదట ప్రవేశపెట్టిరి. యూరపులో పాశ్చాత్యనాగరికతయొక్కయు, శక్తిపూజయొక్కయు, ప్రథమబీజములను చల్లినవారు ఈ మూరులే. ప్రబలులై, సంస్కృతిగలవారై, మహిమాన్వితులైయున్న మూర్లు కాలక్రమమున శక్తిపూజను మఱచి, తమ మహోన్నతపదవినుండి పతనమొంది, ఆఫ్రికాలో ఎవ్వరెఱుగని యొక మాఱుమూలలో, చెదరి చెదరి, లోకమున కజ్ఞాతులై నేడు జీవించుచున్నారు. వారి నాగరికత యూరపుదేశస్థులకు సంక్రమించినది. మాతృదేవత మూర్లనువదలి క్రీస్తుమతస్థులపై తన ప్రేమపూర్వకాశీస్సులు కురియించి, వారి గృహములను ప్రకాశవంతములొనర్చినది.

## ఫ్రాన్సు—'ప-రీ' నగరము

ఈ యూరపు ఎట్టిది? నల్లగాను, కంచురంగుతోను, పసుపుపచ్చనిరంగుతోను, ఎఱ్ఱగాను ఉండెడు ఆసియా, ఆఫ్రికా, అమెరికా దేశస్థులు ఈ యూరపియనుల పాదములయొద్ద ఏల లొంగిపడియున్నారు? ఈ కలియుగమున వారికి ఏకచ్ఛత్రాధిపత్యము ఎట్లు లభించినది? పాశ్చాత్యఖండములు అత్యగ్రస్థానము నాక్రమించియుండు ప్రతివిషయమునకును ఆదిమమూల మగు ఫ్రాన్సుద్వారా ఈ యూరపును గ్రహింపవలెను. ప్రపంచము నేలు సర్వాధికశక్తి యూరపునకు కలదు. ఈ యూరపునకు

ప్రధానకేంద్రము ‘ప రీ’. పాశ్చాత్యనాగరికతకు ప్రధానకేంద్రము ‘ప రీ’. పాశ్చాత్యనైతికభావములు, ఆచారవ్యవహారప్రవర్తనములు మంచివిగాని చెడ్డవిగాని, తేజోమూలములుగాని, తమోమూలములుగాని ఈ ‘ప రీ’లోనే ముదిరి, పరిపక్వము లగును. ఈ ‘ప రీ’ మహాసముద్రమువంటిది. దీనియందు ప్రవాళ, మౌక్తికాది అమూల్యమణులుండును; సొరచేపలు మున్నగు క్రూర సముద్రజంతువులును ఉండును. యూరపుకు ఈ ఫ్రాన్సే “కర్మక్షేత్రము”. అది హృదయంగమ మగు దేశము; అంత శీతలము కాదు, అంత ఉష్ణము కాదు; మిక్కిలి సారవంతము; వర్షములత్యధికములు కావు, అతిస్వల్పములును కావు; ఆకాశము వినిర్మలము; ఎండ మనోజ్ఞము; ఓక్ *, చెస్నార్ † నామకవృక్షరాజములు సమృద్ధములు; పచ్చికబయళ్లు మనోహరములు; కొండలును నదులును చిన్నవి; ఊటలు ఆనందప్రదములు. చీనాలో కొన్ని భాగములు తప్ప, ఫ్రాన్సువలె అంత అందముగా నుండు దేశమును ప్రపంచములో నే నెక్కడను చూడలేదు. నీటియం దా సౌందర్యక్రీడ, నేలయం దా సమ్మోహనశక్తి, — గాలియం దా ఉన్మత్తత — ఆకసమునం దా పారవశ్యము! ప్రకృతి అంతరమణీయము, మానవులు అట్టి సౌందర్యప్రియులు! ధనికులును, బీదలును, చిన్నవారును, పెద్దవారును, తమ యిండ్లను, గదులను, వీథులను, పొలములను, తోటలను, అందలి నడత్రోవలను, ఎంతో ఇంపుగా, ఎంతో పరిశుభ్రముగా, నుంతురు! — దేశమంతయు చిత్రితపటమువలె కనిపించును. జపానులోతప్ప అంత ప్రకృత్యనురాగము, అంత కళాపిపాస నేను మఱెచ్చటను చూడలేదు. రాచనగరులనుబోలు ప్రాసాదములు, ఇంద్రుని నందనోద్యానమునుబోలు తోటలు, తోపులు, కృషీవలుల పొలములు సైతము ప్రతిష్ఠలమును, ప్రతివస్తువును, మనోజ్ఞ

* సింధూరవృక్షము.

† తివిసిచెట్టువంటి యొక వృక్షవిశేషము.

ముగా నొనర్చు ప్రయత్నము, కలావంతముగా జేయు ప్రయత్నము — గమనార్హము. ఈ ప్రయత్నము సాఫల్యముకూడ కాంచినది.

ప్రాచీనకాలమునుండియు ఫ్రాన్సు దేశము "గోలు ఆ" లకును, రోమనులకును, ఫ్రాంకులకును, ఇతరజాతులకును పోరాటము జరుగుచుండిన ప్రదేశము. రోముసామ్రాజ్యము పతన మొందిన పిదప, ఫ్రాంకులకు యూరపుపై నిరంకుశాధిపత్యము లభించెను. వారి ప్రభువగు షార్లిమేను ఖడ్గబలముచే యూరపులో క్రైస్తవమతమును ప్రవేశపెట్టెను. ఈ ఫ్రాంకువారిద్వారానే యూరపు ఆసియాదేశస్థుల యెఱుకకు వచ్చినది. కావుననే మన మిప్పటికిని యూరపియనులకు ఫ్రాంకీ, ఫెరింగీ, ఫ్లాంకీ, ఫిలింగ మున్నగుపేళ్లు వాడుచుందుము.

పాశ్చాత్యనాగరికతకు మూలస్థానమగు ప్రాచీనగ్రీసుదేశము తన తేజశ్శిఖరమునుండి పతనమొంది, విస్మృతికూపమున కూలి, అతివిస్తృతమగు రోముసామ్రాజ్యము నాగరికతావిహీనజాతుల దండయాత్రల తాకుడుచే భగ్నమునొందినపిదప, యూరపుఖండపు జ్యోతి ఆఱిపోయెను; ఆ కాలముననే ఆసియాఖండములో మఱొక అనాగరికజాతివారు — ఆరబులు — అజ్ఞాతస్థితినుండి లేచిరి. అపారవేగముతో ఈ ఆరబు ఉప్పెన ప్రపంచములోని వివిధభాగములకు వ్యాపింప నారంభించెను. బలిష్ఠమగు పెర్షియాదేశము ఆరబులదాడికి ఆగజాలక వినమ్రమై మహమ్మదీయమతము నవలంబింపవలసివచ్చెను. తత్ఫలముగా, ముస్లిమ్‌మతము వినూత్నాకృతిని దాల్చెను. ఆరబులమతము, పెర్షియా నాగరికత సమ్మేళన మొందెను.

ఆరబుల ఖడ్గసాహాయ్యముతో పెర్షియానాగరికత సర్వదిశలందును విస్తరింపసాగెను. ఆ పెర్షియానాగరికత పురాతన గ్రీసుదేశమునుండియు, హిందూదేశమునుండియు కైకొనబడినది. తూరుపునుండియు, పడమటనుండియు, ముసల్‌మన్ దండయాత్రా

తరంగములు యూరపుపై తీవ్రముగా తాకుచు, అందుతోపాటు జ్ఞానతేజస్సును, నాగరికతాదీప్తిని ప్రవేశపెట్టి, మాధ్యములో కూలియున్న యూరపుయొక్క అజ్ఞానాంధకారమును పటాపంచలు చేయనారంభించెను. ప్రాచీనగ్రీసుదేశపు వివేకము, పాండిత్యము, కళలు ఇటలీదేశమున ప్రవేశించి, అచ్చటి అనాగరికజనమార్గ ప్రాబల్యము నణచిపుచ్చి, తమ ఉజ్జీవనప్రభావమును అందు చొప్పించుటచే విశ్వరాజధానియగు రోమునగరముయొక్క మృత శరీరము మరల జీవముతో స్పందింపసాగెను. ఈ నూత్నజీవిత స్పందనము ఫ్లారెన్సు నగరమందు ప్రబలమును, అప్రతిహతమును అగు ఆకృతినిదాల్చి విజృంభించుటచే, ప్రాతవడ్డ ఇటలీదేశము నూతనజీవచిహ్నములు చూపనారంభించెను. దీనినే ("రినేశాన్స్" క్రొత్తపుట్టుక) అందురు. ఈ క్రొత్తపుట్టుక ఇటలీ దేశమునకు పునర్జన్మమాత్రము; కాని యూరపులోని తక్కిన దేశములకు అదియే ప్రథమజన్మము. యూరపు క్రీస్తువెనుక పదునాఱవశతాబ్దమున జన్మమందెను; అనగా, అక్బరు, జహంగీరు, షాజహాను మున్నగు మొగలాయిచక్రవర్తులు తమ మహత్తర సామ్రాజ్యమును హిందూదేశమున సుస్థిరముగా స్థాపించినట్టి కాలమునందే.

ఇటలీ ప్రాచీనకాలముననే యొక బలిష్ఠజాతికి నిలయమైన దేశము. రినేశాన్స్‌యొక్క ఆహ్వానమును విని యది మేలుకాంచి పలికినది; కాని వెంటనే శయ్యలో రెండవప్రక్కకు పొరలి మరల గాఢనిద్రామత్తత నందిన దని చెప్పవచ్చును. పెక్కు కారణములచేత హిందూదేశముకూడ ఈ కాలమున కొంచెము కదలిక చూపినది. అక్బరుమొదలు ముగ్గురుచక్రవర్తుల యేలుబడి కాలమున విద్య, జ్ఞానము, కళలు, హిందూదేశమున మిక్కుటముగా గౌరవింపబడుచుండెను. కాని హిందూదేశముకూడ చాల ప్రాచీనజాతియొక్క సదనము; అదికూడ ఏ కారణముచేతనో, ఇటలీవలెనే ప్రవర్తించి మరల నిద్రించినది.

ఇటలీలోని పునరుజ్జీవనకల్లోలము యౌవనబలిష్ఠ నూతన జాతియగు ఫ్రాంసులకు తాకినది. సర్వదిశలనుండి ఫ్లారెన్సులోనికి ప్రవహించి అక్కడ సమ్మేళనమందు నాగరికతాప్రచండప్రవాహము ఒక క్రొత్త యాకృతిని దాల్చెను; కాని అపరిమితమును, అత్యద్భుతమును అగు ఆ వినూతనకార్యోత్సాహశక్తిని తనయందే నిలుపుకొను బలము ఇటలీకి లేకపోయెను. హిందూదేశములో వలె ఆ నూతనోజ్జీవనము అచ్చటనే ముగిసి అంత మొందియుండెడిది గాని యూరపుఖండపు అదృష్టవశమున నవీనజాతివారగు ఫ్రాంకులు ఆ కార్యోత్సాహశక్తిని హర్షముతో నందుకొని, యౌవనరక్త పాటవముతో, తమ జాతీయనౌకను ధైర్యముగా ఆ వెల్లువనీటిలో తేలించిరి; ఆ పురోగమనప్రవాహము క్రమక్రమముగా పరిమాణమును, బలమును చేకూర్చుకొని, మొదట ఏకముగా నుండినది సహస్రముఖమై ప్రవహింపజొచ్చెను. యూరపులోని తక్కిన దేశజాతులు ఆ వెల్లువనీటిని క్రొత్తకాలువలు త్రవ్వుకొని అత్యాసక్తితో తమదేశములలోనికి మరలించుకొని, తమ జీవిత రక్తమును అందులో పోసి దాని పరిమాణమును, వేగమును అధికపఱచిరి. ఆ ప్రవాహము కాలపరిపాకమున హిందూదేశ తీరముల నెగదట్టి, జపానుతీరమువఱకును సాగి, ఆ జపాను నీటిలో స్నానమాడుటవలన మరల జీవశక్తిని చేకూర్చుకొనినది. ఆసియాలో జపాను క్రొత్తగా జాతీయత నందిన దేశము.

గోముఖ గంగానది కెట్లో అట్లే యూరపియన్ నాగరికతకు 'పరీ' పట్టణము ఆదిమమూలము. మహావిస్తృతమగు ఈ ప్రధాననగరరాజము భూలోకస్వర్గము, నిరంతరానందనిలయము, సదానందనగరి. అంత భోగసమృద్ధి, అట్టి సుఖానుభూతి, ఆ ఉల్లాసము లండన్‌లోగాని, బెర్లిన్‌లోగాని, మఱెచ్చటగాని లేవు. లండన్‌లోను న్యూయార్కులోను ద్రవ్యసమృద్ధియు, బెర్లిన్‌లో విద్యావివేకసమృద్ధులును కలవు. నిజమే; కాని ఎచ్చటను ఆ ఫ్రెంచిభూమి, సర్వాతిశయమగు ఆ ఫ్రెంచిప్రతిభాతిశయము

కానరావు. తక్కిన చోట్ల ఎంత ద్రవ్యమైన నుండనిమ్ము, విద్యావివేకము లుండనిమ్ము, ప్రకృతిసౌందర్యముకూడ ఉండనిమ్ము, కాని ఆ 'మనుష్యుడు' లేడు! అద్భుతమగు ఈ ఫ్రెంచిస్వభావము — మరల పుట్టుటకై మరణించిన — ప్రాచీనగ్రీకుస్వభావముయొక్క అవతారమని చెప్పవచ్చును. వారు ఎల్లప్పుడు ఉల్లాసముతోను, ఉత్సాహముతోను నిండి, సామాన్యజీవితమున దీర్ఘాలోచనలు చేయక, ఒక్కొకసారి నిరర్థకముగాకూడ ప్రవర్తించుచు, కార్యావసరములందుమాత్రము మిక్కిలి గాంభీర్యమును, సద్యఃస్ఫూర్తిని, సుస్థిరతను చూపుచుందురు. కాని కొద్దిపాటి ప్రతిరోధమునకేని నైరాశ్యమునొందుట వారికి నైజము. ఐనను వారికి ఆ నైరాశ్యము క్షణికమాత్రమే. కొంచెముసేపటిలోనే వారి ముఖము నూతనాశాధైర్యవిశ్వాసములతో దీపింప నారంభించును.

'పరీ' నగరపు విశ్వవిద్యాలయము యూరపుఖండపు విశ్వవిద్యాలయముల కన్నిటికిని "మేలుబంతి" యైనది. ప్రపంచములోని వైజ్ఞానికవిద్యాశాల లన్నియు ఫ్రెంచివైజ్ఞానికవిద్యాశాల యొక్క అనుకరణములే. ఉపనివేశములను (కాలనీస్) స్థాపించుటను మొదట ఇతరదేశములకు నేర్పినది 'పరీ' నగరమే. సమరవిద్యయందు సర్వభాషలలోను ఉపయోగింపబడు మాటలు నేటికిని ప్రాయికముగా ఫ్రెంచిమాటలే. ఫ్రెంచిరచనలయొక్క శైలియు, ఫక్కియు యూరపియన్ భాష లన్నిటిలో అవలంబింపబడినవి. విజ్ఞానశాస్త్రములకును, దార్శనికశాస్త్రములకును, కళలకును, 'పరీ' నగరమే గని (ఉత్పత్తిస్థానము). ప్రతిప్రదేశమందను, ప్రతివిషయమునను ఫ్రెంచిఅనుకరణము కలదు — ఫ్రెంచివారు పట్టణవాసులైనట్లును, తక్కినసర్వజాతులునువారితో పోల్చిచూచిన పల్లెటూరివారైనట్లును ఊహింపబడుచుండును! విద్యావిషయమందేమి, కళావిషయమందేమి, సాంఘికవిషయములందేమి, ఫ్రెంచివారు ప్రారంభించినదానిని జర్మనులు, ఆంగ్లేయులు, తక్కిన

జాతులు — ఏబది, అరువదియైదేండ్లపిదపకూడ — అనుకరింతురు. ఈ ఫ్రెంచినాగరికత స్కాట్లండు చేరెను. స్కాట్లండురాజు ఆంగ్లేయులకును రాజైనప్పుడు, ఆనాగరికత ఇంగ్లండును నిద్రనుండి లేపి, అచటివారికి కార్యోత్సాహము కలిగించినది;—స్కాట్లండు దేశపు స్టూవర్టువంశరాజశ్రేణి పరిపాలించుచుండినకాలముననే ఇంగ్లండులో రాయల్ సొసైటీయును, ఇతరసంస్థలును స్థాపింపబడినవి.

మఱియు ఫ్రాన్సుదేశము స్వాతంత్ర్యమునకు పుట్టినిల్లు. ఇచ్చటినుండి — ఈ 'ప-రీ' నగరమునుండి ప్రజాబలము అపారమగు కార్యోత్సాహశక్తితో బయలువెడలి యూరపు దేశమును మూలబంధసహితముగ ఊపివైచెను. అప్పటినుండి యూరపు ముఖవైఖరియే పూర్తిగా మాఱిపోయి, నవీనయూరపు ఖండము ఉత్పత్తియైనది. లిబర్టి*, ఈక్వేటీ†, ఫ్రెటర్నిటి‡ అను మాట లిప్పుడు ఫ్రాన్సులో వినిపించుటలేదు; ఆ దేశమిప్పుడు ఇతరభావములను, ఇతరసంకల్పములను అనుకరించుచున్నది. కాని యూరపులోని ఇతరదేశములందు ఫ్రెంచి విప్లవపుమూలశక్తి ఇప్పటికిని పనిచేయుచున్నది.

'ప రీ' నగరము లోకమునకు కేంద్రస్థానమనియు, ఏ దేశమైనను ఆ నగరముతోడిసంబంధము నెంత యధికముగా నేర్పఱచుకొనగలుగునో, అంతయధికముగా ఆ దేశపు జాతీయజీవనాభివృద్ధి సమకూడుననియు ఇటీవల ఇంగ్లండులోని యొక సుప్రసిద్ధ విజ్ఞానశాస్త్రజ్ఞుడు నాతో చెప్పెను. ఈ మాటలో కొంత అత్యుక్తి కలదు. కాని, ఎవడైనను లోకమున కొక నూత్నభావము నర్పింపవలసియున్నచో, దానిని వ్యాపింపజేయుటకు 'ప రీ' నగరమే అర్హతమము అనుటకు సంశయములేదు. 'ప రీ' ప్రజల యామోదము నొందగల్గినచో, యూరపుఖండ మంతయు ఆ యామోద

* స్వేచ్ఛ † సమత్వము ‡ సౌభ్రాత్రము.

ముతో నిస్సంశయముగా ప్రతిధ్వనించును. స్థపతి, చిత్రకారుడు, గాయకుడు, నటుడు—ఏ కళోపాసకుడైనను 'ప రీ' లో మొదట ప్రఖ్యాతి నొందగలిగినచో, ఇతరదేశముల గౌరవమును, ఆమో దాతిశయమును సులభముగా ఆర్జించుకొనును.

మన దేశమునందు 'ప రీ' యొక్క ప్రతికూలపక్షమును గూర్చిమాత్రమే — అది ఘోరప్రదేశ మనియు, భూలోకనరక మనియు—విందుము. ఆంగ్లేయులలో కొందఱి కీ యభిప్రాయము కలదు; ఇతరదేశములలోని ఐశ్వర్యవంతులు జీవితమున ఇం ద్రియసుఖానుభూతినే పరమసుఖముగా ఎంచువారు — 'ప-రీ' నగరము దుర్నీతికిని, ఇంద్రియభోగములకును నిలయమని ఎంచుట సహజమే.

కాని పాశ్చాత్యఖండ మహానగరములు — లండన్, బెర్లిన్, వియన్నా, న్యూయార్క్ మున్నగునవి అన్నిటిలోను ఇదేస్థితి కలదు. ఒక ముఖ్యభేదము మాత్రమున్నది: ఇతరనగరము లందు ఇంద్రియభోగమార్గములు చప్పనివి, మొఱటువి; కాని నాగరికతానిలయ మగు 'ప-రీ' లోని మాలిన్యముకూడ బంగరు తగడుతో కప్పబడియుండును! 'ప-రీ' లోని సుకుమారభోగమును ఇతరనగరములలోని అసభ్యభోగములతో పోల్చుట, నెమలి తన పింఛమును విచ్చుచు ఆడుటను అడవిపంది బురదలో పొర్లాడు టతో పోల్చుటవంటిది.

సుఖముగా జీవించుచు ఆ సుఖము ననుభవించుచుండవలె నను లాలస లోకములో ఏజాతికిలేదు? లేనిచో, ధనమునార్జించిన వారు తక్కిన అన్నితావులను విసర్జించి వెనువెంటనే 'ప రీ'కి వెళ్లుటేల? రాజులు, చక్రవర్తులు, మాఱుపేరుతో 'ప-రీ'లో ప్రచ్ఛన్నముగా జీవించుచు, ఈ ఇంద్రియభోగ జలావర్తములో స్నానమాడుటను ఏల సుఖజీవనముగా ఎంచవలెను? ఈ లాలస అన్నిదేశములందును కలదు, దాని సిద్ధికై ఎన్ని కష్టములైనను

పడుదురు. ఒకే భేదము కలదు. ఫ్రెంచివారు దాని నొక సమగ్ర విద్యగా నొనర్చిరి. భోగము లెట్లనుభవింపవలసినది వా రెఱుగుదురు. వారు భోగనిశ్రేణి (నిచ్చెన) యొక్క అగ్రతమసోపానము నెక్కగలిగిరి.

ఇట్లయ్యును, 'ప రీ' లోని అసభ్యనాట్యములలో, వేడుకలలో, ఎక్కువభాగము విదేశీయులయానందముకొఱకే; ఫ్రెంచివారు మిక్కిలి జాగరూకత గలవారు. వారు వ్యర్థముగా ధనవ్యయము నెన్నడును చేయరు. అచ్చటగల భోగాతిశయములు, ఒక్కపూట భోజనపుఖర్చే మనుష్యునికి చేటుతెచ్చునంతటి వ్యయమును కోరు భోజనపుహోటళ్లు, కాఫీహోటళ్లు ధనికులును, వివేకహీనులును అగు విదేశీయులకొఱకే ఏర్పడినవి. ఫ్రెంచివారు మిక్కిలి నాజూకునందినవారు; మర్యాద సమృద్ధిగా చూపుదురు; వారి ప్రవర్తన రమ్యము, మధురము; ధనము లాగుటలో వారు ప్రవీణులు, అట్లు చేసినపుడు తమలో తామే నవ్వుకొందురు.

ఇదిగాక మఱొక గమనార్హవిషయముకూడ కలదు. అమెరికనులలో, జర్మనీవారిలో, ఆంగ్లేయులలో గల సాంఘికజీవనమునందు అన్నిజాతులకును ప్రవేశము కలదు. కావున విదేశీయుడు దానిని కూలంకషముగా గ్రహించుట సులభము. కొలదినాళ్లు పరిచయమైన వెనుక అమెరికాదేశస్థుడు మనలను తనయింటిలో కొన్నాళ్లుండి వెళ్లుమని యాహ్వానించును; జర్మనుదేశీయుడుకూడ అట్లే చేయును. కొంత దీర్ఘపరిచయానంతరము ఆంగ్లేయుడును అట్లొనర్చును. కాని ఫ్రెంచివా రట్లు చేయనే చేయరు. ఫ్రెంచివాడు ఎవ్వరినిగాని — అతడు తనకు ఆప్తస్నేహితుడైనతప్ప — తన కుటుంబముతో కలసి నివసింపుమని ఆహ్వానింపడు. కాని విదేశీయునికి అట్టి యవకాశము లభించి, కుటుంబమును చక్కగా చూచి, గ్రహింప ననువగు తరుణమును, కాలమును, దొరకినయెడల, వారినిగూర్చి సామాన్యముగా విను అభిప్రాయమునకు కేవల భిన్నమగు అభిప్రాయము అతనికి

కలుగును. కలకత్తాలో నిమ్నశ్రేణు లుండు ప్రాంతమును మాత్రము చూచి, మన జాతీయశీలమునుగూర్చి అభిప్రాయము నేర్పఱచుకొని ప్రకటించుటలో విదేశీయులు చూపు అవివేకము ఇట్టిదేకదా! 'పరీ' నగరవిషయముకూడ ఇట్టిదే. మనదేశములో అవివాహితస్త్రీలు ఎంతజాగ్రత్తగా చూడబడుదురో, అంత జాగ్రత్తగా ఫ్రాన్సులోని అవివాహితస్త్రీలుకూడ చూడబడుదురు; వారు ధారాళముగా సంఘములో కలసి మెలసి మెలగుటకుకూడ అనుమతింపబడరు; వివాహానంతరముననే — భర్తలతోకూడి — వా రట్లు చేయవచ్చును. మనలోవలెనే వారిలోను వైవాహిక ప్రసంగములు తలితండ్రులే నడపుదురు. పెండ్లిండ్ల సందర్భములందును, పూజాసందర్భములందును మన మెట్లు నటీజనప్రదర్శనము లేర్పాటుచేయుదుమో అట్లే, ఉల్లాసవంతులు గనుక, వారును, తమ గొప్పసాంఘికకార్యము లేవియు ఆటవెలదుల నాట్యప్రదర్శనము లేనిది పరిపూర్ణతనొందినట్లు ఎంచరు. పొగమంచుక్రమ్ముకొని మసకగానుండు దేశమున నివసించువా రగుటచే ఆంగ్లేయులు వ్యాకులస్వభావముగలవారు. అందుచే వారు ముఖము మాడ్చుకొని, ఇండ్లయొద్ద అట్టి నాట్యములు మిక్కిలి అనుచితము లని చెప్పుదురు; కాని నాటకశాలలలో వాని నాక్షేపింపరు. వారినాట్యములు మనదృష్టికి అనుచితములుగా నుండవచ్చును గాని, వానికి వాడుకపడియుండుటచే వారికి అవి అనుచితములుగా నుండవని మన మిచట జ్ఞప్తిలోనుంచుకొనవలెను. నాట్యకాలమున నర్తకి కంఠము, భుజములు బహిరంగముగా కనిపించు దుస్తులు ధరించియుండవచ్చును. అది అనుచితముగా ఎంచబడదు. ఆంగ్లేయులును, అమెరికనులును, ఆ నాట్యములకు నిరాక్షేపముగా పోయి వానిని దర్శింతురు; కాని ఇండ్లకుపోయినపిమ్మట ఫ్రెంచి ఆచారములను ఖండించుటను మానుకొనకపోవచ్చును!

మఱియు స్త్రీల సౌశీల్యమునుగూర్చిన భావము అన్నిచోట్లను ఒకటే — వారు దానినుండి తొలగుట అపాయకరము.

కాని పురుషులవిషయమున అది అంత ముఖ్యము కాదు. ఈ విషయమున ఫ్రెంచిపురుషుడు అంత గట్టిపట్టుపట్టడు. విదేశీయ ధనికులవలెనే అతడును ఇతరుల పరామర్శలను లక్షింపడు. మొత్తముమీద యూరపు పురుషులలో నెక్కువభాగము కొంచెె పాటి నీతిభ్రంశమును నంత తప్పుగా నెంచరు. పాశ్చాత్యఖండము లలో అవివాహితపురుషుల విషయముకూడ ఇంతే. తరుణవయస్కు లగు విద్యార్థుల తలిదండ్రులు ఆ బాలుర స్త్రీలతో మెలగుటకు సిగ్గుపడుచుండుటను కొంత లోపముగనే గణింతురు. అందువలన వారికి అడంగితనము పట్టువడునని వారి భీతి. పాశ్చాత్యదేశము లలో మనుష్యులకు ముఖ్యముగా నుండవలసిన సుగుణములలో శ్రేష్ఠతమమైనది — ధైర్యము. వారి వర్ట్యూ = (సుశీలత) అను మాటయు మన "వీరత్వము" అనుమాటయు ఒక్కటే (అభిన్న ములు). "వర్ట్యూ" శబ్దపు వ్యుత్పత్త్యర్థమును చూచి, వారు మానవునిలో దేనిని యోగ్యగుణముగా నెంతురో చూడుడు. వారు స్త్రీలకు సౌశీల్యమే (పాతివ్రత్యమే) ముఖ్యతమధర్మముగా భావింతు రనుటకు సంశయములేదు. ఒక పురుషుడు అనేక భార్యలను వివాహమాడుట, ఒక స్త్రీ ఏకకాలమున అనేక భర్తలను కలిగియుండుటంత సాంఘికహానికరము కాదు — ఈ రెండవదానివలన జాతి క్రమముగా క్షీణించును. కావున స్త్రీలసౌశీల్యమునకు హానిరాకుండునట్లు సర్వదేశములందు మిక్కిలి జాగ్రత్తపడుచుందురు. స్త్రీలసౌశీల్యసంరక్షణవిషయమున ప్రతి సంఘము చేయు ప్రయత్నములకు మూలమై ప్రకృతియొక్క సంకల్పము కానిపించుచున్నది. జనసంఖ్యను అభివృద్ధి పఱచుట ప్రకృతికి సహజము. ఆ సహజస్థితికి స్త్రీజనసౌశీ ల్యము సాహాయ్యకారి. కావున పురుషుల శీలనైర్మల్యవిష యమునందుకంటె స్త్రీల శీలనైర్మల్యవిషయమునందు ఎక్కువ ఆతురము చూపుటలో ప్రతిసంఘము ప్రకృతిసంకల్పమునే నెఱ వేర్చుచున్నది.

ప్రతిజాతియొక్క జీవితమున కొక ప్రత్యేక నైతికలక్ష్యము కలదనియు, ఆ జాతియొక్క ఆచారములు, ప్రవర్తనములు, ఆ లక్ష్యమునుబట్టియే విచారించి వాని మంచిచెడ్డలు నిర్ణయింప వలసియుండునవియు, మీ మనస్సులలో కెక్కించుటకొఱకే ఈ విషయములనుగూర్చి ప్రసంగించితిని. పాశ్చాత్యులను మనము వారి కన్నులతోనే చూడవలెను; వారిని మనకన్నులతో చూచుటయు, మనలను వారు తమకన్నులతో చూచుటయు — రెండును తప్పే. వారి జీవితలక్ష్యము, మన జీవితలక్ష్యము ప్రత్యక్షవిరుద్ధములు. సంస్కృతములో విద్యార్థిపేరగు "బ్రహ్మచారి" శబ్దము "కామజిత్"* అను సంస్కృతశబ్దమునకు పర్యాయపదము. మన జీవితపరమార్థము మోక్షము; అది బ్రహ్మచర్యము (లేక, పరిపూర్ణ కామనిగ్రహము) లేనిది ఎట్లు సాధింపబడును? కావున అది విద్యార్థిదశయందుండు మన బాలురకును, యువకులకును, అవశ్యానుసరణీయముగా విధింపబడినది. పాశ్చాత్యజీవితలక్ష్యము భోగము, సుఖానుభూతి, కావున మనకువలె వారికి నిష్ఠాబ్రహ్మచర్యము పాటించుట అంత ముఖ్యముకాదు.

ఇప్పుడు మరల 'పెకీ' విషయమునకు వత్తము. ఆధునిక 'పెకీ' నగరమునకు సాటివచ్చు నగర మేదియు ప్రపంచములో లేదు. పూర్వము అది యున్నస్థితికిని దాని యిప్పటిస్థితికిని సంబంధమే లేదు. అప్పుడు అది కాశిలో వంగదేశీయులుండు ప్రాంతము వలె — వంకరటింకరలగు సందుగొందులు, వీధులు; అక్కడక్కడ సందువిడకుండా నిలిపిన కమానులచే నొకటిగా చేర్చబడిన గృహములు; గోడలప్రక్కన బావులు—ఇట్టి స్థితియందుండినది. చిత్రప్రదర్శనములో వ్రాసిన 'పెకీ' నగర ప్రతిరూప మొకటి చూపబడినది. కాని ఆ 'పెకీ' ఇప్పుడు — క్రమపరిణామముల వలన—పూర్తిగా అదృశ్యమైనది; ఇందు సంభవించిన యుద్ధములు,

* పూర్ణమగు ఇంద్రియనిగ్రహముకలవాడు.

విప్లవములు ప్రతిపర్యాయము నగరములో నేదో యొకభాగమును ధ్వంసమొనర్చి, అచట సర్వమును నేలచదరము చేసినవి. మరల నిప్పుడు వానిస్థానమున ఆధునిక 'ప రీ' నగరము — ఎక్కువ నిర్మలమై, ఎక్కువ విస్తృతమై — ఉద్భవించినది.

ఆధునిక 'ప రీ' నగరము, చాలవరకు, మూడవ నెపోలియన్ యొక్క సృష్టి. పురాతనప్రభుత్వపతనకాలమున ప్రారంభమైన నగరపరిణామము నతడు పూర్తిచేసెను. ఫ్రెంచివిప్లవమునకు పూర్వ ముండిన నిరంకుశప్రభువులచే ఫ్రెంచిప్రజ లెట్లు హింసింప బడుచుండినది ఫ్రాన్సుదేశచరిత్రము నెఱిగిన విద్యార్థికి జ్ఞప్తిచేయ వలసిన అవసరము ఉండదు. మూడవ నెపోలియన్ కేవలము ఆయుధబలముచేతనే, రక్తములోనడచి, చక్రవర్తిగా ప్రకటించు కొనెను. ప్రథమ ఫ్రెంచివిప్లవకాలమునుండి ఫ్రెంచివారు ఎప్పు డును చపలచిత్తులై సామ్రాజ్యమునకు భయకారణులై యుండిరి. అందుచే చక్రవర్తి— ప్రాచీన 'ప రీ' లోని జ్ఞాపకచిహ్నముల నట్లే యుంచి —, ప్రజలు తృప్తచిత్తులై యుండుటకొఱకును, సర్వదా అస్థిరబద్ధులైయుండు 'ప రీ' జనులను కార్యమగ్నుల నొనర్చి ఆనందింపజేయుటకొఱకును, అద్భుతములగు రాచబాట లను, అడ్డకట్టలను, సింహద్వారములను, నాటకశాలలను, ఇంక అనేకములగు శిల్పనిర్మాణములను నూత్నముగా కట్టించుచుండెను. ఒకదిశనుండి మఱియొకదిశకుపోవు తిన్నని, విశాలములగు రాచ బాటలు నగరమునిండ నిర్మించెను; దివ్యములగు ప్రాచీనభవనము లను చక్కపఱచెను; క్రొత్తవి కట్టించెను; ఇవన్నియుకాక, దుర్గ ప్రాకారపంక్తి యొకటి కట్టించి, నగరవైశాల్యము రెండింతలు చేసెను. వృక్షపంక్తిశోభితములగు విశాలవీథులకును, డాన్‌టాన్గ్ మున్నగు ప్రాంతములలోని చక్కని గృహములకును ఇదియే మూలము. లోకమునందు అద్వితీయమైన షామ్స్ ఎలిజె అను శృంగారవనమందలి వృక్షపంక్తికి మధ్యనుండు విహారవీథికూడ అప్పుడే పునర్నిర్మాణముచేయబడెను. ఈ విహారవీధి అత్యంత

విశాలము; దీని నడిమిప్రదేశపు పొడుగునను, ఇరుప్రక్కలను, తోటలు వేయబడియున్నవి. ఒకప్రదేశమున అది వర్తులాకృతి దాల్చి నగరముఖమై, ప్లాస్ డెలకాన్ కాడ్ అను పేరుగలిగి నగర పశ్చిమభాగమున నున్నది. ఈ ప్లాస్ డెలకాన్ కాడ్ చుట్టును ఫ్రాన్సులోని ఎనిమిది ముఖ్యపట్టణముల ప్రత్యామ్నాయములగు ఎనిమిది స్త్రీరూపవిగ్రహములు కలవు. ఈ విగ్రహములలో నొకటి స్ట్రాస్‌బర్గ్ జిల్లాను సూచించునది. ఈ జిల్లాను 1872 వ సంవత్సరపు యుద్ధానంతరము జర్మనులు ఫ్రెంచివారియొద్దనుండి లాగుకొనిరి. ఈ నష్టమువలని బాధను ఫ్రెంచివారు మఱవజాలక, అమృతాత్మయొక్క స్మృతిచిహ్నముగానో (అనునట్లు) ఆ విగ్రహము నిప్పటికిని పుష్పములతో, పుష్పమాలలతో కప్పియుంతురు*. మానవులు తమ మృతబాంధవుల సమాధులపై పూలమాల లుంచువిధమున, వారు ఆ విగ్రహముపై ఎప్పుడో ఒకప్పుడు పూలమాల లుంతురు.

ఢిల్లీలోని "చాంద్నీచౌకు" పూర్వ మొకప్పుడు ఈ ప్లాస్ డెలకాన్ కాడ్‌ను పోలియుండవచ్చునని నాకు తోచుచున్నది. విజయస్తంభములు, జయసూచకధనురాకృతులు, శిల్పవిద్యాప్రదర్శకము లగు బ్రహ్మాండమైన స్త్రీపురుష విగ్రహములు, సింహారూపములు ఆ ప్లాస్ డెలకాన్ కాడ్‌కు అచ్చటచ్చట అలంకారములై శోభిల్లుచున్నవి.

ట్రేజన్స్ కాలమ్‌వలె నుండు నొక మిక్కిలి పెద్ద విజయస్తంభము — "గన్ మెటల్" అను మిశ్రలోహముతో (1,200 ఫిరంగీలను కరిగించుటచే వచ్చిన మిశ్రలోహముతో) చేయబడినది — ప్లాస్ వాన్‌డోమ్‌లో వీరాగ్రేసరుడగు ఒకటవ నెపోలియన్ స్మృతిచిహ్నముగా నిర్మింపబడియున్నది; ఆ స్తంభపు ప్రక్కలందు ఆ చక్రవర్తి పరిపాలనకాలపు విజయ

* ఇది 1914 సంవత్సరపు మహాయుద్ధమునకుముందు వ్రాయబడినది.

ములు చెక్కబడియున్నవి; అగ్రభాగమున నెపోలియన్ బోనపార్టి విగ్రహము కలదు. ప్లాస్ ద లా బేస్టిల్ అనుచోట — పిదప రాజకీయకారాగృహముగా ఉపయోగింపబడిన బస్తీల్ అనెడు ప్రాచీనదుర్గస్థానమున — 1830 వ సంవత్సర జూలై మాస విప్లవ స్మృతిచిహ్నమగు "జూలై స్తంభము" కలదు. ప్రభువు కోపమునకు గుఱియైనవారు ఈ చెఱసాలలో నుంపబడువారు. ఆ ప్రాచీనకాలమున విచారణాదిక మేమియు లేకయే రాజు ప్రభుముద్రాంకితమగు లెట్టర్ ద కషె అనెడు నొక అధికారపత్రమును (వారంట్) "జారీ" చేయును. తత్క్షణముననే, ఆ నిర్భాగ్యుడు— దేశోపకారక కార్యము లేమిచేసినది విచారింపకయే, అతడు నిజముగా అపరాధియో, కాడో, విచారింపకయే, రాజు కోపమునకు గుఱియగుట కతడు ఏమి చేసెనో అనికూడ ప్రశ్నింపకయే— బేస్టిల్లోనికి త్రోయబడును. రాజుల ప్రియురాండ్ర కెవనిమీదనైన కోపమువచ్చెనేని, వారు రాజు నడిగి యొక 'లెట్టర్ ద కషె' అతనిపై ప్రయోగింపవచ్చును; ఆ నిర్భాగ్యుడు వెంటనే బేస్టిల్కు పంపబడును. అందు బంధింపబడిన నిర్భాగ్యులలో, మిక్కిలి కొలదిమందియే ఎన్నడేని వెలికివచ్చిరి. పిమ్మట, ఇట్టి హింసాచరణమును, క్రౌర్యమును సైపక దేశమంతయు ఒకటై తిరుగుబాటుచేసెను. "ప్రతిమానవునికి స్వాతంత్ర్యము, అందఱును సమానులు, ఎవ్వరును అధికులు కారు, అధములును కారు" అని యఱచుచు, 'ప-రీ' ప్రజలు ఉద్రేకోన్మత్తులై రాజును, రాణిని పట్టుకొని వారి పైబడిరి. ఆ మూక చేసిన ప్రథమకార్యమిది. మనుష్యుడు తోడిమనుష్యునిపై చూపగల క్రౌర్యాధిక్యచిహ్నమగు బేస్టిల్ను పెఱికివైచి, ఆ ప్రదేశమున నాట్యముచేయుచు, పాటలుపాడుచు, విందులారగించుచు, ఆ రాత్రి నంతయు గడపిరి. రాజు తప్పించుకొనిపోవ యత్నించెను, కాని ప్రజ లతనిని పట్టుకొనగలిగిరి. మఱియు ఆస్ట్రియాచక్రవర్తి యగు అతని మామ, అతనికి సాహాయ్యముచేయుటకై సైనికుల నంపుచున్నాడని విని,

కోపోద్దీపితులై, రాజురాణులను చంపివైచిరి. ఫ్రెంచిజాతియెల్ల స్వాతంత్ర్యనామమునను, సర్వసమత్వనామమునను, ఉన్మత్త మయ్యెను — ఫ్రాన్సులో ప్రజాప్రభుత్వ (రిపబ్లిక్) మేర్పడెను. ఉన్నతులుగా పరిగణింపబడుచున్నవారిలో దొరకినవారి నెల్ల వారు చంపివైచిరి; ఆ "ఉన్నతుల"లో అనేకులు తమ బిరుదములను, పదవిని, విసర్జించి ప్రజాసామాన్యమువైపు చేరిరి. ఇంతేకాక ఫ్రెంచిప్రజలు ప్రపంచమునగల సర్వజాతులకును "నిదురమేలుకొండు, రాజు లెల్లరు ప్రజాకంటకులు, వారి నందఱను పరిమార్పుడు, ప్రతివారికిని స్వాతంత్ర్యము, సమానాధికారములు, కలుగుగాక!" అని ప్రబోధించిరి. అంతట యూరపులోని రాజులెల్లరును ఈ అగ్ని తమ దేశములలోనికి వ్యాపించి తమ సింహాసనములను దగ్ధముచేయు నని భీతితో గడగడవడకుచు, దానిని చల్లార్ప కృతనిశ్చయులై, సర్వదిశలనుండి ఫ్రాన్సుపై బడిరి. రెండవవైపు ఫ్రెంచిప్రజాప్రభుత్వనాయకులు "లాపత్రి ఆడాన్జే - పితృదేశమునకు అపాయస్థితి కలిగినది, ప్రతివారును రండు" అని ప్రకటించిరి. ఈ ప్రకటన దావానలజ్వాలలవలె ఫ్రాన్సులో సర్వతోముఖముగా వ్యాపించెను. నిఱుపేదలగు ఫ్రెంచిప్రజలు — పడుచువారు, వృద్ధులు; పురుషులు, స్త్రీలు; ధనికులు, పేదలు; ఉన్నతులు, నీచులు—గుంపులుకూడి, చీలికపేలికగుడ్డలు దాల్చి, ఉత్తకాళ్లతో, అమితమగు ఆ చలిలో, సగముకడుపునకే తిని, భుజములపై తుపాకులుపెట్టుకొని—ధైర్యోత్సాహసముద్దీపకమగు ఫ్రాన్సుదేశపు జాతీయగీతమును—లామార్సెయ్యేస్ నామకసమరగీతమును—పాడుచు బయలువెడలిరి, — "పరిత్రాణాయ...వినాశాయ చ దుష్కృతామ్"—దుర్మార్గులను నాశముచేయుటకును, తమగృహములను రక్షించుకొనుటకును — ఏకమై మోహరించిన అఖిలయూరపుదేశసైన్యమహాసందోహమును ధీరతతో ఎదుర్కొనిరి. యూరపుఖండ మంతయుచేరినను, ఫ్రెంచిసైన్యము యొక్క ధాటికి ఆగజాలకపోయెను. ఫ్రెంచిసైన్యముఖమున,

అగ్రేసరుడై, యొక మహావీరుడు — తన వ్రేలు కదల్చినమాత్ర మున ప్రపంచమంతయు వడకిపోవునంతటి మహావీరుడు నిలిచి యుండెను. అతడే నెపోలియన్. ఖడ్గధారతోను, బాకుమొన తోను, అతడు "స్వాతంత్ర్యము, సమానత్వము, సౌభ్రాత్రము" అను భావమును యూరపుయొక్క 'అస్థిమజ్జాం'తరములలోనికి ఎక్కించెను. ఇట్లు త్రివర్ణపతాక కోకార్డ్ నామకము యొక్క విజయము సాధింపబడెను. పిదప నెపోలియన్ ఫ్రాన్సుకు చక్రవర్తియై, ఫ్రెంచి సామ్రాజ్యమును సంఘటితము చేయగలిగెను.

తన పిదప సింహాసన మధిష్ఠింపగల "వారసుడు" ఆమెకు జన్మింపనందున, అతడు జోసఫీన్ చక్రవర్తినిని — కష్టసుఖములందు తనకు సమభాగినియై, తనభాగ్యదేవతగానుండిన తన్ను అదృష్ట మార్గమున నడపినభార్యను విడనాడి, ఆస్ట్రియాచక్రవర్తి పుత్రికను వివాహమాడెను. కాని జోసఫీన్‌ను విడనాడుటతోడనే అతని యదృష్టచక్రము ప్రతికూలముగా తిరిగెను. అతని సైన్యము రష్యనుదండయాత్రలో మంచునందును, మంచుగడ్డలందును, చిక్కి నశించెను. యూరపువారు ఈ యవకాశమును గైకొని, అతనిని బలాత్కరించి సింహాసనవిసర్జనమున కంగీకరించునట్లును, దేశభ్రష్టుడై యొకద్వీపమున నివసించునట్లును చేసి, పూర్వపు రాజవంశమువాని నొకనిని సింహాసనముపై నుంచిరి. కాని ఆవ్యధిత సింహము అచటినుండి తప్పించుకొని ఫ్రాన్సుకు మరలివచ్చెను. ఫ్రాన్సుదేశమంతయు అతనికి స్వాగతముచెప్పి, అతనిపతాకముక్రిందికి చేరెను. దేశపరిపాలన చేయుచుండిన రాజు పాఱిపోయెను. కాని నెపోలియన్‌ను విడనాడిన అదృష్టదేవత సుస్థిరబుద్ధియై మరల అతనిని వరింపలేదు. యూరపుఖండమెల్ల మరల నొకటిగాచేరి అతనిని వాటర్లూ యొద్ద నోడించెను. నెపోలియన్ ఒక ఆంగ్లేయయుద్ధనౌక నెక్కి వారికి వశుడయ్యెను; ఆంగ్లేయు లతనిని దేశభ్రష్టు నొనరించి, సెయింట్ హెలీనా అను

దూరద్వీపమున యావజ్జీవకారాగారవాసిగా నుంచిరి. పూర్వపు రాజవంశము లోనివాడొకడు మరల సింహాసనముపై నుంపబడెను. కాని అనంతరకాలమున ఫ్రెంచివారు ఆ పూర్వ రాజ్యవిధానమునెడ అసంతృప్తివహించి, తిరుగుబాటుచేసి, రాజును రాజకుటుంబమును తఱిమగొట్టి, ప్రజాప్రభుత్వమును మరల సంస్థాపించిరి. మహనీయుడగు నెపోలియన్ యొక్క సమీప బాంధవుడొకడు కాలక్రమమున ప్రజాప్రియుడై, కుట్రచేసి తన్ను చక్రవర్తిగా చాటించుకొనెను. అతడే మూడవ నెపోలియన్. కొంతకాలముపాటు అతనిపరిపాలన మిక్కిలిశక్తిమంతమైయుండెను; కాని జర్మనులతోడిపోరాటమున నోడిపోయి అతడు రాజ్యభ్రష్టుడైనందున ఫ్రాన్సు మరల ప్రజాపరిపాలితదేశ మయ్యెను. నేటి వఱకది ప్రజాపరిపాలనక్రిందనే నిలిచియున్నది.

హిందూదేశవివిధదర్శనములకు మూలమగు పరిణామ సిద్ధాంత మిప్పుడు యూరపుదేశ భౌతికశాస్త్రములోనికి ఎక్కినది. హిందూదేశముతప్ప తక్కిన సర్వదేశమతములును ఈ జగత్సమష్టి పరస్పరసంబంధములేని ప్రత్యేకభాగములకూడిక యని సిద్ధాంతీకరించినవి; 'దేవుడు, ప్రకృతి, మానవుడు ఈ మూడును తమంతటతామే ఒకదానితో మఱొకదానికి కూడిక లేక — వేర్వేఱుగా నిలిచియున్నవి; అట్లే మృగములు, పక్షులు, కీటకములు, వృక్షములు, భూమి, రాళ్లు, లోహములు మొదలగునవన్నియును పరస్పర భిన్నములు. దేవుడు మొదటినుండియు వానిని వేఱుగనే సృజించెను'.

నానాత్వములో ఏకత్వము కనుగొనుటే పరస్పర భిన్నములుగా మనకు కనిపించు వస్తువులు నిజమునకు ఒకటియే అని కనుగొనుటే "జ్ఞానము" యొక్క కార్యము. మానవుడు ఈ యైక్యమును కనుగొను సంబంధవిశేషమును "నియమము" అందురు. ఇదియే "ప్రకృతినియమము".

మన చదువు, బుద్ధి, ఆలోచన : ఇవన్నియు పారమార్థికములనియు, ఇవి యెల్ల ఆస్తికధర్మమున రూపొంది కానిపించుననియు ఇప్పటికే చెప్పియుంటిని. పాశ్చాత్యదేశములందు అవి బాహ్యవస్తువులందు అనగా భౌతిక, సాంఘికక్షేత్రములందు కానిపించును. ప్రాచీనభారతతత్త్వవిచారపరులు ఆ భిన్నతాభావము ప్రమాదజనితమనియు, వృక్షములకు, పొదలకు, జంతువులకు, మానవులకు, దేవతలకు, ఈశ్వరునకుసైతము — ఈ ప్రత్యేకవస్తువులన్నిటికి — పరస్పరసంబంధముకలదనియు, ఆ సంబంధము అఖలప్రపంచము నావరించియుండు ఐక్యమనియు క్రమక్రమముగా కనుగొనిరి; అద్వైతి ఈ విచారమున పరమావధి చేరి, ఈ యఖిలము ఆ "ఒకని"యొక్క అభివ్యక్తరూపము లేయని ప్రకటించెను. యథార్థదృష్టికి భౌతికప్రపంచము, ఆధ్యాత్మిక ప్రపంచము ఒక్కటే. ఆ "ఒక్కని" పేరు బ్రహ్మము. భిన్నత్వము కానిపించుట భ్రమ — దానిని మాయ, అవిద్య, అజ్ఞానము అందురు. ఇదియే జ్ఞానమునకు పరమావధి.

ఈ విషయము నేడు హిందూదేశమునకు వెలుపల ఎవ్వని చేతను గ్రహింపబడనియెడల — హిందూదేశమును మన మిప్పుడు విచారణలోనికి కైకొనుటలేదు అతనిని వ్యుత్పన్ను డని ఎట్లు గణింపగలము ? పాశ్చాత్యదేశములలోని వ్యుత్పన్ను లనేకులు తమ మార్గముననే భౌతికశాస్త్రముద్వారానే ఈ సత్యమును ఇప్పుడు కనుగొనుచున్నారు. కాని ఆ 'ఏక' వస్తువు అనేకముగా ఎట్లయ్యెనో, — మనకు తెలియదు; వారికిని తెలియదు. మనము కూడ ఈ సమస్యకు — మన గ్రహణశక్తి పరిమితము గనుక అది మనము కనుగొనజాలమని — సమాధానము చెప్పితిమి. వారును ఈ సమాధానమునే చెప్పిరి. కాని ఆ ఏకైకవస్తువు చెందిన మార్పులును, అది ధరించుచుండు జాతిభేదములును, వ్యక్తిత్వములును — మనము గ్రహింపగలము. ఈ విచారమునే విజ్ఞానశాస్త్రవిచార (సైన్స్) మందురు.

ఇట్లు పాశ్చాత్యదేశములందు ప్రాయికముగా అందఱును పరిణామవాదు లైనారు. చిన్నజంతువులు క్రమపరిణామ మొంది అంతకంటె పెద్దవగునట్లే, పెద్దజంతువులు ఒక్కొకసారి హీనగుణములై, చిన్నవిగను, బలహీనములుగను అయి కాలక్రమమున నశించునట్లే, మానవుఁడుకూడ ఉన్నట్లుండి నాగరికుడై జన్మింపడు; ఈ కాలమున ఇందుకు విరుద్ధమగు వాదమును పాశ్చాత్యదేశ తత్త్వవిచారపరు లెవ్వరును విశ్వసింపరు. తమపూర్వులు ఇటీవలనే — కొలదిశతాబ్దములక్రిందటనే — మృగప్రాయులై యుండి, ఈ కొలదికాలముననే ఇంత అధికతరపరిణామ మొంది రనుటకు గల నిదర్శనములే ఇందుకు ముఖ్యకారణము. కావున మానవు లెల్లరును అనాగరికస్థితినుండి క్రమపరిణామ మొంది యుండవలె ననియు, ఇప్పటికిని పరిణామ మొందుచున్నా రనియు, వారు చెప్పుదురు.

ఆదిమదశయందు మానవులు కొయ్యపనిముట్లతోను, రాతిపనిముట్లతోను, తమ పనిని జరుపుకొనుచు వచ్చిరి. వారు చర్మములు, ఆకులు ధరించువారు. కొండగుహలలోను, పక్షిగూళ్లవలె నిర్మింపబడిన పర్ణకుటీరములలోను నివసించువారు. ఇట్లు వారు ఎట్లో కాలము గడపుచుండిరి. భూమిని త్రవ్వుటచేత ఎల్లదేశములందు ఇందుకు నిదర్శనములు లభించుచున్నవి. కొలది చోట్ల ఆదిమదశయందలి మానవు లిప్పటికిని కలరు. కాలక్రమమున మనుష్యులు సత్తు, రాగి మొదలగు మెత్తని లోహముల నుపయోగించుటను, వానిని కరగించి మిశ్రపఱచి, పరికరములు, ఆయుధములు చేసికొనుటను నేర్చుకొనిరి. ప్రాచీనగ్రీసుదేశస్థులు, బాబిలోనియాదేశస్థులు, ఈజిప్టుదేశస్థులు, — చాలవఱకు నాగరికులై, పుస్తకములువ్రాసి, వెండిబంగారుల నుపయోగింపసాగిన పిమ్మటకూడ చాలకాలముదనుక, ఇనుము నుపయోగింప నెఱుగకుండిరి. ఆ కాలమున మెక్సికోదేశస్థులు, పెరూదేశస్థులు, అమెరికాఖండములోని మాయాలు మున్నగు ఆదిమవాసజాతులు,

కొంతవఱకు నాగరికతనంది, పెద్ద దేవాలయములు నిర్మించుకొను వారు. వారిలో వెండి బంగారముల వాడుక సర్వసాధారణముగా నుండెడిది. వారి వెండి బంగారముల నాశించి స్పెయిన్ దేశస్థులు వారిని పరిమార్చిరిగదా! కాని వారు ఈ వస్తువుల నన్నిటిని ఎంతో కష్టించి చెకుముకిరాతిపనిముట్ల నుపయోగించి చేయుచు వచ్చిరి, వారికి ఇనుము అనెడు పేరుకూడ తెలియదు.

ఆదిమదశయందు మానవుడు ధనుర్బాణప్రయోగము వలననో, వలలుపన్నియో, మృగములను చేపలను చంపి వానిని తిని జీవించువాడు. కాలక్రమమున నతడు భూమిదున్నుటను, పశువులుకాచుటను నేర్చెను. అడవిమృగములను మచ్చికచేసికొని పెంచి వానిచేత పనిచేయించుకొనును; లేక వానిని పెంచి, అవసరమైనప్పుడు తినును; ఆవు, గుఱ్ఱము, పంది, ఏనుగు, ఒంటె, గొఱ్ఱె, కోళ్లు, పక్షులు, ఇతరజంతువులు మచ్చికచేసికొనబడెను. వీనిలో కుక్క మనుష్యునికి ప్రథమమిత్రము.

ఇట్లు కాలక్రమమున భూమిదున్నుట ప్రారంభమయ్యెను. ఫలములు, మూలములు, మొక్కలు, కూరగాయలు, మనుష్యు డిప్పుడు తిను ధాన్యజాతులు: ఇవి తమంతట తామే పుట్టి పెరుగుచుండిన కాలమున ఉండినస్థితి కిప్పుడు కేవలభిన్నములుగా నున్నవి. మనుష్యపరిశ్రమమువలనను, వ్యవసాయమువలనను, సహజస్థితినాటిఫలములు పెద్దవియై రుచికరములయ్యెను. అడవిగడ్డి క్రమమగు బియ్యమయ్యెను. ప్రకృతియొక్క సహజగతిచేతనే ఎన్నోమార్పులు కలుగుచున్నవనుట నిస్సంశయము. కాలములోను, పరిసరములలోను కలుగు మార్పులవలనను, ఇతరకారణములవలనను, ప్రకృతిలో క్రొత్తజాతిచెట్లు, మొక్కలు, పక్షులు, మృగములు ఎల్లప్పుడును సృజింపబడుచుండును. ఇట్లు మనుష్యజాతి సృజింపబడుటకుపూర్వము చెట్లను, మొక్కలను, ఇతర జంతువులను కొంచెముకొంచెముగా, నెమ్మదినెమ్మదిగా, ప్రకృతి

మార్చుచుండెను; కాని మనుష్యుడు లోకములో ప్రవేశించిన పిదప, అతడు మార్పులను అతిత్వరితముగా చేయసాగెను — ఒకదేశపు జంతుజాతులను, ఉద్భిజ్జజాతులను మఱొకదేశమున ప్రవేశపెట్టి, భిన్నజాతిసమాగమమువలనను, అంట్లు త్రొక్కుటవలనను, అనేకవిధములగు క్రొత్తజాతి మొక్కల యొక్కయు, జంతువులయొక్కయు ఉత్పత్తికి అతడు కారణభూతుడయ్యెను.

ఆదిమదశయందు పెండ్లిండ్లు లేవు. కాని కాలక్రమమున వైవాహికసంబాధములు బయలుదేఱెను. ప్రథమమున సర్వజాతులందును, వివాహసంబంధము తల్లిపై ఆధారపడి యుండెను. తండ్రివిషయమున అంత సుస్థిరత ఉండెడిదికాదు. బిడ్డలపేర్లు తల్లినిబట్టియే పెట్టుచుండిరి. బిడ్డలను పెంచవలసినవారు స్త్రీలు గనుక ద్రవ్యమంతయు వారిచేతులలోనే ఉండెడిది. కాలక్రమమున ద్రవ్యము — స్త్రీజనసమేతముగా పురుషులవశమయ్యెను. పురుషు డిట్లు పలుకువాడు: "ఈద్రవ్య మంతయు, ఈధాన్యమంతయు నాది. నేను వీనిని పొలములలో పండించియో, దోచియో, ఇతరవిధములనో, సంపాదించితిని; ఇతరు డెవ్వరైన నా హక్కును ఒప్పుకొనక వివాదమాడి, అందొకభాగము కోరినచో, వానితో యుద్ధముచేసెదను". అత డిట్లుకూడ పలుకువాడు: "ఈ స్త్రీ లెల్లరును నాకే చెందినవారు; వారియందు నాకు గల హక్కునెవడైన నిరాకరించెనేని, వానితో యుద్ధముచేసెదను". ఆధునిక వివాహాచారమున కిదియే మూలము. పురుషునికి అతని బానిసలు, గృహోపకరణములు, ఎట్లు సొంతమగు ఆస్తిగా నుండెనో స్త్రీలుకూడ అట్లే ఆస్తిగా ఏర్పడిరి. ఒక తెగకుచెందిన పురుషులు మఱొకతెగస్త్రీలను పెండ్లాడుట ప్రాచీనాచారము; అదికూడ స్త్రీలను బలాత్కారముగా లాగుకొనిపోయియే. కాలక్రమమున పెండ్లికొమార్తను బలాత్కారముగాలాగుకొనిపోవు అభ్యాసము నిలిచిపోయి, ఇరుపక్షములవారిసమ్మతితో వివాహ

ములు జరుగుట ప్రారంభమయ్యెను. కాని మాఱిపోయిన ఆచారము లన్నిటికిని కొద్దిపాటిజాడలు నిలిచియుండును. ఇప్పటికిని ప్రతి దేశ మందును, అట్టితరుణములందు పెండ్లికొడుకుపై దౌర్జన్యముగా పడినట్లు అభినయించుట వాడుకలోనున్నది. వంగదేశమందును, యూరపులోను, పెండ్లికొడుకుపై పిడికిళ్లతో బియ్యమును విసరి చల్లుదురు. ఉత్తరహిందూస్థానమున పెండ్లికొమార్తె పక్షము వారు పెండ్లికొడుకుపక్షమువారిని దూషణవాక్యములతోను, ఇతర విధములుగాను, నిందింతురు.

సంఘము రూపుదాల్ప నారంభమయ్యెను. ఒక్కొక్క దేశమునందు అది యొక్కొక్కవిధముగా నేర్పడెను. సముద్ర తీరవాసులు చాలవఱకు సముద్రమున చేపలుపట్టియు, సమతల నివాసులు వ్యవసాయముచేసియు, పర్వతప్రాంతవాసులు పెద్ద గొఱ్ఱెమందలు కాచియు, ఎడారులలోనివసించువారు మేకలను, ఒంటెలను కాచియు జీవించుచుండిరి. ఇతరులు అరణ్యములలో నివసించి వేటాడి జీవించుచుండిరి. సమతలనివాసులు వ్యవసాయము నేర్చుకొనిరి; వారి జీవనసమరము కొంత తేలికయయ్యెను; ఆలో చించుటకును, సంస్కృతినొందుటకును, వారికి తీఱికదొరకెను. అందుచే వారినాగరికత క్రమాభివృద్ధి నొందెను; కాని నాగరికత వృద్ధియగుకొలది వారిదేహములు దుర్బలతనొందసాగెను. కాలము నెల్ల బయళ్లలోనే గడపుచు, మాంసమే ముఖ్యాహారముగా గల వారికిని, ఇండ్లలో నివసించుచు, ధాన్యములు, శాకములు, ముఖ్యాహారముగా గలవారికిని శరీరపాటవభేదము క్రమక్రమ ముగా అధికమయ్యెను. వేటకాండ్రు, గొఱ్ఱెలకాపరులు, చేపలు పట్టువారు, ఆహారము బాగుగా దొరకనికాలములలో బంది కాండ్రుగాను, ఓడదొంగలుగాను అయి, సమతలవాసులను కొల్ల గొట్ట నారంభించిరి. సమతలవాసులును ఆత్మసంరక్షణకై బహు సంఖ్యాకములౌకూటములుగా కలయిక నొందసాగిరి; ఇట్లు చిన్న చిన్నరాజ్యము లేర్పడుట ఆరంభమయ్యెను.

దేవతలు* ధాన్యములను, శాకములను ఆహారించి జీవించు వారు. నాగరికులు. పల్లెటూళ్లు, పట్టణములు వారి నివాసస్థానములు. నేతవస్త్రములు ధరించువారు. అసురులు* కొండలలోను, గుట్టలలోను, ఎడారులలోను, సముద్రతీరప్రాంతములలోను, నివసించువారు. అడవిమృగములను, అడవులలోని ఫలమూలములను, తమ ఆవులకు, గొఱ్ఱెలకు బదులుగా దేవత లిచ్చు ధాన్యములను ఆహారించువారు. ఆటవికమృగచర్మములు ధరించువారు. దేవతలు దుర్బలదేహములుకలిగి ప్రయాసము లోర్వజాలక యుండిరి; అసురులట్లుగాక, మాటిమాటికి ఉపవసించుటవలన శరీరపాటవము కలిగి, సర్వవిధప్రయాసము లోర్చుశక్తి పూర్ణముగా కలిగి యుండిరి.

ఆహారము తక్కువగుకాలములందు అసురులు తాము నివసించు కొండలనుండియు, సముద్రతీరములనుండియు బయలు వెడలి పట్టణములను, పల్లెలను కొల్లగొట్టువారు. ఒక్కొక్కసారి వారు ద్రవ్యముకొఱకును, ధాన్యములకొఱకును, దేవతలపై బడి దొమ్మిచేయువారు. అట్టితరుణములందు దేవతలు బహుసంఖ్యాకులుగా కలయికనొందనిచో, అసురులచేత నిహతులగుట సిద్ధము. కాని దేవతలు బుద్ధిబలమునందు అధికులుగనుక, యుద్ధయంత్రములనేకవిధములైనవి నూత్నముగా కల్పింప నారంభించిరి. బ్రహ్మాస్త్రము, గరుడాస్త్రము, వైష్ణవాస్త్రము — ఈ అద్భుతశక్తిమంతములగు అస్త్రములన్నియు దేవతలవి. అసురులు సామాన్యాయుధములతో యుద్ధముచేసిరి, కాని వారు అత్యంతబలిష్ఠులు. వారు దేవతలను పెక్కుసారు లోడించిరి; ఐనను వారు నాగరికత

* 'దేవతలు', 'అసురులు' అను శబ్దములు ఇచట ఎల్లెడల గీతలో తెలుపబడినయర్థమున అనగా, దైవీసంపత్ప్రాబల్యము, ఆసురీసంపత్ప్రాబల్యము గల జాతులు అనునర్థమున — ప్రయోగింపబడినవి. శ్రీమద్భగవద్గీత 16 వ అధ్యాయము చూచునది.

నొందుటకుగాని, వ్యవసాయము నేర్చుకొనుటకుగాని, బుద్ధిబల మును పెంపొందించుకొనుటకుగాని ప్రయత్నింపరైరి. యుద్ధమున విజయముసాధించిన అసురులు పరాజితులగు దేవతలపై స్వర్గమున నేల బ్రయత్నించునప్పుడెల్ల దేవతలయొక్క అధికతరమగు బుద్ధిబలముచేతను, యుక్తిచేతను మోసపుచ్చబడి, అచిర కాలముననే వారి బానిస లగుదురు. (అట్టిప్రయత్నముచేయని) తక్కిన వేళలందు అసురులు కొల్లగొట్టినపిదప తమస్థానమును చేరుదురు. దేవతలు, తమలోతాము ఐకమత్యము సాధించుకొని నప్పుడెల్ల, వారిని (అసురులను) బలాత్కారముగా పర్వతముల లోనికిగాని, అరణ్యములలోనికిగాని, సముద్రతీరమునకుగాని మరలిపోవునట్లు చేయుచుండిరి. కాలక్రమమున రెండు పక్షముల వారిసంఖ్యయు, బలమును, అభివృద్ధిని పొందెను. దేవతలు లక్షలకొలదిగ నొకటిగ చేరిరి. అట్లే అసురులును లక్షలకొలదిగ నొకటైరి. తీవ్రసంఘర్షణములును యుద్ధములును జరిగెను. అందు తోపాటు ఇరుబలములు ఒకటితో నొకటి సమ్మేళన మొందుటయు జరిగెను.

ఈ విభిన్నప్రకృతులును జాతులును మిశ్రణమొందుట వలన, మన ఆధునికసంఘములు, మర్యాదలు, ఆచారములు రూపొంద నారంభించెను. క్రొత్తభావము లుత్పన్నములై క్రొత్త శాస్త్రముల అభ్యాసము ప్రారంభింపబడెను. ఒకవర్గమువారు హస్తపరిశ్రమముచేతనో, బుద్ధిపరిశ్రమముచేతనో, ఉపయోగకర ములును, సుఖసాధకములును అగు వస్తువులను నిర్మింపసాగిరి. మఱొకవర్గమువారు వారిని పరుల ఉపద్రవమునుండి రక్షించు చుండు భారమును పూనిరి. ఎల్లరును వీనిని మార్చుకొన నారం భించిరి. మిక్కిలి యుక్తిమంతులగు కొందఱు గడుసరులు ఈ వస్తువుల నొకచోటినుండి మఱొకచోటికి తీసికొనిపోవు కార్యము వహించి, ఇందుకు ప్రతిఫలము అనుపేర లాభములో నధికభాగము నపహరింపసాగిరి. ఒకడు భూమిని దున్నను,

రెండవవాడు 'ఫలసాయము' చోరగ్రస్తము కాకుండ కాపాడును, మూడవవాడు దానిని ఇతరప్రదేశములకు కొనిపోవును; నాలవ వాడు దానిని కొనును. వ్యవసాయముచేసి పంటపండించినవానికి ఇంచుమించుగా ఏమియు లభించునదికాదు; పంట చోరాదు లపహరింపకుండ కాపాడినవాడు దానిలో సాధ్యమైనంతపాలు బలాత్కారముగా లాగుకొనును; దానిని అమ్మకమునకు తెచ్చిన వర్తకుడు అత్యధిక భాగమును కైకొనును; కొనుగోలుచేయువాడు అపరిమితమగు ఖరీదులను భరించి, ఆ భారముచే తీవ్రక్లేశము నొందును. కాపాడువానికి రాజనామము సిద్ధించెను. వస్తువులను స్థలాంతరములకు కొనిపోవువానికి వర్తకుడనుపేరు వచ్చెను. ఈ యిరువురును పండించినవారే కారు — కాని ఆ వస్తువులలో నధిక భాగము లాగుకొని, కృషీవలుని పరిశ్రమఫలమును చాల వఱకు అపహరించి ధనికులైరి. వీని నన్నిటిని పండించిన నిర్భాగ్యుడు పెక్కుతడవలు పస్తులుపడి, సహాయముకొఱకై భగవంతుని ప్రార్థింపవలసినవాడగును.

కాలము జరుగుకొలది, ఈ విషయములన్నియు మఱిమఱి చిక్కువడి, ముళ్లమీదముళ్లు ఏర్పడెను. ఈ అభేద్యజాలాకృతినుండి మన ఆధునిక మిశ్రితసంఘము రూపొందెను. కాని గతకాలవిశేషచిహ్నములు పూర్ణముగా అంతమొందక ఏకొంచెముగానో నిలిచి యుండును. పూర్వజన్మములందు గొఱ్ఱెలు కాచియో, చేపలుపట్టియో, ఇట్టి ఇతరవృత్తు లవలంబించియో జీవించినవారు తమ నాగరికజన్మమునకూడ ఓడదోపిళ్లను, బందిపోటులను, ఇట్టి యితరవృత్తులను అవలంబించిరి. వేటాడ నరణ్యములులేక, గొఱ్ఱెమందలనుమేపుటకై గుట్టలుగాని, పర్వతములుగాని, సమీపమున లేక, నాగరికసంఘమున జన్మించిన యాదృచ్ఛిక సంఘటనమువలన, వేటాడు, చేపలుపట్టు, పసువులుమేపు నవకాశములులేక, స్వభావప్రాబల్యముచే అతడు దోచుటనో, చౌర్యము చేయుటనో ప్రారంభించును. అతనికి మార్గాంతర మేమికలదు?

మఱియు పౌరాణికయుగమున జన్మించి, చిరతరఖ్యాతి నార్జించి, మనకు నిత్యస్మరణీయనామములుగల స్త్రీరత్నముల * యోగ్య సంతతిలోని శాలికలు, అనేకభర్తలను పెండ్లాడగోరినను సాధ్యము కాని ఈ కాలమున, పాతివ్రత్యభ్రంశమునందిరి. ఇట్లును, ఇతర విధములను, వేర్వేఱురీతుల వేర్వేఱుస్వభావములవారును, నాగరికులును, అనాగరికులును, దైవీసంపత్ప్రాబల్యము కలిగియు, ఆసుర సంపత్ప్రాబల్యముకలిగియు జన్మించినవారు సమ్మేళనమొంది ఆధునికసంఘముగా ఏర్పడిరి. కావుననే, ప్రతిసంఘమునందును భగవంతుడు అనేకరూపములతో సాధునారాయణుడు, చోర నారాయణుడు మున్నగు అనేకరూపములతో—క్రీడించుచుండుట మనకిప్పుడు కాన్పించుచున్నది. మఱియు, ఇప్పుడు ఏ సంఘ మెట్టి స్వభావముకలిగి జన్మించినదా అని నిర్ణయింపవలసివచ్చి నప్పుడు, ఆ సంఘమున దైవీస్వభావముగలవా రెక్కువగా నున్నారా, ఆసురస్వభావముగలవా రెక్కువగా నున్నారా అని చూచి నిర్ణయింపవలసివచ్చినది.

ఆసియాఖండపు నాగరికత యంతయు గొప్పనదుల — గంగ, యాంగ్ట్సెకియాంగ్, యుఫ్రేటిస్ — ప్రక్కనుండు సారవంతములగు సమభూములందు ప్రథమమున వికాసమందెను. ఈ నాగరికతల కన్నిటికిని మొదట వ్యవసాయమే మూలము. అచటివా రందఱియందును దైవీప్రకృతిప్రాబల్యముండును. ఇక యూరపుఖండపు నాగరికతయన్ననో అందు ఎక్కువభాగము పర్వతమయదేశములందో, సముద్రతీరప్రాంతములందో ఉత్పత్తి యయ్యెను. సముద్రముమీాదచేయు దోపిళ్లును, బందిపోట్లును దీనికి మూలము; అచట ఆసురీప్రకృతిప్రాబల్యము కలదు. మధ్యఆసియాఖండము, అరేబియాదేశపు ఎడారులు, అసురుల ఉనికిపట్టులని ఈ ఆధునికకాలమున మన మూహింపవచ్చును.

---

* అహల్య, తార, మండోదరి, కుంతి, ద్రౌపది.

ఆ రక్షణస్థలములనుండి అసురవంశమున జన్మించిన ఈ గొఱ్ఱెల కాపరులును, వేటకాండ్రును, తండోపతండములుగావచ్చి, ఒకటిగాచేరి నాగరికులైన దేవతలను వెన్నంటి తఱిమి, వారు చెదరిపోయి ప్రపంచమం దంతటను చేరునట్లు చేసిరి.

యూరపుఖండమున ఆదిమవాసులగు ప్రాచీనజాతి యొకటి యుండెననుటకు సందియములేదు. పర్వతగుహలు వారి నివాస స్థానము. వారిలో సూక్ష్మతరబుద్ధిగలవారు నీటిలో కొంచెము మెఱకగానుండుచోట్ల కఱ్ఱలుపాతి వానిపై అరుగులను, ఆ అరుగులపై ఇండ్లను కట్టుకొనిరి. వారు చెకుముకిరాతితో బాణములను, ఈటెలలను, కత్తులను, గొడ్డండ్రనుచేసి, వానితో తమపనుల నన్నిటిని జరుపుకొనుచుండిరి.

ఆసియాఖండములోనిజాతులు క్రమక్రమముగా యూరపులో చొర నారంభించెను. తత్ఫలముగా యూరపులో కొన్ని భాగములు తక్కినవానికంటె ఎక్కువ నాగరికత నొందెను; రష్యాలో కొందఱిభాష దక్షిణఇండియాభాషలను పోలి యుండును.

కాని ఈ మోటువారిలో చాలభాగము పూర్వమువలె మోటుగనే ఉండిరి. ఇట్లుండ ఏషియామైనర్‌లోని యొక నాగరిక జాతి యూరపులో తమకు చేరువలోనున్న కొన్నిభాగములను జయించి పరిణత మగు నొక నూత్ననాగరికతను అందు ప్రవేశ పెట్టెను. వారిని మనము యవను లందుము, యూరపియనులు వారిని గ్రీకు లందురు.

అనంతరకాలమున ఇటలీలోని యొక మోటుజాతివారు (రోమనులు అను పేరుగలవారు) నాగరికులగు ఎట్రస్కనులను జయించి వారి సంస్కృతిని, పాండిత్యమును అలవఱచుకొని, ఆ పరాజితజాతియొక్క జీర్ణనాగరికతాస్థానమున స్వకీయనాగరికతను స్థాపించిరి. క్రమేణ రోమనులు తమవిజయములను సర్వదిశావ్యాప్తము లొనర్చిరి; యూరపు నైరృతిభాగముననున్న

మోటుజాతు లన్నియు రోముయొక్క ఆధిపత్యముక్రిందికి వచ్చెను; ఉత్తరప్రాంతములలో నివసించుచుండిన అనాగరిక ఆటవికులు మాత్రము తమ స్వాతంత్ర్యమును నిలుపుకొనిరి. కాని కాలము గడచుకొలది, రోమనులు ద్రవ్య భోగదాస్యములో చిక్కి, తమ బలమును కోల్పోయిరి. ఆ సమయముననే ఆసియాఖండము తన అసురదళములను యూరపుమీదికి విచ్చలవిడిగా పోనిచ్చెను. రోమనులు ఈ అసురధాటిచే తమనివాసస్థానములనుండి తఱుమగొట్టబడిన తరుణమున, ఉత్తరయూరపులోని అనాగరికజనానీకములు రోమన్ సామ్రాజ్యముపై బడి రోమును నాశ మొనర్చిరి. ఆసియాదేశపు దండయాత్రాబల మెదుర్కొనినప్పుడు, యూరపుదేశపు అనాగరికజాతియును, రోమను, గ్రీకుజాతులలో శేషించినవారును మిశ్రమగుటవలన నొక క్రొత్తజాతి ఉత్పత్తియయ్యెను. అదేకాలమున యూదులు రోమనులచే జయింపబడి తమస్థానములనుండి తఱుమగొట్టబడి యూరపుదేశపు నలుదిక్కులందు చెదరిరి. వారితోకూడ వారి క్రొత్తమతము — క్రీస్తుమతము — కూడ యూరపు సర్వభాగములందును వ్యాపించెను. ఈ వివిధజాతులును, వారిమతములును, భావములును, ఈ వివిధాసురజనానీకములును, నిరంతరకలహసంగ్రామవహ్నిచే తప్తమై, మహామాయ మూసలో కరగి ఒకటి కాసాగెను. ఆ మిశ్రణఫలముగా ఆధునిక యూరపియన్ జాతి ఉద్భవించెను.

ఇట్లొక అనాగరిక — బహుఅనాగరిక — యూరపియన్ జాతి—హిందువుల నీలిమము మొదలు ఔత్తరాహీణుల క్షీరధవళ వర్ణమువఱకు సూక్ష్మభేదములతోడి అనేకవర్ణములవారు — నల్లనివి, గోధుమరంగువి, ఎఱ్ఱనివి అగు వెంట్రుకలతోను, నల్లనివి, బూడిదరంగువి, నీలవర్ణపువి అగు కన్నులతోను, హిందువుయొక్క చక్కని రూపరేఖలుగల ముఖమును, ముక్కును, కన్నులను, లేక చీనావారి చదునుముఖమును కలిగి ఏర్పడెను. కొంతకాలము వఱకు వా రొకరితో నొకరు యుద్ధములుచేయుచుండిరి, ఔత్త

రాహిణులు సముద్రపు దొంగలుగా జీవించుచు, తమకంటె నాగరికు లగు జాతులను బాధించి చంపుచు వచ్చిరి. ఈ లోపల క్రైస్తవమతాధ్యక్షు లిరువురును—ఇటలీలోని "పోపు" (ఫ్రాన్స్, ఇటలీ దేశముల ఉచ్చారణలో పాప్) కాన్స్టాంటినోపిల్‌లోని "పేట్రియార్కు" ఉపాయసాహాయ్యముతో ప్రవేశించి ఈ మృగప్రాయు లగు మూకలపై, వారి రాజులపై, రాణులపై, ప్రజలపై, తమ యధికారము ప్రయోగింప నారంభించిరి.

ఇంకొకవైపు అరేబియా ఎడారులలో మహమ్మదీయ మతము ఉత్పత్తియయ్యెను. అనాగరికులగు ఆరబ్‌లు, ఒక సిద్ధపురుషవరేణ్యుని బోధలచే ఉద్దీపితులై, దుర్వార బలవీర్యములతో లోకముపై హఠాత్తుగా పడిరి. మహోద్దండగమనముగల ఆ వాహిని అప్రతిహతశక్తితో తూర్పునుండియు పడమటినుండియు యూరపులో ప్రవేశించెను. ఆ ఉప్పెనతోపాటు హిందూదేశము యొక్కయు, పురాతనగ్రీసు దేశముయొక్కయు విద్యాసంస్కృతులు యూరపుఖండమున ప్రవేశించెను.

మధ్యఆసియాలోని "సేల్‌జుక్" తార్తారులు అను పేరుగల యొక అసురజాతి, మహమ్మదీయమతము నవలంబించి ఏషియామైనరును, ఆసియాలోని ఇతర దేశములను జయించెను. ఆరబులు హిందూదేశమును లోబఱుచుకొనుట కెన్నియో ప్రయత్నములు చేసి విఫలులైరి. లోకమునంతయు ముంగివైచిన మహమ్మదీయతీవ్రకల్లోలము హిందూదేశమునెదుట వెనుకకు తగ్గవలసివచ్చెను. సింధూరాష్ట్రమును వా రొకసారి వశపఱచుకొనజూచిరి. కాని, అది అశక్యమయ్యెను; మరల వా రా ప్రయత్నము చేయలేదు.

కాని కొన్నిశతాబ్దములు గడచిన పిమ్మట, టర్కులును ఇతర తార్తారుజాతులును, బౌద్ధమతములోనుండి మహమ్మదీయ మతములో చేరిన పిమ్మట, హిందువులను, పర్షియనులను,

అరబ్‌లను అందఱను తమ యాధిపత్యములోనికి తెచ్చుకొనిరి. ఇండియాదేశమును జయించిన మహమ్మదీయులలో ఒక్కడైనను అరబ్‌జాతివాడుగాని పర్షియాజాతివాడుగాని లేడు; అందఱును టర్కులో, తార్తారులునో. రాజపుత్రదేశములో మహమ్మదీయ దండయాత్రలొనర్చినవారి నందఱిని టర్కు లనిరి. అది యథార్థమగు చారిత్రకసత్యము. రాజపుత్రదేశపు “చారణులు”, “తురుగాంకో, బఢీజోరే” (తురుష్కులు మిక్కిలి బలాఢ్యులు) అని పాడువారు. అది నిజముకూడ. కతుబుద్దీన్ మొదలు మొగలాయిచక్రవర్తులవఱకు ఎల్లరును తార్తారులే. థిబెట్ దేశస్థులును వారును ఒకజాతివారే; కాని వారు మహమ్మదీయమత మవలంబించి, హిందువులతోను పర్షియనులతోను వివాహసంబంధములు చేసినందున వారి ముఖములు చదునుగా, గుండ్రముగా నుండక మాఱిపోయెను. వారు పూర్వపు అసురజాతులలోని వారే. నేడును వారు కాబూలు, పర్షియా, అరేబియా, కాన్స్టాంటినోపిల్ సింహాసనముల నాక్రమించి రాజ్యముచేయుచున్నారు. గాంధారులును (కాండహారువారు) పర్షియనులును, ఇప్పటికిని టర్కివారి బానిసలుగనే ఉన్నారు. చీనాదేశపు విశాలసామ్రాజ్యముకూడ మంచూరియాదేశపు తార్తారుల పాదములయొద్దనే పడియున్నది. కాని ఈ మంచూరియావారు తమ మతమును విడనాడి మహమ్మదీయులు కాలేదు. వారు “గ్రాండ్‌లామా” అనుచరులు. ఈ అసురులు విద్య నార్జించుటకుగాని బుద్ధిని బలపఱచుకొనుటకుగాని కృషిచేయరు; వా రెఱిగినది యుద్ధముచేయు టొక్కటే. ఆ రక్తము కొంత కలియనిది కదన కుతూహలబుద్ధి కలుగుట అసాధ్యము; ఆ తార్తారురక్తమే యూరపు ఉత్తరప్రాంతములలోనివారిలో — అందును ముఖ్యముగా అంతయు తార్తారురక్తముగలవా రగు రష్యాదేశస్థులలో నెక్కువగా — పరాక్రమోదంచిత సమరోత్సాహరూపమున కానిపించుచున్నది. ఈ దేవాసురయుద్ధ మింకను చాలకాలము జరుగును.

దేవతలు అసురకన్యలను వివాహమాడుదురు; అసురులు దేవ కన్యకలను రాక్షసవిధానమున నెత్తుకొనిపోవుదురు. ఇందువలననే బలోదగ్రములగు సంకరజాతులు ఏర్పడుచున్నవి.

అరేబియనులకు గొప్పమతగురు వగు "కాలిఫ్" యొక్క సింహాసనమును తార్తారులు కైకొని ఆక్రమించిరి; క్రైస్తవులకు ముఖ్యతీర్థయాత్రాస్థానమగు జెరూసలెమును, ఇతరస్థలములను వశపఱచుకొని, "పావనసమాధి"ని దర్శింపబోవువారిని నిరోధించి, క్రైస్తవుల ననేకులను చంపివైచిరి. క్రైస్తవ "ఛర్చీల" అధ్యక్షులు కోపపరవశులై యూరపు అంతటిలోగల తమ అనాగరికానుచరులను రెచ్చగొట్టిరి. ఆ యనుచరులు రాజులను, ప్రజలను ఉద్రేకోన్మత్తుల నొనర్చిరి. యూరపుదేశపు అనాగరిక ప్రజానీకములు జెరూసలెమును క్రైస్తవమతవైరులగు తార్తారుల చేతినుండి విముక్తమొనర్చుటకై ఏషియామైనరుపై కుఱికిరి. ఇం దనేకులు ఒకరిగొంతుల నొకరు కోసికొనిరి. తక్కినవారిని మహమ్మదీయులు రూపుమాపిరి. కాని ఆ అనాగరికజనులయొక్క కోపము అప్పటికే ప్రజ్వలించియుండెను. మహమ్మదీయులు వారిని కూల్చినతోడనే, అనాగరికులకు, ఆటవికులకు సహజమగు మొండిపట్టుదలతో క్రొత్తవారు మరల బహుసంఖ్యాకులై వచ్చిరి. తమవారిని దోచుటకూడ వారికి తప్పుగా తోచునది కాదు. అంతకంటె మంచిఆహారము దొరకనప్పుడు మహమ్మదీయులను భక్షించుటకు వారు వెనుదీయరైరి. ఇంగ్లీషుప్రభువు రిచర్డ్ కు మహమ్మదీయమాంసమునం దభిరుచియుండుట సుప్రసిద్ధముగదా.

మృగప్రాయులకును నాగరికులకును యుద్ధములు జరుగునప్పుడు సాధారణముగా కలుగు ఫలమే యిప్పుడును కలిగినది. జెరూసలెము, తక్కినప్రదేశములు జయింపబడలేదు; కాని యూరపు నాగరికత నొందసాగెను. మృగచర్మములు ధరించి, పచ్చిమాంసము తినుచుండిన ఇంగ్లీషువారును, ఫ్రెంచివారును,

జర్మనులును, ఇతరమ్లేచ్ఛప్రాయజాతులును ఆసియాదేశనాగరికత తోడిసంపర్కము నొందగల్గిరి. ఇటలీలోను ఇతరదేశములలోను ఉన్న ఒక తెగ క్రైస్తవయుద్ధభటులు — మన "నాగా" జాతిని పోలినవారు — వేదాంత మభ్యసింప నారంభించిరి. వారిలో "నైట్స్ టెంప్లార్స్" అను నొక శాఖవారు అద్వైతవేదాంత ములో సుప్రతిష్ఠితులై క్రీస్తుమతమును చివరకు పరిహసింపసాగిరి. వారు అపారముగా ధనము నార్జించిరి. కనుక యూరపుదేశపు రాజులు—'పోపు' ఉత్తర్వు ననుసరించి—మతమును సంరక్షించు మిషతో వారిని నిర్మూలించివైచిరి.

రెండవవైపున ఒక మహమ్మదీయజాతి — 'మూరులు' అనుపేరుగలవారు స్పెయిన్ దేశములో నొక నాగరికరాజ్యమును స్థాపించి, వివిధవిద్య లభ్యసించి, యూరపులో మొదటి విశ్వవిద్యా లయము నేర్పఱచిరి. సర్వదిగ్దేశములనుండి — ఇటలీనుండి, ఫ్రాన్సునుండి, దూరముననున్న ఇంగ్లండునుండికూడ విద్యార్థులు గుంపులుగుంపులుగా అచటికి వచ్చిచేరిరి. రాజకుటుంబములనుండి బాలురు గౌరవప్రవర్తనమును, ఔచితిని, సభ్యతను, యుద్ధ విద్యను నేర్చుకొనుటకై రా నారంభించిరి. గృహములు, దేవాలయములు, భవనములు, స్థాపత్యవిద్యాప్రదర్శకనిర్మాణ ములు, ఒక నవ్యరీతిగా కట్టుట ప్రారంభమయ్యెను.

కాని క్రమక్రమముగా యూరపుఖండమంతయు అతివిస్తృత మగు స్కంధావారము (మిలిటరీ కేంప్ సేనవిడిసినస్థలము)గా మార్పబడెను; ఇప్పటికిని దానిస్థితి అదియే. మహమ్మదీయులు ఏ రాజ్యమునైన లోబఱుచుకొనినపుడు వారిసుల్తాను అందు అధికభాగమును తా నుంచుకొని, మిగిలినభాగమును తనసేనానుల కందఱికి పంచిపెట్టును. ఈ సేనానులు ఎట్టి పన్నులను చెల్లింప బనిలేదు, కాని అవసరమైనప్పుడు రాజునకు ఒకనియమితసంఖ్య గల యుద్ధభటులను సరఫరాచేయవలెను. సర్వదా ఒక్క

సైన్యమును సిద్ధముగా నిలుపుకొనియుండు భారము ఇట్లు తొలగు టయేకాక యుద్ధావసరములందుమాత్రము పనిచేయు నొక ప్రబల సైన్యము ఏర్పాటుపబడినది. ఇదే భావము కొంతవఱకు ఇప్పటికిని రాజపుత్ర దేశమునందు కలదు. మహమ్మదీయులు దీనిని పాశ్చాత్య దేశములకు కొనిపోయిరి. యూరపుదేశస్థులు దీనిని మహమ్మ దీయులయొద్ద గైకొనిరి. కాని మహమ్మదీయపద్ధతిప్రకారము రాజు, అతనిపాలెగాండ్రు, వారిసైన్యములు ఒకపక్షమున ఉండి తక్కినవారు — ప్రజలు, సామాన్యజనులు — యుద్ధవేళలందు బాధింపబడకుండువారు; కాని యూరపులో ఇట్లు కాక రాజు, అతనిపాలెగాండ్రు, ఒకపక్షమున నుండి, ప్రజాసమూహము నంతయు తమ బానిసలుగా చేసికొనుచుండిరి. ప్రతివాడును ఒక యుద్ధవీరు డగు పాలెగాని నాశ్రయించుకొని బ్రదుకవలెను; అతని యనుచరుడై యుండవలెను; అట్లున్నగాని అతనిని బ్రదుక నీయరు; అత డెల్లప్పుడును — ఆజ్ఞయైనతోడనే — యుద్ధము చేయుటకు సన్నద్ధుడై యుండవలెను.

యూరపుదేశస్థులు అంతగా గర్వోక్తులాడు తమ "నాగరికతాపురోగమనము" అను మాటకు అర్థమేమి? అక్రమ మార్గ మవలంబించి అది క్రమమార్గమని వాదించుట; — ఇష్టార్థమును జయప్రదముగా సాధించి, అవలంబించినమార్గము సక్రమమైనదనుటకు ఫలసిద్ధియే నిదర్శన మని వాదించుట! ఈ "నాగరికతాపురోగమనము"న చౌర్యమొనర్చుట, బొంకు లాడుట, ఉరితీయుట కొన్ని సందర్భములలో యోగ్యకార్యము లగును; తనవెంట వచ్చిన మహమ్మదీయసంరక్షకులు — ఆకలి గొనియుండి — కొన్ని రొట్టెముక్కలు దొంగిలించినందుకు స్టాన్లీ వారిని కొరడాతో కొట్టుటను నిర్దోమక్రియగా నొనర్చును; యూరపియనుల ప్రఖ్యాతనీతిసూత్రమగు "నీ విచటినుండి వెడలి పొమ్ము, నేను వచ్చి ఈ చోటు నాక్రమించుకొనవలెను" అను దానిని అది సమర్థించును; సమర్థించుటే కాక దానిని నేర్పును.

ఇందుకు చారిత్రకసాక్ష్యమే కలదు: యూరపియను లెచటికి పోయినను, అచటి ఆదిమవాసజాతులు నిర్మూలమగుచున్నారు కదా! ఈ "నాగరికతాపురోగమనము"న వైవాహిక నీతిద్రోహమును లండనులోను, ఆలుబిడ్డలను నిరాధారముగా వీడి పాఱిపోయి ఆత్మహత్యచేసికొనుటను 'ప-రీ' లోను నేరముగాకాక, పొరపాటుగా నెంతురు!

ఇస్లాము (మహమ్మదీయ) నాగరికత మొదటి మూడు శతాబ్దములలో పొందిన శీఘ్రవ్యాప్తిని అదేకాలమున క్రీస్తుమత ముండినస్థితితో పోల్చిచూడుడు. క్రీస్తుమతము పుట్టిన మొదటి మూడుశతాబ్దములలో లోకమున కెఱుకపడు శక్తినికూడ పొంద జాలకపోయెను; కాన్ స్టెంటైను ఖడ్గము అతని రాజ్యములో దాని కొక స్థానము కల్పించిననాటినుండి ఆ మతము పారమార్థికనాగరికతగాని లౌకికనాగరికతగాని వ్యాపించుటకు ఎట్లుతోడుపడినది? భూమి పరివర్తనశీల మగు (చుట్టు తిరుగుచుండు స్వభావముగలది) మండలమని ప్రప్రథమమున స్థాపింపబూనిన యూరపియన్ విద్వాంసునకు ఆ మతమేమి బహుమతినిచ్చినది? క్రైస్తవమతవ్యవస్థ వైజ్ఞానికశాస్త్రజ్ఞునెవ్వనినేని ఎన్నడేని ఆమోదముతోడను, ఉత్సాహముతోడను సత్కరించినదా? క్రైస్తవ మతగురువులు తమ కాపుదలలోనుండు ప్రజలకు అందజేయు పుస్తకావళి, వారికి అవసరమైయుండునంత దేశశాసనజ్ఞానమును — ద్రవ్యవివాదములకును, అపరాధ విచారణలకును, విద్యావాణిజ్య విషయక రాజ్యనీతికిని, సంబంధించినదానిని—సమకూర్పగలిగియుండునా? నేటికిని, "ఛర్చి" వ్యవస్థ పవిత్రములుకాని గ్రంథములవ్యాప్తిని అనుమతింపదు. ఆధునికవిద్యలను, వైజ్ఞానికశాస్త్రములను కూలంకషముగా చదివినవారు — ఇట్లయ్యును త్రికరణశుద్ధిగా క్రైస్తవ మతము నభ్యసించుట సాధ్యమా? బైబిలులోని క్రొత్తనిబంధనలో (న్యూటెస్టమెంట్) విద్యలను గూర్చియు, విజ్ఞానశాస్త్రములనుగూర్చియు, ప్రత్యక్షప్రశంసగాని పరోక్షప్రశంసగాని లేదు.

కాని కురానులోను, మహమ్మదుప్రవచన గ్రంథ మగు హడిస్ లోని అనేకఘట్టములలోను, ప్రత్యక్షముగనో, పరోక్షముగనో ఆమోదింపబడనట్టియు, ప్రోత్సహింపబడనట్టియు వైజ్ఞానిక శాస్త్రముగాని, విద్యగాని లేనేలేదని చెప్పవచ్చును. వాల్టేర్, డార్విన్, బూష్నర్, ఫ్లామారియన్, విక్టర్‌హ్యూగో మున్నగు అనేకులు యూరప్‌లోని సమగ్రచింతనాపరులగు మహనీయులు — ఈ కాలమున క్రైస్తవమతముచే అధిక్షేపింపబడుచు, నైష్ఠికక్రైస్తవజనానీక దూషణవాక్యములకు గుఱియగుచున్నారు. ఇస్లాముమతము ఇట్లుకాక అట్టివారు ఆస్తికులేగాని, మహమ్మదునందు విశ్వాసములేనివారు అని యెన్నును. ఈ రెండుమతములలో ఏది ఉపకారము, ఏది పురోభివృద్ధినిరోధకము అను విషయమును గూర్చి సమగ్రవిచారణ జరుగుగాక. అట్టి విచారణలో ఇస్లాము ఎచటప్రవేశించినను, ఆదిమవాసులను ఉండనిచ్చి కాపాడినది అనియు ఆ జాతులు నేటికిని కలవనియు, వారిభాష, వారిజాతీయత నేటికిని సురక్షితముగా నున్నదనియు తెలియవచ్చును.

అట్టి సత్కార్యమును తానెచటనైన సాధించినట్లు క్రీస్తుమతము చూపగలదా? స్పెయిన్‌లోని అరబులు, అమెరికాలోని ఆదిమవాసులు నేడెచట నున్నారు? యూరపులోని యూదులను క్రైస్తవు లెట్లు ఆదరించుచున్నారు? యూరపులో జరుగు ఏకార్యముగాని బైబిలుబోధల కనుకూలించునవి లేవు. యూరపు పురోగమనమున ఎన్నివిధముల ఔన్నత్యమును సాధించినను. అందులో ప్రతిది క్రీస్తుమతముపై తిరుగబాటు చేతనే — బైబిలుకు విరుద్ధముగా ప్రవర్తించుటచేతనే సాధింపబడినది. క్రీస్తుమతము మునుపటివలె నేడును యూరపులో నిరంకుశాధికారము కలిగియున్నచో, పాష్‌ట్యూర్ కాఖ్ మున్నగు ఆధునికవిజ్ఞానశాస్త్రవేత్తలను ఇన్క్విజిషన్* అగ్నికి ఆహుతిచేసి

* స్వమతవిరుద్ధవాదులను విచారించు మతాధికారన్యాయస్థానము. ఇందు అపరాధులు అగ్నికి ఆహుతిచేయబడు వాడుక.

యుండును. డార్విన్‌ను అతని సిద్ధాంతముల కనుకూలురై యుండు వారిని స్తంభమునకు కట్టి నిలువున తగులబెట్టియుండును. ఆధునిక యూరపులో క్రీస్తుమతము, నాగరికత, పరస్పరభిన్నవిషయములు. నాగరికత ఇప్పుడు తనపురాతనశత్రువు వగు క్రైస్తవమతమును రూపుమాపుటకును, మతాచార్యులను పతనమొందించుటకును, వారిచేతిలోనుండి విద్యాశాలలను, ధర్మసంస్థలను లాగుకొనుటకును నడుము కట్టుకొనియున్నది. కేవలమూఢు లగు గ్రామీణప్రజలు లేనిచో, క్రీస్తుమతము — ఇప్పటి అప్రతిష్ఠస్థితిలో — ఒక్కక్షణ మైనను నిలిచియుండజాలకపోయి, సమూలముగా పెకికివేయబడి యుండును. పట్టణవాసు లగు బీదలు ఇప్పుడును క్రీస్తుమతవ్యవస్థకు వైరులే! ఇప్పుడు క్రీస్తుమతమును ఇస్లాముమతముతో పోల్చి చూడుడు. మహమ్మదీయదేశములలో విధు లన్నియు ఇస్లామ్ మతమున సుస్థాపితములై యుండును. ప్రభుత్వోద్యోగులందఱును మతగురువులను అపారభక్తితో నాదరింతురు; ఇతర మతబోధకులు కూడ గౌరవింపబడుదురు.

యూరపుఖండపు నాగరికత నీక్రిందివస్తువులతో నేయబడిన గుడ్డతో పోల్పదగును: దాని మగ్గము: సముద్రతీరమున నుండు నొక విశాలమును, సమశీతోష్ణస్థితిగలదియు, పర్వతమయ మైనదియు అగు దేశము. దాని దూది వివిధజాతులమిశ్రణముచే ఏర్పడిన బలిష్ఠమును, పరాక్రమవంతమును అగు నొక సంకరజాతి. దాని పడుగు (నిలువునూలు): ఆత్మసంరక్షణార్థమును, స్వమత సంరక్షణార్థమును చేయు యుద్ధము. ఖడ్గధారి యగువాడు ఉన్నతుడగును; ఖడ్గమును ధరింపజాలనివాడు తన స్వాతంత్ర్యమును కోల్పోయి, ఒక వీరుని ఖడ్గసంరక్షణమున జీవించును. దాని పేక (అడ్డనూలు): వాణిజ్యము. ఆ నాగరికత ప్రయోగించు సాధనము. ఖడ్గము. తత్సాహాయ్యకములు: బలధైర్యములు. దానిలక్ష్యము: ఇహపరసుఖానుభవము.

ఇక మన విషయ మెట్లున్నది? ఆర్యులు శాంతిప్రియులు; భూమి దున్నుకొని వ్యవసాయము చేయువారు; ఎవరివలనను ఏ తొందరయు లేక తమకుటుంబములను పోషించుకొనగలిగినచో వారికి చాలును. అంతమాత్రముననే వారు సుఖులై తృప్తులై యుందురు. అట్టి జీవితమున వారికి కావలసినంత తీఱికయుండును, విషయవిచారమునకును నాగరికజీవనమునకును కావలసినంత అవకాశముండును. మన జనకచక్రవర్తి స్వహస్తములతో భూమిని దున్నువాడు—తనకాలపు తత్త్వజ్ఞులందఱిలో శ్రేష్ఠుడును ఆయనయే. మనలో ఋషులు, మునులు, యోగులు ప్రప్రథమము నుండి ఉద్భవించుచుండిరి; వారికి మొదటినుండియు ప్రపంచము వట్టి భ్రమ యని తెలిసియుండెను. ఎంత కొల్లగొట్టినను, ఎంత కలహించినను, నీవు వాంఛించు సుఖానుభూతి శాంతియందే లభించును — భౌతికసుఖపరిత్యాగమునందే ఆ శాంతి లభించును. భౌతికవికాస మెంత యధికమైనను అది సుఖము నీయజాలదు. మనోబుద్ధుల సంస్కృతియే సుఖము నిచ్చును. అడవులను బాగు పఱచి వ్యవసాయయోగ్యముగా నొనర్చినది వారే.

అడవి నఱికి బాగుపఱిచిన స్థలమున వారు వేదనిర్దిష్టహోమ వేదిక నిర్మించువారు. భారతదేశ నిర్మలాకాశమున యజ్ఞముల పవిత్రధూమము ఎగయుచుండెను; శాంతి వెలయు ఆ వాతావరణ ములో, వేదమంత్రములు ప్రతిధ్వనించి, పునఃప్రతిధ్వనుల నీనుచుండెను. — పశువులును ఇతర మృగములును అపాయ భయములేక పచ్చికమేయుచుండెను. ఖడ్గస్థానము విద్యాధర్మముల పాదములయొద్దనని నిర్ణయింపబడెను. ధర్మమును సంరక్షించు టయు, మనుష్యులయొక్కయు పశువులయొక్కయు ప్రాణములకు హానికలుగకుండ చూచుటయునే దాని పని. బలహీనులను అపాయమునుండి రక్షించు వీరుడు — క్షత్రియుడు. నాగటికిని ఖడ్గమునకును ఏలికయై ధర్మము — సర్వసంరక్షకము — నిలిచి యుండెను. ఆయన రాజరాజు; లోకము నిదురించునప్పుడు

కూడ ఆయన నిరంతరజాగరూకుడై యుండును. ధర్మముయొక్క సంరక్షణలో ప్రతివానికి స్వాతంత్ర్యముండెను.

"ఆర్యులు ఏ పరదేశమునుండియో హఠాత్తుగా వచ్చిపడిన ఆదిమవాసుల భూములను లాగుకొని, వారిని రూపుమాపి హిందూదేశమున నివాసమేర్పఱచుకొనిరి" అని చెప్పు యూరపుదేశ విద్వాంసులమాట లన్నియు కేవలము అర్థరహితములు; వెఱ్ఱి ప్రసంగములు! మన హైందవపండితులుకూడ వారిమాటల నొప్పుకొనుట చిత్రము! ఘోరములగు ఈ అసత్యము లన్నియు మన బాలురకు నేర్పుచున్నారు! ఇది మిక్కిలి దుష్కార్యమగుట నిస్సంశయము.

నామట్టుకు నేను కేవలము అజ్ఞానిని; విద్వాంసుడ నని నే నెన్నడును చెప్పుకొనను. కాని నేను గ్రహింపగలిగిన కొంచెమును ఆధారముచేసికొని, 'ప-రీ' కాంగ్రెసులో ఈ యసత్య భావములను తీవ్రముగా ఆక్షేపించితిని. ఈ విషయమునుగూర్చి నేను హిందూదేశవిద్వాంసులతోను, యూరపుదేశవిద్వాంసుల తోను మాటలాడుచున్నాను. తీఱికదొరకినప్పుడు ఈ సిద్ధాంతమునకు అనేకములగు ఆక్షేపణలు — సవివరముగా — పేర్కొందును. మీకును — మన పండితులకును, ప్రస్తుత మీ మాటలు చెప్పుచున్నాను: మీరు విద్వాంసులు; మీ పురాతనగ్రంథములను, శాస్త్రములను పరిశోధించి మీరే విషయనిర్ణయము చేసికొనుడు.

యూరపియనులకు అవకాశము లభించిన తావులందు ఆదిమవాసులను నిర్మూలించి, వారిభూములపై అనాయాసముగా, సుఖముగా, నివాసము లేర్పఱచుకొందురు; కావున ఆర్యులును అట్లే చేసియుందురని వారి తలంపు!! పాశ్చాత్యులు వారి స్వగృహములందే ఉండి, వారికిగల ఆధారములమీదనే నివసించిన యెడల వారు నిర్భాగ్యులుగను, నీచులుగను పరిగణింపబడుదురు.

కావున వారు లోకమంతయు వెఱ్ఱియెత్తినట్లు తిరిగి, ఇతరుల భూములు అనేకు క్రొవ్వును — దోపిడిచేతను, మారణక్రియల చేతను — ఎచ్చట ఆహరించుట సాధ్యమో చూతురు. కావున ఆర్యులును అట్లే చేసియుందురని వారి తలంపు!! కాని మీ నిదర్శనము (రుజువు) ఏదీ? ఊహలుమాత్రమేనా? అగుచో, మీ వింత ఊహలు మీరే ఉంచుకొనుడు?

విదేశమునుండి ఆర్యులు హిందూదేశమునకు వచ్చిరని ఏ వేదమున, ఏ సూక్తమున నున్నది? మృగప్రాయులైయున్న ఆదిమవాసులను వారు వధించి రను భావమును మీ రెచటినుండి సంపాదించితిరి? అట్టి అర్థరహితప్రలాపములాడుటవలన మీ కేమి లాభము కలుగును? మీ రామాయణపరనము నిరర్థకమై పోయినది; దానిలోనుండి యొక పెద్ద చక్కని కథను అల్లనేల?

సరే, రామాయణ మేమి తెలుపుచున్నది? దక్షిణఇండియా లోని ఆరణ్యకులగు ఆదిమవాసులను ఆర్యులు జయించిరనియా! భళీ!! రామచంద్రుడు నాగరికు డగు ఆర్యరాజన్యుడు. అతడు యుద్ధముచేసినది ఎవనితో? లంకకు రాజగు రావణునితో. రామాయణము నొకసారి కొంచెము చదివిచూడుడు. రావణుని నాగరికత రామచంద్రుని నాగరికతకంటె అధికముగాని, తక్కువ కాదని మీ కప్పుడు తెలియవచ్చును. లంకనాగరికత అయోధ్య నాగరికతకంటె కొంచె మధికముగాని, తక్కువ కానేకాదు. ఇక ఈ వానరులు ఇతర దక్షిణహిందూదేశీయులు, ఎప్పుడు ఓడింపబడిరి? వా రందఱును రామచంద్రుని మిత్రులును, సహాయులును కదా! రామచంద్రుడు ఏ వాలిరాజ్యమును, ఏ గుహకరాజ్యమును తనరాజ్యములో కలుపుకొనెనో చెప్పుడు.

కాని కొలదిప్రదేశములందు ఆర్యులకును ఆదిమవాసులకును అప్పుడప్పుడు యుద్ధములు జరిగియే యుండవచ్చును, జిత్తులమారిమును లొకరిద్దఱు రాక్షసులయడవులలో, హోమాగ్ని

ప్రక్కన, కనులుమూసికొని ధ్యానమగ్నులై యున్న ట్లభినయించుచు, నిజమునకు తమమీద రాక్షసులు రాళ్లు, ఎముకముక్కలు ఎప్పుడు పడవేయుదురో యని కనిపట్టుచు ఉండవచ్చును. ఎప్పుడు అట్లు జరుగునో అప్పుడే వారు మూలుగుచు, ఏడ్చుచు, రాజులయొద్ద కేగుదురు. కవచధారులగు రాజులు ఖడ్గములు, ఉక్కుఆయుధములు పూని నిప్పులుక్రక్కు గుఱ్ఱములపై నెక్కి వత్తురు. కాని ఆదిమవాసులు కఱ్ఱలతోను, రాళ్లతోను, ఎంత కాలము యుద్ధముచేయగలరు? కావున వారు తఱిమివేయబడుటో, చంపబడుటో తటస్థించును. అంతట రాజులు తమరాజధానులకు తిరిగి వత్తురు. సరే, ఇదంతయు జరిగియుండవచ్చును. కాని వారి భూములు ఆర్యులు కైకొని రని ఇందుచే ఎట్లు ఏర్పడును? రామాయణములో నెచ్చట అట్లు చెప్పబడియున్నది?

ఆర్యనాగరికతావస్త్రమునకు మగ్గము విశాలములును, ఓడలు నడువ నర్హమైనవియు అగు నదు లక్కడక్కడగల మిక్కిలి పెద్దదియు, వేడిమిగలదియు అగు చదునుదేశము. ఈ వస్త్రమునకు దూది ఆర్యజాతిప్రాబల్యముగల పూర్ణనాగరికులును, అర్ధనాగరికులును, నాగరికతావిహీనులును కూడిన ప్రజ. దాని పడుగు వర్ణాశ్రమాచారము*, దాని పేక కలహస్వభావమును స్పర్ధాస్వభావమును జయించుట.

"యూరపుదేశస్థులారా! మీరు ఏ దేశమును అనుకూల తరస్థితికి తెచ్చితిరి?" అని మిమ్ము అడుగవచ్చునా? మీ రెక్కడెక్కడ దుర్బలతరజాతు లగపడిరో మీరు వారిని సమూలవినాశ మొనర్చితి రని చెప్పవచ్చును. వారిభూములను మీ రాక్రమించుకొని అందు సుస్థిరనివాస మేర్పఱచుకొంటిరి. మీ అమెరికా

* ప్రాచీనహైందవవ్యవస్థ యగు చాతుర్వర్ణ్యము (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములు), చతురాశ్రమములు (బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము).

యొక్కయు, మీ ఆస్ట్రేలియా న్యూజీలెండ్లయొక్కయు, మీ పసిఫిక్ ద్వీపములయొక్కయు, దక్షిణఆఫ్రికాయొక్కయు చరిత్ర మేమి? అచ్చటి ఆదిమవాసులు నేడెచటనున్నారు? అడవిమృగములనట్లు మీరు వారిని నిర్మూలించినారు; ఊరు పేరు లేకుండునట్లు చంపివేసినారు — అట్లు చేయు శక్తి మీకు లేనప్పుడే అట్టిసందర్భములలో మాత్రమే—వారింకను సజీవులై యున్నారు.

కాని హిందూదేశము అట్లెన్నడును చేయలేదు. ఆర్యులు కరుణామయులు. ఔదార్యవంతులు; విశాలములును, సముద్రము వలె అపారములును అగు వారిహృదయములలోను, మానవాతీత జ్ఞానోన్నతి గల వారి బుద్ధిలోను, అశాశ్వతములును — ఉల్లాసకరములుగా నున్నను నిజమునకు దారుణములును — అగు కర్మములకు చోటులేదు. నా దేశపు బుద్ధిహీనులారా! మిమ్మొక ప్రశ్న అడుగుచున్నాను: ఆర్యులు ఆదిమజాతులను — వారి భూముల నాక్రమించుకొనుటకై — నిర్మూలమొనర్చియుండినచో, ఈ వర్ణాశ్రమధర్మవ్యవస్థ ఉండియుండునా?

యూరపుదేశీయులగమ్యము తాము జీవించుకొనుటకు ఇతరుల నెల్లరను నిర్మూలించుట. ఆర్యజాతిగమ్యము ఎల్లరను తమ ఉన్నతికి లేక, ఇంకను అధికతరోన్నతికి — ఉద్ధరించుట. నాగరికత నేర్పఱచుటకు యూరపుదేశీయులసాధనము ఖడ్గము; ఆర్యులసాధనము వేర్వేఱువర్ణములుగా విభజించుట. ఈ చాతుర్వర్ణ్యవిభజనము సభ్యతను చేరుటకు వలసిన సోపానము — అనగా ప్రతివాడును తనపాండిత్యమునకును, సంస్కృతికిని అనురూపముగా పైకిరా ననువుపఱచుమార్గము. యూరపులో ఎల్లయెడలను బలవంతునికి విజయము కలదు. బలహీనునకు మరణము వాటిల్లును. భరతఖండమున ప్రతిసాంఘికనియమము యొక్క ఉద్దేశము బలహీనులసంరక్షణము.

# హిందూమతము - శ్రీరామకృష్ణపరమహంస

శాస్త్రములన్నమాటకు ఆద్యంతరహితములైన వేదములని యర్థము. వేదములే ధర్మమూలము.

స్మృతియన్నమాటకు పురాణములు తక్కినమతగ్రంథములని యర్థము. శ్రుతి విరోధములేనంతవఱకు స్మృతులును ప్రమాణములే.

సత్యము రెండు విధములు. 1. ఇంద్రియగోచరమో, బుద్ధిగోచరమోయగునది. 2. యోగదృష్టికవగతమగునది.

మొదటిపద్ధతివల్ల శాస్త్రము (సైన్స్) లేర్పడును. రెండవ పద్ధతివల్ల వేదము లేర్పడును. అతీంద్రియగోచరములైన సత్యములకన్నింటికి వేదములనిపేరు. వీనికి ఆద్యంతములుండనేరవు. కావున నివి నిత్యములు. ఈ సత్యములనుబట్టియే సృష్టికర్త సృష్టి, స్థితి, లయములను కావించుచుండును.

ఈ యతీంద్రియదర్శనము కల్గినవాడు ఋషి. ఆయనకు గోచరించిన సత్యములు వేదములు.

ఈ ఋషిత్వ మనగా అతీంద్రియదర్శనము; నిజమైన మతము. ఈ దర్శన ముద్బుద్ధముకానంతవఱకు మతమన్నమాట కేమియు నర్థములేదు. ఆ యనుభూతినందనివానికి మతమునందు ప్రవేశములేదు.

వేదములయొక్క అధికారము ఒక ప్రదేశమునకుగాని కొందఱువ్యక్తులకుగాని పరిమితమైలేదు. సర్వకాల, సర్వదేశ, సర్వజనవిషయమునను వేదము ప్రవర్తించును.

విశ్వజనీనమతమును చెప్పునవి వేదములే.

మనపురాణేతిహాసములందును, తక్కిన దేశీయుల మతసారస్వతమందును ఈ అతీంద్రియదర్శనమునుగూర్చి చెప్పబడినను ఆర్యజాతియందు ప్రసిద్ధమైయున్న చతుర్వేదములే పరిపూర్ణ

ములు, మిక్కిలి పురాతనములు. వేదములందే ఆధ్యాత్మికసత్యము లన్నియు భద్రపఱుపబడినవి. అందుచేత సర్వమత గ్రంథము లందును వేదములకే ఎక్కువ ప్రాశస్త్యముండవలెను. సర్వదేశ ప్రజలు వేదములను గౌరవింపవలెను. వేదములుమాత్రమే తక్కిన మతగ్రంథములందలిసిద్ధాంతములకు సామంజస్యమును సంధానింపగలవు.

మఱి వేదములనగా : వానియందు లౌకికవిషయపరిజ్ఞానము గాని, చరిత్రగాని, మఱి వృత్తివిషయికజ్ఞానముగాని ఉన్నభాగము లను వదలివేయగా తక్కినవియే నిజమైన వేదములు.

వేదములు రెండుభాగములు : జ్ఞానకాండ, కర్మకాండ - కర్మకాండయందు చెప్పబడినకర్మలుగాని, వాని ఫలితములుగాని మాయావచ్ఛిన్నమైన జగత్తునకే పరిమితములు. కాబట్టి అవి దేశ కాలములను వ్యక్తిత్వమునుబట్టి మార్పుపొందుచునేయున్నవి. అట్లుమార్పుపొందుట స్వాభావికము.

సాంఘికనియమములు, ఆచారములు ఈ కర్మకాండపైన ఆధారపడియుండును. కావున మార్పుపొందుచున్నవి. ఇకపైనను మార్పుపొందుచునేయుండును. చిన్నిచిన్ని సాంఘికాచారములు వేదములయొక్క అభిప్రాయమునకు బంధకములు గానంత వఱకు నంగీకృతములగుచునే యున్నవి. ఒకఋషి ప్రవర్తనము ఏదోయొకటి యుదాహరణముగా నున్నచో ఈ ఆచారముల నొప్పుకొనవచ్చును. కాని వేదములయొక్క అభిప్రాయములకు, ఋషులయొక్క ఆచారములకు భిన్నమైనప్పుడు ఈ ఆచారము లను గ్రుడ్డిగా అనుసరించుటయే ఆర్యజాతి పతనమైపోవుటకు ఒకానొక ముఖ్యహేతువు.

మఱి వేదములయందలి విజ్ఞానకాండయున్నది. ఇది సర్వ కాలములందు మానవులకు సంసారతరణమునకై భక్తి జ్ఞాన కర్మ యోగముల నభ్యాసమువల్ల మోక్షము కల్గించి యుద్ధరించు చున్నది. ఈజ్ఞానకాండ సర్వకాల సర్వావస్థలందు నేకరీతిగా

నుండును. మార్పుపొందదు. ఈ జ్ఞానకాండ ఒక్కటియే మానవ కోటికంతకు సరిపడు శాశ్వతమతము.

మనువు మొదలగువారి ధర్మశాస్త్రములు కర్మకాండ ననుసరించి దేశకాలములకు, వ్యక్తులకు కావలసిన ధర్మములను సూత్రీకరించినవి. పురాణములు వేదాంతసత్యములను వ్యాఖ్యానించుటకై యవతారపురుషులయొక్కయు, మహాత్ముల యొక్కయు, జీవితచరిత్రలను వర్ణించినవి. ఇంతేకాక పరమేశ్వరునియొక్క గుణవిశేషములయందు కొన్నింటిని ప్రజోపయోగార్థము వ్యాఖ్యానించినవి.

కాలమహిమవల్ల మనుష్యులలో త్యాగశక్తి లోపించినది. లక్ష్యములయందు, నిర్దుష్టశీలమునందు దృష్టి లోపించినది. బుద్ధికుశలత లోపించినది. వట్టి ఆచారమును పట్టుకొని ప్రేళ్ళాకుట ప్రబలినది. పురాణములందు వివృతములైన వేదాంతసత్యములను వదలి, వట్టి కథాంశములను పట్టుకొని పరమేశ్వరుని గుణములకు వ్యాఖ్యాప్రాయములైన మూర్తి విశేషముల నొకరికంటె నొకరెక్కువని వాదించుకొనుటలోనికి దిగిరి.

ఫలితముగా వేదమతమైన సనాతనధర్మము విభిన్నశాఖలుగా చీలిపోయినది. వ్యక్తులు ఒండొరులు, ద్వేషాక్తహృదయులై కలహించుకొనుచు నొకరిపై నొకరు దుమ్మెత్తిపోసికొనుటకు ప్రారంభించిరి.

ఇట్టిపరిస్థితిలో భగవంతుడు శ్రీరామకృష్ణుడై యవతరించి అచ్ఛమైన ఆర్యమతము నాచరణలోపెట్టి చూపించెను. బహుశాఖలందు చెదరిపడియుండిన సనాతనధర్మముయొక్క ఏకతాస్వభావము ప్రదర్శించెను. ఈశాఖలు పైకి భిన్నముగా కన్పించినను, పరస్పరము కలహసంకులములైయున్నట్లు గోచరించుచున్నను, విభిన్నముగా కన్పించుచున్నను, ప్రజలనందఱిని తప్పుత్రోవనీడ్చుచున్నను, వైదేశికులచే నపహాస్యముచేయబడుచున్నను, వీనియందంతర్లీనమైనది సనాతనమతధర్మమొక్కటే. తనజీవితమును ఈ

సనాతనధర్మమునకు ప్రతిబింబరూపముగ - నుదాహరణరూపముగ ఆయన ప్రదర్శించి చూపించిరి.

శ్రీరామకృష్ణుడు పరమేశ్వరుని అవతారమే. పరమేశ్వరుడు వేదపురుషుడు. ఆయనకు సృష్టి స్థితి లయములకాధారభూతములు వేదములు. ఐనను శ్రీరామకృష్ణావతారము వేదాది విద్యాడంబరములను నిరసించెను. ఎందువల్ల? ఈ వేదసత్యములు లౌకికస్పర్శలేని పరిశుద్ధమైన ఋషులచిత్తములందు స్వతస్సిద్ధముగనే దీపించును. అవియట్లు దీపించుచుండుటలోనే ఆ వేదసత్యములయొక్క గొప్పతనమున్నది. మతముయొక్క పునరుజ్జీవనవ్యాపన మున్నది. అది మహాత్ములమనస్సులలో స్వతస్సిద్ధముగ దీపించునపుడే సంభవించునుగాని ఊరక చదువుటవల్ల కాదు.

ఈ సనాతనధర్మమును సంరక్షించుటకు, సాధువులను రక్షించుటకు పునఃపునః పరమేశ్వరు డవతరించుననుట పురాణప్రసిద్ధమైన విషయము.

ప్రవాహము నిమ్నాభిముఖమైనపుడు వేగము హెచ్చును. తరంగము లేచి పల్లములో పడినచో నంతట నణగి యూరకుండదు. పూర్వముకంటె నుత్తాలముగ లేచును. అట్లే ఆర్యసంఘము బహువిపన్నగ్నమైనప్పుడు ఆవిపత్తులలోనుండి విముక్తమై, అపూర్వశక్తివైభవములతో ప్రకాశించుచువచ్చినది. చారిత్రకనిదర్శనము లిట్లుగ్గడించుచున్నవి.

పడిపైకిలేచినపుడెల్ల మనసంఘమునం దంతర్నిగూఢమైన సంపూర్ణత్వము ఎక్కువగా నభివ్యక్తమగుచువచ్చినది. అట్లే పరమేశ్వరుడుకూడ ఒక అవతారములోలేని సంపూర్ణత్వము నింకొకయవతారములో ప్రకటించుచుండును.

పునఃపునః మనదేశము మూర్ఛపొందుచున్నది. పునః పునః పరమేశ్వరు డవతరించి మనదేశము నుజ్జీవింపజేయుచున్నాడు.

ఇంతకుపూర్వ మెన్నడు మనదేశము నింతకటికిచీకటి ఆవరించియుండలేదు. ఇప్పటి మనపతనస్థితి పూర్వపు మన సంఘస్థితియొక్క పతనస్థితికంటె నెన్నోరెట్లు లోతైనది. దీనితోపోల్చినచో, పూర్వపు పతనము వట్టి గొడ్లకాలిగిట్టల గుర్తులవంటివే.

అందువల్ల ఇప్పుడుపొందిన పునరుజ్జీవనముముందు పూర్వపు పునరుజ్జీవనము సూర్యునిముందు చుక్కలకూడలివంటిది. ఇప్పుడు అభివ్యక్తమైన నూత్నశక్తిముందు పూర్వయుగములందలి శక్తివిజృంభణములు వట్టి పిల్లసమేరీలవంటివి.

మనసనాతనధర్మమందలి ప్రాణభూతములైన లక్ష్యములన్నియు వానిని ఆచరణలోపెట్టు దిక్కులేక శిథిలములై చెదరిపోయినవి. కొన్ని శాఖలయం దగపడుచున్నను, కొన్ని విస్మృతములైనవి.

కాని యిప్పుడాధ్యాత్మికపునరుజ్జీవనమువల్ల నీ చెదరిన లక్ష్యములను చేరదీసి, వానిని ఆచరణలోపెట్టి మఱుగుపడిపోయిన వానిని కన్గొని లక్ష్యసిద్ధిపడయుటకు కొంతమంది సాధకులు సిద్ధపడుటకు వీలున్నది. ఈభవిష్యద్వైభవమునకు సూచకముగా పరమేశ్వరు డీయుగమునందు సర్వలక్ష్యములకు నుదాహరణభూతమైన, పరిపూర్ణమైన అవతారమెత్తి తన పూర్వావతారములకంటె నతిశయము ప్రదర్శించెను.

ఇంత ప్రాముఖ్యముగల ఈయుగముయొక్క ఆరంభమందే ఈ సనాతనధర్మముయొక్క భిన్న లక్ష్యములు, భిన్న వైఖరులు మేళవింపబడినవి. ఈ సర్వమునం దవిచ్ఛిన్నముగా ప్రవహించు నేకత్వము నిర్ధారణ మొనరింపబడినది. ఆచరణలోపెట్టబడి ప్రజలకు భేరివాయించి చూపించినట్లు ప్రదర్శితమైనది.

ఈ యుగావతరణము సర్వప్రపంచమునకు, ప్రధానముగా భారతదేశమునకు జరుగబోవు కళ్యాణమునకు మూలము. దీనికి కారకుడు భగవంతుడైన శ్రీరామకృష్ణుడు. పురాతన

సనాతన ధర్మసంస్థాపకులందఱు నేకాకృతి పొంది పునరుద్భ వించినమూర్తి. ఓ మానవుడా! విశ్వసింపుము. హృద్గతము చేసికొనుము.

చనిపోయినవారు తిరిగిరారు. జరిగిన దినము తిరిగిరాదు. అడగిపోయిన తరంగము మఱిలేవదు. పొందిన శరీరమునే మానవుడు తిరిగి పొందడు. అందుచేత ఓమానవుడా! మృతమైనభూత కాలమును ఆరాధించి లాభములేదు. వర్తమానకాలము నారాధించుటకై మేము నిన్నాహ్వానించుచున్నాము. పూర్వము జరిగిన సంగతులను దలచి విచారించుటకంటె, వర్తమానమునందు జరుగుచున్న పనులలో పూర్వము పడిపోయి శిథిలమైన కాలిత్రోవలను పరిశోధించుటకంటె కన్నులయెదుట క్రొత్తగా వేయబడిన రాజమార్గములలో ప్రవేశింపుము. బుద్ధిమంతులిది అర్థము చేసికొనగలరు.

నేల నాలుగుచెఱగులు ఏమహాశక్తి ప్రథమవిజృంభణమునకు హారతులెత్తినవో ఆమహాశక్తి యొక్క పరిపూర్ణత్వము కొంచెమూహించి చూడుము. ఈ దురభిప్రాయమును, ఈ బలహీనతను, దాస్యములో మ్రగ్గుచున్న ప్రజలకు సహజములైన ఈర్ష్యాద్వేషములను వదలి నూతన ధర్మచక్రమును త్రిప్పుటకు సహాయపడుము.

మీరందఱు, పరమేశ్వరుని సేవకులు. పరమేశ్వరుని సంతానము. పరమేశ్వరోపదిష్టములైన కార్యములం దుపకరణభూతులను విషయమును హృదయమునందు నిర్ధరించుకొని, ఈ మహాకార్యారంభమునకు నడుముకట్టుడు.



# బెంగాలీ భాష

("ఉద్బోధన" పత్రికలో ప్రకటింపబడినది)

మనదేశమున బహు పురాతనకాలమునుండి విజ్ఞానము సంస్కృతమునందే ఉండుటవల్ల సామాన్యజనులకు, పండితులకు మధ్య ఒకపెద్ద అంతరువేర్పడినది. బుద్ధునినుండి చైతన్యరామ కృష్ణులవఱకు లోకోద్ధరణార్థముద్భవించినవారు ప్రజాభాషలందే బోధలుచేసినారు. పాండిత్యమనునది గొప్ప విషయము. కాని కఠినమైన, క్లిష్టమైన, అస్వాభావికమైన, కృత్రిమమైన భాషలో కంటె మఱియొకభాషలో పాండిత్యము వెలయింపబడుటకు వీలు లేదా? ప్రజలు మాటలాడుభాషయందు కళకు తావులేదా? స్వాభావికమైన భాషను దూరీకరించి అస్వాభావికమైనభాషను ఆశ్రయించుటలో ప్రయోజనము ఏమున్నది? నీవు ఇంటిలో నుపయోగించుభాషాముఖమున నీవిజ్ఞానపరిశోధనము కొనసాగించు కొనలేవా? కొనసాగించుకొనగలిగినయెడల గ్రంథరచనమునకు విచిత్రమై, నీకు లొంగనిభాష నుపయోగింపనేల? నీ మనస్సులో తత్త్వశాస్త్రమునుగుఱించి, మఱియేదైన శాస్త్రమునుగుఱించి నీవుప యోగించుభాష, ఇతరులచర్చలకు నితరులతో నుపయోగించు భాష, వ్రాయుభాష పనికిరాదా? పనికిరానిచో, నాయాయంశము లనుగుఱించి నీలోనీవాభాషలో తర్కించుకొనుటకుగాని, చర్చించు కొనుటకుగాని ఎట్లు పనికివచ్చినది? మనము మనఅభిప్రాయములను ప్రకటించుకొనుటకు వీలైనభాష__మన కోప, దుఃఖ, ప్రేమాది భావములను వ్యక్తముచేయుటకు వీలైనభాష - యోగ్యమైనభాష వేఱొకటియుండునా? ఆభావము ఆపద్ధతిలో చెప్పవలెనని ఆచెప్పు వైఖరి, ఆశైలి అన్నియు వానియంతటవవి అన్నియు నొకదాని కొకటి తులదూగునట్లుండవలెననగా ఆభాషలోదప్ప పరభాషలో నుండునా? కృత్రిమభాషకాశక్తి, ఆసంగ్రహము, ఆవ్యంగ్యము నీ యిష్టమువచ్చిన పద్ధతిలో చెప్పుటకు నొదిగియుండు లక్షణము

డునా? నీస్వభాషకే—నిత్యమువాడుభాషకే ఆ గుణముండును. భాషయనునది పరిశుద్ధమైన ఉక్కుగానుండవలెను. దానిలో కల గలుపు పనికిరాదు. దానిని నీయిష్టమువచ్చిన వనిముట్టుగా చేసి కొమ్ము. దానిస్వచ్ఛతకు భంగముండరాదు. అప్పుడది ఒక్క దెబ్బతో కొండ శిఖరమునైనను రెండుగాచేయును. ఏమాత్ర మును మొక్కపోదు. మనభాష సంస్కృతముయొక్క ఆలంకారిక శైలి నవలంబించుటవల్ల కృత్రిమముగా తయారగుచున్నది. మంచి భాషయన్నదొకజాతియొక్క అభ్యుదయమునకు ముఖ్య సూచకము.

మఱికొందఱిట్లనగవచ్చును: "బాగుగనేయున్నది. వంగ దేశమందు బహుప్రదేశములలో బహుమాండలిక భేదములున్నవి. వీనిలో మనము దేనిని సారస్వతభాషగా నంగీకరింపవలెను?" దానికి సమాధానమిది: అన్నింటిలో స్వాభావికముగ బలపడి ఏమాట వ్యాప్తిగాంచుచున్నదో అట్టి దానినే మనము స్వీకరింపవచ్చును. అట్టిది కలకత్తాభాష. ప్రాగ్దేశమునుండిగాని పశ్చిమదేశమునుండిగాని ఎవరు వచ్చినను కలకత్తావచ్చునప్పటికి అక్కడ వాడుకలోనున్న భాషను మాట్లాడుటకు ప్రారంభింతురు. అందుచే మనమేభాషను వ్రాత కుపయోగింపవలెనో ప్రకృతియే నిర్దేశించుచున్నది. ప్రాచీప్రతీచీ మండలములనుండి ఇతరప్రయాణ సౌకర్యము లభివృద్ధిపొందిన కొలది ఈ భేదము తగ్గిపోవుచున్నది. అప్పుడు చిటగాంగునుండి వైద్యనాథమువఱకు కలకత్తాభాషయే వ్యాపించును. ఏభాష సంస్కృతమునకు దగ్గఱగానున్నదో యనికాదు మనము చూడ వలసినది. ఏభాష తక్కిన మాండలికములను త్రోసికొని వ్యాపించు చున్నదో యని చూడవలెను. కలకత్తాభాష బెంగాలంతయు వ్యాపించినదని మనకు తెలిసినప్పుడు మాట్లాడుటకు వ్రాయుటకు రెంటికి నొకటేభాష యుండవలయునని, ఆయొక్కటే అందఱికి తెలియునదిగానుండవలయునని మన మంగీకరించుచుంటిమి. ఆకలకత్తా భాషనే మనము ప్రాతిపదికగాచేసికొనవలయును.

మఱి ప్రాంతీయదురభిమానములను ప్రక్కకు నెట్టివేయవలయును. మొత్తము రాష్ట్రమునకంతకు సంబంధించిన క్షేమము దృష్టిలో పెట్టుకొని మీ మండలముయొక్క, గ్రామముయొక్క ఆధిక్యమునకు స్వస్తిచెప్పవలెను.

భాష భావప్రకటనకు సాధనము. అందుచేత ప్రధానములు భావములు. తరువాత గణనీయమైనది భాష. రత్నములతోను ముత్యములతోను గుఱ్ఱమునలంకరించి, దానిమీద నొకకోతి నెక్కించిన నట్లుండును? సంస్కృతమునే చూడుడు. బ్రాహ్మణముల సంస్కృతమున్నది. మీమాంసాసూత్రములకు శబరస్వామివ్రాసిన భాష్యమున్నది. పతంజలిమహాభాష్యమున్నది. శ్రీశంకరుల శారీరక మీమాంసాభాష్యమున్నది. ఈసంస్కృతము చూడుడు. తర్వాత వచ్చినసంస్కృతమునుచూడుడు. మీకుభేదము తెలియును. భేదమేమనగా మనుష్యుడు బ్రదికియున్నపుడు బ్రదికియున్న భాషను మాట్లాడును. చచ్చినతర్వాత చచ్చినభాష మాట్లాడును. చావుదగ్గఱ పడినకొలది స్వతంత్రాలోచన మందగించును. ఏదోబూజుపట్టిన, పుచ్చిపోయిన ఒకటిరెండుభావములను బుట్టెడుపూలలో నత్తరుచల్లి, వానిలోపల పాతిపెట్టుటకు కొందఱు యత్నింతురు. ఓయిదేవుడా! వారెంతకసరత్తు చేయుదురో చూచితివా? పుటకొక్కటే సమాసము, విశేషణసముదాయ ప్రయోగమున తరువాత ఆకస్మికముగ "రాజా వసతిస్మ" అందురు. అబ్బో! విశేషణములు, సమాసములు! శ్లేషలు! శరపరంపర! ఇవన్నియు మరణచిహ్నములు! దేశము పతనోన్ముఖమైనపు డీ లక్షణములన్నియు అభివ్యక్తములగును. ఇది ఒక భాషావిషయములోనే కాదు. తక్కిన సర్వవిద్యలు – శిల్పములు నీ లక్షణముల నభివ్యక్తముచేయును. ఒక ప్రాసాదమున్నదనుకొనుడు. దానియందొక భావసౌందర్యము కాని, ఒకశైలికాని ఏమియునుండదు. స్తంభములన్నియు ఒకే పద్ధతిలో పోతపోసినట్లుండును. వానిలో జీవముండదు. కొందఱు మనుష్యులు నగలు ధరించు విధమును విలోకింపుడు. ముక్కులనిండ,

మెడలనిండ ఏమేమోపెట్టుకొందురు. ఒక పెద్ద దయ్యమువలె కన్పింతురు. ఇక వానిలో లతలు, తీవలు, రకరకములుగ చెక్కుదురు. మఱి సంగీతముగతి? పాడుచున్నారో, ఏడ్చుచున్నారో, అఱచుచున్నారో తెలియదు. ఆసంగీతములో అర్థము, అభిప్రాయము, అసలది ఏమో మనకు తెలియదుసరిగదా, భరత శాస్త్రనిర్మాత ఆభరతముని వచ్చినను చెప్పలేడు. ఆసంగీతము లోని గిలిగింత లెట్టివో చెప్పలేము. ఎంతగందరగోళము! మన తల పగిలిపోవును! మఱి అన్నింటికంటె ఆ దిక్కుమాలిన ముక్కుతోపాడుట. పండ్లునొక్కిపట్టి మహమ్మదీయగాయకులవలె ముక్కుతోపాడుటకు ప్రయత్నింతురు. ఇది పరమఘోరము. వర్తమానకాలమున ఈ లక్షణములను సవరించుకొనుటకు కొంత ప్రయత్నము జరుగుచున్నది. ప్రజలు క్రమముగా భావరహితమైన, ప్రాణరహితమైనభాష, ఆరీతి సంగీతము, కళ, విద్య, నిరర్థకములని గ్రహింపగలరు. జాతీయ జీవనమునకు బలముచేకూరిన కొలది భాషకు, విద్యకు, సంగీతమునకు స్వాభావికముగా భావము, ప్రాణము చేకూరునని ప్రజలు ఇప్పుడిప్పుడే గ్రహించుచున్నారు. నిత్యోపయోగములోనున్న ఒకటి రెండుమాటలు ప్రకటించు భావపుష్టి గ్రంథములనుండి ఎరవు దెచ్చుకొనిన రెండువేల మాటలు కల్పించలేవు. అప్పుడు ప్రతిదైవవిగ్రహము భక్తి నుద్దీపింపజేయును. నగలుపెట్టుకొనిన ప్రతి చిన్నపిల్ల దేవతవలె కన్పించును. ప్రతియిల్లు, ప్రతిగది, ప్రతిపీట, కుర్చీ, మంచము: అన్నియు ప్రాణవంతములై వెలయును. వలసినది భావపుష్టి..



# భావతరంగిణి

ఒకని కిష్టదేవత ప్రత్యక్షమైనది. అత డా యానందములో మైమఱచిపోయి పాటలు పాడ ప్రారంభించెను. అతడు నిలుచున్న చావడియందే ఒక స్తంభము నానుకొనియున్న "కోబెజీ" అను పురోహితుడు నిద్రమత్తుతో జోగుచుండెను. అత డొక దేవాలయములో అర్చకుడు. వస్తాదు. సితారు వాయించగలడు. రెండు కడవలభంగు నొక్క గుక్కను త్రాగివేయగలడు. ఇట్టి లక్షణములే మఱికొన్ని కలవు. హఠాత్తుగా కోబెజీకి ఒక పెద్ద సవ్వడి వినిపించి, అతడు త్రాగినమత్తులో కనుచున్న స్వప్నములను చెదరగొట్టెను. అతడు తనచుట్టు పరికించి, దేవునిముందు నిలబడి మైమఱచి గానముచేయుచున్న మనుష్యుని చూచెను. ఒక పెద్ద యుత్సవము జరుగుచున్న ఇంటిలో మధురమధురముగా వెల్వడు సంగీతఫణితులలో నారదుడో, భరతుడో, హనుమంతుడో, యనున ట్లతడు పాడుచుండెను. కోబెజీకి కోపమువచ్చి చిరాకుగా అతనిని గద్దించుచు "ఏమిటయ్యా అది? అఱచెద వేల? అందులో నొక శ్రుతిగాని లయగాని లేదు. ఏమిటాగోల" అనెను. వెంటనే జవాబు వచ్చినది? "పోనీలేవయ్యా! ఆ లయ శ్రుతులు ఎవరికి కావలెను. నాకు కావలసినది పరమేశ్వరారాధనము" అనెను: కోబెజీ "ఛీ ఊరుకో. పరమేశ్వరుడేమైన పిచ్చిపుల్లాయి యనుకొంటివా? నీకు బహుశః పిచ్చెత్తియుండును. నీ పాట నాకే బాగుండలేదు. ఆ దేవుడు నాకంటె తెలివితక్కువ వాడా ఏమి?" యనినాడు.

---

శ్రీకృష్ణభగవాను డర్జునున కిట్లు చెప్పెను: "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" అని భోలాచందు ఈ శ్లోకమును బహుపర్యాయములు వినినాడు. అప్పుడప్పుడు ఒడలు తెలియ

కుండ నఱచుచుండెడివాడు. "ఓ పరమేశ్వరా! నిన్ను మేము శరణుపొందితిమి. మాకుచేయవలసినకార్యము మఱేమియులేదు". ఈ మాటలు గొంతుకు బ్రద్దలగునట్లు అఱచుట గొప్పభక్తి యని భోలాచందు అభిప్రాయము. అంతేకాదు. అత డప్పు డఱచుచు పరమేశ్వరునికొఱకు తనప్రాణమునైనను త్యాగము చేయుదుననియు, పరమేశ్వరుడు తనభక్తికి వశపడకున్నచో వేదములు, భగవద్గీత మొదలైనవన్నియు వట్టి బుకాయింపులు, అబద్ధములనియు చెప్పుచుండెడివాడు. అతని అనుచరులు కొంద ఱున్నారు. వారును ఈయభిప్రాయముగలవారే. అసలు భోలాచందు పరమేశ్వరునికొఱకు తనదుష్కృత్యములలో నొక్కటియు మాను కొనలేదు. మఱి పరమేశ్వరుడేమైన పిచ్చివాడా యేమి? అంత వఱకు నెందుకు? ఇతని భక్తికి మనమే మోసపోము.

---

భోలాపురి గొప్పవేదాంతి. ప్రతివిషయములోను తన బ్రాహ్మణత్వమును ప్రకటించుకొనుచుండును. ఊరిలోనున్న జనులందఱు తిండిలేక మాడి చచ్చినను భోలాపురి కేమియు పట్టదు. సుఖదుఃఖములు మాయికము లని, యథార్థములు కావని అతడు చెప్పుచుండును. రోగమువల్ల, దుఃఖమువల్ల, క్షామము వల్ల వేలకొలది మనుష్యులు చచ్చిన నతని కేమిలెక్క? ఆత్మ నిత్యమని యూరకొనును. బలవంతుడెవడైన నతనికండ్ల ముందఱ నింకొక దుర్బలుని తీవ్రముగా బాదినప్పుడు అతనికి గుర్తునకు వచ్చునది "నాయంహంతి - న హన్యతే" అని అనునదిమాత్రమే. అత డేపనినిచేయడు. అసలు పనిచేయుటనిన వానికి ఒళ్లుమంట. పనియను నది వానికి గిట్టదు. "ఏమిబాబూ? అని అడిగినచో నతడు జన్మాంతరమందే నేను కర్మలనన్నియు చేసితి"నని చెప్పును. కాని భోలాపురియొక్క ఆత్మజ్ఞానమొక్క విషయములోమాత్రము పనిచేయును. అతనికి భిక్ష సరిగా జరుగలేదనుకొనుడు. లేదా ఒకగృహస్థుడు అత డాశించినట్లు పూజింపలేదనుకొనుడు. అప్పు డాతని యుద్దేశ

ములో నీ గృహస్థులకంటె నీచజంతువులుండవు. మఱి తనకు సరిగా పూజాపురస్కారములు చేయలేని గ్రామముండుట భూమికి బరువు చేటు. భగవంతుడు మనకంటె తెలివితక్కువవాడని అత డనుకొని యుండవచ్చును.

---

"ఓయి రామచరణా! నీకు చదువులేదు. వ్యాపారము చేయుటకు నీదగ్గఱ దమ్మిడి పెట్టుబడిలేదు. పోనీ కాయకష్టమైన చేసికొనలేవు. పోనీ ఈ త్రాగుడు మానుకొందువా యన్నచో అదియులేదు. దుష్టకార్యములను మానలేవైతివి. మఱి బాబూ, నీవు లోకములో నెట్లు మెలగుదువు?" "ఓష్!, దానికేమి మహాశయా! నే నందఱకు మతోపన్యాసములు చెప్పుదును" అని ప్రత్యుత్తరము చెప్పును. మఱి రామచరణుడు పరమేశ్వరుని గుఱించి ఏమనుచున్నాడో!

---

లక్నో పట్టణమంతయు మొహరం వేడుకలతో నూగిపోవు చున్నది. నగరమునందు ప్రధానమైన మసీదు "ఇమెంబరా" పెద్దపెద్ద అలంకారములతో, దీపపుబుడ్లతో వెలుగొందుచున్నది. ఇసుకవేసిన రాలకుండ ప్రజలు సమకూడిరి. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, యూదులు — అన్నిరకముల ప్రజలు, పురుషులు, స్త్రీలు, పిల్లలు — అన్నిమతములవారు మొహరం ఉత్సవము చూచుటకు గుమికూడినారు. లక్నో షియాలకు ప్రధానస్థానము. అందుచేత 'హస్సాన్', 'హూస్సెయిన్' అను ఏడ్పులతో ఆకాశము బ్రద్దలగుచున్నది. ఈ విచారకరమైన సందర్భమునందు, ఈ ఏడ్పులను విని ఎవరిహృదయము ద్రవించదు? వేయిసంవత్సరములక్రింద జరిగిన "కర్బల" గాధ ఈనాడు పునరుజ్జీవముపొందినది. ఈ పెద్దగుంపులో ఇద్దఱు రాజపుత్రులున్నారు. ఈ యుత్సవము చూచుటకు చాల దూర గ్రామమునుండి వచ్చిరి. వీరిద్దఱు జమీందారీకుటుంబమువారు,

ఠాకూరుసాహేబులు. పాపము వీరికేమియు చదువురాదు. ఈమహామ్మదీయసంస్కృతి ఎంతదొడ్డది! అంతచక్కనిపదజాలము, అంతసొగసైన, నిర్దుష్టమైన ఉచ్చారణ, అంత విభిన్నమైన, విలాస వంతమైన వస్త్రధారణము, ఆ వదులు వదులు బురఖాలు, అంత బిగుతులాగులు, తలపాగలు, వందలకొలది భిన్న భిన్న వర్ణములతో కూడిన యుడుపులు పట్టణ ప్రజల అభిరుచికి తగినట్టి వివియన్నియు అంతదూరగ్రామమునకు ప్రాకలేదు. అందుచేత ఠాకూరు సాహేబుల కివేమియు తెలియవు. ఈ ఠాకూరులు వట్టి సామాన్యులు. సరళమైనవారు. వేట యనిన ప్రీతికలవారు. దృఢ కాయులు. మిక్కిలి కఠినహృదయులు.

ఈ ఠాకూరు లిద్దఱు ద్వారము దాటి మసీదులోనికి వెళ్ల బోవుచుండిరి. ఒక పహరావాడు వారి నాపినాడు. వారు లోపలకు చూచుటకు పోవుచుమనినారు. అపుడు వా డిట్లనెను: "ఇదిగో ఇక్కడ ఈ పెద్ద శిలావిగ్రహమున్నది. దానిని ముందు ఐదు తన్నులు తన్ని మఱి లోపలకు పొండు". "ఈ శిలావిగ్రహ మెవరిది బాబూ?" "ఇదా, ఇది వేయిసంవత్సరములక్రిందట హసానును, హొసాయినును చంపిన పరమనీచుడైన ఎజీద్ ది. అందుకనే ఈ ఏడ్పులు, పెడబొబ్బలు". ఆ పహరావా డీ మాటలు చెప్పి ఎజీద్‌ను పది తన్నులైన తన్నించిన కాగుందునను కొనినాడు. కాని కర్మఫలము విచిత్రముగా నుండును. మన మొకటిచెప్పిన వాడొకటి అర్థముచేసికొనును. వెంటనే ఠాకూరులు వారి రుమాళ్లను మెడకు చుట్టుకొని భక్తితో ఎజీద్ శిలావిగ్రహముముందు సాష్టాంగపడి దొర్లుచు గద్గదస్వరముతో "ఇంక లోపలకు పోవుట ఎందుకు? ఇంక ఇతరదేవతలను చూడనేల? భేష్! భేష్! ఎజీదయ్యా. నీ వొక్కడవే అసలైన దేవుడవు. ఆ దుర్మార్గులను భలే మర్దించినావులే. ఎంత బాగా మర్దించినా వనగా ఇప్పటికిని వా రేడ్చుచునే యున్నారు".

---

సనాతనమత మొక పెద్ద దేవాలయము. దానిలోనికి బహు మార్గములున్నవి. అక్కడ నీకు దొరకని దైవస్వరూపము లేదు. పరబ్రహ్మమునుండి బ్రహ్మ, విష్ణువు, శివుడు, శక్తి, సూర్యుడు, గణపతి — ఇంకా ఇతర దేవతలు కలరు. ఏ దేవతకు కొఱత లేదు. వేదములందు, వేదాంతములందు, పురాణతంత్రగ్రంథములందు కావలసినంత సామగ్రి దొరకును. వానిలో ఏ ఒక్క చిన్న వాక్యమైనను జన్మపరంపరాశృంఖలమును త్రెంపివేయుటకు చాలును! అబ్బో! ఏమి జనసమూహము! లక్షల లక్షల ప్రజ లీ దేవాలయము వంకకు వచ్చుచున్నారు. నేనుకూడ వేడుకపడి వీరితో పోయినాను. నేను ఈ దేవాలయముదగ్గఱకు రాగానే నాకు కన్పించిన దేమియో తెలియునా? లోని కొక్కడును పోవుటలేదు. ద్వారముప్రక్క ఒక పెద్దవిగ్రహమున్నది. 50 తలలు, 100 చేతులు, 200 పొట్టలు, 500 కాళ్లు — ఇట్లున్నది. ప్రతివాడు ఆ విగ్రహము ముందు సాష్టాంగపడుచు దొర్లుచున్నారు. "ఎందుకు బాబూ?" అని నే నడిగినపు డొక డిట్లు చెప్పినాడు: "నీవు లోపలకువెళ్లి చూచి దేవతలకు ఒక్కసాష్టాంగప్రణామముచేసిన చాలు. లేదా దూరమునుండి ఒకటో, రెండో పూలువేసినను చాలు. అసలు చేయవలసిన అర్చన అంతయు ఈ ద్వారమువద్దనున్న దేవునకే! మఱి వేదవేదాంతశాస్త్రపురాణములు మొదలైనవి ఉన్నవి. అప్పుడప్పుడు నీవు వానిప్రవచనములు వినవచ్చును. అంత విన కున్నను బాధలేదు. కాని ఈ దేవునికిమాత్రము పూజచేయక తప్పదు. చేసితీరవలసిన దే. మఱల నే నడిగినాను: "బాగుగనే యున్నది. ఈ దేవదేవుని పే రేమి?" "ఈయనపేరే తెలియదా? ప్రసిద్ధమైనదే. ఆచారదేవత" అని చెప్పినాడు. నాకు ఠాకూరుసాహెబులు గుర్తుకువచ్చినారు. "భేష్ ఆచారదేవతా! వీంద్రను చక్కగా మర్దించినావు" అని నేను పలికితిని.

---

గుద్గరీకృష్ణవ్యాల్ భట్టాచార్య చాల పెద్దపండితుడు. ఆతని పాండిత్యమునకు భూమ్యాకాశములు పట్టవు. కాని మనుష్యుడు బక్కవాడు. ఆయనస్నేహితులు "బహూపవాసమువల్ల, నియమ కాఠిన్యమువల్ల నాతడు కృశించినా"డందురు. కాని ఆయనవిరోధులు "తిండి తినక అట్లైపోయినా"డందురు. వారిలో మిగులదుర్మార్గులు "అట్లుండక ఎట్లుండును? ఏడాదికి డజనుచొప్పున పిల్లలను కనుచున్నాడు" అని అందురు. ఆతడంత బక్కగా నుండుటకు కారణమేదైన కానిండు. సృష్టిలో ఆతనికి తెలియని విషయమేమియు లేదు. శరీరమునందు కేశాగ్రమునుండి పాదనఖాగ్రమువఱకు ప్రవహించు విద్యుదయస్కాంతప్రవాహములను గుఱించి అతడు సర్వజ్ఞుడే యని చెప్పవలెను. ఆతనికి తాంత్రిక జ్ఞానమంతయు సమృద్ధిగా నున్నది. అందుచేత ప్రతివిషయమున నాతడు శాస్త్రీయమైన వ్యాఖ్యానము చేయగలడు. ఫలానామట్టితోనే దుర్గావిగ్రహమెందుకుచేయవలెను? అను విషయము దగ్గఱనుండి ఆడపిల్ల రజస్వలయగుటకు సరియైన వయస్సు పదియేండ్లే అను విషయమువఱకు ఆతనికి తెలియును. ఇంతేకాక, అనేకవిషయములకు సంబంధించిన చిత్రవిచిత్రములైన కర్మకలాపమునకంతకు శాస్త్రీయమైన వ్యాఖ్యానముల నాతడు చేయగలడు. పూర్వోదాహరణముల నిచ్చుటయందును గట్టివాడు. ఎంత చిన్న పిల్లలకైనను తెలియున ట్లెన్నో యుదాహరణముల నీయగలడు. నిజముగా చెప్పవలెనన్నచో హిందూదేశ మొక్కటే ఆధ్యాత్మిక దేశము. హిందూదేశములోకూడ ఈ యాధ్యాత్మికతను తెలిసికొనదగినవారు బ్రాహ్మణు లొక్కరే. వారిలోను కృష్ణవ్యాల్ కుటుంబమువారొక్కరే గట్టివారు. వీరిలోకూడా గుద్గరీగారొక్కరే చాలగొప్పవారు. గుద్గరీకృష్ణవ్యాల్ ఏదిచెప్పినను దానికి తిరుగు లేదు. ప్రజలు కొంచెము కొంచెము ప్రబుద్ధులై చుఱుకుతనముతో వ్యవహరించుచున్నారు. కొంతమంది కొంత కొంత పాండిత్యము సంపాదించుచున్నారు. అందువల్ల ప్రతివాడు

ప్రతివిషయమును కొంత రుచిచూడవలయునని కాంక్షించును. అందువల్ల కృష్ణవ్యాల్ ప్రతివాని కిట్లు చెప్పుచుండును: "అబ్బాయి! మీ కేమియు భయములేదు. ఏ సందేహమున్నను నాదగ్గఱకు రండు. శాస్త్రీయముగా చెప్పెదను. మీ రేమియు చేయనక్కఱలేదు. హాయిగా నిద్రపొండు. దేనినిగుఱించి అంతగా యోచింపకుడు. నా సంభావనమాటమాత్రము గుర్తుంచు కొనుడు". ప్రజలానందముతో "అబ్బ! ఎట్టి యనుభూతి! మనకు పెద్దచిక్కు వచ్చిపడినది. మనము చాలదూరము నడవవలెను. అక్కడకువెళ్లి కూర్చుండవలెను. నానాయాతనపడవలెను. ఇంత యాతనయేల? ఈ కృష్ణవ్యాలుడున్నాడుకదా! బ్రతికిపోయినాము" అని అనుకొనిరి. "కృష్ణవ్యాల్ చిరకాలము వర్ధిల్లుగాక" అని ఆశీర్వదించిరి. మఱల సుఖనిద్రకు మఱగినారు. వేయిసంవత్సరముల నుండి అలవాటుపడిన నిద్ర ఒక్కసారితో పోవునా? శరీరము దాని నొప్పుకొనదు. ఒక్కక్షణములో వేయేండ్లనుండి అభ్యాసమైన మాంద్యము మనస్సును వీడిపొమ్మనిన పోవునా? ఈ ప్రజాబుద్ధి నాక్రమించిన మాంద్యము వలననేకదా ఈ కృష్ణవ్యాలు జాతియంతయు నింతగౌరవము సంపాదించినది. "భేష్! అభ్యాస మంత గొప్పది మఱేదియు లేదు. ఓ యభ్యాసమా! నీవు చాల గొప్పదానవు. వారిని బాగుగా మర్దించితివి".





కొలంబోలో నుపన్యసించుచున్న శ్రీ వివేకానంద స్వామి
జనవరి 1893

# నా యూరపు యాత్ర

"ఓం నమో నారాయణాయ".* స్వామీ,—నమశ్శబ్దముతో రెండవయచ్చును ఉచ్చైఃస్థాయిలో హృషీకేశపద్ధతిలో పలుకుము. వారముదినములు మేము ఓడలో నుంటిమి. ప్రతిదినము ఇచ్చట మా జీవనపద్ధతినిగుఱించి మీకు వ్రాయుదమనుకొందును. వ్రాత పరికరములుగూడ వలసినన్ని మీరు నాకిచ్చితిరి. కాని వంగ దేశీయునకు సహజమైన అలసగుణము అడ్డమువచ్చి నన్నే పనియు జేయనీయదు. ఈ సోమరితనము మొదటి యడ్డంకి. ప్రతిదినము నేను దినచర్య వ్రాయుదమనుకొందును. కాని ఇవ్విధములైన వ్యవహారములలోపడి, అది వాయిదా పడుచునే యున్నది. రెండవది: నాకు తేదీలు గుర్తుండవు. అందుచేత మీరే ఈ తేదీలు పూర్తిచేసికొనవలెను. మఱి మీరు కొంచెము దూరముగా భావించినచో హనుమంతునకువలెనే నాకును చిత్తమీశ్వరా యత్తము గాబట్టి ఈ తేదీలు మొదలైనవి గుర్తుపెట్టుకొనుట కష్టమని అనుకొనవచ్చును. కాని సత్యమునకు ఇది నా సోమరి తనము, తెలివితక్కువతనము తప్ప అన్యము గాదు. ఆ హనుమంతుడు రామాధీనమైన హృదయము గలవాడు. ఆయనకు నాకు సంబంధమేమి? ఆయన యొక గంతుతో శతయోజనవిస్తీర్ణమైన సముద్రమును లంఘించినవాడు. మేము ఒక కొయ్యఓడలో దాటుచున్నాము. మేము ఈ కొయ్యఓడలోనైన నిలుచుండవలె

---

* సన్న్యాసులను సాధారణముగా సంబోధించు విధమిది. 1900 లో రెండవపర్యాయము పాశ్చాత్యభూమికి పోయినపుడు శ్రీ వివేకానందస్వామి తనసంస్మరణోదంతమును ఉద్బోధనపత్రికాసంపాదకులైన శ్రీ త్రిగుణాతీతుని సంబోధించి వ్రాసిరి. కావున ఈరీతిగా నారంభించిరి. స్వామిజీ ఈ యుదంతమును సరళమై, హాస్యరసబంధురమైన వంగభాషాశైలిలో వ్రాసిరి. ఆంగ్లానువాదము దానికి సముచిత దర్పణము కాలేదు.

నన్నచో ఏదో యొక స్తంభమును బట్టుకొని నిలుచుండవలెను. కానీ ఆయనకంటె ఒకవిషయములో మనమే గొప్ప. ఆయన సముద్రమును దాటిన తరువాత లంకలోని రాక్షసులను చూచి నాడు. మేమో! వారితోనే కలసి ప్రయాణముచేయుచున్నాము. భోజనవేళలో వా రుపయోగించు వందలకొలది తళతళమెఱయు శూలముల సంఘర్షణలు విని మనసోదరుడు, తురీయానందుడు భయపడెడివాడు. అప్పుడప్పు డతడు లేచిపోవుచుండెడివాడు. ఏమో ఒకవేళ ఆ ప్రక్కన కూర్చున్న చిట్టజుట్టు, పిల్లికళ్లయామె పొరపాటున అతని పొట్టలోనికి చాకు దింపవచ్చునేమో! అది అతనిభయము. అతడు కొంచెముబలిసినవాడు. అట్లుండుటకు నాకొక సందేహముకలదు. హనుమంతుడు సముద్రము దాటునపుడు మనవలె సముద్రప్రయాణమువలన దాపురించు వ్యాధివలన బాధపడెనా? పూర్వగ్రంథములు ఈవిషయమునుగూర్చి ఏమైన చెప్పినవా? మీరందఱు బాగుగా చదువుకొనినవారు. రామాయణము మొదలగు గ్రంథములలో పండితులు. అందుచేత మీరు ఈ సమస్యను పరిష్కరించగలరు. కాని అధునాతనపండితులు మాత్రము ఈవిషయమును గుఱించి మౌనము వహించినారు. బహుశః హనుమంతునకు ఆ వ్యాధి వచ్చియుండదు. కాని ఆయన ఎవరో యొక రాక్షసిచేతులలో చిక్కకొనినట్లున్నాడు. అందువల్ల ఒకసందేహము పుట్టుచున్నది. ఏమనగా, ఒక్కొకప్పుడు ఓడ హఠాత్తుగా ఆకాశమువైపుకు ఇంద్రునితో మాట్లాడుటకోయన లేచినపుడును, తరువాత వెంటనే పాతాళలోకములోనున్న బలి చక్రవర్తిని త్రొక్కుటకోయన క్రిందికి దిగిపోయినపుడును సోదరుడు తురీయానందుడు ఏదో యొక రాక్షసునినోటిలో చిక్కకొనినట్లు భావించెడివాడు. క్షమించవలెను. మీరు ఈ పనిని మిగుల మంచి వానిచేతిలో పెట్టినారు. ఈ వారమురోజుల సముద్రప్రయాణము నేను మీకు వర్ణించి చెప్పవలసియున్నది. ఇదంతయు కవిత్వముతో నింపి, రసవంతముగా చక్కని భాషలో, అలంకారములతో

కూడిన శైలిలో వ్రాయవలసియున్నది. నేనేదో ఇష్టమువచ్చినట్లు చెప్పుచున్నాను. కాని యథార్థము చెప్పవలెననిన నా జీవిత మంతయు పైనున్న మాయ యను పెంకును పగులగొట్టి, లోపల నున్న బ్రహ్మపదార్థ మను కొబ్బరిని తినుటకు ప్రయత్నించి నపుడు హఠాత్తుగా ఈ ప్రకృతిసౌందర్యమును మెచ్చుకొనుటకు తగిన శక్తిని సంపాదింపగలుగుదును. నా జీవితమంతయు కాశీనుండి కాశ్మీరమునకు, ఖొరాసర్ నుండి గుజరాతువఱకు హిందూదేశ మంతయు తిరుగుచునేయుంటిని. ఎన్నికొండలు, ఎన్ని నదులు, ఎన్ని పర్వతములు, ఎన్ని సెలయేళ్లు, ఎన్నిలోయలు, ఎన్ని మేఘావృత నిరంతర హిమాచ్ఛాదిత పర్వతశిఖరములు గోచరించినవి! కల్లోలిత ములై గర్జించుచు, నురుగులు గ్రక్కుచున్న సముద్రములనెన్ని చూడ లేదు? వినలేదు? దాటలేదు? కాని ఇక్కడ ఈ చీకటిగదిలో ఈ మోటుకొయ్యమంచముమీద కూర్చుంటిని. ఇక్కడ పగలు కూడ దీపము పెట్టుకొనవలసినదే. ఈ గదిగోడలమీద తమ్మినమిలి ఉమిసినగుర్తులు, ఎలుకలు, చుంచులు, బల్లులు, వీని కిచకిచలు, ప్రక్కన వీథిలో బండ్ల చప్పుళ్లు, ట్రాము చప్పుళ్లు, దుమారములు చెలరేగుచున్నవి. ఇట్టి కావ్యోచిత వాతావరణమునందు మన వంగకవి శ్యామచరణుడు హుక్కాగొట్టమునుపీల్చుచు ప్రాణవంత ముగా చిత్రించినహిమాలయములు, సముద్రములు, పచ్చికబయళ్లు, ఎడారులు, నేనెక్కడ చిత్రించగలుగుదును? అట్టివర్ణనము ననుక రించుటవ్యర్థము. శ్యామచరణుకు తన పసితనమునందు స్థలము మార్పునకై ఉత్తరదేశమునకు పోయెను. అక్కడ నీళ్లు మంచివి. జీర్ణశక్తి నభివృద్ధిజేయునవి. నీవు పొట్టనిండ తిని ఒకచెంబెడునీళ్లు త్రాగినచో నీవు తిన్న తిండియంతయు నరగిపోవును. మరల కరకర ఆకలివేయును. ఇచ్చట శ్యామచరణునియొక్క మహా ప్రతిభ ప్రకృతిగతమైన మహిమను, సౌందర్యమును గ్రహింప గలిగినది. కాని పానకములో పుడకవలె ఒకచిన్నలోపము గలదు. శ్యామచరణుని యాత్రలు బర్ద్వాను దాటి పోలేదు.

కాని మీరు నన్ను హృదయపూర్వకముగా అడిగినారు. అదిగాక నాలో కవిత్వశక్తి పూర్తిగా లోపించలేదు. అందుచేత నేను భగవంతునిపేరుమీదుగా ఈ కార్యభారమును పూనుకొనుచున్నాను. మీరుకూడ సావధానులుకండు.

సామాన్యముగా రాత్రిపూట ఏరేవునుండియైనను, అందులో కలకత్తా వర్తకరేవునుండి హుగ్లీ వంటి నదిలో ఓడలు బయలుదేరవు. ఓడ సముద్రములోనికి పోవునంతవఱకు అధికారము చోదకునిచేతిలో నుండును. అంతవఱకు నతడే నౌకానాయకుడు. అతడే ఆజ్ఞ జారీచేయును. ఓడను సముద్రములోనికి నడపునపుడును సముద్రములోనుండి రేవులోనికి నడపునపుడును అతని పని పూర్తియగును. హుగ్లీ ముఖద్వారసమీపమున రెండు అపాయ స్థలములున్నవి. ఒకటి బడ్జిబడ్జిదగ్గఱ జేమ్సుమేరీ బ్యాంకును అను ప్రదేశము. రెండవది. డైమంట్ హార్బరులోనికి పోవుటకుముందుగా నున్న ఇసుకదిబ్బ. సముద్రముపోటులో నున్నపుడు పగటిపూట మాత్రమే చోదకుడు ఎంతోజాగర్తగా ఓడను నడపగలడు. తక్కినవేళ నడపుటకు వీలులేదు. అందుచేత మాకు హుగ్లీ దాటుటకు రెండుదినములు పట్టినది.

మీకు హృషీకేశములోని గంగానది గుర్తున్నదా ? ఆస్వచ్ఛమైన నీలజలముయొక్క ఐదుగజములలోతులోనున్న చేపపొలుసులనైనను మనము లెక్కపెట్టవచ్చును. హిమశీతలమైన తీయని, చక్కని నీరు, 'హర హర' అను ప్రవహించు ఆ నీటి చప్పుళ్ళు, సమీపమునందలి జలపాతముల 'హరహర' యను ధ్వనులు మీకు గుర్తున్నవా ? మన ఆ అరణ్యములయందలి జీవితము, ఆ మాధుకరము, ఆ గంగానదిలోని రాతి లంకలమీద ఆ భోజనములు, దోసిళ్లతో కడుపార సలిలమును గ్రోలుటలు, రొట్టెముక్కల కొఱకు నిర్భయముగా తిరుగుచున్న ఆ చేపలు మీకు గుర్తున్నవా? ఆగంగానదీజలముపైగల ప్రేమ, ఆమహానదివైభవము

అనిర్వచనీయములు. ఆ నీటి చల్లనితాకుడు మనస్సును శాంతపఱచు నట్టిది. శ్రీనగరము, తెహరి, ఉత్తరకాశీ, గంగోత్రి మొదలైన ప్రదేశములగుండా హిమాలయపర్వతములమీద ప్రవహించు ఆగంగా నది మీకు గుర్తుండియుండవచ్చును. మీలో కొంతమంది ఆగంగా నదీజన్మప్రదేశము చూచియున్నారు. కాని కలకత్తాలోని మన గంగానదిలో ఒక సమ్మోహనశక్తియున్నది. నీరు కశ్మలముగా, పరమేశ్వరదేహసాంగత్యమువల్ల నన్నట్లు, తెల్లగా నుండును. ఆమె యెదపైన అసంఖ్యాకములైన ఓడలు తిరుగుచుండును. ఇట్లనిపించుట దేశభక్తియో మఱి చిన్ననాటి సంస్కారములో ఎవరెఱుగుదురు. గంగామాతకు హిందువులకు ఎంత యద్భుతమైన సంబంధము కలదు! ఇది వట్టి మూఢవిశ్వాసమా? కావచ్చును. ఈ హిందువులు గంగయని జపించుచు జీవింతురు. మరణ సమయమున గంగోదకములు చల్లుకొనుదురు. సుదూరవర్తులైన జనులు గూడ తమతో గంగోదకమును గొనిపోవుదురు. రాగి పాత్రలలో భద్రపఱచుకొని దాచుకొందురు. పండుగలు చేసికొనినపుడు, పవిత్రదినములందు, ఆ పాత్రలలోని గంగోదకము రెండు, మూడు చుక్కలు లోపలకు పుచ్చుకొందురు. రాజులు, మహారాజులు, పెద్ద గుండిగలలో గంగోదకమును భద్రపఱచుకొందురు. బహుధనము వెచ్చబెట్టి గంగోత్రినుండి, గంగోదకమును గొనిపోయి రామేశ్వరమునందు వేంచేసియున్న రామేశ్వర లింగమునకు అభిషేకముచేయుదురు. రంగూను, జావా, హాంకాంగు, మడగోస్కరు, సూయిజు, ఏడెను, మాల్టా మొదలైన విదేశములకు పోవు హైందవులు తమతో భగవద్గీతతోబాటు గంగోదకమునుగూడ కొనిపోవుదురు.

హైందవులయొక్క హైందవత్వమునకు భగవద్గీత, గంగోదకము ప్రధానచిహ్నములు. వెనుక పాశ్చాత్యదేశములకు వెళ్ళినపుడు అవసరమగునని నేనుగూడ కొంత గంగోదకమును గొనిపోయితిని. సందర్భము కలిగినపుడు కొన్ని చుక్కలు లోపలికి

పుచ్చుకొని నడివాడను. త్రాగినపుడెల్ల ఆ మహాజనప్రవాహమధ్య మున ఆ నాగరకపుగొడవలో ఆ వేలకొలది స్త్రీపురుషుల విసరు నడకల చప్పుళ్ళలో నా మనస్సు ప్రసన్నమగుచుండెడిది. ఆ జన ప్రవాహము, ఆ గందరగోళము అడుగడుగుకు నున్న ఆ స్పర్థ, ఆ సంఘట్టము భోగనివాసములైన పారిసు, లండను, న్యూ యార్కు, బెర్లిను, రోము మొదలైన ఈ నగరములన్నియు అంతర్ధానము చెంది, 'హర' 'హర' యను గంగానదీ ఘోషలు విన్పించుచుండెడివి. హిమాలయప్రాంతములందలి ఆ ఏకాంతా రణ్యములు కన్పించుచుండినవి. ఆ దివిజకల్లోలినీగర్జనలు 'హరహర' యని నా హృదయమునందు, నా మేదస్సునందు, నా నరములవెంట ప్రవహించుచున్నట్లు నాకనుభవము గలుగు చుండెడిది.

ఈ పర్యాయము మీరుకూడ గంగామాతను మదరాసుకు పంపియున్నారు. కాని ప్రియసహోదరా! అబ్బ! మీరెటువంటి వింత పాత్రలో నుంచినారు గంగామాతను! సోదరుడు తురీయానందుడు తనబాల్యమునుండి బ్రహ్మచారి. ఆధ్యాత్మికశక్తివలన అతడు జ్వాల దగ్నిహోత్రునివలె కన్పించును. అతడు బ్రాహ్మణుడు. సన్న్యసించక పూర్వమందు 'నమోబ్రహ్మణే'యని అనేకులు అతనికి నమస్కరించు చుండెడివారు. సన్న్యాసి కాబట్టి. ఇప్పుడు 'నమో నారాయ ణాయ' అని నమస్కరించుచున్నారు. అందుచేత గంగామాత బ్రహ్మదేవుని కమండలము వదలి ఆయన యధీనములోనికి వచ్చి ఒక బిందెలో నింపబడినది. ఏమైనప్పటికి ఒక రోజున నేను రాత్రి ప్రొద్దుపోయిన తరువాత నిద్రలేచితిని. ఆ విద్దూరపు బిందెలో గంగామాత యుండలేక పోయినది. బయటకు వచ్చు టకు ప్రయత్నముచేయుచున్నది. అది గనుక జరిగినట్లైన చాల అపాయకరమనుకొంటిని. ఎందుచేతననగా గంగా మాత ఆమె జీవితములోని పూర్వపుదృశ్యములు హిమాలయములను తొలచి కొని ప్రవహించుట, ఐరావతగజమును నెట్టించుట, జహ్నునిపర్ణ

శాలను తరలించుకొనిపోవుట మొదలైన ఘట్టములను పునః ప్రద
ర్శించినచో చాలప్రమాదము వాటిల్లునుగదా! నేను గంగామాతను
గుఱించి బహుధా ప్రార్థించితిని. "అమ్మా! కొంచముసేపు తాళియుం
డుము. మమ్ము రేపు మదరాసు వెళ్ళనిమ్ము. అచ్చట నీ చిత్తము
వచ్చినట్లు చేయుదువుగాని. అక్కడ ఏనుగులకంటె పెద్దతలకాయ
లుగలవారున్నారు. వారిలో చాలమందికి జహ్నునికివలెనే పర్ణశా
లలుగూడ నున్నవి. వారి తలకాయలు సగము క్షురకర్మకువశమై
నడినెత్తిని పెద్దజుట్టు ముడిలోనుండును. అవి నిజముగా రాతితో
చేసినవే. వానితో బోల్చిచూచినచో హిమాలయములే వెన్న
పూసవలె మెత్తగ నుండును. నీ ఇష్టము వచ్చినట్లు కొట్ట
వచ్చును. ఇప్పుడుమాత్రము కొంచముసేపు ఓర్పు వహింపుము."
అని చెప్పితిని. కాని నే నేమి చెప్పిన నేమి లాభము? అంతయు
వ్యర్థమైనది. గంగామాత ఒక్కమాటగూడ వినలేదు. అప్పుడు
నాకొక ఉపాయము తోచినది. ఆమెతో నిట్లంటిని: "అమ్మా!
ఆ చొక్కాలు తొడుగుకొన్న, తలపాగాలు చుట్టుకొన్న సేవకుల
వంక చూడుము. ఈ ఓడలో అటు నిటు దిరుగుచున్నారు. వారు
మహమ్మదీయులు. నిజమైన మహమ్మదీయులు. ఆవుమాంసమును
తిను మహమ్మదీయులు. ఈ గదులను ఊడ్చుచు, శుభ్రము
చేయుచు తిరుగుచుండెడివారిని చూచితివా? వీరందఱు పాకీ
వాండ్రు. 'లాల్ బెగ్'యొక్క శిష్యులు. నీవు కనుక నా మాట
వినకపోయితివా వారిని పిలచి నిన్ను ముట్టుకొమ్మందును. ఆ శిక్ష
గూడ నీకు చాలనట్లయిన నిన్ను నీ పుట్టింటికి పంపెదను. ఆ గది
చూచితివా? నిన్ను అందులోబెట్టి తాళమువేసినచో హిమాలయ
ములలో నీ పూర్వపుస్థితికి బోవుదువు. అనగా నీ పొంగంతయు
అణగిపోవును. మంచుగడ్డవలె తయారగుదువు". ఈ మాటలు
ఆమె తలకెక్కినవి. మెదలకుండ నూరకున్నది. ఈ రోగము
ఒక్క దేవతలకే గాదు. మనుష్యులకుగూడ నున్నది. ఎవడైన
యొకభక్తుడు దొరకిన జాలును. వాని నెత్తికెక్కి కూర్చుందురు.

చూడుడు! మరల నేను అసలువిషయము వదలిపెట్టి ఏదో సందర్భములో పడినాను. నేను తొలుతనే మీకు చెప్పితిని. ఈ విషయములు వర్ణించుట నా పద్ధతిగాదు. కాని మీకు ఓర్పున్నచో మరల ప్రయత్నింతును.

స్వజాతిజనములో ఎచ్చటను కన్పించని సౌందర్యముండును. స్వర్గవాసులలోగూడ మనదేశపువారితో తులదూగగల అందము లేదు. —— ఎంత వికారముగానున్నను సరే. కాని నీ జాతిజనుల సౌందర్యము, నీమనము స్వర్గమునకు పోయి అచ్చటి ప్రజలను చూచినపుడుగాని నిజముగా తెలియదు. అప్పుడు మన ఆనందమునకు అంతముండదు. ఇంతియేగాదు. మన వంగ దేశమునందు ఒక ప్రత్యేకమైన సౌందర్యమున్నది. అనంతమైన పచ్చికబయళ్లు, వేలకొలది నదులు, వాగులు, మెడలో వేసికొనిన పూలదండలవలె గోచరించును. మనదేశమందు ఈ రీతి సౌందర్యము కొంత మలబారునందు, కాశ్మీరమునందు కన్పించును. నీటియందు సౌందర్యములేదా? అంతట నీరే కలదు. పెద్ద వానజల్లులు ఆకులమీదనుండి కురియుచుండును. కొబ్బరిఖర్జూర వృక్షముల యాకులు ఆ జల్లులకు కొంచెము తలలు వంచుచుండును. చుట్టు మండూకములు నిరంతరము అఱచుచుండును. ఇటువంటిదృశ్యములందు సౌందర్యముండదా? మఱి మన గంగానదీతీర సౌందర్యము చూచి మెచ్చుకొనవలయుననిన విదేశములకుబోయి తిరిగివచ్చుచు గంగానదీముఖద్వారమున 'డైమండు హార్బరు' గుండా ప్రవేశింపవలయును. అప్పుడుగాని ధునీకూలసౌందర్యము తెలియదు. ఆ నీలాకాశము, దానికడుపులో నల్లనిమేఘములు, వానిక్రిందుగా బంగరుటంచులతో తెల్లని మేఘములు, వానిక్రింద వేలకొలది విసనకఱ్ఱలు విప్పినట్లున్న తలలు ఊచుచునున్న కొబ్బరి ఖర్జూర వృక్షముల తోపులు, వానికి క్రిందుగా లేత గుబురు పసుపుపచ్చ రంగులు, కొంచెము ముదురురంగుకుతిరిగిన వివిధములైన ఆకుపచ్చ వర్ణములు కలబోసినట్లున్న మామిడి, పనస మొదలైన వృక్షములు

గుబురులు గుబురులుగా పెరిగిన ఆ చెట్ల బోదెలు, కొమ్మలు, రెమ్మలు, కన్నులపండువొనరించును. వాని ప్రక్క వెదురు పొదలు గాలికి ఊగులాడుచుండును. క్రింద పచ్చికపట్టుకలదు. దాని మెత్త దనముముందు నునుపుగానుండు, పర్షియా, టర్కీస్థాను మొదలైన దేశములలో దొరకు రత్నములు దిగదుడుపు. కనుచూపున కాని నంతదూరము పచ్చని పచ్చికపట్టు ఎవరో చక్కగా తీర్చి కత్తి రించినట్లుండును. నదియొడ్డువఱకు, పెద్దకట్టలక్రిందవఱకు గంగానది తరంగములు ఎగసి కొట్టుచున్నంతవఱకు ఈ భూమియంతయు పచ్చనిగడ్డితో కప్పబడియున్నది. దీనికి కొంచెము క్రిందుగా పవిత్రమైన గంగాప్రవాహము కలదు. నీ వొకపర్యాయము నీ చూపును ఆకాశమునుండి క్రిందకు త్రిప్పితివేని, ఒకేరేఖలో వివిధములైన ఈ వర్ణనల దృశ్యమును నీవు గాంచుదువు. ఒకే వర్ణము యొక్క బహువిధఛాయలను నీవు మఱి యెక్కడను చూచియుండవు. అసలు నీ వెప్పుడైనను వర్ణములను చూచి సమ్మోహపడితివా? పురుగులు, అగ్నిలోపడిచచ్చిపోవు కొన్ని కీటకములు పూలకైదులలో పట్టువడి తిండిలేక చచ్చి పోవును. వర్ణములయొక్క ఆకర్షణ ఇట్టిది. మీ కొక సంగతి చెప్పెదను: మీరు గంగానదీ దృశ్యముల సౌందర్యము నానందింపదలచినచో ఇప్పుడే మనసారా ఆనందింపుడు. లేనిచో కొలది కాలములోనే ఈదృశ్యము లన్నియు విపరీతముగా మార్పుజెందును. ధనతృష్ణ గల్గిన వర్తకులచేతిలో నివి యన్నియు అంతర్థానము చెందును. ఈపచ్చని పచ్చికలకు బదులు ఆ ప్రదేశములలో రాతి బట్టీలు బయలుదేరును. రాయితీయుటకు మట్టిగుంటలు త్రవ్వబడును. గంగానది చిఱుతరంగములు పచ్చగడ్డిలో సయ్యాటలాడుచున్న ప్రదేశములందు జనపనారు పంటలు సరకుల పడవలు కట్టి వేయ బడును. మీకు ఇంకను ముందు బహువర్ణ సమ్మిశ్రితమైన ఆ కొబ్బరి, తాటి, మామిడి మొదలైన వృక్షములు, ఆనీలి ఆకా శము, ఆ మబ్బులయందము ఇవి ఏవియు గన్పించవు. వీనికిబదులు

చుట్టలు చుట్టలుగా వ్యాపించు బొగ్గు పొగ, ఆ పొగలో మధ్య రాక్షసులవలె నిలబడిన ఫ్యాక్టరీ పొగగొట్టములు కన్పించును.

ఇప్పటికి మా ఓడ సముద్రములోనికి ప్రవేశించినది. మీరు కాళిదాసుని రఘువంశమునందలి సముద్ర వర్ణనమును చదివియుందురు. సముద్రతీరము తాటితోపులతో నీలవర్ణసంకాశమై ఒక ఇనుపచక్రముయొక్క అంచువలె నున్నట్లు వర్ణింపబడినది. కాని అది యధార్థముగాదు. నాకు కాళిదాసనిన చాల గౌరవమున్నది. కాని ఆయన ఎప్పుడును సముద్రమునుగాని హిమాలయములనుగాని చూచియుండడని నా నమ్మకము (స్వామిజీ తరువాత తన యభిప్రాయమును మార్చుకొనినారు. కాళిదాసు హిమాలయపర్వతములను చూచియుండవచ్చునని ఆయన తరువాత పలికిరి.)

ఇచ్చట ప్రయాగలోని గంగాయమునానదుల సంగమమువలె ఈ గంగ సముద్రములో కలియుచోట తెల్లని నల్లని నీళ్లు కలిసియున్నవి. బహుప్రదేశములందు ముక్తి దొరకుట దుర్లభము. కాని హరిద్వారము, ప్రయాగ, గంగాసాగరసంగమములందు ముక్తి సులభముగా దొరకును. కాని కొంతమంది ఇది అచ్చమైన నదీముఖము కాదని చెప్పుదురు. పరమేశ్వరునకు నమస్కారము. ఆయన సహస్రాక్షుడు. సహస్రముఖుడు. సహస్రశీర్షుడు. సత్యవేది.

ఈ ప్రదేశమెంత రమణీయముగానున్నది! కంటి చూపాని నంతవఱకు నల్లని సముద్రజలము నురుగుతెట్టలతో తరంగములుగా లేచి గాలికి తాళయుక్తముగా నాట్యముచేయుచున్నది. వెనుక ప్రక్క పరమేశ్వర శరీరవిభూతివలన ధవళితమైన పవిత్ర గంగాజలము కలదు. శ్రీశంకరాచార్యులవారు పరమేశ్వరుని జటాజూటమును వర్ణించుచు, గంగయొక్క నురుగుచే నీశ్వరుని జటాజూటము ధవళితమైనట్లు వర్ణించిరి. ఇచ్చట గంగాజలము కొంత మందముగా నడచుచుండును. మాముందు గంగాసాగర సంగమమున

నల్లని తెల్లని జలముల మధ్య బద్దె గీచినట్లొక రేఖ యున్నది. ఇంతవఱకు తెల్లనిజలము. ఇచ్చటనుండి నల్లని సముద్రజలము. ముందు, వెనుక, చుట్టును అంతయు నల్లని జలమే. అంతయు నిరంతర తరంగ సంఘట్టనమే. ఈ సముద్రునికి జుట్టు నల్లనిది. శరీరము నల్లనిది. దుస్తులుకూడ నల్లనివే. పురాణములందు దేవతల భయమువలన బహు రాక్షసులు ఈ సముద్రజలములందు దాగుకొనినట్లు వర్ణింపబడినది. ఈ నాడు ఆ రాక్షసులవంతు వచ్చినట్లున్నది. ఈ నాడు వరుణుడు వారిస్నేహితుడు. గ్రీకు వాయు దేవత ఈవోల్యాస్ వారి వెనుకనున్నాడు. భయంకరమైన అఱపులతో, గర్జనలతో సముద్రోపరిభాగమున ఆ రాక్షసులు నేడు భీకరమైన యుద్ధనృత్యము చేయుచున్నట్లున్నది. ఈ నురుగులు కట్టుచున్న తరంగములు వారి అట్టహాసములు. ఈ గందరగోళము మధ్య మా ఓడ పయనించుచున్నది. ఓడ పైభాగమున ప్రభువులవలె నడచుచున్న తెల్లజాతి పురుషులు, స్త్రీలు సాగర పరివృత భూ మండలమున కదినాథులు. వీరందఱు సొగసైన దుస్తులు వేసికొనినారు. చంద్రికాసందీపిత దేహావర్ణముతో వెలయుచు, ఆత్మవిశ్వాసము మూర్తిగొనినట్లున్నారు. నల్లజాతుల వారికి గర్వాహంకారములు రూపుగొనినట్లు కన్పించుచున్నవారు. పైన వర్షసంభరితజలధరముల అఱపులతో నిండిన యాకాశము!—అన్నిదిక్కుల నురువులు గ్రక్కుచున్న తరంగముల గర్జనలు, నృత్యములు! సముద్రుని బలమును లెక్కసేయని మా యోడ యంత్రముల పెను మ్రోత! ఇవి యన్నియు కలియగా విచిత్రమైన ధ్వని సమ్మేళనము! దీనిని వినుచు సగము నిద్ర, సగము మెలకువగా నున్నట్లు ఆశ్చర్యమున నిమగ్నుడనైతిని. హఠాత్తుగా ఈ సర్వధ్వనులను కప్పివైచి సంగీతనాదము తాళధ్వనిలో నా చెవులలో గింగురుమనినది.. స్త్రీ పురుషుల కంఠధ్వనుల కలయిక వినిపించుచున్నది. వారు జాతీయగీతమును పాడుచుండిరి. "ఓ! ఆంగ్లదేశమా! "ఈ సముద్రమును పాలిం

పుము. ఆంగ్ల దేశము ఈ తరంగములను పాలించుచున్న''దను మకుటము అందు కలదు. నేను చుట్టు చూచితిని. ఓడ భారముగా ముందుకు సాగుచున్నది. సోదరుడు తురీయానందుడు తలను రెండు చేతులతోను పట్టుకొని బాధపడుచున్నాడు. అతనికి సముద్రప్రయాణమువల్ల పులకరము దాపురించినది. త్రిప్పుడు వచ్చినది.

రెండవ తరగతిలో ఇద్దఱు బెంగాలీ యువకులుండిరి. వారు పై చదువులకొఱకు పాశ్చాత్య దేశములకు బోవుచుండిరి. వారి స్థితి మఱియు నధ్వాన్నముగా నున్నది. అందులో ఒకడు మిగుల భయపడినట్లు కన్పించుచున్నాడు. ఓడ ఒడ్డుకు పట్టించినట్లయిన ఇంటికి పరువెత్తుకొని పోవునట్లున్నాడు. ఈ కుఱ్ఱవాళ్లిద్దఱును, మే మిద్దఱమును ఓడలోనున్న భారతీయులము. అధునాతన భారత దేశమునకు ప్రతినిధులము. ఓడ గంగలోనున్న రెండు రోజులు సోదరుడు తురీయానందుడు ''అధునాతన భారత దేశము''ను గుఱించిన నా వ్యాసమును పూర్తి చేయుమని తొందర పెట్టుచునే యున్నాడు. ''ఉద్బోధనపత్రి''కా సంపాదకుడు రహస్యముగా నన్ను తొందరపెట్టవలసినదని అతనితో చెప్పినట్లున్నది. ఈ రోజున నాకు కొంచము అవకాశము చిక్కినది. నేను తురీయానందుని ఇట్లడిగితిని: ''సోదరా! అధునాతన భారత దేశముయొక్క పరిస్థితి గుఱించి నీ యభిప్రాయ మేమి?'' అతడు రెండవతరగతివంక ఒకపరి చూచి తనవంక చూచుకొని ఒకనిట్టూర్పు విడిచి, ''చాల విచారకరము. మఱి గందరగోళముగా తయారగుచున్నది'' అని యనినాడు.

గంగానదికి పద్మ, హుగ్లీ అను రెండుశాఖలుకలవు. పద్మ పెద్దపాయ. అయినను హుగ్లీ కే ఇంత ప్రాముఖ్య మెందుకు కలదు? చాలమందిదృష్టిలో హుగ్లీ ముఖ్యమైనపాయ. కాలాంతరమున మఱియొక పాయ ఏర్పడినది. అదియే పద్మ. అట్లే తొలినుల్ల గంగా

నదియొక్క ప్రాచీనవాహిని. దానికి ఆది గంగయని ప్రసిద్ధి. కవి కంకణుని గ్రంథమునందలి నాయకుడు సముద్రవర్తకుడు. అతడు లంకకు ఈపాయగుండనే ప్రయాణించెను. పూర్వకాలమున గంగానదిలో త్రివేణివఱకు పెద్ద ఓడలే పోవుచుండెడివి. సప్తగ్రామమను నౌక ఓడరేవు త్రివేణీ ఘట్టమునకు కొంచముదూరమున సరస్వతీనది యొద్దునుండెను. చాల పురాతనకాలమునుండి వంగదేశముయొక్క విదేశవాణిజ్యమునకు సప్తగ్రామము ప్రధానమైన రేవుగా నుండెడిది. క్రమముగా సరస్వతీముఖద్వారము వండుమట్టిపట్టి పూడిపోయినది. 1539 వ సంవత్సరమున ఈ ముఖద్వారము బాగుగా పూడిపోవుటచేత పోర్చుగీసు వర్తకులు తమ ఓడలను నడపుకొనుటకు గంగానదిలో కొంతదూరము దిగువకు పోవలసివచ్చినది. ఆప్రదేశమే ఇప్పుడు ప్రసిద్ధమైన హుగ్లీపట్టణముగా రూపొందినది. 16-వ శతాబ్దమునుండి గంగానదీముఖద్వారము పూడిపోవుటచే చాలమంది దేశీయ, విదేశీయ వర్తకులు అందోళనము చెందిరి. కాని దానికేమి? ఈ గంగానదీజలమార్గము క్రమముగా అప్పటినుండి ఇప్పటివఱకు పూడిపోవుచునేయున్నది. యంత్రశిల్పుల విజ్ఞానప్రతిభ ఇచ్చట ఏమియు పనిచేయలేకపోయినది. 1666 వ సంవత్సరములో గంగానదిలో సూతివద్ద సంపూర్ణముగా పూడిపోయినదని ఒకఫ్రెంచిమతప్రచారకుడు వ్రాసెను. హాల్వెల్ (బ్లాక్ హోల్ కథకుడు) ముర్షీదాబాదు శాంతిపురములవద్ద గంగానదిలోతు తక్కువగుటవలన నాటుపడవలపై పోవలసినవాడయ్యెను. 1797 వ సంవత్సరములో కెప్టెను కోల్‌బ్రూక్ హుగ్లీలోను జలంగిలోనూ వేసవిలో నాటుపడవలుగూడ నడపుటకు వీలుకాదని వ్రాసెను. 1822 నుండి 1854 వఱకు ఏవిధమైన పడవల రాకపోకలు హుగ్లీలో వీలుకాకపోయినది. 24 సంవత్సరములకాలము హుగ్లీలో నీరు రెండు మూడు అడుగుల లోతు మాత్రముండెను. 17 వ శతాబ్దములో హుగ్లీకి ఒకమైలుదిగువ చించురాలో డచ్చివారు ఒకవర్తకకేంద్రమును కట్టుకొనిరి.

తరువాత వచ్చిన ఫ్రెంచివారు నదికి మఱింత దిగువ చంద్రనగర స్థావరమును నెలకొల్పిరి. 1723 వ సంవత్సరములో జర్మనీ దేశపు ఓస్టెండుకంపెనీవారు బంకిపూరులో చంద్రనగరుకు ఐదుమైళ్లు దిగువ నది కావలిప్రక్క ఒకఫ్యాక్టరీ నిర్మించిరి. 1616 వ సంవత్సరములో డెన్మార్కుదేశీయులు చంద్రనగరుకు ఎనిమిదిమైళ్లు దిగువ సేరంపూరులో ఒకఫ్యాక్టరీని నెలకొల్పిరి. తరువాత ఇంకను దిగువ ఆంగ్లేయులు కలకత్తానగరమును కట్టిరి. ఈ పై చెప్పిన ప్రదేశములో కలకత్తాను విడచి ఏ యొక్క ప్రదేశమునకును ఇప్పుడు ఓడలు పోవు. కలకత్తా విషయములో భవిష్యత్తును గుఱించి సందేహమే.

శాంతిపురమువఱకు వేసవిలోకూడ గంగానదిలో ఇంత జలముండుటకు కారణము చాల చిత్రమైనది. పైన ప్రవహించు ప్రవాహము కట్టుపడిన తర్వాత తత్పూర్వము భూమిలోనికి పీల్చుకొనిన నీరు ఊరి వచ్చి నదిలోనికి చేరును. నదీతలము ఇప్పుడు గూడ రెండుప్రక్కలనున్న భూతలముకంటె చాల లోతు. ఈ నదీతలము క్రొత్తమన్ను చేరుటవలన క్రమముగా పెరిగినపుడు ఇబ్బంది మొదలగును. మఱి ఇంకొక ప్రమాదముకూడ కలుగవచ్చునను ప్రవాదమున్నది. కలకత్తాకు సమీపమునగూడ భూకంపములవలననో ఇతరకారణములవలననో నది ఇవతలనుండి అవతలకు నడచిపోవునట్లుగా అప్పుడప్పు డండిపోవుచుండెడిది. 1770 వ సంవత్సరములో ఇట్లే జరిగెను. 1734 వ సంవత్సరము అక్టోబరు 9 గురువారమునాడు మధ్యాహ్నసమయములో సముద్రపు ఆటుకాలములో నది సంపూర్ణముగా ఎండిపోయినదట. అది కొంచము తరువాత సాయంకాలమునందు మిక్కిలి అమంగళకరమైన సమయములో జరిగినట్లైన దాని ఫలితము ఎట్లుండెడిదో మీ యూహకు వదలిపెట్టుదును. బహుశః మరల అచట నది ప్రవహించుటకు వీలుండెడిది కాదు.

పూర్వము హుగ్లీ పైభాగములకు పట్టిన గతియే ఇప్పుడు కలకత్తా దిగువభాగమునకు పట్టినది. ఇచ్చట మనము రెండు అపాయముల నెదుర్కొనవలసియున్నది. అవి జేమ్సు దిబ్బలు, మేరీ దిబ్బలు. పూర్వము కలకత్తాకు 30 మైళ్ళ ఎగువ దామోదర నది వచ్చి గంగలో కలిసెడిది. ఇప్పుడు కాలమహిమవలన దానికి 31 మైళ్ళు దక్షిణముగా ఈ నదివచ్చి పడుచున్నది. ఈ ప్రదేశ మునకు 6 మైళ్ల దిగువ రూపనారాయణనది గంగలో కలియును. ఈ రెండు నదులు గంగలోనికి చాల నీరు తెచ్చుచుచున్నవి. కాని అవి తీసికొనివచ్చు, ఒండు నంతయు తొలగించు టెట్లు? ఫలితముగా నదీతలమునందు పెద్దలంకలు తలసూపినవి. ఈలంకలు నిరంతరము వేర్వేఱుతావులందు మార్పు చెందుచుండును. ఒక్కొక్కప్పుడు ఇవి దిబ్బవేసికొనిపోవును. బోలుగానుండును. ఒక్కొక్కప్పుడు బిగిసి దిబ్బకట్టును. ఈలంకలే మిక్కిలి భయకారణములు. రాత్రింబవళ్ళు నదియొక్క లోతును కొలిచి చూచుకొనవలసినదే. అజాగ్రత్త వల్ల కొన్నిరోజులు ఈ కొలత తీసికొనకున్నచో, ఓడలకు చాల నష్టము సంభవించును. ఓడవెళ్ళి ఈ లంకలకు తగులు కొనగనే ఇంకనది కదలకుండ నుండి పోవుటయో, కూరుకొనిపోవు టయో జరుగును. మూడు తెరచాపలున్న ఓడకూడ ఈ దిబ్బ లకు తగిలిన అరగంటలో లోపలకు కూరుకొని పోగా తెరచాప కొయ్యలచివళ్ళుమాత్రమే కన్పించుచున్న సందర్భములనేకములు గ్రంథస్థములు చేయబడియున్నవి. ఈ ఇసుకదిబ్బలు దామోదర, రూపనారాయణ* నదుల ముఖములని మనము తలపవచ్చును. దామోదరనది ఇప్పుడు సంతాలు గ్రామములను మ్రింగుటతో తృప్తిపడుట లేదు. ఇప్పుడు ఓడలను, స్టీమర్లనుగూడ రుచిపై

* దామోదర రూపనారాయణ శబ్దములందు శ్లేషకలదు. ఇవి నదుల పేళ్లు:—ఇదియొక యర్థము. దామోదరుడైన నారాయణుడు సమస్తము దిగ మ్రింగునని రెండవ యర్థము.

తరువాత వచ్చిన ఫ్రెంచివారు నదికి మఱింత దిగువ చంద్రనగర స్థావరమును నెలకొల్పిరి. 1723 వ సంవత్సరములో జర్మనీదేశపు ఓస్టెండుకంపెనీవారు బంకిపూరులో చంద్రనగరుకు ఐదుమైళ్లు దిగువ నది కావలిప్రక్క ఒకఫ్యాక్టరీ నిర్మించిరి. 1616 వ సంవత్స రములో డెన్మార్కుదేశీయులు చంద్రనగరుకు ఎనిమిదిమైళ్లు దిగువ సేరంపూరులో ఒకఫ్యాక్టరీని నెలకొల్పిరి. తరువాత ఇంకను దిగువ ఆంగ్లేయులు కలకత్తానగరమును కట్టిరి. ఈ పై చెప్పిన ప్రదేశములో కలకత్తాను విడచి ఏ యొక్క ప్రదేశమునకును ఇప్పుడు ఓడలు పోవు. కలకత్తా విషయములో భవిష్యత్తును గుఱించి సందేహామే.

శాంతిపురమువఱకు వేసవిలోకూడ గంగానదిలో ఇంత జలముండుటకు కారణము చాల చిత్రమైనది. పైన ప్రవహించు ప్రవాహము కట్టుపడిన తర్వాత తత్పూర్వము భూమిలోనికి పీల్చు కొనిన నీరు ఊరి వచ్చి నదిలోనికి చేరును. నదీతలము ఇప్పుడు గూడ రెండుప్రక్కలనున్న భూతలముకంటె చాల లోతు. ఈ నదీతలము క్రొత్తమన్ను చేరుటవలన క్రమముగా పెరిగినపుడు ఇబ్బంది మొదలగును. మఱి ఇంకొక ప్రమాదముకూడ కలుగ వచ్చునను ప్రవాదమున్నది. కలకత్తాకు సమీపమునగూడ భూకంపములవలననో ఇతరకారణములవలననో నది ఇవతలనుండి అవతలకు నడచిపోవునట్లుగా అప్పుడప్పు డండిపోవుచుండెడిది. 1770 వ సంవత్సరములో ఇట్లే జరిగెను. 1734 వ సంవత్సరము అక్టోబరు 9 గురువారమునాడు మధ్యాహ్నసమయములో సము ద్రపు ఆటుకాలములో నది సంపూర్ణముగా ఎండిపోయినదట. అది కొంచము తరువాత సాయంకాలమునందు మిక్కిలి అమంగళ కరమైన సమయములో జరిగినట్లైన దాని ఫలితము ఎట్లుండెడిదో మీ యూహాకు వదలిపెట్టుదును. బహుశః మరల అచట నది ప్రవహించుటకు వీలుండెడిది కాదు.

పూర్వము హుగ్లీ పైభాగములకు పట్టిన గతియే ఇప్పుడు కలకత్తా దిగువభాగమునకు పట్టినది. ఇచ్చట మనము రెండు అపాయముల నెదుర్కొనవలసియున్నది. అవి జేమ్సు దిబ్బలు, మేరీ దిబ్బలు. పూర్వము కలకత్తాకు 30 మైళ్ళ ఎగువ దామోదర నది వచ్చి గంగలో కలిసెడిది. ఇప్పుడు కాలమహిమవలన దానికి 31 మైళ్ళు దక్షిణముగా ఈ నదివచ్చి పడుచున్నది. ఈ ప్రదేశమునకు 6 మైళ్ల దిగువ రూపనారాయణనది గంగలో కలియును. ఈ రెండు నదులు గంగలోనికి చాల నీరు తెచ్చుచున్నవి. కాని అవి తీసికొనివచ్చు, ఒండు నంతయు తొలగించు టెట్లు? ఫలితముగా నదీతలమునందు పెద్దలంకలు తలసూపినవి. ఈలంకలు నిరంతరము వేర్వేఱుతావులందు మార్పుచెందుచుండును. ఒక్కొక్కప్పుడు ఇవి దిబ్బవేసికొనిపోవును. బోలుగానుండును. ఒక్కొక్కప్పుడు బిగిసి దిబ్బకట్టును. ఈలంకలే మిక్కిలి భయకారణములు. రాత్రింబవళ్ళు నదియొక్క లోతును కొలిచి చూచుకొనవలసినదే. అజాగ్రత్త వల్ల కొన్నిరోజులు ఈ కొలత తీసికొనకున్నచో, ఓడలకు చాల నష్టము సంభవించును. ఓడవెళ్ళి ఈ లంకలకు తగులు కొనగనే ఇంకనది కదలకుండ నుండి పోవుటయో, కూరుకొనిపోవుటయో జరుగును. మూడు తెరచాపలున్న ఓడకూడ ఈ దిబ్బలకు తగిలిన అరగంటలో లోపలకు కూరుకొని పోగా తెరచాప కొయ్యలచివళ్ళుమాత్రమే కన్పించుచున్న సందర్భముల నేకములు గ్రంథస్థములు చేయబడియున్నవి. ఈ ఇసుకదిబ్బలు దామోదర, రూపనారాయణ* నదుల ముఖములని మనము తలపవచ్చును. దామోదరనది ఇప్పుడు సంతాలు గ్రామములను మ్రింగుటతో తృప్తిపడుట లేదు. ఇప్పుడు ఓడలను, స్టీమర్లనుగూడ రుచివై

* దామోదర రూపనారాయణ శబ్దములందు శ్లేషకలదు. ఇవి నదుల పేర్లు: ఇదియొక యర్థము. దామోదరుడైన నారాయణుడు సమస్తము దిగ మ్రింగునని రెండవ యర్థము.

విధ్యముకొఱకు మ్రింగుచున్నది. 1877 వ సంవత్సరములో "కౌంటి ఆఫ్ స్టెర్లింగు" అను ఓడ 1444 టన్నుల గోధుమను నింపుకొని కలకత్తానుండి వచ్చుచు ఈ ఇసుకదిబ్బల ఊబిలో చిక్కుకొని ఎనిమిది నిమిషములకాలములో చిక్కుకొనిన గుర్తుకూడ లేకుండ కూరుకుపోయినది. 1874 వ సంవత్సరమున 2400 టన్నుల బరువుతో ఒక ఓడ రెండే నిమిషములలో ఈ ఊబిలో దిగబడి అదృశ్యమైనది. ఓ గంగామాతా! నీ ముఖము చిరకాలము వర్ధిల్లుగాక! మమ్ము నష్టములేకుండ నీ ముఖమునుండి బయట బడనిచ్చినందులకు నీకు ధన్యవాదములను సమర్పించుచున్నాను. సోదరుడు తురీయానందుడు "అయ్యా! గంగామాత ఔదార్యమునకు ఒక మేకను బలి ఈయవలె" ననినాడు. "నేనుతప్పకుండ ఈయవలెను. కాని సోదరా! ఒక దినమందే ఇచ్చిన నేమి? ప్రతి దినమును ఈయవలె"నంటిని. మఱుసటి దినమున సోదరుడు తురీయానందుడు మరల నా ప్రసక్తి తెచ్చెను. కాని నేను మౌనము వహించితిని. ఆ మఱునాడు భోజనవేళ మేకల బలి ఎంతవఱకు వచ్చినదని నేనడిగితిని. సోదరుడు కొంచము కళవళపడి ఇట్లనినాడు: "ఏమి నీ యభిప్రాయము? నీ వొక్కడవే ఏమోతినుచున్నావు" అనినాడు. అప్పుడు నే నతనికొక కథ చెప్పవలసివచ్చెను. కలకత్తాలో ఒక యువకుడున్నాడు. గంగానదికి బహుదూరముగా అతని యత్తవారి యూరున్నది. అతడచ్చటికి వెళ్ళినాడు. భోజనసమయమున కొంత మంది తప్పెటలు పుచ్చుగొని యచ్చటకు వచ్చిరి. అతని అత్తగారు భోజనమునకు ముందు అతనితో కొంచెము పాలు తీసికొనమని పలికినది. "బహుశః ఇచ్చట ప్రజల ఆచారమేమో! ఒప్పుకొనినచో సరిపోవును" అని అల్లుడు అనుకొనినాడు. ఒక గ్రుక్కెడు పాలు అతడు త్రాగినాడు. వెంటనే చుట్టుపట్ల తప్పెట్లుమ్రోగుట కారంభించినవి. అతని అత్తగారు అతని తలపై చేయియుంచి ఆనందాశ్రువులతో ఇట్లనెను: "నాయనా! నీవు నిజముగా పుత్రధర్మమును ఈ నాడు నిర్వర్తించితివి. ఇటు చూడుము. నీ

కడుపులో గంగాసలిలమున్నది. నీవు అచ్చటివాడవే గదా. మఱి ఈ పాలలో నీ చనిపోయిన మామగారి బొమికలపొడి కలిపితిమి. ఇవి నీవు త్రాగుటవల్ల ఆ బొమికలు గంగలో కలిపినట్లయినది. అందువల్ల వచ్చు పుణ్యము నీ మామగారి జీవునకు లభించినది.'' అని అతని నాశీర్వదించినది. ఈ కథ నేను తురీయానందునకుచెప్పి ప్రకృతమున కన్వయించితిని. కలకత్తానుండి ఒక మనుష్యుడు ఈ ఓడపైన ప్రయాణించుచున్నాడు. ఇక్కడ మాంసముతో అనేక వంటకములు తయారుచేయుచున్నారు. ఆ కలకత్తా వ్యక్తి ఆ వంటకములు తిన్నప్పుడెల్ల గంగామాతకు మాంసము పెట్టినట్లే. కాబట్టి సోదరుడు దానినిగుఱించి చింతపడనక్కఱలేదు. సోదరుడు తురీయానందుడు పెద్ద అవస్థలో పడినాడు. నా ఉపన్యాసప్రభావము అతనిపై నెట్లు ప్రసరించినదో తెలిసికొనుటకు నాకు కష్టమాయెను.

ఓడ ఎంత ఆశ్చర్యకరమైన వస్తువు! ఒడ్డునుంచి చూచిన, సముద్రము చాల భయంకరముగానుండును. దాని గర్భములో ఆకసము వంగి కలిసికొన్నట్లుండును. దాని లో నుండి సూర్యుడుదయించునట్లు, దానియందే యస్తమించునట్లుండును. ఆసముద్రునికి కొంచెము కోపరేఖ తోచిన, మనహృదయములు తల్లడిల్లును. అట్టి సముద్రము ఈ ఓడలవల్ల ఒక రాచబాటగా మిక్కిలి తేలికమైన మార్గముక్రింద మార్చివేయబడినది. ఈ ఓడ నెవడు కనిపెట్టెనో ప్రత్యేకముగా ఒకడే కనిపెట్టియుండడు. మనుష్యునకు మిక్కిలి యవసరమైన యంత్ర పరికరములన్ని కనుగొనినట్లే క్రమక్రమముగా హెచ్చుతగ్గులు సరిచూసి బహుజనులు సమష్టిగాశ్రమించి దీనిని కనిపెట్టియుందురు. చక్రములు తీసికొనుడు. అవి లేకుండ మనజీవితము గడవనే గడవదు. కిరకిరలాడు ఎద్దులబండి నుండి జగన్నాథస్వామి రథము వఱకు, రాట్నము నుండి ఫ్యాక్టరీల లోని బృహద్యంత్రములవఱకు ఈ చక్రముయొక్క యుపయోగమున్నది. ఈ చక్రము నెవరు కనిపెట్టినారు? ఫలానావాడని చెప్ప

టకు వీలు లేదు. అందుచేత ఇది సమష్టి ప్రయత్నఫలితము అని చెప్పనగును. ప్రాచీనమానవుడు గొడ్డలితో చెట్లను కొట్టెడివాడు. ఏటవాలు ప్రాంతములయందు పెద్ద చెట్ల బోదెలను దొర్లించెడివాడు. క్రమక్రమముగా గుండ్రని చక్రాకృతులక్రింద ఈ చెట్ల బోదెలు కోయబడినవి. కాలక్రమమున ఆకులు, కనిపెట్టబడినవి. ఈ ఒక్క చక్రము ఇప్పుడున్న ఆకృతి వహించుటకు ఎన్ని వేలసంవత్సరములు పట్టినదో ఎవరు చెప్పగలరు? కాని హిందూదేశములో ఈ యభివృద్ధి చెందుటలోని దశాక్రమమంతయు జాగ్రత్తగా కాపాడబడినది. అది ఎంత అభివృద్ధి చెందినను, మార్పుచెందినను ఈ పరిణామములోని దశాభేదములను అన్నింటిని ఆశ్రయించిన జనమున్నారు. అందుచేత ఈ క్రమమంతయు నిలచినది. మొదట ఒక వెదురుముక్కకు దారముకట్టి శ్రుతిపోసికొనుటకు ఒక జంత్రము నిర్మించుకొనిరి. తరువాత తరువాత ఒక వంపుకఱ్ఱకు గుఱ్ఱపు వెంట్రుకలు కట్టి మొదటి వాయులీన యంత్రమును నిర్మాణముచేసిరి. అది చాల మార్పులుపొంది, వివిధములైన దారములు, నరములు, కూర్చబడి అనేక నామరూపములు వహించి ఇప్పుడు చక్కగా పరిపూర్ణమైన సారంగి రూపొందినది. కాని ఇప్పటికికూడ బండితోలుకొను తురకవాడు ఆ గుఱ్ఱపు వెంట్రుక కట్టిన వంపుకఱ్ఱతో కుండకు కలిపికట్టిన వెదురుగొట్టము మీద వాయించుచు చేపల వల అల్లుచు మజ్నూర్ కహార్ కథను గానముచేయుట లేదా? ఇప్పుడును మధ్యపరగణాలకు పోయి చూడుడు. అక్కడ ఈ రబ్బరుటైరుల రోజులలోగూడ బాటల మీద కొయ్యచక్రములుగల బండ్లు మనకు కన్పించును. ఇవి ఆప్రజల తెలివిని చాటినచో చాటును గాక.

చాల పురాతనకాలములో అనగా స్వర్ణయుగములో ప్రజలు నిష్కపటచిత్తులుగా నున్నప్పుడు, అనగా మోసగాండ్ర మగుదమేమో యను భయముచేత శరీరాచ్ఛాదనము చేసికొనని దినములలో, స్వార్థపరత్వమగునేమో యని పెండ్లికూడ చేసికొనని

దినములలో, స్వపరభేదములేని దినములలో, ఇతరుల సొమ్మును, మట్టితో సమానముగా చూచు దినములలో, కట్టలు, రాళ్లు, ఆయుధములుగా నుపయోగించు దినములలో, అట్టి మంచిదినములలో నీటిమీద ప్రయాణముచేయుటకు వారు తెప్పలను సంగడులను కట్టెడివారు. దీనికొఱకు ఒకచెట్టు లోపలిభాగమునుకాల్చి కొన్ని కొయ్యలతో నిర్మింపబడిన నాటు పడవలు ఒరిస్సానుండి కొలంబోవఱకు పోవుట చూచియుందురుగదా! అవి సముద్రములో నెంతదూరముపోవునోకూడ మీరు గమనించియుందురు. ఓడయొక్క నిర్మాణమునకు బీజము లీనాటుపడవలలో మనకు కన్పించును.

మఱి తూర్పువంగదేశపు పల్లెవాండ్ర పడవలను మీరెక్కినట్లయిన మీరు మీ భద్రతకొఱకు అభిమానఋషుల నైదుగురను ప్రార్థించి మఱియు నెక్కవలెను. చిటగాంగు పల్లెవాండ్రు నడపు పడవ ఒకమాదిరిగృహమువలె నుండును. ఎంతచిన్నగాలి వచ్చినను అందలిచుక్కాని పట్టు తప్పిపోవును. ప్రయాణీకులందఱు ఇష్టదైవమును తలచుకొనవలసినదే గాని వేఱుగతిలేదు. మఱి పెద్ద నాటుపడవలున్నవి. ముఖభాగము రెండు పెద్ద ఇత్తడికండ్లతో నుండును. తెడ్లవాండ్లు నిలుచుండి తెడ్లు వేయుదురు. కవికంకణుడు శ్రీమంతుని ఓడప్రయాణమునకు ఉపయోగించిన పడవ ఇదియే. కవికంకణు డిట్లు చెప్పినాడు: "శ్రీమంతుడు తెడ్డువేసికొనుచు బంగాళాఖాతమును దాటినాడు. ఆ సందర్భములో కొన్ని సొరచేపల గుంపులో అతని పడవ చిక్కుకొని మునిగినంతపని జరిగినది. అతడొక నీటిజంతువును చిన్నచేపయనికూడ పొరపడెను." మన గంగాసాగరపు పడవ యున్నది. దాని పైకప్పు సొగసుగా నుండును. లోపలిభాగము వెదురుబద్దలతో నిర్మింపబడినది. దానిలో గంగాజలముతో నింపిన బిందెలు వరుసలు వరుసలుగా నుంచబడినవి. ఆ గంగాజలము స్వాదువుగా చల్లగా నుండును. మీరు బాగా చలికాలములో గంగాసాగరమువెళ్లి చూడుడు. ఆ

ఉత్తరపుచలిగాలి మీకసలు చల్లని నీటిని త్రాగవలయునను కోరికను సమూలముగా తీసివేయును. ఈ గంగాసాగరపు చిన్న పడవ ప్రతిదినము ఈ బెంగాలీ బాబులను ఇంటివద్దనుండి ఆఫీసులకు, మరల ఇంటికి చేరవేయుచుండును. 'బల్లి' యనువాడు ఈ నావపైన అజమాయిషీ చేయుచుండును. అతడు చాల నేర్పరి. తెలివిగలవాడు. చాలాదూరమున ఒకమబ్బుముక్కను చూచినాడనుకొనుడు. అతడు వెంటనే జాగ్రత్తపడును. ఇప్పుడే పడవలు మిక్కిలి బలిసిన దేహములుకల జాన్సూరు మనుష్యుల చేతుల లోనికి పోయినవి. వీరొకతరహాభాష మాట్లాడుదురు. వీరిని మీ మహంత్ మహారాజు పరిహాసమునకు ఆ సముద్రపుకొంగలను పట్టుకొనుడని ఆజ్ఞాపించినాడు. ఆ సముద్రపుకొంగలను బకాసురులని ఆయన పేర్కొనెను. ఇది వారి కర్థము కాలేదు. ''అయ్యా! ఆ రాక్షసుడెక్కడ దొరకును? మాకు తెలియుటలేదు'' అని గొణిగికొనినారు. మఱి ''గాడిద'' యని వెక్కిరింతపేరుగల పడవ కలదు. అది నెమ్మదిగా బోవును. ఎప్పుడు సూటిగా బోదు. పక్కలకే నడచును. మఱి ఆ పెద్దతరహా పడవలు ఓడలకు ప్రక్క కట్టు పడవలవంటివి. వీనికి ఒకటియో, రెండో, మూడో తెరచాపలుండును. ఇవి లంక, మాల్దీవులు, అరేబియాదేశములనుండి కొబ్బరికాయలు, ఖర్జూరపుకాయలు, ఎండుచేపలు మున్నగువానిని మనకు దిగుమతి చేయును. ఈ పడవలన్నియు నౌకానిర్మాణ పరిణామమునందు దశాభేదములను ప్రదర్శించును.

తెరచాపలతో పడవలను నడపుట కనిపెట్టుట విచిత్రమైన విషయము. ఏ ప్రక్కకు గాలి వీచుచున్నను ఆ తెరచాపలను నేర్పుగా సడలించినచో మన మనుకొన్న ప్రదేశమునకే ఓడ చేరగలదు. గాలి వ్యతిరేకముగా నున్నపుడు ప్రయాణమునకు కాలము కొంచెె మెక్కువ పట్టును. ప్రయాణించుచున్న పడవ చూచుటకు చాల అందముగా నుండును. దూరమునుండి చూచినచో చాలరెక్కలుగల పెద్దపక్షి ఆకాశమునుండి దిగుచున్న

ట్లుండును. తెరచాపలు ఓడను సూటిగా పోనీయవు. కొంచెము గాలి వ్యతిరేకముగా నున్నచో కొంచె మడ్డదిడ్డముగా పోవలసి యుండును. మఱి గాలి ఏమియు లేకుండ నిశ్చలముగా నున్నచో అప్పుడు ఓడ నిస్సహాయస్థితిలో పడిపోవును. తెరచాపలు దింపుకొని కదలకుండ నుండిపోవలసినదే. భూమధ్యరేఖకు సమీప ప్రదేశములందు సాధారణముగా ఇప్పుడుకూడ నట్టి స్థితి కలదు. ఈ దినములలో తెరచాపలుగల పడవలు చాలాభాగము ఇనుముతో కట్టబడినవి. ఏ కొంచమో కొయ్య యుండవచ్చును. ఈ తెరచాప పడవలలో సరంగుగా నుండుట స్టీమరులోకంటె చాల కష్టమైన పని. ఎంతో అనుభవశాలిగాని వీనితో సమర్థించుకొనలేడు. ముఖ్యముగా ఈ తెరచాప పడవలలో సరంగునకు రెండు విషయములు బాగుగా తెలియవలెను. ఒకటి అడుగడుగునకు గాలిస్వభావ మెట్లుండును అనునది. రెండవది మార్గమందంతట ఎచ్చటెచ్చట అపాయప్రదేశములున్నవో తెలిసికొని జాగ్రత్తపడుట. ఈ రెండు గుణములు స్టీమరులో సరంగుకంటె తెరచాపల ఓడలో సరంగునకు అవసరమైనవి. స్టీమరు చాల భాగము మనుష్యుని అదపులో నుండును. వలసినపుడు క్షణములో యంత్రములను ఆపవచ్చును. ముందుకు, వెనుకకు, ప్రక్కలకు, వలసినదిక్కునకు, కొంచెము కాలములోనే స్టీమరును త్రిప్పవచ్చును. తెరచాప ఓడలు గాలియొక్క అధీనములో నుండును. చాపలు దించులోపల, చుక్కాని త్రిప్పులోపల ఓడ వెళ్లి ఏ దిబ్బకో, ఏ నీటిలోనున్నకొండకో గ్రుద్దుకొనవచ్చును. లేక మఱియొక ఓడతో ఢీకొనవచ్చును. ఈ రోజులలో తెరచాప పడవలు కూలీలనుతప్ప ప్రయాణీకుల నరుదుగా ఎక్కించుకొనును. సాధారణముగా నివి సరకును చేరవేయును. అదియైన ఉప్పు వగైరావంటి తక్కువరకపు సరకును మాత్రమే. కొన్ని చిన్న తెరచాప పడవలు తీరవ్యాపారమున కుపయోగించును. ఈ తెరచాప పడవలు సూయజు కాలువగుండా ప్రయాణముచేయవు. కారణములు

రెండు. ఒకటి, సూయజుగుండా వానిని చేరవేయుటకు స్టీమర్లకు డబ్బు చెల్లించలేవు. రెండు, కాలువ అధికారులకు వేలకొలది రూకల్యములు పన్ను చెల్లించలేవు. అందుచేత నివి ఆఫ్రికా నంతయుచుట్టి ఆఱునెలలు ప్రయాణముచేసి ఆంగ్లదేశమునకు బోవలయును.

తెరచాప పడవలలోనున్న ఈ ఇబ్బందులవల్ల పూర్వకాలములో నౌకాయుద్ధము చాల ప్రమాదభరితముగా నుండెడిది. గాలిలో ఏకొంచెము మార్పువచ్చినను, సముద్రపుప్రవాహములో ఏకొంచెము మార్పువచ్చినను యుద్ధఫలితము నిర్ణయించుట కది చాలును. మఱి ఆ ఓడలు కొయ్యతో కట్టినవి కాబట్టి తేలికగా వానిలో నిప్పు అంటుకొనెడిది. అంటుకొన్నచో ఆర్పుట కష్టముగా నుండెడిది. వానినిర్మాణము చాల భిన్నమైనది. ఒకప్రక్క చదునుగా, బాగుగా నెత్తుగా నుండెడిది. అయిదాఱు అంతస్థులుండెడివి. ఆ పై అంతస్థులో ఒకప్రక్క ఒక కొయ్యవరండా, దానిముందు నౌకానాయకునిగది, కార్యాలయము, రెండుప్రక్కల తక్కిన యుద్యోగుల గదులు, తరువాత పెద్ద ఖాళీప్రదేశము ఏర్పడియుండెను. రెండవప్రక్క కొన్నిగదులు కలవు. క్రింది అంతస్థులలోగూడ అటువంటివే యుండెడివి. పైకప్పు కలిగిన చావడులు ఒకదానిక్రింద నొకటిగా నుండును. మొదటియంతస్థులో నావికుల భోజనశాలలు, పడకగదులు కలవు. ప్రతిఅంతస్థులో ఇరుప్రక్కల వరుసగా బెట్టిన ఫిరంగులు, వానిగొట్టములు, ఓడగోడలలోని వరుసక్రంతలనుండి ముందుకు పొడుచుకొనియుండును. ఆ ఫిరంగుల కిరుప్రక్కల ఫిరంగిగుండ్లు పోగులుపోసియుండును. తుపాకిమందు సంచులలో పెట్టియుండును. ఈ పురాతనయుద్ధనావలలోని అంతస్థులన్నియు ఎత్తు తక్కువగానున్న కప్పులతో కూడియుండును. మనిషి తలవంచి నడవవలసినదే. మఱి ఇంతేకాక నౌకాయుద్ధమునకు ఓడలను సమకూర్చుకొనుటగూడ ఇబ్బందితో కూడుకొన్న పనియే. ప్రభుత్వము ఒకఆజ్ఞను జారీచేసియుండెడిది. మనుష్యులు

కనబడిన చాలు. బలవంతముగానో కపటముగానో వారిని ఈ ఓడలలోనికి చేర్చుకొనెడివారు. దౌర్జన్యముగా తల్లులనుండి కుమారులను, భార్యలనుండి భర్తలను లాగుకొనిపోయెడివారు. ఒకతడవ వారిని ఓడలపై ఎక్కించినచో చాలును. (వారి జన్మలో పాపము పూర్వమెప్పుడును వానినెక్కియుండరు.) వారిని ఓడ తెరచాపకొయ్య మీదికెక్కింతురు. వారు భయపడి ఎక్కలేక పోయినచో వీపు చీలినదన్నమాటే. ఈ అగ్నిపరీక్షకు తాళుకొనలేక కొందఱు చచ్చిపోయెడివారు. ఈ నియమములు, ఈ సూత్రములు నిర్మించువారందఱు ఆయాదేశములందు భాగ్యవంతులు, పలుకుబడికలవారు. వ్యాపారము, దోపిడి, ఇతరదేశములను జయించుట మున్నగు పనులవలన వచ్చిన లాభములన్నియు వీరివంతు. తక్కిన పేదప్రజలు రక్తమును ఓడ్చవలెను. జీవితములు ధారపోయవలెను. మొత్తము ప్రపంచచరిత్రలోనున్న సూత్రమిదియే. మఱి ఇప్పుడు ఇటువంటి నియమములు లేవు. ఇప్పుడు యుద్ధనావలలోనికి మనుష్యులను చేర్చుకొను అధికారులపేరు విని పేదవారెవరును గజగజ వణకిపోనక్కఱలేదు. ఇప్పుడు ఓడలలోనికి చేరుట స్వేచ్ఛావ్యవహారము. యువకులైన దోషులు కైదులలోనికి పంపబడుటలేదు. యుద్ధనావలలో నావికులుగా శిక్షింపబడుచున్నారు.

ఆవిరిశక్తి పరిస్థితినంతయు మార్చివేసినది. ఇప్పుడు ఓడలలో తెరచాపలు వట్టి అలంకారములు. ఇప్పుడు ఓడలు గాలిపైన ఆధారపడవు. ఇప్పుడు తీవ్రవాతూలమువలన అంత ప్రమాదము లేదు. తీసికొనవలసిన జాగ్రతయెల్ల సముద్రములోని కొండలగుఱించి మాత్రమే. ఓడలు వానికి కొట్టుకొనకుండ నున్నచో చాలును. యుద్ధనావలుకూడ ఇపుడు పూర్వపునౌకలకంటె ఎంతో భిన్నమైనవి. అవి అసలు ఇపుడు ఓడలవలె కన్పించనే కన్పించవు. నీటిపైన విభిన్నమైన పరిణామముతో తేలుచున్న ఉక్కుకోటలవలె అవి కన్పించును. ఫిరంగులసంఖ్యకూడ చాల

తగ్గినది. వాని ఇప్పటి "టర్రెటుతుపాకుల" ముందు పూర్వపు ఫిరంగులు వట్టి పిల్లసమేరులే. ఈ యధునాతన యుద్ధనౌకలు చాల వేగరులు. వీనిలో మిగుల చిన్నవి టార్పెడో పడవలు. కొంచెము పెద్దవి శత్రువుల వర్తకనౌకలను పట్టుకొనుట కుప యోగించునవి. పెద్దనౌకలు నౌకాయుద్ధమునందు పాల్గొనుట కేర్పడినవి.

అమెరికాసంయుక్తరాష్ట్రముల ప్రజాయుద్ధకాలములో కొయ్యఓడల బయటిగోడలను కప్పుటకు ఉక్కుఖడ్డీలను వరుసలుగా యూనియనిస్టుపార్టీ ఉపయోగించినది. శత్రువుల ఫిరంగిగుండ్లు ఈ ఉక్కుఖడ్డీలకు తగిలి క్రిందబడిపోవుచుండెడివి. ఓడకేమీ నష్టమేమియు కలిగెడిదిగాదు. దీనితో ఓడగోడలకు శత్రువుల తుపాకిగుండ్లవలన ముప్పులేకుండనుండుటకు ఉక్కుతొడుగువేయుట ఆరంభమైనది. ఓడఫిరంగులుకూడ ఎంతో అభివృద్ధిపొందినవి. పెద్దపెద్ద ఫిరంగులు వచ్చినవి. వానిని మందుతో నింపుట, వలసిన ప్రక్కకు త్రిప్పుట, ప్రయోగించుట మొదలైన పనులకు వలసిన యంత్రములు వచ్చినవి. పూర్వము అయిదు వందలమంది మనుష్యులుకూడ కదలింపజాలని ఫిరంగిని నిలువుగా కాని, అడ్డముగాకాని ఒకమీట నొక్కుటవలన ఒకచిన్నకుఱ్ఱవాడు చేర్పగలడు. మందుతో, గుండ్లతో నింపగలడు. ప్రయోగింపగలడు. దీనికంతకు ఒకక్షణమైన పట్టదు. ఓడలగోడల ఈ యుక్కుతొడుగుల మందము పెరిగినకొలది ఫిరంగులశక్తికూడ పెంపు చెందినది. పిడుగులవంటి ఫిరంగులు నిర్మింపబడుచున్నవి. ఈ రోజున యుద్ధనావ యనగా ఉక్కుగోడలతో నిర్మింపబడిన దుర్గమే! ఫిరంగులనగా కేవలము మృత్యువే! ఒక్కదెబ్బతో ఎంత పెద్ద ఓడనైనను ముక్కలక్రింద కొట్టివేయవచ్చును. కాని బెంగాలీ జానపదకథలోని నకిందరుని తండ్రిగూడ సాతాలీకొండ మీద నిలుచుండి ఊహింపలేని "ఈ ఉక్కుఅంతఃపురము" చూచుటకు డెబ్బదివేల పర్వతసదృశతరంగములపైన నాట్యము

చేయును. ఇదికూడ టార్పెడోలన్నచో గజగజ వణకిపోవును. టార్పెడోయనగా చుట్టవలెనుండి ఒకవంకకు ప్రయోగింపబడినచో నీటిలోపలినుండి చేపవలె దానికి తగులును. క్షణములో ఆగుతిని కొట్టును. దానిలోనున్న శక్తివంతమైన ప్రేలుడుపదార్థము విపరీతమైనధ్వనితో ప్రేలును. ఇది తగిలినంతనే ఓడ ముక్కలు ముక్కలుగా పగిలిపోవును. ఈ ప్రేలుడులో చిక్కుకొనిన మనుష్యుల జాడకూడ తెలియదు. ఏకొంచెమైన తెలిసినచో అది మాంసపు తునకల రూపములో తెలియును. ఆకారముండదు. ఈటార్పెడోలు వచ్చినప్పటినుండి నౌకాయుద్ధములు ఎక్కువకాలము పట్టుట లేదు. ఒకటి రెండు పోరాటములతో ఒక పెద్ద విజయమో, అపజయమో సంభవించును. కాని ఈరకపు యుద్ధనౌకలు ప్రవేశపెట్టుటకు పూర్వము వీనివల్ల నౌకాయుద్ధములో ఉభయకక్షుల జనము 'ఇంతమంది నశింతు'రని వేయబడిన అంచనా యథార్థస్థితి పరిశీలనమువల్ల తప్పని తేలినది.

నౌకాయుద్ధములో ఈ నౌకలనుండి ప్రయోగింపబడిన ఫిరంగిగుండ్లలో ఏ కొన్నియైనను ఎదుటి ఓడలకు తగిలినచో రెండు నిమిషములకొక వ్యక్తివంతున చనిపోవుట నిశ్చయము. ఇట్లే ఒక యుద్ధనౌకనుండి ప్రేల్చబడిన ఐదువందల గుండ్లు కొకటి చొప్పున తగిలినచో ఉభయపక్షములోను ఒక్కయోడయైన లేకుండనశించి పోవలసినదే. కాని ఆశ్చర్యమేమన ఈ ఫిరంగులు, తుపాకులు, అభివృద్ధి చెందినకొలది, తుపాకులు మిక్కిలి తేలికగా మాటిన కొలది వానిని ప్రేల్చు కౌశల్యము పెరిగినకొలది, గుతిదూరము పెరిగిన కొలది, తుపాకిని గుండ్లతోనింపు యంత్రాంగము పెరిగిన కొలది, త్వరత్వరగా పేల్చుట పెరిగిన కొలది అవి ఎక్కువ గుతి తప్పుట జరుగుచున్నట్లున్నది. పూర్వము బారఖ్ జాయీలు, ఆఫ్రీదులు, పురాతనమై పొడవైన తుపాకులతో పంగలికఱ్ఱమీద ఎత్తుపెట్టికొని తుపాకి నిప్పుముట్టించి ప్రేల్చెదు నప్పుడే గుతితప్పకుండ గొట్టువాడు. ఇప్పుడు బాగుగా శిక్షితుడైన యుద్ధభటుడు

మిక్కిలి అభివృద్ధిగాంచిన యంత్ర శతఘ్నులను నిమిషమునకు నూటయేబది పర్యాయములుచొప్పున కాల్చగలిగినప్పటికి దాని వలన కలుగు ఫలితము వాతావరణము వేడి ఎక్కుట మాత్రమే. యంత్రాంగము కొద్దిలో మంచిదే. యంత్రాంగము ఎక్కువ యైనప్పుడు మనిషిలోని ఉత్సాహశక్తిని చంపి వానిని ప్రాణరహిత మైన యొక యంత్రముగా మార్చివేయును. ఫ్యాక్టరీలలో మను ష్యులు ఒకేరకమైనపని రాత్రింబవళ్ళు సంవత్సరములతరబడి చేయుదురు. ఒక్కొక్కతరహాపనికి కొంతమంది మనుష్యులు సూదుల మొనలు చేయుట, దారములు ముడివేయుట, మగ్గ ముతో ముందుకు వెనుకకు తిరుగుచుండుట, ఇటువంటి పనులు జీవితమంతయు చేయుదురు. ఆ పని చేయువానికి ఆ యుద్యోగము పోయినచో చావవలసినదే. వారికి జీవనాధారము మఱియొకటి దొరకదు. ఈ పద్ధతి పనిచేయుటవల్ల మనిష్యుడు ప్రాణరహితమైన యంత్రమువలె నైపోవును. ఈ కారణముచేతనే జీవితకాలమం తయు బడిపంతులుగనో గుమాస్తాగానో పనిచేసినవారు పరమ మూఢులుగా తయారగుదురు.

వర్తక నౌకలు, ప్రయాణ నౌకలు — వీనియొక్క ఆకా రము వేఱు. వ్యాపారనౌకలు యుద్ధకాలములో ఫిరంగులతో నమర్పబడుటకు, శత్రువుల వ్యాపార నౌకలను వేటాడుటకు వీలుగా నిర్మింపబడి యుండును. ఈ పనికి ప్రభుత్వములనుండి రుసుము వానికి లభించును. ఇట్లు నిర్మితములైనను యుద్ధనౌకలతో నివి చాల భేదించును. ఈ రెండురకముల నౌకలు చాలభాగము స్టీమర్లే. ఇవి చాలపెద్దవి. చాలఖర్చుతోకూడినవి. ఇవి ఒకేవ్యక్తి భరింపలేనివి. కావున కొందఱు సంఘముగా నేర్పడి వీని యాజమాన్యము వహింతురు. ఇండియా, యూరపు ప్రదేశముల వర్తకమున కుప యోగించు నౌకలుగల కంపెనీలలో పి. అండ్ ఓ. కంపెనీ చాల పురాతనమైనది—చాల భాగ్యవంతమైనది. బి. ఐ. యస్. యన్. కంపెనీ రెండవది. తరువాత చాల కంపెనీలున్నవి. విదేశీయులకు

సంబంధించినవానిలో మెస్సాజరీస్ మారిటైమ్స్ కంపెనీ ఫ్రెంచి వారిది. ఆస్ట్రియన్ లాయిడ్ కంపెనీ, జర్మన్ లాయిడ్ కంపెనీ, రుదాటినో కంపెనీ ఇటలీ వారివి. చాల ప్రసిద్ధమైనవి. వీనిలో పి. ఎండ్ ఓ. కంపెనీ వారి ప్రయాణనౌకలు భద్రమైనవి. వేగరులని ప్రసిద్ధిపొందినవి. మస్సాజరస్ మారిటైమ్స్ కంపెనీ వారి ఓడలలో భోజనసదుపాయములు బాగుగానుండును.

ఈపర్యాయము మేము యూరపు బయలుదేరినపుడు ఈ రెండుకంపెనీలవారు ప్లేగువ్యాధిభయమువలన నాటు మనుష్యులను అనగా హైందవులను ఎక్కించుకొనుటకు నిరాకరించిరి. హైందవు లెవ్వరును వలసకార్యాలయమునుండి తాము విదేశములకు స్వేచ్ఛ గనే పోవుచుండిరి; కాని ఏవిదేశీయులును తమ్ము బలవంతముగా బాని సలగా నమ్మివేయుటకో లేక కూలిపనిచేయించుటకో కొనిపోవుట లేదని నిర్ధారణపఱచు సర్టిఫికేటు పొందనిదే విదేశములకు పోవుటకు వీలులేదని ఇండియా ప్రభుత్వము ఒక ఆజ్ఞ జారీ చేసెను. ఈ సర్టిఫికేటును ఓడలోనికి ఎక్కుటకు ముందు దాఖలు చేయవలయును. ఈ ఆజ్ఞ చాలకాలము పెద్దమనుష్యులైన భార తీయులకు సంబంధించనంతవఱకు అమలులోనికి రాలేదు. ఇప్పుడు ప్లేగువ్యాధి ప్రబలియున్నది. గావున దీనిని పైకితీసిరి. ఫలితముగా విదేశములకుపోవు ప్రతిభారతీయుడు తనప్రయాణవిషయమును ప్రభు త్వమునకు తెలుపవలసినదే. మనదేశములో కొంతమంది పెద్దమను ష్యులమని, కొంతమందినిమ్నజాతులవారమని చెప్పుకొందురు. కాని ప్రభుత్వదృష్టిలో అందఱు నాటు మనుష్యులే. మహారాజులు, రాజులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అందఱును ఒకేతరగతి నాటు మనుష్యులే. కూలివాండ్రకు చెందిన న్యాయసూత్రమే ఏవిధమైన మినహాయింపు లేక నేటివు లంద ఱకు చెల్లవలసినదే! ఓ ఆంగ్లప్రభుత్వమా! నీ కభివందనములు. నీ దయవల్ల కనీస మొక్కటిక్షణమైనను నేను ''నేటివు'' లందఱ

లోను ఒకడనని తలచుచున్నాను. ఇట్టి భావన చాల యోగ్య మైనది. ఈ నా శరీరము కాయస్థజాతికి చెందినది. అందుచేత చాల తరగతులకు చెందిన జనుల విమర్శలకు గుఱియైనది. ఈ రోజులలో అన్నివర్ణముల జనులు తాము పరిశుద్ధరక్తముగల ఆర్యులమని చెప్పుకొనుచుండుట మనము వినుచుందుము. అభి ప్రాయభేదమెల్ల వారివారి నరములందీ ఆర్యరక్తము ఏశతాంశ ములో ప్రవహించుచున్నదనియే. కొంతమంది మొత్తమంతయు ఆర్యరక్తమని, కొంతమంది నరములలో మాత్రము ఒక ఔన్సు అంతకంటె ఎక్కువో తక్కువోయని అనుచుందురు. ఒక్క విషయ ములోమాత్రము వారందఱు ఏకీభవింతురు. అది వారి వర్ణములు కాయస్థజాతి కన్న మిన్న యని. మఱియు వీరును, ఆంగ్లజాతియు ఒకే మూలమునుండి వచ్చిరట. వారు ఒకరికొకరు దాయాదు లట. వారు నేటివులు కారట. మఱియు ఈ దేశమునకు వారు ఆంగ్లేయులవలెనే మానవతీ సూత్రములను పురస్కరించుకొని వచ్చిరట. వారి మతములో బాల్యవివాహము, బహుభార్యా త్వము, విగ్రహారాధనము, సహగమనము, ఘోషాపద్ధతి మొద లైన దురాచారములు లేవట. ఈ దురాచారములన్నియు కాయ స్థులు, ఆ సంబంధమైన వారి వల్ల వారి మతములోనికి జొనుప బడినవట. వారి మతము ఆంగ్లేయుల మతమువంటిదేనట. వారి పితృ, పితామహులందఱు. ఆంగ్లేయులవలె నుండెడివారట. ఈ ఉష్ణదేశపు ఎండవల్ల వారు నల్లబడిరట. ఇప్పుడు మీ వ్యాజవాదములతో ధైర్యమున్నచో ముందుకు రండు. ప్రభుత్వము మీరందఱు నేటివులనుచున్నది. ఇంత నల్లనిపూతలో ఇక్కడ కొంచెము కారునలుపు, అక్కడ కొంచము చామన చాయ యని గుర్తుపెట్టుటకు వీలులేదు. ప్రభుత్వము వారందఱను నేటివులనుచున్నది. ఇప్పుడు మీరు ఆంగ్లేయులవలె వేషము వేసి కొనిన లాభములేదు. ఇక నుండి మీ దొరటోపీలు మీ కేమియు లాభము తెచ్చిపెట్టవు. మీరు హిందువుల నెత్తిమీద తప్పం

తయు బెట్టి, ఆంగ్లేయులతో సఖ్యము నెఱపుటకు ప్రయత్నించి నను దానివల్ల మీకు కలుగునవి ఎక్కువ చీవాట్లు, దెబ్బలు తప్ప మఱేవియు కావు. ఓ ఆంగ్లరాజ్యమా! నీ కాశీస్సులు. నీవు అదృష్టదేవత యొడిలో పెరుగు నిసుగువైతివి. నీవు ఇతోధికవృత్తి పొందుదువుగాక!! అందువల్ల మరల మేము మా పూర్వపు నాటుదుస్తులు, అంగవస్త్రము, ధోవతి, హాయిగా ధరింతుము. మీదయవల్ల మా దేశములో నీచివరనుండి ఆచివరవఱకు వట్టి కాళ్ళతో వట్టి తలతో ప్రయాణింతుము. మే మలవాటుపడిన పప్పు అన్నము మా పద్ధతిలో, మా చేతులతో తిందుము. ఓ! భగవంతుడా! అనుగ్రహింపుము. మేము ఈ ఆంగ్లేయ ఇండియను పద్ధతులవల్ల తద్వ్యామోహములో పడితిమి. మేము మా నాటు దుస్తులను వదలి, నాటు మతమును వదలి నాటు మర్యాదలను, నాటు పద్ధతులను వదలివేసినంతనే ఈ ఆంగ్ల ప్రజలు మమ్ము వారి భుజములమీద నెక్కించుకొని సింహములుగా మార్చివేయుదు రని చెప్పుకొనుచుండుట వినుచుందుము. మేము అట్లు వదలి వేయుటకు సిద్ధముగానున్న సందర్భములో ఈ ఆంగ్లేయుని చబుకు జువ్వాడింపు, ఆతని ఛడావు దెబ్బ మాకు నసాళమంటెనవి. వెంటనే మా వారందఱు భయభూతముచే కబళింపబడి వెనుకకు పరువెత్తిరి. ఆ ఆంగ్లపద్ధతులకు స్వస్తి చెప్పి తమ నాటుతనమును ఒప్పుకొనుటకు ఉత్సాహపడిరి. మే మింత శ్రద్ధగా ఆంగ్లపద్ధతులను అవలంబించితిమి. ఆంగ్లేయుల చడావులు మాతలకాయలలో నుండి వానిని తఱిమివేసినవి.

ఓ! ఆంగ్లప్రభుత్వమా! వర్ధిల్లుము. ఈ ఆంగ్లేయుల సింహాసనము స్థిరపడుగాక! వారి ప్రభుత్వము శాశ్వతమగు గాక! నాలో ఆంగ్ల పద్ధతులను అవలంబింపవలెనను కొంచము ఇచ్ఛకూడ ఇగిరి పోయినది. అమెరికా ప్రజలకు నా అభినందనలు. నా గడ్డము బాగుగామాసి బాధకలిగించుచున్నది. నేను ఒకమంగలిదుకాణము లోనికి అడుగు పెట్టినంతనే, "ఓయీ! నీబోటి వికారుల

కొఱకు ఈ దుకాణము పెట్టలేదు" అని ఎవడో యనినాడు. నా తలపాగా, కాషాయపురంగు అంగరకా చూచి వాడిట్లు అనియుండు ననుకొంటిని. నేను వెళ్ళి ఒక ఇంగ్లీషుకోటు, హేటు కొనెదననుకొంటిని. నేను అట్లనుకొనుచుండగా అదృష్టవశాత్తు ఒక అమెరికన్ పెద్దమనిషి కన్పించి "ఓయీ! నీవా కాషాయపు దుస్తులలోనే యుండుట మంచిది. అప్పుడు నిన్ను గుఱించి ఎవరును పొరపడరు. నీవు ఐరోపీయుని దుస్తులను ధరించినచో నిన్ను ప్రతివాడు తఱిమి వేయును సుమీ" అనినాడు. తరువాత ఒకటి రెండు మంగలిదుకాణములలో నాకు ఇటువంటి మర్యాదయే లభించినది. పిదప నేను స్వంతముగా గడ్డము చేసికొనుట నేర్చుకొంటిని. ఒకతూరి నాకు ఆకలి మండి పోవుచుండెను. ఒక భోజనశాలకుబోయి 'ఫలానావస్తు వున్నదా' యని యడిగితిని. అంతట అత డిట్లనినాడు: "మేము వానిని నిలువచేయలేదు. అక్కడెక్కడో దొరకును పొమ్ము". "అదిగో! ఇది అక్కడ ఉన్నదే!" అని నే నంటిని. తేటతెల్లముగా చెప్పవలెనన్నచో ఆ మాటలకర్థమిది: "నీబోటి వారు ఇచ్చట కూర్చుండి భోజనముసేయుటకు వీలులేదు. ఎందుచేతననగా నీవు తిను బల్లమీద ఎవడును తినడు. తిన్నవాడు వెలిపడును" అని యత డనెను. కాని అమెరికా నాకు బాగుగానే కన్పించినది. వర్ణములతో వెలయుచున్న మా దేశము వలెనే అది కన్పించినది. ఈ తెల్ల నల్ల భేదములు నాటు మనుష్యులలోని ఈ ఆర్యరక్తములోని హెచ్చుతగ్గులు, ఈ వంశమర్యాదలను గుఱించి బానిసలు ఇంత కట్టుదిట్టముగా నుండుట ఎంత అసహ్యముగా నుండును! ఒక 'దోం' జాతి వాడు ఇట్లనుచుండువాడు: "మా జాతికంటె గొప్పజాతి ప్రపంచములో లేదు. మేము దోములము సుమా". ఇది ఎంత హాస్యాస్పదమైన విషయమో చూడుడు. ఈ వర్ణభేదమంతయు లోకములో మర్యాదలేని జాతులందే ఎక్కువగా కన్పించును.

సాధారణముగా స్టీమర్లు తెరచాపఓడలకంటె చాల పెద్దవి. అట్లాంటిక్ సముద్రముగుండా ప్రయాణము చేయు స్టీమర్లు 'గోల్కొండ' స్టీమరుకంటె ఒకటిన్నరరెట్లుండును. జపానునుండి పసిఫిక్ సముద్రములో నేను ప్రయాణించిన ఓడగూడ చాల పెద్దది. పెద్దఓడలలో మధ్యభాగమున మొదటితరగతిగదులుండును. వానికి రెండుప్రక్కల ఖాళీప్రదేశముండును. తరువాత రెండవ తరగతి గదులుండును. వాని కిరుప్రక్కల తక్కువతరగతి ప్రయాణీకులు కూర్చుండు వసారాలుండును. ఒకచివర నావికులకు, సేవకులకు గదులు కలవు. ఈ తక్కువతరగతి ప్రయాణీకులు మూడవతరగతివారు. వీరిలో చాలపేదవారు, అమెరికా, ఆస్ట్రేలియాలకు వలసపోవువారిని పోలువారు. ఆ గదులు చాల ఇరుకుగా నుండును. వారికి తిండి బల్లలమీద పెట్టరు. చేతులలో పెట్టుదురు. ఇండియా, ఇంగ్లాండులమధ్య ప్రయాణముచేయు ఓడలయందు ఇట్టి గదులు లేవు. కాని ఆ ఓడలలో 'డెక్కు' ప్రయాణీకులుందురు. ఒకటి, రెండు తరగతుల మధ్యనున్న ఖాళీప్రదేశమును ఈ డెక్కుప్రయాణీకులు కూర్చుండుటకు, పరుండుటకు ఉపయోగింతురు. కాని దూరప్రయాణముచేయు డెక్కుప్రయాణీకుడెవ్వడు నాకు కన్పించలేదు. 1893వ సంవత్సరములో మాత్రము నేను చైనాకు వెళ్లినపుడు త్రోవలో బొంబాయినుండి హాంకాంగువరకు పలువురు చీనాదేశస్థులు డెక్కుపైన ప్రయాణము చేయుట జూచితిని.

తుపానుగాలిలో డెక్కుప్రయాణీకులు చాల ఇబ్బంది పడుదురు. ఇంతేగాకుండ రేవులలో సరకులు దింపునపుడుగూడ కొంత ఇబ్బందిపడుదురు. అన్నింటికంటె పైన ఉన్న 'హరికేను డెక్కు'లో తప్ప తక్కిన క్రిందిడెక్కులలో ఒకచదరమైన ఖాళీ ప్రదేశముండును. దానిలోనుండి సరకుల నెక్కించుట, దించుట చేయుదురు. ఆ సందర్భములయందుమాత్రము డెక్కుప్రయాణీకులకు కొంత ఇబ్బంది కలుగును. దీనిని విడచి కలకత్తానుండి

సూయజుకు వేసవికాలములోనైనచో యూరోపుదేశములగుండానైనను డెక్కుమీద ప్రయాణము రాత్రిళ్లు చాల హాయిగా నుండును. మొదటితరగతి, రెండవతరగతి ప్రయాణీకులు, వారి సౌకర్యవంతమైన గదులయందు అమితమైన ఆవిరిలో ఉడికిపోవుచుండగా డెక్కుమీద స్వర్గమువలె నుండును. ఇటువంటి ఓడలలో రెండవతరగతి చాల అసౌకర్యముగా నుండును. బెర్లిను, జర్మనీ, ఆస్ట్రేలియాలమధ్యతిరుగుచున్న క్రొత్తగాస్థాపించినజర్మనులాయిడ్ కంపెనీవారి ఓడలలో మాత్రము రెండవతరగతిలో చాల సౌకర్యములు ఉన్నవి. 'హరికేనుడెక్కు'లో గూడ కొన్నిగదులున్నవి. 'గోల్కొండ' ఓడలో భోజనసదుపాయములు మొదటితరగతి వారితో సమానముగా నున్నవి. ఆ ఓడల మార్గములో కొలంబో తగులును.

గోల్కొండ ఓడలో రెండుప్రక్కల 'హరికేనుడెక్కు' మీద రెండుగదులున్నవి. ఒకటి డాక్టరుకు, ఒకటి మాకు ఇచ్చిరి. కాని వేడి బాగా ఎక్కువగా నుండుటవలన మేము క్రింది 'డెక్కు' లో ఉండవలసివచ్చినది. 'హరికేనుడెక్కు'లో మాకు ఇచ్చిన గది సరిగా ఇంజనుపైన ఉన్నది. అందుచేత మాకు వేడిఎక్కువ. ఓడ ఉక్కుతో కట్టినను ప్రయాణీకుల గదులు మాత్రము కొయ్యతోనే కట్టిరి. ఈకొయ్యగోడలకు పైన, క్రింద గాలి ధారాళముగా వచ్చుటకు కొన్ని క్రంత లేర్పాటుచేసిరి. ఈ గోడలకుపైన దంతపురంగు వేసిరి. ఒక్కొక్కగదికి ఈ రంగువేయుటకు 25 పౌనులు ఖర్చైయుండును. నేలమీద ఒకచిన్నపట్టా పఱచిరి. ఒకగోడప్రక్కన గోడలోనే రెండు ఇనుపబల్లలు, కాళ్లులేని మంచములు ఒకదానిపైన నొకటి గోడలోనికి కూర్పుచేసిరి. దానికెదురుగనున్న గోడకుకూడ ఇట్టివే రెండుబల్లలు కూర్చిరి. ద్వారమున కెదురుగా చేతులు కడుగుకొనుటకు ఒకతొట్టి, ఒకఅద్దము, రెండుసీసాలు, నీరుత్రాగుటకు రెండుగ్లాసులు, మంచములప్రక్క ఇత్తడి తడక అమర్చబడినవి. దీనిని గోడకు చేర్చుటకు

వాల్చవచ్చును. మరల తీయవచ్చును. దానిపైన ప్రయాణీకులు నిద్రించుటకుముందు వారి చేతిగడియారముగాని ముఖ్యవస్తువులు గాని పెట్టుకొనవచ్చును. క్రిందుగానున్న మంచముక్రింద ట్రంకు పెట్టెలు, సంచులు పెట్టుకొనవచ్చును. రెండవ తరగతిలోగూడ ఇట్టి సదుపాయములే యున్నవి. ఒక్కటే భేదము. చోటుకొంచెము తక్కువ. కుర్చీలు, మంచములు మొదలైనవి అంత ప్రశస్త మైనవిగావు. ఈ ఓడ వ్యాపారమంతయు ఆంగ్లేయులు పట్టు కొనినారు. అందుచేత ఇతరదేశీయులు నిర్మించిన నౌకలయందు గూడ ఆహారసదుపాయములు, కాల నియమములు వానిలో ప్రయాణముచేయు ఆంగ్లేయ ప్రయాణీకులకు అనువుగానుండునట్లు ఆంగ్లపద్ధతియందే నిర్మాణించిరి. ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మని, రష్యా మొదలైన దేశములలో ఆహారవిషయమునందును కాల విషయమునందును ఒకదేశమున కొకదేశమునకు మధ్య చాల భేదమున్నది, మనదేశములోగూడ వంగదేశము, ఉత్తరహిందూ స్థానము, మహారాష్ట్రము, గుజరాతు మొదలైన దేశములమధ్య గూడ ఇట్టి భేదమే యున్నది గదా. కాని ఈ భేదములు ఓడలలో అంతగా పాటింపరు. ఎందుచేతననగా వానియందు ప్రయాణము చేయు వారిలో ఆంగ్లమును మాట్లాడు ప్రయాణీకులసంఖ్య అధిక ముగాగలదు. అందుచేత ప్రతి విషయము ఆంగ్లపద్ధతిలో మలచ బడినది.

ఓడలో కెప్టెన్ పెద్ద అధికారి. పూర్వము సముద్రముల మీాద ఈ కెప్టెన్ ఓడలను పరిపాలించెడివాడు. దోషులను శిక్షిం చుట, ఓడ దొంగలను ఉరితీయుట మొదలైన పనులు చేసెడి వాడు. ఇపుడు ఈ విషయములందతడు అంతదూరము పోజాలడు; కాని అతనిమాటకు ఓడపై తిరుగులేదు. అతనిక్రింద నలుగు రధి కారు లుందురు. తరువాత నలుగురో, ఐదుగురో ఇంజనీర్లు ఉందురు. వీరు అధికారులతరువాతివారు. కాని వీరిలో ప్రధా నుడు అధికారితో సమానుడే. అతనికి మొదటితరగతి ఆహారము

లభించును. తరువాత నలుగురైదుగురు చుక్కానివారుందురు; వంతులప్రకారము చుక్కాని పట్టుట వీరిపని. ఇంతవఱకు వీరం దరు ఐరోపీయులు. తక్కినవారు సేవకులు, నావికులు, బొగ్గు వేయువారు. వీరందఱు హైందవులు, మహమ్మదీయమతస్థులు. పి అండ్ ఓ. కంపెనీలో మాత్రము బొంబాయి ప్రక్క నేను హిందూమతస్థులైన నావికులను చూచితిని. ఈ సేవకులు, నావి కులు కలకత్తానుండి వచ్చినవారు. బొగ్గువేయువారు మాత్రము తూర్పువంగ ప్రాంతమునకు చెందినవారు. వంటవారుకూడ ఆ ప్రదేశమునకే చెందిన కాథలిక్ క్రైస్తవులు. వారితోబాటు నలు గురు ఊడ్పుపని చేయువారుగూడ నున్నారు. ఓడలోనున్న గదు లలోని మురికి నీటిని తీసివేయుట, స్నానమునకు ఏర్పాటుచేయుట, మరుగుదొడ్లు శుభ్రముచేయుట, మున్నగునవి వీరిపనులు. మహమ్మ దీయ సేవకులును, లస్కర్లును క్రైస్తవుల తిండిని తినరు. ప్రతిదినము ఓడమీద పందిమాంసము మొదలైనవి వండుదురు. అందుచేత ఏదోవిధముగ ఈ మహమ్మదీయులు తమకుతాము ప్రత్యేకముగా తిండి సాధించుకొందురు. కాని ఓడవంటసాలలో తయారుచేసిన రొట్టెను పుచ్చుకొనుటకువారికి అభ్యంతరములేదు. కాని కలకత్తా నుండి వచ్చిన, ఆంగ్ల నాగరికత సోకిన ఆంగ్ల నావికులుమాత్రము ఆహారవిషయమున ఏనియమము పాటింపరు. పురుషులకు మూడు భోజనశాలలున్నవి. ఒకటి సేవకులకు, ఒకటి నావికులకు, ఒకటి బొగ్గు వేయువారికి. కంపెనీవారు ప్రతిభోజనశాలకు ఒక వంట వానిని, ఒక సేవకుని ఇత్తురు. ప్రతి భోజనశాలకు వంటిళ్ళు వేఱే యున్నవి. కొద్దిమంది హిందూ ప్రయాణీకులు కలకత్తా నుండి కొలంబోకు పోవుచుందురు. వారు ఆయాసేవకుల పనులయిన తరువాత వీనిలో ఏ వంటగదిలోనో వండుకొందురు. ఈ సేవకులు వారి మంచినీటిని వారే తోడుకొందురు. ప్రతి 'డెక్కు' మీద 'డెక్కు' గోడలకు రెండు పంపులు అమర్చిరి. ఇందులో ఒకపంపు తియ్యనీటిని ఒకపంపు ఉప్పునీటిని తోడును. ఈ మహమ్మదీయు

లందఱు వారి కొఱకు ఈ పంపునుండి తోడుకొందురు. పంపునీటిని త్రాగుట కభ్యంతరములేని హిందువులు ఇంగ్లాండునకుగాని మఱెచ్చటకుగాని ఆహారపానీయముల విషయములందు తమతమ ఆచారములను పాటించుకొనుచు, ఈఓడలమీద ప్రయాణముచేయ వచ్చును. వారు ఒక వంటసాల, మంచినీళ్ళు ఇతరుల సంపర్కము లేకుండ వాడుకొనవచ్చును. స్నానజలముకూడ ఎవరును ముట్టు కొనకుండ సంపాదించుకొనవచ్చును. బియ్యము, పప్పులు, కూర గాయలు, చేపలు, మాంసము, పాలు, నెయ్యి ఈ పదార్థము లన్ని ఈ ఓడలమీద దొరకును. ఎందుచేతననగా ఈ ఓడలమీద ఎక్కువగానున్న సేవకులు హైందవులు. వీరందఱు తినుటకు ముల్లంగి, కాబేజి, బంగాళాదుంపలు సరఫరాచేయవలెను. ప్రయాణమునకు ముఖ్యముగా కావలసినది డబ్బు. అదియున్నచో ఎక్కడికైనను పోవచ్చును. నీ ఆచారనియమములన్నిటిని పాటింప వచ్చును.

కలకత్తా, ఐరోపాలమధ్య తిరుగు ఓడలన్నింటియందును వంగసేవకులే నియమింపబడిరి. క్రమముగా వారొక కులముగా మాఱిపోవుచున్నారు. వారు కొన్ని నావికపదములు తయారు చేసినారు. కెప్టెనుకు 'బారీవాలా', ఆఫీసరుకు 'మాలము', తెర చాప కొయ్యకు 'దోల్', తెరచాపకు 'సరహ్', వంచుటకు 'ఎరియా', ఎత్తుటకు 'హబిష్'. అను మాటలు పర్యాయపదము లాయెను.

సరంగులను పెద్దలున్నారు. వారిక్రింద మఱిద్దరుగాని, ముగ్గురుగాని 'థిండల్లులు' అను అధికారులున్నారు. వారిక్రింద లస్కర్లును, బొగ్గువారును కలరు.

ఈ వంటనౌకర్లకు పైన బట్లరు, వానిపైన ఒక ఐరోపీయు డగు వంటవాడు ఉండును. లస్కర్లు ఓడలు కడుగుదురు. త్రాళ్లను విప్పుట, చుటుట మున్నగు పనుల జేయుదురు. పడవలను క్రిందకు

దింపుట, పైకిలాగుట వీరికర్తవ్యములు. తెరచాపలను ఎత్తుట, దించుట వీరిపనులు. ఇట్టివే కొన్నిపనులు వీరు చేయుదురు. సరంగు, తిండాలు వీరిద్దఱు వారుచేయుపనులు పర్యవేక్షించుచు తిరుగుచుందురు. బొగ్గువారు ఇంజను గదిలో మంటవేయుదురు. వారు రాత్రింబవళ్లు ఆ అగ్నితో కుస్తీపట్టవలెను. ఇంజనులను పరిశుభ్రము చేయవలెను. అంత పెద్ద ఇంజనులను, దానిభాగములను పరిశుభ్రముచేయుటయన్న అంత తేలికగాదు. సరంగు అతని సహాయకుడు కలకత్తావాండ్రు. వంగభాష మాట్లాడుదురు. పెద్దమనుష్యులవేషము ధరింతురు. చదువుట, వ్రాయుట ఎఱుగుదురు. స్కూలులో చదువుకొనుటవలన చక్కని ఇంగ్లీషుకూడ మాట్లాడుదురు. సరంగుకు ఒకకొడుకున్నాడు. 13 ఏండ్లవాడు. కెప్టను వద్ద వాడు నౌకరు. కెప్టన్ గదిముందు వాడు ప్రతీహారిగా నుండును. ఈ వంగదేశీయులైన లస్కర్లను, బొగ్గువాండ్రను, సేవకులను, వంటపనివానిని, వీరందఱిని చూచినపుడు నా దేశప్రజలను గుఱించి నేను పొందుచుండిన నిరాశాభావము విశేషముగా తొలగిపోయినది. వారిశరీరము బలపడుచున్నది. వారికి ఇసుమంతయు భయములేదు. కాని వారు చాల వినయము గలవారు. కూడని పొగడ్తలక్షణము నాటుమనుష్యులందఱికుండునట్టిది ఇచ్చట పాకీవారికిగూడ లేదు. ఎంత మార్పు.

భారతీయులైన లస్కర్లు మంచిపనివాండ్రు. పనిచేయుటలో వెనుక ముందు లేనివారు. కాని వారిజీతము తెల్లనావికునిజీతములో నాల్గవవంతు మాత్రమే. ఇంగ్లాండులో చాలమంది దీనివల్ల అసంతృప్తిచెందిరి. ముఖ్యముగా ఓడలమీద ఉద్యోగములు పోగొట్టుగొన్న తెల్లవారందఱు అసంతృప్తిచెందిరి. వారందఱు ఒక్కొకప్పుడు ఉద్యమములుగూడ లేవదీసిరి. కాని భారతీయ నావికులకు వ్యతిరేకముగా వారు చెప్పగలదేమియులేదు. ఎందుచేతననగా ఈ భారతీయలస్కర్లు తెల్లవారికంటె చుఱుకైనవారు.

అందుచేత ఈ తెల్లవారు వారిపైన చేయు ఒకే ఒక ఆరోపణ మే మనగా, 'తుపానుగాలిలో ఓడ ప్రమాదములో నున్నపుడు ఈ భారతనావికులు ధైర్యము గోల్పోవుదురని.' ఓయి భగవంతుడా! నిజమాలోచించినచో ఈ ఆరోపణకు తావులేదు. అపాయ పరిస్థితులలో తెల్లవాండ్రందఱు భయమువల్ల ఇష్టమువచ్చినట్లు త్రాగుదురు. త్రాగి, ఒళ్లుతెలియక తిరుగుదురు. భారతీయనావికు లన్ననో, ఎన్నడును వారిజీవితములో సారా ఒకబొట్టయినను త్రాగలేదు. అపాయకాలమునందు వారు పిరికితనమును చూపలేదు. అసలు భారతీయభటుడెవ్వడైనను యుద్ధరంగములో వెన్నిచ్చెనా అన్నది ప్రశ్న. ఎప్పుడును అతడు వెన్నియ్యలేదు. కాని భారతీయభటులకు నేత యుండవలెను. నాకొక ఇంగ్లీషు స్నేహితుడున్నాడు. అతనిపేరు జనరలు స్ట్రాండు. అతడు సిపాయి తిరుగుబాటుకాలములో భారతదేశములో నుండెను. సిపాయి తిరుగుబాటుకాలములో భారతదేశములో పనిచేసెను. అతడు నాకు అనేక కథలను చెప్పెను. ఒకరోజున నేను సంభాషించుచుండగా వాని నిట్లడిగితిని: "ఈ సిపాయిలందఱకు వలసినన్ని తుపాకులు, మందుగుండుసామగ్రి, ఆహారపదార్థములు ఉన్నవి. వారందఱును ఆఱితేఱిన వీరభటులుగదా. అట్టివా రేదు ఎందుకు ఓడిపోయిరి?" ఆయన ఇట్లనినాడు: "అది వారితప్పు గాదు. వారి నాయకులతప్పు. ఆ నాయకులు ముందు నిలిచి నడపుటకుబదులు, వెనుక భద్రమయినచోటున నిలిచి "వీరులారా! పోరుడు! ధైర్యముతో పోరుడు!" అని అఱచుచు వారిని పురికొల్పుచుండెడివారు. నాయకుడు ముందు నడచి మృత్యువు నెదుర్కొన్నగాని వెనుకనున్న వీరభటులు ధైర్యముగా పోరాడలేరు. సర్వత్ర ఇది ఇంతే. నాయకుడు తనప్రాణములను లక్ష్యపెట్టరాదు. నీవు ఒకప్రయోజనమునకు నీప్రాణము త్యాగము చేసినచో, అప్పుడు మాత్రమే నీవు నాయకుడవగుటకు అర్హుడవు. మనకట్టి త్యాగము లేదు. కాని మనమందఱము నాయకత్వ

మును కోరుదుము. కాని దానివల్ల ఫలితము శూన్యము. మన మాట ఎవడు వినును?

నీవు "ఆర్యులనుండి నేను ఉద్భవించితి"నని ఎంత అఱచినను, పురాతన భారతదేశమునుగుఱించి నీవు రాత్రింబవళ్లు ఎంత సంకీర్తనముచేసినను, నీ జన్మలో నీవెంత గర్వపడినను, ఓయి ఉత్తమకులమునకుచెందిన భారతీయుడా! నీవును, నీతోడివారును బ్రతికియున్నారనుకొనుచున్నారా? మీరందఱు పదివేలసంవత్సరముల వయస్సుగల ముసలమ్మలు. మీ పూర్వులు నడచుచున్న శవములని ఎవరిని నిందించిరో వారిలోనే ఇప్పటికినీ ఏకొంచెమో జీవమున్నది. నిజముగా నడచుచున్న శవములు మీరు! మీ ఇండ్లు, మీ ఇంటిలోనివస్తుసామగ్రి, పురాతనవస్తుప్రదర్శనశాలలో పెట్టుటకు పనికివచ్చినవి. వానిలో జీవములేదు. అంత పాతపడిపోయినది. మీ పద్ధతులు, మీ ప్రవర్తనలు, మీ కదలికలు, మీ జీవితపుపోకడలు ఒక్కమాఱు చూచినవాడయినను ఏమనుకొనును? అమ్మమ్మచెప్పు చిన్నకథను వినుచున్నట్లు భావించును. మీతో కొంచెము స్నేహముచేసి ఇంటికి తిరిగి వచ్చిన తరువాత ఎవడైన నేమనుకొనును? తా సంతకుపూర్వము ఒక పురాతన చిత్రశాలకు పోయి బొమ్మలను చూచివచ్చితి ననుకొనును. ఈ మాయలోకములో మీరు నిజమైన మాయబొమ్మలు. ఎడారిలో ఎండమావులు. మీరు అనగా ఉత్తమకులమునకుచెందిన భారతీయులు. మీరు భూతకాలమునకు, దానివైవిధ్యములకు ప్రతినిధులు. అజీర్ణమువలన సంభవించిన ఏపీడకలయోతప్ప మిమ్ము చూచుటకు ఎవరును నిచ్చగింపరు. మీరు వట్టిశూన్యము. భవిష్యత్తులో వట్టిగాలిమూటలు. స్వప్నజగత్తునకుచెందినవారు మీరు. మీరు ఇంకను ఇందందు మసలుచున్నారేల? మీలో మాంసములేదు, నెత్తురులేదు. వట్టిపురాతనభారతదేశముయొక్క బొమికలగూళ్లు మీరు. మీరు తొందరగా దుమ్మై, గాలిలో ఎందుకు కలిసిపోరు? మీ కంకాళపుప్రేళ్లమీద కొన్ని అమూల్య

మైన రత్నపుటుంగరములున్నవి. అవి మీ ప్రాచీనులు సంపాదించి పెట్టినవి. మీ దుర్వాసనాభూయిష్టమైన శవములయొక్క కౌగిలింతలో ఎన్నో పురాతన రత్నపేటికలు భద్రపఱుపబడినవి. ఇప్పటి వఱకు మీకు వాని నితరులకు అప్పగించు సమయము చిక్కలేదు. ఇప్పుడు ఈ ఆంగ్లేయులపరిపాలనలో ఈ ఉచితవిద్యావిధానపు దినములలో, ఈ వెలుగులో వానిని మీ వారసులకు అప్పచెప్పుడు. మీరు చేతనయినంత త్వరగా ఆ పని చేయుడు. మీరు శూన్యములో కలసిపోవుదురు. అంతర్ధానమగుదురు. మీ స్థానములో క్రొత్త హిందూదేశము ఉద్భవమగును. క్రొత్త భారతదేశము తలసూపుగాక! కర్షకుల గుడిసెలనుండి, నాగలి పుచ్చుకొనిన పల్లెవారి గుడిసెలలోనుండి, చెప్పులుకుట్టువారి గుడిసెలలోనుండి, పాకీవాండ్ర గుడిసెలలోనుండి క్రొత్త హిందూస్థానము ఉద్భవించుగాక! కిరాణావానిదుకాణమునుండి, పెసరట్లమ్ముకొనువానిపెనమునుండి క్రొత్త హిందూస్థానము పుట్టుగాక! ఫ్యాక్టరీలనుండి, విపణివీథులనుండి, తోటలనుండి, అడవులనుండి, గుట్టలనుండి, పర్వతములనుండి, నూతన భారతదేశము తలయెత్తుగాక. ఈ సామాన్యప్రజలు వేలసంవత్సరములు అణగద్రొక్కబడిరి. కిక్కురుమనకుండ వారి దుర్దశనుండి వారియందు అద్భుతమైన త్యాగశక్తి తలసూపినది. వారు శాశ్వతముగా దుఃఖములనుభవించిరి. అది వారికి అనంతమైన ప్రాణశక్తి నిచ్చినది. గుప్పెడు బియ్యపుగింజలతో పొట్టనింపుకొని వారు ప్రపంచమునంతను తలక్రిందుచేయగలరు. వారికి చిన్నరొట్టెముక్క పెట్టుము, చాలు. ఈ ప్రపంచకమంతయు వారిశక్తికి పట్టదు. వారు రక్తబీజుడను * రాక్షసుని వలె అనంతమైన ప్రాణశక్తిగలవారు. ఇంతేగాక దీనికితోడు పరిశుద్ధమైన నైతికజీవితముయొక్క బలముకూడ వారికున్నది.

* 'దుర్గాసప్తశతి'లో నుల్లేఖింపబడిన రాక్షసుడీతడు. వానిశరీరము నుండి నేలబడిన ప్రతిరక్తబిందువునుండి వానినిబోలు రాక్షసుడొకొక్కడు పుట్టుచుండువాడు.

అది ప్రపంచములో వారికితప్ప మఱెవ్వరికి లేదు. అట్టి శాంతి, అట్టి తృప్తి, అట్టి ప్రేమ, ఏకధాటిగా, నిశ్శబ్దముగా పనిచేయు అట్టి శక్తి, అవసరసమయములలో ఆ సింహబలప్రదర్శనము అవి యన్నియు మీ కెచ్చట కన్పించును? పురాణకంకాళములైన మీ ముందుగల మీ వారసులకు — భవిష్యద్భారతదేశమునకు — మీ రత్నపేటికలు, మీ రత్నపుటుంగరములు వారికందింపుడు. త్వరగా నందింపుడు. మీరు అంతర్ధానమైపోవుదురు. మరల కన్పించరు. ఊరక మీ చెవులుమాత్రము విప్పుకొని విందురు. భారతదేశముయొక్క పునరుజ్జీవనపు ప్రారంభతూర్యధ్వని విని నంతనే మీరు అంతర్ధానమైపోవుదురు. ఆ తూర్యధ్వని కోటి పిడుగుల సవ్వడి కెనయై, విశ్వాంతరాళమునందు 'గురుజయ! గురుజయ!' అని మాఱుమ్రోగును.

మా ఓడ ఇప్పుడు బంగాళాఖాతములో నున్నది. ఇది చాల లోతైన సముద్రము. దానిలో లోతులేని భాగములో హిమాలయములనుండి దూసుకొనివచ్చుచు ఉత్తరప్రదేశము గుండా ప్రవహించుచున్న గంగానదివలన ఒండుపేరుకొన్నది. ఆ సారవంతమైనప్రదేశమంతయు మనవంగదేశము. 'సుందరబన్నులు' దాటి మనవంగదేశము విస్తరించు ఛాయలులేవు. కొంతమంది 'సుందరబన్నులు' పూర్వము చాలఎత్తైనప్రదేశమనియు, అచ్చట చాల పట్టణములు గ్రామములు నుండినవనియు చెప్పుదురు. కాని చాల మంది ఈ విషయము నొప్పుకొనరు. ఏమైనప్పటికి 'సుందరబన్నులలో' బంగాళాఖాతములోని ఉత్తరభాగమునందు చాల చారిత్రక సంఘటనలు జరిగినవి. ఈ ప్రదేశములు బుడతకీచులగు ఓడ దొంగలకు స్థానము. అరకాన్ రాజు ఈ ప్రదేశము నాక్రమించు కొనుటకు బహుప్రయత్నములు గావించెను. మొగలుచక్రవర్తి ప్రతినిధి ఈ ఓడదొంగలను, వీరినాయకుడగు గాంజలెజును శిక్షించు టకు చాల ప్రయత్నించెను. ఇచ్చటనే క్రైస్తవులకు, మొగలులకు, మగ్గులకు, వంగీయులకుమధ్య అనేకయుద్ధములు జరిగెను.

బంగాళాఖాతము సాధారణముగా కల్లోలముగా నుండును. దీనికితోడు వర్షఋతువు. అందుచేత మా ఓడ కష్టముగా ప్రయాణించుచున్నది. కాని ఇదే మొదలు కాబట్టి దీనితరువాత ఏమి జరుగునో మాకేమియు తెలియదు. మేము మదరాసు వెళ్లుచున్నాముగదా. ఈ దక్షిణహిందూస్థానములో చాలభాగము మదరాసులో చేరినది. భూవైశాల్యములో నేమి కలదు? ఒకఎడారియైనను, ఒకఅదృష్టవంతునిచేతిలో అది స్వర్గముక్రింద మారవచ్చును. పూర్వము ఈ మద్రాసు వట్టికుగ్రామము. చెన్నపట్నమని, మద్రాసుపట్నమని దీనిని పిలిచెడివారు. చంద్రగిరిరాజు దీని నొక వర్తకుల కంపెనీ కమ్మెను. అప్పుడు ఇంగ్లీషువారు జావాలో వ్యాపారముచేయుచుండిరి. ఇంగ్లాండు యొక్క ఆసియా దేశపు వ్యాపారమునకు బాంటం కేంద్రస్థానముగా నుండెడిది. మద్రాసు, తక్కిన ఆంగ్లవ్యాపార కేంద్రములు బాంటంయొక్క అజమాయిషీలో నుండెడివి. ఇప్పు డా బాంటమేమైనదో! ఇప్పుడు మద్రాసు ఎంత పెరిగిపోయినది. "సాహసే లక్ష్మీః" అను మాట కొంతవఱకే సత్యము. దానికి తోడు జగజ్జననియొక్క అనుగ్రహముండవలెను. అయితే సాహసవంతులకే లోకమాత అట్టి అనుగ్రహము నొసంగునని యంగీకరింతును.

మద్రాసు దక్షిణభారతీయరాష్ట్రములకు నమూనా. కలకత్తాలోని జగన్నాథఘట్టములో మనకీ దక్షిణదేశపు ఛాయలు కన్పించును. అచ్చట మనకు నడినెత్తిన పిలక పెట్టించి, తలయంతయు ముండనముచేయించి ముఖముమీద గంధాక్షతలుమెత్తి, వ్రేళ్లుమాత్రమే దూరు ఇరుకుచెప్పులు తొడుగుకొని పొడుము ముక్కుతో నొప్పుచు పిల్లలఒడలంతయు గంధము పట్టించి తిరుగు ఒరిస్సాబ్రాహ్మణులు కన్పింతురుగదా. గుజరాతీ బ్రాహ్మణులు కాదనలుపు, మహారాష్ట్రబ్రాహ్మణులు చదరపుతల, పిల్లికండ్లు కలిగియుందురు. మంచిసొగసుగానుండువారు కొంకణబ్రాహ్మణులు.

వీరందఱు ఒకేవిధముగా వేషము ధరింతురు. అందఱు దక్షిణాది బ్రాహ్మణులని ప్రసిద్ధి. అయినను దక్షిణాది నమూనా బ్రాహ్మణుడు నీకు మద్రాసులోనే కన్పించును. అతనిముఖముమీద పెద్ద నామాలు చాల వైభవముగా ఉండును. ఉత్తరహిందూస్థానములో రామానందమతమువారు ఈ రామానుజ నామములను అనుసరింతురు. వంగదేశములో వైష్ణవులలో ఒడలంతయు భయంకరముగా నామములు పెట్టుకొందురు. తెలుగు, తమిళము, మళయాళము ఇచ్చటి భాషలు. వీనిని ఆఱుసంవత్సరములు విన్నను, వీనిలో నీకొక మాటగూడ అర్థముగాదు. వీనిలో 'ఇకార' 'దకార'ములయొక్క బహుభేదములు ధ్వనించుచుండును. ఆ బియ్యము, ఆ మిరియాల పప్పుచారు కలిసిన ఒక్కముద్ద మెల్లగా మ్రింగుము; నీ శక్తి ఎట్టిదో వ్యక్తమగును! కరివేపాకు, పొగుపు వగైరాలు కల అన్నములో పెరుగు కలిపి తినుట, నువ్వులనూనెతో తలంటిపోసికొనుట, నువ్వుల నూనెలో చేపలు వేయించుట,—వీనిని వదలిపెట్టి దక్షిణహిందుస్థానమును ఊహింపలేము.

మఱి దక్షిణహిందూదేశములోని మహనీయులకాలములోను అంతకంటె పూర్వమందును హిందూమతమును ఆచార్యులు రక్షించిరి. శ్రీశంకరాచార్యులు జన్మించినదచ్చటనే. ఆయన పుట్టినబ్రాహ్మణశాఖలో తలపై ముందుభాగమున పిలక పెట్టుకొందురు. కొబ్బరినూనె తిరుగమూతను వేసికొందురు. ఈదేశమునందే శ్రీరామానుజస్వామి పుట్టెను. శ్రీమధ్వమునిగూడ ఇచ్చటనే పుట్టెను. ఈ ముగ్గురినుండియే నవీన హిందూమతముద్భవించినది. చైతన్యుని వైష్ణవమతము పూర్వము మధ్వమతమునకు నకలు. ఉత్తరహిందూస్థానమున మత సంస్కర్తలగు కబీరు, దాదూ, నానక్, రాంసనేహీ వీరందఱు శంకరాచార్యునకు ప్రతిధ్వనులు మాత్రమే. ఉత్తరదేశమున శ్రీరామానుజుని శిష్యులు అయోధ్య మొదలగు ప్రదేశముల నాక్రమించుకొనిరి. ఈ దక్షిణాది బ్రాహ్మణులు

ఉత్తరాది బ్రాహ్మణులను నిజమైన బ్రాహ్మణులని అంగీకరింపరు. శిష్యులుగాకూడ నంగీకరింపరు. నిన్నటివఱకు వీరికి సన్యాసము గూడ నివ్వలేదు. ఈ మద్రాసు బ్రాహ్మణులు ఇప్పుడు గూడ మతములో ముఖ్యస్థానములు ఆక్రమించి కూర్చున్నారు. ఉత్తర దేశములో ప్రజలు మహమ్మదీయుల దండయాత్రలకు తాళుకొనలేక, ధన, మానములను, గృహదేవతలను ఆలుబిడ్డలను వదలి అరణ్యములలో దాగుకొనినరోజులలో, ఈ దక్షిణదేశములలో విద్యానగర సామ్రాజ్యము స్థిరపడినది. మహానుభావుడైన సాయనాచార్యుడు పుట్టిన దిచ్చటనే.* ఈయన భుజబలముచే మహమ్మదీయులు విజితులైరి. బుక్కరాయడు సింహాసనమున స్థాపింపబడెను. ఆయన బుద్ధిబలము విద్యానగర సామ్రాజ్యమునకు స్థైర్యము సంపాదించెను. ఆయన రాజ్యాంగతంత్రము దక్షిణదేశములో చిరశాంతిని, అభ్యుదయమును నెలకొల్పెను. ఆయన లోకోత్తరప్రతిభ అసాధారణకృషి సర్వవేదభాష్యములను నిర్మించెను. ఆయనత్యాగశక్తి, పరిశోధనాశక్తి కలిసి "పంచదశి"గా రూపొందినవి. ఆ విద్యారణ్యమునియే సాయనుడు. ఆయన దక్షిణదేశములో పుట్టెను. ఈ మద్రాసు రాష్ట్రములో తమిళు లెక్కువ. వీరి నాగరికత అతి ప్రాచీనమైనది. వీరిలో ఒక శాఖ సుమేరియనులు. వీరు చాల పురాతనకాలమున యూఫ్రేట్సు నది యొడ్డున తమ నాగరకతను వ్యాపింపజేసిరి. వీరి జ్యోతిషము, మతగ్రంథములు, నీతి, కర్మకాండలు మొదలైనవి ఆస్సీరియా, బాబిలోనియా నాగరికతలకు పునాదులు వైచినవి. వీరి పురాణ గాథలు క్రైస్తవుల బైబిలుకు మూలకందములు. ఈ తమిళులలోనే, మఱియొక శాఖ మలబారు తీరమున వ్యాపించి ఈ జిప్టు నాగరకతను వ్యాపింపజేసినది. ఈ తమిళులకు ఆర్యులెన్నోవిధముల ఋణ

---

* వేదములకు భాష్యము వ్రాసిన సాయనుడు విద్యారణ్యముని సోదరుడని కొందఱందురు.

పడియుండిరి. దక్షిణదేశమునందు వారు నిర్మించిన ఉన్నత దేవాలయములు వీరశైవ, వీరవైష్ణవ మతములకు పతాకప్రాయములు. హిందూదేశమునందలి ఈ గొప్పవైష్ణవమతమునకు ఒక తమిళ పంచముడు కర్త. అతనిపేరు శఠగోపుడు. అతడు చేటలు జల్లెడలు అమ్ముకొని జీవించెడివాడు. అయినను మహాయోగి. ఈ తమిళ ఆళ్వారులన్న వైష్ణవులందఱికి విపరీతమైన గౌరవము. ఇప్పటికిని ఇతర ప్రదేశములలోకంటె దక్షిణదేశములోనే ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు మిక్కుటముగా వ్యాసంగము చేయబడుచున్నవి. తక్కిన ప్రదేశములలోకంటె ఇచ్చటనే మత విషయములందు శ్రద్ధ ఎక్కువ.

జూన్ 24-వ తేదీ రాత్రి మా ఓడ మద్రాసు చేరినది. ఉదయము నిద్రలేవగానే మద్రాసు రేవులో ఉన్నట్లు నేను గుర్తించితిని. రేవులో నీరు నిశ్చలముగానున్నది. కాని బయట ఉత్తుంగ తరంగములు గర్జించుచున్నవి. అప్పుడప్పుడు ఆ తరంగములు రేవు గోడకు కొట్టుకొనుచున్నవి. పదునైదు ఇరువది యడుగుల ఎత్తు లేచి, నురుగులు గ్రక్కుచున్నవి. రేవుకుముందు మద్రాసులో ప్రసిద్ధమైన స్ట్రాండురోడ్డున్నది. ఇద్దఱు తెల్లజాతి పోలీసు ఇనస్పెక్టర్లు, ఒక మద్రాసీ జమేదారు, ఒక డజనుమంది పోలీసు వాండ్రు, ఓడమీదకువచ్చి చాలమర్యాదగా తెల్లవారికే ఓడ దిగుటకు అనుమతి ఇచ్చిరనియు, నాటువాండ్ర ననుమతింపరనియు చెప్పిరి. నాటువాడు ఎంత గొప్పవాడైనను అతనికి కొన్ని మురికి అలవాట్లుండును. అందుచేత అతడు ప్లేగుక్రిములను వ్యాపింపచేయవచ్చునను సందేహము కలదు. కాని మద్రాసు ప్రజలు నాకు ప్రత్యేకముగా అనుమతి కోరిరి. వారికి అనుమతి రావచ్చును. నెమ్మదినెమ్మదిగా కొంతమంది మద్రాసు స్నేహితులు పడవల మీద చిన్న చిన్న గుంపులుగా మా ఓడవద్దకు రాసాగిరి. కాని, వారు మమ్ము కలిసికొనరాదని నిషేధమున్నది. అందుచేత కొంచెము దూరములో ఓడలోనుండి వారితో మేము మాట్లాడవలెను.

నా స్నేహితులందఱు వచ్చిరి. అలసింగ, బిలిగిరి, నరసింహాచారి, నంజుండరావు, కిడ్డి మొదలైన వారు అందఱు పడవలమీదవచ్చిరి. తట్టలతో మామిడిపండ్లు, అరటిపండ్లు, కొబ్బరికాయలు, అన్నము, పెరుగు, మిఠాయి, పిండివంటకములు మొదలైన వన్నియు వచ్చి పడుచున్నవి. క్రమముగా గుంపు పెరిగినది. స్త్రీ, పురుషులు, బాలురు పడవలనిండ ఎక్కివచ్చిరి. మద్రాసులో బారిస్టరుగా పని చేయుచున్న కేమియరు అను ఆంగ్లేయస్నేహితుడుగూడ వచ్చెను. రామకృష్ణానందుడు, నిర్భయానందుడు కొన్నిసార్లు దగ్గఱగా వచ్చిరి. అంత ఎండలో రోజంతయు ఇట్లే పడవలపైనుండి మాట్లాడదమని పట్టుపట్టిరి. నేను కూకలువేయగా వారు చివరకు ఆపూనికను మానుకొనిరి. నన్ను క్రిందకు దిగుటకు అనుమతించరే దనువార్త పట్టణములో వ్యాపించగనే పడవలసంఖ్య పెరుగ సాగినది. ఓడపై కట్టలను ఆనుకొని నిలుచుండుటచే నేను బాగుగా అలసిపోయితిని. అందువల్ల నేను నా మద్రాసు స్నేహితులందఱకు సెలవుచెప్పి నాగదిలోనికేగితిని. "బ్రహ్మవాదిన్" పత్రికనుగుఱించి మద్రాసులో చేయవలసిన పనులనుగుఱించి అలసింగకు చెప్పుటకు సమయము చిక్కలేదు. అందుచేత అతడు నాతో కొలంబోవఱకు ప్రయాణించుటకు సిద్ధపడినాడు. ఓడ సాయంకాలమున రేవునుండి బయలుదేరెను. బయట ఒక పెద్ద కేకను విని నేను నాగదికిటికీ నుండి తొంగి చూచితిని. ఒక వేయిమంది మద్రాసీయులు, స్త్రీలు, పురుషులు, బాలురు, ఓడ గోడలమీద కూర్చుండి వీడ్కోలు కేకలు వేయుచుండిరి. సంతోషసమయమున వంగీయు లకువలెనే మద్రాసీయులుకూడ 'హుర్రా!' యని కేకలు వేయుదురు.

మద్రాసు నుండి లంకకు పోవుటకు నాలుగు దినములు పట్టినది. ఉవ్వెత్తు తరంగములు లేచుట గంగానది ముఖద్వారము నుండి ప్రారంభమయినది. పోయినకొలది ఈ తరంగములు పెరుగ సాగినవి. మద్రాసు వీడినతర్వాత ఈ తరంగములు మఱియు

పెరుగసాగినవి. మా ఓడ కష్టముగా నడచుచుండెను. ప్రయాణీకు లందఱు సముద్రప్రయాణపు జబ్బుపడిరి. ఇద్దఱు వంగదేశ బాలురు కూడ జబ్బుపడిరి. అందులో ఒకడు తాను నిశ్చయముగ చని పోవుదునని గోలపెట్టెను. మిక్కిలి కష్టముతో వానిని మేము ఊరార్పవలసి వచ్చెను. "నాయనా! నీవు భయపడవలసిన అవసరమే మియులేదు. ఇది సామాన్యముగా అందఱికి వచ్చుజబ్బే. దీనితో ఎవడు చావలేదు" అని వారిలో నొకొక్కరిని నచ్చచెప్పితిమి. రెండవతరగతి సరిగా ఓడ యొక్క 'స్క్రూ'మీద నున్నది. ఈ ఇద్దరు కుఱ్ఱవాండ్రు నాటువారైనందున ఒక చీకటిగదిని వీరి కిచ్చిరి. అచ్చటకు గాలిగాని వెలుతురుగానిరాదు. అందుచేత ఆ పిల్లవాండ్రిద్దఱు అందులో నుండలేకపోయిరి. 'డెక్కు'మీద ఓడ ఊపు ఎక్కువగానున్నది. ఓడ ముందుభాగమున తరంగములు లేచిన పల్లములో ప్రవేశించి ముందుకు వంగగా వెనుక భాగము బాగుగాపైకి లేచినది. ఓడ ముందటిభాగము కేవలము గాలి లోనికి లేచి పోయినది. ఊపు ఎక్కువైనప్పుడు ఓడ అంతకు విపరీతమైన సంచలనము కలిగినది. రెండవతరగతి యంతయు పిల్లిచేతులలోబడిన ఎలుకవలె గిజగిజ లాడిపోయినది.

ఏమైనప్పటికి ఇది వర్షర్తువు. ఓడ పశ్చిమదిక్కుగా నడచినకొలది తుపానుగాలి ఎక్కువగును. మద్రాసు స్నేహితులు సమృద్ధిగా పండ్లు ఇచ్చిరి. అందులో చాలభాగము కొంతమితాయి, అన్నము, పెరుగు మొదలైనవానిని ఈ ఇద్దఱు కుఱ్ఱవాండ్రకు ఇచ్చితిని. అలసింగ తొందర తొందరగా టిక్కట్టుకొని కాళ్ళకు చెప్పులులేకుండ ఓడ నెక్కినాడు. అతడప్పుడప్పుడు చెప్పులు తొడుగుకొనునట. బహుదేశములలో అభ్యాసములు బహువిధ ములుగానుండును. పాశ్చాత్యదేశములందు స్త్రీలు, చెప్పులు తొడుగుకొనకపోవుట చాల సిగ్గుచేటు. కాని వారు వారిరొమ్మును సగమువరకు అనాచ్ఛాదితముగా నుంచుటకు సిగ్గుపడరు. కాని మనదేశములో తలకు మేలిముసుగు ఉండితీరవలెను. తక్కిన

శరీరము సుష్ఠుగా నాచ్ఛాదితమైనను, కాకపోయినను అంతపట్టింపు లేదు. "బ్రహ్మవాదిన్" సంపాదకుడగు అలసింగ రామానుజ మతస్థుడు. మైసూరు బ్రాహ్మణుడు. అతనికి 'రసము' పై మిక్కిలి ప్రీతికలదు. వానితల నున్నగా క్షౌరము చేయబడియుండును. అతడు ముఖముపై తెంగల పద్ధతిని నామములు పెట్టును. అతడు మిక్కిలి జాగరూకతతో ప్రయాణపుబత్తెముకొఱకు రెండు మూటలు దెచ్చెను. ఒక మూటలో వేయించిన అటుకులు, ఇంకొకదానిలో మురమురాలు, వేయించిన వేరుశనగపప్పు ఉన్నవి. లంకకు చేరు నంతవఱకు ఇవి తినియుండవచ్చునని అతనియూహ. అప్పుడతనికి బ్రాహ్మణీకము పోదు. ఇంతకుపూర్వ మొకతూరి అలసింగ లంకకు వెళ్ళియుండెను. అప్పుడు అతని కులమువారు అతనిని వెలి వేయుటకు ప్రయత్నించిరి. కాని లాభము లేకపోయెను. హిందూ దేశమునందు ఈ వర్ణపద్ధతిలో ఇది ఒక మేలు. వాడు చేసినపనికి వాని కులములోని జనులు అభ్యంతరము పెట్టకపోయినచో తక్కిన వారు ఏమియు చేయలేరు. మఱి దక్షిణ హిందూస్థానములోని కులములమాట? కొన్ని కులములలో ఐదువందలమంది, కొన్ని టిలో ఏడువందలమంది వేయిమంది కంటె ఎక్కువ ఉండరు. వారిలో వారికి వివాహములకు కన్యలుకావలసి వచ్చినపుడు మేన గోడంద్రనుగూడ చేసికొందురు. అంత సన్నిహిత సంబంధ ములు చేసికొనెడువారు తక్కువ జనసంఖ్యగల కులములవారు. మైసూరులో మొదట రైలుమార్గములు వేసినపుడు రైలును చూచుటకు వచ్చిన దూరదేశపు బ్రాహ్మణులను వారి కులమువారు వెలివేసిరట! ఏమైనను అలసింగు వంటివారు లోకములో చాల అరుదుగా నుందురు. అతడంత నిస్స్వార్థుడు. అంత కార్యతత్పరుడు, అంతగురుభక్తిగలవాడు, అంత వినయవంతుడైన శిష్యుడు లోక ములో నరుదుగానుండును. జన్మచేత అతడు మద్రాసీయుడు. నెత్తి మీదపిలకబెట్టి తక్కినతల ముండనముచేయించుకొనును. కాళ్ళకు చెప్పులుండవు. అతడు ధోవతికట్టుకొనును. మొదటితరగతి టిక్కట్టు

తీసికొనినాడు. అప్పుడప్పుడు డెక్కుమీద అతడు పచారు చేయును. ఆకలి వేసినపుడు మురమురాలు, వేరుశనగపప్పు నమలును. ఓడలోని సేవకులు మద్రాసీయులనందఱను చెట్టియార్లనుకొందురు. వారు మహాధనవంతులనియు, ఒక దమ్మిడీయైన తిండికొఱకు, వేషము కొఱకు ఖర్చుపెట్టరని చెప్పుదురు. కాని ఈ సేవకులందఱు, అలసింగు మాతో కలియుటవలన అతని బ్రాహ్మణత్వము చెడిపోయినదనుకొనినారు. అది నిజమే. మనతో కలసినందువలన మద్రాసీయులు వారి వర్ణనియమములను కొన్నిటిని పోగొట్టుకొందురు.

అలసింగకు సముద్రపుజ్వరమురాలేదు. సోదరుడు తురీయానందుడు మొదట కొంచెము సుస్తీపడెను. కాని ఇప్పుడు బాగుగనే యున్నాడు. అందుచేత ఈ నాల్గుదినములు బహువిధములైన మధురసంభాషణలతో, కబుర్లతో గడచినవి. మా ముందిప్పుడు కొలంబో యున్నది. ఇదే సింహళద్వీపము. శ్రీరామచంద్రుడు ధనుష్కోటినుండి ఇంతవఱకు వారధికట్టి రావణుని జయించెను. నే నా వారధిని చూచితిని. రామ్నాడుప్రభువైన సేతుపతిమహారాజు ప్రాసాదములో శ్రీరామచంద్రుడు ఈ మహారాజు పూర్వీకుని సేతుపతిగా పట్టముగట్టి, ప్రసాదించిన శిలాఫలకము చూచితిని. కాని ఈదినములలో సింహళములోని బౌద్ధులు దీని నొప్పుకొనరు. వారిదేశములో దీనిని సూచించు సంప్రదాయ మేదియు లేదని వారు చెప్పుదురు. వారి నిరాకరణతో మనకేమిపని? మన పూర్వగ్రంథములు ఈ విషయమున పరమప్రమాణములు గదా. మఱి వారిదేశమున సింహళమును లంక * యనరు. లంక యని ఎట్లందురు? వారిమాటలో, వారిపనిలో, వారిస్వభావములో, వారిఆకారములో చుఱుకుదనములేదు. వారు గౌనులు తొడుగుకొందురు. జుట్టు ముడివేసికొందురు. అందులో పెద్ద

* వంగభాషలో లంక యనగా మిరపకాయ.

దు న్వైన పెట్టుకొందురు. వట్టి ఆడంగి యలవాట్లుగల మనుష్యులు. వారు స్త్రీలవలెనే సన్నగా పొట్టిగా మృదువుగా నుందురు. అట్టి వారా రావణ కుంభకర్ణుల సంతానము! ఏమాత్రము కారు. వారు వంగ దేశమునుండి వలసవచ్చినట్లు ఒకప్రవాదమున్నది. అది నిజమే యైయుండవచ్చును. ఇప్పుడు వంగదేశములో ఎదుగు చున్న క్రొత్తరకపు జనము స్త్రైణమైన వేషములతో, మృదువైన, సుస్నితమైన ఉచ్చారణతో, మందమందములగు నడకలతో ముఖము మూడలేని సిగ్గుచూపులతో, పుట్టినప్పటినుండి ప్రేమగీతములు వ్రాయుచు ప్రియుల విరహమువలన బాధ పడుచున్న జనులు ఉన్నారు. వీరందఱు ఇప్పుడు సింహళమున కెందుకు పోగూడదు? వారివంటివారు ఇప్పుడెక్కడున్నారు? మన ప్రభుత్వము నిద్రపోవుచున్నదా? నిన్న మొన్న పూరీలో కొంత మంది జనులను పట్టుకొనుటకు ఒక పెద్ద దెబ్బలాట లేవదీసినారు. ముఖ్యపట్టణములోనే పట్టుకొని పైకి పంపదగిన వారెంతమంది లేరు?

ఒక వంగరాజకుమారుడుండెనట. అతడు దుర్మార్గుడు. తనతండ్రితో పోట్లాడినాడు. తనవంటివారిని కొంతమందిని కూర్చుకొని సింహళమునకు వచ్చెనట. అప్పుడు సింహళమునందు కొంతమంది అడవిజాతివారుండెడివారట. వారినిపుడు బిదోయును లందురు. ఆ అడవిజాతివాండ్ర రాజు ఈ రాజకుమారునెంతో మర్యాదచేసి తనకుమార్తెనిచ్చి పెండ్లిచేసెను. ఈ రాజకుమారుడు కొంతకాలమచటనుండి తనభార్యతో కుట్రచేసి ఒకరాత్రివేళ కొంతమందితోసహా రాజును, అతని సరదారులను చంపెను. ఇతనిపేరు విజయసింహుడు. ఇతడు మామనుచంపి సింహాసనమధిష్ఠించెను. ఇంతటితో ఇతనిదౌష్ట్య మాగలేదు. తరువాత కొంత కాలమునకు ఆ సింహళపుభార్యమీద విసుగుపుట్టి, హిందూదేశము నుండి కొందఱు స్త్రీపురుషులను, యువతులను తీసికొనివచ్చినాడు. అనూరాధ యను నామెను వివాహమాడెను. ఆ దేశపు బాలలను

వదలివేసెను. పిమ్మట ఆ కొండజాతిప్రజలను నాశనముచేయుట కారంభించెను. ఏ కొలదిమందో మృత్యువునుండి తప్పించుకొనగల్గిరి. వారిప్పుడు అరణ్యములలో అచ్చటచ్చట కనిపించుచుండిరి. ఈ విధముగా లంక సింహళముగా మాఱిపోయినది. అది మొదట వంగదేశపు దుండగుల వలసగా ప్రారంభమయ్యెను.

కాలాంతరమున అశోకచక్రవర్తి పరిపాలించుచున్నపుడు అతడు తనకుమారుడగు మహేంద్రుని, తన కుమార్తెయగు సంఘమిత్రను సింహళమునకు మత ప్రచారకులుగా పంపెను. వీరిద్దఱు సన్యాసులు, ఇక్కడకు వచ్చినతర్వాత ఇచ్చటి జనులందఱు అనాగరికులుగా నుండుట వారు గమనించిరి. వారు జీవితమంతయు కష్టించి మరల వారిని నాగరకులుగా సేయుటకు సకలవిధముల ప్రయత్నించిరి. వారు అనేక నీతిసూత్రములను రచించి, వారినందఱిని బౌద్ధ మతములోనికి మార్చిరి. శీఘ్రముగా సింహళీయులందఱు పరమ బౌద్ధులయిరి. ఒక పెద్ద పట్టణమును దేశముయొక్కమధ్య నిర్మించి దానికి అనూరాధపురమని పేరిడిరి. ఈ పట్టణముయొక్క శిథిలములను చూచినవారు ఇప్పటికిని ఆశ్చర్యపడుదురు. పెద్ద స్తూపములు, మైళ్లకొలది విస్తరించి యున్న శిథిలములైన రాతికట్టడములు ఈ నాటికిని నిలచియున్నవి. ఈ పట్టణములో చాలభాగమున ఇప్పుడు అడవి పెరిగినది. ఈ అడవియంతయు ఇప్పటికిని కొట్టివేయబడలేదు. తలలు బోడులైన సన్న్యాసులు, సన్న్యాసినులు, పచ్చని బురఖాలు ధరించి చేతులతో భిక్షాపాత్రలు పట్టుకొని సింహళదేశమంతయు వ్యాపించిరి. పెద్ద దేవాలయములు, ధ్యానమగ్నులైన బుద్ధునివిగ్రహములు కలవు. బుద్ధుడు, ధర్మబోధచేయుచున్నట్లున్న విగ్రహములు కొన్ని కలవు. కొన్ని బుద్ధుడు పండు కొన్నట్లున్నవి. కొన్ని బుద్ధుడు నిర్వాణగతుడై యున్నట్లున్నవి. ఇట్టి విగ్రహములతో పెద్దపెద్ద దేవాలయము లనేకములు వెలసినవి. దేవాలయముల గోడలమీద ఈసింహళీయులు నరక దృశ్యములు కొన్ని చిత్రించిరి. మనుష్య

లను పిశాచములు బాధుచున్నట్లు, అంపములతో కోయుచున్నట్లు, తగలబెట్టుచున్నట్లు, నూనె కాగులో వేయించుచున్నట్లు, చర్మముల నొలుచుచున్నట్లు—ఇటువంటి ఘోరదృశ్యములను చిత్రించిరి. ఇట్లు చిత్రించుట వట్టి ఆకతాయితనము. 'అహింసా పరమోధర్మః' యని చెప్పిన బౌద్ధమతమున ఇట్టి ఘోరదృశ్యములకు తావు ఎట్లుండును? చైనా, జపాను దేశములందుగూడ దేవాలయములందు ఇట్టి చిత్రములే మనకు కన్పించును. సిద్ధాంతముగా అహింసనుగుఱించి వారు ప్రచారము చేసినను, చూచుటకు ఘోరమైన శిక్షావిధానము అమలులోనున్నది. ఈ అహింసావాదుల తెగకు చెందిన ఒకవ్యక్తి ఇంటిలో ఒకతూరి ఒకదొంగ పడెను. ఆ ఇంటిలోని నౌకర్లు ఆ దొంగను పట్టుకొని చితుకబాదుచుండిరి. ఈ గోల విని ఆ ఇంటియజమానుడు పైనున్న వసారామీదకువచ్చి విషయము తెలిసికొని "ఆగుడు! వానిని కొట్టకుడు. అహింస చాల గొప్పధర్మము" అని కేకలు పెట్టెను. ఈ అనుభూతిలేనిఅహింసావాదులు కొట్టుట నాపి "ఈ దొంగను ఏమిచేయుమందు"రని యడిగిరి. యజమాను డిట్లని నాడు: "వాని నొకసంచిలో గట్టివేసి నీటిలో పాఱవేయుడు. ఆ దొంగ ఈ విధమైన దాక్షిణ్యమునకు కృతజ్ఞుడై చేతులు జోడించి "అయ్యగారి దయ ఎంత గొప్పది!" అనినాడు. బౌద్ధులు ప్రశాంతులనియు, సర్వమతసహనముకలవారనియు నేను వింటిని. బౌద్ధప్రచారకులు కలకత్తాకువచ్చి మన మెంత మర్యాదచేసినను, తూచితూచి ప్రయోగించిన విశేషణములతో మనలను నిందింతురు. ఒకప్పుడు అనూరాధపురములో హిందువులముోల నేను ఉపన్యసించుచుంటిని. అందులో బౌద్ధులెవ్వరును లేరు. ఆ యుపన్యాసము ఏర్పాటుచేసినది ఎవరి ఇంటిలోనుగాదు. ఒక పెద్ద మైదానమునందు. అది ఎవరిసొత్తుగాదు. అచ్చటకు పలువురు బౌద్ధసన్న్యాసులు, ఇతరులు, స్త్రీపురుషులు, పెద్దగుంపుగా డప్పులు, తాళములు మ్రోగించుకొనుచువచ్చి పెద్దగోలచేసిరి. సభ విరమింప

వలసివచ్చెను. లేనిచో పెద్దరక్తపాతము జరుగు ప్రమాదము సంభవించెడిది. కాని నేను మిక్కిలి కష్టముతో హిందువులందఱిని "అయ్యలారా! ఆ బౌద్ధులు ఆచరణలో పెట్టక పోయినను, మనమైన అహింసను కొంత యాచరింపవలె"నని శాంతపఱచితిని. అప్పుడు ఆ పరిస్థితి శాంతించినది.

క్రమముగా తమిళ హిందువులు సింహళములోనికి వలస రానారంభించిరి. బౌద్ధులు కొన్ని విపరీతపరిస్థితులవలన వారి ముఖ్యపట్టణమును వదలి ఒకగిరిదుర్గమును కట్టుకొని దానికి 'కంది' యని పేరిడిరి. కొంతకాలము పిమ్మట తమిళులు దానినికూడ నాక్రమించి ఒకహిందూరాజును స్థాపించిరి. తరువాత పాశ్చాత్యులు గుంపులుగుంపులుగా రానారంభించిరి. స్పెయినుదేశీయులు, బుడతకీచులు, డచ్చివారు, ఆంగ్లేయులు వచ్చిరి. చివరకు ఆంగ్లేయులు రాజులైరి. కందిరాజ్యకుటుంబము తంజావూరునకు పంపబడెను. వారికి భరణము ఏర్పాటుచేసిరి. ఒకవిధమైన తమిళఫలాహారముపై వారాధారపడెదరు.

ఉత్తర సింహళములో హిందువు లెక్కువమందియున్నారు. దక్షిణభాగములో మాత్రము, సంకరజాతికిచెందిన యురేషియనులు బహు తరగతులజనులు ఎక్కువమంది కలరు. బౌద్ధుల ప్రధానస్థానము కొలంబో—ఇప్పటి ముఖ్యపట్టణము. హిందువుల ప్రధానస్థానము జాఫ్నా. కులభేదములు ఇచ్చట భారతదేశములో నున్నంత గాఢముగాలేవు. బౌద్ధులలోగూడ వివాహమునకు సంబంధించినంతవఱకు ఏవో కొన్ని భేదములున్నవి. భోజనవిషయమున నీ భేదములు లేవు. హిందువులలో భోజనవిషయమునకూడ నీ భేదముకలదు కదా. సింహళములో నున్న కసాయివాండ్రందఱు పూర్వము బౌద్ధులే! బౌద్ధమత పునరుజ్జీవనము తరువాత వీరిసంఖ్య తగ్గుచున్నది. బౌద్ధులలోనధికులుఆంగ్లాభ్యాసములనలవఱచుకొనిరి. వారి బిరుదులను దేశీయముగా నిపుడు మార్చుకొనుచున్నారు.

హిందూకులములన్నియు ఒకే హిందూకులముగా నేర్పడి పంజాబు లోని జాట్లలోవలె పరస్పర వివాహములుచేసికొనుచున్నారు. వివాహవిషయమున వధువు ఐరోపీయురాలైనను బాధలేదు. కుర్ర వాడు దేవాలయములోనికి బోయి ముఖమున త్రిపుండ్రములు ధరించి శివనామము నుచ్చరించి హిందువగును. భర్త హిందు వైనను, భార్య క్రైస్తవురాలు కావచ్చును. ఒకక్రైస్తవుడు హిందు వుగా మాఱవలెనన్నచో ముఖమున కొంచెము బూది రాచుకొని "నమః పార్వతీ పతీ!" యనిన చాలును. క్రైస్తవ మిషనరీలకు ఇది చాల కోపకారణమయ్యెను. సింహళములోనికి వచ్చిన తరువాత చాలమంది క్రైస్తవులు నుదుట విభూతి ధరించి శివ నామోచ్చారణముతో హిందువులైరి. ఈ హిందువులలో అద్వైత వాదము, వీరశైవవాదము ముఖ్యములైన మతములు. 'హిందు' అనుమాటకు బదులు 'శైవు'డన్నమాట ఎక్కువవాడుకలో నున్నది. భజనసంకీర్తనములను శ్రీచైతన్యుడు వంగదేశమున ప్రవేశపెట్టెను. కాని అది పుట్టినది తమిళదేశమునందు. సింహళ దేశములో పరిశుద్ధమైన తమిళము మాట్లాడుదురు. ఆదేశపు తమిళముగూడ అచ్చమైన తమిళము. ఒక లక్షమంది ఆనంద మగ్నులై శివసంకీర్తనములు చేయుట ఒక వేయి మృదంగములు మ్రోగుట చూడదగినదృశ్యములు. పెద్దపెద్ద తాళముల శబ్దములు ప్రతిధ్వనించును. ఎఱ్ఱని కళ్ళతో, పుష్టికలిగిన శరీరము లతో, ముఖమున, ఒడలినిండ వెలయు బూదిపూతలతో, మెడలో, నొప్పు రుద్రాక్షమాలలతో మహాభక్తుడైన హనుమంతునివలె ఒడ లెఱుగని శివముతో నృత్యముచేయు ఈ తమిళజనులను గుఱించి "నీవు వీరిని చూడకుండ ఇట్లుందురని యనుకొనలేవు."

కొలంబోలోని మా స్నేహితులు మాకు దిగుటకు అనుమతిని పొందిరి. మేము దిగి మా స్నేహితులను కలిసికొంటిమి. హిందు వులలో చాలాప్రధానుడు సర్ కుమారస్వామి. ఆయనభార్య ఒకఆంగ్లయువతి. ఆయనకుమారుడు కాళ్లకు చెప్పులు ధరించడు.

ముఖమున విభూతిధరించును. అరుణాచలము, మఱికొంతమంది స్నేహితులు మమ్ముచూచుటకు వచ్చిరి. చాలకాలము తరువాత మరల నేను "ఒకవిధమైన తమిళఫలాహారము"తో పెద్దకొబ్బరికాయను తింటిని. కొన్నికొబ్బరిబొండములు, వారు నా యొడగదిలో పెట్టిరి. నేను మిసెస్ హిగ్గిన్సును చూచితిని. ఆమె బౌద్ధబాలికలకు ఏర్పాటుచేసిన భోజనాదిసదుపాయములుకల్గిన పాఠశాలను చూచితిని. మాపాత స్నేహితురాలైన కానోవారారాణి పెట్టించిన మఠమును, పాఠశాలనుచూచితిని. మిసెస్ హిగ్గిన్సు ఇంటికంటె కానోవారారాణి ఇల్లే ఎక్కువ విశాలముగా ఎక్కువ సౌకర్యములతో కూడియున్నది. రాణి తనసొంతడబ్బు ఖర్చుపెట్టినది. మిసెస్ హిగ్గిన్సు చందాలు వసూలుచేసినది. రాణి వంగదేశపుస్త్రీలు చీరకట్టుకొన్నట్లు ఒక కాషాయవస్త్రమును కట్టుకొనెను. సింహళ బౌద్ధులు ఇట్టి వేషధారణమునకు మిక్కిలి వ్యామోహపడుదురు. వంగదేశపు చీరలనుకట్టుకొని బండ్లపై నెక్కిన స్త్రీ లనేకమందిని నేను చూచితిని.

బౌద్ధుల ప్రధాన యాత్రాస్థలము 'దలాదమాలిగవ' లేక దంత దేవాలయము. ఇది కందీలోనున్నది. ఈ దేవాలయమునందు బుద్ధుని దంతమున్నది. ఈ దంతము మొదట పూరీ జగన్నాథ దేవాలయములో నుండెడిది. తరువాత చాల చేతులు మాఱి సింహళము చేరినది. ఇచ్చటకూడ ఈ దంతమునుగుఱించి చాల తగాదాలు బయలుదేరినవని సింహళీయులు చెప్పిరి. ఇప్పుడీ దంతము భద్రముగానున్నది. సింహళీయులు చారిత్రక లిఖితములు పెక్కింటిని భద్రపఱచిరి; అవి కాకమ్మ పిచికమ్మ కథలు మాత్రము కావు. పురాతన మాగధి భాషలో వ్రాసిన బౌద్ధమతగ్రంథములుకూడ చక్కగా భద్రపఱచిరి. సింహళమునుండి బౌద్ధమతము బర్మా, సయాం మొదలగు దేశములకు వ్యాపించినది. సింహళ బౌద్ధులు వారి మతగ్రంథములలో ఉదాహరింపబడిన శాక్యముని నొక్కనిని మాత్రమే ఒప్పు

కొందురు. ఆయన సిద్ధాంతములను అనుసరించుటకు ప్రయత్నింతురు. నేపాలు, సిక్కిము, భూటాను, లడఖ్, చైనా, జపాను దేశములలోవలె శివుని వారు ఆరాధింపరు. తారాదేవి మొదలైన దేవతలనుకాని, మంత్రములనుగాని వారెఱుగరు. కాని వారికి భూతావేశము మొదలైనవానిలో నమ్మకమున్నది. బౌద్ధులు రెండు తెగల క్రింద చీలిపోయిరి. ఒకటి ఉత్తరాది తెగ: రెండవది దక్షిణాది తెగ. ఉత్తరాదివారు మహాయానులమని చెప్పుకొందురు. దక్షిణాది తెగలో సింహాళీయులు, బర్మాదేశీయులు, సయాము దేశస్థులై యున్నారు. వీరందఱు హీనయానులు. మహాయానులు బుద్ధునినామమాత్రముగా నారాధింతురు. వారి ఆరాధనమంతయు తారాదేవి, అవలోకితేశ్వరులను గుఱించినది. జపానువారు, చైనావారు, కొరియాదేశస్థులు అవలోకితేశ్వరుని 'నాన్ ఇన్' అందురు. మహాయానమతమునందు మంత్రతంత్రములు గలవు. టిబెట్టు దేశీయులు శివుని నిజమైన ప్రమథగణము. వారందఱు హిందూ దేవతలను ఆరాధింతురు. డమరుకమును వాయింతురు. కపాలమును భద్రపఱతురు. మృతులైన సన్న్యాసుల బొమికలతో చేసిన బూరాల నూదుదురు. మద్యమాంసములు సేవింతురు. దయ్యములను, భూతములను ప్రయోగింతురు. మంత్రముల నుచ్చరించి రోగములను నయముచేయుదురు. చీనా, జపానుదేశములలో దేవాలయముల కుడ్యములపై పెద్దగిల్టుగల ఏకాక్షరములను నేను చూచితిని. ఇవి వంగభాషాక్షరములకు చాల దగ్గఱ పోలికతో నుండును.

అలసింగ కొలంబోనుండి మద్రాసుకు తిరిగి వెళ్లెను. మేము మఱల ఓడ నెక్కితిమి. కుమారస్వామితోటలో కొన్ని నిమ్మకాయలు, నల్లకొబ్బరికాయలు, రెండు పానకపు సీసాలు మొదలైనవి మిత్రులు మాకు బహుమానించిరి.

భగవంతుడైన కార్త్తికేయునకు బహునామములున్నవి: సుబ్రహ్మణ్యుడు, కుమారస్వామి మొదలైనవి. దక్షిణ

దేశమున కార్తికేయుని ఆరాధన ఎక్కువ. కార్తికేయుడు ఓంకారము యొక్క అవతారమట. ఆ దైవముపేరు కుమారస్వామి.

జూన్ 25 వ తారీఖున ఉదయమున మాయోడ కొలంబోనుండి బయలుదేరెను. ఇప్పుడు వర్షర్తువు విజృంభించినది. ఈ పరిస్థితులను మేము ఎదుర్కొనవలెను. మాయోడ పోవుచున్నకొలది తుపాను పెరుగుచున్నది. గాలి పెనుమ్రోత పెట్టుచున్నది. ఎడతెగని వాన కురియుచున్నది. నలువైపుల కటికిచీకటి వ్యాపించియున్నది. ఓడ డెక్కమీదికి భయంకరనాదముతో సముద్రతరంగములుకొట్టుకొను చున్నవి. కావున డక్కమీద నిల్చుండుట కవకాశ మేమాత్రము లేదు. భోజనముచేయు బల్లను చిన్నచిన్న చదరములుగా కొయ్య ముక్కలతో అచటివారు ఏర్పాటుచేసిరి. ఆ కొయ్యచట్రములలో తినుబండారములు పైకి ఎగురుచున్నవి. ఓడ పగులుచున్న దేమో యన్నట్లు కిఱ్ఱుచప్పుడు చేయుచున్నది. కెప్టెన్ ఇట్లనినాడు: "ఈ సంవత్సరపు వర్షర్తువు పూర్వమెన్నడును లేనంత ఉధృత ముగానున్నది." కెప్టెన్ చాల సరదామనిషి. చైనాసముద్రము లోను,హిందూసముద్రములోను పెక్కుసంవత్సరములు గడపినాడు. కబుర్లతో చాలసేపు శ్రోతలనుపట్టి ఉంచగలడు. కాకమ్మ,పిచ్చికమ్మ కథలు చెప్పుటలో చాల నేర్పుగలవాడు. ఓడదొంగలు, చైనా కూలీవాండ్రు, ఓడఅధికారులను చంపి, ఓడనంతయు దోచుకొని తప్పించుకొనిపోయినకథ. అట్టివే మఱికొన్ని ఇతరకథలు ఎన్నెన్నో అతడు చెప్పుచుండెను. అప్పుడు చేయుటకు వేఱేమియు పనిలేదు. ఆ యోడలయూపులో చదువుట, వ్రాయుట ఏమాత్రము సాధ్య ముగాదు. గదిలో కూర్చుండుట బహుకష్టము. తరంగములు లోపలికి కొట్టునేమో యను భయముతో కిటికీలు మూసితిమి. ఒకరోజున తురీయానందుడు కిటికీరెక్క ఓరగా తెఱచెను. ఒక తరంగలేశము లోపలికికొట్టి గదినిపూర్తిగా జలమయముచేసినది. గదిలోపల నిట్లున్నదికదా! డెక్కమీదనున్న ఊపు ఇంత యని

వర్ణింప నెవరితరము ? ఇట్టిపరిస్థితులలో మా ఉద్బోధనపత్రిక పని కొంతవఱకు సాగుచున్నదని మీరు గుర్తుపెట్టుకొనవలెను.

మా ఓడలో ఇద్దఱు క్రైస్తవప్రయాణికులుండిరి. వారిలో నొకడు అమెరికాదేశీయుడు. కుటుంబముతోగూడ వచ్చినాడు. చాల మంచివాడు. అతనిపేరు బోగేష్. అతని పెండ్లియై ఏడేండ్లు అయినది. ఆర్గురు పిల్లలు పుట్టిరి. ఓడమీద పనివారు అది దైవాను గ్రహమందురు. కాని ఆ పిల్లలు మాత్రము అట్లనుకొనుట లేదు. అతనిభార్య డెక్కుమీద ఒక మురికిదుప్పటిపఱచి, వారిని దానిపై పరుండబెట్టి పోవుచుండెడిది. వారు ఒడలంతయు దుమ్ముకొట్టుకొని ఏడ్చుచు డెక్కుమీద దొర్లుచుండెడివారు. డెక్కుమీదనున్న ప్రయాణికులు భయపడుచుండెడివారు. డెక్కుమీద ఇష్టమువచ్చి నట్లు తిరిగెడివారుకారు. ఈ బోగేషు పిల్లలలో ఎవరినైన త్రొక్కుదుమేమో అని వారు భయపడుచుండిరి. వారు భార్యాభర్తలు చంటిపిల్లను ఒక చతురపు బుట్టలో పరుండబెట్టి కౌగలించుకొని ఒకమూల కూర్చుండెడివారు. ఈ ఐరోపీయ నాగరికతను మనము మెచ్చుకొనలేము. మనము వీథిలో గూర్చుండి ముఖము కడుగుకొన్నను పుక్కిలించి యుమిసినను అది యనాగరకమని వారనెదరు. ఈ పనులు ఇంటిలో చేసికొనవలయును. బాగుగనేయున్నది. నేను మిమ్ములను ఒక ప్రశ్న అడుగుదును. ఇట్లు పదిమందిలో కౌగలించుకొని కూర్చుండుట నాగరికమైన పనియేనా యని ప్రశ్న. ఇటువంటి నాగరకత వెంటబడి మీరందఱు పరువెత్తితిరి. మీరు ఒకప్రొటెస్టాంటు మతగురువును చూచినగాని ఈ ప్రొటస్టాంటు మతము ఉత్తర ఐరోపాకు చేసిన మేలు బోధపడదు. పదికోట్లమంది ఇంగ్లీషువారు చనిపోయినను వారి మతగురువులు బ్రతికిన చాలు. ఇరువది సంవత్సరములలో మరల పదికోట్లమంది పుట్టుకొనివత్తురు.

ఓడ ఇటు అటు కదలుటవలన చాలమంది తలనొప్పివలన బాధపడుచుండిరి. ఒక వ్యక్తితో ఆయన కూతురు, చిన్న

పిల్ల వచ్చినది. ఆమె పేరు టూటిల్. పాపము తల్లిపోయినదట. మన నివేదిత ఈటూటిల్‌కు ఆబోగేష్ పిల్లలకు తల్లియైనది. టూటిల్ తండ్రి మైసూరు తేయాకును, కాఫీ తోటలను పెంచెడి వాడు. ఆమె యచ్చటనే పెరిగినది. "అమ్మాయీ! బాగా యున్నావా?" యని ఆ పిల్లను అడిగితిని. ఆమె ఇట్లనినది: "ఈ బంగాళా అంత బాగుగాలేదు. ఊపు ఎక్కువగా నున్నది. నాకు కడుపు త్రిప్పుచున్నది." ఆమె యుద్దేశ్యములో ప్రతి ఓడకూడ బంగాళాయే! ఆబోగేష్ పిల్లలలో ఒకడు సుస్తీగా నున్నాడు. వారిని చూచువారులేరు. పాపము ఆ పసివారు దిన మంతయు డెక్కుమీద దొర్లుచునేయున్నారు. ఆ కెప్టెన్ ముసలి వాడు. అప్పుడప్పుడు తనగదిలో నుండి బయటికి వచ్చి, వాని నోటికి చిన్నగరిటితో సూపు (ఒక విధమైన రసము) పట్టుచుండెడి వాడు. వాని పీలకాళ్ళవంక చూచుచు "పాపము! ఎంతశుష్కించినాడు! పాపము ఎవరు చూచుటలేదు." అని ఆత డనువాడు.

చాలమంది జనులు శాశ్వతసౌఖ్యమును కోరుదురు. మఱి సౌఖ్యమనునది శాశ్వతమైనచో దుఃఖముకూడ శాశ్వతము గావలెను. కొంచెము ఆలోచించి చూడుడు. ఆ సందర్భములో 'ఎప్పటికైనను, మేము ఏడెనురేవుచేరుకొనగలుగుదుమా' యని అనుకొంటిమి. అదృష్టవశాత్తు సుఖదుఃఖములు శాశ్వతములుకావు. అందుచేత ఆఱురోజులలో పోవలసిన దూరమునకు పదునాలుగుదినములుపట్టినను ఇంత భయంకరమైన గాలివానలో రాత్రింబవళ్లు ప్రయాణము చేసి ఏడెను రేవు చేరితిమి. కొలంబోనుండి మేము ముందుకు పోవుచున్నకొలది తుపాను, వర్షము అధికము కాజొచ్చినవి. ఆకసమంతయు ఒకపెద్దచెరువైపోయినది. గాలి భయంకరముగా వీవదొడగినది. తరంగములు ఉవ్వెత్తుగ లేచుచున్నవి. ఓడ ఒక అడుగు ముందుకు పోవుటకు మిగుల కష్టముగా నుండెను. అంత గాలిలో ఆతరంగముల కెదురుగా నడచుటలో ఓడయొక్క వేగమంతయు మందగించినది. మేము సాకోత్రాదీవిని సమీపించి

తిమి. అచ్చట గాలివాన ఘోరముగా నున్నది. కెప్టెన్ అది ఋతుపవనములకు కేంద్రమనియు, దీనిని మనము దాటగల్గినచో ప్రశాంతవాతావరణములోనికి పోగల్గుదుమనియు చెప్పినాడు. అట్లే జరిగినది. ఇంతటితో ఈ దారుణహృదయపీడనము అంత మైనది.

8 వ తేదీ సాయంత్రము మేము ఏడెను చేరితిమి. తెల్లవాడు గాని, నల్లవాడుగాని క్రిందికి దిగరాదన్నారు. ఓడమీద సరకు కూడ ఏమియు వేసికొనలేదు. ఏడెనులో చూడదగిన విచిత్రము లేమియు లేవు. రాజపుత్రస్థానములోవలె ఎడారిప్రదేశములు విస్తరించియున్నవి. చెట్లు చేమలులేని గుట్టలు, ఆ గుట్టల మధ్య తోటలు, గుట్టలపైన సిపాయిల ఇండ్లవరుసలు కలవు, ముందు హోటళ్లు, అంగళ్లు, అర్ధచంద్రాకృతిలో కట్టబడియున్నవి. వీనిని ఓడలోనుండి చూడవచ్చును. చాల యోడలు రేవులో లంగరు వేసియున్నవి. ఆంగ్లేయులది ఒకటి, జర్మనులదొకటి రెండు యుద్ధనౌకలున్నవి. తక్కినవి రవాణానౌకలు, ప్రయాణనౌకలు. క్రిందటిసారి నేను వచ్చినపుడు పట్టణమును చూచితిని. ఈ కొండల వెనుక దేశీయుల ఇండ్లవరుసలు, బజారులు ఉన్నవి. అందుండి కొన్ని మైళ్లదూరములో కొండలప్రక్క గోతులు త్రవ్విరి. ఆ గోతులలోనికి వర్షోదకమంతయు చేరుకొనును. పూర్వము అచటి వారు ఈ నీరే త్రాగెడివారు. ఇప్పుడు యంత్రముద్వారా సముద్రోదకమునుండి మంచినీటిని తయారుచేసికొందురు. కాని ఈ నీటి ఖరీదు ఎక్కువ. ఏడెనుపట్టణము మనభారతీయపట్టణము వలెనే యుండును. ఎక్కువమంది పౌరజనులు హిందువులు. సైనికులలోగూడ చాలభాగము హిందువులే. చాలమంది పార్సీ వర్తకులు, సింధీవర్తకులు నున్నారు. ఏడెను చాల పురాతన పట్టణము. రోమనుచక్రవర్తియైన కన్‌స్టాంటియస్ క్రైస్తవ మతమును ప్రచారముచేయుటకు కొంతమంది మిషనరీలను అచటికి పంపినాడు. వీరిమీద అరబ్బులు తిరుగబడి వీరిని చంపివేసిరి.

దానిమీద ఆరోమనుచక్రవర్తి వారిని శిక్షించవలసినదని అబ్సీనియాన్ రాజును కోరెను. అబ్సీనియాలో చాలకాలము క్రైస్తవమతము ప్రచారములో నుండెడిది. అబ్సీనియారాజు ఒకసైన్యమును పంపి ఏడెనులోని అరబ్బులను కఠినముగా శిక్షించెను. తరువాత పర్షియాకుచెందిన 'సమనిధిరాజులు' ఏడెనును ఆక్రమించిరి. కొండలలో నీరు నిలువచేయుటకు గుహాలు తొలచినది వీరే అని ప్రసిద్ధి. తరువాత మహమ్మదీయమతము విజృంభించినది. అరబ్బులు ఏడెనుపట్టణము నాక్రమించిరి. తరువాత కొంతకాలమునకు ఒక పోర్చుగీసు సేనాని ఈపట్టణమును పట్టుకొనుటకు వ్యర్థప్రయత్నములు గావించెను. అప్పుడు టర్కీసుల్తాను హిందూమహాసముద్రమునుండి బుడతకీచులను వెడలగొట్టుటకు ఏడెను పట్టణమును నౌకాస్థావరముగా మార్చెను.

మరల ఏడెనుపట్టణము పొరుగుననున్న అరబ్బురాజు అధీనమయ్యెను. తరువాత అతనివద్దనుండి ఇంగ్లీషువారు దానిని కైకొనిరి; కొని ప్రస్తుత పట్టణమును అభివృద్ధిచేసిరి. ఇప్పుడు ప్రపంచములో నున్న ప్రతిబలవంతమైన దేశముయొక్క యుద్ధనావలు ప్రపంచమందంతటను తిరుగుచున్నవి. ప్రతిదేశము ప్రపంచమునందెచ్చటెచ్చట తగాదా పుట్టునో అచ్చటచ్చట తన యధికారము చలామణికావలెనని వాంఛించుచున్నది. ప్రతిదేశము తన యాధిక్యమును, తనరాజకీయ లాభములను, తనవర్తకవ్యవస్థలను భద్రముగా కాపాడుకొనవలయునని వాంఛించుచున్నది. అందుచేత ఈదేశముల కన్నింటికి సర్వకాల సర్వావస్థలయందు బొగ్గు కావలయును. యుద్ధకాలమునందు శత్రుదేశములనుండి బొగ్గు సరఫరాయగుట దుర్లభము గావున ప్రతిదేశము బొగ్గు నిలువచేసికొనుటకు కొన్ని ప్రదేశములను తన యధీనములోనికి తెచ్చుకొనవలయునని కాంక్షించును. ఆంగ్లేయులు ఉన్న ప్రదేశములలో ఉత్తమమైనవానిని ఆక్రమించుకొనిరి. మిగిలినవానిలో ఉత్తమమైన వానిని ఫ్రెంచివారు ఆక్రమించుకొనిరి. వారితరువాత తక్కిన పాశ్చాత్యదేశ

ములవారు పశ్చిమమున్న తక్కిన ప్రదేశములను బలవంతముగను, ధనమూలముగను, స్నేహసంబంధములవలనను తమయధీనము చేసికొనిరి. ఇప్పుడు ఆసియా, యూరపు దేశములను సూయజు కాలువ కలుపుచున్నది. అది ఇప్పుడు ఫ్రెంచివారి యధీనములోనున్నది. అందుకు ప్రతిగా ఆంగ్లేయులు ఏడను రేవునందు తమపటిష్ఠతిని కట్టుదిట్టము చేసికొనిరి. తక్కిన దేశములవారు ఎఱ్ఱసముద్రము వెంట ఏదియోయొక ప్రదేశము నాక్రమించుకొనిరి. ఒక్కొక్కప్పుడు ఇట్టి కాంక్ష వినాశకరమైన ఫలితములను తెచ్చిపెట్టును. ఇటలీదేశము ఏడు శతాబ్దముల కాలము వైదేశికుల పరిపాలనలో క్రాగ్గిపోయినది. తరువాత బహుకష్టములుపడి స్వాతంత్ర్యమును సంపాదించుకొనినది. వెంటనే ఇటలీ వారు ఇతర దేశములను జయింపవలెనను దురాశతో దురాలోచనములు చేయదొడగిరి. యూరోపులో ఒక దేశమునకు చెందిన నేలను మఱియొక దేశమువారు అంగుళమైన ఆక్రమించుకొనుటకు వీలులేదు. అప్పుడు తక్కిన దేశములన్నియు కలసి ఆ యాక్రమించుకొనినవానిపై బడును. ఆసియాలో ఈ పెద్దరాజ్యములవారు ఆంగ్లేయులో, రష్యావారో, ఫ్రెంచివారో, డచ్చివారో ఆక్రమించుకొనకుండ వదలినస్థలమంగుళమైనను లేదు. అప్పుడు ఆఫ్రికాలో అందందుగల ప్రదేశములను మాత్రము ఇంకెవరును నాక్రమించుకొని యుండలేదు. ఇటలీ తనదృష్టి అటు త్రిప్పినది. మొదట ఇటలీ ఉత్తరఆఫ్రికాలో ఆక్రమణకై ప్రయత్నించెను. కాని అచ్చట ఫ్రెంచివారు ఎదురైరి. అందుచేత ఇటలీ తనప్రయత్నమును మానుకొనవలసి వచ్చెను. అప్పుడు ఇటలీవారికి ఆంగ్లేయులు ఎఱ్ఱసముద్రప్రాంతమున కొంత భూభాగమునిచ్చిరి. అచ్చటనుండి ఇటలీ అబిసీనియా రాజ్యమునంతను నాక్రమించుకొనగలదని వారి యభిప్రాయము. ఇటలీకూడ ఒక పెద్దసైన్యముతో సిద్ధమయ్యెను. కాని అబిసీనియా రాజు మనీలిక్ అనువాడు ఇటలీని చితుకగొట్టెను. ఇటలీకి ఆఫ్రికానుండి వెనుకకు పాఱిపోవుటకుగూడ కష్టమయ్యెను. ఇంతియే

దానిమీద ఆ రోమనుచక్రవర్తి వారిని శిక్షించవలసినదని అబ్సీనియాన్ రాజును కోరెను. అబ్సీనియాలో చాలకాలము క్రైస్తవమతము ప్రచారములో నుండెడిది. అబ్సీనియారాజు ఒకసైన్యమును పంపి ఏడెనులోని అరబ్బులను కఠినముగా శిక్షించెను. తరువాత పర్షియాకు చెందిన 'సమనిధిరాజులు' ఏడెనును ఆక్రమించిరి. కొండలలో నీరు నిలువచేయుటకు గుహాలు తొలచినది వీరే అని ప్రసిద్ధి. తరువాత మహమ్మదీయమతము విజృంభించినది. అరబ్బులు ఏడెనుపట్టణము నాక్రమించిరి. తరువాత కొంత కాలమునకు ఒక పోర్చుగీసు సేనాని ఈపట్టణమును పట్టుకొనుటకు వ్యర్థప్రయత్నములు గావించెను. అప్పుడు టర్కీ-సుల్తాను హిందూ మహాసముద్రమునుండి బుడతకీచులను వెడలగొట్టుటకు ఏడెను పట్టణమును నౌకాస్థావరముగా మార్చెను.

మరల ఏడెనుపట్టణము పొరుగుననున్న అరబ్బురాజు అధీనమయ్యెను. తరువాత అతనివద్దనుండి ఇంగ్లీషువారు దానిని కైకొనిరి; కొని ప్రస్తుత పట్టణమును అభివృద్ధిచేసిరి. ఇప్పుడు ప్రపంచములో నున్న ప్రతిబలవంతమైన దేశముయొక్క యుద్ధనావలు ప్రపంచ మందంతటను తిరుగుచున్నవి. ప్రతిదేశము ప్రపంచమునందెచ్చ టెచ్చట తగాదా పుట్టునో అచ్చటచ్చట తన యధికారము చలామణికావలెనని వాంఛించుచున్నది. ప్రతిదేశము తన యాధిక్యమును, తనరాజకీయ లాభములను, తనవర్తకవ్యవస్థలను భద్రముగా కాపాడుకొనవలయునని వాంఛించుచున్నది. అందుచేత ఈ దేశముల కన్నింటికి సర్వకాల సర్వావస్థలయందు బొగ్గు కావలయును. యుద్ధకాలమునందు శత్రుదేశములనుండి బొగ్గు సరఫరాయగుట దుర్లభము గావున ప్రతిదేశము బొగ్గు నిలువచేసికొనుటకు కొన్ని ప్రదేశములను తన యధీనములోనికి తెచ్చుకొనవలయునని కాంక్షించును. ఆంగ్లేయులు ఉన్న ప్రదేశములలో ఉత్తమమైనవానిని ఆక్రమించుకొనిరి. మిగిలినవానిలో ఉత్తమమైన వానిని ఫ్రెంచి వారు ఆక్రమించుకొనిరి. వారితరువాత తక్కిన పాశ్చాత్యదేశ

ములవారు పనికివచ్చు తక్కిన ప్రదేశములను బలవంతముగను, ధనమూలముగను, స్నేహసంబంధము లవలనను తమయధీనము చేసికొనిరి. ఇప్పుడు ఆసియా, యూరపు దేశములను సూయజు కాలువ కలుపుచున్నది. అది ఇప్పుడు ఫ్రెంచివారి యధీనములోనున్నది. అందుకు ప్రతిగా ఆంగ్లేయులు ఏడను రేవునందు తమపరిస్థితిని కట్టుదిట్టము చేసికొనిరి. తక్కిన దేశములవారు ఎఱ్ఱసముద్రము వెంట ఏదియోయొక ప్రదేశము నాక్రమించుకొనిరి. ఒక్కొక్కప్పుడు ఇట్టి కాంక్ష వినాశకరమైన ఫలితములను తెచ్చిపెట్టును. ఇటలీదేశము ఏడు శతాబ్దముల కాలము వైదేశికుల పరిపాలనలో క్రుంగిపోయినది. తరువాత బహుకష్టములుపడి స్వాతంత్ర్యమును సంపాదించుకొనినది. వెంటనే ఇటలీ వారు ఇతర దేశములను జయింపవలెనను దురాశతో దురాలోచనములు చేయదొడగిరి. ఐరోపాలో ఒక దేశమునకు చెందిన నేలను మఱియొక దేశమువారు అంగుళమైన ఆక్రమించుకొనుటకు వీలు లేదు. అప్పుడు తక్కిన దేశములన్నియు కలసి ఆ యాక్రమించుకొనినవానిపై బడును. ఆసియాలో ఈ పెద్దరాజ్యములవారు ఆంగ్లేయులో, రష్యావారో, ఫ్రెంచివారో, డచ్చివారో ఆక్రమించుకొనకుండ వదలినస్థలమంగుళమైనను లేదు. అప్పుడు ఆఫ్రికాలో అందందుగల ప్రదేశములను మాత్రము ఇంకెవరును నాక్రమించుకొని యుండలేదు. ఇటలీ తనదృష్టి అటు త్రిప్పినది. మొదట ఇటలీ ఉత్తరఆఫ్రికాలో ఆక్రమణకై ప్రయత్నించెను. కాని అచ్చట ఫ్రెంచివారు ఎదురైరి. అందుచేత ఇటలీ తనప్రయత్నములను మానుకొనవలసివచ్చెను. అప్పుడు ఇటలీవారికి ఆంగ్లేయులు ఎఱ్ఱసముద్రప్రాంతమున కొంత భూభాగమునిచ్చిరి. అచ్చటనుండి ఇటలీ అబిసీనియా రాజ్యమునంతను నాక్రమించుకొనగలదని వారి యభిప్రాయము. ఇటలీకూడ ఒక పెద్దసైన్యముతో సిద్ధమయ్యెను. కాని అబిసీనియా రాజు మనీలిక్ అనువాడు ఇటలీని చితుకగొట్టెను. ఇటలీకి ఆఫ్రికానుండి వెనుకకు పాఱిపోవుటకుగూడ కష్టమయ్యెను. ఇంతియే

గాక రష్యా, అబీసీనియా దేశముల క్రైస్తవమునందున్న సాదృశ్యమువలన రష్యాచక్రవర్తి అబీసీనియాకు స్నేహితుడాయెను.

సరియే....ఇప్పుడు మా యోడ ఎఱ్ఱసముద్రముగుండా ప్రయాణించుచున్నది. ఓడమీదనున్న క్రైస్తవమతాచార్యుడిట్లనినాడు: "యూదులనాయకుడగు మోసెస్ తనఅనుచరులతో ఈ ఎఱ్ఱసముద్రమును కాలినడకను దాటినాడు. ఈజిప్టురాజగు ఫారో వారిని పట్టుకొనుటకు పంపిన సేన సముద్రములో మునిగిపోయెను. సేనలోని రథముల చక్రములు బురదలో, మహాభారతములో కర్ణుని రథచక్రములవలె, క్రుంగిపోయెను. అతడు ఈ సంగతిని అధునాతనభౌతికశాస్త్రీయకారణములు చూపించి ధృవపఱచవచ్చుననినాడు. ఈ రోజులలో ప్రతిదేశములోను మతమహిమను భౌతికశాస్త్రీయపద్ధతులతో నిరూపించుట ఒక వ్యామోహమై పోయినది. ఇటువంటి మహిమలన్నియు ప్రకృతిశక్తులవల్ల సందర్భపడునవైనచో వీనివల్ల భగవంతుడున్నాడని నిరూపించుటకు వీలేమియున్నది? ఇది ఒక పెద్దసమస్య. ఈ మహిమలు భౌతికశాస్త్రమువల్ల ఋజువుకానిచో ఇవి వట్టికట్టుకథలగును. అందుచేత మీ మతమంతయు తప్పు. భౌతికశాస్త్రమువల్ల ఋజువైనచో అప్పుడు మీ దేవుడు దేవుడు. అట్లు కానిచో మీ దేవుని వైభవము వట్టిదండుగయగును. అప్పుడే మహిమలు తక్కిన ప్రకృతిసంఘటనములవలెనే స్వాభావికములగును. దీనికి బోగేష్ మతగురువు ఇట్లనినాడు: "ఇందులో ఇన్ని చిక్కులున్నవని నే నెఱుగను. నే నూరక విశ్వసించితిని. అంతే". ఇది బాగుగనేయున్నది. దీనిని సహింపవచ్చును. ఇంకొకరకపు జనులున్నారు. వీరు ఇతరులయొక్క అభిప్రాయములను గట్టిగా విమర్శింతురు. ఆ విమర్శనలో రకరకములైన వాదనలు చేయుదురు. కాని వారి విశ్వాసములసంగతి వచ్చినపుడు ఇట్లందురు: "మేము ఊరక విశ్వసింతుము. ఆ విశ్వాసములందలి నిగ్గుకు మా మనస్సే సాక్షి". ఇదిమాత్రము సహించుట కష్టము. వారిమేధకు విలువ ఏమి

యున్నది? ఏమియు లేదు. ఇతరుల యొక్క మతవిశ్వాసము లన్నియు అంధవిశ్వాసములని వారు తేలికగా కొట్టివేయుదురు. అందులో ముఖ్యులు ఐరోపీయనులు. ఒరుల మతవిశ్వాసములను వారు మిక్కిలి తేలికగా కొట్టివేయుదురు. కాని వారి విద్దూరపు విశ్వాసములనుగుఱించి కొన్ని భగవద్విషయిక సందర్భములను కల్పించుకొని వానిపైన నెంతో ఆవేశము పెంచుకొందురు.

మాయోడ ఉత్తరదిశకు ప్రయాణించుచున్నది. ఎఱ్ఱ సముద్రముయొక్క ఒడ్డున పురాతనమైన నాగరికత వర్ధిల్లినది. ఎఱ్ఱసముద్రమునకు అటుప్రక్క అరేబియా ఎడారికలదు. ఇటు ప్రక్క ఈజిప్టు. ఇది చాల పురాతనమైన దేశము. వేల సంవత్సర ములక్రింద ఈ ఈజిప్టుదేశీయులు పుంట్ (ఇది బహుశః మలబారు కావచ్చును) నుండి బయలుదేరి ఎఱ్ఱసముద్రమును దాటి క్రమ క్రమముగా వారి రాజ్యమును ఈజిప్టువఱకు వ్యాపింపచేసికొనిరి. వారిరాజ్యవిస్తరణము, వారి నాగరికత చాల యాశ్చర్యమును కలిగించుచుండును. గ్రీసు దేశీయులు వీరిశిష్యులు. వారి రాజులకు కట్టిన గోరీలను 'పిరమిడ్సు' అందురు. శరీరమంతయు సింగము, ముఖముమాత్రము మనుష్య స్త్రీ బొమ్మలుగల 'స్ఫింక్సు' అను దేవతల బొమ్మలతో నుండు ఆశ్చర్యకరమైన కట్టడములు నేనును కలవు. ఇప్పటికిని ఆరాజుల కళేబరములు భద్రముగా నున్నవి. పురాతన ఈజిప్టు దేశీయులు ఇచ్చట నివసించిరి. వారి జుట్టు ఉంగరములుతిరిగి ఉండెడిది. వారు చెవులకు పోగులు పెట్టు కొనెడివారు. తెల్లని ధోవతులు గోచీపోసి కట్టుకొనెడివారు. హైక్సోసులు, ఫారోలు, పర్షియాచక్రవర్తులు, అలెగ్జాండరు, టాలమీ మొదలగువారు, రోమను అరబు విజేతలు ఈ ఈజిప్టు నందు వఱలిరి. కొన్ని శతాబ్దములక్రిందట వారి చరిత్రమంతయు వారి పురాతనలిపిలో పాపరాసు అను మొక్కనుండి తయారు చేసిన కాగితము మీాద, రాతి పలకలమీాద, మట్టి కుండలమీాద వివరముగా వారు వ్రాయించిరి.

ఐసిస్ అను భక్తుడు నివసించిన దేశమిది. హోరసు కూడ నిచ్చటివాడే. ఈ పురాతన ఈజిప్టుదేశీయులు మనిషి చనిపోయినపుడు అతని సూక్ష్మశరీరము ఉత్క్రమణము చెందుననియు అతని స్థూలకళేబరమునకు ఏవిధమైన గాయముకలిగినను అది వాని సూక్ష్మశరీరమునందు ప్రతిబింబించుననియు ఈస్థూలశరీరమును నాశనము చేసినచో ఆసూక్ష్మశరీరముకూడ నశించుననియు విశ్వసించెడివాడు. అందుచేత ఈ నిర్జీవశవములను జాగ్రత్త పెట్టుటకు వారు అంత కష్టపడెడువారు. అందుచేతనే రాజులకు, చక్రవర్తులకు ఇంత పెద్ద పిరమిడ్లు కట్టిరి. వీనినికట్టుటలో పాపము ఎంత ఉపాయము అవలంబించిరో! ఎంత శ్రమపడిరో! కాని వారి ప్రయాసమంతయు వ్యర్థమైనది. ఈ పిరమిడ్లలోనున్న ధనరాసులవలన నాకృష్టులై దొంగలు వీనిలోనికి కన్నములువేసి వీనిలోని మాయగదులలోనికి చొరబడి ఆరాజుల శవములను ఎత్తుకొనిపోయిరి. ఇది జరిగినది యిప్పుడుగాదు. ఇదిగూడ ఆ పురాతన ఈజిప్టు దేశీయుల పనియే. ఐదు, ఆరు వందల సంవత్సరముల క్రిందట యూదు, అరబు వైద్యులు ఈ ఎండిపోయిన పురాతనశవములలో గొప్ప ఔషధ ప్రక్రియలున్నట్లు భావించిరి. ఈ రోజునగూడ యునానీ, హకీమీ పద్ధతులలో "మూమియా" లేక "మొమ్మాయి" వాడుదురు. ఈ పురాతనశవములు చాల పరిశుద్ధమైన "మొమ్మాయి" ముమియో వైద్యవిధానమునకై పనికివచ్చెడివి.

అశోకచక్రవర్తి టాలమీవంశీయులు పరిపాలించుచుండగా ఈజిప్టునకు మతప్రచారకులను పంపెను. వారు మతప్రచారము చేయుచు, రోగములు కుదుర్చుచు, శాకాహారము తినుచు, బ్రహ్మచర్యము నవలంబించుచు, శిష్యులకు సన్న్యాసమిచ్చుచు నుండెడువారు. వారు చాల మతశాఖలను నెలకొల్పిరి. ఇవి థేరపెటే, ఎస్సెనెస్, మనిఛయన్లు మొదలైనవి. వీనిలోనుండియే అధునాతనక్రైస్తవమతము జన్మించినది. టాలమీయుల పరిపాలనలో ఈజిప్టు సర్వవిద్యలకు నెలవయ్యెను. ఇచ్చట అలెగ్జాండ్రియా అను

పెద్దపట్టణమున్నది. ఇచ్చటనున్న విశ్వవిద్యాలయము ప్రపంచము నందంతటను ప్రసిద్ధమైనది. ఇందలి గ్రంథాలయము ప్రశస్తిగాంచి నది. ఇచటి విద్యావంతులు, ప్రపంచమునందంతటను ప్రసిద్ధులు. ఈ అలెగ్జాండ్రియా పట్టణము నిరక్షరాస్యులు, ద్వేషపూరితులు, నీచులైన క్రైస్తవులచేతిలోపడి నాశనమైనది. వారిచ్చటి గ్రంథా లయమును తగులబెట్టిరి. ఇచ్చటి వివేకమంతయు తరిమివేయబడినది. చివరకు క్రైస్తవులు ఒకవిద్యావతియైన హైపేషియా అనునామెను జంపి ఆమెశవమునకు చాల యవమానము గావించిరి. ఆ శవమును వీథులగుండా ఎముకలుతప్ప ఏమియు మిగులనట్లు ఈడ్చిరి.

ఈ దేశమునకు దక్షిణముగా అరేబియా ఎడారి యున్నది ఇది పల్వురు వీరులకు పుట్టినిల్లు. మీరెన్నడైన బురఖా తొడుగుకొనిన బిడోయిన్ అరబ్బును చూచితిరా? అతని తలకు ఉలుకుచ్చులతో ఒక పెద్దరుమాలు చుట్టబడియుండును. అతనినడక, నిలుచుండుటలోని ఆ తీరు, ఆ చూపులు, మీ రింకొక దేశములో చూడలేరు. విశాలమైన ఆ యెడారి స్వాతంత్ర్యము నిలిచిచూచు నట్లుండును. అక్కడ అరబ్బులుపుట్టిరి. క్రైస్తవులమతోన్మాదము, గోత్ జాతీయుల అత్యాచారము, గ్రీకు, రోమను నాగరికతలను నాశనముచేసినపుడు, పర్షియాదేశము తన యవినీతిని బంగారపు ఆకులతో, పొరమీద పొరగా కప్పివేయుటకు ప్రయత్నించినపుడు, హిందూదేశములోగూడ భారతీయసంస్కృతిపై దెబ్బపడినపుడు, పాటలీపుత్ర ఉజ్జయినీసామ్రాజ్యసూర్యులు అస్తమించినపుడు, దేశము నిరక్షరాస్యులైన క్రూరరాజుల పరిపాలనలోనికి రాగా, పరమదుష్టమైన యవినీతి, లంచగొండితనము, దురాశాపరత్వము వ్యాపించినపుడు — ఇట్టి ప్రపంచపరిస్థితులలో ఈజిప్టు ఎడారి యందు ఈ క్షుద్రమై, పశుప్రాయులైన అరబ్బుజాతి మెఱుపువలె వ్యాపించినది.

ఇచ్చట మక్కానుండి ఒకస్టీమరు వచ్చునని కొనుము. దానినిండ ప్రయాణీకులుండురు. టర్కీవారు ఐరోపీయనులవలె

వేషము ధరింతురు. ఈజిప్టువారు సగము పాశ్చాత్యవేషముతో నుందురు. సిరియామహమ్మదీయులు ఇరానుదుస్తులు వేసికొందురు. అచ్చమైన అరబ్బువారు మోకాలుజారు బట్ట కట్టుకొందురు. మహమ్మదు జన్మించుటకు పూర్వము దిగంబరులై, కాబా దేవాలయమునకుచుట్టు ప్రదక్షిణముచేయుట వారి అలవాటు. మహమ్మదుకాలమునుండి మొలచుట్టు ఒకబట్ట చుట్టెదరు. ఇందువల్లనే మనదేశములో మహమ్మదీయులు ప్రార్థనసమయములలో లాగూబొందులువిప్పి వారి పాదముల వఱకు బట్ట వ్రేలాడగట్టుదురు. ఇప్పుడు అరబ్బులరోజులు పోయినవి. ఎడఆఫ్రికండలోనికి త్రోసికొనివచ్చిన కాఫర్లు, సిదీలు, అబ్సీనియనులు అరబ్బుజాతిని సాంకర్యముచేసిరి. వారిశరీరదార్ఢ్యము, శక్తి అంతయు మాటిపోయినది. ఈ ఎడారి అరబ్బుల పూర్వవైభవమంతయు వినష్టమైపోయినది. ఉత్తరదిశను టర్కీరాజ్యమునకు చెందిన పౌరులు శాంతజీవనము గడపుచున్నారు. కాని ఇచ్చట సుల్తాను కాలములోని క్రైస్తవ ప్రజలు తురకలను ద్వేషింతురు. అరబ్బులన్న ఇష్టపడుదురు. వారిట్లందురు! "ఈ అరబ్బులు చెప్పినచో చదువుకొందురు. పెద్దమనుష్యులగుదురు. వీరితో అంతచిక్కులేదు. కాని తురకవాండ్రుమాత్రము క్రైస్తవులను బాగుగా నణచివేయుదురు."

ఈ ఎడారి చాల ఉష్ణప్రదేశమైనప్పటికి ఇచ్చటి ఉష్ణమును ఉత్సాహమును, ధైర్యశక్తులను చంపివేయదు. నీవు తలను, శరీరమును కప్పుకొన్నచో చాలును. ఎండవల్ల ప్రమాదములేదు. ఈ వేడిలో ఉక్కపోత యుండదు. దీనివల్ల చుఱుకుతనముపోదు. అంతేకాక ఇట్టి ఎండవల్ల శరీరములో సమత్వమును తెచ్చు గుణమున్నది. రాజపుత్రస్థానము, అరేబియా, ఆఫ్రికాలలోని జనులు దీనికి నిదర్శనముగానుందురు. మార్వారులోనికొన్ని మండలములలో మనుష్యులు, పశువులు, గుఱ్ఱములు, బలముగనుండి, దృఢదీర్ఘకాయములతో నొప్పుచుండుట చూతుము. ఈ అరబ్బులను, సిద్దీలను

చూచుట సంతోషము కలిగించును. బెంగాలులోవలె వేడిలో తేమయున్నచో శరీరములోని ఉత్సాహము నశించును. ప్రతి జంతువు బలహీనముగా నుండును.

ఎఱ్ఱసముద్రముపేరు విన్నంతనే ప్రయాణీకులు భయపడి పోవుదురు. అచ్చటి ఉష్ణము భయంకరముగానుండును. వేసంగిలో అది మఱింత ఎక్కువగా నుండును. ఇప్పుడును అంతే. ప్రతివాడు డెక్కుమీద కూర్చుండి వానికి తెలిసిన ఒకభయంకరమైన ఆపదనుగుఱించి కథ చెప్పును. కెప్టెన్ వీరందఱికంటె దొడ్డవాడు. ఆతడిట్లు చెప్పెను : "కొన్నిరోజులక్రిందట ఒక చైనా యుద్ధ నౌక ఎఱ్ఱసముద్రములో ప్రయాణించుచుండెను. ఆ యోడ కెప్టెన్, బొగ్గుగదిలో పనిచేయుచున్న మఱి ఎనిమిదిమందినావికులు ఎండదెబ్బవలన చనిపోయిరి".

నిజమునకు బొగ్గుగదిలో పనిచేయుచున్నవారు అగ్నిమధ్య నిలబడియుండవలెను. దీనికితోడు ఎఱ్ఱసముద్రపువేండవలన ఒక్కొక్కప్పుడు వారికి పిచ్చెక్కుచుండును. డెక్కుమీదకు ఎక్కి వారు సముద్రములోనికి దుమికి చచ్చెడివారు. ఒక్కొక్కప్పుడు ఇంజను గదిలోనే చనిపోయెడివారు.

ఈ కథలు వినినపుడు మాకు పైప్రాణము పైనపోయిన ట్లైనది. అదృష్టవశమున మేమంత మండువేండను అనుభవించి యుండలేదు. పైగా అప్పుడు సామాన్యముగా వీచు దక్షిణపు గాలికి బదులు ఉత్తరపుగాలి వీచుచుండెను. ఈ ఉత్తరపుగాలి మధ్యధరాసముద్రమునుండి వచ్చును గావున చల్లగా నుండును.

జూలై 14 వ తారీఖున స్టీమరు ఎఱ్ఱసముద్రమునుదాటి సూయజుకాలువ ప్రవేశించెను. మాముందు సూయజుకాలువ యున్నది. సూయజు రేవులో సరకు దింపవలెను. ఇప్పుడు ఈజిప్టులో ప్లేగువ్యాధి వ్యాపించియున్నది. ఒకవేళ ఓడపైనున్న వారుకూడ ప్లేగుక్రిములను వ్యాపింపచేయవచ్చును. కాబట్టి

ఈ వ్యాధి సోకు ప్రమాదము పోయినది. మన దేశములో ఈవ్యాధి వ్యాపింపకుండ తీసికొన్న చర్యలకంటె ఇచ్చట తీసికొన్న చర్యలు విపరీతము. దీనిముందు మన దేశమునందున్న కట్టుదిట్టములు లెక్కలోనికిరావు. ఇప్పుడు సరకులు దింపవలెను. కాని సూయజు రేవులోని పనివారు ఓడను ముట్టుకొనరాదు. అందువలన ఓడ లోని నావికులపై ఈ భారము పడినది. వారు కూలివారుగా పనిచేయవలయును. క్రేనులతో సరకులు ఎత్తి సరకులు క్రిందకు ముట్టుకొనకుండ దింపవలెను. సూయజు రేవులోని పడవలోనికి దింపవలెను. ఈ పడవలు అప్పుడు ఈ సరకును ఒడ్డునకు చేర వేయును. కంపెనీ ఏజంటు ఒకచిన్నలాంచీలో ఓడవద్దకు వచ్చెను. కాని అతనిని ఓడపైకి ఎక్కనీయలేదు. అతడు లాంచిలోనుండియే కెప్టెన్‌తో మాట్లాడెను. ఇది హిందూదేశముకాదు. అందుచేత ప్లేగువ్యాధి సోకకుండా చేసిన కట్టుదిట్టములు ఇచ్చట ఆంగ్లేయునికి గూడ వర్తించును. ఇచ్చటనుండి యూరపు ప్రారంభమగును. కావున ప్లేగువ్యాధి వ్యాపింపకుండ కట్టుదిట్టములు, నిర్బంధములు బాగుగా నములుపఱచుచుండిరి. ఒకవేళ ఎలుకలోనుండిపుట్టిన ఈ ప్లేగు వ్యాధి. అట్టికఠినచర్యలు అమలుకానిచో ఈ యూరపుస్వర్గము లోనికి చొరబడునేమో యని వారిభయము. ప్లేగుక్రిముల జీవిత కాలము పదిరోజులు. అందుచేత పదిరోజులుమాత్రమే మనము ఓడదిగరాదు. మాకు పదిరోజులు దాటిపోయినవి. అందుచేత మాకు ఆ వ్యాధి సోకు ప్రమాదములేదు. కాని మే మిచ్చట ఏ ఈజిప్టువాని నైనను తాకినచో మరల పదిరోజులు ఓడదిగకుండ నుండవలెను. అట్లు తాకినసందర్భములో నేపుల్సులోగాని, మార్సేల్సులోగాని ఎవరును ఓడదిగుటకు వీలుండదు. అందుచేత ఏవిధమైన పనియైనను దూరమునుండియే ముట్టుకొనకుండ చేయ వలసివచ్చినది. ఓడపైనున్న నావికులకు ఈ కారణమువల్ల సరకు దింపుటకు ఒకరోజు పట్టినది. ఓడకు సెర్చిలైటున్నచో ఆరాత్రి అదిసూయజుకాలువ దాటగలిగెడిదే. మఱి ఆసెర్చిలైటును

ఓడకు బిగించవలయునన్న సూయజు రేవులో పనివారు ఓడను ముట్టుకొనవలసివచ్చును. అప్పుడు ఓడలోనివారికి పదిరోజులు వెలితప్పదు. అందువలన ఓడ రాత్రి బయలుదేరరాదు. మేమున్న వారమున్నట్లుగా సూయజురేవులో 24 గంటలు ఉండవలసి వచ్చెను. ఈ సూయజురేవు స్వభావసిద్ధమైన, సహజమైన రేవు. దీనికి మూడుప్రక్కల మూడు ఇసుకతిప్పలు, గుట్టలున్నవి. దీనిలో నీరు చాల లోతు. ఈ నీటిలో అసంఖ్యాకమైన చేపలు, సొర చేపలు ఈదుచుండును. ఇచ్చటను ఆస్ట్రేలియాయందలి సిడ్నీ రేవులోను నున్నంత సమృద్ధిగా సొరచేపలు ప్రపంచమునందు మఱెచ్చటను కన్పించవు. ఏవిధమైన సందుదొరకినను అవి మనుష్యులను మ్రింగివేయుటకు సిద్ధముగా నుండును. ఎవ్వడును నీటిలోనికి దిగుటకు సాహసించడు. మనుష్యులుకూడా దుడుకు తనముతో ప్రవర్తింతురు. పాములుగాని, సొరచేపలుగాని కన్పించినచో, వానిని చంపుటకు సందువొరకినచో వారూరకుండరు కదా.

మఱునాడు ఉదయము భోజనముసకుముందే పెద్దపెద్ద సొర చేపలు మా యోడవెనుక నీదుచున్నట్లు మాకు తెలిసినది. నేను బ్రతికియున్న సొరచేప నెన్నడును చూడలేదు. పూర్వము నేను వచ్చినపుడు నా యోడ సూయజురేవులో చాల కొంచెముకాలమే యాగినది. అదికూడ పట్టణముదగ్గఱగా నాగినది. అందుచేత సొరచేపనుచూచు నవకాశము నాకపుడు లేకపోయెను. సరే. ఈ సొరచేపలను గుఱించి విన్నంతనే మే మచ్చటకు పరుగెత్తితిమి. రెండవతరగతియోడ వెనుకభాగమున నున్నది. ఓడ డెక్కు మీద పురుషులు, స్త్రీలు, పిల్లలు గుమికూడి కటకటాలపైన నానుకొని ఆ చేపలను చూచుచుండిరి. కాని మేము అక్కడకు వెళ్లగనే సొరచేపలు కొంచెము దూరముగా పోయినవి. అందువలన మా ఉత్సాహము మందగించినది. కాని మేము లకుముకి పిట్టముక్కువంటి తలలు గలిగిన ఒకరకమైన చేపలను నీటిలో

ఈదుచుండగా చూచుచుంటిమి. మఱియు చాలచిన్న చేపజాతులు కూడ అధికముగా నున్నవి. అప్పుడప్పుడు చాలపెద్ద చేపలు బాణము దూసికొనిపోయినట్లు అచ్చటచ్చట దూకుచున్నవి. నేను అవి చిన్నసారచేపలేమో యనుకొంటిని. కాని తరువాత కాదని తేలినది. ఆ చేపపేరు 'బోనిటో'. ఇంతకుపూర్వము దానిని గుఱించి చదివితిని. ఈ చేపలు మాల్దీవులలోనుండి పెద్దపడవల మీద ఎండుచేపలుగా వంగదేశమునకు ఎగుమతిచేయబడునని గూడ నేను చదివినట్లు జ్ఞాపకము. ఈ చేపమాంసము ఎఱ్ఱగా నుండి రుచికరముగానుండునని కూడ చదివితిని. ఇప్పుడు దాని వేగము, దానిశక్తి చూచి చాల ఆనందించితిని. అంతపెద్ద చేప నీటిలో బాణమువలె దూసికొనిపోయినది. అందులో ఈ సముద్రపునీరు అద్దమువలె నిర్మలముగా నున్నది. దీనిలో దాని శారీరకచలనములన్నియు చక్కగా చూడవచ్చును. మేము ఈ బోనిటో చేప పరుగులను, ఆ చిన్న చేపల చంక్రమణములను 20 నిమిషములసేపు చూచితిమి. అరగంట, ముప్పావుగంట కావచ్చును. మేము చాల అలసిపోతిమి. ఒకడు 'అదిగో! సారచేప!' యనినాడు. ఒకడజనుమంది మనుష్యులు ''అదిగో! వచ్చుచున్నది'' అని అఱచిరి. నా కన్నులను ప్రక్కకు త్రిప్పితిని. కొంతదూరమున ఒక పెద్ద నల్లనిదేదో ఆఱు, ఏడు అంగుళముల లోతున నీటిలో మావంకకు కదలివచ్చుచున్నట్లు అగపడినది. క్రమముగా అది దగ్గఱకువచ్చినది. దానితల చదునుగా, విశాలముగా నున్నది. అది నెమ్మదిగా వచ్చుచున్నది. బోనిటో చేపకు వేగమేమియు లేదు. కాని అది దానితలను ఒక్కమాటు త్రిప్పినచో చాలును. ఒకపెద్దచంక్రమణము చేయును. చాల పెద్దచేప అది. బహు హుందాగా నడచుచున్నది. దానిముందు ఒకటి, రెండు చిన్న చేపలున్నవి. అసంఖ్యాకమైన పిల్లచేపలు దానివీపుమీద, దానిశరీరమందంతట ఎగురుచున్నవి. కొన్ని దాని మెడను అతుకుకొనినవి. అదిగో ఇదే సారచేప! దానిపరివారముతో, దాని

యనుచరులతో బయలుదేరినది. దానిముందువచ్చు చేపలను 'మత్స్యము' లందురు. సొరచేపకు ఆహారము వెదకి చూపించుట వాని పని. బహుశః అది తినగా మిగిలిన ముక్కలను ఈ చేపలు తినవచ్చును. ఈ సొరచేప నోరు ఆవులించినపుడు మనము చూచి తీరవలెను. చాల భయంకరముగా నుండును. ఆ సందర్భములో అది తినగా మిగిలిన ముక్కలు తక్కిన చేపలకు లభించునా యను సంశయము కలుగును. ఈ సొరచేపల వీపుమీద ఎక్కిన చేపలను జలగచేపలందురు. ఈ చేపల వక్షమునందు రెండంగుళముల వెడల్పు, నాల్గంగుళముల బారుగల గుండ్రని అవయవము లుండును. అవి సంచులవలె వ్రేలాడుచుండును. అవి ఇంగ్లీషువారి చెప్పులలోని రబ్బరువలె నుండును. ఈ సంచులను ఈ చిన్న చేపలు ఈ సొరచేపలశరీరమునకు తగిల్చినట్లుగా కరచుకొనియుండును. ఇట్లు కరచుకొనియుండుట, ఈ సొరచేప శరీరముమీద వీపుపై కూర్చుండి స్వారిచేయునట్లుండును. ఈ చేపలు, ఈ సొరచేప శరీరముమీద పుట్టు పురుగులను తిని బ్రతుకుచుండవచ్చునను నొక యభిప్రాయము కలదు. సొరచేపకు ఈ విధమైన రెండు తరగతుల పరివారముండును. అది వీనికిమాత్రము ఏ అపాయము చేయదు. 'తనయనుచరులు, స్నేహితులు' అని దానికి వానిపైన మక్కువ యుండును. ఈ చేపలలో ఒకదానిని ఒకడు గాలమువేసి పట్టుకొనెను. ఒకడు దాని రొమ్మున వ్రేలాడుచున్న సంచిని తన చెప్పుతో త్రొక్కెను. అతడు కాలు పైకితీయగనే ఆ చెప్పును అది కరచుకొని పైకిలేచెను. అది ఈ విధముగానే సొరచేపను పట్టుకొని వ్రేలాడును.

రెండవతరగతి ప్రయాణీకుల ఉత్సాహమున కంతములేదు. అందులో నొకడు మిలిటరీవాడు. అతని ఉత్సాహము మితిమీరి పోయెను. ఓడయంతయు వెదకి వారొక పెద్దగాలమును దెచ్చిరి. అది వంగదేశములో నూతులలోపడిన కడవలను తీయుట కుపయో

గించు గాలములకంటె పెద్దది. దీనికి వారు రెండుపౌనుల మాంస మును, ఒక పెద్ద గట్టిత్రాడుతో కట్టిరి. ఒక లావుపాటి పెద్దతీగను బిగించిరి. అక్కడనుండి దానికి ఆ ఆడుగుల దూరముగా ఒక పెద్ద కఱ్ఱముక్కను నీళ్లపైన తేలుటకుగాను కట్టిరి. అప్పుడు ఈ తేలుకఱ్ఱతోపాటు దానిని నీటిలోనికి వదలిరి. ఓడకు దిగువభాగమున ఒక పోలీసుపడవ ఒడ్డుననున్న జనముతో మాకెట్టి సంపర్కములేకుండ చేయుటకు కాపలాకాయుచున్నది. దీనిపైన ఇద్దఱు మనుష్యులు హాయిగా నిద్రపోవుచుండిరి. ఇది ఓడపైనున్నవారికి అసూయాజనకముగా నున్నది. ఇప్పుడు మాత్రము వారికి, వీరికి స్నేహమైనది. ఈ పెద్దగోలవిని అందు లోని ఒకఅరబ్బువాడు కళ్లు నులుముకొనుచు లేచి నిలుచుండెను. ఏదో ఆపద మూడినదనుకొని అతడు తనదుస్తులను సర్దుకొనెను. పిదప మాడగా ఓడపైనున్నవారు ఆ గాలమును, ఆకఱ్ఱముక్కను 'ఇంకను కొంచెము దూరముగా త్రోయు'డని వారిని హెచ్చ రించిరి. అతడు 'బ్రతికితినిరా!' యని యొక నిశ్వాసము వీడి, నవ్వుచు ఒకవాసముతో, తేలెడికఱ్ఱను కొంత దూరము త్రోసెను. మేము కాలిగ్రవేళ్లమీద నిలిచి, కటకటాల నానుకొని, మిక్కిలి ఆతురముగా షార్కుకొఱకు ప్రతీక్షించు చుంటిమి. కాని సామాన్యముగా మనము ఎవరికొఱకు ఆతుర ముగా ప్రతీక్షింతుమో అతడు ఒక్కొక్కప్పుడు రాకుండును. ఈ షార్కుచేపకూడ రాలేదు. కాని దుఃఖమునకు అంతముండి తీరవలెనుగదా! అట్లే ఈ కష్టమునకుగూడ అంతమున్నది. హఠా త్తుగా ఓడకు నూఱుగజముల దూరమున నీరుపట్టు తోలు తిత్తినిపోలు పెద్దదైనచేప నీటిపైన తేలి కన్పించినది. వెంటనే పెద్ద గోలయైనది. "అదిగో షార్కు! అల్లరి చేయకుడు. మీరు అఱచినచో షార్కు పలాయనము చేయును. తెల్లటోపీలనుతీసి అవతల పెట్టుడు. లేనిచో షార్కు సిగ్గుపడును." అని కొందఱు కేకలుపెట్టిరి. ఈవిధమైన కేకలు చెవులలో పడు

చుండగా ఉప్పుసముద్రములో నివసించు షార్కు చేప నీటిలో మునిగిన పడవ పైకి తేలినట్లు సమీపించినది. గాలమునకు కట్టిన మాంసమును ఊరక పోనీయరాదని దాని యభిప్రాయము! షార్కు నోటికి ఎఱకు నడుమ ఏడు, ఎనిమిది అడుగులు మాత్ర మీ దూరము కలదు. ఇంతలో దాని పెద్దతోకను కొంచెము త్రిప్పినది. అందుచేత దాని తిన్నని నడక కొంచెము వంకరతిరిగినది. "అయ్యో! షార్కు పాఱిపోయినది" అని డెక్కుమీదివా రఱచిరి. మరల దాని తోక కొంచెము కదలినది. దాని పెద్ద శరీరము గాలమును సమీపించెను. మరల అది ఆవలించుచు ముందుకుత్రోసికొని వచ్చుచున్నది. ఎఱను కబళించనున్నది. మరల దానిదేహము కదలినది. షార్కు తన శరీరమును వంచుకొన్నది. షార్కు చంక్రమించి ముందుకు వచ్చుచున్నది. ఆవలించుచున్నది. ఎఱను నోటిలోనికి వేసికొన్నది. నిజముగానే ఎఱను మ్రింగినది. "లాగుడు నలుబది ఏబదిమంది కలసి లాగుడు. మీ బలమంతయు కలిపి లాగుడు. అబ్బ! ఈ చేపకు ఎంత బలమున్నది! ఎంత పోరాడుచున్నది! ఎంత పెద్దగా ఆవులించుచున్నది! లాగుడు లాగుడు." అని మహాశయులు అఱచిరి. "అది నీటిపైకి వచ్చినది. మరల నీటిలోనికి పోవుచున్నది. ప్రక్కకు తిరుగుచున్నది. లాగుడు! లాగుడు! ఆ ఎఱను వదలించుకొని పాఱిపోయినది. షార్కు పాఱిపోయినది. ఏమి మీరు ఆ ఎఱను కొంచెము మ్రింగువఱకు ఓపికపట్టకపోయితిరి గదా. కొంచెము కదలగానే ఆచేపను అంత తొందరగాలాగుటకు యత్నించితిరి గదా! చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొనిన ప్రయోజనమేమి?" అని వారనుకొనిరి. షార్కు గాలమును వదలించుకొని పాఱిపోయినది. అది తన పురోగామి చేపలకు ఏమిశిక్ష వేసినదో మనకు తెలియదు. జరిగినది మాత్రమిది. షార్కు తప్పించుకొని పోయినది. షార్కు చేప, ఒడలిమీద నల్లని చారలుగలిగి పెద్దపులివలె నున్నది. ఏమైనను,

పెద్దపులిపోలు ఈ చేప గాలము చాల అపాయకరమైనదని గ్రహించి తనపరివారమందలి "పురోగామి"మత్స్యములతోను, జలగ చేపలతోను అంతర్థానమైనది.

అయినప్పటికి మేము నిరాశపడవలసిన భయము లేదు. ఎందువల్లననగా ఈ "పెద్దపులి" పార్టు ఇటు పోవుచుండగా దాని ప్రక్కనుండియే ఒక పెద్ద వెడల్పైనతలతో మఱియొక పార్టు ఇటు వచ్చుచున్నది. పార్టు చేపలకు భాష లేదు కాబోలు. ఉన్నచో ఆ వచ్చు పెద్దచేపకు ఈ పోవుచున్న పెద్దపులిచారల పార్టు ఈ రహస్యమును చెప్పి హెచ్చరించకుండ నుండెడిదా? తప్పకుండ హెచ్చరించెడిది. "ఓ మిత్రుడా! జాగ్రత్త! అచట నొక క్రొత్త జంతువున్నది. దానిమాంసము మాత్రము చాల రుచిగానున్నది. కాని దాని బొమికె ఎంత గట్టిగానున్నది! నేను పుట్టి పెరిగిన తరువాత ఇన్నాళ్ళయినది. బ్రతికిన వానిని, చచ్చిన వానిని, సగము చచ్చినవానిని గుట్టలకొలది ఇన్ని జంతువులను తింటిని. నా పొట్టనిండ పుట్టలకొలది రాళ్ళు, పెంకులు, కొయ్యలు నిండియున్నవి. కాని ఈ క్రొత్తజంతువును బొమికలతో పోల్చినపుడు అవియన్నియు వెన్నపూసవంటివని చెప్పదగును. దాని బొమికలు గ్రుచ్చుకొని పండ్లు దవడలు ఏమైపోయినవో!" అని అది చెప్పియుండును. ఈ మాటలు చెప్పి ఆవచ్చుజంతువునకు ఆవులించిన తన దవడలు చూపియుండును. ఆ రెండవదికూడ దాని వయోలక్షణమగు అనుభవముతో ఈ చేపకు ఏదో ఒకానొక తరహా చేపయొక్క కార్జమో మాంసమో తిని దాని నోటిలోని పుండ్లను మాన్పుకొనుమని సలహా చెప్పియుండును. కాని అట్టి దేదియు జరుగలేదు. కావున ఈ పార్టు చేపలకు ఒక ప్రత్యేకమైన భాషయుండదని, ఒకవేళ నున్నచో అది నీటిలోపల మాట్లాడుటకు వీలైయుండదని మనము నిశ్చయింపవచ్చును. అందువల్ల పార్టు చేపలు మాట్లాడుటకు వీలైన అక్షరసమామ్నాయము కనిపెట్టు నంతవఱకు అవి ఆ భాషనుపయోగించువఱకు

అవలీలగా వానిని పట్టుకొనవచ్చును. చారలచేప మనుష్యులతో సంపర్కము బాగుగాచేసి ఆ మనుష్యుల లక్షణమును కొంత అలవఱచుకొనినది. కాబట్టి ఆవచ్చు వెడల్పుతల షార్కుచేపకు ఉన్న నిజము చెప్పక ఒక చిరునవ్వునవ్వి "ఏమి! బాగుగా నుంటివా? అని పలుకరించి లోపలనే యుండుటేల? నాతో బాటు దీనికి గూడ ఈ పరాభవము జరుగునుసుమా!" అని ఆచేప యనుకొనియుండును.

ఒక వంగకావ్యములో ఇట్లున్నది: "భగీరథుడు ముందు శంఖము పూరించుచు నడచుచుండగా వెనుక గంగానది ఆతని ననుసరించుచున్నది". ఇప్పుడు అట్లే ఈ శంఖధ్వని వినిపించినది. అనగా ముందు పురోగామిచేపలు వచ్చుచున్నవి. దానివెనుక ఈ చదునుతలచేప తనపర్వతశరీరముతో వచ్చుచున్నది. చుట్టును జలగచేప లెగురుచున్నవి. ఆహా! ఎవరు అంత ఆకర్షణీయమైన దృశ్యమునుచూచి ఆగగలుగుదురు. మధ్యగల ఈ మాంసపుముక్కవలన ఐదారుగజములమేరలో ఆ సముద్రపు నీరంతయు జిడ్డుతేరినది. మఱి ఆ మాంసపుముక్క సువాసన ఎంతదూరముగ వ్యాపించినదో చెప్పలేము. ఆ మాంసపు ముక్క చూచుట కెంత సొగసుగా నున్నది! ఎఱ్ఱగా, తెల్లగా, పచ్చగా, చిత్రవర్ణముగా నున్నది. అది అచ్చమైన ఇంగ్లీషుపందిమాంసము. దానిని గాలమునకుకట్టి నీటిలోనికి వదలిరి. అది చాల ఆకర్షణీయముగా నీటిలో నొప్పుచున్నది.

"ఎవరును మాట్లాడకుడు. కదలకుడు. తొందరపడకుడు. తాడుపట్టుకొని లాగుటకు సిద్ధముగామాత్ర ముండుడు. అదిగో! ఆ షార్కు గాలము దగ్గఱకు వచ్చినది. ఎరను పరీక్షించుచున్నది. నోటిలో పెట్టుకొనుచున్నది. పెట్టుకొన నీయుడు. మాట్లాడకుడు. ఇప్పుడది కొంచెము ప్రక్కకు

తిరిగి మాట్లాడుచున్నది. మొత్తమంతయు మ్రింగుచున్నది. బాగుగా మ్రింగనీయుడు" అని కొందఱనిరి. ఇప్పుడు ఈ చదును తల షార్కు వత్తిగిలి, తీరుబడిగా వేసిన ఎరను కబళించినది. పోవుదమనుకొని కొంచెము కదలినది. దానికి ఆశ్చర్యము కలిగి తల కొంచెము విదలించి లోపలనున్న మాంసమును బయటకు గ్రక్కుదమనుకొన్నది. లాభములేకపోగా గాలము మఱింత బాగుగా గొంతుకలో గ్రుచ్చుకొన్నది. పైనుండి పెద్దలు, చిన్నలు అందఱు కలసి త్రాడును తీవ్రముగా లాగుచుండిరి. "చూడుడు! చూడుడు! షార్కుతల నీటిపైకివచ్చినది. లాగుడు! లాగుడు! అప్పుడే సగముశరీరము నీటిపైకి వచ్చినది. అబ్బ! ఏమిదవడలు! శరీరమంతయు దవడలు. లాగుడు! లాగుడు. అమ్మయ్య ఇప్పటికి మొత్తమంతయు పైకివచ్చినది. ఇప్పుడు గాలము దానిదవడలగుండా సాంతము గ్రుచ్చుకొనిపోయినది! లాగుడు ఆగుడు. అరబ్బు పోలీసూ! దానితోకకు త్రాడు కట్టి ఇట్లు విసరుము. ఇది పెద్దదయ్యమువలె నున్నది. ఏమోయీ జాగ్రత్త సుమా! అది తోకతో కొట్టిన చాలును. గుఱ్ఱపుకాలైనను విఱిగిపోవును. లాగుడు! లాగుడు. అబ్బ! ఎంత బరువున్నది! ఓయి భగవంతుడా! షార్కు పొట్టక్రింద వ్రేలాడుచున్నది! ఏమది? అవి ప్రేగులుకావా! అంత బరువు శరీరము వలన ఆ ప్రేగులు బయటకు వచ్చివేసినవి. సరియే! వానిని కోసి పాఱవేయుడు. సముద్రములోనికి కోసి పాఱవేయుడు. కొంతబరువు తగ్గును. అబ్బ! ఏమిరక్తప్రవాహము! బట్టలమీద పడకుండ జాగ్రత్తపడినను ప్రయోజనమేమియులేదు. అదిగో మనము దానినందుకొనవచ్చును. ఇప్పుడు డెక్కుమీద పెట్టుడు. చాల జాగ్రత్త. అది మీదపడినయెడల చేతిని తటాలున లాగివేయును. తోకవద్దకు పోకుడు. జాగ్రత్త! ఇప్పుడు త్రాడు వదలుడు. అబ్బ! ప్రక్కనపడినది! ఎంత పెద్ద షార్కు! క్రింద పడినప్పుడు ఎంత చప్పుడైనది! సరే మనము ఎంతసేపని తప్పి

కొని తిరుగుదుము. అదిగో ఆ మొద్దుతో దానినెత్తిమీద బాదుము. ఓ మిలిటరీమనిషి! నీవే ఆ పనిచేయుటకు తగిన వాడవు" అని వా రఱచిరి. ఆ మిలిటరీప్రయాణీకుని దుస్తులనిండ రక్తము చిమ్మినది. అతడు ఒకదూలమునుపట్టుకొని ఆ షార్కు తలమీద బాదుట మొదలుపెట్టినాడు. ఓడపైనున్న స్త్రీలందఱు "ఎంతక్రూరముగానున్నది! ఎంతఘోరముగానున్నది! చంపవలదు! చంపవలదు!" అని గోలచేయుచుండిరి. కాని వారు ఈ దృశ్యమును చూడకుండ నూరకొనిరా? ఇంతటిలో ఈ ఘోర దృశ్యము అంతము కాలేదా. ఆ షార్కు పొట్ట కోసిరి. దాని పొట్టలోనుండి రక్తము ప్రవహించినది. అచటివారు గుండెను వేఱు వేఱుగాకోసి దాని ప్రేగులు తీసివేసిరి. అయినను దానిశరీరమింకను కదల్చుచునేయుండెను. దానిపొట్టలో బొమికలు, చర్మము, మాంసము, కొయ్యలు ప్రోగుపడియున్నవి. అవియన్నియు పైకి తీసిరి. ఈ విషయములను వివరముగా చెప్పనేల? ఒక సంగతి చెప్పెదను. ఆ దినమున నా యాహారము ఇంచుమించుగా పాడై పోయినది. ఎందుబోయినను షార్కుచేప కంపే!

కాలువత్రవ్వకములో సూయజుకాలువత్రవ్వకము ఆశ్చర్య కరమైనది. ఒక ఫ్రెంచి ఇంజనీరు ఫెర్డినాండు డి లెస్సెప్స్ అను నాతడు ఈ కాలువను త్రవ్వెను. ఈ కాలువ మధ్యధరాసముద్ర మును, ఎఱ్ఱసముద్రమును కలుపుచు, హిందూదేశమునకు ఐరోపా దేశమునకు మధ్య వర్తకసంబంధముల నభివృద్ధిచేసినది.

మిగుల ప్రాచీనకాలమునుండి ప్రస్తుత మానవనాగరకతకు దోహదములైన కారణములలో భారతీయవాణిజ్యమే మిగుల ముఖ్యమైనది. బహుపురాతనకాలమునుండి భారతదేశము భూసారమునందు, వాణిజ్యపరిశ్రమలయందు తక్కిన యన్ని దేశ ములకంటె ఎంతో యుచ్చదశలో నున్నది. ఒకశతాబ్దముక్రిందటి వఱకు ప్రపంచమునందంతటకు వలసిన వస్త్రములు, ప్రత్తి, జనప

నారు, నీలిమందు, లక్క, బియ్యము, రత్నములు, ముత్యములు అన్నియు హిందూదేశమునుండియే సరఫరా యగుచుండెడివి. ఇంతేకాదు. ప్రపంచమునందు ఏ ఇతర దేశమునందుకూడ భారత దేశములోవలె 'కిన్ కాబు'వంటి పట్టు, ఉన్ని వస్త్రములు లభించెడివి కావు. లవంగములు, ఏలకులు, మిరియములు, ఇతర సుగంధ ద్రవ్యములు హిందూదేశమునుండి లభించుచుండెడివి. అందుచేత బహుపురాతనకాలమునుండి ఎప్పుడెప్పుడు ఏయేదేశము నాగరక మగుచు వచ్చుచున్నదో అప్పుడప్పుడెల్ల ఆయా నాగరకపదార్థము లకు, వస్తుసామగ్రికి అదిభారతదేశముపై ఆధారపడుచు వచ్చెను. ఈవ్యాపారమంతయుముఖ్యముగా రెండుమార్గములద్వారాజరిగెను. ఒకటి భూమార్గము. ఆఫ్ఘనిస్తాను, పర్షియాలమీదుగా ఈమార్గము పోవును. రెండవది సముద్రమార్గము. ఎఱ్ఱసముద్రముద్వారా అలె గ్జాండరు పర్షియాను జయించిన తర్వాత, భారతదేశమున కొక సముద్రమార్గము కనిపెట్టుటకు నయార్కసు అను ఒక యధికారిని నియమించెను. ఆ సముద్రమార్గము సింధునదీముఖద్వారమునుండి మహాసముద్రముమీదుగా, ఎఱ్ఱసముద్రముమీదుగా ఏర్పాటు చేయబడినది. బాబిలోనియా, పర్షియా, గ్రీసు, రోము దేశముల సంపత్తు పురాతనకాలమున భారతదేశముతోడి వర్తకముపై చాలభాగము ఆధారపడి యుండెనని బహుజనులకు తెలియదు. రోమను సామ్రాజ్యము పడిపోయిన తర్వాత మహమ్మదీయ దేశ ములలో బాగ్దాదు, ఇటలీలో వెనీసు, జనీవానగరములు భారత దేశపుసరకులకు పాశ్చాత్యదేశములలో వ్యాపారకేంద్రములైనవి. తరువాత రోమనుసామ్రాజ్యమును తురకలు జయించినపుడు; వారు ఇటలీ వారికి భారతదేశమునకు పోవు వ్యాపారమార్గమును మూసి వేసిరి. అప్పుడు స్పెయిన్ దేశీయుడైన క్రిస్టాఫరు కొలంబసు అట్లాంటిక్ దేశమున కొక క్రొత్తమార్గమును కనుగొను టకు ప్రయత్నించెను. ఆ సందర్భములో అతడు అమెరికా దేశమును కనుగొనినాడు. అమెరికా చేరినతర్వాతగూడ అది

భారతదేశమను భ్రాంతి అతనిని వదలలేదు. ఆ కారణమువలన అమెరికాలోనున్న ఆదిమవాసులు 'ఇండియన్సు' అని ఈ నాటికిని పిలువబడుచున్నారు. వేదములందు సింధునదికి 'సింధు', 'ఇందు' అను రెండు పేర్లు కనిపించుచున్నవి. పారశీకులు 'సింధుకు' బదులు 'హిందు' అని వాడిరి. గ్రీకులు 'ఇండస్' అని వాడిరి. కావుననే ఇండియా, ఇండియను అను పేర్లు పుట్టినవి. మహమ్మదీయుల విజృంభణముతో 'హిందు' అను పదమునకు అపార్థమేర్పడి నల్లనివాడు అను అర్థమునం దుపయుక్తమైనది. ఇప్పుడు 'నేటివు' అను పదము అట్లే ఉపయోగింపబడుచున్నది కదా.''

ఈలోపుగా బుడతకీచులు ఆఫ్రికానుచుట్టి హిందూదేశమున కొక క్రొత్త మార్గమును కనుగొనిరి. బుడతకీచులకు హిందూదేశములో చాల లాభించినది. తరువాత ఫ్రెంచివారు, డచ్చివారు, డేనులు, ఆంగ్లేయులు వచ్చిరి. భారతీయవ్యాపారము, భూమి శిస్తులు, ఇతర శిస్తులు ఇప్పుడు ఇంగ్లీషువారి యధీనములోనున్నవి. అందుచేతనే వారు తక్కిన యన్నిదేశములలో అగ్రస్థానము వహించియున్నారు. కాని ఇప్పుడు అమెరికా మొదలగు దేశములలో భారతదేశము కంటె భారతదేశపుపంటలు బాగుగాపండింపబడుచున్నవి. అందుచేత ఇప్పుడు భారతదేశమునకు ప్రతిష్ఠ తగ్గినది. భారతదేశము తమ నాగరకతకు హేతువను మాటను ఐరోపీయనులు ఇష్టపడరు. తమ నాగరకతకు, తమ సంపదకు ఈ నాటువాంద్రదేశము ముఖ్యకారణమని వా రంగీకరించరు. అయినను ఇది సత్యమే. ఇది వారర్థముచేసికొనజాల రేరు. మనము వారి కీవిషయము అర్థమగునంతవఱకు ఊరకుండరాదు.

కొంచెము ఆలోచించి చూడుడు. మన దేశములోని ఈ నిమ్నజాతులవారు వైదేశికులచే జయింపబడి, స్వజాతీయులచే నీచముగా చూడబడిరి. కర్షకులు, సాలెవాండ్రు మఱి యనేక విధముల వృత్తుల నాశ్రయించినవారు, బహుపురాతనకాలము

నుండి శాంతముగా పనిచేయుచుండెడివారు. వారు తమకష్టమునకు తగిన బహుమానముకూడ పొందకుండ అణగి పడియున్నారు. దీనినిగుఱించి కొంచెమాలోచించి చూడుడు. ప్రపంచమునందంతట నెమ్మదిగా ఎంత గొప్ప మార్పుజరుగుచున్నది! అది ప్రకృతి సిద్ధమైన విషయము. దేశమందలి నాగరకత, అధికారములు బహు విప్లవముల పాలబడుచున్నవి. ఓ భారతీయులైన శ్రమజీవు లారా! మీ ప్రశాంతమైన, నిరంతరమైన పరిశ్రమవలన, బాబి లోనియా, పర్షియా, అలెగ్జాండ్రియా, గ్రీస్, రోము, వెనిస్, జినోవా, బాగ్దాదు, స్పెయిన్, పోర్చుగల్, డెన్మార్కు, హాలండు, ఇంగ్లాండు దేశములు క్రమముగా ఆధిక్యమును, సామ ర్థ్యమును పొందగలిగినవి. పాపము మీరో? మిమ్ములను గుఱించి ఎవడాలోచించును? మీ పూర్వులు కొన్ని వేదాంతగ్రంథములను రచించినారు. కొన్ని పురాణములను రచించినారు. కొన్ని దేవా లయములను కట్టినారు. ఇందుకై మీరు ఆకాశము ప్రతిధ్వనించు నట్లు బొబ్బలు పెట్టెదరు. పాపము! ప్రపంచమునందున్న సర్వాభి వృద్ధికి ఎవరు రక్తమోడ్చి శ్రమ చేసిరో ఆ జనులనుగుఱించి ఎవడు శ్రద్ధవహించును? వారినిగుఱించి ఒక మంచిమాటనైన పలికినవా డన్నాడా? వేదాంతమునందో, కవిత్వమునందో, పరాక్రమము నందో ప్రపంచమునంతను జయించిన కొందఱు వీరపురుషులను గుఱించి ఎందరెందరో ఎఱుగుదురు. వారికి సర్వమానవజాతి నీరాజన మెత్తుచునేయున్నది. కాని ఎవ్వరును తొంగిచూడని గొప్పతనమును గుఱించి ఎవ్వడును ఒక్క ఉత్సాహకరమైన మాట పలుకడు. అందఱు ద్వేషించువారే! అంత ద్వేషపూరితమైన వాతావరణమునందు దరిద్రజీవనము గడపుచు, అనంతమైన ఓర్పుతో, అనంతమైన ప్రేమతో, అవ్యాఘాతమైన ఆచరణతో, మనదేశమునందలి సామాన్యప్రజానీకము తమ ఇండ్లలో రాత్రింబవళ్ళు నోరెత్తక తమ తమ ధర్మములను నిర్వర్తించు చున్నారు. సరే! దీనిలో ధీరత్వము లేదా? ఏదో ఒక పెద్ద

పనిని నిర్వర్తించి మహావీరులై కూర్చుందురు. ఒక్కొక్కప్పుడు ఎంత పిఱికివాడైనను, ప్రాణత్యాగమునకు సిద్ధపడును. ఎంత స్వార్థపరుడైనను త్యాగముచేయును. వారిని మెచ్చుకొనుటకు గుంపులు గుంపులుగా జనులున్నారు కదా! కాని అదే స్వార్థ రాహిత్యము, అదే ధర్మనిర్వాహణమునందలి శ్రద్ధ, చాల చిన్న విషయములలో ఎవ్వరిచేతను గమనింపబడక చూపించువాడే చాల గొప్పవాడు. అణగద్రొక్కబడిన భారతీయ శ్రమజీవులారా! ఆ గొప్పతనము మీయందున్నది. తలవంచి మీకు నమస్కరించుచున్నాను.

ఈ సూయజు కాలువగూడ చాలపురాతనమైనది. ఈజిప్టులో ఫారోలు పరిపాలించినపుడు అసంఖ్యాకమైన చిన్న చిన్న సముద్రపు నీటిగోతులను ఒకదానితో నొకటిగా వరుసగా కలిపి వారు ఈ సముద్రమునుండి ఆ సముద్రమువఱకు ఒక పెద్ద కాలువగా ఏర్పాటు చేసిరి. ఈజిప్టును రోమనులు పరిపాలించినపుడు ఈ కాలువను తెఱచియుంచుటకు ప్రయత్నములు జరిగినవి. తరువాత అమ్రు యను మహమ్మదీయసేనాపతి ఈజిప్టును జయించి ఈ కాలువలో ఇసుకమేటలను త్రవ్వించి కాలువనంతను చక్కగా బాగుచేయించి దానిస్వరూపమునే మార్చెను.

తరువాత దానినిగుఱించి ఎవ్వరును శ్రద్ధబూనలేదు. ఇప్పుడున్న ఈ కాలువ, ఈజిప్టునకుచెందిన ఖెదీవు ఇస్మాయిల్ అను నాతడు త్రవ్వించినాడు. ఇతడు టర్కీసుల్తానుకు రాజప్రతినిధిగా నుండెడివాడు. ఇతనికి ఫ్రెంచివారు పెట్టుబడి, సలహాల నొసంగిరి. ఈ కాలువతో పెద్దచిక్కొకటియున్నది. ఇది ఎడారిగుండా ప్రవహించును. అందువల్ల మాటిమాటికి ఇసుకతో మేటవేసికొని పోవుచుండును. పెద్దవ్యాపారనౌక ఒక్కటితప్ప ఒకేసారి ఈ కాలువగుండా ఓడలు ప్రయాణముచేయలేవు. మిక్కిలి పెద్దవైన యుద్ధనౌకలుగాని, వ్యాపారనౌకలుగాని ఈ కాలువగుండా

ప్రయాణించ నేరవు. లోపలికివచ్చు నోడలు, బయటికిపోవు నోడలు ఒకదానినొకటి కొట్టుకొనకుండ ఈ కాలువను కొన్ని భాగములుగా విభజించి ఒక్కొక్క భాగమునకు రెండుప్రక్కల లంగరువేసికొనుటకు వీలయినంత విశాలమైన చెరువులు అప్పటివారు త్రవ్వించిరి. మధ్యధరాసముద్రముఖమున ఈ కాలువయొక్క ప్రధాన కార్యాలయమున్నది. కాలువలోని ప్రతిభాగమునకు రైలుస్టేషనుల వలె కొన్ని స్టేషనులున్నవి. ఒక ఓడ కాలువలో ప్రవేశింపగనే ప్రధాన కార్యాలయమునకు ఎడతెగకుండ తంతివార్తలు పంపబడుచుండును. ఆ ప్రధాన కార్యాలయములో ఎన్ని ఓడలు లోపలికి వచ్చుచున్నవో, ఎన్ని ఓడలు బయటకుపోవుచున్నవో, ఏ క్షణమునందు ఏ ఓడ ఏ ప్రదేశమునందున్నదో ఈ వైనమంతయు తంతివార్తలద్వారా సంగృహీతమై ఒక పెద్దపటముమీద తెలుపబడియుండును. ఒక యోడ మఱియొక ఓడను ఢీకొట్టుకొనకుండ నివారించుకొనుటకు మార్గము నిరాటంకముగా నున్నదని వర్తమానము తెలియకుండ ఏ యోడయైనను అది యున్న స్టేషను నుండి బయలు దేరుటకు అనుమతింపబడదు.

సూయజు కాలువ ఇప్పుడు ఫ్రెంచివారి యధీనమునందున్నది. కాలువ కంపెనీలో ఎక్కువ వాటాలు ఆంగ్లేయులవే. అయినప్పటికి ఒకానొక రాజకీయపు టొప్పందమువల్ల ఫ్రెంచివారే కాలువపైన యాజమాన్యము వహించుచున్నారు.

ఇప్పుడు మధ్యధరాసముద్రము వచ్చినది. హిందూదేశము దాటిన తరువాత ఇంతకంటె గమనింపదగిన ప్రదేశములేదు. ఈ సముద్రము ఆసియా, ఆఫ్రికాలకు, పురాతననాగరకతలకు చివరిహద్దు. ఇంతటితో ఒకవిధమైన ఆచారవ్యవహారములు, జీవితపద్ధతులు అంతమై, మఱియొకవిధమైన వైఖరులు, స్వభావములు, ఆహారపద్ధతులు, వేషధారణములు, ఆచారములు, అలవాట్లు మొదలగునవి వెలయును. మనము ఇచ్చటనుండి ఐరోపాను

ప్రవేశింతుము. ఇంతియేకాదు. శరీరఛాయలు, జాతులు, నాగరకతలు, సంస్కృతులు, ఆచారములు అనేకశతాబ్దులనుండి పరస్పరమిచ్చుట మేళవింపబడినవి. వీనినుండి ఒక క్రొత్తనాగరకత జన్మించినది. ఈ మధ్యధరాసముద్రమును చుట్టియున్న ప్రదేశములయందే నేడావరించియున్న మతము, నాగరకత, సంస్కృతి, పరాక్రమము పుట్టినవి. ఈ మధ్యధరాసముద్రమునకు దక్షిణభాగమున శిల్పమునకు, సంపదకు, పాడిపంటలకు జన్మస్థానమైన, పురాతనమైన ఈజిప్టుప్రదేశమున్నది. తూర్పుదిక్కున ఫొనీషియనుల, ఫిలిస్టైనుల, యూదుల, బాబిలోనియనుల, అస్సీరియనుల, పర్షియనుల నాగరకతలు విలసిల్లిన ఆసియామైనరు కలదు. ఉత్తరమున ప్రపంచములో నాశ్చర్యకరమైన గ్రీకు నాగరకత వర్ధిల్లిన దేశము కలదు.

అనేకదేశములను, నదులను, కొండలను, సముద్రములను పరిశీలించితిమి. ఇప్పుడు కొంచెము పురాతనచరిత్రనుగుఱించి చెప్పెదను. ఈ పురాతనకాలమునుగుఱించిన కథలు చాల ఆశ్చర్యకరమైనవి. ఇవి కట్టుకథలుగావు. యథార్థముగా జరిగినవి. ఇవి నిజమైన మనుష్యజాతిచరిత్రలు. శాశ్వతముగా ఈ పురాతన దేశములన్నియు మఱుగుపడిపోయినవి. ఏకొంచెమైన ఈ దేశములనుగుఱించి ప్రజలకు తెలిసినచో ఆకొంచెము పురాతన గ్రీకు చారిత్రకులు వ్రాసిన కట్టుకథలలోనుండి గ్రహింపబడినదే! బైబిలులోని, పురాణగాథలలోని విచిత్రవర్ణములు మాత్రమే. ఇప్పుడు పురాతనమైన రాళ్ళపైన చెక్కబడిన శాసనములు, కట్టడములు, గదులు, పెంకులు మొదలైనవానిమీద చెక్కిన శాసనములు భాషావిషయికపరిశోధనలు—ఇవి ఆయా దేశములను గుఱించిన పురాతనచరిత్రను విశదముచేయుచున్నవి. ఈ పరిశోధన ఇప్పుడిప్పుడే మొదలైనది. అయినను దీనివల్ల మిగుల నాశ్చర్యకరమైన చరిత్రలు బయటపడినవి. ఇక ముందుముందు ఏవి బయటపడ

గలవో ఎవరు చెప్పగలరు? ఒకచిన్నరాతిమీదనో, శిథిలమైన పాత్రమీదనో, కట్టడముమీదనో, పెంకుమీదనో చెక్కబడిన శాసనపు ముక్కలను గుఱించి దేశదేశములలోని పండితులు తమ తలలు బ్రద్దలుకొట్టుకొనుచు, కాలగర్భమునందు మఱుగుపడి పోయిన పురాతన చరిత్రలను వెలికి త్రవ్వుచున్నారు.

కాన్స్టాంటినోపుల్ పట్టణమును మహమ్మదీయులనాయకు డగు ఉస్మాను ఆక్రమించుకొనిన తరువాత తూర్పుఐరోపా అంతయు మహమ్మదీయుల ఆధిపత్యముక్రిందికి వచ్చినపుడు పురాతన గ్రీకు గ్రంథములు, విద్యాసంస్కృతులు చాలకాలము వారి శక్తిహీను లైన సంతానము చేతులలో మఱుగుపడియుండి క్రమముగా పశ్చిమఐరోపాదేశములందు వ్యాపించెను. గ్రీసుదేశము చాల కాలము రోమనుల ఆధిపత్యముక్రింద నున్నప్పటికి, విద్యాసంస్కృ తులయందు గ్రీకులు, రోమనులకు ఉపాధ్యాయులైరి. గ్రీకులు క్రైస్తవమతములో చేరుటవలన, క్రైస్తవుల బైబిలు గ్రీకు భాషలో వ్రాయబడుటవలన యావత్తు రోమనుసామ్రాజ్యమందు క్రైస్తవమతము వ్యాపించెను. కాని మనము యవనులని పిలుచు నట్టియు, ఐరోపా నాగరకతకు ప్రథమదేశికులైనట్టియు పురాతన గ్రీకులు క్రైస్తవులకంటె ఎంతో పూర్వమే।వారిసంస్కృతియందు అత్యున్నతిని సాధించిరి. వారు క్రైస్తవులుగా మాఱిన తరువాత వారి విద్యాసంస్కృతులు వినష్టమైనవి. కాని వారి పురాతన సంస్కృతి ఏకొంచెమో హైందవుల గృహములలో నున్నట్లే క్రైస్తవులైన ఈనాటి గ్రీకులలోగూడ మిగిలియున్నది. ఈ గ్రంథములు ఐరోపాయంతయు వ్యాపించినవి. ఇవి ఆంగ్లేయులు, జర్మనులు, ఫ్రెంచివారు మొదలైన ఐరోపీయనులలో నాగరకతా వ్యాపనమునకు తోడుపడినవి. గ్రీకుభాష, కళలు నేర్చు కొనుటకు ఐరోపీయనులు చాల వ్యామోహపడిరి. ఆ మిగిలిన గ్రంథములలో నున్నదంతయు వారాసక్తితో గ్రహించిరి. వారి తెలివితేటలుగూడ వికసింపజొచ్చినవి. భౌతికశాస్త్రము

లభివృద్ధి చెందజొచ్చెను. ఆగ్రంథములయొక్క రచనాకాలము, గ్రంథకర్త విషయము వారియొక్క పరిశుద్ధ పారము మొదలైనవి పరిశోధింపబడినవి. క్రైస్తవులు కాని గ్రీకుల గ్రంథములమీద ఐచ్ఛికముగా అభిప్రాయమును ప్రకటించుట కడ్డంకిలేదు. కాని క్రైస్తవుల గ్రంథములమీద మాత్రము అట్టి ఐచ్ఛికాభిప్రాయములను ప్రకటింపరాదు. ఈ ఐచ్ఛికాభిప్రాయ ప్రకటనమువలన బహిర్గత అంతర్గత సాక్ష్యయుతమైన విమర్శనశాస్త్రము బయలు దేరినది.

ఉదాహరణకు ఫలానాదినమున ఫలానా సంఘటనము జరిగినదని ఒక గ్రంథములో వ్రాయబడినదని యనుకొనుడు. ఎవడో ఒకడు ఏదోజరిగినదని ఒక పుస్తకములో వ్రాసినంత మాత్రముచేత అది నిజముగా జరిగినదని నమ్మవలసినదేనా? ఆనాటి ప్రజలలో ఊహాగానము ననుసరించి ఏదో జరిగినట్లు వ్రాయుట అలవాటుగానుండెడిది. ఇంతేగాక వారికి ప్రకృతిని గుఱించి, మనము నివసించుచున్న భూమిని గుఱించి పరిజ్ఞానమేమియు లేదు. ఇట్టి విషయములన్నియు ఆయాగ్రంథములందున్న విషయముయొక్క యథార్థతను గుఱించి సందేహము లొదవుటకు హేతువులైనవి. ఉదాహరణముకొఱకు ఒక గ్రీకు చరిత్రకారుడు ఫలాన తేదీన హిందూదేశమున చంద్రగుప్తుడు పరిపాలించుచుండెనని వ్రాసెననుకొనుడు. హిందూదేశము నందలి గ్రంథములుకూడ ఆ తేదీన ఆరాజున్నట్లు వ్రాసినచో ఆ విషయము చాలవఱకు నిర్ధారితమైనట్లే. చంద్రగుప్తుని పరిపాలన సూచించు నాణెములు దొరకినను, లేక అతని పరిపాలనము సూచించు ఆనాటి ఒక కట్టడము బయల్పడినను అప్పుడు ఈ గ్రీకు చరిత్రకారుడు వ్రాసినది యథార్థమగునని గ్రహింపనగును.

మఱియొక గ్రంథకర్త అలెగ్జాండరు పరిపాలనములో ఫలానా సంఘటన జరిగినదని వ్రాసెననుకొనుడు. అందులోనే ఒకరో ఇద్దఱో రోమనుచక్రవర్తులనుగుఱించికూడ ప్రక్షిప్తములని

చెప్పుటకు వీలులేని పద్ధతిలో కొన్ని విషయములు ఉటంకించి యుండవచ్చునని యనుకొనుడు. అప్పుడు ఆపుస్తకము అలెగ్జాండరు సమకాలములో వ్రాసినది కాదని చెప్పవచ్చును.

ఇక భాషావిషయము పరిశీలింపుడు కాలాంతరమున ప్రతి భాష కొంత మార్పు చెందును. గ్రంథకర్తల శైలిగూడ మార్పు చెందుచునే యుండును. ఒక గ్రంథమునందు హఠాత్తుగా వర్ణ్య విషయమునకు సంబంధించని ఒకవర్ణనము తటస్థపడినదనుకొనుడు. అందలి గ్రంథకర్తశైలికి, ఇతరశైలికి సంబంధము లేదనుకొనుడు. అప్పు డా వర్ణనము ప్రక్షిప్తమని చెప్పవచ్చును. ఈ రీతిగా అనుమానముచేత, పరీక్షచేత బహువిధములుగా ఒక పుస్తకము యొక్క సత్యాసత్యములను నిరూపించు పద్ధతులతో ఒక శాస్త్రమే యభివృద్ధిచెందినది.

దీనికి తోడు అధునాతన భౌతికశాస్త్రము త్వరత్వరగా నభివృద్ధిచెందుచున్నది. ఈ శాస్త్రవ్యాసంగము బహువిషయములపై బహుముఖముల వెలుగును ప్రసరింపజేయుచున్నది. దీని ఫలితముగా ఏ గ్రంథమునందైనను అస్వాభావికములైన సంఘటనములు వర్ణింపబడినపుడు వానియం దేమాత్రము సత్యము లేదని నిరాకరింపబడుచున్నవి.

వీని యన్నింటికి మకుటప్రాయముగా సంస్కృతభాష యూరపులోనికి వచ్చిపడినది. భారతదేశములోను, యూఫ్రెటిసు నదియొడ్డునను, ఈజిప్టులోను నున్న పురాతన శిలాశాసనములను చదువుట, బహుకాలము భూమియందో, పర్వతములయందో మఱుగుపడిన దేవాలయములను కనుగొనుట, వానియొక్క చరిత్రము నిర్దుష్టముగా కనిపెట్టుట మొదలైన యంశము లభివృద్ధి చెందినవి.

ఈ క్రొత్త పరిశోధనా శాస్త్రము బైబిలును, అందులో న్యూటెస్టమెంటును తన బారి కగ్గము చేయలేదు. అయితే

ఇప్పుడు తీవ్రములైన మతాభియోగములవలన బాధలేదు. కాని సంఘదూషణమునకు పాల్పడవచ్చునని భయముగలదు. దీనిని కూడ లెక్కసేయక చాలమంది పండితులు ఈ గ్రంథములనుకూడ తమ శాస్త్రీయపరిశోధనమున కగ్గము చేసినారు. వారు భారతీయమైన లేక ఇతరమైన మతగ్రంథములను ఎంత తీవ్రముగా తమ విమర్శచేత ఛిన్నాభిన్నము సేసిరో యూదు, క్రైస్తవ మత గ్రంథములనుకూడ అట్టి ధైర్యముతోనే విమర్శించుటకు వెనుదీయరని మన మూహింతము. నేని మాటలెందుకు చెప్పుచున్నానో ఒక యుదాహరణమున తెలుపుదును. ఈజిప్టు పురాతనతత్త్వశాస్త్రరచయితయగు మాస్పెరో "హిస్టాయిరే ఏన్షియన్నే ఓరియంటలే" అను పేరుగల ఈజిప్టు బాబిలోనియా దేశముల చరిత్రమును ఒక బృహద్గ్రంథముగా రచించెను. ఒక ఆంగ్ల పురాతనశాస్త్రవేత్త దాని నాంగ్లీకరించెను. దానిని నేను చదివితిని. ఈ పర్యాయము ఒక ఆంగ్ల మ్యూజియమునందున్న ఒక గ్రంథాలయములోని యుద్యోగిని ఈజిప్టు, బాబిలోనియాలను గురించిన గ్రంథములేమైన నున్నవా యని యడిగితిని. "మాస్పెరో రచించిన గ్రంథమున్న"దని అతడు చెప్పెను. నేను దాని ఆంగ్లీకరణము నా దగ్గఱ నున్నదని చెప్పితిని. దానిమీద అతడు "అది చాలదు. ఆ అనువాదకుడు మూఢక్రైస్తవమతాభిమాని. మాస్పెరో క్రైస్తవ మతమును విమర్శించిన సందర్భములందు అతడు ఆయా వ్రాతలను తారుమారుగావించి ఇష్టమువచ్చినట్లు మలచి వ్రాసినాడు. అందుచే ఫ్రెంచిలో వ్రాయబడిన అసలు గ్రంథమును చదువుము" అని చెప్పినాడు. చదివినమీదట అతడు చెప్పినది యథార్థమని తేలినది. ఇది చాల పెద్ద చిక్కు. మతదురభిమానము ఎంత చెడ్డదో మీరెఱుగుదురు. మతదురభిమానమువల్ల సత్యాసత్యములు మఱుగుపడిపోవును. అప్పటినుంచి ఈ పరిశోధనా గ్రంథముల యనువాదములందు నాకు విశ్వాసము సన్నగిల్లినది.

మతియొక్క శాస్త్ర మభివృద్ధి చెందినది. అది మానవ జాతిశాస్త్రము. మనుష్యులను వారి శరీరఛాయ, జుట్టు, శరీర నిర్మాణము, శిరస్సుయొక్క ఆకారము మొదలైన వానిని బట్టి తరగతులవారీగా విభాగించుట ఈ శాస్త్రాశయము.

జర్మనులు అన్నిశాస్త్రములయందును ఆటితేఱినవారై నప్పటికి సంస్కృతమునందును, పురాతన అస్సీరియా సంస్కృతి యందును ప్రత్యేకనైపుణ్యమును సాధించిరి. బెన్ఫీ మొదలైన వారు దీనికి నిదర్శనములు. ఫ్రెంచివారు ఈజిప్టు పురాతన పరిశోధనా శాస్త్రములో నేర్పరులు. మేస్పరో మొదలైనవారు దీనికి నిదర్శనములు. డచ్చివారు యూదు, క్రైస్తవ మతముల విమర్శనలో గొప్పవారు. క్యూనెను మొదలైన డచ్చి పండితులు ప్రపంచమునందంతటను ప్రఖ్యాతి వహించిరి. ఆంగ్లేయులు చాల శాస్త్రములను మొదలుపెట్టి తరువాత మానుకొందురు.

ఈ పండితుల యభిప్రాయములనుగుఱించి మీకు కొంచెము చెప్పెదను. వారియభిప్రాయములు మీకు రుచించనిచో మీరు ఖండించవచ్చును. కాని నన్నుమాత్రము దూషింపకుడు. హిందువులు, యూదులు, బాబిలోనియనులు, ఈజిప్టుదేశీయులు, ఇంకను పురాతనజాతులకుచెందినవారందఱు మానవజాతియంతయు పురాణదంపతులనుండి ప్రభవించినదని చెప్పుదురు. ఈ విషయ మును ఇప్పటి ప్రజలు ఎక్కువగా విశ్వసింపరు.

మీరు ఎప్పుడైన కాఫిర్లను చూచితిరా? వారు కారు నలుపుగా నుందురు. వారిముక్కు చప్పిడిముక్కు. పెదవులు మందము. జుట్టు ఉంగరాలుతిరిగియుండును. నుదురు సన్నము. అండమానుదీవులలోనుండు ప్రజలు, భిల్లులు వీరివలెనే ఉందురు. కాని వారు కొంచెము పొట్టిగా నుందురు. జుట్టు అంత ఉంగరాలు తిరిగియుండదు. వీరిలో ప్రథములు నీగ్రోలు. వీరు ఆఫ్రికాలో నివసించుచున్నారు. రెండవతరగతికి చెందినవారు

నీగ్రిటోలు. అనగా చిన్ననీగ్రోలు. పురాతనకాలములో వీరు అరేబియాలో కొన్నిభాగములందు యూఫ్రటీసునదీతీరములందు, దక్షిణపర్షియాలో హిందూదేశమంతట అండమానుదీవులలో, మఱికొన్ని ఇతరదీవులలో ఆస్ట్రేలియావఱకు వ్యాపించియుండిరి. అధునాతనకాలమునందు భారతదేశములో కొన్నియడవు లందు, అండమానుదీవులందు, ఆస్ట్రేలియాలో వీరు అగపడు చుందురు.

రెప్పాలు, భూటియాలు, చైనీయులు, వీరిని మీరు చూచితిరా? వీరు పసుపుపచ్చగనో, తెల్లగనో ఉందురు. జుట్టు సరళముగా, నల్లగా నుండును. వీరికండ్లు చాల నల్లగా నుండును. గడ్డము, మీసము అల్పముగా నుండును. ముఖము చదునుగా నుండును. దవడ బొమికలు పెద్దవి. నేపాలీయులను, బర్మీయులను, సయామీయులను, మలయావారిని, జపానువారిని మీరు చూచి తిరా? వారి ఆకారముకూడ నిట్లే యుండును. కాని కొంచెము పొట్టిగా నుండును.

ఈ రెండుతరగతుల ప్రజలు మంగోలులని, చిన్నమంగోలు లని పిలువబడుదురు. ఈ మంగోలియనులు ఆసియాలో చాల భాగము ఇప్పు డాక్రమించుకొనిరి. ఇప్పుడు వారు మంగోలులు, కల్మకులు, హూణులు, చైనీయులు, తార్తరులు, టర్కీయులు, మంచూలు, కిర్ఘిజులు అను వివిధభాగములుగా విభక్తమైరి. వీరు దేశద్రిమ్మరులుగా జీవింతురు. డేరాలు వేసికొనుచు, మేకలను, గొఱ్ఱెలను, పశువులను, గుఱ్ఱములను పెంచుచు తిరుగు చుందురు. అవకాశము లభించినపుడు మిడుతలదండ్లవలె ప్రపంచ ముపైబడి నాశనముచేయుదురు. చైనీయులు, టిబెట్టువారు ఇందు చేరరు. వీరికి టురేనియనులు అనియు పేరుగలదు. ఇరాన్, తురాన్ అను ప్రసిద్ధమైన పదబంధములందు కన్పించునది తురా నన్న మాటయే.

పురాతనకాలమునాటి ఈజిప్టులోను, పురాతన బాబిలోనియాలోను ప్రస్తుతము ఇండియా యంతట ప్రధానముగా దక్షిణ భాగములో నల్లని దేహవర్ణములుగల ఒకజాతి నివసించుచుండెడిది. వీరిజుట్టు సరళముగా నుండును. ముక్కు కొంచెము వేసినట్లుండును. సరళమైన నల్లనికండ్లు. ఐరోపాయందుకూడ అచ్చటచ్చట అపురూపముగా వీరు కన్పింతురు. వీరందఱు ఒకజాతికి చెందినవారు. వీరిని ద్రావిడులని పిలుతురు.

మఱియొకజాతి శరీరవర్ణము తెలుపుగాను, కన్నులు సరళముగాను ఉండును. వీరిచెవులు, ముక్కు వంపుతిరిగి అగ్రమునందు మొద్దుగా నుండును. వీరికి సన్నని నుదురు, బండపెదవులు కలవు. ఉత్తరఅరేబియాలోనుండు ప్రజలు అధునాతనయూదులు, పురాతనబాబిలోనియనులు, అస్సీరియనులు, ఫొనీషియనులు ఈ జాతికి చెందినవారు. వీరిభాషలన్నియు ఒకపురాతనభాషనుండి వచ్చిన శాఖలే. వీరికి సెమిటిక్ జాతి యని పేరు.

మఱి ఆర్యజాతి వేఱు. వీరు సంస్కృతమునుండి వచ్చిన భాషలు మాట్లాడుదురు. వీరిముక్కులు, కండ్లు, నోళ్లు తీర్చిదిద్దినట్లుండును. వీరు తెల్లని దేహచ్ఛాయ గలవారు. జుట్టు నల్లగను, ధూమ్రవర్ణముగను నుండును. కండ్లు నల్లగనో, నీలవర్ణముగనో యుండును.

అధునాతనకాలమునందున్న మానవజాతులన్నియు ఈ పురాతనజాతులసంపర్కమువలన నేర్పడినవే. ఏదో ఒకజాతి ఎక్కువగా నివసించుచున్న దేశమునందు ఆ జాతికే చాలభాగము పోలియున్న శారీరకనిర్మాణము, భాష కలిగియున్నవి.

పాశ్చాత్యదేశములందు, ఉష్ణదేశములందు నివసించువారు నల్లగను, శీతలదేశములందు నివసించువారు తెల్లగను నుందురను సిద్ధాంతమును అంతగా నొప్పుకొనరు. నలుపు, తెలుపులకుమధ్యనున్న అనేక దేహవర్ణాంతరములు ఈ నల్ల, తెల్లజాతుల సంపర్కముచే నేర్పడినవని చాలమంది యభిప్రాయము.

ఈజిప్టు పురాతన బాబిలోనియా దేశముల నాగరకతలు చాల ప్రాచీనమైనవని పండితుల యభిప్రాయము. క్రీస్తుకు పూర్వము ఆఱువేలసంవత్సరములకంటెకూడ పురాతనమైన గృహములు, శిథిలభవనములు ఈ దేశమునందున్నవి. హిందూ దేశమునందు కనిపెట్టబడిన పురాతనగృహములు క్రీస్తుపూర్వము మూడవశతాబ్దికిచెందిన చంద్రగుప్తునికాలముకంటె ప్రాచీనములైనవి లేవు.* కాని అంతకంటె బహుపురాతనమైన గ్రంథములు మాత్రమున్నవి. ఇట్టి పురాతనగ్రంథములు మఱి ఏ దేశమునందును లేవు. క్రీస్తుకు ఐదు వేల సంవత్సరములకు పూర్వమే ఇప్పుడున్న క్రమములో నీ వేదము లుండడివని బాలగంగాధరతిలకుపండితుడు వలసినంత సాక్ష్యము చూపించి, నిరూపించెను. క్రీస్తుకుపూర్వము కనీసము ఐదువేలసంవత్సరముల ముందు ఇప్పుడున్నపద్ధతిలోనే హిందువులుండెడివారు.

ప్రపంచమంతటను జయించిన పాశ్చాత్యనాగరకతయొక్క జన్మస్థానము ఈ మధ్యధరాసముద్రతీరములంచే సెమెటిక్ జాతులైన ఐజిప్టేయనులు, బాబిలోనియనులు, ఫోనిషీయనులు, యూదులు, ఆర్యజాతులైన పర్షియనులు, గ్రీకులు, రోమనులు వీరందఱు ఒకరితో నొకరు కలిసిపోయి అధునాతన పాశ్చాత్య నాగరకతను కల్పించిరి.

ఈజిప్టులో "రోజెట్టాశిల" యను పేరుగల యొక పెద్ద రాతి పలకమీాద ఒక శాసనము చెక్కబడి యుండెను. దీనిపైన పురాతనలిపిలో శాసనములు చెక్కబడియున్నవి. క్రింద మఱియొకవిధమైన వ్రాతలో శాసనములున్నవి. అన్నిటికంటె గ్రీకు

* హరప్పా, మొహెంజొదరో అను ప్రదేశములందు త్రవ్వగా ప్రాచీన కాలమున మిగుల వృద్ధినందిన నాగరకతాచిహ్నము లగపడినవి. ఇవి క్రీస్తుపూర్వము 3000 సంవత్సరములనాటివని నిర్ణయింపబడెను. ఇచ్చటి త్రవ్వకపు పనులు 1922 సంవత్సరమునకుమున్ను జరుగలేదు. సంపాదకుడు.

లిపినిబోలు లిపిలో శాసనములున్నవి. ఒక పండితుడు ఈమూడు విధములైన శాసనములు ఒకటే యని యూహించి ఈ పురాతన ఈజిప్టు శాసనములను కోప్టు భాషాక్షరముల సాహాయ్యముతో చదువగలిగెను. ఈ కోప్టులనువారు ఇప్పటికిని ఈజిప్టులో నివసించు ఒక క్రైస్తవజాతివారు. పురాతన ఐజిప్టీయులనుండి వచ్చినవారు. బాబిలోనియాలో పెంకులమీద, ఇటుకరాళ్ళమీద వ్రాయబడిన క్యూనీఫారం అక్షర శాసనములుగూడ క్రమముగా పరిశీలింపబడినవి. ఈలోపున హిందూదేశములో నాగరి ఆకారములోనున్న అక్షరములతోడి కొన్ని శాసనములు అశోకచక్రవర్తి కాలమునాటివని నిర్ధరించిరి. ఇంతకంటె పురాతనమైన శాసనములు హిందూదేశములో కనుపించలేదు.* ఈజిప్టులో పురాతన లిపిలో, దేవాలయములమీద, స్తంభముల మీద శవములను భద్రపఱచు శిలాపేటికలమీద వ్రాయబడిన వ్రాతలన్నియు క్రమముగా చదువబడి ఈజిప్టు పురాతనత్వమును వెలుగులోనికి దెచ్చెను.

ఈ పురాతన ఐజిప్టీయులు దక్షిణాదియందు పుంటు అను ప్రదేశమునుండి సముద్రములమీదుగా ఈజిప్టునకువచ్చిరి. కొందఱి యుద్దేశ్యములో ఈపుంటు ఇప్పటి మలబారు. ఐజిప్టీయులు ద్రావిడులు ఒకటేయనిరి. వీరి మొట్టమొదటి రాజు మెనెస్. వీరి పురాతనమతము కొంతవఱకు మనపురాణకథలను పోలియుండును. షిబూ అను దేవుడు నూయీా అను ఆడదేవతచేత కప్పబడినాడు. తరువాత షూ అను దేవుడువచ్చి షిబూను కప్పిన నూయీాని తొలగించినాడు. నూయీా దేవత శరీర మాకాశమైనది. ఆమె రెండుచేతులు, రెండుకాళ్ళు ఆ ఆకాశము నాదుకొనుటకు స్థంభములుగా నేర్పడినవి. షిబూ దేవుడు భూమి అయినాడు. నూయీా

* సింధు లిపియును, సుమేరియన్ ఈజిప్షన్ లిపులును ఒకేకాలము నాటివని ఇపుడు గ్రహింపబడినది.

దేవతకు ఒకకొడుకు, ఒకకూతురు కలరు. కొడుకుపేరు మిసిరిస్. కూతురుపేరు ఇసిస్. ఈజిప్టు దేవతలలో వీరు ప్రధానులు. వీరిద్దఱి కుమారుడు హోరుస్ అను దేవత. వీనిని అందఱు భజింతురు. ఈ ముగ్గురిని కలిపి చాలమంది కొలుతురు. వీరిలో ఐసిస్ ధేను రూపముతో కొలువబడును.

భూమిమీద నైలునది యున్నది. దీనివలెనే ఆకాశములో గూడ నైలునది యున్నది. ఆకాశములోనున్న నైలునదికి భూమి మీదనున్న నైలునది యొకశాఖ. ఐజిప్టీయుల దృష్టిలో సూర్యుడు ఒక పడవనెక్కి భూమి చుట్టు తిరుగును. అప్పుడప్పుడు అహి అను పేరుగల పాము అతనిని మ్రింగును. అప్పుడు గ్రహణ మేర్పడును. చంద్రుని అప్పుడప్పుడు ఒక వరాహ మెదుర్కొని చీల్చివేయును. మరల ఆ ముక్క లతికికొనుటకు పదునైదు రోజులు పట్టును. అప్పటి కాతడు స్వస్వరూపమునందును. ఈజిప్టు దేవతలలో కొందఱకు నక్కముఖములు, కొందఱకు డేగ ముఖములు, కొందఱకు ధేనుముఖములు : ఈ విధముగా నుండును.

ఐజిప్టీయుల నాగరకతతో సమకాలీనముగా యూఫ్రేటిస్ నదియొడ్డునందు మఱియొక నాగరకత విలసిల్లెను. ఇచ్చట బాల్, మోలోఖ, ఇస్టార్టె, డాముజీ. ముఖ్యదేవతలు. ఇస్టార్టె దేవత, డ్యాముజీ యను నొక గొల్లవానిని ప్రేమించెను. ఒక వరాహము "డ్యాముజీ"ని చంపెను. ఇస్టార్టె వానిని వెదకుకొనుచు భూమిక్రిందనున్న నరకలోకములోనికి బోయెను. అచ్చట అలాట యనుదేవత యామెను చిత్రవిచిత్రమైన హింసలకు పాల్పడ చేసెను. ఇస్టార్టె వీని నన్నిటికి నోర్చుకొని డ్యాముజీని ఇచ్చివేసినగాని తిరిగి తాను భూలోకములోనికి బోననెను. ఇది పెద్ద చిక్కుసమస్య. ఇస్టార్టె కామదేవత. ఆమె తిరిగి భూలోకమునకు బోయినగాని అచ్చట జంతుజాల మభివృద్ధి చెందదు. అంతట

దేవతలందఱు సమావేశమై ఒక పరిష్కారమార్గమునకు వచ్చిరి. డాముజీ నాలుగు నెలలు నరకములోనుండును. ఎనిమిది నెలలు భూమిమీద నుండును. ఇస్టార్టె దీనికి నొప్పికొని, తిరిగి భూలోకమునకు వచ్చెను. ఆమె రాకతో వసంతోదయమయ్యెను. పంటలు చక్కగా పండినవి.

ఈ డాముజీకి ఇందువల్ల అదునోయి, అదోసిస్ అను పేరు వచ్చినది. ఏవో చిన్ని చిన్ని భేదములను వదలిన సెమిటిక్ జాతుల మతమంతయు ఒక్కటే. బాబిలోనియావారు, యూదులు, ఫోనీషియనులు అరబ్బు జాతులు కొంతకాలము జరిగిన తరువాత ఒకేవిధమైన మతాచారములుకలిగి యుండిరి. వారిలో ప్రతి దేవునికి మొలోఖ్ అను పేరు వంగభాషలో కలదు. ఇది ఇప్పటికిని 'మాలిక్' అను పేరుతో నున్నది. 'మాలిక్' అనగా పరిపాలకుడు. ములుక్ అనగా బెంగాలీభాషలో రాజ్యము. బాల్ అనిగూడ దైవమునకు పేరు. ఏవో చిన్న, చిన్న భేదములు ఉండుననుకొనుడు. కొంతమంది దృష్టిలో అలాత్ అన్న దేవతయే అరబ్బు అల్లాగా మాఱినాడు.

ఈ దేవతల కొలువులో కొన్ని క్రూరమైన ఆచారములు గూడ నుండెడివి. మొలోఖ్ లేక బాల్ కొలువులో చిన్న బిడ్డలను సజీవదహనము చేసెడివారు. ఇస్టార్టే దేవాలయములో స్వాభావికముగాగాని అస్వాభావికముగాగాని కామతృప్తి కలిగించుకొనుట ప్రధానమైన పద్ధతి.

బాబిలోనియా జాతికంటె యూదుజాతి అధునాతనమైనది. కొంతమంది పండితుల యుద్దేశ్యమునుబట్టి బైబిలు గ్రంథము క్రీస్తుపూర్వము ఐదవ శతాబ్ది నుండి క్రీస్తు తరువాత చాల సంవత్సరములవఱకు వ్రాయబడుచునే యుండెనట. బైబిలులో చాల పురాతనములని యనుకొనబడుచున్న బహుభాగములు చాలకాలము పిమ్మట వ్రాయబడినవి. బైబిలులోనున్న ప్రధాన

విషయములు బాబిలోనియనులకు సంబంధించినవి. బాబిలోనియనుల సృష్టిక్రమపద్ధతి, జలప్రళయవర్ణనము బైబిలులోనికి మొత్తము ముత్తముగా ఎక్కింపబడినవి. వీనియన్నింటినిమించి ఆసియామైనరులో పర్షియను చక్రవర్తులు పరిపాలించునపుడు చాల పర్షియను సిద్ధాంతములు యూదుల అంగీకారమును పొందినవి. ఓల్డుటెస్టమెంటునుబట్టి చూచినచో, ఉన్నదంతయు ఈ ప్రపంచమే. ఆత్మ లేదు, మరణానంతర మేమియు నుండదు. న్యూటెస్టమెంటులో మాత్రము, మరణానంతరము జీవునిగతి పునర్జన్మము ఈ రెండు పర్షియను సిద్ధాంతములు చేర్చబడినవి. సేటన్ సిద్ధాంతము కేవలము పర్షియావారిదే. ఈ సిద్ధాంతము లన్నియు న్యూటెస్టమెంటులోనికి చక్కగా నెక్కింపబడినవి.

యూదుల మతమునందు 'ఏవుమోలోభ్' అను దేవతను ప్రధానముగా నారాధింతురు. కాని ఈ పేరు యూదులభాష లోనిదికాదు. కొంతమంది అభిప్రాయములనుబట్టి ఇది ఈజిప్టు భాషాపదము. కాని ఈ పద మెచ్చటినుండి వచ్చినదో ఎవ్వరును సరిగా చెప్పలేరు. ఇస్రేలైటులు ఈజిప్టులో చాలకాలము నివసించి నట్లు బైబిలులో దృష్టాంతములు గలవు. కాని ఈ దృష్టాంత ముల నెవరును నిప్పుడు అంగీకరింపరు. అబ్రహాం, ఐసాకు, జోసెఫ్ మొదలగు పురాణపురుషులందఱు కల్పితపురుషులని చాలమంది యభిప్రాయము.

యూదులు 'ఏవు' అను పేరు ఉచ్చరింపరు. దానికి బదులు 'అదునోయి' అని ఉచ్చరింతురు. యూదులు 'ఇజ్రెయిల్', 'ఎఫ్రెయిమ్' అని రెండు భాగములుగా విభక్తమైనప్పుడు రెండు దేశములందును రెండు ముఖ్యమైన దేవాలయములను కట్టుకొనిరి. ఇస్రేలులు జెరూసలెములో ఒక దేవాలయమును కట్టుకొనిరి. ఆ దేవాలయమునందున్న విగ్రహము ఏవుది. ఈ విగ్రహము అర్ధనారీశ్వరమూర్తి. ఈ విగ్రహమును ఒక కొయ్యపెట్టెలో పెట్టి

భద్రపఱచిరి. ద్వారమువద్ద ఒక పెద్ద లింగాకృతి యున్నది. ఎఫ్రెయిమ్‌వారు కట్టిన దేవాలయములో ఏవు విగ్రహము బంగారము తొడుగు వేసికొనిన వృషభాకృతిగా నున్నది.

ఈ రెండుప్రదేశములందును పుట్టిన పెద్దకొడుకును దైవమునకు ముందు బ్రతికియుండగా తగులబెట్టుట యాచారము. ఈ రెండుదేవాలయములందును కొంతమంది స్త్రీలు భోగమువృత్తితో జీవించుచుందురు. ఈ వృత్తివల్ల వచ్చిన డబ్బు దేవాలయపు ఖర్చుల కుపయోగించువారు.

కాలాంతరమున సంగీతమువల్లనో, నృత్యమువల్లనో దేవతలను తమయం దావేశింపచేసికొనుట యూదులలో నాచారమైనది. ఇట్లు దేవతాహిష్టులుగాగలవారందఱు నొకతరగతిగా నేర్పడిరి. వీరిని మతగురువులందురు. వీరిలో చాలమంది పర్షియనులతో స్నేహమువల్ల విగ్రహారాధనను, పుత్రబలులను, అవినీతిని, వ్యభిచారమును, తదితరమైన యాచారములను వ్యతిరేకించిరి. క్రమముగా మనుష్యబలికి బదులు 'సున్నతి' ఆచారములోనికి వచ్చెను. విగ్రహారాధనము, వ్యభిచారము క్రమముగా అంతర్ధానమయ్యెను. కాలాంతరమున ఈ మతగురువులవల్లనే క్రైస్తవమతము పుట్టినది.

అసలు జీససుక్రీస్తు అను పేరుతో ఒకవ్యక్తి జన్మించియుండెనా యనునది పెద్దవివాదము. న్యూటెస్టమెంటులో నాల్గుభాగములున్నవి. వానిలో జాన్ మహాపురుషుడు వ్రాసినది కేవలము కల్పితమని కొంతమంది నిరాకరించిరి. తక్కిన మూడుగ్రంథములు ఒకపురాతనగ్రంథమునుండి నకలుచేయబడినవని నిర్ణయింపబడినది. ఈ నకలుచేయుటగూడ జీససుక్రీస్తుకు ఏర్పాటుచేసిన తేదీకి చాలకాలము పిమ్మట జరిగినది.

పైగా యూదులలో క్రీస్తు పుట్టినాడని అనుకొనబడుచున్న కాలములో జోసెఫస్, ఫిలో అను ఇద్దఱు చరిత్రకారులు పుట్టిరి.

వారిద్దఱు యూదులలోనున్న చిన్న చిన్న కులములనుగూడ పేర్కొనిరి. కాని క్రీస్తునుగుఱించిగాని, క్రైస్తవులనుగుఱించిగాని వారు కనీసము సూచించియైన నుండలేదు. క్రీస్తునకు రోమను న్యాయాధికారి శిలువపై కొరతశిక్ష వేసినాడను విషయము సూచించియైన నుండలేదు. జోసెఫసు పుస్తకములో ఈ కొరతనుగూర్చి ఒకేఒకపంక్తి యున్నది. కాని అది ప్రక్షిప్తమని నిరూపింపబడినది. యూదులను అప్పుడు రోమనులు పరిపాలించు చుండిరి. వారికి గ్రీకులు శాస్త్రములు, విద్యలు నేర్పుటకు ఉపాధ్యా యత్వము వహించియుండిరి. వారందఱు యూదులనుగుఱించి బహు విషయములను వ్రాసిరి. కాని క్రీస్తునుగుఱించిగాని, క్రైస్తవులను గుఱించి గాని ఇంచుకంతైన ఉటంకించియుండలేదు.

ఇందులో మఱియొక చిక్కున్నది. న్యూటెస్టమెంటునం దున్న బహుసూక్తులు, నియమములు, సిద్ధాంతములు క్రీస్తుశకము నకు చాల ముందే యూదులలో ప్రచారమునందుండెను. ఇవి యన్నియు బహుప్రదేశములనుండి వచ్చిన హీల్లెల్ బోలు రబ్బిన్ మొదలైనవారిచేత ప్రచారముచేయబడినవి. ఈ విషయము లన్నియు పరిశోధకులు చెప్పునవి. కాని వారి ప్రతిష్ఠ దెబ్బతినునను భయముచేత తమ మతమునుగూర్చి వారేమియు నిర్ణయములను చేయలేరు. ఇతరమతములనుగుఱించినయెడల గాఢముగా చేయగల్గుదురు. అందుచేత వారు క్రీస్తుపరిశోధనలో చాల మంద కొడిగా ప్రవర్తింతురు. కాని ఈ చెప్పిన కొంచెమే చాల పెద్ద విమర్శయని చెప్పబడుచున్నది.

పాశ్చాత్యపండితులు బహుదూరదేశములయొక్క మతము లను, ఆచారములను, జాతులను ఇంకను బహువిషయములను గుఱించి పరిశోధనచేయుచున్నారు. మనవంగభాషయందు ఇట్టి పరిశోధన ఏమియులేదు. ఇట్టి పరిశోధన మనభాషయం దెట్లు సంభవించును? ఒకవ్యక్తి పదిసంవత్సరములు ప్రయాసపడి ఇట్టి

గ్రంథము నొకదాని ననువదించవలయునన్నచో ఈ పది సంవత్సరములు అతనికి తినుటకేమియున్నది? ఒకవేళ ననువదించి నను, అచ్చువేయుటకు అతనికి డబ్బెక్కడనుండి వచ్చును?

మనము రెండు ముఖ్యవిషయములు గమనింపవలెను. ఒకటి మనదేశము చాల పేదదేశము, రెండవది ఏవిధమైన విద్యా వ్యాసంగము ఇందు లేదు. మనదేశములో బహువిద్యలను, బహు శాస్త్రములనుగురించి మనము వ్యాసంగముచేయు సుదినము ఉదయించునా? మూగవానికి వచఃకౌశలమును ప్రసాదించుశక్తి, కుంటివానిచే కొండలనుదాటించు కారుణ్యముగల భగవతికి కాళీ మాతకే తెలియవలెను.

ఓడ నేపిల్సు రేవుకు వచ్చినది. మేము ఇటలీ చేరుకొంటిమి. ఇటలీకి ముఖ్యపట్టణము రోమునగరము. ఈ రోమునగరము చాల పురాతనమైన రోమనుసామ్రాజ్యమునకు ముఖ్యపట్టణము. రోమనుసామ్రాజ్యము చాల శక్తిమంతమైనది. రోమనుల రాజ యములు, సైనికశాస్త్రములు, వలసల నేర్పాటుచేసికొను విద్య, ఇతరప్రదేశములను జయించు ప్రజ్ఞ ఈ గుణములన్నియు నేటికిని సర్వప్రపంచమునకును మేలుబంతులుగా నున్నవి. రోమునగరము యొక్క గొప్పతనము ఇందు సూచింపబడుచున్నది.

నేపిల్సును వదలిన తరువాత మా ఓడ మార్సేల్సు రేవులో ఆగినది. అచ్చటనుండి సరాసరి లండను చేరుకొనినది.

మీరు ఇప్పటికే ఐరోపా గురించి చాల వినినారు. వారి ఆహారము, వారివేషము, వారిపద్ధతులు, ఆచారములు మొద లైనవి చాల వినియున్నారు. నేను మరల వానిని గురించి వ్రాయ నక్కరలేదు. కాని పాశ్చాత్యనాగరకత, దానియుత్పత్తి, మనకు దానితోగల సంబంధము మనమెంతవరకు దాని నవలంబించ వలెనో అను ఈరీతి విషయములను గురించి ముందు ముందు నేను చాల చెప్పవలసియున్నది. జన్మవల్ల మనుష్యునకు గౌరవము

రాదు. అందుచేత వీరినిగుఱించి మఱియొకప్పుడు చెప్పెదను. ఐన నేమి లాభము? ప్రపంచములో పెద్దకబురులుచెప్పుటలో, వివాద పడుటలో మనవంగీయులతో ఎవరు తులతూగగలుగుదురు? మీకు చేతనైనచో మీ సామర్థ్యమంతియు పనిలో చూపించుడు. మీ సామర్థ్యమును మీ పని చూపించవలెను. నాలుక ఆడిన ప్రయోజనమేమి? ఒకసంగతిమాత్రము స్పృశించెదను. విజ్ఞానము, అధికారము పేదవాండ్రైన క్రిందితరగతిప్రజలకు సంక్రమించినప్పటి నుండి ఐరోపా దేశము అభివృద్ధిచెందుచు వచ్చినది. ఐరోపాలోని దరిద్రప్రజానీకము ఐరోపానుండి తుడిచిపాఱవేసిన చెత్తవలె అమెరికాకు వలస పంపబడి ఈనాడు అమెరికాదేశమునకు వెన్నె ముకయై నిలిచినారు. భాగ్యవంతులు, పండితులు, నీవుచెప్పునది విని అర్థముచేసికొని నిన్ను మెచ్చుకురు; నిందింతురు. ఈ భూషణ దూషణలవలన కలుగు ఫలితము శూన్యము. ఈ పండితులు, ఈ భాగ్యవంతులు దేశమునకు అలంకారప్రాయులు. అంతే. దేశముయొక్క ప్రాణము నిమ్నజాతులకుచెందిన దరిద్రప్రజా నీకము. సంఖ్య గణనకురాదు. సంపత్తునుకాని, పేదతనమును కాని గ్రహింపవలసిన పనిలేదు. కొలదిమంది మనుష్యులు మనో వాక్కర్మలయందు కలసి కట్టుగా నున్నచో ప్రపంచము నుద్ధరింప గలరు. ఈ నిశ్చయము మఱువకుండ గుర్తుపెట్టుకొనుడు. దీనికి ప్రతిఘటనము ఎంతయున్న అంతమంచిది. ప్రతిఘటనము లేనిదే నదికి వడి వచ్చునా? ఒకవిషయము ఎంతక్రొత్తదైన, ఎంతమంచి దైన ప్రారంభదశయందు అంత ప్రాతికూల్యమును ఎదుర్కొన వలసివచ్చును. ప్రాతికూల్యమునుబట్టి విజయముండును. ప్రాతి కూల్యములేనితావున విజయము హుళిక్కి. ఇక సెలవు.

* * *

పాదములందు చక్రలాంఛనములుగలవాడు దేశద్రిమ్మరి యగునని మనలో సామెత యున్నది. నా పాదములందంతటను చక్రలాంఛనములున్నవని నా భయము. అయినను, గట్టిగా

మున్నవని యనుకొనుటకుగూడ వీలులేదు. నేను నా పాదములను లెస్సగా పరీక్షించి చూచితిని గాని లాభములేకపోయెను. ఈ గోష్ఠులకి నా పాదములన్నియు బ్రద్దలైనవి. అందువల్ల పాదములలో చక్రలాంఛనములుగాని మఱి ఏమిగాని కనుపించలేదు. అయినను అవిధమైన సంప్రదాయమున్నది కాబట్టి నా పాదముల నిండ అట్టి చక్రరేఖలుండుననియే నేను నిశ్చయించితిని. చక్రరేఖ లుండుటవల్ల కలుగు ఫలితముల నిదర్శనము పొడసూపినది.

నేను పారిసునగరములో కొంతకాలముండి ఫ్రెంచిభాషను, ఫ్రెంచినాగరకతను అవగాహముచేసికొనవలెనని ఆశించితిని. నేను నా ప్రాతస్నేహితులను వదలి ఒక క్రొత్తస్నేహితునితో నివసించుచుంటిని. ఇతడొక ఫ్రెంచివాడు. సామాన్యమైన ఆదాయము గలవాడు. ఇతనికి ఇంగ్లీషురాదు. నాకు వచ్చిన ఫ్రెంచి మిగుల చమత్కారమైనది. ఇంగ్లీషురాని ఫ్రెంచివారిమధ్య నివసించుచున్నప్పుడు మనము ఫ్రెంచిభాషలో మాట్లాడవలెను. లేనిచో మూగవానివలె నూరకుండవలెను. కాని నోరుమూసికొని కూర్చుండుట చాల కష్టముగదా. ఈ నోరుమూసికొని కూర్చుండలేనితనము ఫ్రెంచిలో నన్ను మాట్లాడింపజేయుననియు, దానివల్ల అతిత్వరగా ధారాళముగా మాట్లాడుట సంభవించుననియు నేను భావించితిని. కాని దీనికి వ్యతిరేకముగా నేనిప్పుడు వియన్నా, టర్కీ, గ్రీసు, జెరూసలెం దేశములలో తిరుగవలసి వచ్చినది. దైవగతి నెవరు తప్పింపగలరు! నేనిప్పుడు మీకీ యుత్తరమును మహమ్మదీయుల ప్రాభవమునకు చివరి ముఖ్యపట్టణముగా నిలిచియున్న కాన్స్టాంటినోపుల్‌నుండి వ్రాయుచుంటిని.

నాతోబాటు ముగ్గురు స్నేహితులు ప్రయాణముచేయుచున్నారు. వీరిలో ఇద్దఱు ఫ్రెంచివారు. మూడవవ్యక్తి అమెరికా దేశీయురాలు. ఈమెపేరు కుమారి మాక్లియోడ్. ఈమెను మీరు బాగుగా నెఱుగుదురు. ఫ్రెంచివారిలో ఒకడు పురుషుడు.

అతనిపేరు జూలెస్ బోయిస్. ఇతడు చాల ప్రసిద్ధుడైన వేదాంతి, సాహిత్యవేత్త. రెండవవ్యక్తి స్త్రీ. ఈమెపేరు కుమారి కాల్వే. ఈమె ప్రపంచప్రసిద్ధినందిన గాయకురాలు. "మాన్షోరు" అనగా ఇంగ్లీషులో "మిస్టరు"అనియు, "మేడమోసెల్"అనగా "కన్య" యనియు గ్రహింపవలెను. ఈ కాల్వేకన్య ఈ కాలమునందు అగ్రస్థానము వహించిన గాయకురాలు. నృత్యనాటకములందు గాయకురాలు. ఈమెసంగీతప్రదర్శనములు చాలప్రస్తుతికెక్కినవి. ఈమెకు ఈప్రదర్శనములవలన సంవత్సరమునకు మూడు, నాల్గు లక్షల రూపాయలు వట్టి గానమువల్లనే వచ్చును. దీనినిబట్టి ఈమె ప్రశస్తి ఎట్టిదో ఊహింపవచ్చును. నాకీమెతో పూర్వపరిచయమున్నది. పాశ్చాత్యదేశములందు సంగీతమునం దీమెయును, నాట్యమునందు మేడం "సారాబెరన్"హార్డు అను నామెయు అగ్రగాములు. వీరిద్దఱు కూడ ఫ్రెంచివారే. వీరికి ఆంగ్లభాష అక్షరముకూడ రాదు. కాని వీరప్పుడప్పుడు ఇంగ్లండు అమెరికాలకు పోయి, అచ్చట లక్షల కొలది డాలర్లు తమప్రదర్శనములవలన సంపాదింతురు. ఫ్రెంచిభాష ప్రపంచమునందు నాగరకభాష. పాశ్చాత్యదేశములందు ఫ్రెంచి భాష మాటాడుట నాగరకలక్షణము. ఫ్రెంచిభాష పాశ్చాత్య దేశమునందు ప్రతివానికిని వచ్చును. అందువలన ఈ ఇరువురు స్త్రీలకు ఇంగ్లీషు నేర్చుకొనవలయునని వాంఛగాని తీరుబడిగాని లేదు. మేడం బెరని హార్డు వయసుమీఱిన స్త్రీ. కాని వేషము వేసికొని రంగస్థలమునందామె యడుగుపెట్టినంతనే ఆమె ఏ వేషము ధరించినను ఆవేషమునకు సరియైన వయస్సులో సౌష్టవముతో సంపూర్ణముగానున్నట్లు భాసించును. అది పురుషవేషముగా వచ్చును, స్త్రీవేషము గావచ్చును. ఒక బాలికయో, ఒక బాలుడో—ఏ వేషము వేయుమన్న ఆ వేషమును ఆమె చక్కగా వేయును. మఱి యామె కంఠస్వరము ఏమిచెప్పుదును? ఇచ్చటి ప్రజలు ఆమె కంఠము వెండితీవలుగల జంత్రమువలె మ్రోగునని మెచ్చుకొందురు. మేడం బెరన్ హార్డుకు హిందూదేశమనిన చాల

యభిమానము. హిందూ దేశము చాల పురాతన దేశమని, నాగరకతగల దేశమని ఆమె ఎప్పుడును నాతో చెప్పుచుండును. ఒక సంవత్సరము ఆమె భారతదేశమునకు సంబంధించిన ఒక నాటకమును ప్రదర్శించెను. ఆనాటకములో భారతదేశములో పురుషులు, స్త్రీలు, బాలురు, బైరాగులు, నాగప్రజలు మఱి సమస్తముగల అచ్చమైన భారతీయదృశ్యము రంగస్థలముమీద ప్రదర్శింపబడినది. ఆ ప్రదర్శనమైపోయిన తర్వాత ఆమె తాను ప్రతి పురాతనవస్తు ప్రదర్శనశాలను ఒక నెలరోజులు తిరిగి తిరిగి చూచి, భారతదేశములోని పురుషులు, స్త్రీలు, వారి వేషధారణ, స్నానఘట్టములు మొదలైన సర్వము అవగాహముచేసికొంటినని నాతో తెలిపినది. మేడమ్ బెర్న్‌హార్డుకు భారతదేశమును దర్శింపవలయునని పెద్ద కోరికయున్నది. 'అది నాజీవితాశయము' అని ఆమె యనుచుండును. వేల్సురాకుమారుడు (ఈయనయే తర్వాత 7-వ ఎడ్వర్డు ప్రభువు) పెద్దపులివేట, ఏనుగువేట ఆమె భారతదేశము వచ్చిన, తానేర్పాటుచేయుదుమనని చెప్పెను. కాని యామె తాను భారతదేశమునకువచ్చినచో రెండు లక్షల రూపాయలవఱకు వెచ్చింపవలసివచ్చునని చెప్పెను. ఆమెకు ధనలోపములేదు. ఎట్లుండును ? ఆపిడకు 'అప్సరస'యని పేరుకలదు. ఆమెకు డబ్బేమి తక్కువ ? ఆమె ప్రత్యేకమైన రైలుబండిలోగాని ప్రయాణము చేయదు. ఆవైభవము, విలాసము ఐరోపాలోని పెద్ద పెద్ద రాకుమారులే యనుభవింపజాలరు. ఆమె ప్రదర్శనమునకు నొక నెలముందుగా రెట్టింపుధరనిచ్చి టిక్కెట్లుకొందురు. ఆమెకు డబ్బు తక్కువలేదునకే, ఆమె ఏమైన తక్కువఖర్చుపెట్టుననుకొన్నారా? అందుచేత తాత్కాలికముగ భారతదేశమున కామె ప్రయాణము వాయిదాపడెను.

కుమారి కాల్వే ఈ శీతకాలమంతయు సంగీతము పాడదు. విశ్రాంతి తీసికొనును. ఈజిప్టు మొదలైన యుష్ణదేశముల కామె యిపుడు పోవుచున్నది. నేనిప్పు డామెకతిథిగా పోవుచున్నాను.

కాల్వే పాండిత్య మొక్క సంగీతమునందేకాదు. ఇతరవిద్యలు కూడ ఆమెకు చక్కగావచ్చును. వేదాంతమన్నను, తద్గ్రంథము లన్నను, మతగ్రంథములన్నను ఆమెకు చాలయిష్టము. ఆమె చాల నిరుపేద కుటుంబములో పుట్టినది. క్రమముగ బహుకష్టము లనుభవించి మిక్కిలిశ్రమపడి స్వీయ ప్రతిభవల్ల ఇప్పుడు భూరి సంపదనార్జించినది. ప్రభువులయొక్క ధనవంతులయొక్క ఆద రాభిమానములకు పాత్రమైనది.

మేడమ్‌మెల్బా, మేడమ్‌ఎమ్మాఏమెస్ మొదలైనవారు చాలమంది ప్రశస్తిగల గాయకురాండ్రున్నారు. జీన్ డిరెస్కీ, ప్లాంకన్ మొదలైన ప్రసిద్ధులైన గాయకులున్నారు. వీరందఱు సంవత్సరమునకు 2, 3 లక్షలు సంపాదింతురు. కాని కాల్వే సంగీతము బహువిలక్షణప్రతిభాయుతమైనది. ఆమె అతిలోక సౌందర్యము, యౌవనము, ప్రతిభ, మధురగంధర్వగాత్రము — ఇవి యన్నియు నామె గాయకులందఱికన్న మిన్నయగుటకు కారణములైనవి. ఈ యన్నింటికంటె శ్రమ, పేదరికము ముఖ్య కారణములు. పరిశ్రమ, దారిద్ర్యములకంటె గొప్ప యుపాధ్యా యులు లేరు. బాల్యములో నిరుపేదతనము, శ్రమ, కష్టములు— ఈ యన్నింటితో పోరాడి కాల్వే జయము గాంచినది. ఈ గుణ ములే యతిసహృదయత్వమును, పరిపూర్ణమైన హుందాతనమును ఆమెకు సంపాదించిపెట్టినవి. మఱి పాశ్చాత్యదేశములలో స్వీయ ప్రజ్ఞను వ్యక్తీకరించుటకు చాల యవకాశములున్నవి. మన దేశములో ప్రజ్ఞతోపాటు ఉత్సాహమున్నను, అవకాశములు శూన్యముగదా! వంగదేశములో స్త్రీలు చదువుకొనుట కుత్సాహ పడినను, అవకాశములు లేవు. కావున ఫలితము శూన్యమేకదా! మఱి వంగభాషలో నేర్చుకొనుటకుమాత్ర మేమున్నది? ఎంత చెప్పిన నేవో కొన్ని పనికిమాలిన నవలలు నాటకములేకదా అందున్నవి! పైగా పాండిత్యమనిన వైదేశికభాషకో, సంస్కృత మునకో పరిమితమాయెను. అదియును కొంతమందికే సాధ్య

మాయెను. ఈ పాశ్చాత్య దేశములలో మాతృభాషలోనే యనంతములైన గ్రంథములున్నవి. వీనినిమించి ఏదైన వైదేశికభాషలో ఒక క్రొత్తవిషయము ప్రచురితమైనచో, అది వెంటనే భాషాంతరీకరింపబడి ప్రజలందఱి యందుబాటులోనికి వచ్చును.

జూలీస్ బోయిాస్ ప్రసిద్ధుడైన గ్రంథకర్త. అతడు ప్రధానముగా వివిధమతములయందు, తద్విశ్వాసములం దిమిడియున్న చారిత్రకవిషయములను వెలుగులోనికి కొనితెచ్చుటలో ప్రవీణుడు. భూతోచ్చాటనము, మంత్రశాస్త్రము, గారడి, చనిపోయినవారి జీవులతో సంభాషించుట — ఈ మొదలైన మధ్యకాలపు పాశ్చాత్య దేశములలోనున్న విద్యలను, తంత్రములను గుఱించిన చారిత్రకాంశముల నతడొక పెద్దగ్రంథముగా రచించెను. ఇది చాల ప్రసిద్ధమైనది. అతడు గొప్పకవి. విక్టర్ హ్యూగో, లామర్టైల్ మొదలైన ఫ్రెంచికవులకును, గెటె, షిల్లర్ మొదలైన జర్మనుకవులకును సంక్రమించిన భారతీయవేదాంతసిద్ధాంతములకు నతడు చక్కని ప్రచారకుడు. పాశ్చాత్యకవిత్వముమీాద, తత్త్వశాస్త్రములమీాద భారతీయవేదాంతముయొక్క ముద్ర మిక్కిలి యధికము. ప్రతిగొప్పకవియు వేదాంతియే. తత్త్వశాస్త్రముపైన ఏగ్రంథమువచ్చినను ఏదోరకముగా దానియందు మనవేదాంతసిద్ధాంతములు చొరబడవలసినదే. వారిలో కొంతమంది భారతీయవేదాంతమునకు తాము ఋణపడినట్లు చెప్పుకొనరు. కేవలము స్వప్రతిభమీాదనే ఆయా సిద్ధాంతములను స్థాపించితిమని చెప్పుకొందురు. హెర్బర్ట్ స్పెన్సర్ మొదలైనవా రిట్టివారు. కాని యధికసంఖ్యాకులు బహిరంగముగ తా మప్పుపడియుండుట నొప్పుకొందురు. ఈ దినములలో — టెలిగ్రాఫ్, రైలుబండ్లు, వార్తాపత్రికలు వచ్చిన రోజులాయె! ఒప్పుకొనక యేమిచేయుదురు? జూలీస్ బోయిాస్ చాల పెద్దమనిషి. అడకువగలవాడు. పెద్ద డబ్బున్నవాడుకాడు. పాఱిస్‌లో పాపము నాకు చాల మైత్రితో

ఆతిథ్యమిచ్చినాడు. ఇప్పుడు మా వెంట ప్రయాణముచేయుచున్నాడు.

కాన్‌స్టాంట్‌నోపిల్ వఱకు మా వెంట మఱియిద్దఱు స్నేహితులు వచ్చిరి. పేరీహైసింథీ, ఆయనభార్య. వీరిద్దఱు దంపతులు. 'పేరీ' యనగా 'ఫాద' రని యర్థము. అనగా సన్న్యాసి. అతడు రోమన్ కాథలిక్ ఛర్చికి చెందినవాడు. అతనిపాండిత్యము, అతని వాగ్మిత, అతని తపోదీక్ష అతనికి ఫ్రాన్సులోను, కాథలిక్ మత పద్ధతిలోను పెద్దమర్యాద కలుగుటకు కారణములైనవి. విక్టర్ హ్యూగో ఫ్రాన్సులో చాల గొప్పకవి. అతడు ఇద్దఱు వ్యక్తుల ఫ్రెంచిభాషాశైలిని మెచ్చుకొనెడివాడు. ఆ యిద్దఱిలో నొకడు హైసింథీ. పేరీహైసింథీ నలుబదిసంవత్సరముల వయస్సులో ఒకఅమెరికనుస్త్రీని వలచి, వివాహమాడెను. దీనివల్ల పెద్దఅల్లరి పుట్టెను. కాథలిక్ మతమునుండి ఇతడు బహిష్కృతుడయ్యెను. పేరీహైసింథీ వెంటనే సన్న్యాసివేషమును దీసివేసి 'బురఖా' బదులు "హేటు, కోటు, బూటు" వేసికొనినాడు. గృహస్థుడైనాడు. లాయిసన్ అని పేరుపెట్టుకొనినాడు. నేనుమాత్ర మతనిని వెనుకటిపేరుతోనే పిలుతును. ఇది చాలకాలమునాటి కథ. సముద్రపుతోపాఖండమందు ఈకథయే ప్రతివారినోట నుచ్చరింపబడినది. యావత్తు ఖండము ఈ యుదంతములో ప్రతిధ్వనించినది. ప్రొటెస్టాంటుమతస్థు లతనిని మిక్కిలి గౌరవముతో స్వీకరించిరి. కాథలిక్కులు అతనిని ద్వేషింప మొదలిడిరి. అతని ప్రతిభాపాండిత్యములుచూచి 'పోప్' అతనిని వదలుకొనుట కిచ్చగింపక అతనిని గ్రీకుకాథలిక్ పురోహితునిగా నుండుమనియు, రోమన్ ఛర్చిని వీడవలదనియు నభ్యర్థించెను. గ్రీకుకాథలిక్ పురోహితు లొకక్కపర్యాయము పెండ్లియాడవచ్చును. కాని వారికి పెద్దయుద్యోగమిచ్చుటకు వీలులేదు. లాయిాసన్ భార్య మాత్రము దీని కొప్పుకొనలేదు. 'పోప్' అధికారములోనుండి భర్త నీవలకు లాగినది. కాలాంతరమున వారికి పుత్రపౌత్రాభి

వృద్ధియైనది. ఇప్పుడు లాయీాసన్ ముసలివాఁడైనాఁడు. జెరూసలెము నకుపోయి యచ్చట క్రైస్తవులకు, మహమ్మదీయులకు స్నేహసంబంధములను నెలకొల్పవలెనని వచ్చుచున్నాఁడు. లాయీాసన్ మార్టిన్‌లూథర్‌వలె మాఱి, పోప్‌యొక్క సింహాసనమును మధ్యధరాసముద్రములో పాఱవేయగలడని లాయీాసన్ భార్య యెప్పుడును కలలు కనుచుండును. కాని యటువంటిదేమియు జరుగలేదు. జరిగినదెల్ల నొక్కటే. అతడు త్రిశంకుస్వర్గములో వ్రేలాడుట. కాని లాయీాసన భార్య యింకను పగటికలలు కనుచునేయున్నది. ఈ ముసలి లాయీాసన్ కలుపుగోలుతనము కలవాఁడు. నమ్రతగలవాఁడు. భక్తిభావభరితమైన హృదయము గలవాఁడు. అతడు నన్ను కలసికొన్నపుడెల్ల బహుమతములను గుఱించి, వానిశాఖాభేదములనుగుఱించి దీర్ఘముగ సంభాషించుచుండెడివాఁడు. కాని స్వభావముచే భక్తుఁడగుటవల్ల అద్వైతమునిన కొంచెము భయపడుచుండును. ఆయనభార్యకు నే నన్నచో నంత యిష్టములేదనుకొందును. ఆ వృద్ధునితో నేను త్యాగమును గుఱించి, సన్న్యాసమునుగుఱించి చర్చించుచున్నపుడెల్ల అతని హృదయములో నాయాపురాతనభావములు మేల్కొనుచుండెడివి. అతనిభార్యమాత్రము కోపపడుచుండెడిది. మఱి ఫ్రెంచివారందఱు స్త్రీలు, పురుషులుకూడ తప్పంతయు నీమెతలపైననే పెట్టుదురు. "అదుగో! ఆమెయే మనసన్న్యాసి శిరోమణిని పతితుని గావించిన"దని వ్రేలుపెట్టి చూపింతురు. ఈ దంపతులు క్యాథలిక్ మతమునకుచెందిన పారిస్‌వాసులు. కావున పాపము లాయీాసన్ భార్యస్థితి చాల విచారకరముగా నున్నది. ఫ్రెంచి వారు వివాహితుడైన పురోహితుడు కన్పించిన మండిపోవుదురు. గృహస్థుడైనవాడెవడైనను మతోపన్యాసము చెప్పినచో క్యాథలిక్కులు సహింపరు. లాయీాసన్‌భార్యకు కొంచె మసూయ కూడ నున్నది. ఒకప్పుడామె ఒకనర్తకి నిట్లు చీవాట్లుపెట్టినది! "నీవు వానిని పెండ్లిచేసికొనకుండ, వానితోనుండుట చాలతప్పు

సుమీ!'' యని పలికినది. ఆ న ర్తకి ఇట్లు త్రిప్పికొట్టినది. ''నీకన్న నేను వేయిరెట్లు మెఱుగు. నేనున్నది ఒక సామాన్యమానవునితో. నేను వానిని వివాహముచేసికొననిమాట నిజమే. మఱి నీవో? నీయంత పాపాత్మురాలు లేదు. ఒకసన్న్యాసిశిరోమణిని పతితుని జేసినావు. నీకతనిమీద అంతప్రేమయున్నచో అతనివద్ద ఒక దాదివలె నీవుండవలసినది. అట్లుండక నీవు వానిని పెండ్లి చేసికొని గృహస్థుగా మార్చి నాశనముచేసితివి.''

ఐనను వీనినన్నిటిని నేను విని మెదలక యూరకుంటిని. ముదుసలియైన పేరీహైసింథీ నిజముగ మధురమైన స్వభావము గల వాడు. ప్రశాంతహృదయుడు. అతడు సంసారసుఖము కలవాడే. భార్యాపుత్రులతో సుఖముగానున్నాడు. ఫ్రెంచిప్రజలందఱు దీని కేమిచెప్పుదురు? ఆయనభార్య కొంచెము దిగివచ్చినదైన అంతయు సర్దుకొని పోయెడిది. కాని ఒక్కవిషయమున్నది. ఏదేశమం దైనను నొక విషయము నర్థముచేసికొనుటలోగాని, తీర్మానించుట లోగాని స్త్రీలపద్ధతి వేఱు, పురుషులపద్ధతి వేఱు. స్త్రీలదృష్టి వేఱు, పురుషులదృష్టి వేఱు. స్త్రీలొక దృష్టిపథమునుండి వాదింతురు. పురుషులు వేఱొకదృష్టిపథమునుండి వాదింతురు. పురుషులు తప్పం తయు మగవానిపై మోపి, స్త్రీయందు సానుభూతి చూపింతురు. స్త్రీలు తప్పంతయు స్త్రీపై మోపి పురుషులయందు నిర్దోషత నాపాదింతురు.

ఈ స్త్రీపురుషుల సహవాసమువల్ల నాకొక మంచిలాభము కలిగినది. ఐతే వీరిలో నొక్క యమెరికాస్త్రీని మినహాయించి వీరెవ్వరికి నింగ్లీషురాదు. అందుచే నింగ్లీషు మాట్లాడుట కట్టి పెట్ట వలసివచ్చెను.* ఏదో ఒకవిధముగ నేను ఫ్రెంచి మాట్లాడుట వినుట తప్పలేదు.

---

* ఒక సంఘములో ప్రసంగించునపుడు ఎల్లరకును తెలిసిన భాషను మాత్రమే వాడవలెను. ఏయొక్కరునకైనను తెలియనిభాషలో ప్రసంగించుట పాశ్చాత్యదేశములలో మర్యాదకాదు.

నేను అన్ని దేశములు చక్కగా దర్శించుటకు వీలుగా ప్యారిస్‌లో మన స్నేహితుడు 'మాక్సిం' తక్కిన యనేక దేశముల వారికి నన్నుగుఱించి పరిచయపత్రములు వ్రాసి యిచ్చెను. 'మాక్సిం' ఎవరో నీకు తెలియునా? ప్రసిద్ధమైన మాక్సిం తుపాకిని కనిపెట్టినవాడు. ఈతుపాకి దానియంతటనదియే గుండ్లను నింపుకొనగలదు. వదలనుగలదు. వరుసగా ననేకపర్యాయములు ప్రేల్చుటకనువైనదిది. మాక్సిం—జన్మచేత అమెరికన్. ఇపు డింగ్లాండులో స్థిరపడెను. అక్కడ తుపాకినిర్మాణశాలలు కట్టించెను. ఎవరైన అదేపనిగ నతనిముందు నతని తుపాకినిగుఱించి చెప్పినచో నతడు కొంచెము విసిగికొనును. "బాబూ! వినాశకరమైన యీ యంత్రమును గనిపెట్టుటతప్ప నా ప్రయోజకత్వము వేఱే యేమీ లేదా?" యని యడుగును. మాక్సింకు చైనాయన్నను, భారతదేశమన్నను చాల యిష్టము. అతడు మతముపై, తత్త్వశాస్త్రముపై బహురచనలు గావించెను. నా పుస్తకములు చాల కాలమునుండి చదువుచున్నాడు. కాబట్టి నే నన్నచో నతనికి విపరీతమైనభక్తి. అతడు చాలమంది రాజులకు, ప్రభువులకు తుపాకులు సరఫరాచేయును. ప్రతిదేశమందును పేరుగలవాడు. అతనికి 'లి-హూంగ్-చాంగ్' చాల ముఖ్యస్నేహితుడు. చైనా యన్నచో నతనికి గౌరవ మెక్కువ. కాన్ఫూషియస్ మత మన్నచో భక్తియెక్కువ. అపుడపుడు చైనావారి పేరులనుపోలు మాఱుపేరులతోనాతడు క్రైస్తవులకు వ్యతిరేకముగావారు చైనా దేశమునకు పోవుటలోగల యుద్దేశములు మొదలైనవానినిగుఱించి వార్తాపత్రికలలో విమర్శించువాడు. క్రైస్తవమతప్రచారకులు చైనాలో తన్మతప్రచారముచేయుట బొత్తుగా వానికి గిట్టదు. అతనిభార్యకూడ అతనివలెనే చైనాయన్నచో నిష్టపడును. క్రైస్తవమతమును ద్వేషించును. వారికి పిల్లలులేరు. ముసలివాడు. మహాభాగ్యవంతుడు.

నా ప్రయాణప్రణాళికలో నివిచేరినవి: ప్యారిస్‌నుంచి వియన్నా అచ్చటనుండి రైలుమీద కాన్‌స్టాంట్‌నోపిల్ — అచటనుండి స్టీమరుపై ఏథెన్సు, గ్రీసు—అటనుండి మెడిటరేనియన్‌మీదుగా ఈజిప్టు—అచటనుండి ఆసియామైనరు, జెరూసలెం మొదలైన దేశములు. ప్యారిస్‌నుండి కాన్‌స్టాంట్‌నోపిలుకు ఓరియంటల్-ఎక్సుప్రెస్సు పోవును. దానియందు నిద్రించుటకు, కూర్చుండుటకు అమెరికన్‌పద్ధతిలో సదుపాయములుగలవు. అమెరికన్‌రైలుబండ్లవలె నవి సర్వసమగ్రముగ లేకపోయినను వానియందు సదుపాయములు చక్కగానే యున్నవని చెప్పవచ్చును. అక్టోబరు 24-వ తారీకున నేను ప్యారిస్‌నుండి బయల్దేరవలెను.

నేడు అక్టోబరు 23 వ తేది. రేపు సాయంకాలము నేను పారిస్‌నుండి బయల్దేరవలెను. ఈ సంవత్సరములో పారిస్ 'ఎగ్జిబిషన' జరుగును. కాబట్టి ప్రపంచములోని నాగరక దేశముల నుండి బహుజను లిచట సమాగతులైరి. చాల ప్రసిద్ధులైన స్త్రీ పురుషులు ప్రపంచకములోని నలుమూలలనుండి యిచ్చటకు వచ్చిరి. తమప్రతిభావిశేషములవల్ల తమదేశములయొక్క కీర్తి వైభవములను జూచుటకు మహామేధావులైన ప్రజలు బహుదేశములనుండి యీనాడు పారిస్‌లో గుమికూడిరి. ఈ నా దెవని పేరీప్రదేశమున మ్రోగునో యతనిదేశముయొక్క కీర్తివైభవములుకూడ ప్రపంచమునందు పరిమళించును. ఓ నా మాతృదేశమా! వంగదేశమా! ఈ జర్మను, ఫ్రెంచి, ఇటలీ మొదలైన దేశములనుండి వచ్చిన పండితులతో నిండిన యీ పెద్ద పారిస్ నగరములో నీకు చోటున్నదా? నీ పేరుచెప్పుట కెవ్వడైన నున్నాడా? నీవొకదేశమవున్నావని యిక్కడెవరు ప్రకటింతురు? ఆ మహాప్రతిభావంతులగు తెల్లవాండ్రు కూర్చున్న వరుసలోనుండి యొక యువకుడు తన మాతృదేశమునుగుఱించి తెలుపుటకు ముందుకు వచ్చెను. అతని మాతృదేశము వంగదేశము. అతడు ప్రపంచమునందంతటను ప్రసిద్ధుడైన వైజ్ఞానికుడు. అతడు

డాక్టర్ జగదీశ్ చంద్రబోస్. ఆ యువకవంగవిజ్ఞానియొక్కడే తన యద్భుతప్రతిభచేత పాశ్చాత్యసభ్యులను ఈదినమున సత్యాశ్చర్య చకితులను గావించెను. సగముచచ్చిన తనమాతృభూమికి నూతన జీవము నొసంగెను. భౌతికవిజ్ఞానవేత్తలందఱిలో జగదీశచంద్ర బోసు ఈనాడు శిరోమణియై దీపించెను. జగదీశచంద్రబోసు భారతీయుడు. వంగీయుడు. ఇతడు గొప్పనిర్వాహకుడు. మహా వీరుడు. ఇతడును, విద్యావతి, గుణవతియునైన ఇతనిభార్యయును —వీరిద్దఱు నేయేదేశములకు వెళ్లినను అచట భారతదేశము యొక్క గొప్పదనమును దీపింపజేయుదురు. వంగమాతయొక్క కిరీటమునందు క్రొత్తరత్నములు పొదుగుదురు. వీరిద్ద అదృష్ట వంతులైన దంపతులు.

లెగెట్టు పారిస్‌లోని తన భవనములో ప్రతిదినము చాల గొప్ప స్త్రీ పురుషుల నాహ్వానించి చాల ధనము వెచ్చించి వారికి విందులు చేసెడివాడు. అదికూడ నేటితో నంతమందును.

కవులు - వైజ్ఞానికులు - నీతిశాస్త్రవేత్తలు - తత్త్వవేత్తలు రాజకీయవేత్తలు గాయకులు - పండితులు చిత్రకారులు శిల్పులు మొదలైన ప్రసిద్ధ స్త్రీ పురుషులు లెగెట్టు నింటిలో కలిసికొనెడివారు. అతని ఆతిథేయత, సానుభూతి యట్టిది. ఆ ఎడతెగని సంభాషణలు కొండమీాదినుండి దూకుచున్న సెల యేటివలె సాగుచుండును. నలుదిక్కులనుండి వివిధములైనభావము లగ్నికణములవలె వ్యాపించుచుండెడివి. ఆ సంగీతము మంత్రముగ్ధ లను జేసెడిది. మహాప్రతిభావంతులైనవారు తమతమ భావము లను జర్చించుకొనుచుండగా నందఱును ముగ్ధులై దేశకాలములను మఱచి నోరుదెఱచుకొని వినుచుండెడివారు. ఇవన్నియు నేటితో నంతమైనవి.

పుడమిపై పుట్టి గిట్టనిది లేదు. ఈ పారిస్ 'ఎగ్జిబిషన్' లోనికి మఱల నే నీరోజున తిరిగివచ్చితిని. మెఱపుతీవలవంటి భావములు

ఇచ్చుట కుప్పవడినవి. ఇదొక విశిష్టమైన సభ. భూమిపైకిదిగినవి దివ్యదృశ్యము.

రెండు మూడు దినములనుండి పారిస్‌లో వాన కురియుచున్నది. పారిస్ అన్నచో సూర్యునకు చాలదయ. ఈ మూడు రోజులు పారిస్‌కు పరిచితమైన తనరశ్మి నత దుపసంహరించుకొనినాడు. బహుశః ఈ కళలు కళావేత్తల సభకు వెనుక రహస్యముగా ప్రవహించుచున్న ఇంద్రియలోలతను చూడలేక తన ముఖమును మబ్బులతో గప్పికొనినాడేమో! లేక వివిధవర్ణ సమ్మిశ్రణమైన ఈ మాయాస్వర్గముయొక్క జరుగబోవు వినాశము చూడలేక దుఃఖముతో తన మొగమును మబ్బుదొంతర్ల చాటున దాచుకొనినాడేమో!

ఈ దృశ్యమును జూడకుండ తప్పించుకున్నందుకు మాకు కూడ చాల సంతోషము. ఈ 'ఎగ్జిబిషన్' చెదరిపోవుట ఒక పెద్ద వ్యవహారము. ఈ భూతలస్వర్గము — ఈ పారిస్‌పట్టణములో నున్న వీథులు — దుమ్ముతోను, పెంటతోను నిండియుండును. ఒకటి రెండు వదలి కడమయిండ్లన్నియు దాని లోనిభాగము లన్నియు కొయ్యముక్కలు, పీలికలు, సున్నపుబూతలు గలిగి యున్నవి. ఈ యిండ్లన్నియు పడగొట్టినపు డీ సున్నపుదుమ్ము వ్యాపించి ముక్కులోను నోటిలోను ప్రవేశించి, ఎల్లరను ఉక్కిరిబిక్కిరిచేయును. పీలికలు, ఇసుకమన్ను, ఇవి యన్ని వీథులందు నిండిపోయి వానిని పంకిలమయ మొనరించును. దీనికితోడు వానకూడ కురిసినచో వేఱుగ చెప్పనక్కఱలేదు.

అక్టోబరు 24-వ తారీఖున సాయంకాలము రైలులో పారిస్ నుండి బయల్దేరితిమి. ఆరాత్రి చాల చీకటిగానున్నది. బోయిస్, నేను నొకపెట్టెలో నెక్కితిమి. త్వరగా నిద్రపోయితిమి. తెల్లవారుసరికి మేము ఫ్రాన్సు సరిహద్దుదాటి జర్మనీ ప్రవే

శించితిమి. నేను జర్మనీని చక్కగా చూచితిని. ఫ్రాన్సును చూచిన తర్వాత జర్మనీని చూచినపుడు రెంటికిని గల భేదము కొట్టవచ్చినట్లు కన్పించును. ఒకప్రక్క సమస్తప్రపంచమందు ప్రసిద్ధిగాంచిన ఫ్రాన్సుదేశము క్షీణించిపోవుచుండగా నింకొకప్రక్క జర్మనీ త్వరత్వరగా నభివృద్ధిగాంచుచున్నది. ఒక ప్రక్క నల్లని వెంట్రుకలు కొంచెము పొట్టవారైన విలాసవంతులు మిక్కిలి నాగరకులునైన ఫ్రెంచిప్రజలు వారియొక్క కళాకౌశలముతో నొప్పుచుందురు. వారికి కళ జీవితలక్ష్యము. వారి జీవితములో కళ మేళవించినది. ఇంకొకప్రక్క బూడిదరంగు జుట్టుకలిగి మిక్కిలి ఒడ్డూపొడుగూ కలిగిన జర్మనుప్రజల మొఱటైన, నేర్పులేని కళారహితమైన పనులు కానవచ్చును. పారిస్ తర్వాత అంత గొప్ప పట్టణము పాశ్చాత్యదేశములలో లేదు. తక్కిన ప్రతి పట్టణము పారిస్‌కు నకలు. కనీసము పారిస్ ననుకరించుటకు ప్రయత్నము కన్పించును. కాని ఫ్రాన్సు కళయందొక దివ్యసౌందర్యము, వైభవమునున్నవి. జర్మనీ, ఇంగ్లాండు, అమెరికాలలో ఫ్రాన్సుకళానుకరణము మొద్దుగను మొఱటుగను నుండును. ఫ్రాన్సువారు దౌర్జన్యముచేసినను సొగసుగానుండును. జర్మనులు సుందరులుగా కన్పడుటకు చేయు ప్రయత్నములును భయంకరముగానుండును. ఫ్రెంచివారు కోపము ప్రకటించినను అది సుందరముగానుండును. జర్మను ప్రజలు చిఱునవ్వునవ్వినను భయంకరముగానుండును. ఫ్రెంచినాగరకత యుత్సాహపూరితమైనది.' పచ్చకప్పురము కస్తూరితావివలె నది యీకొసనుండి యాకొస కొక్కమాఱు గుబాళించును. జర్మన్ నాగరకత పట్టి బండగా నుండును. సీసమువలె, పాదరసమువలె బరువుగా నుండును. పడినచోటినుండి యది కదలలేదు. జర్మనుల బండబలము ఎట్టిదనగా వారు అవిశ్రాంతముగా పనిచేయుచుందురు. ఫ్రెంచివారిశరీరములు మృదులమైనవి. కాని వారు నిష్ఠతో పని చేయుట మొదలు పెట్టినచో నది యినపసుత్తితో కొట్టినట్లుండును. అది ఓర్వరాకుండును.

జర్మనులు ఫ్రెంచిపద్ధతిలో పెద్దపెద్ద భవనములు, హర్మ్యములు కట్టుచున్నారు. పెద్దశిలావిగ్రహములు, వీరవిగ్రహములు ఆ భవనములపైన నెలకొల్పుచున్నారు. కాని రెండతస్తులతో నున్న యీ జర్మను భవనములను జూచినపో నివి మనుష్యులు నివసించుటకా లేక ఏనుగులు, ఒంటెలు మొదలైనవానిని కట్టివేయుటకా యనుకొందుము. కాని ఫ్రాన్సులో ఏనుగులును, గుఱ్ఱములును వసించుటకై నిర్మింపబడిన ఏదంతస్తుల మేడలను చూచినపుడు అవి దేవకన్యలకై కట్టిన సౌధములని యనిపించును.

అమెరికాలో నెక్కువగా జర్మనుపద్ధతియనిన ప్రజలకిష్టము. ప్రతిపట్టణమునందును లక్షలకొలది జర్మనులున్నారు. భాషమాత్ర మింగ్లీషే. కాని అమెరికా నెమ్మదిగా జర్మను పద్ధతులను పెంచుకొన్నది. జర్మనీలో జనాభా పెరిగిపోవుచున్నది. మిగుల బలపడుచున్నది. ఈనాడు జర్మనీ ఐరోపాకంతకు నియంతృత్వము వహించినది. ఐరోపాలో జర్మనీస్థానము సర్వాతిశాయిగానున్నది. తక్కినదేశములకంటె చాలకాలముక్రిందటనే జర్మనీలో స్త్రీపురుషులకు నిర్బంధవిద్య నమలుపఱచిరి. నిరక్షరాస్యత శిక్షార్హమని చట్టముచేసిరి. ఈనాడు జర్మనీలో నందఱు నక్షరాస్యులే. జర్మనుసైన్యమునకు ప్రపంచకములో నెల్ల నత్యుత్తమమైనదను ప్రతిష్ఠయున్నది. నౌకాదళమునందును జర్మనీ సర్వాతిశాయి యగుటకు ప్రజ్ఞ కలిగినది. వస్తునిర్మాణమునందు జర్మనీ ఇంగ్లాండు నతిక్రమించినది. జర్మనువ్యాపారము, ఆంగ్లేయుల వలసరాజ్యములందును పెరుగుచున్నది. జర్మనులు నెమ్మదినెమ్మదిగా నౌకాధిపత్యము వహించుచున్నారు. జర్మన్‌చక్రవర్తియొక్క ఆజ్ఞకు లోబడి చైనాయుద్ధరంగమందు తక్కినదేశములన్నియు జర్మన్‌సైన్యాధిపతి నాయకత్వము నంగీకరించినవి.

దినమంతయు మా రైలుబండి జర్మనీలో ప్రయాణించి, ప్రొద్దుగ్రాలుసరికి ఆస్ట్రియా సరిహద్దులలో ప్రవేశించినది.

ఆస్ట్రియా పూర్వము జర్మనుల ఆధిపత్యముక్రింద నుండెడిది. ఇప్పుడది వేఱుదేశము. ఐరోపాలో ప్రయాణము చేయుటలో కొన్ని చిక్కులున్నవి. ప్రతిదేశమందును కొన్నికొన్నివస్తువులమీాదఅచ్చటియధికారులు పెద్ద సుంకమును వసూలుచేయుదురు. పొగాకువంటి కొన్నిసరకులు కేవలము ప్రభుత్వముయొక్క వ్యాపారాధీనమైయుండును. రష్యా, టర్కీలలో ప్రభుత్వపు రహదారిచీటి (పేస్‌పోర్ట్) లేకుండ మనము ప్రవేశించుటకు వీలులేదు. ఈచీటిమనదగ్గఱనుంచుకొనవలెను. పైగా రష్యా, టర్కీలలో మనపుస్తకములు, కాగితములు అధికారులు వశపఱచుకొందురు. వారు వానిని పరీక్షించి వారి ప్రభుత్వములకు, వారిమతములకు విరోధముగా నా పుస్తకములలో, పత్రములలో నేమియు లేదని సంతృప్తిపడిన తర్వాతనే మనకు తిరిగి యిత్తురు. వారికేమైన అనుమానము కలిగిన నవి మనకురావు. ఇతరదేశములలో మనపొగాకు పెద్దచిక్కులు తెచ్చిపెట్టును. మనపెట్టెలు, బుట్టలు, బంగీలు, పరుపుచుట్టలు— అన్నియు మనము విప్పిచూపవలసినదే. వీనిలో పొగాకు దాచితిమేమో యని వీరిభయము. కాన్‌స్టాంట్‌నోపిల్‌కు రావలెనన్న జర్మనీ, ఆస్ట్రియా, మఱికొన్ని చిన్నచిన్నరాజ్యములగుండా పోవలెను. ఈ చిన్నచిన్నరాజ్యములు పూర్వము టర్కీలోనున్న కొన్నిమండలములు. తర్వాత స్వతంత్రులైన క్రైస్తవరాజులందఱు కలిసి టర్కీ మహమ్మదీయులనుండి వీలైనన్ని మండలములు గుంజుకొనిరి. ఈ పెద్దరాజ్యములకంటె ఈ చిన్నరాజ్యములలో చిక్కులెక్కువ. అవి పెద్దచీమలవంటివి. ఇవి చిన్నచీమలవంటివి. ఇవి కుట్టినచో వానికంటె నెక్కువ చుఱ్ఱుమనిపించును.

అక్టోబరు 25-వ తారీకున ఆస్ట్రియా ముఖ్యపట్టణమైన వియన్నా చేరుకొంటిమి. ఆస్ట్రియాలోను, రష్యాలోను రాజకుటుంబికులకు 'ఆర్చుడ్యూక్సు' – 'ఆర్చ్‌డచ్చెస్సు'లు అని బిరుదనామములుకలవు. మాబండిలో నుండి వియన్నాలో నిద్ద ఆర్చు

డ్యూకులు దిగవలసియుండెను. వారు దిగునంతవఱకు తక్కిన ప్రయాణీకు లెవరును దిగరాదు. అందుచేత మేము వారెప్పుడు దిగుదురాయని కనిపెట్టుకొనవలసియుండెను. బుటేపనిచేసిన యూనిఫారములు తొడుగుకొనిన యుద్యోగులును ఈకలతోనొప్పు టోపీలు ధరించిన కొందఱు సైనికులును ఆర్చ్‌డ్యూకులకొఱకు వేచియుండిరి. ఆర్చ్‌డ్యూకులు దిగగానే వారందఱు వారిని చుట్టుకొనిరి. మాకును ప్రాణము తెఱపినబడ్డది. త్వరగా మేము మా సామగ్రితో క్రిందకుదిగితిమి. ఉన్న ప్రయాణికులు కొలదిమందియే యగుటచేత మాసామగ్రి నధికారులకు చూపించి యనుమతి పొందుట కెంతోకాలము పట్టలేదు. ఇంతకుపూర్వమే మేమొక హోటలులో దిగుట కేర్పాటుజరిగినది. ఆహోటలువాడు బండిలో వచ్చినాడు. మేమువెళ్ళితిమి. అది రాత్రిగావున నగరముచూచుటకు బోవు ప్రశ్నలేదు. మఱునాటియుదయమున పట్టణమును చూచుటకు బయలుదేరితిమి. ఇంగ్లాండు జర్మనీలనువదలి యూరోపా యందన్ని దేశములందుగల హోటళ్ళలో ఫ్రెంచిపద్ధతి కన్పించును. వారు హిందువులవలె రెండుసార్లు—పగలు 12 గంటలకు రాత్రి 8 గంటలకు భోజనము చేయుదురు. మధ్యాహ్నము, ఉదయము ఎనిమిదింటికి కొంచెము కాఫీత్రాగుదురు. ఇంగ్లాండు, రష్యాలను వదలి తక్కిన దేశములలో టీ త్రాగుట చాల తక్కువ. ఉదయ భోజనమును ఫ్రెంచిలో 'డీజెనర్' అనగా నింగ్లీషులో బ్రేక్‌ఫాస్ట్ అందురు. రాత్రిభోజనమును 'డీనర్', ఇంగ్లీషులో డిన్న రందురు. రష్యాలో టీ ఎక్కువ త్రాగెదరు. రష్యా చాల చలిదేశము. చైనాకూడ చాలవఱకు చలిదేశమే. చైనా టీ చాల బాగుగానుండును. అందులో చాలభాగము రష్యా కెగుమతియగును. చైనావారివలెనే రష్యావారును టీ కషాయములో పాలు కలుపుకొనకుండ త్రాగెదరు. టీ, కాఫీలలో పాలుకలిపినచో విషమగునట. అచ్చముగా టీ త్రాగు జాతులైన చైనా, జపాన్, రష్యావారు, మధ్యఆసియాప్రజలు, పాలు కలపని వట్టి కషాయమే త్రాగెదరు.

అట్లే అచ్చముగా కాఫీత్రాగు జాతులగు టర్కీప్రజలు మొదలైన వారు కాఫీకషాయములో పాలు కలుపుకొనరు. రష్యాలో మాత్రము కొంచెము నిమ్మకాయ పిండి టీలో గడ్డపంచదార కలుపుదురు. పేదవాండ్రుమాత్రము పంచదారగడ్డ నోటిలో వేసికొని తర్వాత టీ త్రాగుదురు. త్రాగిన తర్వాత ఆ గడ్డతీసి మఱొకనికిత్తురు. వా డింకొకనికిచ్చును. అత డదేవిధముగా చేయును.

వియన్నా పారిస్ పద్ధతిలో కట్టబడిన ఒకచిన్న నగరము. కాని ఆస్ట్రియావారు జాతివలన జర్మనులు. ఆస్ట్రియాచక్రవర్తియే నిన్న మొన్నటివఱకు జర్మనీకంతకును చక్రవర్తి. ఇప్పుడుమాత్రము ప్రష్యారాజైన విల్ హెల్మ్ రాజుయొక్క దూరదృష్టివలన, నతని మంత్రియగు బెస్మార్క్ రాజకీయచాతుర్యమువలన, నతనిసైన్యాధిపతి "వాన్ మోల్ట్కి" యొక్క యుద్ధతంత్రమువలన, ప్రష్యారాజే ఆస్ట్రియాను వదలి తక్కిన జర్మనీకంతకు చక్రవర్తియైనాడు. ఇప్పుడు ఆస్ట్రియావైభవమంతయు, నధికారమంతయు క్రుంగి పోయినది. ఏదోవిధముగా తన పరువు ప్రతిష్ఠలను కాపాడుకొనుచున్నది. ఆస్ట్రియారాజవంశముపేరు హేప్స్‌బర్గు రాజవంశము. ఇది ఐరోపాలోకెల్ల మిక్కిలి పురాతనమైనది, ఠీవిగలవంశము. ఈ రాజవంశమే నిన్న మొన్నటివఱకు జర్మనీకంతకు చక్రవర్తిత్వము వహించెను. జర్మనీ రాకుమారులే ఐరోపాలో సర్వదేశముల సింహాసనముల నధిష్ఠించియున్నారు. జర్మనీలోని చిన్నచిన్న జాగీర్దారులుకూడ ఇంగ్లాండు, రష్యాలవంటి సామ్రాజ్యముల సింహాసనముల నాక్రమించిరి. ఆస్ట్రియా ఆ గౌరవమునకు, ఆ ప్రతిష్ఠకు నింక నఱ్ఱులుసాచుచునేయున్నది. ఇప్పు డాశక్తి మాత్రము కొదువయైనది. టర్కీకి ఐరోపాలో 'జబ్బుమనిషి' యనిపేరు. మఱి ఆస్ట్రియాకు ఆ దృష్టిలో "జబ్బుమగువ" యని పేరుండవలెను. ఆస్ట్రియా కాథలిక్కుమతమునకు చెందినది. నిన్న మొన్నటివఱకు ఆస్ట్రియాసామ్రాజ్యము పవిత్రమైన రోమక్

సామ్రాజ్యమని పేరుపొందినది. అధునాతనజర్మనీలో ప్రొటెస్టాంటు లెక్కువ. ఆస్ట్రియాచక్రవర్తి పోపునకు కుడిభుజము. విశ్వాస పాత్రుడైన అనుచరుడు. కాథలిక్ శాఖకంతకు నాయకుడు. ఇప్పు డైరోపాయందంతటను ఆస్ట్రియాచక్రవర్తి యొక్కడే కాథలిక్ రాజు. కాథలిక్ ఛర్చికి పెద్దకూతురువంటిది ఫ్రాన్సు; ఇప్పుడు సర్వ తంత్ర స్వతంత్రప్రజారాజ్యము. స్పెయిను, పోర్చుగల్లు పతనమై పోయినవి. ఇటలీ పోప్‌కు తనసింహాసనమును స్థాపించుకొనుటకు వలసినంత యధికారమును మాత్రమే యొసగినది. పోప్‌యొక్క అధికారమును, ప్రశస్తిని ఇటలీ అపహరించినది. ఇటలీరాజునకు పోప్‌నకుమధ్య పచ్చగడ్డివేసిన భగ్గుమనును. పూర్వము పోప్‌నకు ముఖ్యపట్టణమైన రోమ్ ఇప్పు డిటలీకి ముఖ్యపట్టణము. ఇటలీ రాజు పోప్‌యొక్క పురాతనహర్మ్యముల నాక్రమించి తన నివాసము చేసికొనినాడు. పోప్‌యొక్క పురాతన ఇటలీరాజ్య మంతయు నిప్పు డపహృతమైనది. ఇప్పు డతని యధికారము వాటికాన్ కొండవఱకే పరిమితమైయున్నది. కాని మతవ్యవహార ములందు పోప్‌నకు పలుకుబడి యింకను అధికముగనే యున్నది. ఈ పోప్ అధికారమున కింకను ఆస్ట్రియా అండగా నున్నది. పోప్‌న కండగానున్న ఆస్ట్రియాకు వ్యతిరేకముగా అధునాతనమైన ఇటలీ పోరాడి బైటపడినది. అందువల్ల ఆస్ట్రియా ఇప్పు డిటలీకి విరోధి. ఎందుచేత ? ఇటలీ తనయధికారమునుండి బైటపడినది కాబట్టి. దురదృష్టవశాత్తు ఈ శైశవావస్థలోనున్న ఇటలీ ఇంగ్లాండుయొక్క దుర్బోధవల్ల నొక పెద్ద శక్తిమంతమైన సైన్య మును, నౌకాదళమును నిర్మించుటకు పూనుకొనినది. కాని ధన మెక్కడనుండి వచ్చును ? అందుచే ఇటలీ ఋణములలో చిక్క కొని వినాశమార్గమున పడినది. దీనికితోడు ఆఫ్రికాలో తన సామ్రాజ్యమును స్థాపించుటకు పూనుకొని, ఒక క్రొత్త చిక్కు తెచ్చిపెట్టుకొనినది. అబిసీనియాచక్రవర్తి చేత విజితమై తనకీర్తి ప్రతిష్ఠలను గోల్పోయి క్రింద చతికిలబడినది. ఈలోపుగా ప్రపంచ

యొక్క పెద్దయుద్ధములో ఆస్ట్రియానుజయించి చాలభాగ మాక్ర మించుకొనినది. ఆస్ట్రియా నెమ్మదిగా క్రుంగిపోవుచుండగా ఇటలీ కూడ తన క్రొంగ్రొత్తజీవితమును దుర్వినియోగము చేయుటవల్ల తానుకూడ నల్లే దెబ్బతినిపోయినది.

ఆస్ట్రియా రాజవంశము ఐరోపా రాజవంశములలో మిక్కిలి అభిజాత్యముకలది. అది చాల పురాతనమైనదని మిక్కిలి అభి జాత్యముకలదని ఆవంశీయులయభిప్రాయము. వివాహాదిసంబంధము లనుగుఱించి వీరెంతయో జాగరూకులై యుందురు. రోమన్ కాథలిక్కు కుటుంబములతో తప్ప వీరన్యసంబంధములు చేసికొనరు. ఈవంశముతో సంబంధ మేర్పాటు చేసికొనవలెనను వ్యామోహము ఘనుడైన నెపోలియన్ పతనమునకు దారితీసినది. అతనికి ఒక రాజవంశములోనికన్యను వివాహముచేసికొని పుత్రపౌత్రాది సంతతి పొంది ఒక రాజవంశమునకు మూలపురుషుడు కావలెనని చమత్కారమైన యూహ పుట్టెను. అతనివంశమర్యాదలనుగూర్చి యడిగినప్పుడు "నేను నాబిరుదములు మఱొకవ్యక్తినుండి సంక్ర మింపచేసికొనినవి కావు. నేనే ఒక గొప్పరాజవంశమునకు మూల పురుషుడను కాబోవుచున్నా"నని యతడనెను. అతని యభిప్రాయ మిది : "నా పెద్దలపేరుమీదుగా బ్రదుకుటకు పుట్టినవాడను గాను. నేనే ఒక మహారాజవంశమునకు మూలపురుషుడను కాగలను" అంత మహావీరుడు ఈ వంశగౌరవమను అఘాతమున బడిపోయెను.

జోసెఫైన్ మహారాజ్ఞి విడాకులిచ్చుట, ఆస్ట్రియన్ చక్ర వర్తి యుద్ధములో నోడిపోగా, అతనికుమార్తెను చేకొనుట, మేరీలూయీస్‌తో మహావైభవముగా నెపోలియన్ వివాహమా డుట, ఆస్ట్రియా రాజదుహితకు పుత్రజననమగుట, క్రొత్తగాపుట్టిన బిడ్డను రోమ్ రాజుగా పట్టాభిషిక్తునిచేయుట, నెపోలియన్ పతన మగుట, అతని మామతోడి విరోధము సంభవించుట, లీప్సిక్,

వాటర్లూ, సెంటిహెలీనాలందు ప్రతికూలఘట్టములు తలసూపుట, మేరీలూయీస్‌మహారాణి తనబిడ్డతో తండ్రియింట నివసించుట, నెపోలియన్‌యొక్క రాజ్ఞితో సామాన్యసైనికభటునకు వివాహమగుట, నెపోలియన్ ఏకైకపుత్రుడు, రోమ్‌రాజు అతని మాతామహునియింట మరణించుట—ఇవి యన్నియు ప్రసిద్ధమైన చారిత్రకాంశములే.

ఫ్రాన్సు ఇప్పు డంతకంటె బలహీనమైనస్థితిలో నుండి తన పురాతనవైభవమును దలపోసికొనుచున్నది. ఇప్పుడు నెపోలియన్‌మీద బహుగ్రంథములు వచ్చినవి. మృతుడై విస్మృతుడైపోయిన నెపోలియన్‌మీద 'సార్దే' మొదలగు నాటకరచయితలు చాల నాటకములు వ్రాయుచున్నారు. మేడమ్‌బెర్న్‌హార్డు, రీజెనే మొదలైన నట్టువరాండ్రు ఈ నాటకములను క్రిక్కిరిసియున్న ప్రేక్షకజనులమ్రోల ప్రదర్శించుచున్నారు. ఇటీవల మేడమ్‌బెర్న్‌హార్డు పారిస్‌లో "లాయిగ్లాన్"— అనగా "యువకుడైన గరుత్మంతుడు" అను నాటకమును ప్రదర్శించి గొప్ప ప్రజాకర్షణముచేసెను.

ఈ "యువకగరుత్మంతుడు" నెపోలియన్ యొక్క ఏకైకపుత్రుడు. ఇతడు అతని మాతామహునియొక్క ఇంటిలో వియన్నాలో నిర్బంధితుడయ్యెను. ఆస్ట్రియా చక్రవర్తి మంత్రి మేషియవెల్లియన్ మెటర్నిక్ నెపోలియన్‌యొక్క వీరగాథలా కుఱ్ఱవానికి తెలియకుండ మిక్కిలి జాగ్రత్తతీసికొనెను. కాని కొద్దిమంది నెపోలియన్ పక్షపాతులు ఆ కుఱ్ఱవానికి సేవకులుగాచేరి 'స్కాన్‌బ్రన్' భవనములో మాఱువేషములతో ప్రవేశింపగల్గిరి. వీరు నెపోలియన్ పక్షమువారని యెవరికిని తెలియదు. ఈ కుఱ్ఱవాని నెట్లైనను ఫ్రాన్సుకు చేరవేసి, ఐరోపాలోని జాగీర్దార్లందఱునుచేరి, తిరిగి సింహాసనమున నెక్కించిన బోర్బన్ వంశీయులను ఫ్రాన్సు సింహాసనమునుండిదింపి, ఈ కుఱ్ఱవాని నందు నెక్కించి నెపోలియన్

రాజవంశము నధికారములోనికి గొనివత్తమని వారు ప్రయత్నించిరి. ఈ పిల్లవాడు వీరపుత్రుడు. కాబట్టి యతనిలో నణగిమణగి యున్న వీరభావములు తండ్రియొక్క వీరగాథలను వినినపుడు మేల్కొన్నవి. ఒకరోజున ఈ కుఱ్ఱవాడు "స్కాన్ బ్రన్" భవనము నుండి తక్కిన కుట్రదారులతో కలిసి పాఱిపోయెను. కాని మెటర్నిక్ బుద్ధికౌశల్యముతో నీ సంగతిని కనిపెట్టి ఈ కుఱ్ఱవాడు చేయిదాటిపోకుండ చూచుకొనెను. ఈ కుఱ్ఱవాడు మరల 'స్కాన్ బ్రన్' భవనమునకు గొనిరాబడి ఖైదుచేయబడెను. ఈ యువకగరుత్మంతుడు ఱెక్కలు తెగిన పక్షియై, భగ్నాశుడై మరణించెను. ఇది ఆ నాటకములోని కథ.

ఈ 'స్కాన్ బ్రన్' సామాన్యమైనదే. ఇందులోని గదులు వైభవముగా నలంకృతములైనవి. ఈగదులలో నొకదానిలో చైనా పనితనము కనిపించును. మఱొకదానిలో హైందవకళ, ఇంకొక దానిలో ఇంకొక దేశపుకళ యొప్పుచుండును. ఈ గదులిట్లుండును. ఈ భవనపుటావరణలోని యుద్యానవనము చాలఆకర్షణీయమైనది. ఇప్పుడీభవనము చూచుటకు పోవుజనులందఱు నెపోలియన్ కుమారుడే గదిలో పండుకొనెనో, ఎక్కడ చదువుకొనెనో, ఎక్కడ మరణించెనో మొదలైన వివరములు తెలిసికొనుటకు ఆతురపడుదురు. చాలమంది ఫ్రెంచివారు "ఏ గదిలో యువగరుత్మంతుడుండెడివాడు? ఏ మంచముమీద పరుండువాడు? మున్నగు ప్రశ్నపరంపరను చాల అనాలోచితముగ భవనరక్షకుని నడుగుచుందురు. ఇవి ఎంత చొప్పదంటుప్రశ్నలో చూడుడు. ఆస్ట్రియావారికి ఆ కుఱ్ఱవాడు నెపోలియన్ కొడుకని మాత్రమే తెలియును. ఆ సంబంధము ఆ రాజకుటుంబపు పిల్లను బలవంతముగా వివాహము చేసికొనుటతో కలిగినదాయెను. వారిహృదయములలో ద్వేషభావమింకను విస్మృతముకాలేదు. ఆ కుఱ్ఱవాడు చక్రవర్తికి మనుమడు, ఏ సివాసము లేనివాడు. అందుచేత నతనికి నిలువనీడ నీయక వారికి తప్పదు. కాని యతనిని వారు 'రోము

రాజ'ని పిలువలేరు. అతడు ఆస్ట్రియాచక్రవర్తి మనుమడు కావున నతడు 'ఆర్కి-డ్యూక్' మాత్రము కావచ్చును. ఫ్రెంచిప్రజలు వానిపై నొక గ్రంథము రచించి వాని నిప్పుడు గరుత్మంతుని చేయుదురుగాక! దానికితోడు కల్పనాత్మకమైన పరిస్థితులను, మేడమ్‌బెర్న్‌హార్డునటనాచాతుర్యమును, ఈకథను మిక్కిలి ఆకర్షవంతముగా చేయవచ్చునుగాక. కాని ఒక ఆస్ట్రియా దేశీయుడైన రక్షకభటునకీ గరుత్మంతుడను పేరెట్లు తెలియును? పైగా నాస్ట్రియాచక్రవర్తి అతనిమంత్రియగు మెటర్నిక్ సలహావల్ల నెపోలియన్ కుమారుని నొకరకముగా చంపెనని ఆ గ్రంథములో వ్రాయబడినది.

ఈ గరుత్మంతుడనుపేరు విని ఈ భవనరక్షకుడు మొగము చిట్లించుకొని మనసులో విసిగికొనుచు నొకగదితర్వాత నొకగదిని, అన్నివస్తువులను చూపింపజొచ్చెను. అంతకంటె నతడేమిచేయ గలడు? తనకువచ్చు నాల్గుడబ్బులు పాపము అతడు వదలుకొన లేడాయెను. పైగా ఆస్ట్రియావంటి దేశములలో సైనికులకు జీతములు చాల తక్కువ. పాపము వారికాజీతము పొట్టకు సరిపోవు నంత కాకపోయినను కొన్ని సంవత్సరములు కొలువుచేసిన తర్వాత వారు తమయిండ్లకుపోవచ్చును. అతనిదేశభక్తివల్ల ఈ ఫ్రెంచి వారి ప్రశ్నలకతని ముఖము ముడుచుకొనిపోయినది. కాని అతడు తెలియకుండగనే డబ్బుకొఱకు చేయిచాచెను. ఈ ఫ్రెంచి యాత్రికులు కొన్ని వెండినాణెము లతనిచేతిలోపెట్టి 'గరుత్మంతుని' మెచ్చుకొనుచు, మెటర్నిక్‌ను తిట్టుకొనుచు పోయిరి. భవన రక్షకుడు వారికొక్క సలాముచేసి తలుపులుమూసెను. అతడు మనసులో ఈ ఫ్రెంచివారి పూర్వీకులను తప్పక తిట్టుకొని యుండును.

వియన్నాలో ముఖ్యముగ చూడదగినది పురాతనవస్తుప్రదర్శనశాల. అందులో ముఖ్యమైనది భౌతికశాస్త్రీయ వస్తు ప్రద

ర్శనశాల. ఇది విద్యార్థులకు చాల లాభదాయకమైన సంస్థ. ఇచ్చట ఇప్పుడు కన్పించని పురాతనమైన బహువిధజాతులకు చెందిన జంతువుల కంకాళములు ప్రోగుచేసి భద్రపఱచిరి. చిత్రవిభాగము నందు డచ్ చిత్రకారులయొక్క తైలవర్ణ చిత్రములు అధిక సంఖ్యాకముగనున్నవి. డచ్ చిత్రకళయందు వ్యంగ్యలక్షణము లేదు. దీనియందు స్వాభావికమైన వస్తువుల రూపములు జంతువుల ప్రతిరూపములు చిత్రితములగును. ఒక చిత్రకారుడు ఒక చేప లతో నిండినబుట్టను, ఒక మాంసపుముద్దను, ఒక నీటికూజాను చిత్రించుటకు కొన్ని సంవత్సరములు శ్రమించియుండవచ్చును. ఆ చేపలు, ఆమాంసము, ఆనీళ్ళు - ఎంతో ఆశ్చర్యమును గల్గించును. ఈ డచ్ చిత్రకళలో ఆడ బొమ్మలు చూచుటకు వస్తాదులవలె గన్పించును.

వియన్నాలో జర్మన్ పాండిత్యము, ప్రతిభ ఉన్నదను కొనుడు. కాని టర్కీ క్రమముగా శిథిలమగుటకు త్రోవదీసిన కారణసామగ్రి ఇచ్చటకూడ గోచరించుచున్నది. బహుజాతులు, బహుభాషలు అందుగలవు. ఆస్ట్రియాలో ప్రజలు జర్మనుభాష మాట్లాడుదురు. హంగరీప్రజలు తార్తారుజాతివారు. వారిభాష వేఱు. గ్రీకుభాషమాట్లాడువారును, గ్రీక్ ఛర్చికి సంబంధించిన క్రైస్త వులునున్నారు. ఇన్ని విభిన్నజాతులను ఏకముచేయుటకు తగినశక్తి ఆస్ట్రియాకు లేదు. అందువల్ల ఆస్ట్రియా పతనమైనది.

ప్రస్తుతకాలములో జాతీయతాభావము ఐరోపాయందు పెల్లుబికి ప్రవహించుచున్నది. ఒకేభాషమాట్లాడువారు, ఒకే మతమునకుచెందినవారు, ఒకేజాతికి చెందినవారు ఐక్యమగుట కుత్సహించుచున్నారు. ఇట్టి ఐకమత్యము సంఘటితమైన ప్రదేశము లందు మితమైనశక్తి ప్రకటనమగుచున్నది. ఈ ఐకమత్యము లేని చోట పతనము తప్పదు. ఇప్పటి ఆస్ట్రియాచక్రవర్తి* మరణా

* రెండవ ఫ్రాన్సిస్ జోసెఫ్. ఇతడు 1916 లో మరణించెను.

నంతరమున ఆస్ట్రియాసామ్రాజ్యములోని జర్మన్ భాషా ప్రాంతమును జర్మనీ తప్పకుండ తనలో కలుపుకొనును. రష్యా, తక్కిన దేశములు జర్మనీని వ్యతిరేకించును. ఇదొక భయంకరమైన యుద్ధమునకు త్రోవతీయవచ్చును. ఈ ఆస్ట్రియాచక్రవర్తి చాల వృద్ధుడు. అందుచే నీయుద్ధప్రమాదము చాల త్వరగా దాపురింపనున్నది. జర్మన్ రాజప్పుడు టర్కీ-సుల్తానుకు మిత్రుడు. టర్కీ, రష్యాలకు విరోధము గలదు. జర్మనీ తన ఆస్ట్రియాభాగ మాక్రమించుకొనినపుడు రష్యా వ్యతిరేకించినచో టర్కీ రష్యాను కొంత నిరోధింపగలదు. అందుచే జర్మను చక్రవర్తి టర్కీతో జత కట్టినాడు.

వియన్నాలో మూడురోజులకే విసుగుపుట్టినది. పారిస్ చూచిన తర్వాత తక్కిన ఐరోపాను చూచుట ఒకవిందుభోజనము చేసిన తర్వాత పచ్చడిమెతుకులు తినుటవంటిది. అవేదుస్తులు, అదేభోజనపద్ధతి. ప్రతి పద్ధతి యదే. ఐరోపాయంతట ఫ్రాన్సులోని పద్ధతుల అనుకరణము కన్పించును. ఆ నల్లనిసూటు, అదే రకమైన హేటు. అబ్బ! అసహ్యము! పైగా పైన మబ్బుపట్టియుండును. క్రింద ఈ జనులగుంపు నల్లనిహేట్లతో, నల్లనికోట్లతో చూచుటకు పరమఅసహ్యముగా నుండును. యావత్తు ఐరోపాలో ఫ్రాన్సుపద్ధతిదుస్తులు, జీవనపద్ధతులు ప్రాకుచున్నవి. ఇట్టి అనుకరణము మరణసూచకము. వందలసంవత్సరము లలవాటుచేసి ఉదయమే పండ్లుతోముకొనుట - ముఖముకడుగుకొనుట - భోజనముసేయుట - ప్రతిక్రియ ఒకేపద్ధతిలోచేయుట మనపూర్వులు మనకునేర్పిరి. అందువలన మనము యంత్రములవలె తయారైనాము. మనలో ప్రాణశక్తి లోపించినది. మన మూరకే యంత్రములవలె తిరుగుచున్నాము. ఈ యంత్రములు 'ఔ'నని 'కా'దని చెప్పవు. ఏ విషయమునుగురించి తల పగులగొట్టుకొనవు. తమపూర్వికులు నడచిన మార్గము ననుసరించియే నడచి క్రమముగ కృశించి వీరు వినష్టమగుదురు. ఐరోపీయుల కర్మయు నింతే. కాలగతి మారు

చుండును. ప్రజలందఱు వేషధారణములు, ఆహారము, సంభాషణ విధానము అవలంబించి ప్రతివిషయమునందు నట్లే యుండి క్రమ ముగా యంత్రములవలె మాఱి తమ పూర్వికులు నడచిన మార్గమందే నడచిపోయిరి. దానివల్ల కలుగు ఫలితము వారు కృశించి వినష్టమగుటే కదా!

అక్టోబరు 28 న 9 గంటలకు మఱల మేము ఓరియంట్ ఎక్స్‌ప్రెస్సులో నెక్కితిమి. 30 న కాన్‌స్టాంట్‌నోపిల్‌లో దిగితిమి. రెండురాత్రులు - ఒకపగలు హంగరీ, సెర్బియా, బల్గేరియాల గుండా అది ప్రయాణించెను. హంగరీప్రజలు ఆస్ట్రియాచక్రవర్తిచే పరిపాలింపబడుచుందురు. ఆస్ట్రియాచక్రవర్తికి హంగరీరాజని పేరు కలదు. హంగరీప్రజలు, టర్కీప్రజలు ఒకటేజాతివారు. టిబెట్ ప్రజలకు, వీరికి చాల పోలికలున్నవి. హంగరీప్రజలు కాస్పియన్ సముద్రమునకుత్తరవైపుగా యూరపులో వ్యాపించిరి. టర్కీప్రజలు ఏషియామైనరు, పర్ష్యాసరిహద్దులగుండా యూరప్‌లోప్రవేశించిరి. హంగరీప్రజలు క్రైస్తవులు. టర్కీయులు మహమ్మదీయులు. కాని తార్తారురక్తమునకు ప్రధానగుణమైన సామరికవీర్యము వారిలోను వీరిలోను సమానముగనే కన్పించును. హంగరీప్రజలు ఆస్ట్రియానుండి విడివడుటకు చాల పోరాటములు చేసిరి. ఇప్పుడు వారు పేరుకు మాత్రమే ఆస్ట్రియాక్రింద నున్నారు. ఆస్ట్రియా చక్రవర్తి హంగరీకి నామమాత్రపురాజు. వారి ప్రధాననగరము బుడాపెస్టు చాలా శుభ్రమై, సొగసైన పట్టణము. హంగరీ ప్రజలు విలాసవంతులు. సంగీతమనిన చెవికోసికొందురు. పారిస్ అంతటను హంగరీబేండులున్నవి.

సెర్బియా, బల్గేరియా మొదలైనవన్నియు టర్కీలోని మండలములు. రష్యా, టర్కీలకు జరిగిన యుద్ధములందు మండల ములు స్వతంత్రములైనవి. కాని టర్కీసుల్తానే వారిప్రభువు. సెర్బియా, బల్గేరియాలు వైదేశికవిధానమునందు స్వతంత్రములు

కావు. ఐరోపాలో 3 నాగరకజాతులున్నవి. ఇవి ఫ్రెంచి, జర్మను, ఇంగ్లీషుజాతులు. తక్కినవి మనవలెనే అధోగతిలో నున్నవి. వానిలో నెక్కువజాతులు ఆసియాలోకూడ మనకు కన్పించనంత అనాగరకజాతులు. సెర్బియా, బల్గేరియాలంతటను మట్టియిళ్లు, చిరిగినపేలికల గట్టుకొన్న మనుష్యులు, పెంటకుప్పలు మనకు కన్పించును. "ఇదేమిరా? మఱలహిందూదేశమునకు వచ్చితిమా" యనుకొంటిమి. మఱి వారందఱు క్రైస్తవులు. కాబట్టి వారికి అసంఖ్యాకమైన పందులు ఉండితీరవలెను.

ఒకపంది రెండువందల అడవిజాతిమనుష్యులుచేయునంత బురదచేయును. ఈ సెర్బులు – బల్గేరియనులు మట్టికప్పులున్న యిండ్లలో నివసింతురు. పేలికలైన దుస్తులు ధరింతురు. వీరి చుట్టును దిక్కుమాలిన పందులు కలవు. ... చాల రక్తపాతమైన తర్వాత పెక్కు యుద్ధములుచేసి టర్కీదాస్యమునుండి వారు బైట పడిరి. కాని వెంటనే వారికొక పెద్దచిక్కు తటస్థించినది. వారు ఐరోపీయపద్ధతిలో పెద్దసైన్యమును తయారుచేసికొనవలసివచ్చెను. కాని వారిలో నొక్కడైనను భద్రముగ జీవించుటకు వీలులేని పరిస్థితి తలసూపినది. సరే, నేడో రేపో వారు రష్యాలో చేరిపో గలరు. కాని యీ రెండురోజులైనను సైన్యములేకుండ వారు బ్రతుకుటయే దుర్లభము. అందుచే వారు తప్పనిసరిగ సైన్యమును తయారుచేసికొనవలయును.

ఒకవిమఘడియలో ఫ్రాన్సు జర్మనీచేతిలో పడిపోయెను. క్రోధము, భయమువల్ల ఫ్రాన్సు ప్రతిపౌరుని సైనికునిగా చేసినది.

ప్రతివ్యక్తి కొంతకాలము సైన్యములో పనిచేయవలెను. సైనికశాస్త్రము నభ్యసింపవలెను. ఎవ్వనికైన నిది తప్పదు. అతడు 3 సంవత్సరములు బారకీసులలో నివసించి యుద్ధనైపుణ్యము సంపాదింపవలెను. వాడు కోటీశ్వరుడైననుసరే బుజము మీద తుపాకి ధరింపవలెను. బారకీసులలో నివసించి యుద్ధ

విధానము నేర్చుకొనవలెను. ప్రభుత్వము అతనికి భోజనముపెట్టి దుస్తులిచ్చును. జీతము రోజుకొకపైస. ఈ శిక్షణమైనతర్వాత రెండు సంవత్సరములవఱ కెప్పుడు పిలిచిన అప్పుడు వచ్చి సైన్యములో చేరుపద్ధతిలో నత డింటివద్ద కనిపెట్టుకొని యుండవలెను. తర్వాత 15 ఏండ్లవఱకు పిలువగనే వచ్చి చేరుటకు సిద్ధముగనుండవలెను. ఫ్రాన్సు జర్మన్ సింహము నుద్రేకించినది. అందుచే జర్మనీ కూడ సిద్ధముగానుండవలసివచ్చినది. తక్కిన దేశములలోకూడ నొకరినిచూచిన మఱియొకరికి పరస్పరభీతియుండుటచే అందుగూడ సైన్యనిర్మాణ మవసరమయ్యెను. అందుచేత ఇంగ్లాండు లేక తక్కిన ఐరోపాయందు ప్రతిదేశము నిట్టి సైనికసన్నాహము చేసికొనవలసివచ్చినది. ఇంగ్లాండు లంకగావున విడువకుండ తన నావికాదళమును బలపఱచుకొనుచున్నది. కాని బోయరుయుద్ధమువలన నేర్చుకొనిన పాఠములవల్ల ఇంగ్లండుకూడ సైనికసన్నాహమునకు దిగదని ఎవరు చెప్పగలరు? అన్ని దేశములకంటె రష్యాలో జనాభా ఎక్కువగానుండును. అందుచే ఐరోపాయంతటిలో రష్యా పెద్దసైన్యమును నిర్మాణముచేసికొనగలదు. సెర్బియా, బల్గేరియాలవంటి చిన్నచిన్న రాజ్యములు పుట్టిననాటినుండి మిక్కిలి అధునాతనమైన ఆయుధ సామగ్రితోకూడిన అధునాతన శిక్షణలో సుశిక్షితులైన సైన్యమును నిర్మాణము చేసికొనవలసివచ్చినది. కాని దానికి కావలసిన ధన మెందుండి వచ్చును? ఫలితముగా కర్షకులందఱు పేలికలను ధరింపవలసివచ్చినది. పట్టణములసైనికు లాడంబరమైన యూనిఫారములు దాల్తురు. ఐరోపాయంతటను సైనికవ్యామోహము బలిసినది. ఎచ్చటచూచినను సైనికులే. ఏమైనను స్వాతంత్ర్యము స్వాతంత్ర్యమే. 'దాస్యము దాస్యమే'. అదెంతటి గొప్పదైనను మఱొకనిక్రింద పనిచేయవలసినపుడు దానిరామణీయకత చచ్చును. వ్యక్తిగతమైన బాధ్యత లేనియెడల నొక గొప్పపని నెవడును చేయలేడు. ఒకపూటతిని చింపిరిగుడ్డలుకట్టుకొని స్వతంత్రముగా బ్రదుకుట బంగారపుసంకెలతో మేడలలో నివసించుచు దాస్యము చేయుట

కంటెపదివేలరెట్లు మెఱుగు. దాస్యములోనున్నవాడు ఇహపరముల రెండిటియందు దుఃఖములనుభవించును. ఐరోపీయులు పెర్ష్యలను, బల్గేరీయులను పరిహసించుచుందురు. వారిలోని లోపములను, తప్పులను ఎన్ని ఏడిపింతురు. కాని పాపము ఇన్ని సంవత్సరములు దాస్యములో మ్రగ్గి ఇప్పుడే గదా వారుబైటపడిరి. ఒక్క రోజులో వారు ప్రావీణ్యము సంపాదింపగలరా? వారు తప్పులు చేయక తప్పదు. అవి వందలకొలది కావచ్చును, కాని తప్పులుచేయుచునే వారు ఒప్పులేవియో నేర్చుకొందురు. క్రమముగా వారు ప్రావీణ్యము సంపాదింతురు. వారిపై బాధ్యతపెట్టుడు. ఎంత కూర్చుని లేవలేనివారైనను శక్తిసమన్వితు లయ్యెదరు. ఎట్టి మూఢులైనను వివేకవంతు లయ్యెదరు.

మాబండి హంగరీ, రుమేనియాలగుండా పోవుచున్నది. వినాశోన్ముఖమైన ఆస్ట్రియాసామ్రాజ్యములో నివసించు వివిధ జాతులప్రజలు బలహీనులు. కాని హంగరీప్రజలు మాత్రము మిక్కిలి శక్తిమంతులు. ఐరోపాలోనున్న జాతులలో నొకటిరెండు చిన్నజాతులను వదలిన, తక్కినవన్నియు నైరోపీయ విద్వాంసులు చెప్పు ఇండో యూరోపియన్ లేక ఆర్యజాతికి చెందినవారే. ఈ హంగరీప్రజలు సంస్కృతసంబంధమైన భాషలు మాటలాడని కొలది జాతులలో నొకరు. పూర్వము చెప్పినట్లు హంగరీవారు - టర్కీప్రజ లొకేజాతికి చెందినవారు. ఈ జాతి ప్రజలు బహుకాలముక్రిందటనే ఆసియాయందును ఐరోపాలోను తమ ప్రభుత్వమును స్థాపించిరి. హిమాలయములయొక్క పశ్చిమశాఖను హిందూ కుష్ పర్వతశాఖ కుత్తరము గానున్న దేశమున కిప్పుడు తురుష్కస్థానమని పేరుకలదు. ఇదియే వీరి ప్రథమనివాసస్థలము. ఆదేశమును వీరిభాషలో బాగ్వ్యాయా యందురు. ఢిల్లీ పరిపాలించిన మొగల్‌రాజవంశము, ఇప్పుడు పర్షియాను పాలించు రాజవంశము, కాన్‌స్టాంట్‌నోపిల్ పాలించు టర్కీరాజవంశము - ఈ

హంగరీ ప్రజలు — వీరందఱా తురుష్కస్థానమునుండియే తమ రాజ్యములను విశాలతరము చేసికొనుచువచ్చిరి.

హిందూదేశముతో ప్రారంభించి ఐరోపావఱకు వీ రాక్రమించిరి. ఈనాడు ఈరాజవంశములు 'చాగ్‌వోయీాల'మని చెప్పుకొందురు. వీరందఱు మాట్లాడుభాష యొకటే. శతాబ్దముల క్రిందట ఈ టర్కీప్రజలు చాల నాగరకులు. గొఱ్ఱెలమందలతో పశువులమందలతో – గుఱ్ఱపుమందలతో పెండ్లాము బిడ్డలతో, వారికున్న వస్తుసామగ్రితో పచ్చికబయళ్ళలో విడిసి, మందలను మేపుకొనుచు సంచరించుచుండెడివారు. పచ్చిక, జలము, తగ్గిపోయినచో నటనుండి మఱొకచోటికి పోవువారు. ఇప్పుడును మధ్య ఆసియాలో నీజాతిజనుల కుటుంబము లిట్లే దేశద్రిమ్మరులుగా జీవించుచున్నారు. ఈ టర్కీప్రజలు మధ్య ఆసియాలోని జాతులతో భాషావిషయకమైన పోలికలుగలిగి యున్నారు. కాని శారీరకమైన కొన్ని భేదములున్నవి. శిరోనిర్మాణమందును, దౌడ ఎముకల ప్రాధాన్యమందును టర్కీ ప్రజల ముఖములు మంగోలియనుల ముఖములను పోలియుండును. కాని వీరిముక్కులు చప్పిడివి కాక పొడవుగానుండును. కండ్లు తీర్చినట్లుండి పెద్దవిగా నుండును. కాని కన్నులమధ్యనున్న ప్రదేశము కొంచెము విశాలముగా మంగోలియనులకువలెనే యుండును. చాలకాలమునుండి ఆర్య సెమిటిక్ రక్త మీాటర్కీజాతిరక్తములో మిశ్రితమైనట్లు కన్పించును. బహు పురాతనకాలమునుండి టర్కీయులు యుద్ధకౌతుకము కలవారు. వీరితో సంస్కృతము మాట్లాడుప్రజలు, కాంధహారు, పర్ష్యాప్రజలు మేళవించుటవల్ల ఆఫ్ఘనులు, కిల్జీలు, హజారాలు, గారఘ్‌జాయీాలు, అసఫ్‌జాయీాలు మొదలైన యుద్ధప్రియములైన జాతులు పుట్టుటకు కారణమైనవి. ఈ జాతులకు యుద్ధమనిన చాల ప్రీతి. వీరే హిందూదేశమును బహుపర్యాయములు అణగద్రొక్కిరి.

బహుపురాతన కాలమందు టర్కీ ప్రజలు భారతదేశము నందలి పశ్చిమ మండలములను పెక్కుమాఱులు జయించి విశాలరాజ్యములను స్థాపించిరి. వారు భారతదేశమును జయించిన తర్వాత బౌద్ధమును పుచ్చుకొనిరి. క్రీస్తు యొక్క పురాతనచరిత్రలో నీ ప్రసిద్ధమైన తురుష్క చక్రవర్తుల నామధేయములు ఉదాహృతములగును. వారు హుష్కుడు - యుష్కుడు - కనిష్కుడు మొదలైనవారు. ఈ కనిష్కుడే మహాయాన బౌద్ధమతమునకు ప్రారంభకుడు. తర్వాత చాలకాలమునకీ తురుష్కులలో నధికసంఖ్యాకులు మహమ్మదీయమతము పుచ్చుకొని మధ్యఆసియాలో కాబూలు, కాందహారు మొదలగు ప్రధాన బౌద్ధ రాజ్యములను తుడిచిపెట్టిరి. మహమ్మదీయమతములో చేరుటకు పూర్వము వారు జయించిన రాజ్యములందలి సంస్కృతి, విజ్ఞానములను గ్రహించి వారు తమదేశములందు నాగరకతను వ్యాపించుకొనుటకు ప్రయత్నించెడివారు. కాని మహమ్మదీయులైనపిదప వారిలో మిగిలినది యుద్ధస్వభావమే. వారికి సంస్కృత విజ్ఞానముకూడ మచ్చునకైనలేదు. మీదుమిక్కిలి ఆక్రమితరాజ్యములలో తత్పూర్వ నాగరకత వారివలన వినష్టమైనది. అధునాతన ఆఫ్ఘనుస్థాన్, కాందహారు మొదలగు దేశములలో ఆశ్చర్యకరమైన స్తూపములు, సంఘారామములు, పెద్దపెద్దశిలావిగ్రహములు, పురాతనబౌద్ధులు కట్టిన విప్పటికిని నిల్చియున్నవి. ఈతురుష్కులు మహమ్మదీయమతములో కలియుటవల్ల నా దేవాలయములు, స్తూపములు చాలభాగము శిథిలావస్థలో నున్నవి. ప్రస్తుతము ఆఫ్ఘనులు వారికి సంబంధించిన జాతిప్రజలు మిక్కిలి అనాగరకులు. నిరక్షరాస్యులుగా మాఱిపోవుటవల్ల నా పురాతనశిల్పఖండముల నమకరించుటకుబదులు 'జిల్' మొదలైన దేవతలు ఈ శిల్పఖండ నిర్మాణములను కావించియుందురనియు, నంత గొప్పకట్టడములు మనుష్యుని శక్తికి నందనివనియు భావింతురు. పర్షియాలో పరిపాలితులగు ప్రజలు పరమనాగరకులైన ఆర్యజాతియగు పురాతన

పర్ష్యనుల సంతానము. కాని వారు పరిపాలించు రాజవంశ మనాగరకమైన, పరాక్రమవంతమైన తురుష్కజాతికి చెందినది. కాబట్టి పర్ష్యాపతనమగుటకు హేతువైనది. ఈవిధముగా నాగరకులనబరగిన ఆర్యజాతిసంతానముతో వెలసిన గ్రీకు, రోమన్ రాజ్యములకు తుది చిహ్నమగు కాన్ స్టాంట్ నోపిల్ శక్తిమంతమైన, అనాగరకమైన తురుష్కజాతి పదాఘాతములకు తట్టుకొనలేక వినష్టమైపోయినది. భారతదేశమును పాలించిన మొగల్ చక్రవర్తులుమాత్ర మీ తురుష్కులలో కేటాయింపుగానున్నారు. బహుశః హైందవభావములు తద్రక్తము వీరికి సంక్రమించుటవల్ల నీ భేదము వచ్చియుండును. రాజపుత్రకవుల పాటలయందు, కవితలందు, చారిత్రకగాథలందు భారతదేశమును జయించిన రాజవంశములన్నియు తురుష్కవంశములుగ చెప్పబడినవి. ఇది చాల యథార్థము. మహమ్మదీయ సైన్యమం దేయేజాతులు కలిసియున్నను నాయకత్వము మాత్రము తురుష్కులదే.

మహమ్మదీయమతములో కలిసిన తురుష్క లోకప్పుడు బౌద్ధులు. వారిక్రింద సైన్యములో చేరిన జాతులన్నియును మహమ్మదీయమతము పుచ్చుకొనక పూర్వము బౌద్ధులో లేక వైదికమతస్థులో యైయుండిరి. వీరందఱు బలవంతముగా తురుష్కులచేత మహమ్మదీయమతములో కలుపబడిరి. ఇట్లు మహమ్మదీయులైన హైందవులే తత్పూర్వమునుండి తమ పూర్వికుల మతమునే యవలంబించి వచ్చుచున్న ప్రజలను బహుపర్యాయములు జయించిరి. వీనికే మహమ్మదీయదండయాత్రలనియు, మహమ్మదీయ విజయమనియు, సామ్రాజ్యస్థాపనమనియు చారిత్రకు లందురు. తురుష్కలభాష వారి శరీరనిర్మాణమువలెనే కొంత సాంకర్యమునకు స్థానమైనదనుకొనుడు. వారిస్వస్థానమైన చాగ్ వోయీనుండి చాలదూరదేశములకుపోయిన తురుష్కులు మిక్కిలి సంకరభాష మాట్లాడుదురు. ఈ సంవత్సరము 'పర్ష్యా షా పారిస్ ఎగ్జిబిషన్' చూచుటకువచ్చి, వారు కాన్ స్టాంట్ నోపిలునుండి రైలులో తమదేశ

మునకు పోయిరి. దేశకాలసంబంధమైన బహుభేదములున్నప్పటికిని పర్ష్యా షా, టర్కీ-సుల్తాన్ వారి పురాతన మాతృభాషయగు టర్కీ-భాషలో మాట్లాడుకొనిరి. కాని సుల్తాన్ టర్కీ-భాషలో పరిషియా, అరబ్బు, గ్రీకుభాషాపదములు చేరియుండగా, నంతకంటె షా భాష కొంత పరిశుద్ధమైనదని చెప్పవలెను.

పురాతనకాలములో ఈ చాగ్వోయీ తురుష్కులు రెండు తెగలుగా విభక్తమైరి. ఒక తెగ "తెల్లగొఱ్ఱెలు." రెండవ తెగ "నల్లగొఱ్ఱెలు". కాశ్మీరున కుత్తరమునందున్న వీరినివాసస్థానమున గొఱ్ఱెలను మేపుకొనుచు దేశములను దోచుకొనుచు కాస్పియన్ సముద్రపుటొడ్డువఱకు కలిసి ప్రయాణించిరి. "తెల్లగొఱ్ఱెల"శాఖ అక్కడనుండి కాస్పియన్ సముద్రమున కుత్తర తీరము వెంట నైరోపాలోనికి చొచ్చుకొనిపోయి యప్పటికి శిథిలావస్థలోనున్న రోమన్‌సామ్రాజ్యమం దొక భాగమును ఆక్రమించి హంగరీరాజ్యము స్థాపించెను.

"నల్లగొఱ్ఱెలశాఖ" కాస్పియన్ సముద్రముయొక్క దక్షిణతీరము వెంట చొచ్చుకొనిపోయి, పర్ష్యా పశ్చిమభాగ మాక్రమించి, కకేషస్ పర్వతముదాటి, క్రమముగా, ఆసియామైనరు మొదలైన సీమలను అరేబియాను ఆక్రమించి, కాలిఫ్ సింహాసనము నాక్రమించుకొని నెమ్మదినెమ్మదిగా నప్పటికి మిగిలిన పశ్చిమరోమన్ సామ్రాజ్యమును కబళించివేసెను. బహు పురాతన కాలమునం దీ తురుష్కులు సర్పారాధకులు. బహుశః ఈ రాజవంశీకులనే పురాతన భారతీయులు నాగులని, తక్షకులని నిర్దేశించి యుందురు. తర్వాత వీరు బౌద్ధమతమును స్వీకరించిరి. పిమ్మట వారు జయించిన దేశములయందున్న మతము నవలంబించుచు వచ్చిరి. మఱి కొంతకాలము తర్వాత మన మిప్పుడు చెప్పుకొనుచున్న ఈ రెండుజాతులలో "తెల్లగొఱ్ఱెలశాఖ" క్రైస్తవులను జయించి తా నా మతమే పుచ్చుకొనినది. "నల్లగొఱ్ఱెలశాఖ"

మహమ్మదీయులను గల్చి తా నా మతమే పుచ్చుకొనినది. ఈ రెండు మతముల శాఖలను పరిశోధన చేసినచో సర్పారాధనము, బౌద్ధమతము వీరిలో నున్నట్లు గోచరించును.

హంగరీప్రజలు జాతిభాషలందు తురుష్కులైనను రోమన్, కాథలిక్ మతమునకు చెందినవారు. పూర్వము భాషాసంబంధమునకుగాని, దేశరక్తసంబంధములకుగాని మతదురభిమానమునకు స్థానములేదు. హంగరీప్రజలకు, టర్కీప్రజలగు పచ్చగడ్డివేసిన భగ్గుమనును. ఈ హంగరీప్రజల సాయము లేకున్నచో బహు సందర్భములందు ఆస్ట్రియా మొదలగు క్రైస్తవరాజ్యముల యునికికే ముప్పు వాటిల్లెడిది. అధునాతనకాలములో విద్యావ్యాప్తిచేత భాషాపరిశోధనలవలన, మఱియు మనుష్యజాతినిర్ణయశాస్త్రమువల్ల ప్రజలు భాషాసంబంధము, రక్తసంబంధము మొదలైనవానివంక నెక్కువగా నాకృష్టులగుచుండిరి. మతసంబంధము క్రమముగా శిథిలమగుచున్నది. ఈ కారణమువల్ల విద్యావంతులైన హంగరీప్రజలలోను తురుష్కప్రజలలోని జాతీయైక్యభావము ప్రబలుచున్నది.

హంగరీ ఆస్ట్రియా సామ్రాజ్యమం దొకభాగముగా నున్నను దానినుండి త్రెంచుకొని బైటపడుటకు బహుప్రయత్నములు గావించినది. చాలతిరుగుబాట్లు, చాలవిప్లవములు సంఘటించి హంగరీ యిప్పు డాస్ట్రియా సామ్రాజ్యమందు నామమునకు మాత్రము కలిసియున్నది. సర్వవిషయములందు హంగరీ స్వతంత్రరాజ్యమే. ఆస్ట్రియాచక్రవర్తికి హంగరీరాజనియు పేరుకలదు. దేశీయవ్యవహారములన్నియు హంగరీ ఆస్ట్రియాతో సంబంధము లేకుండనే నిర్వహించుకొనును. ఆస్ట్రియాచక్రవర్తి పేరుకు మాత్రము నాయకుడు. కాని యీ కొద్దిసంబంధము నెక్కువకాల ముండునట్లు తోచదు. హంగరీప్రజలలో తురుష్కజాతిలక్షణమగు యుద్ధప్రావీణ్యము, ఔదార్యాదిసద్గుణములు సుప్రసిద్ధగా



షిల్లాంగులో శ్రీ వివేకానంద స్వామి
(జబ్బుపడిన తరువాత) 1901

నున్నవి. పైగా మహమ్మదీయమతములో చేరని హేతువువల్ల దివ్యకళలగు సంగీతము మొదలైనవి మహమ్మదీయులవలె పైశాచికములని వారు భావింపరు. ఇందువల్ల హంగరీప్రజలు సంగీతమునందు మహాప్రవీణులు. వారిసంగీతప్రావీణ్యము ఐరోపాయందంతటను ప్రసిద్ధిపొందినది.

చలిదేశములలో నివసించు ప్రజలు కారము తినరని పూర్వము నేననుకొనుచుండెడివాడను. ఈ కారము తినుట కేవల ముష్ణదేశస్థుల దురభ్యాసమనుకొనెడివాడను. కాని హంగరీలోని కారము తినుట మొదలై రుమేనియా, బల్గేరియాలలో శ్రుతిమించి, మద్రాసీలందరికంటెకూడ మించిన ధోరణిలో నాకు కన్పించినది.



# అనుబంధము

మేము రైలుబండిలోనుండి మొదటిసారిగా కాన్‌స్టాంట్ నోపిలును చూచితిమి. ఇది చాల ప్రాతపట్టణము. గోడలవెంట పెద్ద మురుగుకాలువలు ప్రవహించుచున్నవి. ఇఱుకుగానుండి మెలికల తిరిగిన సందులు పెంటకుప్పలతో నిండియున్నవి. ఇళ్లు కొయ్యఇళ్లు. కాని క్రొత్తగానుండి చూచుట కింపుగా నున్నవి. స్టేషన్‌లో నా పుస్తకములతో పెద్దచిక్కు వచ్చినది. కుమారి కాల్వే, [illegible]లిస్‌బోయాజ్ పరిశోధకోద్యోగులతో ఫ్రెంచిభాషలో తర్కించుటకు మొదలుపెట్టిరి. అది వారిమధ్య మామధ్య నొక తగాదాగా పరిణమించినది. ఆ ఉద్యోగుల పైయధికారి ఒక తురుష్కుడు. అతని భోజనము సిద్ధపఱుపబడినది. అందుచేత దానితో తగాదా ముగిసినది. రెండుపుస్తకములుమాత్రము తమకడనుంచుకొని తక్కినపుస్తకములన్నియు వారిచ్చివేసిరి. వారా

రెంటినిగూడ మా హోటలుకు పంపుమని చెప్పిరి. కాని పంప లేదు. మేము ఆ పట్టణములో వేశ్యోఱుతావులందును, బజారు లోను గొంత తిరిగితిమి. ఆ పట్టణమునకు ''స్టాంబోలు'' అని మఱొక పేరు కలదు. హార్బరు దిగువ వైదేశికుల యిండ్లు, హోట ళ్లున్నవి. మే మచ్చటనుండి బండిలో బయల్దేరి పట్టణము చూచిన తర్వాత కొంత విశ్రాంతి తీసికొంటిమి. సాయంకాలము మేము వుర్కుపాషాను చూచుటకు పోయితిమి. మఱునాడు భాస్కరస్ వెంట బోటులో షికారుకు బయల్దేరితిమి. బాగా చలిగానున్నది. తీవ్రమైనగాలి వీచుచున్నది. అందువల్ల నేను, మిస్ మాక్లియో మొదటిమకాములో దిగితిమి. మేము ''స్కుటారి''కి పోయి పీరీహైసింథీని చూడవలయుననుకొంటిమి. వారిభాష మాకు తెలి యదు. కాబట్టి సంజ్ఞలుచేసి ఒకపడవను కుదిర్చితిమి. కాలువ దాటి ఒకబండిని కట్టించితిమి. త్రోవలో సూఫీఫకీరు ఒకడు కూర్చుండియుండెను. ఈ ఫకీర్లు ప్రజలకు రోగములు కుదుర్చుదురు. తమ మతగ్రంథములనుండి మొదట కొంత చదివి వెనుకకు ముందు నకు నూగి నాట్యముచేయుచు క్రమముగా నావిష్టులై రోగియొక్క శరీరముపై నడచుచు వానిరోగమును వారు కుదుర్చుచుందురు.

పీరీహైసింథీతో అమెరికాలోని కళాశాలలను గుఱించి మేము చాలసేపు సంభాషించితిమి. తర్వాత మేమొక అరబ్బు దుకాణముదగ్గఱకు పోయితిమి. అచట మాకొక తురుష్క విద్యార్థి తటస్థపడెను. తర్వాత మేము స్కుటారినుండి తిరిగి వచ్చితిమి. మాకొక పడవ దొరికినది. కాని అది మమ్ము సరిగా చేరవలసిన చోటునకు చేర్చలేదు. మేమొక ట్రాంబండినెక్కి స్టాంబూల్‌లో మేము దిగిన హోటలుకు తిరిగివచ్చితిమి. పూర్వము గ్రీకుచక్రవర్తుల అంతఃపురమున్నచోట ఇప్పుడు స్టాంబూల్ మ్యూజియమున్నది. మే మచ్చట కొన్ని చెప్పదగిన శాసనములు చెక్కిన శవపేటికలను, మఱికొన్ని వస్తువులను చూచితిమి. దాని పైని 'టూఫానీ' అనబడు నున్నతప్రదేశమునుండి పట్టణము

చూచితిమి. ఆ దృశ్యము చాల నాకర్షణీయముగ నున్నది. అక్కడ నేను కోడిపిల్లమాంసపుటూరుగాయను కొనితింటిని. ఈ మాంసము తిని చాలకాలమైనది. దానితోపాటు తురుష్కపద్ధతితో తయారుచేసిన మసాలాఅన్నమును, మఱికొన్ని పదార్థములను బుచ్చుకొంటిని. స్కటారీలోని స్మశానమును చూచినతర్వాత పురాతనకుడ్యములను చూచుటకు పోయితిమి. ఆ గోడలలోపల బందిఖాన చాల భయంకరప్రదేశము. తర్వాత మేము వృక్ష పాషానుచూచి భాస్ఫరస్‌కు బయల్దేరితిమి. ఫ్రెంచివ్యవహారములను జూచు అధికారితో భోజనములుచేసి ఒకగ్రీకుపాషాను, ఒక ఆల్బేనియా పెద్దమనిషిని చూచితిమి. అక్కడ పోలీసువారు పీరీహైసింథీ యుపన్యాసములను నిషేధించిరి. అందుచేత నేను నుపన్యసించుటకు వీలులేదు. మేము దేవన్మల్లుమ కోబిజీ యను గుజరాతీబ్రాహ్మణుని చూచితిమి. ఇక్కడ భారతీయులగు హిందూస్తానివారు, ముసల్మానులు పలువురున్నారు. మేము తురుష్కభాషాశాస్త్రముపై కొంత ప్రసంగించితిమి. నూర్‌బే అను ఒకవ్యక్తినిగూర్చి వింటిమి. అతనితాత ఫ్రెంచివాడు. అచ్చట కొంద ఱతడు కాశ్మీరదేశస్థునివలె అందగాడని చెప్పుదురు. ఇచ్చటి స్త్రీలకు పర్దాపద్ధతిలేదు. చాలా చనవుగా తిరుగుదురు. మహమ్మదీయులలో వ్యభిచార మెక్కువ. మేము కుర్దుపాషాను గూర్చి వింటిమి. ఆర్మీనియనుల హత్యను గుఱించి వింటిమి. ఈ ఆర్మీనియనుల కొక దేశమనునదిలేదు. వారు నివసించు దేశములలో మహమ్మదీయు లెక్కువ. ఆర్మీనియా యను ప్రదేశమున్న దెవ్వరికిని దెలియదు. ఇప్పటి సుల్తాను కుర్దుజాతివారితో హమీదీయాశ్వసైన్యము నొకదానిని నిర్మించి కోస్సాకులపద్ధతిలో వారికి శిక్షణ నిప్పించుట కెంచెను. వారికి సైన్యములో చేర వలసిన నిర్బంధముండదు.

సుల్తాను ఆర్మీనియన్ గ్రీకుకుటుంబీకులను పిలిచి పన్నులకు బదులుగా సైన్యములో జేరు నిర్బంధమును ప్రతిపాదించెను. వారు

ఆ విధముగా వారి మాతృభూమికి సేవచేయగలరు. వారిట్లు సమాధానము చెప్పిరి: "యుద్ధములో వారు పోట్లాడుచు మహమ్మదీయులతో పాటు మరణించినచో క్రైస్తవ సైనికులను పూడ్చిపెట్టుటలో కొంత గందరగోళము జరుగును". సుల్తాను దీనికి మహమ్మదీయులలోను, క్రైస్తవులలోను ప్రతిదళమునందు వేర్వేరు పురోహితుల నేర్పాటుచేయుదుననియు చెప్పెను. వారి వారి మత పద్ధతులనుబట్టి అంత్యక్రియలు నెఱవేర్తురనియు, ఒకవేళ మూకుమ్మడిగా పాతిపెట్టవలసివచ్చినపుడు క్రైస్తవ, మహమ్మదీయ పురోహితులు కలిసి యంత్యక్రియలు నెఱవేర్తురనియు, నొకమతమునకు చెందిన జీవుడు తన మతమంత్రములతో బాటు నితరమత మంత్రములను విన్నంతమాత్రమున కల్గునష్టమేమియు నుండదనియు చెప్పెను. కాని దీనికి క్రైస్తవు లంగీకరించలేదు. వారందువల్ల పన్నులిచ్చుట తప్పలేదు. సుల్తానుప్రతిపాదనము వారంగీకరించక పోవుటకు మహమ్మదీయులతో నివసించుటవల్ల వారుకూడ మూకుమ్మడిని మహమ్మదీయులుగా మాఱిపోవలసివచ్చునను భయమే ముఖ్యకారణము. ఇప్పటి స్టాంబూల్ సుల్తాను చాలకష్టపడి పని చేయు స్వభావముగలవాడు. ప్రతివిషయమును స్వయముగా పర్యవేక్షించును. రాజభవనములో నేర్పాటుచేయు నాటకములు మొదలగు వినోదప్రదర్శనముల ఏర్పాట్లనుకూడ స్వయముగ పరామర్శించును. ఇతనికి పూర్వుడు మురాద్ అసమర్థుడు. ఇతడు మాత్రము చాల తెలివైనవాడు. ఇతడు రాజ్యమునకు వచ్చిన తర్వాత రాజ్యముయొక్క స్థితిలో నాశ్చర్యకరమైన అభివృద్ధి తెచ్చినాడు. ఈ దేశములో పార్లమెంటరీవిధానము కొనసాగదు.

ఉదయము పదిగంటలకు మేము కాన్‌స్టాంట్‌నోపిల్‌నుండి బయల్దేరితిమి. ఒకపగలు, ఒకరాత్రి నిశ్చలముగానున్న సముద్రము మీద ప్రయాణించి మేము "గోల్డెన్‌హారన్"ను, మార్మోరా సముద్రమును చేరుకొంటిమి. మార్మోరాసముద్రదీవుల నొకదానిలో

మేము గ్రీకుమతమునకు సంబంధించిన మఠమును చూచితిమి. పూర్వమిక్కడ మతగ్రంథాధ్యయనమునకు చాల యవకాశము లుండెడివి. కారణము ఆసియా, ఐరోపాలకు మధ్య నుండుట. ఉదయము మెడిటరేనియాలోని 'ఆర్చిపెలాగో'కు పోయి, మేము చూచుచుండగా మాకు ప్రొఫెసర్ లైఫెన్ కన్పించెను. ఈయన నొకపర్యాయము నేను పూర్వము మద్రాసులోని పచ్చయ్యప్ప కాలేజిలో కలిసికొంటిని. ఒకానొకదీవిలో మాకు శిథిలదేవా లయము కన్పించెను. ఇది బహుశః సముద్రపుటొడ్డున నున్నది. కాబట్టి 'నెప్ట్యూన్' దేవాలయము కావచ్చును. సాయంకాలము నకు మేము ఏథెన్సు చేరుకొంటిమి.

మేమా రాత్రియంతయు క్వారన్టైను (ఓడ హార్బరు లోకి రాకుండా నిషేధింపబడునపుడు నిల్చు స్థలము) లో గడపి ఉదయమున రేవులో దిగుట కనుమతిని సంపాదించితిమి. పోర్టు పైరస్ ఒకచిన్నపట్టణము. కాని చాల అందమైనది. ఇట ఐరోపావాతావరణమే మనకెచ్చటనైనను తగులుచుండును. అందు సీటుగౌనులు తొడుగుకొనిన ఒకరిద్దఱు గ్రీకువాండ్రు కన్పింతురు. అక్కడనుండి 5 మైళ్లు కారులోపోయి, ఏథెన్సుయొక్క పురాతనకుడ్యములను చూచితిమి. ఈ పురాతనకుడ్యములు పట్టణ మును సముద్రపురేవుతో కలుపును. తర్వాత మేము పట్టణములో తిరుగుటకు పోయితిమి. ఎక్రోపోలిస్సు – హోటళ్లు – ఇండ్లు – వీథు లన్నియు పరిశుభ్రముగా నున్నవి. రాజభవనము చాల చిన్నది. ఆ దినముననే మేము అచటనున్న ఒక చిన్న గుట్ట నెక్కి "ఎక్రోపోలిస్సు"ను, "వింగ్లెస్ విక్టరీ"యొక్క దేవాలయమును, "పార్థినన్" మొదలైనవానిని చూచితిమి. ఆ దేవాలయము పాల ఱాతితో కట్టబడినది. కొన్ని స్తంభశిథిలములుకూడ మాకు కన్పిం చినవి. మఱునాడుకూడ మెల్కార్వీకన్యతో వీనిని చూచుటకు పోయితిమి. వీనికి సంబంధించిన బహుచారిత్రకాంశముల నామె మాకు చెప్పినది. మఱునాడు ఒలింపియన్ జీస్ దేవాలయమును,

డయానిసస్ నాటకశాలను దర్శించితిమి. 3 వ నాడు మేము గ్రీకుల ప్రధానమతస్థానమైన ఎలిసిస్‌కు పోయితిమి. ఇచ్చటనే ప్రసిద్ధమైన ఎలిజీనియన్ విచిత్రములు ప్రదర్శితములగుచుండెడివి. ఈ ప్రదేశములోని పురాతనప్రదర్శనశాల ఒకధనికుడైన గ్రీకువాడు పునర్నిర్మాణము చేసెను. ప్రస్తుతకాలములో పూర్వపు ఒలింపియా ఆటలుకూడ పునరుద్ధృతములైనవి. ఈ ఒలింపియన్ ఆటలు స్పార్టాకు దగ్గరగా ఒకప్రదేశములో ఏర్పాటుచేయబడినవి. అనేక సందర్భములలో అమెరికావాండ్రే నెగ్గుచుందురు. గ్రీకులు మాత్రము ఆ ప్రదేశమునుండి ఏథెన్సులోని ప్రదర్శనశాలవఱకు జరిగిన పర్వపందెములో నెగ్గిరి. ఈ సంవత్సరము తురుష్కులతో జరిగిన పోటీపందెములో ఈ పరుగెత్తుటలో వారే గెల్తురని నిస్సందేహముగా ఋజువైనది.

నాలుగవనాడుదయము 10 గంటలకు మేము 'జార్' అను రష్యాస్టీమరుపై ఈజిప్టుకు బయల్దేరితిమి. మేము ఓడరేవుకు వచ్చిన తర్వాత ఓడ సాయంకాలము 4 గంటలకు బయల్దేరునని వింటిమి. బహుశః మేము పెందలకడనే వచ్చియుందుము. లేక సరకులెక్కించుకొనుటలో చాల ఆలస్యమైయుండును. అందుచేత మేమేదియు చేయునదిలేక అటునిటు తిరుగుటకు పోయితిమి. ఏజిలేడస్ — అతని ముగ్గురు శిష్యులు పిథియస్, మిరాంగ్, పోలిక్లిటస్ — ఈ నల్వురియొక్క శిల్పములను చూచితిమి. వీరు నలుగురు క్రీ. పూ. 576 నుండి 486 వఱకు నున్న మధ్యకాలములో జీవించినవారు. ఇచ్చటకూడ ఎండవేడిమి విపరీతముగా నున్నది. రష్యాఓడలో స్క్రూపైన మొదటితరగతి కలదు. తక్కినదంతయు డెక్కు. ఇది ప్రయాణీకులతో, పసువులతో, గొఱ్ఱెలతో నిండియుండెను. ఈ స్టీమరులో మంచుగడ్డ దొరకదు.

పారిస్‌లోని లోవర్ మ్యూజియంలో గ్రీకుశిల్పము చూచి అందు మూడంతరువులున్నవని నేను గమనించితిని. మొదటిది

మైసెనోయియన్ శిల్పము. ఇది అచ్చమైన గ్రీకుశిల్పము. ఎషీయన్ రాజ్యము సమీపమందలి దీవులకుకూడ వ్యాపించి ఆసియానుండి అక్కడకు సంక్రమించిన కళలంకుకూడ గ్రీకువారు ప్రావీణ్యము సంపాదించిరి. ఈ విధముగా గ్రీసులో శిల్పము ప్రథమముగా ప్రవేశించినది. చరిత్రకు పూర్వకాలమునుండి క్రీ. పూ. 776 వఱకు మైసెనోనియన్ శిల్పకాలమని చెప్పవచ్చును. ఈ శిల్పకళయందు ఆసియాకళానుకరణము మాత్రమే కన్పించును. క్రీ. పూ. 776 నుండి క్రీ. పూ. 146 వఱకు అచ్చమైన గ్రీకుశిల్పకాలమని చెప్ప వచ్చును. దోరియన్ జాతి ఎషీయన్ సామ్రాజ్యమును నాశనము చేసిన తర్వాత యూరపుఖండముమీదను, ఆర్చిపిలాగోలోను నివసించు గ్రీకులు ఆసియాలో చాల వలసలను సంపాదించిరి. ఇందుమూలమున వీరికిని, బాబిలోనియా దేశీయులకును, ఈజిప్టు దేశీయులకును మధ్య తగాదాలు సంభవించినవి. ఈ యుద్ధములే గ్రీకుకళకు కారణములైనవి. ఈ కాలమునందలి కళ కాలక్రమ మున ఆసియా అనుకరణము వదలి ప్రకృత్యనుకరణమును మొదలుపెట్టెను. గ్రీకుకళకును, నితరదేశములకళకును ప్రధాన మైన భేదమిది: గ్రీకుకళ ప్రకృతిని, జంతువులను యథాతథముగా చిత్రించును.

క్రీ. పూ. 776 నుండి క్రీ. పూ. 475 వఱకు ఆర్కేయిక్ గ్రీకుకళాయుగము వఱలినది. ఈ యుగమునందును బొమ్మలు మొద్దుగనే యున్నవి. కాని జీవకళ లేదు. పెదవులు కొంచము తెఱచుకొని నవ్వుచున్నట్లుండును. ఈ బొమ్మలు ఈజిప్టు బొమ్మ లను పోలియుండును. శిలావిగ్రహములన్నియు నిటారుగా కాళ్ల పైన నిల్చియుండును. జుట్టు, గడ్డము అన్ని నిలువుగీతలుగీసి చెక్కినట్లుండును. ఈ శిలావిగ్రహములకు బట్టలు చుట్టినట్లు చెక్కిరి. అవి స్వభావసిద్ధముగ నూగులాడుచున్నట్లు, వ్రేలు చున్నట్లు లేవు.

ఆర్కేయిక్, గ్రీక్ శిల్పము తర్వాత క్రీ. పూ. 475 నుండి క్రీ. పూ. 323 వఱకు క్లాసిక్ గ్రీకుశిల్పయుగము వర్ధిల్లినది. ఏథెన్సు నాయకత్వము వహించినప్పటినుండి అలెగ్జాండరు మరణమువఱకు ఇది వఱలినది. పోలిపోనీసస్సు, అట్టికారాజ్యములం దా యుగ శిల్పము వికసించినది. అట్టికాకు ఏథెన్సు ముఖ్యపట్టణము. ఒక ఫ్రెంచిపండితవిమర్శకుడు ఇట్లు వ్రాసినాడు: "క్లాసిక్ గ్రీకుశిల్పము ప్రసిద్ధమైన ఇతర దేశపద్ధతులనుండి విడివడి స్వతంత్రముగా నిల్చినది". ఈ క్లాసిక్ గ్రీకుశిల్పమే వైదేశిక శిల్పవిధానములను నియమముల నవలంబించలేదు, వాని ననుకరింపలేదు. క్రీ. పూ. 5 వ శతాబ్దమందలి ఈ గ్రీకుశిల్పమును మనము పరిశోధించితిమేని, (ఈ శతాబ్దమునందు పరిపూర్ణమైన శిల్పకళాఖండములు తయారైనవి.) పురాతనశిల్పకళానియమములను దూరీకరించుటవలన గ్రీకుశిల్పములందు నింత జీవకళ ప్రాణశక్తి సంభవించినవని మన కవగతమగును. ఈ క్లాసిక్ గ్రీకుశిల్పమందు రెండుమార్గములున్నవి. 1. ఎట్టికామార్గము, 2. పెలోపోనీసియా మార్గము అనునవి. మొదటిదానిలో మఱల 2 భేదములు కలవు. మొదటిది ప్రతిభావంతుడైన ఫిధియాస్ మార్గము. దీనినిగుఱించి ఒక ఫ్రెంచి పండితు డిట్లు వర్ణించినాడు: "ఈ శిల్పమార్గమున సమగ్రసౌందర్యపరిణతి కలదు. పరిశుద్ధమైన, ఉన్నతమైనభావముల కిది ప్రతినిధి. సౌందర్యము, భావసంపద—ఈ శిల్పమార్గమునం దభివ్యక్తమై మనుష్యహృదయములమీద చిరస్థాయిగ ముద్రితములైనవి. అట్టికాకు చెందిన రెండవమార్గములో స్కోపస్, ప్రాక్సిటీలస్ అను నిద్దఱు శిల్పులు గొప్పవారు. ఈ మార్గము మతమును వదలి కేవలము మనుష్యజీవితమునే చిత్రించినది.

పెలోపోనిషియన్ మార్గమునకు పోలిక్లిటస్, లైసిప్పస్ అను నిద్దఱు ప్రతినిధులుండిరి. ఇందులో మొదటివాడు క్రీ.పూ. 5 వ శతాబ్దిలోను, రెండవవాడు 4 వ శతాబ్దిలోను పుట్టినారు.

శిల్పకళయందు మానవశరీరనిర్మాణములోని కొలతలన్నియు చక్కగా ప్రతిబింబింపవలెనను నియమమునకువారు ప్రాధాన్య మిచ్చినవారు.

క్రీ. పూ. 323 నుండి క్రీ. పూ. 146 వఱకు అలెగ్జాండరు మరణమునుండి రోమనులు అట్టికాను జయించునంతవఱకు గ్రీకు శిల్పమునందు క్షీణయుగ మనవొప్పును. ఈ యుగమున గ్రీకు శిల్పములో నాడంబరోపేతమైన అలంకారము లుండుట గమనింతుము. విగ్రహము లసాధారణముగ, స్థూలములుగ నుండుట మనకు కన్పించును. తర్వాత రోమనులు గ్రీసు నాక్రమించుకొనిన కాలములో గ్రీకు శిల్పమును, పురాతనకాలపు శిల్పకారుల పనితనమును అనుకరించుటలో నిమగ్నులైరి. ఇందులోనున్న నవీనత ఒక్కటియే. అది ఒకానొకవ్యక్తియొక్క ముఖము నచ్చముగా చిత్రింపగల్గియుండుట.



# సృష్టిప్రళయములు*

ఈ విశ్వమంతయు అశాంతిరూపమైనది. కల్లోలితమైన విశ్వము తిరిగి శాంతిని సంపాదించుటకు చేయు ప్రయత్నమే సృష్టి యందు కనుపించు చలనముగా రూపొందినది. విశ్వము తిరిగి శాంతిని సంపాదించినచో చలనముండదు. శాంతియందు చలన ముండదు. అందుచే ఈ శాంతస్థితి మన ఆలోచన కందనిది. ఆలోచనకూడ చలనమేకదా. ఇట్టి స్థితి పొందరానిదనిమాత్రము మనము చెప్పుటకు వీలులేదు. ఈ సర్వవిశ్వము శాంతావస్థను చెందుటకే పరుగిడుచున్నది. సర్వపరిస్థితులు పరిపూర్ణమైన సమత్వమువైపుకే మ్రొగ్గుచున్నవి. మఱి ఆ యవస్థయం దేవిధమైన భేదముండునని చెప్పుటకులేదు. అది నిరవయవమైనది. రెండు అవయవములున్నచో నొకదాని నొకటి ఆకర్షించుటయో, వికర్షించుటయో జరిగెడిది. అపుడు శాంతి చెడిపోవును. అందుచే నాయవస్థఏకము, విశ్రాంతిస్వరూపము, నిరవయవమని చెప్పవలెను. ఆధ్యాత్మికపరిభాషలో ఈ శాంతస్థితి అంతఃకరణమో, శరీరమో, మఱి ఏదియో గుణము కాదు. ఆ స్థితినిగుఱించి మనము చెప్ప గలిగినదెల్ల నొక్కటే. ఆ స్థితియందు దాని స్వకీయస్వభావము తప్ప మఱియొకగుణముండదు. అది నిర్విశేషము. సచ్చిదానంద స్వరూపము.

మఱియు ఆ స్థితి ద్విత్వవిశిష్టముకాదు. అట్లగుటకు వీలు లేదు. ఏకమే కావలెను. నేను, నీవు మొదలైన కల్పితభేదము లెల్ల అచట నుండుటకు వీలులేదు. ఈ భేదములన్నియు మాయకు

---

* స్వామిజీ ప్రథమపర్యాయము అమెరికాపోయినపుడు ఒకపాశ్చాత్య శిష్యుడడిగిన ప్రశ్నలకు ప్రత్యుత్తరముగా వ్రాయబడినది.

సంబంధించినవి. మార్పుకు సంబంధించినవి. ఈ మార్పు అవికారమైన ఆత్మపదార్థముపై మనకిప్పుడు భాసించుచుండును. అందుచేత ఈ మార్పు భాసింపకపూర్వ మాత్మయొక్క అచ్ఛమైనస్థితి విశ్రాంతిస్వరూపము. మోక్షస్వరూపము. ఇప్పుడు మాత్రము భిన్నత్వము అనుభూయమానమగుచున్నది. ప్రాచీనకాలమున అది అద్వయస్థితిలో, సమరూపస్థితిలో నుండెను. అది మూలావస్థ. దానినుండి ఈ పరివర్తనాత్మకస్థితి యుత్పాదితమగుచున్నది. దానిపైన నిది అభివృద్ధి. మఱల ఈ స్థితినుండి ఆ భిన్నత్వములేని పురాతనపుస్థితికిపోవుట దిగజారిపోవుటమాత్రమే యగుట అని కొందఱనవచ్చును. కాని సర్వకాలములందీ ఏకత్వము, భిన్నత్వము అను స్థితులు తిరిగి తిరిగి జరుగకున్నచో ఈ వాదమునందు కొంత యథార్థముండవచ్చును. ఒకతడవ జరిగినది మఱల మఱల జరిగి తీరవలెను. విశ్రాంతి తర్వాత మార్పువచ్చును. ఆ మార్పే ప్రపంచము. ఒకమార్పుకు వేఱొకమార్పుకుమధ్య విశ్రాంతియుండి యుండవలెను. అనగా విశ్రాంతి తర్వాత మార్పు. మార్పు తర్వాత విశ్రాంతి ఒకదానిపిదప నొకటి చక్రనేమిక్రమమున తిరుగుచుండును. అంతేకాని మొదట కొంతకాలము విశ్రాంతి యుండి తర్వాత కొంతమార్పువచ్చి ఈ మార్పిట్లే నిరంతరము కొనసాగుచుండునని భావించుట యుక్తముకాదు. సృష్టియందు ప్రత్యణువును విశ్రాంతి మార్పుపొందుచున్నట్లు సాక్ష్యమిచ్చుచున్నది. ఈ విశ్రాంతి లయము. మార్పు సృష్టి.

ఒకలయమునకు మఱియొకలయమునకు మధ్యనున్న కాలమునకు కల్పమనిపేరు. కాని కల్పములకు మధ్యనున్న లయము పరిపూర్ణమైన అద్వైతస్థితికాదు. పరిపూర్ణమైన అద్వైతస్థితి యైనచో తర్వాత మఱల సృష్టి జరుగుటకు వీలులేదు. మఱి ఇప్పుడున్న ఈ సృష్టి దీనికిపూర్వమున్న లయస్థితికన్న ఎంతో అభివృద్ధికరమైనట్టిదని చెప్పుట యుక్తముకాదు. ఆ సందర్భములో

సృష్టిలోనున్న అభ్యుదయస్థితికన్న దీనితర్వాతవచ్చు ప్రళయస్థితి మఱియు నభ్యుదయస్థితి కావలసివచ్చును. ఇంతకన్నను పరిపూర్ణము కావలసివచ్చును. అందుచేత ఒకప్పు డభ్యుదయము, మఱియొకప్పుడు అనభ్యుదయమున్నవని చెప్పుటకు వీలులేదు. ఉన్నదేమన మఱల తిరిగి తిరిగి అదేపరిస్థితి భాసించుచున్నదన్నమాట. 'ధాతా యథాపూర్వ మకల్పయేత్' ధర్మమనగా నిదియే అర్థము. కాని జీవులకు సంబంధించినంతవఱ కభ్యుదయమందుట యున్నది. అనగా జీవులు జన్మలెత్తినకొలది తమస్వస్వరూపమునకు దగ్గఱగా వత్తురు. ప్రతికల్పమందును వేలకొలది జీవులు మోక్షమునందుదురు. కాని ఈ జీవాత్మ పరమాత్మయందొక అంశము. ఈ సృష్టి నిరంతరము కొనసాగుచున్నది కాబట్టి అసలు ఆత్మకు మోక్షమను మాట కుదురదు. అదియున్నచో సృష్టి జరుగుటకే వీలులేదు. అది వినష్టము కావలసినదే అని శంకించవలసివచ్చును. దీనికి సమాధానమిది : అసలు జీవాత్మ యన్నది విభిన్నముగా లేనేలేదు. ఉన్నదనుకొనుట మాయ. ప్రపంచమెంత భ్రాంతియో జీవాత్మ యున్నదనుటయు నంత భ్రాంతియే. న్యాయమున కీ జీవాత్మ నిరుపాధికమైన బ్రహ్మపదార్థమే.

ఈ సృష్టియందు సత్యమైన పదార్థము బ్రహ్మమే. అది సృష్టిస్వరూపమున మాయాప్రభావమున భిన్నభిన్నముగా గన్పించుచున్నది. మాయ అన్నది భ్రాంతిస్వరూపము కాబట్టి సత్యపదార్థముకాదు. కాని, అది దృశ్యజగత్తు నుత్పాదించుచున్నది. ఐనచో ఒకప్రశ్న యుదుగవచ్చును : "భ్రాంతిస్వరూపమైన మాయ ప్రపంచము నెట్లుత్పాదించుచున్నది?" సమాధానము : "కార్యమైన ఈ జగత్తంతయు నజ్ఞానస్వరూపమైనపు డుత్పాదకమైన మాయయు నజ్ఞానమే తప్పకుండ నగునుగదా." మఱి జ్ఞానమునుండి అజ్ఞానమెట్లుకల్గును? అందుచే ఈ మాయ రెండు విధములుగా నున్నదని చెప్పవలెను. 1. అజ్ఞానము, 2. విజ్ఞానము. విజ్ఞానము అజ్ఞానమును నశింపజేసి తానును వినష్టమగును.

మాయ తన్నుతానే నశింపజేసికొనును. తర్వాత మిగులునది కైవల్యము. సచ్చిదానందస్వరూపము. అందుచే సృష్టిలో సత్య పదార్థము కైవల్యము. మనకు సృష్టి ముగ్విధములుగా ప్రకటిత మగును. 1. ఈశ్వరుడు, 2. జీవుడు, 3. భౌతికపదార్థము. ఈ అన్నింటి కధిష్ఠానభూతమైనది కైవల్యరూపమైన బ్రహ్మ పదార్థము. మాయాచ్ఛాదితమై అది భిన్నముగా దృశ్యమాన మగుచున్నది. ఈశ్వరదర్శనము బ్రహ్మానుభూతికి సహోదరము. మనుష్యుని ఊహలలో ఉత్తమమైన ఊహ ఈశ్వరసంబంధమైన ఊహ. ఈశ్వరునకు ఆరోపించు గుణగణములన్నియు సృష్టియం దారోపితగుణము లెంత సత్యములో అంతే సత్యములు. మాయా పరిచ్ఛిన్నమైన పరబ్రహ్మమే ఈశ్వరుడనుమాట మనము మఱచిపోరాదు.



# "క్రీస్తున కనుకరణము"

## పీఠిక

(1889వ సంవత్సరములో స్వామిజీ బెంగాలీభాషలో వ్రాసినదిది. "Imitation of Christ" అను గ్రంథమును బెంగాలీభాషలోని కనువదించి, దాని నొక బెంగాలీ మాసపత్రికయందు వారు ప్రకటించిరి. ఆ గ్రంథమునందు స్వామిజీ ఆఱు పరిచ్ఛేదములనుమాత్ర మనువదించి, హైందవమతగ్రంథముల నుండి తుల్యోదాహరణములు చూపిరి. ఆ గ్రంథమున కిది పీఠిక.)

"Imitation of Christ" (క్రీస్తునకనుకరణము) అను గ్రంథము క్రైస్తవుల పవిత్రగ్రంథము. ఒక రోమన్ కాథలిక్ సాధువు వ్రాసినాడు. వ్రాసినాడనుమాట అంతయోగ్యము కాదేమో! ఈ గ్రంథమందలి ప్రత్యక్షరము క్రీస్తునందున్న భక్తిచేత సర్వసంగపరిత్యాగముచేసి తనహృదయరక్తముతో అక్షరాక్షరమును తడిపి ఆ మహానుభావు డీ గ్రంథమును వ్రాసినాడన వచ్చును. కడచిన 400 సంవత్సరములలో, లక్షలకొలదిస్త్రీపురుషుల హృదయములపైన ఈ మహానుభావుని తేజోవంతములై, ప్రాణవంతములైన పలుకులు, ఆధ్యాత్మికదీప్తిని ప్రసరింపజేసినవి. వర్తమాన కాలమందును, భవిష్యత్తునందును ఈ గ్రంథమున కట్టి ప్రచార ప్రభావములు తప్పవు. ఈ మహానుభావుని ప్రతిభముందు, సాధన ముందు భక్తిప్రపత్తులతో వేలకొలది మహారాజులు వినమిత శిరస్కులైరి. ఈ మహానుభావుని నిరుపమానమైన పావిత్ర్యము కతన క్రైస్తవదేశములందు చిన్నచిన్న మతసంఘములు శతాబ్దములనుండి వచ్చుచున్న అంతశ్ఛేదములను సమయింపజేసికొనినవి. ఎల్లరకు సంబంధించిన సాధారణధర్మములపై, భక్తిబంధురమైన ఏకైకలక్ష్యముపై వారు దృష్టిని సారించిరి. అట్టి మహానుభావు డింత గొప్పపుస్తకమునకు తనపేరుపెట్టుట యోగ్యముకాదను

కొన్నాడు. ఇందులో వింత ఏమియు లేదు. అతని పేరెందుకు పెట్టవలెను? లౌకికభోగములనన్నింటిని నిరసించి కీర్తి యనుదానిని గవ్వకును గొఱగానిదానిగా నిరసించిన త్యాగమూర్తికి గ్రంథకర్తగా పేరుపొందవలెననుకొనుట సంభవమగునా? తర్వాతి కాలమువారు ఈ గ్రంథము రచించినది థామస్ ఏకెంపెస్ అను రోమన్ కాథలిక్ సాధువని ఊహించినారు. ఈ ఊహ ఎంతవఱకు నిజమో భగవంతునకే తెలియవలెను. అతడెవడైననేమి? అతడు ఆ గ్రంథకర్త—ప్రపంచమంతటియొక్క గౌరవమందదగియున్నాడన్నచో నతిశయోక్తి ఏమియు లేదు.

మనమిప్పుడొక క్రైస్తవప్రభుత్వమునందున్నాము. ఆ ప్రభుత్వానుగ్రహమువల్ల బహుశాఖలకు సంబంధించిన దేశీయ, విదేశీయ క్రైస్తవుల సంపర్కము మనకు కల్గుచున్నది. కాని వారి మతవిశ్వాసములకు, నాచరణముల కెంత విపరీతభేదమున్నది! ఒక క్రిస్టియన్ మిషనరీ ఉపన్యసించునప్పుడు రేపటినిగుఱించి ఆలోచించవద్దని చెప్పును. వెంటనే అతడే పదిసంవత్సరముల వఱకు సుఖజీవనమునకై ఒకప్రణాళికను వేసికొనును. చెప్పునప్పుడు తలదాచుకొనుటకు స్థలములేనివాడైన క్రీస్తుదేవుని నేననుసరించుచున్నాననును. ఆ క్రీస్తుదేవుని మహాత్యాగమును గుఱించి చెప్పును. ఆచరణలో లోకమందున్న సర్వసుఖముల ననుభవించుచు పెండ్లికొడుకువలె నూరేగును. ఎందు వెదకినను నిజమైన క్రైస్తవుడు మనకెచ్చటను కన్పించడు. ఈ ప్రొటెస్టాంట్ శాఖలకు చెందిన క్రైస్తవులు పరమవిలాసపురుషులు. దురధికారపూరితులు. గుఱ్ఱపుబండ్లెక్కి తిరుగు మనుష్యులు. వీరినిచూచినపుడు మనకు గల్గిన భావము ఈ ఉదాత్తగ్రంథమును శ్రద్ధతో నొక్క పర్యాయము చదివినచో మనమనస్సులనుండి తొలితమగును.

వివేకులందఱు ఒకేవిధముగ ఆలోచింతురు. ఈగ్రంథమును చదువుచున్నపుడు మనహృదయములందు భగవద్గీత అనుక్షణము ప్రతిధ్వనించుచుండును. గీతలోవలెనే సర్వధర్మములను పరిత్య

జించి "నన్ను శరణుచెందు"మని ఈ గ్రంథమందును చెప్పబడినది. వినయము, నిర్విణ్ణుడైన జీవుని వేదన, దాస్యభక్తి ప్రతివాక్యమందును, ఈగ్రంథములో గోచరించును. గ్రంథకర్తయొక్క త్యాగము, ఆత్మార్పణము, ఈశ్వరేచ్ఛ కధీనమై యుండుట మొదలైనవానినిగూర్చి చదువునపుడు పాఠకుని హృదయము తరంగితమగును. ఈ గ్రంథ మొక క్రైస్తవుడు వ్రాసినది కావున మతదురభిమానమువల్ల మనదేశీయులు ఈగ్రంథముపై చిన్నచూపుసారింపవచ్చును. నేను వైశేషికదర్శనమందలి ఒకసూత్రమునుమాత్రము వ్రాసెదను. "ఆప్తోపదేశవాక్యం శబ్దః". దీని కర్థమిది: శబ్దప్రమాణమనగా సిద్ధపురుషులయొక్క ఉపదేశము. అనగా సిద్ధపురుషుల మాటలు యథార్థజ్ఞానజనకములు. జైమిని ఋషి దీనికి వ్యాఖ్యానముచేయుచు ఇట్టి ఆప్తపురుషులు ఆర్యులందును, మ్లేచ్ఛులందును పుట్టవచ్చునన్నాడు.

పురాతనకాలములో యవనాచార్యుడు మొదలగు గ్రీకు ఖగోళశాస్త్రజ్ఞులు మనపూర్వులైన ఆర్యులచేత అంత గొప్పగా గౌరవింపబడినప్పుడు ఈ మహాభక్తునియొక్క గ్రంథము నా దేశీయులచేత ప్రశంసింపబడదని నే ననుకొనను.

సరే, ఏమైన కానిండు. ఈ పుస్తకముయొక్క బెంగాలీ అనువాదమును క్రమముగా పాఠకులముందుంచుచున్నాను. వంగ పాఠకులు బండ్లకొలది కొఱగానినవలలు, నాటకములు చదువుటకు వ్యయముచేయుకాలమందు శతాంశమైనను ఈగ్రంథమును చదువుటకు వినియోగింతురని నేను విశ్వసింతును.

నేనక్షరాక్షరము సరిగా ననువదించుటకు ప్రయత్నించితిని. ఎంతవఱకు కృతార్థుడనైతినో చెప్పలేను. బైబిలునకు సూచనలున్న తావులందు క్రింద 'హంసపాదులు' పెట్టి చూపించితిని.



# బిల్వమంగళుడు

(ఈ రచన రాఘవానందస్వామి అమెరికాసంయుక్తరాష్ట్రములో నున్నపుడు మిస్. యస్. ఇ. వాల్డో అను నామెకు సంబంధించిన కాగితములలో కనుగొనెను.)

ఈ కథ భక్తవిజయమను గ్రంథములోనిది. ఒకపల్లెలో ఒక బ్రాహ్మణయువకుడుండెను. అతడు మఱొకపల్లెలో నివసించు ఒకభోగిని కలవాటుపడెను. ఈ రెండుపల్లెలమధ్య ఒక పెద్దనది కలదు. ఈ యువకుడు ప్రతిదిన మొకసంగడిపై నదిదాటి ఆ వేశ్య యొద్దకు పోవుచుండెను. ఒకరోజున తనతండ్రికి తద్దినముపెట్ట వలసివచ్చి ఆ భోగినికడకు పోవుటకు వానికివీలుకాలేదు. తద్దినము పెట్టవలెను. శ్రాద్ధక్రియకు వలసిన నియమములన్నియు పాటింపవలెను. ఇది హిందువుల ఆచారము. అతడంతయో విసికొన్నను, కసరికొన్నను చేయక తప్పినదికాదు. తుట్టతుదకు ఆ కర్మ ముగిసినది. ప్రొద్దుగ్రుంకినది. వెంటనే ఒక పెద్దఉప్పెన వచ్చినది. వర్షము కుంభవృష్టిగా కురియుచుండను. ఆ నది ఉత్తాలతరంగములతో నుఱ్ఱూతలూగుచుండను. నదిని దాటుట చాల అపాయకరముగానుండెను. ఐన నతడు నదివద్ద కేగెను. సంగడి లేదు. సంగడివాండ్రు నదిదాటుటకు భయపడిరి. కాని అతడు వెళ్లకుండ నుండలేడు. వానికి పిచ్చెక్కిపోవుచుండెను. అందుచే వెళ్ల వలసినదే. పైనుండి ఏదో కొట్టుకొనివచ్చుచుండను. దానిని తెప్పకొయ్యగా జేసికొని నదిదాటి ఆవలియొడ్డుచేరి దానిని పైకి లాగి అతడు భోగినియింటికేగెను. తలుపులుమూసియుండెను. అతడు తలుపులు కొట్టెను. ఎవ్వరును లేవలేదు. గోడచుట్టు ప్రదక్షిణించెను. ఒకచోట నేదో పైనుండి వ్రేలుచుండగా తన కొఱకు ప్రియురాలువేసిన త్రాడని దానిసాయముతో పైకెగబ్రాకి అతడు లోపలకు దిగబోయి కాలుజారిపడెను. ఆయింటిలోని

వారు, ఈ చప్పుడువిని లేచిరి. ఆ భోగినివచ్చి మూర్ఛాగ్రస్తుడైన ఆ యువకునిచూచి అతనిని లబ్ధసంజ్ఞానుని గావించెను. అతని ఒడలంతయు దుర్వాసన కొట్టుచుండెను. ఆమె "నీకేమిజరిగినది? ఈ యొడలినిండ దుర్వాసనయేమి? లోనికెట్లువచ్చితివి?" అని అడిగెను. అతడు "ఓసిప్రియురాలా! నాకొఱకై త్రాడు జారవిడిచితివిగదా" అనినాడు. ఆమెనవ్వి "ప్రియురాలేమిటయ్యా! మాకు కావలసినది డబ్బు. నీకొఱకు త్రాడువేసితిననుకొంటివా? ఓయీ పిచ్చివాడా! నీవు నది నెట్లు దాటితి" వనినది. నదిలో కొట్టుకొనిపోవుచున్న కొయ్యతో దాటితినన్నాడు. సరే పోయి చూతమనినది. చూడగా ఆత్రాడొక త్రాచు, భయంకర విషసర్పము. అది ఊరక ముట్టుకొన్న జనులుచచ్చిపోవుదురు. దానితల ఒక భూరియలోనున్నది. ఇతడు తోకపట్టుకొన్నపుడది బొరియలోనికిపోవుచుండెను. దీనినతడు త్రాడనుకొన్నాడు. ప్రేమోన్మాదములో నాయనకేమి తెలియును? పాము తలను కన్నములోనుంచియుండగా దానితోక ఎవడైన పట్టుకొని ఎంత గుంజినను బైటకు రాదు. అందువల్ల నితడాగోడ ఎక్కగల్గినాడు. కాని అదిబైటకు రాలేదన్నమాటేగాని ఇతని బరువునకది చచ్చినది. "సరేనీవు నది దాటిన కొయ్య ఎక్కడున్న" దని ఆమె వానినడిగినది: "అదిగో ఆనదియొడ్డున" అనిచూపినాడు. అదొకశవము. నదీప్రవాహములో కొట్టుకొనివచ్చినది. అతడది యొకమొద్దనుకొనినాడు. దానిపైనెక్కి నదీతరణముచేయుటవల్ల శరీరమంతయు దుర్వాసనకొట్టుచున్నది. ఆభోగస్త్రీ అతనివంకకుచూచి ఇట్లనినది: "నాకుఎన్నడును ప్రేమలోనమ్మకములేదు. దానిని మేము విశ్వసింపము. నిజముగా నీది ప్రేమకాకున్నచో ఓయి పరమేశ్వరా! ప్రేమయనునది వేఱుగా నెట్లుండును? అది సరేగాని ఓయిమిత్రుడా! నావంటిదుష్టురాలికి నీ హృదయమిచ్చితివేల? నీ హృదయము పరమేశ్వరాంకితమేల చేయవు? అప్పుడు ముక్తి నీకు కరతలామలకమగునుగదా." అతనికి ఒక పెద్ద పిడుగుపడ్డట్లైనది. ఆతడు నేత్రములు తెఱచి

నాడు. ఆక్షణములో నతని మనసున పరమేశ్వరతత్త్వము తళుక్కు-
మన్నది. అతడిట్లనినాడు : "పరమేశ్వరుడనుచు నొకడున్నాడా?"
ఆమె "ఉన్నాడయ్యా! ఉన్నాడు, పరమేశ్వరుడున్నాడు" అని
అన్నది. అత డటనుండి సాగిపోయి ఒక అడవిలో ప్రవేశించెను.
గొంతెత్తిఏడ్చుట ప్రారంభించినాడు. పరమేశ్వరునిప్రార్థింపసాగెను.
"ఓ ప్రభూ! నీవు నాకు కావలెను. ఈ నా ప్రేమ ప్రవాహమును
తాళుకొను తాహతు ఈ అల్పమానవులకు లేదు. ఈ నా ప్రేమ
మహాప్రవాహము నిముడ్చుకొనగల్గు ప్రేమసముద్రము నాకు
కావలెను. మహావేగముతో పొంగిపొరలు నా ప్రేమనది చిన్ని
చిన్ని పడియలలోనికి ప్రవేశింపజాలదు. దానికొక సముద్రము
కావలెను. ఓ ప్రభూ! ఆసముద్రమవు నీవే, స్వీకరింపుము."
అతడా యరణ్యములో సంవత్సరములతరబడి నున్నాడు. కొన్నాం
డ్లకు తాను కృతార్థుడనైతినని భావించెను— సన్యాసియయ్యెను.
తర్వాత నగరములోనికివచ్చి ఒక నదిఒడ్డున స్నానఘట్టమున
కూర్చుండియుండెను. అటకొక వర్తకునిభార్య, అందమైనది సేవకు
రాలితో వచ్చి తిరిగిపోయెను, ఈ ముదుసలి సన్యాసియందు
కోరికతలయెత్తెను, ఆసుందరవదనము అతని నాకర్షించెను; ఈ
యోగి ఆమెవంకచూచిచూచి లేచినిల్చి ఆమెవెంట నామెయింటికి
పోయెను. ఇంతలో నామెభర్త వచ్చెను. ఈకాషాయాంబరము
దాల్చినవానినిచూచి "స్వామీ! లోనికి దయచేయుడు. ఏమి
యాజ్ఞయో సెలవియ్యగలరు" అనగా యోగి "నేను చాల పెద్ద
వస్తువునే అడుగబోవుచున్నాను" అనెను. ఇతడు "నేను గృహ
స్థుడను. ఎవరేది అడిగిన నిత్తును" అనినాడు. యోగి "నీభార్యను
చూడవలెనయ్యా" అనినాడు. వణిజుడు "ఓయి పరమేశ్వరా!
ఏమిది? సరే, నేను నాభార్య పవిత్రులము. పరమేశ్వరుడు సర్వ
రక్షకుడు. స్వాగతముస్వామీ రండు లోపల" కనినాడు. యోగి
లోపలకు వెళ్ళెను. వణిజు డితనిని తన భార్యకు పరిచయము
కావించెను. ఆమె "స్వామీ! తమకు నేనేమిచేయవలె" నని

యడిగినది. అత డామెవంక చూచిచూచి కడ కిట్లనినాడు : "అమ్మా! నీ తలలోని రెండుసూదులు నా కిత్తువా" అనినాడు. ఆమె యివిగో అని ఇచ్చినది. అతడా సూదుల రెంటిని తన కంటి పాపలలోగ్రుచ్చుకొని "ఛీ దౌర్భాగ్యులారా! చావండి, ఇంకపై చర్మాస్థి మజ్జామాంసవికారాకృతులు మీకు లేవు. మీరు దర్శింపదలచుకొన్నచో ఆత్మ చక్షువులతో బృందావన సంచారియైన గోపాలుని దర్శింపుడు. మీకున్న చక్షువు లాత్మచక్షువులే" యనినాడు. బయలుదేరి ఆతడు మఱల అడవికేగెను. అట మఱల నేడ్వసాగెను. ఆఏడ్పు ఏడ్పటులే సాగినది. ఆ ఏడ్పంతయు అతనియందున్న ప్రేమ ప్రవాహము సత్పదార్థమును కన్గొనుటకై పొందిన జీవునివేదన. తుదకతడు కృతార్థుడైనాడు. అతని హృదయమును, అతని ఆత్మను, అతని ప్రేమప్రవాహమును సరియైన దిశకు పట్టించినాడు. అది గోపకిశోరమును చేరినది. అతడు పరమేశ్వరుని శ్రీకృష్ణాకృతిగా దర్శించినాడు. అపుడు మఱల నతడు తనకు కన్నులు లేకపోయెనేయని పరమాత్మయొక్క భౌతికమైన దివ్యసౌందర్యము చూడలేకపోయితిని గదాయని విచారించి నాడు. మనోమయమైన రూపమునేతప్ప చూడలేకపోయితినే యని విచారించినాడు. అతడు కొన్ని మధురములై, మనోహరములైన భక్తి శ్లోకములను రచించెను. సంస్కృతకవులు తమ గ్రంథములందు గురుస్తుతి చేయుదురు. అతడు ఆ భోగినిని గురువుగా స్తుతించెను.



# వ్యక్తిగత గుణములు

("క్రిటిక్", అక్టోబరు 7, 1893)

సర్వమతమహాసభవల్ల అధునాతనులకు పురాతనతత్త్వశాస్త్రమతములమీద నెంత యభిమానమున్నదో మనకు తెలిసినది. ఒకసారి మన కీవిషయము తెలిసినచో, మనకు పురాతనతత్త్వశాస్త్రమతప్రవర్తకులనుగుఱించి తెలిసికొనవలెనను అభిరుచి పెఱిగి, విజ్ఞానసముపార్జనమందు మన ముత్సాహితుల మగుదుము. పార్లమెంటు ముగిసిన తర్వాత ఈదృశవిజ్ఞానసముపార్జనమునకు ఇంకను షికాగోలోనుండియున్న స్వామి వివేకానందుని ఉపన్యాసములు గొప్పఅవకాశమును కలుగజేసినవి. ఆయన ఇక్కడకు వచ్చుటకు ముఖ్యకారణము హిందువులలో క్రొత్తపరిశ్రమలను ప్రారంభించుటకై అమెరికావారికి అభిరుచిని కల్గజేయుట. కాని ఆయన ప్రస్తుత మాయభిప్రాయమును వదలిపెట్టెను. ప్రపంచమునందు అమెరికావారు అందఱికంటె దాతృతాగుణమందు గొప్పవారు. అందువల్ల ఏదో ప్రయోజనమును నెఱవేర్చుటకై అమెరికనుల సాహాయ్యమభ్యర్థించుటకై పలువురిచ్చటకు వత్తురు. వివేకానందస్వామిని మా దేశములోని పేదవారికి, మీ దేశములోని పేదవారికి తేడా ఏమని అడుగగా, ఆయన ఇట్లు చెప్పెను: "మీ దేశములోని పేదవారు మా దేశములో మహారాజులు". ఆయనను షికాగోలోనున్న నిఱుపేదవాడలకు కొనిపోగా, ఆయన ఇట్లు చెప్పిరి: "ఇచ్చటి పరిస్థితి సుఖకరముగానే యున్నది. ఆనందదాయకముగాకూడ నున్నది".

వివేకానందుడు 'బ్రాహ్మణానాం బ్రాహ్మణః'. అట్టిమహనీయుడు తనదర్జాను వదలిపెట్టి సామాన్య సన్న్యాసులలో తానొకడుగా

చేసినారు. ఈ సన్న్యాససోదరకూటమునందు కులగర్వమునకు తావులేదు. కాని ఆయన తనజాతిచిహ్నమును ఇంకను ధరించుచునేయున్నారు. ఆయనసంస్కృతి, ఆయనవక్తృత్వము, ఆయన మహిమ, అనుభూతి ఇవన్నియు హైందవనాగరకతయన నేమియో మనకు తెలియజేసినవి. ఆయన ఆకృతివిశేషము చాల దొడ్డది. సొగసైన, వివేకవంతమైన చుఱుకుదనముకల ముఖము గలవారు. కాషాయవస్త్రము లా ముఖమున కొక వింతఅందము తెచ్చినవి. గంభీరము, మధురమునైన ఆ గొంతుసవ్వడి వెంటనే ఎవనినైనను ఆకర్షించును. సారస్వతకూటములు, ఛర్చీలు మొదలగు ప్రదేశములలోనివారు ఆయనచే నుపన్యసింపజేయుటలో ఆశ్చర్యమేమున్నది? బుద్ధునిజీవితమునుగుఱించి, సిద్ధాంతమునుగుఱించి మనకు బాగుగా తెలియునంతవఱకు నీయుపన్యాసములు కొనసాగినవి. ఆయన మాట్లాడుటకు ఏవిధమైన సూచనలు వ్రాసి పెట్టుకొనరు. అనేకవిషయములను చక్కగా వివరించుచు, సిద్ధాంతముల నెంతో నేర్పుగా చేయుచు నుపన్యసింతురు. ఆయన నిష్కాపట్యము, ఒక్కొక్కపు డాయన ఉపన్యాసములను, ఆ వాగ్ధాటి నెంతో ఉత్తేజపఱచుచుండును. ఆయన మహాపండితుడు. జెసూట్ పండితులవలె గొప్పపరిశ్రమచేసినవారు. ఆయన మనఃస్వభావము నట్టిదే. ఆయన తన ఉపన్యాసములందు కొన్ని కొన్ని ఆక్షేపణలు విసరును. కాని ఆయన సభ్యులందు చాలమంది వానిని గణింపరు. ఆ ఆక్షేపణ లంత సున్నితములైనవి. ఆయన చాలమర్యాదగ మాట్లాడుట ఒక దొడ్డగుణము. ఎప్పుడైననుసరే మనపద్ధతులమీదను, ఆచారములమీదను అంతసూటిగా, మోటుగా దెబ్బలు కొట్టరు. ప్రస్తుతము స్వమత, తత్త్వశాస్త్రములందలి పదములను మనకు తెలుపుటవఱకే ఆయన ఉద్దేశించినారు. విగ్రహారాధన అజ్ఞానదశలోనున్నవారికి చాల అవసరమని ఆయన అభిప్రాయము. ఈ విగ్రహారాధనను మీఱి ప్రకృతిలో పరమాత్మను దర్శింపగల

సమయమునకై, మనుష్యునియందున్న దేవత్వమును గుర్తింపగల సమయమునకై చూచుచున్నారు. బుద్ధుడు మరణసమయమందు చెప్పినట్లు "మీ మోక్షమును మీరు సంపాదించుకొనుడు. నేను చేయగలిగినదిలేదు. మీకు మీరే సహాయముచేసికొనుడు" అని యాయన చెప్పెను.

లూస్‌మన్రో



# పునర్జన్మ

(ఇవాన్‌స్టన్ ఇన్డెక్స్ - అక్టోబర్ 7, 1893)

క్రిందటివారములో 'కాంగ్రిగేషనల్ ఛర్చి'లో కొన్ని యుపన్యాసములు చెప్పబడినవి. ఈ యుపన్యాసములు మొన్ననే పూర్తియైన మతవిషయికమహాసభయందలి ఉపన్యాసములను పోలియున్నవి. ఉపన్యాసకులలో స్వీడన్ దేశీయుడైన డా॥ కరల్‌వాన్ బెర్గెన్ ఒకరు. రెండవవారు స్వామి వివేకానంద. వివేకానంద స్వామి హిందూదేశపక్షమున మతమహాసభకు ప్రతినిధిగా వచ్చిరి. ఆయన ధరించిన మందారపూవన్నెదుస్తులు, ఆయన ఆకృతి విశేషము, ఆయన ప్రతిభావంతమైన వక్తృత్వము, ఆయన చేయు విచిత్రమైన తత్త్వశాస్త్రవ్యాఖ్యానములు పల్వుర నాకర్షించెను. ఆయన షికాగోలో నున్నంతకాలము అదొక పెద్ద యుత్సవము. మూడురోజులు సాయంసమయములం దీ యుపన్యాసము లేర్పాటుచేయబడినవి. (శనివార, మంగళవారముల సాయంసమయములందు చేసిన యుపన్యాసములనుగుఱించి వ్యాస

కర్త వ్యాఖ్యానింపలేదు. ఊరక పేర్కొనినాడు. తర్వాతివ్యాస మిట్లున్నది.)

అక్టోబరు 5 సాయంకాలమున డా॥ వాన్ బెర్గెన స్వీడెన్‌లో "రాజదుహితలు" అను సంస్థను స్థాపించిన హాల్డెన్ బీమిష్‌చ్ అనునాతనిగుఱించి మాట్లాడెను. హైందవసన్న్యాసి "పునర్జన్మ" నుగుఱించి మాట్లాడెను. ఈ హిందూసన్న్యాసి యుపన్యాస మెంతో బాగుగా నున్నది. కారణ మీప్రాంతములయం దెప్పుడు నట్టిభావములు వ్యక్తమైనవికావు. "ఈ పునర్జన్మ సిద్ధాంతము" మనదేశమునకు చాలక్రొత్తది. ఇక్కడ దీని నెవరును అర్థముచేసికొనలేరు. కాని ప్రాచ్యదేశములం దిది ప్రసిద్ధమైనదే. అచ్చటి ప్రజలవలంబించు మతములన్నింట నిదొక మూలసిద్ధాంతము. అసలీ సిద్ధాంతవిషయమునే ఎఱుగనివారు దానికి వ్యతిరేకమేమి చెప్పుదురు? ఇందులో నిర్ణయించవలసిన ప్రధానాంశము మనకు పూర్వజన్మయున్నదా యనునది. మనకు వర్తమానమున్నదని మనమెఱుగుదుము. భవిష్యత్తుండునను విశ్వాసమున్నది. మఱి భూతములేకుండ వర్తమానమెట్లుండును? ఆధునికభౌతికశాస్త్రకారులు పదార్థమనునది ఉన్నదనియు, అదెప్పుడును వినష్టముకాకుండ నుండుననియు సిద్ధాంతీకరించిరి. సృష్టి యనునది దృశ్యములోవచ్చిన మార్పు. మనము శూన్యములో నుండి పుట్టుకొనిరాలేదు. కొంతమంది భగవంతుడు సర్వవస్తువులకును సమానకారణమని, అందుచేత మనఉనికికి ఈశ్వరుని సామాన్యకారణత్వమే హేతువని చెప్పుదురు. కాని మనము ప్రతివిషయమునందును ఈ సృష్టిక్రమము — అనగా ఈ పదార్థ మెక్కడనుండి — దేనినుండి వచ్చినదని ఆలోచింపవలెను. భవిష్యత్తున్నదని నిరూపించుటకు వీలైన హేతువులే భూతమున్నదని నిరూపించుటకును పనికివచ్చును. ఈశ్వరేచ్ఛ ఒక్కటేకాక ఇతరకారణములుకూడ నుండియుండవలెను. పారంపర్య

మొక్కుటే తగినంత కారణము కాజాలదు. కొందఱు మాకు పూర్వజన్మ యున్నట్లు గుర్తులేదందురు. కాని పూర్వజన్మజ్ఞానము గల సందర్భములు విశేషముగా నున్నవి. ఈ సిద్ధాంతమునకు మూలమిది· హిందువులు నోరులేని జంతువులయెడల కరుణ చూపుదురు. అందువల్ల కొంతమంది జీవులు చతుష్పాదజంతువులుగా జనించునని మనము విశ్వసింతుమని వారి నమ్మకము. జంతువులయెడ దయచూపుటకు విశ్వాసముతప్ప మఱొక కారణముండునని వారూహింపలేరు. పురాతన హిందూపురోహితుని దృష్టిలో మతమనగా ఉన్నతపథమునకు గొనిపోవునది. క్రూరత్వము అనునది సంపూర్ణముగా దూరీకరింపబడవలెను. మానవత్వము విగళితమై దేవత్వము సంభవింపవలెను. పునర్జన్మ ఈ మర్త్య లోకమువఱకే పరిమితముకాదు. జీవు డితరలోకములకు, ఉత్తర లోకములకు పోగలడు. ఈ లోకమున మానవునకు పంచేంద్రియములే యుండును. పైలోకమందు ఆతనికి అష్టేంద్రియములుండును. పోనుపోను దేవత్వము పొందగలడు. పరమాత్మయం దైక్యము కాగలడు.



# హైందవనాగరకత

(ఈ ఉపన్యాసము అక్టోబరు 9-వ తేదీని స్ట్రీటర్ - అన్నచోట చేయబడినది. దీనికి పల్వురుశ్రోతలు వచ్చిరి. కాని తేదీలో ప్రకటింపబడిన స్ట్రీటుడెయిలీ ఫ్రీప్రెస్ ఉత్సాహరహితముగా ఇట్లు వ్రాసెను).

శనివారము రాత్రి నాటకశాలయం దేర్పాటుచేయబడిన మాననీయుడైన ఈ హైందవు (వివేకానందు)ని ఉపన్యాసము ఎంతో బాగుగానున్నది. భాషాశాస్త్రమును సాధనముగా తీసికొని ఆర్యజాతులకు, అధునాతన ప్రపంచమునందలి ఆర్యజాతి సంతతి వారికి మధ్య చిరకాలమునుండి అంగీకరింపబడుచున్న సంబంధము నిరూపించుట కతడు యత్నించెను. అతడు హిందూదేశములో మూడువంతుల జనులను దాస్యమందు మగ్గజేయుటకు హేతువైన వర్ణపద్ధతి కొంత సమర్థించెను. "పురాతనహిందూదేశము, ఇప్పటి హిందూదేశమువలెనే ఉండెడిది. హిందూదేశము తన కనుల ముందు ప్రపంచమం దనేకజాతులు తోకచుక్కలవలె ఒకటి రెండు వెలుగులు వెలిగి కాలగర్భమున లీనమైపోవుట చూచినది." అని ప్రగల్భవచనములు చెప్పినారు. ఆయన సామాన్య జనుల వలెనే భూతకాలము నెక్కువ ప్రేమించును. ఆయన బ్రదుకునది తనకొఱకుకాదు. భగవంతునికొఱకు. ఆయన స్వదేశమునందు బిచ్చగాండ్రమీద దేశద్రిమ్మరులమీద ఒక భారమున్నది. ఈ విషయ మాయన ఉపన్యాసమందంత స్పష్టముగాలేదు. ఆ దేశములో వంట సిద్ధమైన తర్వాత నింటిలోనివారు అతిథిరాకకు వేచియుందురు. అతిథికి ముందు వడ్డింతురు. ఆయన తిన్నతర్వాత, ఇంటిలోని జంతువులు, సేవకులు తినెదరు. యజమాని భుజించినతర్వాత గృహిణి భుజించును. పదియేండ్లపిల్లవాండ్రను పండితులవద్ద శుశ్రూషకు

పంపుదురు. అచ్చట పదియేండ్లో, ఇర్వదియేండ్లో చదివినతర్వాత వారు తమ పూర్వవృత్తులకైన పోవుదురు. లేక దేశమంతట మతోపన్యాసములు చేయుచు ఈశ్వరసంకీర్తనము చేయుచు తిరుగనైన తిరుగుదురు. వీరు ధనమును ముట్టరాదు. ఎవరేని దయతో ఏదిచ్చిన నది తినవలెను. ఏమి ఇచ్చిన అది కట్టుకొనవలెను. వృద్ధులు సంసారమును వదలి కొంతకాలము ఈశ్వరారాధన మతవ్యాసంగములు చేసి తాము పవిత్రులమైతిమని కొంత తృప్తికల్గినతర్వాత తాముకూడ మతమునుగుఱించి వ్యాపనము చేయుటకై లోకములో తిరుగుదురు. ఆలోచనాశక్తి అభివృద్ధి పొందవలెనన్న మనుష్యునకు తగినంత తీరుబా టుండవలె నని ఈ యుపన్యాసములో చెప్పినాడు. కొలంబసునాటి అనాగరకులైన అమెరికా ఎట్టి ఇండియనులకు విద్యాసదుపాయములు కలిగింపనందులకు అమెరికనుల నతడు నిందించెను. ఇట్లు నిందించుటలో ఇచ్చటి పరిస్థితులనుగుఱించిన తన యజ్ఞానము నతడు వెల్లడించుకొనినాడు. ఆయన ఉపన్యాసము చాల చిన్నదిగానున్నది. ఆయన చెప్పినవానికంటె ముఖ్యములైన విషయములు చెప్పవలసిన వెన్నో యున్నవి. వాని నన్నిట నాయన దిగద్రావినాడు.

(ఈ వ్రాతవల్ల అమెరికాలోని పత్రికలు 'ఏదో ఒక కారణమువల్ల వివేకానందస్వామికి ఎల్లవేళలందు చూపవలసినంత ఆదరమును చూపలేదని బోధపడుచున్నది).



# రమణీయమైన ఉపన్యాసము

(విస్కాన్సిన్ స్టేట్ జర్నల్, నవంబరు 21, 1893.)

కాంగ్రిగేషనలు చర్చిలో (మేడిసన్) కడచినరాత్రి మాన నీయుడైన హిందూసన్న్యాసి వివేకానందస్వామి చెప్పిన యుపన్యాసము రమణీయముగ నుండెను. మతమునుగూర్చి గొప్ప తత్త్వశాస్త్రవిషయములు ఆయన మాట్లాడెను. ఆయన క్రైస్తవేతరుడైనప్పటికి క్రైస్తవమతము ఆయనబోధనలను పెక్కింటిని అనుసరింపవచ్చును. ఈ విశ్వము ఎంత విశాలమైనదో ఆయనమతముకూడ అంతవిశాలమైనది. ఆయనమతములో ప్రతి మతమునకు స్థానమున్నది. సత్యమెచటనున్నను దాని నాయన అంగీకరించును. హిందూమతములో ద్వేషములకు, అంధ విశ్వాసములకు స్థానము లేదని, వేడుకలకు స్థానములేదని ఆయన చెప్పెను.



# హిందూమతము

(మిన్నెపోలిస్‌స్టార్, నవంబరు 2౦, 1893.)

మిన్నెపోలిస్, (ఫస్ట్ యూనిటేరియన్ చర్చి) లో నిన్న సాయంకాలము వివేకానందస్వామి హిందూమతమునుగుఱించి వ్యాఖ్యానించెను. 'బ్రాహ్మణమతము పురాతనమైన ఆధ్యాత్మిక సత్యములు రూపుగొన్నమతము' అనునది విషయము. ఆయన యుపన్యాసమును సభ్యులు చాల శ్రద్ధతో వినిరి. ఆసభ మంచి ఆలోచనాపరులైన స్త్రీ పురుషులతో నిండియున్నది. ఆ యుపన్యాస మేర్పాటుచేసినది - "పెరిపేటెటిక్సు" - అరిస్టాటిల్ పద్ధతి ప్రకారము నడచుచు పాఠములు చెప్పువారు. ఆ యుపన్యాసము నందు ఈ 'పెరిపేటెటిక్సు' స్నేహితులు - వీరిలో కొందఱు బహు విధములైన మతాధికారులు - కూడ పాల్గొనిరి. పలువురు విద్యార్థులు, పండితులు పాల్గొనిరి. వివేకానందుడు బ్రాహ్మణ సన్న్యాసి. ఆయన తనదేశీయమైన వేషమువేసికొనినారు. నెత్తి పైన నొక తలపాగ, నారింజరంగు కోటును, ధరించి, ఆ కోటు మీద నడుమునొద్ద ఒక కాషాయవస్త్రము బిగించినారు. కాషాయ వస్త్రములు కట్టుకొన్నారు.

ఎంతో శ్రద్ధతో నెమ్మదిగా, స్పష్టముగా, శాంతముగా, ఏవిధమైన కదలిక లేకుండ తనమతమునుగుఱించి ఆయన వ్యాఖ్యా నించినారు. ప్రతిశబ్దము తూచితూచి మాట్లాడినారు. తన యుద్దే శమును సూటిగా చెప్పగలిగినారు. హిందూమతమునందలి బహు సాధారణసత్యముల నాయన వ్యాఖ్యానించినారు. క్రైస్తవమత మును గుఱించి వ్యతిరేకముగ ఒక్కమాటకూడ ఆయన చెప్ప లేదు. కాని ఆ మతముకూడ బ్రహ్మవిషయమును గూర్చి చెప్పినట్లు వ్యాఖ్యానించినారు. హిందూమతమునందు ముఖ్య

సిద్ధాంతము ఆత్మపదార్థ పారమార్థికత. ఆత్మ పరిపూర్ణమైనది. పరమార్థము ఎచ్చటనో లేదు. మనయందేయున్నది. భూతభవిష్యత్తులకు మధ్యనున్న సరిహద్దుగీత వర్తమానము. మనుష్యునిలో దేవత్వము రాక్షసత్వము రెండునున్నవి. జీవుడు దేవత్వము పెంచుకొనిన ఊర్ధ్వలోకములకు పోవును. రాక్షసత్వము పెంచుకొనిన అధోలోకములకుపోవును. ఈ రెండును మనుష్యునియం దెప్పుడును పోరాడుచునేయుండును. మనుష్యుడు సద్గుణములచే అభ్యుదయముపొందును. దుర్మార్గముచే పతితుడగును.

ఫస్ట్‌యూనిటేరియన్ చర్చిలో శ్రీ వివేకానందులు రేపు ప్రాతఃకాలమున మాట్లాడుదురు.



(దేస్‌మోయిన్సున్యూస్, నవంబరు 28, 1893)

కడచినరాత్రి సెంట్రల్చర్చిలో దూరస్థమైన హిందూదేశమునుండివచ్చిన మహాప్రతిభావంతుడైన వివేకానందస్వామి మాట్లాడిరి. ప్రపంచపు వస్తుప్రదర్శనము చికాగోలో జరిగినప్పు డేర్పాటుచేయబడిన సర్వమతమహాసభయం దాయన హిందూ మతమునకు ప్రతినిధిగా పాల్గొనినారు. గౌరవనీయుడైన హెచ్. ఒ. బ్రీడెన్ స్వామిని సభ్యులకు పరిచయముచేసెను. స్వామిలేచి సభ్యులకు నమస్కరించి హిందూమతమునుగుఱించి యుపన్యసించుటకు ప్రారంభించెను. ఆయన యుపన్యాసము ఏదో ఒకశాస్త్రమునకు కట్టుబడియుండలేదు. తత్త్వశాస్త్రమునుగుఱించి స్వీయాభిప్రాయములు కొన్నింటిని తనమతమునకు, ఇతరమతములకు చెందినవానినిగుఱించి ఆయన యుపన్యసించిరి. పరిపూర్ణముగా క్రైస్తవుడు కావలెనన్నచో సర్వమతములను సాధనచేయవలయునని ఆయన చెప్పెను. ఒకమతములోలేని సత్యము మఱి

యొకమతములో దొరకును. అందుచేత అన్ని మతములు గొప్పవే. అన్ని మతములు నిజమైన క్రైస్తవమున కవసరమైనవే. “మీరు ఒకమిషనరీని మాదేశమునకు పంపిన, అతడు హిందూక్రైస్తవు డగును. నేను మీదేశమునకువచ్చి క్రైస్తవహిందువునైతిని. నే నిక్కడకు వచ్చిన తర్వాత ‘మీ రచ్చటి ప్రజలను మతాంతరులనుచేయుచున్నారా?’ అని నన్నడిగినారు. ఇట్లను గుట నాకవమానముగా తోచినది. నాకు ఈ మతాంతరీకరణ మున నమ్మకములేదు.”*

ఈ దినమున పాపాత్ముడు తేపు ప్రొద్దున మతముపుచ్చు కొనగానే, నెమ్మది నెమ్మదిగా పుణ్యాత్ముడై పోవునని మీ యభిప్రాయము. ఇంత మార్పెట్లువచ్చును? దీనికి మీరెట్లు సమాధానము చెప్పుదురు? ఆ మానవుని యాత్మ మాట లేదుకదా? ఆ పద్ధతిలో ఆత్మకు మరణముండవలెను. మీరు భగవంతు డాతని మార్చినాడందురు. భగవంతుడు పరిపూర్ణుడు. సర్వశక్తి సంపన్నుడు. కేవలము పావిత్ర్యము రూపుగొన్నవాడు. మఱిప్పు డీ మనుష్యుడు మతము పుచ్చుకొన్న తర్వాత పుణ్యాత్ము డగుట కా భగవంతుడిచ్చిన పవిత్రతయున్నదే దానిని మినహాయింపగా మిగిలిన భగవంతునివంటివాడు. మా దేశములో మతము, శాఖ యన్నదానికి మీ దేశములోకంటె భిన్నార్థము లున్నవి. మతమన్నమాట అన్ని మతములకు చెందును. అనగా నన్ని మతములకు మా మతములో స్థానమున్నది. అనగా మేము దేనినైనను సహింపగలము. కాని అసహనమునుమాత్రము సహింప లేము. మఱి ‘శాఖ’ యన్న మాటమాత్రమున్నది. ఇక్కడ దానికర్థము: దాతృత్వమన్న మేలిముసుగును కప్పుకొని “మేము

* ఈ విలేఖకుడు మతాంతరీకరణమునుగుఱించి స్వామిజీ చేసిన వాదములను అర్థముచేసికొనలేకపోయినాడు. కాని స్వామీజీ ఉపన్యాసములతో పరిచయమున్నవారి కాయన ఇచ్చట ఏమి యుద్దేశించెనో తెలిసికొనుటకు తగినంత భోగట్టా నిత డీయగల్గినాడు.

సన్మార్గులము, మీరు దుర్మార్గు''లని చెప్పు కొందఱు పెద్ద మనుష్యులవఱకే ఈ మాట పరిమితమగును. నాకు ఒకకథ జ్ఞప్తికి వచ్చుచున్నది : ఒకకప్ప ఒకనూతిలోనేపుట్టి, దానిజీవితమంతయు ఆ నూతిలోనే గడపినది. ఒకరోజున సముద్రములోని ఒకకప్పను దెచ్చి ఎవరో ఆ నూతిలో వేసిరి. ఆ రెండుకప్పలు సముద్రమును గుఱించి మాట్లాడుట మొదలుపెట్టినవి. ఈ నూతికప్ప ఆసముద్రపు కప్పను ''సముద్రమెంత పెద్దది?'' అని అడిగెను. కాని దానికది చెప్పిన సమాధానము బోధపడ లేదు. అప్పు డా నూతికప్ప ఆ నూతిలో ఒకప్రక్కనుండి ఇంకొకప్రక్కకు దూకి ''సముద్రమింత పెద్దదా'' అని యడిగినది. సముద్రపుకప్ప ''ఓ'' నన్నది. నూతికప్ప మఱల నొకగంతువేసి ''అబ్బా! అంత పెద్దదా?'' అనినది. సముద్రపు కప్ప మఱల ''ఓ'' నన్నది. నూతికప్ప ''సముద్రపుకప్ప డంబములుపలుకుచున్నది, దీని నిక్కడనుండి తఱిమివేయవలెను'' అని అనుకొన్నది. శాఖలనగా నర్థమది. వారివిశ్వాసములే విశ్వాసములు. వారివలె విశ్వాసములు లేనివారిని బహిష్కరించుటకో, అణగద్రొక్కుటకో వారు ప్రయత్నింతురు.



# హిందూసన్న్యాసి

("ఎప్పీల్ - అవలాంకే" జనవరి 16, 1894.)

నేటిరాత్రి ఆడిటోరియం (మెంఫిస్) లో ఉపన్యాసము చెప్పబోవు హైందవసన్న్యాసి వివేకానందస్వామి ఈ దేశములో ఇంతవఱకు మతోపన్యాసములు చెప్పిన మహావక్తలలో ఒక డని చెప్పవచ్చును. ఆయన అనుపమమైన వక్తృత్వము, యోగసిద్ధులను గుఱించి ఆయనకున్న వివేకము, ఆయన వాదనాపటిమ,

ఆయన శ్రద్ధ — ఇవి యన్నియు ప్రపంచమతమహాసభయందు చేరిన వివేకవంతులనందఱను ఆకర్షించెను. అమెరికా సంయుక్త రాష్ట్రములయం దాయన కావించిన ఉపన్యాసములు వేలకొలది ప్రజల నాకర్షించినవి.

ఆయన మనోహరమైన వ్యక్తిత్వముగలవాడు. మధురముగా మాట్లాడువాడు. ఆయన మాట్లాడుట యెంతో హాయిగా నుండును. ఆంగ్లభాషలో రత్నములవంటి మాటలనేరి ఆయన యుపయోగించును. ఆయన ప్రవర్తనయంతయు పాశ్చాత్యదేశములందలి గౌరవార్హులలో, విజ్ఞానవంతులలో ఉత్తములైనవారి కోవకుచెందినది. ఆయన స్నేహపాత్రుడు. సంభాషణాచాతుర్యముకలవాడు. సంభాషణాచాతుర్యములో పాశ్చాత్యదేశమందలి ఏనగరమందైనను ఆయననుమించినవారుండరు. ఆయన ఆంగ్లభాషను స్పష్టముగ, ధారాళముగ మాట్లాడును. ఆయన భావములు తళతళ మెఱయుచుండును. మంచి ఆలంకారికమైన భాష ఆయననోటివెంట ప్రవాహముగా రత్నములవంటి అభిప్రాయములను వ్యక్తీకరించుచున్నప్పుడు మన కాశ్చర్యము కలుగుచుండును.

వివేకానందస్వామి పుట్టుకచేతను, చిన్నతనములో తనమత బోధనలు వినుటచేతను బ్రాహ్మణమతమువాడుగా పెరిగినారు. కాని తర్వాత సన్న్యాసిమైనారు. ఆయన వేదవేదాంతములను చక్కగా నభ్యసించినారు. హిందూదేశమునందు చాలకాలము పెద్దపెద్ద విద్యాలయములలో విద్యార్థిగా, నుపాధ్యాయుడుగానుండి గొప్ప విజ్ఞానమును సంపాదించెను. ఈ విజ్ఞానముచే ఈ తరమందలి ప్రతిభావంతులైన పండితులలో తానొకడని ప్రపంచవ్యాప్తమైన ప్రసిద్ధి సంపాదించెను.

ప్రపంచమతమహాసభలో ఆయనచేసిన మొదటి యుపన్యాసమే ఆయన ఆమతప్రతినిధులయందు నాయకమణియని నిరూ

పించినది. ఆసభలయందు తన మతమును సమర్థించుచు ఆయన బహూపన్యాసములు చేసిరి. మనుష్యుడు తనతోడివానియందు నెఱపవలసిన విధులనుగుఱించి, భగవంతునియందు నెఱపవలసిన విధులనుగుఱించి వర్ణించు సందర్భమున ఆయన నోటివెంట ఇంగ్లీషు భాషకలంకారభూతములైన సుందరములైన తాత్త్వికరత్నములు జలజల రాలినవి. ఆయన దార్శనికుడైన భావుకుడు, ఆధ్యాత్మికవాది; వేదికమీద చెప్పుచున్న విషయమును కండ్లకు కట్టినట్లు ప్రదర్శింపగలరు.

ఆయన మెంఫిస్సు వచ్చినప్పటినుండి హు. ఎల్. బ్రిన్క్లీకు అతిథిగా నున్నారు. రేయింబవళ్ళు పల్వురు మర్యాదనెఱపుటకు చేయు టెలిఫోను పిలుపుల కంతులేదు. టెన్నిస్క్లబ్బురు పిలిచినంతనే ఆయన అతిథిగా వచ్చినారు. మిస్సెస్. యస్. ఆర్. షెప్పర్డు శనివారము సాయంత్రము ఏర్పాటుచేసిన స్వాగతమును, ఆతిథ్యమును ఆయన స్వీకరించిరి. కల్నల్ ఆర్. బి. స్నోడెన్; అన్నెస్డేల్ - లో నున్న తన యింటియందు ఈ మహాపురుషున కాదివారమునాడు విందుచేసినాడు. అచ్చట ఈయనను అసిస్టెంటు బిషప్ - థామస్ యఫ్. గెయిలర్, రెవరెండ్, డా. జార్జిపేటర్సన్ మొదలైన మతాధికారు లెందఱో కలిసికొనినారు.

నిన్న సాయంకాలము రాండాల్పు' భవనములోనున్న "నైన్టీన్తు సెంచరీక్లబ్"లో అందలి సభ్యులముందు ఆయన యుపన్యసించినారు. ఇది చాల పెద్ద సభ, సభ్యులందఱు గొప్ప నాగరకులు. ఈ రాత్రి 'ఆడిటోరియం'లో ఆయన హిందూమతముపై నుపన్యసింతురు.



# అకారాది సూచి

